# తెలుగు సాహిత్యచరిత్ర

## ప్రథమభాగము

ఆచార్య కొర్లపాటి శ్రీరామమూర్తి
ఎం ఏ, పిహెచ్ డి, డి. లిట్
యు. జి. సి ఎమెరిటస్ ఫెలో
తెలుగు శాఖ
ఆంధ్రవిశ్వకళాపరిషత్ – వాల్తేరు

రమణశ్రీ ప్రచురణ
విశాఖపట్టణము

# అంకితము

శ్రీవిద్యాదయితప్రసన్నకవితాశీర్వాదమోదమ్ముతో
శ్రీవాగ్వల్లభదివ్యభవ్యకవితాశ్రేయోభిలాషమ్ముతో
శ్రీవిశ్వేశ్వరసత్ప్రబంధకవితాస్నేహార్ద్రభావమ్ముతో
దైవానుగ్రహదత్తమైనయది మత్సాహిత్యచారిత్రమున్

సారతరభక్తికవితా
సౌరభశరభాంకలింగశతకాంతముగా
సారతరభక్తికలితో
దారహృదయశరభలింగధన్వంతరికిన్

అనవరతహసన్ముఖునకు
ఘనతరుణనిపుణచికిత్సకప్రముఖునకున్
అనుగతకళాభిముఖునకు
జనహితసుమధురమృదులవచనసుముఖునకున్.

వరభారతరామాయణ
పురాణపఠనాంచితానుభూతిసుకృతికిన్
స్థిరభారతీయసంస్కృతి
పరాయణగుణానుభావభాసురమతికిన్.

నిండు మనస్సుతో నిబిడనిశ్చలనిర్మలగౌరవమ్ముతో
పండితమండలాదరణపావనజీవనచిహ్నముద్రగా
చండతరామయాపనయసద్గుణవైద్యకృతజ్ఞతాస్థచే
చెండులు కట్టి భావములు చేసెద సంచిత మాత్మతృప్తికై.

# కీర్తిగీతి

రుద్రసన్నిభుఁడు ప్రతాపరుద్రనృపతి
కుడిభుజము, గజసాహిణి, గురుసదృశుఁడు
మహితమతి బెండపూఁడన్నమంత్రి యనుట
కాకతీయచరిత్రకు కాంతిరేఖ. 1.

ఉర్వి ద్వైరాజ్యభారంబు నిర్వహించు
పెమవీరభద్రాఖ్యపృథ్వీపతులకు
మంత్రి బెండపూఁడన్నయామాత్యుఁ డనుట
రాణ్మహేంద్రచరిత్రకు క్రాంతిరేఖ 2.

సరసభీమేశ్వరపురాణసత్కృతిపతి,
మంటపాలయభవననిర్మాణసుకృతి
మౌళి, బెండపూఁడన్నయామాత్యుఁడనుట
దక్షవాటి చరిత్రకు రక్షరేఖ. 3.

మందహాసము, మధురసంభాషణమును
మంచు, వాక్టరుగ సమత, మమత విందు
వెండపూఁడి పేరామంగా రండ యనుట
గతవిశాఖచరిత్రకు గర్వరేఖ 4

సతియు, సుతయు, జామాతయు సహచరులుగ
వాక్షప శరభలింగము దాటు లేక
తండ్రి యనిపించు పేరామాత్యతనయుఁ డనుట
స్థితవిశాఖచరిత్రకు జీవరేఖ. 5.



డాక్టర్ బెంతవూడి శరభలింగము

ఎం. ఎ. పి. హెచ్. డి.,



ఆచార్య కొర్లపాటి శ్రీరామమూర్తి

# భూమిక

పవనాందోళితనారికేళకదళీపత్రావళీనృత్యకో
పవనాంతవ్యవసాయజీవనవిధానప్రాప్తి చెట్టెక్కి, స
త్కృపనోద్దీపితనారికేళకదళీద్రాక్షాపరీపాకవ
ర్ణనితాసవ్యవసాయజీవనవిధానధ్యాన సంప్రాప్తమై. 1

వరగురువాక్సుధారసము వాకలు కట్టి నిసర్గతాలసాం
కురమును ప్రోదిసేసి, నునుక్రొంజిగురాకిడి పాదుకొల్పి, పం
దిరిపయి నిల్పికొంటి మది తీగలు సాగిన సాహితీలతన్
పరిణతపత్రపుష్పఫలభారగభీరసముజ్జ్వలాకృతిన్. 2

కన్నుల నిప్పులైన వడగాల్పుల ధాటికి వాడకుండఁగా
వన్నెల చిన్నెలైన జడివానల దాడికి వీడకుండఁగా
మిన్నుల మ్రోతలైన మిడిమేలపు పిడ్గుల మాడకుండఁగా
సన్నుతసాహితీలత వసంతవికాసము చెందు నిత్యమున్. 3

ప్రాకృతసంస్కృతాదిబహుభాషల భానుమయూఖమాలికల్
సాకినవైన వీ తెలుగు శారద శారదచంద్రచంద్రికల్
వాకున కందరానివగు స్వాదురసామృతపూరసారశ
య్యాకమనీయముల్ సహృదయప్రకరానుభవైకవేద్యముల్. 4

సాహిత్యార్ణవమంథనోత్థచరితాంశస్వచ్ఛకావ్యామృత
గ్రాహిగ్రంథము వాంఛనీయమని పూర్వగ్రంథసంధానముల్
సాహాయ్యమ్ముగ నూతనాంశములతోడన్ తథ్యమిథ్యావివ
క్షాహృద్యమ్ముగ సంఘటింతును యథాశక్తిన్ త్రిధాభక్తమున్ 5

# స్వాగతము

సరిగా పాతిక సంవ
త్సరములు ఎం. ఏ కు తెలుగు సాహిత్యచరి
త్ర రమణ పారము చెప్పిన
పరిపాటి మెయిన్ రచింతు పరమార్థముగా— 1

ఆంధ్రవిశ్వకళాసంసదాంధ్రశాఖ
శిష్యమిత్ర సహవ్రతుల్ చేసినట్టి
మామకపదవీవిరమణామంత్రణసభ
వ్రాసెదనగిన ప్రకటన వా స్తవముగ— 2

విశ్వవిద్యాలయసహాయవి త్తసంఘ
మున్నతతమవిద్యార్హత, ఉజ్జ్వలపరి
శోధనము, ప్రచురణములు చూచి యిడిన
సార్థగౌరవపదవియు సార్థకముగ— 3

సంగ్రహములు, సర్వస్వముల్ సకలవిషయ
కలితసిద్ధాంతగ్రంథముల్ కలవుగాని,
స్నాతకోత్తరతరగతిస్థాయి పాఠ్య
గ్రంథమగు చరిత్రము లేని కారణమున— 4

సహజము ప్రమాదపతితము
ప్రహసనసదృశము ప్రమాణరహిత ముపేక్షా
సహము కువిమర్శ కావున
సహృదయసముచితసమీక్ష సాపేక్షముగా— 5

# పీఠిక

స్నాతకోత్తర తరగతిస్థాయి సాహిత్యచరిత్ర వ్రాయవలయునని సంకల్పము. అందుకు స్నాతకోత్తర తరగతి విద్యార్థులకు సాహిత్యచరిత్ర పాతిక సంవత్సరములు నిరంతరముగ పాఠప్రవచనము చేసిన అనుభవము మూలధనము. ముప్పదినాలుగు సంవత్సరములు పరిశోధనము చేసిన, పాతిక సంవత్సరములు పైగా పరిశోధనము చేయించిన అనుభవము చక్రవృద్ధి.

ఆంధ్రవిశ్వకళాపరిషత్తులో తెలుగు శాఖ 1931 వ సంవత్సరమునందు తేజరిల్లినది ఆనర్స్ తరగతులకు బోధన, పరిశోధన కార్యక్రమము ప్రారంభమైనది. అప్పటి తెలుగు శాఖ అధ్యక్షులు పింగళి లక్ష్మీకాంతముగారు సాహిత్యచరిత్రను, సాహిత్యవిమర్శను పాఠ్యప్రణాళికను ప్రవేశపెట్టి, వానికి రూపురేఖలు దిద్ది తీర్చిరి 1931 వ సంవత్సరమునుండి 1949 వ సంవత్సరము వఱకును వారు పాఠప్రవచనము చేసిన సాహిత్యచరిత్ర, సాహిత్యవిమర్శ శిష్యప్రశిష్యుల ద్వారా దేశమంతట దీధితులు ప్రసరించినవి. లిఖితరూపము నందినవి. అవి రూపాంతరము చెంది అచ్చయినవి ఆచార్యపింగళి లక్ష్మీకాంతముగారి ఆంధ్రసాహిత్యచరిత్ర అసమగ్రముగ 1974 వ సంవత్సరమునందు ముద్రితమైనది. లిఖితప్రతికి, ముద్రితగ్రంథమునకు చాల అంతరము కలదు ఆంతర్యము దురవగాహము లిఖితప్రతియందు అజ్ఞాతయుగము మొదలు ఆధునికయుగము వఱకు కలదు. అందు చక్కని ప్రణాళిక కలదు. సమగ్రమైన సమ్యగవగాహనము కలదు స్పష్టమైన ప్రతిపాదనము కలదు. కమనీయమైన కవితాశైలి కలదు అది సమగ్రసుందరమైన సాహిత్యచరిత్ర. ముద్రితగ్రంథము సమగ్రము కాదు. సుందరమును కాదు ప్రణాళిక సడలినది. అవగాహనము మాఱినది ప్రతిపాదనము పలచబడినది. శైలి శ్లథమైనది ఉభయత్ర విషయమునకు కాలదోషము పట్టినది. కాబట్టి స్నాతకోత్తర తరగతిస్థాయి-సాహిత్యచరిత్ర సాపేక్షము.

స్నాతకోత్తరతరగతి పరీక్షలందును, ఉద్యోగార్హతానిర్ణయ పరీక్షలందును వ్యాసప్రశ్నలు, వామనప్రశ్నలు అడుగుట సర్వసాధారణము అవి పాఠ్యప్రణాళి కానుసారములు. వ్యాసప్రశ్నలకు సంబంధించిన విషయములు సవిస్తరముగను, వామనప్రశ్నలకు సంబంధించిన విషయములు సంగ్రహముగను ఉండవలయును. ప్రముఖకవుల గురించి ప్రత్యంశవివరణము, ఇతరకవుల గురించి ప్రత్యేకాంశ వివరణము తదనుకూలము అది ఈ గ్రంథరచనా ప్రణాళికకు ప్రాతిపదిక. ఇది సాహిత్యచరిత్రగ్రంథరచనా ప్రణాళికను సంవదించునదియే.

పూర్వాభిప్రాయములను పునఃపరిశీలనము చేయునెడ, ప్రతిపాదకుల పేరులు తెలుపలేదు అందుకు రెండు హేతువులు కలవు 1 విద్యార్థులు, ఉద్యోగార్థులు పరీక్షలందు విపర్యయమునకు పాల్పడు ప్రమాదము కలదు. అది వారికి నష్టము కలిగించును. 2. ప్రతిపాదనము ప్రధానము కాని, ప్రతిపాదకుడు ప్రధానము కాదు. అయిన రాగద్వేషములు అంకురించును అవి కుశంకలకు, కువిమర్శలకు దారి తీయించును. ఉత్తమవిమర్శ వ్యక్తిపరము కాదు. వస్తునిష్ఠము. ప్రతిపాదకుల పేరులు వలయువారికి సంఖ్యాసూచికలోని ఆకరములు తెలుపును.

ఇతరత్ర విపులీకరించిన విషయములు ఇందు సూచనప్రాయముగను, సంక్షేపరూపమునను కలవు. అందుకు రెండు కారణములు కలవు. 1. గ్రంథరచనా ప్రణాళిక. 2. గ్రంథప్రయోజనము జిజ్ఞాసువులకు విపులీకరించిన తావులను సంఖ్యాసూచికలోని ఆకరములు తెలుపును.

అడిగిన పుస్తకములు అందిచ్చి సహకరించిన ఆచార్య చెల్లపిళ్ల సోమసుందరం, ఆచార్య కోలవెన్ను మలయవాసిని, డాక్టర్ సజ్జా మోహనరావు, డాక్టర్ పండితారాధ్యుల వీరేశలింగము, శ్రీ పాటీలు తిమ్మారెడ్డి, చిరంజీవి కరెవరపు వెంకట్రామయ్యలకు –

వ్రాతప్రతిని చదివి అభిప్రాయములు తెలిపిన ఆచార్య కోలవెన్ను మలయవాసిని, చిరంజీవి కరెవరపు వెంకట్రామయ్యలకు–

ముద్రణ కావించిన శ్రీ యస్. వి. రమణమూర్తి, యస్. రమేశ్, యస్. శ్రీనివాస్‌బాబులకు–

ముద్రణ దోషములు సవరించిన డాక్టర్ జంధ్యాల మహతీశంకర్, శ్రీ ఆర్. నాగేశ్వరరావులకు కృతజ్ఞతలు

— కొర్లపాటి శ్రీరామమూర్తి

# తొలిపలుకు

ఆంధ్రవాఙ్మయరంగమున నేటివరకు ఆ యా విషయములపై సాగిన అనేకానేకచర్చలను, చారిత్రికాధారములను, శాసనప్రమాణములను నిశితముగా పరిశీలించి, పరిశోధించి, రెండు పుష్కరముల కాలము సాహితీరసతరంగములలో నిరంతరము మునిగి తేలుచు, పఠనపాఠనకార్యక్రమమును పాటించుచు వచ్చిన ఆచార్య కొర్లపాటి శ్రీరామమూర్తిగారు, తమ పదవీవిరమణానంతరము యు జి సి ఎమెరిటస్ ఫెలోగా తెలుగు సాహిత్యచరిత్రను రచించుటకు పూనుకొనుట అత్యంత ముదావహము. వీరి అనుభవసారము పిండితార్థమై సాహిత్యవిద్యార్థులకు, జిజ్ఞాసువులకు పసందైన విందు అగును

ఆంధ్రసాహిత్యచరిత్ర విద్యార్థిలోకమునకు ఏ తీరులో ఉండవలెను? ఏ శైలిలో ఉండవలెను? అను విషయమును, ఆంధ్రవిశ్వవిద్యాలయము తెలుగు శాఖ ప్రథమాధ్యక్షులైన పింగళి లక్ష్మీకాంతముగారు, కవులను యుగకర్తలుగా గౌరవించి, సాహిత్యచరిత్రను సరళసుందరశైలిలో నవదరించిరి. అది వ్రాతప్రతిగానే పెక్కేళ్లు సాహిత్యవిద్యార్థులకు, అధ్యాపకులకు హస్తామలకమైనది. అదే శాఖలో ఆచార్యులైన శ్రీ కొర్లపాటి శ్రీరామమూర్తిగారు మహాకవులపరమైన యుగ విభజనమే ఉత్తమమైనదిగా భావించి, నిరూపించి, తెలుగు సాహిత్యచరిత్రను క్రొంగ్రొత్తగా ఉత్తంసమైన ఉపపత్తులతో, విశిష్టమైన వివరణలతో, నూత్నపరిశోధితాంశములతో సర్వాంగసుందరముగా తీర్చిదిద్దిరి

"మహి మున్ వాగనుశాసనుండు సృజియింపన్" అని రామరాజభూషణుడు ప్రశంసించినను, వాగనుశాసనునికి ముందు తెలుగు భాషాఛందస్సుల స్వరూపస్వభావములు తెలియపరచు వాఙ్మయము అధికముగానే ఉన్నది. ఆ విషయము ఈ పుస్తకములో కూడినంత విపులముగా వివరణ పొంది ఉన్నది. నన్నయకు పూర్వము ఆంధ్రదేశములోని బౌద్ధజైనకావ్యముల విషయము కూడ ఈ గ్రంథములో కూలంకషముగ చర్చింపబడినది. పరంపరగా చెప్పుకొను విషయములతో

ఆంధ్రరాష్ట్రమునకు దగ్గరాష్ట్రమను పేరు ఉండెడిదనుట ఒకటి. ఆ పేరు ఉండె ననుటకు అధారము మృగ్యమని; వేంగిదేశమునకు మాత్రమే, అది కూడ నన్నయ తర్వాతనే దగ్గరాష్ట్రమను పేరు వచ్చుటకు అవకాశమున్నదని శాసనప్రమాణముతో నిరూపింపబడినది.

మహాభారతసంహితారచనబంధురుడైన నన్నయభట్టు తోడయి నిర్వహించు టనుబట్టి, కొందరు విమర్శకులు వారిరువురు జంటకవులని తలంచిరి అది వాస్త వము కాదని నిర్ధరింపబడినది ఒక కవియొక్క ఒకానొక కవితాలక్షణమును ఆ కవియే పేర్కొన్నప్పుడు, ఆ లక్షణ మా కవి కవితలో సమన్వయింప వలసి యున్నది. నన్నయ ప్రసన్నకథాకవితార్థయుక్తికి ప్రసన్నకథాకలితార్థయుక్తి అను పాఠాంతరమును గ్రహించి ఇచ్చిన ఉదాహరణములే గతానుగతికముగా పరసపాఠ నాదులయందు చోటు చేసికొన్నవి ప్రసన్నకథాకవితార్థయుక్తి అను పాఠమే కవి హృదయమని అర్థ, యుక్తిశబ్దముల నన్నయ ప్రయోగాంతరములనుబట్టి నిర్ణయించి సమన్వయింపబడినది అక్షరరమ్యత కుంతకుడు ప్రతిపాదించిన వర్ణవిన్యాసవక్రత అని వివరింపబడినది. నన్నయ ప్రసన్నకథాకవితార్థయుక్తి, అక్షరరమ్యత ఉన్నంత, కన్నంత విప్పిచెప్పగల శక్తి కలిగించు వివరణ గ్రంథమునందు కలదు.

"భక్తిమీఁది వలపు బ్రాహ్మ్యంబుతోఁ బొత్తుఁ బాయంగలేను నే బసవలింగ" అని మల్లికార్జున పండితుడు అన్నట్లు పరంపరగా వ్రాయుచున్నారు కాని ఈ సీసపాదమునకు ఆకరము మృగ్యము. పై వాక్య మాధారముగా మల్లికార్జున పండి తుని చూచిన దృష్టిని మార్చుకొనవలసిన అవసరము, మల్లికార్జునపండితుని గ్రంథ మునుబట్టి వివరింపబడినది పాల్కురికి సోమన కాలమును గూర్చి వంద సంవత్స రములు ఇటునటు జరుపు వాదము లున్నవి. అవియెల్ల పరిశీలించి, చారిత్రికాధా రముల తోపాటు ఆంతరంగిక సాక్ష్యములను కూడ జతకూర్చి ఇందు నిర్ణయింప బడినది. పాల్కురికి సోమనాథుని కవితారీతులు, పాండిత్యప్రతిభలు, మతోద్యమ తీవ్రతలు విశదీకరింపబడినవి. చక్రపాణి రంగనాథుని కృతుల గూర్చి, యథా వాక్కుల అన్నమయ్య పూర్వకవితాచర్వణము గూర్చి ప్రత్యేకముగ వివరింప బడినది.

ఆంధ్రకవులలో తిక్కన ధ్రువతార. తిక్కన పునరుద్ధరించిన హరిహరనాథ తత్త్వము ప్రత్యేకవివరణము కోరునట్టిది. తిక్కన భారతరచన సామాన్యముగా చేయలేదు "మహాకవిత్వదీక్షావిధినొంది.. రచించెద"నని చెప్పుకొనినాడు ఆ మహాకవిత్వదీక్షావిధిస్వరూపస్వభావము లెట్టివి? అనునది సాహిత్యవిద్యార్థులకు, జిజ్ఞాసువులకు తెలియవలెను ఇట్టి కవుల స్వీయవచనముల వివరణము సోదాహరణ నిరూపణమును అత్యంతావశ్యకములైన విషయములు ఈ రీతి వివరణలతో, నిరూపణలతో ఈ గ్రంథము పరమప్రయోజనకారి

సాహిత్యచరిత్రకారులకు పాఠనిర్ణయము ప్రధానవిషయము కాకపోవచ్చును. కాని ప్రకరణార్థమునకు, కవిహృదయమునకు, పాత్ర పరమార్థమునకు ఆఘాతము కలిగించు పాఠముల విషయము ప్రస్తావించుట అవసరమే తిక్కన భారతములోని "ఈ వెండ్రుకలు పట్టి యీడ్చిన యా చేయి" అని ద్రౌపది చెప్పిన సీసపద్యము అతి ప్రసిద్ధము. అందులో "అలుపాలఁ బొనుపడునట్టి చిచ్చే యిది" అను వాక్యమున్నది. అల్పశబ్దమునకు అలుపము ప్రసిద్ధరూపాంతరము కాదు తిక్కన ప్రయోగాంతరమును లేదు శబ్దస్వరూపమే కాదు అర్థసంగతి కూడ సరిగా లేదు. ఆ పాఠము "అఱపాల" కావచ్చునని శ్రీరామమూర్తిగారు సూచించిరి. ఇది అర్థ సంగతమగుటయేగాక ద్రౌపది హృదయావేదనను బహిర్గతము చేయునట్టిది. శ్రీకృష్ణుని సంధిప్రయత్నము అల్పప్రతిక్రియ, అల్పకార్యము, స్వల్పకార్యమును కాదు. అర్ధరాజ్యమను అర్థమున "అఱపాల" అను పాఠమే ప్రకరణోచితము.

రంగనాథరామాయణకర్తృత్వము, రంగనాథు డెవరు? అను విషయముల వివరణములతోపాటు రంగనాథరామాయణకవితారామణీయకము, అవాల్మీక వృత్తాంతముల అపూర్వవిషయముల వివరణము ఈ గ్రంథమునందు సర్వసమర్థ ముగ ఉన్నవి.

సాహిత్యచరిత్రలో ఎఱ్ఱన కృతుల పౌర్వాపర్యము ఒక సమస్య అరణ్య పర్వశేషమే ఎఱ్ఱన ఆదిరచనమను సోపపత్తికసమన్వయము, ప్రబంధపరమేశ్వర ప్రశంసలోని పరమార్థవివరణము, సూక్తివైచిత్రిస్వరూపవిశదీకరణము ఇందులోని నూతనాంశములు నాచన సోముని కాలనిర్ణయమునకు ప్రధానాధారముగా గ్రహించు పెంచుకలదిన్నె శాసనము నిర్ధారకసాధనము కాదన్న నిరూపణము అపూర్వము. సోముని ఆశ్వాసాంతగద్యములోని విశేషణములు స్థూలముగా నిర్వచించి సూక్ష్మముగా వివరింపబడినవి సకలభాషాభూషణవిశేషణము భాషా

విషయమని, సాహిత్యరసపోషణవిశేషణము సాహిత్యవిషయమని, సంవిధానచక్రవర్తి విశేషణము కథావిషయమని, నవీనగుణసనాథవిశేషణము కావ్యగుణవిషయమని సముచితముగ సమన్వయింపబడినది. భాస్కరరామాయణరచనములో మంత్రి భాస్కరునికి ఎట్టి సంబంధమును లేదని, భాస్కరరామాయణరచనాప్రణాళిక హుళక్కి భాస్కరునిదే అని సోపపత్తికముగా నిరూపింపబడినది. ఈ రామాయణము షట్కాండముల సమీక్ష సవివరముగ ఉన్నది.

ప్రాఙ్నన్నయయుగమునుండి ఎఱ్ఱనయుగపర్యంతము గల ఈ ప్రథమ భాగము వివేకభక్తియుతమైన శరభాంకలింగశతకసమీక్షవరకు సాగినది ప్రతి యుగమునకు చారిత్రికనైపథ్యమును సమకూర్చుట, ప్రధానగ్రంథములు సవివరముగాను, ఇతరగ్రంథములు సంగ్రహముగాను సమీక్షించుట, ప్రసిద్ధకవుల ఆత్మీయతలను అవలోడించుట, ప్రతియుగవైశిష్ట్యమును సూక్ష్మేక్షికతో పరిశీలించుట ఈ గ్రంథము ప్రత్యేకతలు.

కావ్యసారమును కాచి వడగట్టిన సాహిత్యచరిత్ర ఇది.

సాహిత్యచరిత్రాంశము లెంతగా వివరణ పొందినను, నూత్నపరిశోధితాంశములు ఎన్ని సమకూడినను, శైలి సరళసుందరము కానిచో ఆ పుస్తకము చదివించదు చదివించు గుణము శైలికి జీవలక్షణము. అది ఈ గ్రంథములో అంతటను ఉన్నది శ్రీరామమూర్తిగారి తెలుగుసాహిత్యచరిత్రలోని శైలి గాంభీర్యమాధుర్యముల సమ్మేళనము. కావ్యపఠనదశలో సహృదయుడు పొందు అనుభూతి, ఈ సాహిత్యచరిత్రపఠనదశలో పాఠకుడు పొందుట ఈ గ్రంథము విశిష్టత.

విద్యార్థులకు విషయవిస్తరము,
పరీక్షార్థులకు సమాధానసౌకర్యము,
పరిశోధకులకు ప్రరోచనపాటవము,
జిజ్ఞాసువులకు ప్రామాణికదర్శనము

అందించగల 'వేడిమెకమ్' (Vademecum) ఈ తెలుగు సాహిత్యచరిత్ర.

— ఆచార్య కోలవెన్ను మలయవాసిని

అధ్యక్షురాలు, తెలుగుశాఖ

ఆంధ్రవిశ్వకళాపరిషత్ — వాల్తేరు.

# రమ్యాణి వీక్ష్య

అద్యతనాంధ్రసాహితీజగతిలో కవిగా, కథారచయితగా, నాటకకర్తగా, నైకవిధగ్రంథరచనావతంసులుగ, ఉత్తమదేశికులుగ లబ్ధప్రతిష్ఠులైన ఆచార్యకొర్లపాటి శ్రీరామమూర్తిగారు ఇంచుమించు ఇరువదియైదు సంవత్సరములు పాఠప్రవచన మొనర్చిన 'తెలుగు సాహిత్యచరిత్ర'కు అక్షరరూప మీ గ్రంథము సాహిత్య మొక అపారపారావారము ఆ పారావారమున ప్రవేశించి మథించినకొలది,మథించిన వారి మేధ కొలది అం దమూల్యార్థములు కైవసము లగుననుట అనుభవపునరుక్తము ఆ యా రచయితలు, ఆచార్యులు కొందఱు ఇతఃపూర్వము ఆంధ్ర సాహిత్యచరిత్రలను రచింపకపోలేదు వానిలో కొన్ని సంక్షిప్తములు. మఱికొన్ని సర్వస్వములు అవి విద్యార్థులకు -అందును స్నాతకోత్తరతరగతిస్థాయివిద్యార్థులకు, ఆంధ్రకేంద్రప్రభుత్వపరీక్షార్థులకు-అంతగా ఉపయుక్తములు కావు నిర్దిష్టమైన ప్రణాళికతో గాని, నిర్దుష్టమైన రచనాసంవిధానముతో గాని కూడుకొన్నవి కావు. ఆ లోపమును తీర్చుటకు ఆచార్య కొర్లపాటి శ్రీరామమూర్తిగారు తమ సుదీర్ఘబోధనానుభవముతో, ప్రగాఢపరిశోధనాపాటవముతో, అటు విద్యార్థులే గాక అధ్యాపకులు; ఇటు పరిశోధకులే గాక పండితప్రకాండులు ఔదల దాల్చునట్లు సంతరించిన దీ తెలుగు సాహిత్యచరిత్ర.

ఇందలి యుగవిభజనము పాఠ్యప్రణాళికానుసారమే కాదు; సాహిత్యపరిణామ వికాసనిరూపకము ప్రతియుగమునకే గాక యుగకర్తలకును సంకలించిన 'చారిత్రికనైపథ్యము' అనిదంపూర్వమే కాదు; అపూర్వము కూడ ఒక కవియొక్క గాని, కావ్యముయొక్క గాని, ప్రక్రియయొక్క గాని, విలువలు నిర్ధారించుటకు ఈ చారిత్రికపరిజ్ఞానము ప్రాణస్నాయువు అది లేని సాహిత్యచరిత్ర నేల విడిచిన సాము దానితో పరిపుష్టమైన ఈ తెలుగు సాహిత్యచరిత్ర అనర్ఘమణిరత్నము. అంతేకాదు నేటిదెని విమర్శకలోకములో వాదోపవాదములు సాగుచున్న పాలకురికె సోముని, నాచన సోమన వంటి కవుల కాలనిర్ణయములు; రంగనాథరామాయణము, భాస్కరరామాయణము వంటి కావ్యముల కర్తృత్వనిర్ణయములు సత్యప్రకటన సమర్థములు.

ఈ సాహిత్యచరిత్రలో కవుల గ్రంథములు ఊచముట్టుగా -ప్రాధాన్యవివక్షదృష్టిని- సమ్యగనుశీలితములగుట మఱియొక విశేషము పూర్వవిమర్శకుల సమన్వయములను అనుసరించుచునే, అవసరమైన తావుల స్వీయసమన్వయము లొనరించుట కన్పట్టును ఉదాహరణకు "సారమతింగవీంద్రులు" అను నన్నయ పద్యమును ఎంచతో ఎన్నియో విధముల వ్యాఖ్యానించిరి ఆ పద్యములోని సారము "ప్రసన్నకథాకలితార్థయుక్తి" అని సోపపత్తికముగ నిరూపించుటయేకాక, ప్రసన్నకథ, ప్రసన్న కవిత, ప్రసన్న-అర్థముల ఆంతర్యమును నివరించుటలో పరిశోధనాపరమేష్ఠిత్వమే గాక సృజనవ్యాపారమర్మజ్ఞత వెల్లడియగుచున్నది నన్నయ అక్షరరమ్యత కుంతకుని వక్రోక్తి సిద్ధాంతములోని 'వర్ణవిన్యాసవక్రత' ప్రతిఫలనమని విశ్లేషించుట విశేషము ఈరీతిగనే నాచన సోముని ఆశ్వాసాంతగద్యలోని విశేషణములు సమన్వయించిన విధము నిరుపమానము.

తిక్కనను మహాకవిగ, యుగకర్తగ అందఱు అంగీకరించినను ఆ యుగకర్తకు సాహిత్యచరిత్రలో సముచితస్థానము లభింపకపోవుటయే కాదు; సమగ్రావిష్కరణమును జరుగలేదు. ఈ గ్రంథము ఆ లోపమును తీర్చుటయే కాదు; ఈ సాహిత్యవిరాణ్మూర్తి విశ్వరూపదర్శనము చేయించినది ఇట్లు నివరించబూనుకొనిన ఈ గ్రంథములోని ప్రత్యంశమును పేర్కొనవలసివచ్చును అయినను ప్రత్యేకముగా పేర్కొనవలసినది ఇందలి శైలి సరళసుందరమే కాదు; పరిత హృదయమునందు పాదుకొనునది సంస్కృతప్రౌఢి తోపాటు తెలుగు నుడికారమును చక్కగా తేజరిల్లినది.

స్నాతకోత్తరతరగతిలో విద్యార్థిగ ఆచార్య కొర్లపాటి వారి ముఖస్థముగా ఆంధ్రసాహిత్యచరిత్రను అభ్యసించుట, ఆ పై ఆంధ్రోపన్యాసకునిగా అభ్యసించిన దానిని మననపూర్వకముగా విద్యార్థులకు బోధించుట, ముఖల వ్రాతప్రతి రూపములో చక్షురసంయోగము బడయుట- త్రివేణీసంగమము వలె తీర్థహేతునిగ నొనర్చి- వ్రాయించిన దీ స్పందన

-కలెవర ప వెంకట్రామయ్య

ఆంధ్రోపన్యాసకుడు

మిసెస్ ఏ.వి యస్. కళాశాల

విశాఖపట్టణము.

# విషయసూచిక

# ఉపోద్ఘాతము

## ౧

## ఆంధ్ర, తెలుగు శబ్దములు

ఆంధ్రుల ప్రసక్తి అశోకుని శాసనమునందు కలదు అది పదమూడవ ప్రముఖశిలాశాసనము కాలము క్రీస్తుపూర్వము మూడవ శతాబ్ది (254–256) భాష మాగధీప్రాకృతము "ద రజ విషవస్మి ...... అంధ్రపులిదేష–" అని కలదు[1] "ఇహ రాజ్యవిషయే ...... అన్ధ్రపులిన్దేషు–" అని సంస్కృతచ్ఛాయ. అశోకుని రాజ్యములో అంధ్రులు, పుళిందులు కలరని అర్థము. అప్పటి అంధ్రశబ్దమే ఇప్పటి ఆంధ్రశబ్దము

అశోకుని పితామహుడైన మౌర్యచంద్రగుప్తుని ఆస్థానమునందున్న మెగాస్తనీసు అను గ్రీకు రాయబారి గ్రంథమునందు ఆంధ్రుల విషయము కలదని[2] ప్రసిద్ధము కాని, మెగాస్తనీసు గ్రంథము –గ్రీకుభాషలో 'తా ఇండికా' ఇంగ్లీషు భాషలో 'ఇండికా' – లభింపలేదు అందలి విషయములు కొన్ని ఏరియన్ ప్రభృతుల గ్రంథములందు ఉదాహరింపబడినవి ప్లినీ గ్రంథమునందు "ఆంధ్రులు అసంఖ్యాకమైన గ్రామములు, ముప్పది దుర్గములు కలిగిన, రాజునకు లక్ష కాల్బలము, రెండువేల అశ్వదళము, వెయి గజదళము సమకూర్చిన శక్తిమంతమైన జాతి" అని కలదు[3] ఇది మెగాస్తనీసు గ్రంథమునుండి ఉదాహరించినట్లు లేదు ప్లినీ రచించినట్లు కలదు. ఇతని కాలము క్రీస్తుశకము ప్రథమశతాబ్ది[4] (23–79)

ఆంధ్రుల ప్రసక్తి అతఃపూర్వమే ఐతరేయబ్రాహ్మణమునందు కలదని[5] అతి ప్రసిద్ధము అది శునశ్శేపాఖ్యానములోని విశ్వామిత్రశాప వృత్తాంతము. (18.ఖం 7పం) అందు విశ్వామిత్రుడు శునశ్శేపుని జ్యేష్ఠపుత్త్రునిగ స్వీకరించుటకు, తనజ్యేష్ఠ పుత్త్రుని కాక, నూటొక్కమంది పుత్త్రులలోని మధ్యమపుత్త్రుడైన మధుచ్ఛందసుని ఏలఅడుగవలయును? అను ప్రశ్నకు[6] అవకాశము కలదు అంతేకాదు తైత్తిరీయ, కఠకసంహితలందు శునశ్శేపుని వరుణపాశ విషయమేకాని, విశ్వామిత్రరక్షణ విషయము లేదు[7] భారత, భాగవత, రామాయణములందు విశ్వామిత్రరక్షణ విషయమే కాని, విశ్వామిత్రశాపవృత్తాంతము లేదు కావున ఐతరేయ బ్రాహ్మణము నందు విశ్వామిత్రశాపవృత్తాంతము ప్రక్షిప్తము కావలయును. శునశ్శేపాఖ్యానమే

ప్రసక్తి ఉపరాపిచ్చును ప్రక్షిప్తముల కాలము క్రీస్తుపూర్వము మూడవ శతాబ్ది కంటె పూర్వము కాదు.[8] అదే శతాబ్దిని ఆంధ్రుల ప్రసక్తి అశోకుని శాసనము నందు కలదు, అది నిర్ధారకసాధనము ఇది సంశయగ్రస్తసాధనము.

బ్రాహ్మణగ్రంథములైన రామాయణ మహాభారతములందు, వాయు బ్రహ్మాండ మత్స్య విష్ణుభాగవత పురాణములందు ఆంధ్రుల ప్రసక్తులు కలవు[9] అవి కాలక్రమసంక్రాంతములు కావచ్చును బౌద్ధగ్రంథములైన సుత్తనిపాతము వ్యాఖ్యానమునందు అంధకరట్ఠము, సమంతపాసాదికమునందు తమిళుల లోపాటు అంధుల ప్రసక్తి, అపదానజాతకకథయందును తమిళుల తోపాటు అంధకుల ప్రసక్తి కలవు[10] రట్ఠశబ్దము సంస్కృతరాష్ట్రశబ్దమునకు, అంధ, అంధక శబ్దములు సంస్కృత–ఆంధ్ర, ఆంధ్రక శబ్దములకు ప్రాకృతరూపములు జైనగ్రంథములైన సెరివాణిజజాతక కథయందు, జైన బృహత్కల్పభాష్యమునందును తెల (తేలి) వాహనదీతీరమునందలి అంధపురము (=ఆంధ్రపురము) అంధకుల (=ఆంధ్రుల) రాజధాని అని కలదు[11] బౌద్ధగ్రంథముల కాలమునకు ప్రాగవధి క్రీస్తుపూర్వము రెండవ శతాబ్ది[12] జైన గ్రంథముల కాలమునకు ప్రాగవధి క్రీస్తుతర్వాత ఐదవశతాబ్ది[13] అశోకుని శాసనమే ఆంధ్రుల ప్రసక్తికి ఆద్యప్రకృతి అది జాతివాచకము

పల్లవరాజు శివస్కంధవర్మ మైదవోలు శాసనమునందు "అన్ధా పథీయో గామో విరిపరుమ్" అని కలదు[14] శాసనకాలము మూడవ శతాబ్ది భాష ప్రాకృతము "అన్ధాపథీయో గ్రామో విరిపరుమ్" అని సంస్కృతచ్ఛాయ. ఆంధ్రాపథీయమైన విరిపరు గ్రామమని అర్థము ఆంధ్రాపథమునకు సంబంధించినది ఆంధ్రాపథీయము ఆంధ్రాపథమన ఆంధ్రదేశము ఇది దేశవాచకము

నాటకమునందు మాగధి, ఆవంతి, ప్రాచ్య, శౌరసేని, అర్ధమాగధి, బాహ్లీక, దాక్షిణాత్య అను భాషలు ఏడు; శాకారి, ఆభీరి, చాండాలి, శాబరి, ద్రామిళి, ఆంధ్రి అను విభాషలు ఏడు ఉండునని భరతుని నాట్యశాస్త్రమునందు కలదు (49,50శ్లో 17 అ) ఆంధ్రి అన ఆంధ్రభాష కాని అట్టి కల శ్లోకములు ప్రక్షిప్తములని అభిప్రాయము కలదు. అయినను ఆంధ్రజాతి మాటాడు భాష ఆంధ్రభాషయే

ఇట్లు ఆంధ్రశబ్దము జాతివాచకముగ, దేశవాచకముగ, భాషావాచకముగ కలదు

తెలుగు శబ్దము పదొకండవ శతాబ్ది శాసనములందు కలదు. 1022 నాటి ఒక తమిళశాసనమునందు వేంగిగంగమండలమహాదండనాయకుడైన మారాయడు చేర, తెలుంగ, రట్టుగ, కొంకణ, రుళువరాజులను జయించినట్లు కలదు. [15] నాటిదే అగు మఱొక తమిళశాసనమునందు రాజేంద్రచోడుడు కళింగులతోను, తెలుంగుల తోను యుద్ధము చేసినట్లు కలదు [16] ఒక కన్నడశాసనమునందు కొంగల్వరాజు తెలుగుదేశమును జయించినట్లు కలదు [17] తమిళశాసనములలోని తెలుగు శబ్దము జాతివాచకము కన్నడశాసనములోని తెలుగు శబ్దము దేశవాచకము భాషావాచకముగ తెలుగు శబ్దమునకు రూపాంతరము తెనుగు శబ్దము పదొకండవ శతాబ్దినే కలదు. "తెనుఁగున రచియింపు మధికధీయుక్తిమెయిన్", "నన్నయభట్టు దెనుఁగునను మహాభారత సంహితారచనబంధురుఁ డయ్యె" (16,25 ప 1 ఆ ఆ. ప) అని నన్నయ భారతమునందు కలదు ఇందు మొదటి తెనుగు శబ్దము ప్రాసఘటితము. నిర్ధారక ప్రయోగము తెలుగుశబ్దము భాషావాచకముగ పదమూడవ శతాబ్దివఱకు ప్రయుక్తము కాలేదు "తెలుఁగునఁ గల భేదంబులు దెలుఁగై సంస్కృతము చెల్లు తెలుఁగులు దత్సంధులు-" అని కేతన ఆంధ్రభాషాభూషణమునందు కలదు (16 ప) ప్రాస ఘటితము నిర్ధారక ప్రయోగము.

కోదుల, గోండుల వంశోత్పత్తికథలలో తెలింగదేవత కలదు [18] గోండుల జానపదగాథలో 33 కళ్ళముల తెలుగు దేవతలు కలరు [19] వాయు, మార్కండేయ పురాణములందు తిలంగదేశము కలదు (111 శ్లో 45 అ పూ. వా పు) కథలు, గాథలు, పురాణములు నిర్ధారకసాధనములు కావు తెలింగ, తిలంగ, తిల్లింగ, తైలింగ, త్రిలింగ, [20] త్రైలింగశబ్దములకు మూలము తెలుంగు శబ్దమె అగును. ఆంధ్ర, తెలుగు, తెనుగు శబ్దములకు అనేక వ్యుత్పత్తులు కలవు అని ప్రతిపాదకుల వ్యుత్పత్తికి కొలమానములుగా కలవుగాని, శబ్దముల వ్యుత్పత్తికి ప్రమాణములుగా కానరావు.

ఆంధ్ర, తెలుగు శబ్దములందు ఆంధ్రశబ్దమే ప్రాచీనము తెలుగు శబ్దము అర్వాచీనము రెండును జాతివాచకములుగ, దేశవాచకములుగ, భాషావాచకములుగ కలవు పదొకండవ శతాబ్దినుండి పర్యాయపదములు. ఆంధ్రసాహిత్యచరిత్ర అనినను, తెలుగుసాహిత్యచరిత్ర అనినను అర్థమొకటే అది జాతివాచకముగ కాదు దేశవాచకముగ కాదు భాషావాచకముగ మాత్రమే. ఆంధ్రసాహిత్యచరిత్ర అనిన ఆంధ్రభాషలోని సాహిత్యము యొక్క చరిత్ర తెలుగుసాహిత్యచరిత్ర అనిన తెలుగుభాషలోని సాహిత్యముయొక్కచరిత్ర

# వాఙ్మయ, సారస్వత,
# సాహిత్య శబ్దార్థములు

వాక్ శబ్దముకంటె మయట్ ప్రత్యయము చేరిన, నిష్పన్నమగు రూపము వాఙ్మయము. మయట్ ప్రత్యయమునకు అర్థము వికారము అది తెలుగువికారము కాదు సంస్కృతవికారము ప్రకారమని అర్థము వాక్ప్రకారమన వాగ్వ్యవహారమని తాత్పర్యము దైనందిన సంభాషణము మొదలు దైవస్తుతిపారాయణము వఱకు గల వాగ్వ్యవహారమెల్ల వాఙ్మయమే అది ముఖస్థమైన ముఖస్థవాఙ్మయము లిఖితమైన లిఖితవాఙ్మయము. ఇది వాఙ్మయశబ్దమునకు గల విస్తృతార్థము విస్తృతార్థమున వాఙ్మయశబ్దము సామాన్యవాచి ఈ అర్థమున వేదములు, పురాణములు, శాస్త్రములు, కావ్యములు,పత్రములు, కరపత్రములు, పత్రికలు, ప్రత్యేకసంచికలు సర్వమును- ముఖస్థము, లిఖితము కూడ- వాఙ్మయపరిధిలోనికి వచ్చును కాని కావ్యములను మాత్రమే వాఙ్మయమను వ్యవహారము కలదు ఇది పరిమితార్థము పరిమితార్థమున వాఙ్మయశబ్దము విశేషవాచి

“అనుద్వేగకరం వాక్యం సత్యం ప్రియహితం చ యత్
స్వాధ్యాయాభ్యసనం చైవ వాఙ్మయం తప ఉచ్యతే” 15 శ్లో 17 అ.

అని భగవద్గీతయందు కలదు. ఉద్వేగము కలిగింపని సత్యమైన, ప్రియహితమైన వాక్యమును, వేదాభ్యాసమును వాఙ్మయతపస్సు అందురని అర్థము. సత్యప్రియహిత సంభాషణము, వేదపారాయణము ముఖస్థవిషయములు వాఙ్మయశబ్దమిట ముఖస్థ వాఙ్మయమను విస్తృతార్థమున ప్రయుక్తము సామాన్యవాచి

“వివృణ్వతో యస్య విసారి వాఙ్మయమ్
దినే దినే శిష్యగణా నవా నవా
ఉషస్సులగ్నా శ్రవణేఽధికాం శ్రియం
ప్రచక్రిరే చందనపల్లవా ఇవ” 14 శ్లో.

అని బాణుని కాదంబరియందు కలదు బాణుని పితామహుడు అర్థపతి ప్రతి దినము క్రొత్త క్రొత్త శిష్యులకు విస్తృతమైన వాఙ్మయమును వివరించుననని తాత్పర్యము. వేదములు, పురాణములు, శాస్త్రములు, కావ్యములు కలిసి విస్తృత

వాఙ్మయ మగును వేదములు ముఖస్థ వాఙ్మయము పురాణశాస్త్ర కావ్యములు లిఖితవాఙ్మయము. వాఙ్మయశబ్దమిట ముఖస్థ, లిఖితవాఙ్మయములను విస్తృతార్థమున ప్రయుక్తము సామాన్యవాచి

నన్నయ భారతమునందు నారాయణభట్టు "వాఙ్మయధురంధరుఁడు" అని కలదు (24 ప 1ఆ ఆ. ప ) అతడు నన్నయ సహాధ్యాయుడు నన్నయభట్టు "సంహితాభ్యాసుఁడు" (9ప ) సహాధ్యాయుడు కావున నారాయణభట్టు కూడ సంహితాభ్యాసుడు కావలయును వాఙ్మయధురంధరు డనగా వెదపురాణశాస్త్రకావ్యనాటకాది సమస్తవాఙ్మయధురంధరుడని అర్థము "వేదాదిసమస్తవాఙ్మయములందు" అని నన్నయ ప్రయోగాంతరము (18 ప 2 ఆ స ప ) వాఙ్మయశబ్ద మిటకూడ ముఖస్థ, లిఖితవాఙ్మయములను విస్తృతార్థమున ప్రయుక్తము సామాన్యవాచి.

తిక్కన భారతమునందు హరిహరనాథునికి "సాత్యవతేయవాఙ్మయవిశాలగృహస్ఫురితప్రదీపితా" అను సంబుద్ధి కలదు (395 ప 1ఆ ద్రో. ప ) వ్యాసుని వాఙ్మయమనెడి విశాలగృహమని రూపకము విశాలగృహవాఙ్మయము మహాభారతము మాత్రమే కాదు, అష్టాదశపురాణములు, బ్రహ్మసూత్రములును వాఙ్మయశబ్ద మిట లిఖితవాఙ్మయమైన సర్వగ్రంథసముదాయమను విస్తృతార్థమున ప్రయుక్తము. సామాన్యవాచి.

ఎఱ్ఱన హరివంశమునందు "పరాశరాత్మజమునీంద్రునివాఙ్మయ" మని కలదు. (42 ప 1 ఆ. పూ. భా,) అది "ఆదిదేవుఁడౌ వెన్నుని వృత్తము" అనగా విష్ణువృత్తాంతము. హరివంశమే పరాశరాత్మజుని "భారతపరాంశ"మైన హరివంశము "నిశ్రుతమైనపురాణ" మని కూడ ఎఱ్ఱన వివరణ (52 ప 1 ఆ పూ భా,) ఎఱ్ఱన నృసింహపురాణమునందును వాఙ్మయశబ్దము బహుధాప్రయుక్తము (26 ప 27 వచ 1 ఆ; 112, 140, 191 ప, 4 ఆ.) సర్వస్థలములందును సర్వగ్రంథసముదాయమను విస్తృతార్థమున ప్రయుక్తము. సామాన్యవాచి

"ఇహ హి వాఙ్మయ ముభయథా కావ్యం శాస్త్రం చ"

అని రాజశేఖరుని కావ్యమీమాంసయందు కలదు వాఙ్మయము ద్వివిధము. 1 కావ్య వాఙ్మయము, 2 శాస్త్రవాఙ్మయము అని అర్థము. శాస్త్రపరముగ వాఙ్మయశబ్దము సర్వగ్రంథసముదాయమను విస్తృతార్థమున సామాన్యవాచి. కావ్యపరముగ వాఙ్మయశబ్దము కావ్యగ్రంథసముదాయమను పరిమితార్థమున విశేషవాచి,

"ఆదిరాజయశోబిమ్బ మాదర్శం ప్రాప్య వాఙ్మయమ్
లేషా మసన్నిధానేఽపి న స్వయం పశ్య నశ్యతి,'' 5 శ్లో. 1 పరి,

అని దండి కావ్యాదర్శమునందు కలదు ఆదిరాజుల యశస్సు అనెడు బింబము వాఙ్మయమనెడు అద్దమునందు ప్రతిబింబమై,వారు సన్నిధిని లేకపోయినను నశించుట లేదని అర్థము ఆదిరాజుల యశోబింబము ప్రతిబింబమగు వాఙ్మయదర్పణముకావ్య దర్పణము రాముడు లేకపోయినను వాల్మీకిరామాయణము నందు రాముని యశస్సుకలదు ధర్మరాజు లేకపోయినను వ్యాసుని మహాభారతమునందు ధర్మరాజు యశస్సు కలదు రఘువంశరాజులు లేకపోయినను కాళిదాసు రఘువంశమునందు రఘువంశరాజుల యశస్సు కలదు బింబప్రతిబింబసంబంధము కావ్యదర్పణ సందర్భము వాఙ్మయశబ్దమిట కావ్యగ్రంథసముదాయమను పరిమితార్థమున ప్రయుక్తము విశేషవాచి

పయి శ్లోకము తర్వాత పాతిక శ్లోకములు పైగా (6—21శ్లో 1 పరి) కావ్యాదర్శమునందు కావ్యవిషయమే కలదు అనంతరశ్లోకమిది.

"తదేత ద్వాఙ్మయం భూయః సంస్కృతం ప్రాకృతం తథా
అపభ్రంశశ్చ మిశ్రం చేత్యాహు రార్యా శ్చతుర్విధమ్ " 32శ్లో 1 పరి

ఇందలి ఆ యీ వాఙ్మయము కావ్యవాఙ్మయమే

సరస్వతీసంబంధమైనదిసారస్వతము.సరస్వతి అనగా సరస్వతీదేవి మాత్రమే కాదు. వాక్కు కూడ "బ్రాహ్మీతు భారతీ భాషా గీ ర్వా గ్వాణీ సరస్వతీ" అని అమరము వాగర్థమున సరస్వతీసంబంధమైనది సారస్వతము. వాఙ్మయశబ్దము వలె సారస్వతశబ్దమును విస్తృతార్థమున సామాన్యవాచిగాను, పరిమితార్థమున విశేషవాచిగాను కలదు

"దేవీం వాచ ముపాసతేహి బహవః సారంతు సారస్వతామ్
జానీతే నితరామసౌ గురుకులక్లిష్టో మురారిః కవిః
అబ్ధి ర్లఙ్ఘిత ఏవ వానరభటైః కింత్వస్యగమ్భీరతా
మాపాతాళనిమగ్నపీవరతను ర్జానాతి మన్థాచలః ."

ఇది అలంకారకౌస్తుభమునందు, కువలయానందమునందును ఉదాహృతమైన ప్రాచీన చాటుశ్లోకము. ఇందు సారస్వతసారమును సమధికముగ తెలిసికొన్న గురుకుల క్లిష్టుడు మురారి అని కలదు గురుకులక్లిష్టమైన సారస్వతము కావ్యగ్రంథసముదాయము కాదు. సర్వగ్రంథసముదాయము. సారస్వతశబ్దమిట సర్వగ్రంథసముదాయమును విస్తృతార్థమున ప్రయుక్తము సామాన్యవాచి

"విద్యాకైరవకౌముదీం శ్రుతిశిరఃసీమన్తముక్తామణిమ్
దారాన్ పద్మభువ స్త్రిలోకజననీం వన్దే గిరాం దేవతామ్
యత్పాదాబ్జనమస్క్రియా స్సుకృతినాం సారస్వతప్రక్రియా
బీజన్యాసభువో భవ న్తి కవితానాట్యైక జీవాతవః." 1 శ్లో 1 ప్ర

ఇది విద్యానాధుని ప్రతాపరుద్రీయమునందలి ఇష్టదేవతాస్తుతి. ఇందు సారస్వతశబ్దము తోపాటు సారస్వతప్రక్రియాశబ్దబంధమును ప్రయుక్తమైనది "సారస్వతప్రక్రియాః కావ్యనాటకాదివాఙ్మయవిశేషాః" అని ప్రతాపరుద్రీయమునకు వ్యాఖ్యానమైన రత్నాపణమునందు మహావ్యాఖ్యాత మల్లినాధసూరి కుమారుడైన కుమారసోమపీఠి అర్థవివరణము కలదు కావ్యనాటకాదులు సారస్వతప్రక్రియలు అని వాఙ్మయవిశేషములు వాఙ్మయశబ్దముతోపాటు సారస్వతశబ్దమిట కావ్యగ్రంథసముదాయమను పరిమితార్థమున ప్రయుక్తము వాఙ్మయశబ్దము తోపాటు సారస్వత శబ్దమును విశేషవాచి

"ఎఱ్ఱనార్యుండు సకలలోకైకవిదితుఁ
డయిన నన్నయభట్టుమహాకవీంద్రు
సరససారస్వతాంశప్రశస్తి దన్నుఁ
జెందుటయు సాధుజనహర్షసిద్ధిఁ గోరి 469 ప.
ధీరవిచారుఁడు తత్కవి
తారీతియుఁ గొంత దోఁపఁ దద్రచనయకా
నారణ్య పర్వశేషము
పూరించెఁ గవీంద్రకర్ణపుటపేయముగాన్" 470 ప 7ఆ

అని ఎఱ్ఱన అరణ్యపర్వశేషమునందు కలదు ఇందు నన్నయభట్టమహాకవీంద్రుని సరససారస్వతాంశప్రశస్తి తన్ను చెందుట వలన, నన్నయ రచన అగునట్లు, ఎఱ్ఱనార్యుడు కవీంద్రకర్ణపుటపేయముగా అరణ్యపర్వశేషము పూరించినట్లు కలదు. కవీంద్రకర్ణపుటపేయమగునది కావ్యము సరససారస్వతము రసవత్కావ్యము, సారస్వతశబ్ద మిటకూడ కావ్యగ్రంథసముదాయమను పరిమితార్థమున ప్రయుక్తము విశేషవాచి

"శబ్దార్థౌ సహితౌ కావ్యం" అని భామహుని కావ్యాలంకారమునందు కలదు (16శ్లో 1 పరి) శబ్దార్థసహితమైనది కావ్యమని అర్థము "శబ్దార్థయో ర్యథావత్ సహభావేన విద్యా సాహిత్యవిద్యా" అని రాజశేఖరుని కావ్యమీమాంసయందు కలదు.

(22శ్లో.1ప్ర) శబ్దార్థముల సహభావము సాహిత్యమని అర్థము. సహభావమే సహితత్వము. సహితత్వమే సాహిత్యము, "సహితయో ర్భావస్య సాహిత్యమ్"

"సాహిత్య మనయోః శోభాశాలితాం ప్రతి కాప్యసౌ
అన్యూనాతిరిక్తత్వమనోహారి ణ్యవస్థితిః" 17శ్లో 1ఉ.

అని కుంతకుని వక్రోక్తిజీవితమునందు కలదు "అన్యూనాతిరిక్తత్వము చేత మనోహరములైన శబ్దార్థముల పరస్పరసౌందర్యమే సాహిత్య"మని అర్థము.

"తత్ పునః శబ్దార్థయోః సాహిత్య మామనన్తి.
కిం సాహిత్యమ్? యః శబ్దార్థయో సంబన్ధః"

అని భోజుని శృంగారప్రకాశమునందు కలదు "అది (కావ్యము) శబ్దార్థముల సాహిత్యమును తెలుపును. సాహిత్యమనగా శబ్దార్థముల సంబంధము. అని" అర్థము

"సాహిత్యం సపరిష్కారం కవినా కల్పితమ్
భావయన్ రసికో లోకే సుఖ మత్యన్త మశ్నుతే.
వృత్త్యాదీనాం సమష్టిః స్యాత్ సాహిత్యం తత్పరిష్కృతిః
శబ్దార్థయోః పరిష్కారః కవి స్తస్య ప్రసాధకః"

అని రుయ్యకుని లేదా మంఖుకుని సాహిత్యమీమాంసయందు కలదు." కవిచే కల్పితమైన పరిష్కారము కలది సాహిత్యము అది భావించు లోకములోని రసికులకు మహాసుఖము లభించును. వృత్త్యాదుల సమష్టి సాహిత్యము. తత్పరిష్కృతి శబ్దార్థముల పరిష్కారము తత్ప్రసాధకుడు కవి" అని అర్థము.

ఇట్లు సాహిత్యశబ్దము కావ్యపరముగ అలంకారశాస్త్రములందు ప్రయుక్తమైనది అంతేకాదు. కావ్యవిషయమును తెలుపు అలంకారశాస్త్రములు సాహిత్యవిశిష్టములైనవి సాహిత్యమీమాంస, సాహిత్యదర్పణము, సాహిత్యచింతామణి, సాహిత్యరత్నాకరము ప్రసిద్ధములు.

"సంగీతమపి సాహిత్యం సరస్వత్యాః స్తనద్వయమ్
ఏక మాపాతమధుర మన్య దాలోచనామృతమ్"

"సాహిత్యసంగీతకలావిహీనః
సాక్షా త్పశుః పుచ్ఛవిషాణహీనః"

అను ప్రసిద్ధచాటుశ్లోకములోని సాహిత్యశబ్దమును కావ్యపరమే.

"సహితం రససంయుక్తం తదేవ సాహిత్యమ్"

"హితేన నిరతిశయప్రేమాస్పదేన
రసేన సహితం తదేవ సాహిత్యమ్ "

"రసముతో కూడినదే సాహిత్యము" "నిరతిశయప్రేమాస్పదమైన రసముతో కూడినదే సాహిత్యము" అను నవీనవ్యుత్పత్తులలోని[21] సాహిత్యమును కావ్యవిషయమే

అసలు వ్యాకరణశాస్త్రముతో సంబంధము కల సాహిత్యశబ్దమును కావ్య పరముగా ప్రయోగించిన వారిలో ప్రథముడు రాజశేఖరుడు.[22] కావచ్చును ఆదిని తర్కవ్యాకరణశాస్త్రములందు శబ్దార్థముల సంబంధములకు వర్తించిన సాహిత్య శబ్దము కాలక్రమమున కావ్యగ్రంథములకు మాత్రమే సంప్రరూఢమైనది[23] అయినను పత్రికాసాహిత్యము, కరపత్రసాహిత్యము అను వ్యవహారములు ఆధునికముగ వెలసినవి వైదికవాఙ్మయము, లౌకికవాఙ్మయము, వైదిక సారస్వతము, లౌకికసారస్వతము అన్నట్లు వైదికసాహిత్యము, లౌకికసాహిత్యము అను వ్యవహారము ప్రసిద్ధము కాదు అంతేకాదు కావ్యవాఙ్మయము, కావ్య సారస్వతము అన్నట్లు కావ్యసాహిత్యము అను వ్యవహారమును ప్రసిద్ధము కాదు. కారణము కావ్యమే సాహిత్యము వాఙ్మయ, సారస్వతశబ్దములకు సర్వగ్రంథ సముదాయము అను విస్తృతార్థము, కావ్యగ్రంథసముదాయము అను పరిమితార్థము రెండును కలవు సాహిత్యశబ్దమునకు కావ్యగ్రంథసముదాయము అను పరిమితార్థమే ప్రసిద్ధము.

సంస్కృతములోని వాఙ్మయ, సారస్వత శబ్దముల వలె, ఇంగ్లీషులోని 'లిటరేచర్' అను శబ్దమును సర్వగ్రంథసామాన్యవాచిగాను, కావ్యగ్రంథ విశేషవాచిగాను కలదు[24] లిఖితమైనదెల్ల 'లిటరేచర్' అని విస్తృతార్థము ఈ అర్థమున గ్రంథపట్టికలు, పాఠ్యగ్రంథములు, శాస్త్రగ్రంథములు, వార్తాపత్రికలు వ్యాపారప్రకటనలు మొదలైనవెల్ల లిటరేచర్ అగును అనుభూతులు, ఆవేశములు, ఆలోచనలు, జీవితవిధానములు అభివ్యక్తము సేయు రచనలు 'లిటరేచర్' అని పరిమితార్థము ఈ అర్థమున కవితలు, నాటకములు, నవలలు, కథానికలు మొదలైనవి 'లిటరేచర్' అగును సంస్కృతములోని సాహిత్యశబ్దము వలె కావ్య నాటకాదులకు మాత్రమే స్ఫోరకమైన ఇంగ్లీషు శబ్దము మృగ్యము 'లిటరేచర్' అను శబ్దము వాఙ్మయ, సారస్వత శబ్దముల వంటిదే.

వాఙ్మయ, సారస్వత శబ్దములు సాధారణముగా సర్వగ్రంథసముదాయమునకు, ప్రత్యేకముగ కావ్యగ్రంథసముదాయమునకు వర్తించును గావున, వాఙ్మయ చరిత్ర, సారస్వతచరిత్ర అనిన సర్వగ్రంథచరిత్ర, కావ్యగ్రంథచరిత్ర అగును సాహిత్యశబ్దము కావ్యగ్రంథసముదాయమునకు మాత్రమె వర్తించును గావున; సాహిత్యచరిత్ర అనిన కావ్యగ్రంథచరిత్ర మాత్రమే అగును కావ్యభేదములెల్ల కావ్యములే వేదముకంటె పురాణముకంటె, శాస్త్రముకంటె పృథగ్భూతమైనది కావ్యము ఆంధ్రకావ్యముల చరిత్రయే ఆంధ్రసాహిత్యచరిత్ర తెలుగు కావ్యముల చరిత్రయే తెలుగు సాహిత్యచరిత్ర.

# కావ్యలక్షణము

" "కవనీయం కావ్యం" (వర్ణింపదగినది) అని లోచనకారుడు; "కవయతీతి కవిః తస్య కర్మ కావ్యం" (వర్ణించువాడు కవి అతని కర్మ కావ్యము) అని విద్యాధరుడు, "కౌతి శబ్దాయతే విమృశతి రసభావాన్ ఇతి కవిః తస్య కర్మ కావ్యం" (రసభావములను విమర్శించువాడు కవి వాని కర్మ కావ్యము) అని భట్టగోపాలుడు; "లోకోత్తరవర్ణనానిపుణ కవికర్మ కావ్యం" (లోకోత్తరవర్ణనానిపుణుడగు కవియొక్క కర్మ కావ్యము) అని మమ్మటుడు " కర్మ అన కృతి. ఇవి కావ్యనిర్వచనములు [25]

రూపకమునకు అనగా దృశ్యకావ్యమునకు రసము ప్రధానమని భరతుడు; కావ్యమునకు అలంకారములు ప్రధానమని భామహుడు, గుణములు ప్రధానమని దండి, రీతి ఆత్మ అని వామనుడు (రీతి రాత్మా కావ్యస్య); ధ్వని ఆత్మ అని ఆనందవర్ధనుడు (కావ్యస్యాత్మా ధ్వనిః), రసము ప్రధానమని అభినవగుప్తుడు (రసేనైవ సర్వం జీవతి కావ్యం), వక్రోక్తి కావ్యజీవితమని కుంతకుడు (వక్రోక్తిః కావ్యజీవితం); ఔచిత్యము రససిద్ధమైన కావ్యమునకు స్థిరజీవితమని క్షేమేంద్రుడు (ఔచిత్యం రససిద్ధస్య కావ్యస్య జీవితం) ఇవి కావ్యలక్షణములు [26] ఇందు కావ్యశరీరము, కావ్యాత్మ, కావ్యజీవితము, కావ్యస్థిరజీవితము కలవు

కావ్యప్రయోజనము కర్తవ్యోపదేశము అకర్తవ్యోపదేశము కూడ అది గౌణము రసానందము ప్రధానము ఆనందము, ధర్మోపదేశము ప్రయోజనములని భరతాదుల అభిప్రాయము

"ధర్మార్థకామమోక్షేషు వైచక్షణ్యం కళాసు చ
కరోతి కీర్తిం ప్రీతిం చ సాధుకావ్యనిషేవణం"

అని భామహుని ప్రతిపాదనము సాధుకావ్యపరనమువలన ధర్మార్థకామ మోక్షములందు విచక్షణాజ్ఞానము, ప్రీతి, కీర్తి కలుగునని అర్థము.

"కావ్యం యశసేఽర్థకృతే వ్యవహారవిదే శివేతరక్షతయే
సద్యఃపరనిర్వృతయే కాన్తాసమ్మితతయోపదేశయుజే"

అని మమ్మటుని ప్రతిపాదనము కావ్యము యశస్సు, అర్థము, వ్యవహార జ్ఞానము, అశుభనివారణము, సద్యఃపరనిర్వృతి కలిగించి కాంతాసమ్మితముగా ఉపదేశించునని అర్థము సద్యఃపరనిర్వృతి అన రసానందము ఆది బ్రహ్మానంద సబ్రహ్మచారి కాంతాసమ్మితోపదేశము కర్తవ్యవిషయమే కర్తవ్యాకర్తవ్యోప దేశము వేదము చేయును పురాణము చేయును కావ్యము చేయును చేయువిధానము నందు భేదము కలదు వేదపురాణకావ్యములకును భేదము కలదు అది విద్యానాథుని ప్రతాపరుద్రీయమునందు ఇట్లు తెలుపఁబడినది

"య ద్వేదా త్ప్రభుసమ్మితా దధిగతం శబ్దప్రధానా చ్చిరం
య చ్చార్థప్రవణా త్పురాణవచనా దిష్టం సుహృత్సమ్మితాత్
కాన్తాసమ్మితయా యయా సరసతా మాపాద్య కావ్యశ్రియా
కర్తవ్యే కుతుకీ బుధోఽపి రచిత స్తస్యై స్పృహాం కుర్మహే "

"ప్రభుసమ్మితము, శబ్దప్రధానమును అయిన వేదమువలన ఏది బహు కాలమునకు అవగతమగునో, సుహృత్సమ్మితము, అర్థప్రధానము అయిన పురాణము వలన ఏది స్వల్పకాలమునకు అభిహితమగునో, ఆ కర్తవ్యములో కాంతాసమ్మిత మైన కావ్యశ్రీ సరసత్వమును ఆపాదించి, పండితులకు కుతూహలమును కలిగించు చున్నది అట్టి కావ్యశ్రీ కొఱకు మేము స్పృహయాళువుల మగుదుము" అని అర్థము

వేదము కర్తవ్యమును అకర్తవ్యమును తెలుపును కర్తవ్యము విధిరూపము- అకర్తవ్యము నిషేధరూపము "సత్యం వద, ధర్మం చర" అనునవి విధులు, "న సురాంపిబేత్, న పరదారాన్ గచ్ఛేత్" అనునవి నిషేధములు విధి నిషేధములు రెండును ప్రభుసమ్మితములు రాజాజ్ఞా సదృశములు. ధిక్కరింపరానివి శిరసా వహింపవలసినవి వేదమును అధ్యయనము సేయునెడ ఉచ్చారణమునందు ఉదాత్తా నుదాత్తస్వరిత ప్రచయములు నియతములు అనియతోచ్చారణము అనర్థదాయకము కాఁబట్టి వేదము శబ్దప్రధానము వేదార్థము వెంటనే తెలియదు మీమాంస చదివిన వేదార్థము తెలియును కాఁబట్టి వేదము బహుకాలావబోధము ఇది వేదస్వరూపము.

పురాణమును కర్తవ్యమును అకర్తవ్యమును తెలుపును కర్తవ్యాకర్తవ్యములు విధినిషేధరూపములు కావు కథారూపములు సత్యవిధికి హరిశ్చంద్రుని కథ, ధర్మవిధికి శ్రీరాముని కథ, సురాపాననిషేధమునకు శుక్రాచార్యుని కథ, పరదారాగమననిషేధమునకు రావణుని కథ మొదలైనవి కథలనుబట్టి కర్తవ్యాకర్తవ్యములు గ్రాహ్యములు కథలు స్నేహితుని హితవచనముల వంటివి కాఁబట్టి పురాణములు సుహృత్సమ్మితములు స్వల్పకాలావబోధములు ఇది పురాణస్వరూపము.

కావ్యములు కూడ కర్తవ్యమును, అకర్తవ్యమును తెలుపును కర్తవ్యాకర్తవ్యములు విధినిషేధరూపములు కావు కథారూపములును కావు వ్యంగ్యరూపములు–విధి నిషేధ మగును నిషేధము విధి అగును కథ గౌణ మగును శబ్దార్థములు ఔపచారికము లగును రసము ప్రధాన మగును కర్తవ్యాకర్తవ్యములు వ్యక్తము లగును కవితావాక్కులు కాంతావచనముల వంటివి ప్రభువచనము కఠినము మిత్రవచనము మృదులము కాంతావచనము మధురము రంజకత్వము, వ్యంజకత్వము సహజము కాఁబట్టి కావ్యములు కాంతాసమ్మితములు రసానందజనకములు. సత్వరావబోధములు ఆలోచనామృతములు ఇది కావ్యస్వరూపము.

వేదములు, పురాణములు, కావ్యములు కాక శాస్త్రములు కలవు అవి బహువిధములు ధర్మశాస్త్రములు స్మృతులు వేదస్మృతులు, వేదసదృశములు రాజనీతిశాస్త్రములు తత్తుల్యములు తర్క వ్యాకరణాలంకార వేదాంత వైద్య గణితాది శాస్త్రములు విశ్లేషణాత్మకములు ప్రస్తరణ రూపములు తత్త్వప్రతిపాదకములు. అనుశాసనములు గాని చండశాసనములు కావు ఆధునిక భౌతిక రసాయన జంతు వృక్షాదిశాస్త్రములును విశ్లేషణాత్మకములు ప్రస్తరణ రూపములు సూక్ష్మపరిశీలనములు విజ్ఞానప్రతిపాదకములు ఇవియెల్ల విషయ ప్రధానములు. ఇది శాస్త్రస్వరూపము.

వేదములు శబ్దప్రధానములు శాస్త్రములు విషయప్రధానములు పురాణములు కథా ప్రధానములు కావ్యములు రసప్రధానములు కావ్యములందును భేదములు కలవు అవి కావ్యభేదములు అవే సాహిత్య ప్రక్రియలు శ్రవ్యకావ్యములు, దృశ్యకావ్యములు; పద్యకావ్యములు, గద్యకావ్యములు, పద్యగద్యోభయ కావ్యములు, (చంపూకావ్యములు), మహాకావ్యములు, లఘు కావ్యములు (క్షుద్రకావ్యములు); శాస్త్రకావ్యములు, క్షేత్ర కావ్యములు, కథాకావ్యములు, చరిత్ర కావ్యములు, సంగీత కావ్యములు, స్వతంత్ర కావ్యములు, శ్లేషకావ్యములు, ద్వ్యర్థికావ్యములు, ద్విపద

కావ్యములు, ఉదాహరణ కావ్యములు, శతకములు, రగడలు, వీరగాథలు, యక్షగానములు, కీర్తనలు,కృతులు, పదములు, ఆఖ్యాయికలు, కథానికలు మొదలైనవి బహువిధములైన కావ్యభేదములు సాహిత్య ప్రక్రియలు సాహిత్య ప్రక్రియల చరిత్రయే సాహిత్యచరిత్ర సాహిత్యేతరమైన గ్రంథముల చరిత్ర సాహిత్యచరిత్ర కాదు కావ్యముల చరిత్రయే సాహిత్యచరిత్ర

# చరిత్ర

చరిత్ర అను శబ్దము ప్రాచీనమైనది అర్థము నవీనమైనది ప్రాచీనార్థము కథ. స్టోరీ నవీనార్థము కథ కాదు హిస్టరీ అను ఇంగ్లీషు శబ్దమునకు అనువాదము. జరిగినదాని వివరణ కథ కల్పితము చరిత్ర వాస్తవము ప్రతివ్యక్తికి చరిత్ర ఉండును ప్రతి సమాజమునకు చరిత్ర ఉండును ప్రతిదేశమునకు చరిత్ర ఉండును. ప్రతి వస్తువునకు చరిత్ర ఉండును ప్రతి విషయమునకు చరిత్ర ఉండును అది ఎప్పటి కప్పుడు, ఎక్కడ కక్కడ గ్రంథస్థము కావలసినది అయిన సందర్భములు అరుదు. అందును మనకు అస్తినాస్తివిచికిత్సానహము గతశతాబ్ది వఱకు దేశ చరిత్ర గ్రంథస్థము కాలేదు అందుకు కావలసిన సామగ్రిని భద్రపఱచుకొనలేదు. జనశ్రుతులు, కట్టుకథలు, పుక్కిటిపురాణములు విశ్వసించుట జరిగినది అవి నివురు గప్పిన నిప్పులు కొండంత నివురు తొలగించిన కాసంత నిప్పు కనిపించును అది పట్టుకొనుసరికి ఆరిపోవును కూడ చరిత్ర కల దేశము చరిత్రగ్రంథము లేనిదైనది. దేశచరిత్రను నిర్మించుకొనవలసి వచ్చినది అది కూడ తెల్లదొరలు ఆరంభించినది. అందుకు కావలసిన సామగ్రి అన్వేషణ, సమీకరణ, సంరక్షణ వారి చలువయే

చరిత్రగ్రంథము నిర్మించుకొనుటకు శాసనములు, నాణెములు, పురావస్తువులు, పురాతత్త్వములు, వాఙ్మయము ప్రధానమైన సామగ్రి అందు శాసనములు, నాణెములు, పురావస్తువులు నిర్ధారకసాధనములు ప్రతిశాసనము పరమ ప్రమాణము కాదు కూటశాసనములు కోకొల్లలు జనమేజయుని శాసనములు ప్రథమోదాహరణము వాఙ్మయము పరీక్షా సాపేక్షము సమకాలిక వాఙ్మయము సమర్థసాధనము సమీపకాలికవాఙ్మయము పాక్షికసాధనము సుదూరకాలిక వాఙ్మయము దుర్బలసాధనము నేలగర్భమున దాగిన సామగ్రి కాలక్రమమున లభించుచున్నది అందువలన నిర్మించుకొన్న దేశచరిత్ర నిత్యనూతనము కాదు అలతి మార్పులే కాదు, పెద్ద మార్పులును అవకాశము

సప్రమాణ నిరూపణాత్మకమైన యథార్థవిషయగ్రథనము చరిత్ర సంభావ్యమైన సమన్వయము ఉపాదేయమే పైచరిత్ర కవుల చరిత్రకు కరదీపిక కావ్యములలోని అవతారికలు, ఆశ్వాసాద్యంత పద్యగద్యములు కవుల చరిత్రకు ఆధారములు కవుల చరిత్ర సాహిత్య చరిత్రకు సాధనము

# కవులచరిత్ర - సాహిత్యచరిత్ర

## సామ్యభేదములు

కవుల చరిత్ర కవుల కావ్యసంబంధమైన జీవిత చరిత్ర సాహిత్య చరిత్ర కవుల రచనా సంబంధమైన కావ్యముల చరిత్ర కవుల చరిత్రకు, సాహిత్య చరిత్రకు కొంత సామ్యము కలదు ఎంతో భేదము కలదు కవుల చరిత్రసాధనము సాహిత్య చరిత్ర సాధ్యము

కవుల చరిత్రలందు కవుల కులమతము లుండును. గోత్ర సూత్రము లుండును పుట్టుపూర్వోత్తరము లుండును జన్మస్థలములు, గమ్యస్థానములును ఉండును విశేషణము లుండును ప్రశంసలుండును బిరుదము లుండును ప్రవర్తనము లుండును సాధించిన ఘనకార్యము లుండును రచించిన కావ్యము లుండును కాల నిర్ణయము లుండును కర్తృత్వ నిర్ధారణము లుండును కావ్య పౌర్వాపర్య నిర్దేశము లుండును కవితాశైలికి కతిపయోదాహరణము లుండును ఇవి యెల్ల కవుల చరిత్రకు ప్రధాన విషయములు సాహిత్యచరిత్రకు ఉపోద్ఘాత ప్రాయములు.

ఉదాహరణమునకు ఆదికవి నన్నయ గురించి కవుల చరిత్రయందుండు విషయమిది నన్నయ రాజరాజనరేంద్రుని కులబ్రాహ్మణుడు ముద్గలసగోత్రుడు. ఆపస్తంబ సూత్రుడు పశ్చిమగోదావరిజిల్లా తణుకు తాలూకా గ్రామమునందు యజ్ఞము చేసినట్లు పరమార్వాచీనప్రమాణము కలదు గమ్యస్థానము రాజమహేంద్రవరము రాజరాజ నరేంద్రుని ఆస్థానకవి రాజరాజ నరేంద్రుడు వేంగి రాజ్యాధిపతి తూర్పు చాళుక్యరాజు రాజధాని రాజమహేంద్రపురము నన్నపార్యుడు అవిరళజపహోమతత్పరుడు విపుల శబ్దశాసనుడు సంహితాభ్యాసుడు పరమవిజ్ఞాన నిరతుడు లోకజ్ఞుడు సచ్చరిత్రుడు సంస్కృతాంధ్ర కవి. నిత్య సత్యవచనుడు. బుద్ధితె బృహస్పతి రాజరాజ నరేంద్రుని ఆనతిని తెనుగున మహాభారత సంహితా రచన బంధురుడు. అతని సహాధ్యాయుడు నారాయణభట్టు తోడయి నిర్వహించెను.

నారాయణభట్టునకు రాజరాజ నరేంద్రుడు 1053 వ సంవత్సరమునందు కోనసీమ లోని నందమపూడిని అగ్రహారముగ దానము చేసెను. దానశాసనమును నన్నయ భట్టు రచించెను. కావున నన్నయ భారత రచనాకాలము 1053 తర్వాత కావల యును. రాజరాజ నరేంద్రుని రాజ్యాంతకాలమగు 1062 వ సంవత్సరము నన్నయ రచన అరణ్యపర్వము నందు ఆగిపోయెను. నన్నయ ఆంధ్ర కవిత్వవిశారదుడని తిక్కన, గాథప్రతిభుడని శ్రీనాథుడు, వాగనుశాసనుడని భట్టుమూర్తి ప్రశంసించిరి. ఆంధ్రశబ్దచింతామణి, లక్షణసారము, ఇంద్రవిజయమును, చాముండికావిలాసము ఆదికవి నన్నయభట్టు రచించినవి కావు ఇత్యాదివిషయములు కవులచరిత్రయందు సప్రమాణనిరూపణములుగ, సంభావ్యసమన్వయములుగ సవివరముగ ఉండును. అందుకు దేశచరిత్ర, శాసనములు, అవతారికలు, ఆశ్వాసాద్యంతపద్యగద్యములు, ఆంతరంగిక విశేషములు మొదలైనవి ఆధారము లగును కొన మెఱుపు నన్నయ శైలికి నాలు గైదు లేదా పది పదియేను పద్యము లుండును.

కవుల చరిత్రలోని కవి చరిత్రాంశములు, కావ్యచరిత్రాంశములు సంగ్రహముగ సప్రయోజనముగ సాహిత్యచరిత్రయం దుండును ఇది సామ్యము. శైలీ శబ్దము విస్తృతార్థము కలది శయ్యా మాత్రమే గాక, కవితా రీతులెల్ల శైలీ విశేషములే. శయ్యామాత్రమైన శైలికి కతిపయోదాహరణములు కవుల చరిత్రయం దుండును కవితారీతులన్నిటికి విశ్లేషణాత్మకముగ సమన్వయరూపమున విపులో దాహరణములు సాహిత్యచరిత్రయం దుండును ఇది భేదము ఇంతవఱకు కవుల చరిత్రకు, సాహిత్య చరిత్రకు సంవాదము కలదు ఇంతకంటె పార్థక్యము, సార్థక్యము కలది సాహిత్యచరిత్ర.

సాహిత్య మొక స్రవంతి పంటేది [27] భావధార ఏకధార కాదు ప్రవాహము. అది పరిణామశీలము నది ప్రవాహదశలో మలుపులు తిరుగును ఉపనదులను కలుపుకొనును మహానది అగును తీరభూములను తీర్థ భూతము సేయును దూర భూములను సస్యసంపన్నము సేయును సాహిత్యము పరిణామదశలో మార్పులు చెందును అన్యప్రభావములకు లోనగును మహాసాహిత్యమగును జాతిని చిరంజీవము సేయును నిద్రాణువులను మేల్కొల్పును ఏవంవిధమైన సాహిత్యపరిణామవికాస మును సాహిత్యచరిత్ర ప్రతిపాదించును అంతేకాదు సమాజమునకు సాహిత్య మునకు బింబప్రతిబింబ సంబంధము కలదు సమాజము పూర్వము రాజాధీనము ప్రస్తుతము ప్రజాధీనము రాజాధీనమైన సమాజమునందు సాహిత్యము ప్రజాహిత మును పరోక్షముగ కాంక్షించును ప్రజాధీనమైన సమాజమునందు సాహిత్యము

ప్రజాహితమును ప్రత్యక్షముగ లక్షించును సమాజమునుబట్టి సాహిత్యము. రాజాధీనమైన సమాజములోని సాహిత్యమునకు చారిత్రిక నైపథ్య ముండును ప్రజాధీనమైన సమాజములోని సాహిత్యమునకు ఉద్యమనైపథ్య ముండును ఆ నైపథ్యములను సాహిత్యచరిత్ర వివరించును

తెలుగు సాహిత్యమునందు ఆంధ్రీకరణములు కలవు స్వతంత్రకావ్యములు కలవు ఆంధ్రీకరణములైన కావ్యముల ఆంధ్రీకరణవిధానమును సాహిత్యచరిత్ర సోదాహరణనిరూపణము సేయును స్వతంత్రకావ్యములస్వతంత్రసరణిని సహేతుక సమన్వయము సేయును అంతేకాదు సమానధర్మము కల కవు లుందురు సమానేతివృత్తము కల కావ్యము లుండును సదృశకవుల, సమానేతివృత్తకావ్యముల తారతమ్యపరిశీలనమును సాహిత్యచరిత్ర కావించును పూర్వకవుల ప్రభావము తర్వాతి కవులపై ఉండుట సహజము పూర్వకవితాచర్వణవిశదీకరణమును సాహిత్యచరిత్రకు పురస్కారము సాహిత్యము బహురూపము అనేకప్రక్రియాత్మకము ప్రక్రియావైవిధ్యమును సాహిత్యచరిత్ర ప్రస్తరించును కవి ఆత్మీయత కావ్యమునందు ప్రతిఫలించును ఆత్మీయతాప్రతిఫలనమును సాహిత్యచరిత్ర ఆవిష్కరించును

ఉదాహరణమునకు ఆదికవి నన్నయనుగూర్చి సాహిత్యచరిత్రయం దుండు విషయ మిది ఆదికవి నన్నయ ఆదికావ్యమైన రామాయణమును కాక భారతమును రచించుటకు హేతుభూతమైన చారిత్రికనైపథ్యము,నారాయణభట్టు సహనిర్వహణము, భారతాంధ్రీకరణపద్ధతి, సంహితారచనసరణి, ప్రసన్నకథాకలితార్థయుక్తి, అక్షరరమ్యత, నానారుచిరార్థసూక్తినిధివిశేషణార్థము, శైలి, ఆత్మీయత, భారతాంధ్రీకరణములోని పూర్వకవితాచర్వణము, కావ్యపథము తీర్చి దిద్దిన విధము, అది ప్రతిఘటించిన అనంతరకావ్యపద్ధతి, సమన్వయించిన తదనంతరకావ్యపద్ధతి క్రమముగ సాహిత్యచరిత్ర సంతరించు పరిణామనికాసము.

ఒక విధముగ కవుల చరిత్ర సాధనము సాహిత్యచరిత్ర సాధ్యము మఱొక విధముగ కవుల చరిత్ర సోపానపరంపర సాహిత్యచరిత్ర మహాసౌధము కవుల చరిత్ర కావ్యసంపదను తెలియ జేయును సాహిత్యచరిత్ర కావ్యసారమును కాచి వడపోయును సాహిత్యనికాసమును సాక్షాత్కరింపజేయును

సాహిత్యచరిత్ర దేశచరిత్రను దేదీప్యమానము సేయును జాతి సంస్కృతిని జాగృతము సేయును వ్యక్తి చైతన్యమును వ్యవస్థితము సేయును కావ్యపునరోత్తేజము కలిగించును నూతనకావ్యసృష్టికి నాంది పట్టును ఇది సాహిత్యచరిత్ర ప్రయోజనము ఇంత ప్రయోజనము కవుల చరిత్రకు అందని ఫలము అయినను కవుల చరిత్ర ఫలమే సాహిత్యచరిత్ర

# యుగవిభాగము

ప్రతిగ్రంథమునకు ప్రత్యేకవిభాగము లుండును అది నిర్నిమిత్తము కాదు. ప్రయోజనాత్మకము. అలంకారప్రాయము కాదు ఉద్దేశపూర్వకము. అర్థవంతము. ఒక్కొక్క విభాగమునకు ఒక్కొక్క విషయ ముండును అది స్వయంసమగ్రము. సమ్యగవగాహనానుకూలము. అంతస్సూత్రము వినా అన్యవిభాగనిరపేక్షము ఒక విభాగములోని విషయము మఱొక విభాగములోనికి సంక్రమణము చెందిన స్పష్టత కొఱవడును అంతేకాదు ప్రతి విభాగమునకు ప్రత్యేకధర్మ ముండును అది వ్యత్యస్తమైన అవ్యవస్థ ఏర్పడును ప్రత్యేకధర్మప్రతిష్ఠములైన, ప్రత్యేకవిషయ ప్రతిపాదకములైన ఆంగ్లసాహిత్యచరిత్రలోని విభాగములను "ఏజెస్" అందురు అవి యుగములని ఆంధ్రసాహిత్యచరిత్రలోని వ్యవహారము సాహిత్యచరిత్రలోని యుగములు కృతత్రేతాద్వాపరకలియుగముల వంటి యుగములు కావు కాని కాలమానములే. వట్టి కాలమానములు కావు. సాహిత్యపరిణామదశాసూచకములైన కాలమానములు. అట్టి యుగవిభాగమే ఆంధ్రసాహిత్యచరిత్రకు అనువైనది

## స్థూలవిభాగము

సహస్రవసంతవికసితమైన, విలసితమైన తెనుగు సారస్వతనందనవనమును స్థూలముగ చూచిన రెండు విధములుగ కనిపించును. ఒక విధము పూర్వ సాహిత్యము. మఱొక విధము నవ్యసాహిత్యము పూర్వసాహిత్యముకంటె పృథగ్భూతమైనది నవ్యసాహిత్యము పూర్వసాహిత్యము పూర్వధర్మానుసారమైనది. నవ్యసాహిత్యము నవ్యధర్మానుసారమైనది. కాబట్టి పూర్వయుగము, నవ్యయుగము అను యుగవిభాగమునకు అవకాశము కలదు అట్టి యుగవిభాగము స్థూలవిభాగము.

ఇది స్థూలదృష్టికి సుసంగతము. సూక్ష్మదృష్టికి సుసంగతము కాదు. పూర్వసాహిత్యము పూర్వధర్మానుసారమైనను, ఒక్క మూసను పోత పోసినది కాదు. అవాంతరభేదములు అనేకములు కలవు నన్నయభట్టు మొదలు చిన్నయసూరి వఱకు సాహిత్యస్రవంతి అనేకపరిణామభంగిమలను ధరించినది. నవ్యసాహిత్యమునందును అవాంతరభేదములు కలవు అవి స్థూలవిభాగమున అభివ్యక్తము కావు. సర్వపరిణామదశలను స్పష్టము సేయు సూక్ష్మవిభాగము సాపేక్షము

## కాలవిభాగము

కాల మునుబట్టి మూడు భాగములు కలవు[28] 1500 వ సంవత్సరము వఱకు ప్రథమభాగము 1501 వ సంవత్సరమునుండి 1700 వ సంవత్సరము వఱకు ద్వితీయభాగము 1701 వ సంవత్సరమునుండి 1900 వ సంవత్సరమువఱకు తృతీయభాగము ప్రథమభాగములోని కవులు పూర్వకవులని, ద్వితీయభాగములోని కవులు మధ్యకాలపు కవులని, తృతీయభాగములోని కవులు ఆధునిక కవులని కూడ ఈ విభాగమునందు కలదు కాబట్టి పూర్వయుగము, మధ్యయుగము, ఆధునిక యుగము అను యుగవిభాగమునకు అవకాశము కలదు అట్టి యుగవిభాగము కాలవిభాగము

ఇది స్థూలదృష్టికి కూడ సుసంగతము కాదు ఇందలి పూర్వయుగములోని సాహిత్యమును ఒక్క విధము కాదు బహువిధము మధ్యయుగములోని సాహిత్యమును ఏకవిధముకాదు నైకవిధము. అంతేకాదు తెలుగు సాహిత్యము పదునాఱవశతాబ్దిని పరమోన్నతమైనది. పదునేడవశతాబ్దిని పతనోన్ముఖమైనది. అది ప్రస్ఫుటము కాదు 1701-1900 కాలము ఆధునికయుగము కానేకాదు. ఆధునికయుగ మన్న కాలమున ఆధునికశబ్దము సామాన్యార్థము కలది కేవలము కాలసూచకము నేడు ఆధునికశబ్దము విశేషార్థము కలది ప్రధానముగ గుణ సూచకము పూర్వసాహిత్యముకంటె పృథగ్భూతమైన నవ్యసాహిత్యము వెలసిన నవ్యయుగమే ఆధునికయుగము అది 1875 ప్రాంతమునుండి ఆరంభమైనది. 1701-1900 వఱకు తెలుగుసాహిత్యము ఒకచోట పుట్ట లేదు తమిళకర్ణాట దేశములందును తలయెత్తినది కాబట్టి కాలవిభాగమును ఆంధ్రసాహిత్యచరిత్రకు అనువైనది కాదు

## ప్రక్రియాపరమైన యుగవిభాగము

1500 వ సంవత్సరము వఱకు గల కాలమును పురాణయుగమని కాని, భాషాంతరీకరణకాలమని కాని చెప్పదగునని, తర్వాతి కాలమునుండి ప్రబంధయుగ మని చెప్పవచ్చునని మఱొక అభిప్రాయము కలదు.[29] ఇది నిమిత్తముగ ఆధునిక యుగమును గద్యయుగమనుటయును కలదు. కాబట్టి పురాణయుగము, ప్రబంధ యుగము, గద్యయుగము లేక వచనయుగము అని యుగవిభాగము చేయుటకు అవకాశము కలదు అట్టి యుగవిభాగము ప్రక్రియాపరమైన యుగవిభాగము.

ఇది స్థూలదృష్టికి ఇంచుక సంగతము. సూక్ష్మదృష్టికి అసంగతము. అంతేకాదు. బహుదోషబంధురము భాషాంతరీకరణము ప్రక్రియాభేదము కాదు. అది 1500 తర్వాత ఆగిపోలేదు భాషాంతరీకరణము సంస్కృతగ్రంథములకు పరిమితము కాదు సర్వభాషా గ్రంథములకును పర్యాప్తము. అది నేటను కలదు. పురాణములన అష్టాదశపురాణములు అవి కావ్యభేదములు కావు గ్రంథభేదములు. 1500 పూర్వము అష్టాదశపురాణములన్నియు తెలుగు సేయబడలేదు 1500 తర్వాతను తెలుగు సేయబడినవి భారతరామాయణములు పురాణములని సన్నియ భారతమునందు కలదు బసవపురాణము కలదు ఇవి పురాణసంజ్ఞితములే కాని, పంచలక్షణలక్షితములైన అష్టాదశపురాణములవంటి పురాణములు కావు పూర్వచరితములు మాత్రమే ఇతిహాసములు, కావ్యములు, ద్విపదకావ్యములు, స్వతంత్ర కావ్యములు, కథాకావ్యములు, ఉదాహరణములు, శతకములు, రగడలు, పదములు సంకీర్తనములు, వీరగాథలు, చాటువులు మొదలైన బహుప్రక్రియలు వెలసిన కాలము, పురాణయుగము కాదు 1501–1900 మధ్య ప్రబంధములు పరశ్శతముగ వెలువడినను, అన్ని ప్రబంధములును ఒక విధము కాదు. పదునాఱవ శతాబ్ది ప్రబంధములు ఉత్తమప్రబంధములు, పదునేడవ శతాబ్ది ప్రబంధములు మధ్యమ ప్రబంధములు పదునెన్మిది పందొమ్మిది శతాబ్దుల ప్రబంధములు అధమ ప్రబంధములు ప్రబంధ మొక ప్రక్రియాభేదము కాదు స్వతంత్రకావ్యము మాత్రమే పదునాఱవ శతాబ్దినుండి పందొమ్మిదవ శతాబ్దివఱకు స్వతంత్రకావ్యములు వెలువడలేదు పురాణములును పుట్టినవి అనేక పురాణములు పదునాఱవశతాబ్ది నుండియే అవతరించినవి, పూర్వప్రక్రియలెల్ల కొనసాగినవి నూతనప్రక్రియలును వెలసినవి శ్లేషకావ్యములు ద్వ్యర్థికావ్యములు, వచనకావ్యములు, యక్షగానములు మొదలైనవి ఒక ప్రక్రియతర్వాత మఱొక ప్రక్రియ అవతరింపలేదు ఆధునిక యుగమునందును అనేకప్రక్రియలు కలవు అన్ని ప్రక్రియలును అన్ని కాలము లందును పరిణామవశలసందినని ప్రాధాన్యవివక్ష బలవదాకృష్టము కాబట్టి ప్రక్రియాపరమైన యుగవిభాగము నిర్దుష్టము కాదు నిర్దిష్టము కాదు

## రాజనామాశ్రయ యుగవిభాగము

"చాళుక్యచోడయుగము (1000–1200),కాకతీయయుగము(1200–1380) రెడ్డినాయక కర్ణాటకకావ్యయుగము (1380–1500) శ్రీ రాయలయుగము 1500–1600) అని ఒక నిర్దేశము కలదు.[30] కాబట్టి చాళుక్యయుగము, కాకతీయ

యుగము, పద్మనాయక రెడ్డిరాజులయుగము, విజయనగరరాజుల యుగము, నాయకరాజుల యుగము అని యుగవిభాగము చేయుటకు అవకాశము కలదు. ఇది రాజనామాశ్రయ యుగవిభాగము.

ఇందు రాయలయుగము వినా ఇతరయుగములు రాజనామాశ్రితములు కావు రాజవంశనామాశ్రితములు. చాళుక్యచోడయుగ మనగా చాళుక్యచోళుల యుగము కాదు. చాళుక్యుల, చోళుల యుగము. కాకతీయయుగము 1380 వరకు లేదు 1323 వఱకు కలదు రెడ్డియుగము 1380 నుండి కాదు స్థూలముగ 1324-25 నుండి రాయలయుగము 1650 వఱకు సాగదు 1600 వఱకు మాత్రమే సాగును అనంతరము నవాబులయుగము, నాయకరాజులయుగము అనవలయును కాని, ఆంధ్రదేశమును అఖండముగ కాలానుక్రమణికను రాజవంశము లేవాడును పరిపాలింపలేదు ఖండములుగ ఏకకాలమునందు ఎన్నో రాజవంశములు పరిపాలించినవి అన్ని రాజవంశములును, అందఱు రాజులును ఆంధ్రసాహిత్యవికాసమునకు దోహదము చేయలేదు కాలానుక్రమణిక లేని, కార్యకారణ సంబంధము లేని రాజవంశనామాశ్రయయుగవిభాగము నిరుపయోగము కార్యకారణసంబంధమునుబట్టి రాజనామాశ్రయయుగవిభాగము చేసిన రాజరాజనరేంద్ర యుగము, మనుమసిద్ధియుగము, ప్రోలయవేమారెడ్డియుగము, పెదకోమటి వేమారెడ్డి యుగము, మొదటి దేవరాయలయుగము, శ్రీకృష్ణదేవరాయల యుగము, రఘునాథ రాయల యుగము- ఇత్యాదియుగము లేర్పడును. ఇందు ప్రోలయవేమారెడ్డి మొదలు మొదటి దేవరాయలవఱకు కాలమొకటే. శివకవులకు రాజనామావకాశము, రాజవంశనామావకాశము లేదు వారు రాజాశ్రితులు కారు ఆధునికయుగమునకును అంతే. రాజులు లేరు. రాజవంశములు లేవు. ఇంతకు రాజులు, రాజవంశములు కొందఱు కవులను పోషించుట వాస్తవము. అందఱు రాజులు,అన్ని రాజవంశములును కవులను పోషింపలేదు కవులై సాహిత్యమును సృష్టింపలేదు. సాహిత్యసృష్టికర్తలైన కవిరాజులును కాదని, కవిపోషకులైన కాని, రాజుల పేర, రాజవంశముల పేర యుగవిభాగము చేయ వలసిన ఆవశ్యకము లేదు. చేసిన, కాలానుక్రమణిక లేని యుగవిభాగమది యుగ విభాగప్రయోజనమునకే విరుద్ధము. కాలానుక్రమణిక చరిత్రకు వెన్నెముక ఆంధ్రదేశచరిత్రకు కాలానుక్రమణిక లేకపోవుట సహజము. ఆంధ్రసాహిత్య చరిత్రకు లేకుండజేయుట కృతకము.

## అనువైన యుగవిభాగము

సాహిత్య చరిత్రకు పరిణామక్రమవికాసము జీవనాడి. అది కాలానుక్రమణికను అపేక్షించును. పరిణామకారకుడైన కవి పూర్వరంగ ప్రవర్తకులైన పూర్వ కవుల పూజాఫలమును అందుకొని సూత్రధారియై, కవితాసరస్వతిని నూతన వేషాలంకృతను జేసి, సాహిత్యరంగమున ప్రవేశపెట్టి నృత్యమాడించును. సమకాలిక కవులు పారిపార్శ్వకు లగుదురు అనంతరకాలిక కవులును అద్భుతప్రేక్షకులై అనుసరింతురు. అట్టి కవి యుగకర్త సమాన ధర్మము కల సాహిత్య కాలము యుగము సాహిత్య స్రష్ట మాత్రమేగాక పరిణామ ద్రష్టయునైన కవి పేరిట యుగవిభాగము యుగ కర్తృగౌరవాపాదకము మాత్రమే కాదు; యుగ సాహిత్య తత్త్వప్రతిపాదకము. కాలానుక్రమణిక మూలాధారము. స్వప్రయోజనము స్పష్టము. నిర్దిష్టము. నిర్దుష్టము ఆంధ్ర సాహిత్యచరిత్రకు అనువైన యుగవిభాగము ఆ యుగవిభాగమిది [31].

| | | | |
|---|---|---|---|
| 1. | ప్రాఙ్నన్నయ యుగము | — | — 1050. |
| 2. | నన్నయ యుగము | — 1051 | — 1100. |
| 3. | శివకవి యుగము | — 1101 | — 1250 |
| 4. | తిక్కన యుగము | — 1251 | — 1300. |
| 5. | ఎఱ్ఱన యుగము | — 1301 | — 1380. |
| 6 | శ్రీనాథ యుగము | — 1381 | — 1500. |
| 7. | రాయల యుగము | — 1501 | — 1600 |
| 8. | దక్షిణాంధ్ర యుగము | — 1601 | — 1855. |
| 9. | క్షీణ యుగము | — 1601 | — 1874 |
| 10 | ఆధునిక యుగము | — 1875 | — |

ఇది ప్రసిద్ధమైన, ప్రసిద్ధ కవిపరమైన, ఆంధ్రసాహిత్యచరిత్రకు అనువైన, తెలుగు సాహిత్య చరిత్రకు తీరు, తెన్ను కల యుగవిభాగము ఇందలి కాలములు ఇప్పటివి

ప్రాఙ్నన్నయయుగ మనుటకు కారణము కవి అభావము. శివకవియుగ మనుటకు కారణము శివకవియుగములోని కవులందఱును ఒకే కోవకు చెందినవారగుట శ్రీనాథ యుగమునకు సంధియుగమని, ప్రబంధ పూర్వయుగమని, [32] రాయల యుగమునకు ప్రబంధయుగమని నామాంతరములు కలవు.

సంధియుగమునకు సంజ్ఞ ఆంగ్లసాహిత్యచరిత్రలోని "ఏ జె ఆఫ్ ట్రాన్సిషన్" కు అనుకరణము ఆంగ్లసాహిత్యమునందు ఒక మహాకవి అస్తమించి, మఱొక మహా కవి ఉదయించు వఱకు ఏ మహాకవియు లేని తన్మధ్యకాలమును ఏ జె ఆఫ్ ట్రాన్సిషన్ అందురు శ్రీనాథ యుగమునందు శ్రీనాథుడు, పోతన, వేమన, అన్నమాచార్యులు మొదలైన మహాకవు లెందఱో కలరు అట్టి శ్రీనాథ యుగమునకు ఆంగ్లసాహిత్యములోని అర్థము సంగతము కాదు అందుకు శ్రీనాథ యుగమునందు తత్పూర్వమైన ఎఱ్ఱన యుగమునకు తర్వాతి యుగమైన రాయల యుగమునకు సంధి సంధానము కలదు గావున సంధియుగమను సమన్వయము కలదు. పూర్వోత్తరయుగములకు సంధి సంధానము ప్రతియుగమునందు సంభవము, ప్రత్యేక వివక్ష ప్రయోజనరహితము

రాయల యుగమునకు ప్రబంధయుగమను ప్రసిద్ధ వ్యవహారము కలదు. అది ప్రబంధ మొక ప్రక్రియా భేదమను అపసిద్ధాంతమువలన ఆవిర్భవించినది. ప్రక్రియా భేదమను ప్రబంధ లక్షణములు ఎఱ్ఱన యుగమునందు బీజప్రాయమై, శ్రీనాథయుగమునందు బిందుభూతమై రాయల యుగమునందు పతాకస్థాయినందినవి అది పరిణామక్రమ వికాసము. అంతమాత్రమున శ్రీనాథయుగమును ప్రబంధ పూర్వయుగమని, రాయల యుగమును ప్రబంధయుగమని అనవలసిన ఆవశ్యకము లేదు అంతేకాదు కవిపరమైన యుగ విభాగమునందు మఱల ప్రక్రియాపరమైన యుగనిర్దేశము ప్రణాళికా విరుద్ధము.

నన్నయ యుగమునకు నన్నయ, తిక్కన యుగమునకు తిక్కన, ఎఱ్ఱన యుగమునకు ఎఱ్ఱన, శ్రీనాథ యుగమునకు శ్రీనాథుడు, రాయల యుగమునకు రాయలు యుగకర్తలు రాయలన శ్రీకృష్ణదేవరాయలు. అతడు విజయనగర సామ్రాజ్యాధీశ్వరునిగ కాక, ఆముక్తమాల్యదాకర్తగ, సాహితీ సార్వభౌమునిగ యుగకర్త ఇది కవిపరమైన యుగ విభాగమునకు అనుగుణము ఇక దక్షిణాంధ్ర యుగమనుటకు హేతువు స్థలభేదము. ఆంధ్రదేశము సీమావధులను దాటి తమిళ కర్ణాట దేశములందు అభివృద్ధి చెందిన ఆంధ్ర సాహిత్యమునకు శృంగగ్రాహికగ స్థలపరమైన యుగనిర్దేశము అదే కాలమున ఆంధ్రదేశమునందు క్షీణయుగము. ఇది గుణపరమైన యుగనిర్దేశము క్షీణ దక్షిణాంధ్ర యుగములు రెండును క్షీణ లక్షణ లక్షితములే ఆధునికయుగము ఆధునికతాగుణ విశిష్టము. ఇది కాలపరమైన యుగనిర్దేశము కాదు. గుణపరమైన యుగ నిర్దేశము.

# ప్రాఙ్నన్నయ యుగము

## తెలుగు పదములు

చరిత్రకు అందిన మొట్టమొదటి తెలుగు పదము నాగబు[1] అది అమరావతి శిలాశాసనము లిపిని బట్టి కాలము రెండవ శతాబ్ది కాని, అది తెలుగుపదము కాదని, నాగబుద్ధాచార్య నామైకదేశమని ఒక అభిప్రాయము కలదు.[2] "ఈ శాసనము వెనుకగాని, ముందు గాని, క్రిందగాని మీదగాని యింక నక్షరములు లేవు... ఉండునేమో యని యనుమానించుట కవకాశము లేదు ఈ జాతి పై భాగము గొప్ప శిల్ప చిత్రము గలదిగా నుండవలెను" అని శాసన ప్రకాశకుల అభిప్రాయము.[3] కాబట్టి నామైకదేశము కాజాలదు నామమే తెలుగు పదమే శాసనము పైభాగమున గల శిల్పము నాగశిల్పము కావచ్చును శిల్పము క్రింద పేరు చెక్కుట నాటి పద్ధతి అశోకుని పదునాల్గవ శిలా శాసనము కాల్సీశిల ఉత్తర ముఖమున ఏనుగు బొమ్మ, దాని క్రింద "గజతమ" మను లేఖనము కలదు.[4] గజతమమన ఉత్తమగజమని అర్థము. నాగబు తెలుగు పదమైనను అచ్చ తెనుగు పదము కాదు. సంస్కృతసమము. నాగ–సంస్కృత ప్రాతిపదిక బు–తెలుగు ప్రథమైక వచన విభక్తి ప్రత్యయము మువర్ణకమునకు పూర్వరూపము ఇది రెండవ శతాబ్దికే సంస్కృతసమములు ప్రచురముగ కలవని సూచించున

ఇంతకంటె బహుపూర్వమే క్రీస్తుపూర్వము మూడవ శతాబ్ది మాలకొండ శాసనమునందు, క్రీస్తుపూర్వము రెండవ శతాబ్ది శాలిహుండము శిథిల పాత్ర శాసనమునందు తెలుగు పదములు, క్రీస్తు తర్వాత రెండవ శతాబ్ది శాతవాహనుల వెండి నాణెముల మీద తెలుగు భాష, తెలుగు ఛందస్సు కలవని మరొక అభిప్రాయము కలదు[5] అవి తెలుగు పదములు కావు, తెలుగు భాష, తెలుగు ఛందస్సు కావు."[6]

ప్రథమ శతాబ్దిని హాలుడు సంకలనము చేసిన గాథాసప్తశతియందు తెలుగు పదములు కలవని ఇంకొక అభిప్రాయము కలదు[7] అవి కూడ తెలుగు పదములు కావు[8] అంతేకాదు. ప్రథమ శతాబ్ది గాథాసప్తశతి యథాతథముగ లభింపదు.

ఉపలబ్ధమైన గాథా సప్తశతియందు ఐదవశతాబ్ది ప్రవరసేనుని గాథలు నాలుగు కలవు (61-1, 2-3, 8-3, 96-3) పదొకండవ శతాబ్ది భోజుని (భోజకుడు) గాథలు రెండు కలవు (99-3, 20-4) కాబట్టి గాథాసప్తశతి నిర్ధారక సాధనము కాదు.

రెండవ శతాబ్ది వాసిష్ఠీపుత్రి పులుమావి జంగిలిగుండు శాసనమునందు "కుమారదతస గామే వేపురకే వథవెస.. తళాకమ్ ఖానితమ్" అని కలదు. "కుమార దత్తస్యగ్రామే వేపురకే వాస్తవ్యస... తటాకమ్ ఖానితమ్" అని సంస్కృతచ్ఛాయ కుమారదత్తుని వేపురక గ్రామమునందు తటాకము త్రవ్వం బడినదని అర్థము ఇందలి వేపురక శబ్దములోని 'క' స్వార్థప్రత్యయమని, వేపుర అనగా వేపూరు తెలుగు పదమని ఒక అభిప్రాయము కలదు [9] కావచ్చును

మూడవ శతాబ్దినుండి ఆరవ శతాబ్ది వరకు సంస్కృతప్రాకృత శాసనము లందు గ్రామనామములు, మనుష్యనామములు, తెలుగు పదములు కలవు.[10] విజిపర, కుడూర, చిల్లరెక, కొండుక మొదలైనవి గ్రామనామములు. గొల, కొట్ట, అతుక, కొట్టి మొదలైనవి మనుష్యనామములు.

## వచన శాసనములు

ఆరవ శతాబ్దినుండి తొమ్మిదవ శతాబ్దివరకు కేవలము తెలుగు వచన శాసనములు కలవు అందు రేనాటి చోళుల శాసనములు మొదటివి. అందును కలమళ్ళ శాసనము మొట్టమొదటి శాసనమని, ఎఱ్ఱగుడిపాడు శాసనము మొట్టమొదటి శాసనమని అభిప్రాయ భేదములు కలవు [11] ఆ రెండు శాసనములందును కాలనిర్దేశము లేదు లిపి స్వరూపమును బట్టి రెండు శాసనములకును కాలము 575-600 అని శాసన ప్రకాశకుల సూచనము [12] అకారాద్యనుక్రమణికను ఆ శాసనములివి .[13].

### ఎఱ్ఱగుడిపాడు శాసనము

"స్వస్తిశ్రీ ఎరికల్ ముత్తురాజుల్ల కుణ్డికాళ్ళ [ని]వురుకాను ఇచ్చిన పన్నస. దుజయరాజుల ముత్తురాజులు నవ్రపియముత్తురాజులు వల్లవదుకరాజులు సక్షికాను ఇచ్చి [స] పన్నస్య కొట్టంబున పాటక కుణ్డికాళ్ళళ ఇచ్చిన పన్నస. ఇరువది యాదినాల్కు మఱున్తుఱు నేల."

ఎఱకల్ = వంశనామము? = ఎఱకల ముత్తురాజు = పేరు లేక ముసలిరాజు కుణ్డికాళ్ళ = కుండిపాదులు కుండి బౌద్ధసంన్యాసి పేరు కాళ్ళు పాదార్థకగౌరవవాచకము నివఱు కాన. = నివసుగాసు నివము నివాపశబ్దభవము కావచ్చును తర్పణమని అర్థము పన్నస. = దానము అనంతరశాసనములందు దత్తి, దానము అని కలదు. అది పంచాశత్‌శబ్దభవమైన ఏబది అగును ఇచ్చినది ఇరువదినాలుగని ఇందే కలదు, వల్లవదుకరాజులు = పల్లవయువరాజులు, సకి = సాక్షి కొట్టంబు = గ్రామసముదాయము బోయకొట్టములు ప్రసిద్ధము పాఱకు = బ్రాహ్మణునికి మఱున్తుఙ్లు = నేల కొల ానము ఎఱకల ముత్తురాజు కుండి అను బౌద్ధసంన్యాసికి తర్పణ మిచ్చు సందర్భమున బ్రాహ్మణునికి భూదానము సేయుట శాసనవిషయము

## కలమళ్ల శాసనము

"......... కల్ ము [తు]రాజు ధనంజయుఱు రేనాణ్డు ఏళనే చిఱుమ్బూరి రేవణకాలు [పం]పు చెనూరు కాజు అటికళా [ఊ]ఱిణ్డవారు ఊరి ............... పఞ్చమహాపాతకసకు-"

ఇందు కల్ ముందు స్వస్తిశ్రీఎఱకల్ అని ఉండును ధనంజయుఱు = ధనంజయుడు, ఏళన్ = ఏలన్ = ఏలుచుండగా చిఱుమ్బూరి = చిఱుమూరి. గ్రామనామము రేవణకాలు = రేవణపాదులు—పంపు = పనపు = ఆనతి చెనూరు = చెన్నూరు కాజు = కాచు = కాపాడు అటికళా = అటికళ గ్రామనామము. ఊఱిణ్డవారు = ఊరిండ్లవారు = ఊరి గృహస్థులు పఞ్చమహాపాతకసకు = పంచమహాపాతకునకు ఇది శాపోక్తి ఎఱకల ముత్తురాజు ధనంజయుడు రేనాడు ఏలుచుండగా, చిఱుమూరి రేవణపాదుల ఆనతిని చెన్నూరు కాపాడు అటికళగ్రామములోని ఊరి మొత్తము గృహస్థులు చేయవలసిన పని (అది లుప్తమైనది) శాసనవిషయము

ఇట్లు ఆరవ శతాబ్దినుండి రేనాటి చోళుల శాసనములు తెలుగునందు కలవు అవి వచనశాసనములు ఏడవ శతాబ్దినుండి తూర్పుచాళుక్యుల తెలుగువచనశాసనములును కలవు ఆరవ శతాబ్ది చతుర్థపాదమునుండి తొమ్మిదవ శతాబ్ది పూర్వార్ధము వఱకు ఇతరుల తెలుగు వచనశాసనములు కూడ కలవు

తెలుగు వచనశాసనములందు తెలుగు పద్యలక్షణములు ప్రదర్శించుట ప్రయత్నపూర్వకము బలవదాకృష్టము.

# పద్య శాసనములు

తొమ్మిదవ శతాబ్దినుండి తెలుగు పద్య శాసనములు కలవు. అందు తూర్పు చాళుక్యుల పద్య శాసనములు అగ్రేసరభాసమానములు మొట్టమొదటి తెలుగు పద్య శాసనము గుణక విజయాదిత్యుని సేనాని పండరంగని పేరిటి అద్దంకి శాసనము. ఆ శాసన పద్యమిది [14] :

"పట్టంబు గట్టిన ప్రథమంబు నేణ్డు బలగర్వ్వణం బొప్పంగఁ బైరేచి సేన
పట్టంబు గట్టించి ప్రభు బణ్డరంగు బణ్చిన సమత్తపడ వతో బోయ
కొట్టంబు ల్వణ్డెణ్డు గొణి వెంగి నాణ్టిం గొళల్చి యా త్రిభువనాంకుశబణ నిల్పి
కట్టెపు దుర్గ్గణంబు గడు బయల్సేసి కణ్డుకూ ర్చెబవాడ గావిణ్చె మెచ్చి."

ఇది తరువోజ పద్యము. ఇందు ప్రాచీనలేఖన పద్ధతి, లేఖక దోషములు కలవు నేణ్డు= నేఁడు. బలగర్వ్వణంబ =బలగర్వము గట్టించి=గట్టించి. సమత్త పడువతో=సామంత పడ వతో కొట్టంబుల్వణ్డెణ్డ =కొట్టముల్ పండ్రెండు. నాణ్టిం= నాఁటి. గొళల్చి= గొలచి, త్రిభువనాంకుశబణ= త్రిభువనాంకుశమున. శాసనము నందు కాలము లేదు లిపిస్వరూపమును బట్టి శాసనకాలము 8 రి ప్రాంతమని శాసన ప్రకాశకుల నిర్దేశము తొమ్మిదవ శతాబ్ది ఉత్తరార్ధములోని దగును

పండరంగని విజయ పరంపరను తెలుపు కందుకూరు శాసనమును పద్య శాసనము. సీసపద్యము పరిష్కృత శాసన పద్యమిది [15] :

" శ్రీనిరవద్యుఁడు చిత్తజాతసముఁడు
శివపదపరభక్తి సేవితుండ
ఖిలుఁడు సన్నుతరిపుబలుఁ డా పథరాధ
యం డయోగ్య శిఖాసనుం డగణిత
దానాసముఁడు గజ ....................
............................
.................. లయుండు సాహసుం
డనఁ బండరం గుర్వి ననియుఁ గాంచి

కొలఁది లేని కొట్టములు వొడిచి గుణక
జాత పక్షపాతి సలరితముగ
.........................
........... ............"

ఇందు ఎత్తుగీతము ఆటవెలది శాసనకాలము 848-49 అని సూచింపఁబడి నది కాని పండరంగఁడు కొలఁది లేని కొట్టములు కూలగొట్టినట్లు శాసనమునందు కలదు. గావున, అద్దంకి శాసనము కంటె అనంతరకాలికమగును.

చాళుక్యభీముని ధర్మవరము శాసనమునందును సీసపద్యము కలదు ఆ పద్యమిది [16] :

" ...... నెన్నెలు సలరామనిభుతోఁ
నెడఁజీ [న బో]యల నడవి సొ[న్పె]
లోహనసం బెక్కి రాహను నొడిచిన
వల్లభు కొల్వున నెల్ల నెఱుంగ
కన్నరాభూ[పతి] వెన్నాజిలోం జూపె
సంకెలాణ్ణను [జే]ని [బి] [ంక] ముడి [చె]
దణ్డుపై వచ్చిన [బెణ్డెన] చోఱనిం
జేకొని కాచె భూ[లోకం] బెఱుంగ
కిరనపురము దహలనిరుతంబు దఱెనాండు
నచలపురము [సొ]చ్చె నచలితుణ్డు
వల్లభుణ్డు గుణకె స[ల్లు]ణ్డు వన్చినం
బణ్డరంగ చూరె పణ్డరంగు"

ఇందును ఎత్తుగీతము ఆటవెలది పద్యమునందు మొదటి గణము లుప్త మైనది ఎల్లనెఱుంగ = ఎల్లనెఱుఁగ వెన్నాజిలోంజూపె = వెన్నాజిలోఁజూపె. లోకంబెఱుంగ= లోకమెఱుఁగ దఱెనాండు = దఱెనాఁడు. అచలితుణ్డు= అచలితుండు వన్చినం= పంచినం. ఇందును పండరంగుని విజయయాత్ర ప్రసక్త మైనది కాని చాళుక్యభీముని శాసనము గుణక విజయాదిత్యుని అనంతరము మొదటి చాళుక్యభీముడు రాజు అతడు రాజైన అయిదవ సంవత్సరమునందు శాసనము వెలువడినది మొదటి చాళుక్యభీముడు రాజైన కాలము 892 వ

సంవత్సరము కాఁబట్టి ధర్మపరము శాసనము కాలము 892+5=897 వ సంవత్సరము [17].

యుద్ధమల్లుని బెజవాడ శాసనమునందు అయిదు మధ్యాక్కరపద్యములు కలవు అయిదు మధ్యాక్కరపద్యములందును, అన్నిపాదములందును అయిదవ గణము మొదటి అక్షరముతోనే యతిమైత్రి కలదు ఆద్యంత పద్యములివి. [18]

"స్వస్తి నృపాంకుశాత్యస్తవత్సలసత్యత్రిణేత్ర
విస్తరశ్రీయుద్ధమల్లు ణనవద్యవిఖ్యాతకీర్తి
ప్రస్తుతరాజాశ్రయుణ్డు త్రిభువనాభరనుణ్డు సకల
వస్తుసమేతుండు రాజసల్కి భూవల్లభు ణ్డర్తి."

"రమనతో బెజవాడ కెల్ల బెడంగుసు రక్షయుం గాసు
స్దమతాత మల్లపరాజు చేటెఱు దానం౦ గట్టించెం
గ్రమఱున దానిక కలశబిడ్డట్లగా మొగమీడు
వమరంగ శ్రీయుద్ధమల్లు ణెత్తించె సమితతేజుండు."

యుద్ధమల్లు ణనవద్య = యుద్ధమల్లుఁడనవద్య కీర్తి = కీర్తి. త్రిభువనాభరనుణ్డ = త్రిభువనాభరణుండు భూవల్లభుణ్డర్తి = భూవల్లభుఁడర్థి. రమన = రమణ. బెడంగసు = బెడఁగును గాసుస్దమ = గానుఁదమ. దానుంగట్టించెం = దానుఁగట్టించెఁ క్రమఱున = క్రమముస కలశబిడ్డట్లగా = కలశమిడ్డట్లుగా. శ్రీయుద్ధమల్లుణెత్తించె = శ్రీయుద్ధమల్లుఁడెత్తించె ఉదాహృతపద్యములందు తాత మల్లపరాజు, మనుమడు యుద్ధమల్లుడు కలరు. మొదటి యుద్ధమల్లుని తాత విజయాధిత్యుడు రెండవ యుద్ధమల్లుని తాత మొదటి యుద్ధమల్లుడు. అతడే తూర్పు చాళుక్యరాజ్యవంశమునందు మొట్టమొదట మల్లశబ్దవాచ్యుడు. కాఁబట్టి బెజవాడ శాసనములోని మల్లపరాజు మనుమడు రెండవయుద్ధమల్లు డగును. కాలము.[19] 928-35. కావున యుద్ధమల్లుని బెజవాడ శాసనము కాలము శాసనప్రకాశకులు సూచించిన 898 వ సంవత్సరము కాక, 930వ సంవత్సరము కావలయును.

పదవ శతాబ్ది గంగాధరశాసనమునందు మూడు కందపద్యములు కలవు. ఆ పద్యములివి.[20]

"జినభవనంబు లెత్తించుట
జినపూజలు సేయుచున్కి జినమునులకు స
త్తిన యన్నదానం బీవుటం
జిన వల్లభు బోలం గలరె జినధర్మపరుర్

దినకరు సరి వెల్గుదుమని
జినవల్లభు నెట్ట నెత్తు జితకవిన సనుం
మనుజు ల్గలరే ధాత్రిం
వినితిచ్చుదు ననియ వృత్తవిబుధకవీంద్రుల్.

ఒక్కొక్క గుణం [బు] కల్గుదు
రొక్క [కొ] ణ్డిగా కొక్కొలక్క వెరెవ్వరెం
లెక్కింప నొక్కొ లక్కకు
మిక్కిలి గుణపక్షపాతి గుణ మణిగణంబుల్"

అన్నదానంబీవుటం= అన్నదానమీవుట జితకవిననుం=జితకవినిసనుస్. ధాత్రిం=ధాత్రిన్ ఎవ్వరిరెం=ఎవ్వరిరెన్. గుణమణిగణంబుర్=గుణమణిగణముల్ మూడవ పద్యమునందు రెండు పాదములందును యతిమైత్రి లేదు ఇవి కన్నడ శాసనములోని పద్యములు కవి కన్నడకవి కన్నడ—ఆదికవి పంపని సోదరుడు జినవల్లభుడు యతిమైత్రి లేమి కన్నడప్రభావము కావచ్చును పంపని కాలము పదవ శతాబ్దిమధ్యభాగము [21] శాసనకాలము పదవశతాబ్ది ఉత్తరార్ధమగును.

విరియాల మల్లని గూడూరు సానుబంధశాసనమునందు మూడు చంపక మాలలు, రెండు ఉత్పలమాలలు కలవు ఇది విరియాల కామసాని గూడూరు శాసనమని ఇతరత్ర కలదు కాని కామసాని శాసనము కాదు విరియాల మల్లని శాసనము విరియాల మల్లడు మల్లేశ్వరస్వామిని ప్రతిష్ఠించి, తటాకమును త్రవ్వించి ప్రకటించిన శాసనము అది కన్నడశాసనము. కాలము 1124వ సంవత్సరము [22] అందు పూర్వపద్యములు అనుబంధప్రాయముగ కలవు తొలి నాలుగుపద్యముల కాలము 1005 వ సంవత్సరము, తుది పద్యము కాలము 1045వ సంవత్సరమును అగును [23] పరిష్కృతశాసనానుబంధపద్యములివి.[24]

“అనుపమదుర్జయాన్వయసుధాబ్ధి ననేకులు రాజసంపదల్
సనినఁ బొరంటివెన్నఁడన సంభవుఁడయ్యె నతిప్రసిద్ధుఁడై
వినుతవిరోధి మండలిక వెన్నఁడు వెన్నుఁడు పోలె వానికిన్
ఘనుఁడగు సెబ్బిభూపతి జగద్వినుతుం డుదయించెఁ గీర్తితోన్

భావితకీర్తి నాతనికిఁ బాండవమధ్యము భీముఁడో యనం
గా వినయాలు భీమనృపసుస్మయుఁడై యుదయించె వానికిన్
భావినుతుండు మండలిక భూషణుఁ డైన తొండ్రయుఁ డుత్తమ
శ్రీవినుతుండు బంధుజనసేవ్యుఁడు దా నుదయించె నున్నతిన్

అతఁ డని బొట్టు బేతవసుధాధిపుఁ జేకొని వాని పైరి ను
ద్ధృతముగఁ జంపి యక్కొరవిదేశమునందుఁ బ్రతిష్ఠ సేసె త
త్తనయు పేరు పొద్మఁగల దాయను విక్రమ గర్వితుండు స
ప్రతిముఁడు వానిచే మొగడపల్లియుఁ బంద్రడు నేలు నిప్పుడే.

అనుదగు సట్టి యెఱ్ఱనృపు సంగన కామనసాని యుక్క మే
ల్లనుదని బేతభూవిభునిఁ గాకతివల్లభుఁ జిన్నవానిఁ దాఁ
బరఁగగఁ జేతఁబట్టికొని బల్లహురాయని యోగిఁ బొట్ని భా
స్కరవిభుఁ జక్రవర్తిఁ గని కాకతి నిల్పుట కోట సేయదే

కాలకకాలుఁడై వడసెఁ గాడయరాయనిఁ జంపి సూరఁ డ
వ్వేలుపుఁగొండ రవ్వనృపు వెలుపుఁగొండన నిల్పి వానిచే
మేలుగ మూఁడునుప్పయిని మీలుగ నేరెపుటోట పాడునున్
మేలుగఁ బెక్కు భూమిపులు మీలుగ రెండెయరాజు సంగడున్.”

ఇట్లు శాసనములందు తొమ్మిదవ శతాబ్దిని తరువోజ, సీసము; పదవశతాబ్దిని మధ్యాక్కర, కందము; పదునొకండవ శతాబ్దిని చంపకమాల, ఉత్పలమాల పద్యములు కలవు. చంపకమాల, ఉత్పలమాల సంస్కృతచ్ఛందస్సులైనను సంస్కృత కావ్యములందు విరళము శాసనములందు క్వాచిత్కము అట్టిది 848 వ సంవత్సరము నాటి గుణకవిజయాదిత్యుని సాతలూరు శాసనమునందు సంస్కృతచంపకమాల కలదు అందు తెలుగు యతిప్రాసలు కలవు ఆ శ్లోకమిది[25]

“అరినృపవాజివారణపదాతిమహాభ్రవిరామమారుతః
పరకరికారనుస్థితవి(సి?)ఖాప్రవినాశితభూమిసన్నిభః
గురుతరదీనభాగవతమానసమానితకల్పపాదపః
పరకరిగల్లభూమిపభుజాసిరిహాజిషువిప్రసాదితే.”

ఇందు నాలుగు పాదములందును ప్రాసము కలదు మొదటి పాదమునందు నిత్యసమాసయతి కలదు రెండవ పాదమునందు అభేదయతి కలదు. సంస్కృత యతి లేదు తెలుగు యతిమైత్రియే కలదు

రెండవ యుద్ధమల్లుని కుమారుడైన బాదపరాజు ఆరుంబాక శాసనమునందలి శ్లోకమునందు తెలుగు కందపద్యము తీరు తెన్నులు కలవు ఆ శ్లోకమిది.[26]

"ధవళగుణో ధవళయశో
ధవళితదిఙ్మణ్డలో౽వదమితారాతిః
భవభక్తో భవకరుణో
ధ్రువ భవభోగాన్వితో విభాతి సుకీర్తిః"

ఇందు నాలుగు పాదములందును ప్రాసము కలదు రెండు, నాలుగు పాదములందు తెలుగు యతిమైత్రి కలదు నాల్గవ పాదమునందు సంస్కృతయతి స్పష్టము కాదు అంతేకాదు ఇది కందపద్యమే శాసనకాలము పదవశతాబ్దియే

రాజరాజనరేంద్రుని కోరుమిల్లి శాసనములోని శ్లోకసముచ్చయమునందు విలక్షణముగ రగడ లక్షణము కలదు ఆ ఘట్టమిది,[27]

"తస్మై సమస్త జనతావిశేషగుణాయ 1
రై సుతర్పితమహీదేవదేవగణాయ 2
విప్రాన్వయాబ్ధిశశిభృత ప్రతిచ్ఛందాయ 3
విద్వజ్జనాధికృతవిశ్రుతానందాయ 4
జన్మప్రభృతిగీతవేదాన్త తత్త్వాయ 5
సన్మనోవసతివాస్త వ్యాత్మసత్త్వాయ 6
లంభితగురుత్వపరిలాలితచరిత్రాయ 7
సుంభితమతిస్థగితజీవభృగుపుత్రాయ 8
సిద్ధనిజనాథకృతసేవితమనీషాయ 9
పద్ధమతిదూషితసమస్తజనదోషాయ 10
సంతతారాధితనిజస్వామిపాదాయ 11
చింతితమనస్థసుఖదాభూతపాదాయ 12
హోమధూమవినిర్గలామితకలంకాయ 13
ధీమత్ప్రగీతరుచిరస్వనామాంకాయ 14
సకలమునిగణనుతాపస్తంభసూత్రాయ 15
తత్ర సంగీతభారద్వాజగోత్రాయ 16

| | |
|---|---|
| సప్తతంతుకృతయూపస్తంభ శోభాయ | 17 |
| సప్తాశ్వరూప సదృశాత్మతనులాభాయ | 18 |
| నిత్యజనతోచిత సుసత్యగుణయుక్తాయ | 19 |
| సత్యభిలషిత కార్య సంపత్తి సక్తాయ | 20 |
| పరమపురుషార్థ సంపాదన పటిష్ఠాయ | 21 |
| పరమేశ్వరస్మరణపాలన వరిష్ఠాయ | 22 |
| సకలార్థశాస్త్ర పరినిష్ఠిత వినోదాయ | 23 |
| సుకుమారతాధిక సరోజనిభపాదాయ | 24 |

ఇందు ఇరవైనాలుగు పాదములును పండ్రెండు ద్విపదల వలె కలవు కాని ద్విపదలు కావు ద్విరదగతిరగడ పాదములు రెండేసి పాదములకు అంత్యాను ప్రాసము కలదు 1-2, 3-4, 15-16 పాదముల మూడు జంటలందు నినా, తొమ్మిది జంటలందు ప్రాసము కలదు 1,3,4,7,6,9,11,20,21,22, పాదములు పదింటను యతిమైత్రి కలదు 18, 19, పాదములు రెండిటియందు ప్రాసయతి కలదు 18 వ పాదమునందు అఖండయతి కలదు. సగము పైగా యతిమైత్రి కలదు ప్రతిపాదమునందు అయిదేసి మాత్రల గణములు నాలుగేసి కలవు. 940 ప్రాంతమునందలి సోమదేవసూరి యశస్తిలకచంపువునందును రగడ లక్షణము కలదు అది హయ ద్విరదగతి రగడ అందు ప్రాసము లేదు అక్షరాశ్రితమైన అంత్యాను ప్రాసమేగాని, శబ్దాశ్రితమైన అంత్యానుప్రాసము లేదు ఎనిమిది పాద ములకు ఒక పాదమున యతిమైత్రి, రెండు పాదములందు ప్రాసయతి కలదు అంతకంటె సలక్షణమైనది కోరుమిల్లి శాసనములోని రగడ శాసనకాలము 1022వ సంవత్సరము.

ఇవి తొమ్మిదవ శతాబ్దిని చంపక మాలారచనము, పదవ శతాబ్ది పూర్వార్ధము నందు కందపద్యరచనము, పదునొకండవ శతాబ్ది పూర్వార్ధమునందు రగడరచనము తెలుగునందు కలవనుటకు పరోక్షనిదర్శనములు.

తొమ్మిదవ శతాబ్ది ఉత్తరార్ధము మొదలు, పదకొండవ శతాబ్ది పూర్వార్ధము వరకు శాసనములందు సాక్షాత్కరించిన తరువోజ, సీసము, ఆటవెలది, మధ్యాక్కర, కందము, చంపకమాల, ఉత్పలమాల, రగడ ప్రౌఢన్నయయుగములోని ఛందస్సులు తరువోజ, సీసము, ఆటవెలది, మధ్యాక్కర, కందము, రగడ దేశియ చ్ఛందస్సులు. చంపకమాల, ఉత్పలమాల సంస్కృతచ్ఛందస్సులు.

# పద కవిత్వము

ప్రతి వాఙ్మయమునకు ప్రాథమికదశ గేయరూపము ఇది నిరపవాదసిద్ధాంతము అంతేకాదు ఆ గేయరూపము హ్రస్వతరము కారణము కళాావిర్భావము ప్రాక్తన మానవుని కాలమునందే జరుగును ప్రకృతిసౌందర్యపరవశుడగు ప్రాక్తన మానవుడు వేసిన చిందులు వేఱు దన్ని నాట్యమగును తీసిన రాగములు తీగ సాగి గానమగును. గీసిన రేఖలు శాఖ లూని చిత్రలేఖనమగును. చేసిన ఆకృతులు ప్రాను కట్టి శిల్పమగును నాట్యమునకు గానమునకు పలుకు తోడై పల్లవించి పదకవిత్వమగును పదకవిత్వమే పరిణామదశలో పుష్పఫలభరితమైన పద్యకవిత్వమగును. ప్రపంచము మొత్తముమీద ప్రథమగ్రంథమని సర్వసమ్మతమైన ఋగ్వేదములోని ఋక్కులు హ్రస్వతరమైన గేయరూపములు ఋక్కులను గానము సేయు విధానమును తెలుపునది సామవేదము [28] గ్రీకువిషాదరూపకమునకు మూలకారణమైన డిథిరామ్బ్సు హ్రస్వతరమైన గేయములు.[29] సంస్కృత— ఆదికావ్యమునకు అది కారణమైన అనుష్టుప్పు హ్రస్వతరమైన గేయము "మానిషాద" శ్లోకము తంత్రీలయ సమన్వితమని, అది వెలువడిన అనంతరము వాల్మీకి అంతర్మథనమునందు కలదు. వాల్మీకి రామాయణము "గేయే పాఠ్యే చ మధురమ్" అని అందే కలదు అంతే కాదు. అది మునుల సన్నిధిని, శ్రీరాముని సన్నిధిని కుశలవులు గానముచేసిరని కూడ అందు కలదు తమిళసంఘసారస్వతములోని కురళ్ హ్రస్వతరమైన గేయ రూపము [30] కన్నడవాఙ్మయములోని ద్విపది, త్రిపది కూడ హ్రస్వతరమైన గేయ రూపములు [31] అట్లుహ్రస్వతరమైన గేయరూపమే ఆంధ్రసాహిత్యమునందును తొలిదశ అగును అది పదకవిత్వము

తొమ్మిదవ శతాబ్ది తోరణస్తంభసదృశమైన తరువోజ హ్రస్వతరమైన గేయ రూపము కాదు. దీర్ఘతరమైన గేయరూపము. అందుహ్రస్వతరమైన గేయరూపము అంతర్గర్భితమై యున్నది తరువోజపాదమునకు మూడింద్రగణములపై ఒక సూర్యగణము, మఱల మూడింద్రగణలపై ఒక సూర్యగణము లక్షణము మూడింద్రగణములపై ఒక సూర్యగణము ద్విపదపాదలక్షణము. ద్విపదపాదము ద్విగుణితమైనది తరువోజపాదము మొదటి ద్విపదపాదము ఒక దళము. తర్వాతి ద్విపదపాదము మఱొక దళము రెండు దళములందును యతిమైత్రి కలదు.

రెండుపదములందును యతిమైత్రి కలదు పాదమునకు మూడు యతిమైత్రులు. మూడు యతిమైత్రులు, నాలుగు పాదములకును ప్రాసము కలసివచ్చు నాలుగు ద్విపదలు ఒకటైన, తరువోజనాలుగు పాదముల నడచివచ్చును ఇది పరిణామ ధర్మము తరువోజ పాదము నడుమ విరిగి ద్విపదకాదు అది పరిణామ విరుద్ధము. నాలుగు ద్విపదలు నాణెముగ కుదిరి తరువోజపద్యములగు సందర్భములు ద్విపద కావ్యములందు బహుళము కావున ద్విపద తరువోజ కంటె పూర్వకాలికము కావలయును అది గేయరూపము

"తలకొని తలఁబ్రాలు దంపెడి చోటఁ
దరుణులచే సొంపు దనరుఁ దరోజ" 51ప 8డి

అని విన్నకోట పెద్దన కావ్యాలంకారచూడామణియందు కలదు కాలము 1150 ప్రాంతము అంతకు బహుపూర్వమే తరువోజ పద్యమైనది. తరుణులు దంపెడు చోట సొంపు తనరునది పద్యము కాదు పాట అది ద్విపద అగును. నాలుగు ద్విపదల పాట తరువోజ అనిపించును చంపుళ్ల పాటలు ద్వి పదచ్ఛందస్సులో కలవు

తరువోజకు సహోదరమైనది మధ్యాక్కర అది కన్నడమునందు కలదు. సమవణక్కర మధ్యాక్కర పాదమునకు రెం డింద్రగణములపై ఒక సూర్య గణము, మరల రెం డింద్రగణములపై ఒక సూర్యగణము లక్షణము. అదొక దళము ఇదొక దళము. తరువోజదళము వలె మధ్యాక్కరదళమును పదము కావచ్చును.

"పదములఁ దుమ్మెదపదముల్ ప్రభాత
పదములఁ బర్వతపదము లానంద
పదములు శంకరపదముల్ నివాళి
పదములు వాలిక పదములు గొబ్బి
పదములు వెన్నెల పదములు సంజ
వర్ణన మఱి గణవర్ణనపదము
లట్టప ఘోషణ ఘూర్ణిలు చుండఁ
బాడుచు నాడుచుఁ బరమహర్షమునఁ
గూడి సద్భక్త సంకుల మేఁగుదేర" ప్ర సం.పుట 513.

అని పాలకుఱికి సోమనాథుని పండితారాధ్యచరితములోని వాదప్రకరణము నందు కలదు మల్లికార్జున పండితుడు వెలనాటిచోడుని బౌద్ధగురువుతో వాదించుటకు బయలుదేరినపుడు అనుసరించిన శివభక్తులు పాడిన పదము లివి

"ఆనందగీతంబు లగ్గించువారు
పూని శంకరగీతములు పాడువారు" 1063-64 పం 1 ఆ

అని పాలకుఱికి సోమనాథుని బసవపురాణమునందును కలవు అంతేకాదు ఆ కాలమునందు ఆంధ్రదేశము పరుస "ఆడుచుఁబాడుచు" నడచినట్లును పండితారాధ్య చరిత్రలోని పర్వత ప్రకరణమునందును కలదు (ద్వి. సం పుట 376) శ్రీ శైల మల్లికార్జునస్వామి "గేయచరిత్రుఁ"డని వాదప్రకరణమునందు కలదు. (ప్ర సం. పుట 653.) గీతచరిత్రుడని పాఠాంతరము కలదు పదము, గేయము, గీతము పర్యాయపదములు మల్లికార్జునస్వామి గేయచరిత్ర శ్రీశైలక్షేత్రము ప్రసిద్ధమైనప్పటి నుండి ప్రాప్తించును శ్రీశైలక్షేత్రము వసుబంధుని వాసవదత్త కావ్యమునందు, శ్రీహర్షుని రత్నావళీ నాటకమునందు, భవభూతి మాలతీమాధవమునందు మహి మాన్వితముగ కలదు భవభూతి కాలము ఎనిమిదవ శతాబ్ది [32] శ్రీహర్షుని కాలము ఆరవ శతాద్ది [33] వసుబంధుని కాలము అయిదవ శతాబ్ది [34] అప్పటినుండి తుమ్మెద పదములు, ప్రభాత పదములు, పర్వత పదములు, శంకర పదములు, వాలేసు పదములు, నివాళి పదములు మొదలైనవి ఆంధ్రదేశమునందు అర్ఘపఘోష లగును అవి నిస్సందేహముగ తెలుగు పదములే పాటలే.

"—రోకటిపాట లట్ల వేదములు" 213 పం. 7 ఆ

అని బసవపురాణమునందు కలదు. రోకటితో వడ్లు దంచునపుడు స్త్రీలు పాడునవి రోకటి పాటలు. దంపుళ్ళ పాటలే రోకలి తోపాటే పుట్టునవి రోకటి పాటలు

నన్నయ భారతమునందును పాటలు, గీతములు కలవు

"పొలుపుగఁ జూసి కట్టితొడి భూరివిభూతి ప్రకాశితంబుగాఁ
గలయఁగఁ దప్పుదీఁటులు కాంస్యమృదంగ ముకుందవేణుతా
ళశపటహధ్వనుల్ చెలఁగ నాటుచుఁ బాటలు నొప్ప నెల్లవా
రలుఁ జని చేసి రప్పనలు లైపెతృ్రదిని నుత్సవంబుతొనె. 174 ప.
గురుకుచయుగ్మముల్ గదలఁ గ్రొమ్ముడులందుల పుష్పముల్ పయిం
దొరఁగ నిదాఘబిందునితతుల్ చెదరన్ పదిరామదంబునం

బసిపిలయ్యె నింపెసఁగఁ బాడుచుఁ దాళము గూడ మెట్టుచుం
దపుఁడియ లొప్పనాడెరి ముదంబునఁ దఃష్కు జనాలి మెచ్చఁగన్."

175 ప 8 అ ఆ. ప.

ఇందు ద్వారకానగరములోని స్త్రీ పురుషులు ఎల్లవారలును పాటలు పాడుచు రైవతకాద్రికి అర్చనలు సేయుట అమూలకము నర్తకులు నృత్యము చేసిరని, గాయకులు గానముచేసిరని (ననృతు ర్న ర్తకా శ్చైవ జగు ర్గేయాని గాయనాః-4 శ్లో 211 అ ఆ ప) సంస్కృతభారతమునందు కలదు నన్నయ స్వతంత్ర కల్పనమునందు రాజమహేంద్రవరములోని స్త్రీ పురుషులు ఎల్లవారలును పాటలు పాడుచు కపులాద్రికి అర్చనలు సేయుట కన్నులకు కట్టును అది సమకాలిక సమాచారమైనను అనుశ్రుతాచారము

అర్జునుని నాగలోకములోని నాగపురమునకు తీసికొనిపోయిన ఉలూపి(చి)

"నీ గుణములు దొల్లియ నా
గీగీతములందు విని తగిలి యిపుడు మనో
రాగమునఁ జూడఁగంటిని
భాగీరథియందు నిన్నుఁ బరహితచరితా" 131 ప 8 ఆ. ఆ ప.

అని చెప్పినట్లు నన్నయ భారతమునందు కలదు ఇట్లు సంస్కృత భారతము నందు లేదు నాగిగీతములన నాగస్త్రీల పాటలు. నాగలోకములోని నాగపురము నందలి నాగస్త్రీల పాటలు నన్నయ విన్నవి కావు నన్నయ విన్న ఆంధ్రదేశము లోని రాజమహేంద్రపురము నందలి ఆంధ్రస్త్రీల పాటలు నాగస్త్రీల పాటలగును. ఆంధ్రస్త్రీల పాటలు పరంపరాగతము లగును.

అర్జునుడు అమరావతికి వెళ్ళినపుడు గంధర్వులు, అప్సరసలు స్తోత్రము చేసిరని సంస్కృత భారతమునందు కలదు (సంస్తూయమానో గన్ధర్వై రప్స రోభిః-) నన్నయ భారతమునందు "అప్సరోగీయమాన మంగళహిత గీతావహిత మానసుం డగుచు' అని కలదు (152 వచ. 1 అ ఆర ప) ఇది "మంగళగీత మహిత మానసుండగుచు," మంగళగీత మానిర మానసుండగుచు, మంగళగీత సంవా హిత మానసుండగుచు అనుపాఠాంతరములు కలవు. అన్ని పాఠములందును మంగళగీతములు కలవు సంస్కృతభారతమునందు లేని మంగళగీతములు తెలుగు మంగళగీతములే అగును అవి స్త్రీల పాటలే. అటు నాగలోకమునకు, ఇటు నాకలోకమునకు తెలుగు స్త్రీల పాటలు నన్నయ కవితా వరప్రసాదములే.

సంస్కృతభారతమునకు సంబంధము లేని కేవలము నన్నయ స్వీయ కవితా విశేషమైన వర్షర్తువర్ణనములోని పద్యమిది.

"దళితసపీన కందళ కదంబ కదంబక కేతకీరజో
మిళిత సుగంధ బంధుర సమీరణుఁడన్ సఖుఁ డూఁచు చుండఁగా
నలియుచు మొల్లగుత్తులను నుయ్యేల లొప్పఁగ నెక్కి యూఁగె న
ల్లలదళినీకులంబు మృదుధ్వనిగీతము విస్తరించుచున్"

138 ప 4 ఆ అర ప.

ఇందు కడిమిపూగుత్తుల, మొగలిరేకుల పుప్పొడి కలసి పరిమళము విరజిమ్ము గాలి అనెడు సఖుడు ఊపగా, నసరొద అనెడు పాట పాడుచు ఆడతుమ్మెదల పిండు మొల్లగుత్తులనెడు ఉయ్యేల లెక్కి ఊగెనని కలదు రూపకమునందు ఉయ్యేల తోపాటు పాట కలదు సఖుడు కలడు సఖులు కలరు. ఉద్యానవనములోని ఉయ్యేల పాట బృందగీతము శృంగారగీతము ఇది నన్నయనాటికి ప్రసిద్ధమైన, శృంగార గీతమైన ఉయ్యేల పాట.

పండుగపాటలు, స్త్రీల పాటలు, మంగళగీతములు, శృంగారగీతములు, ఉయ్యేల పాటలు పదములే.

ఇవియెల్ల ప్రాఙ్నన్నయయుగములోని పదకవిత్వమునకు చిహ్నపతాకలు.

పద కవిత్వము ద్వివిధము. ఒకటి దేశీయము. మఱొకటి శాస్త్రీయము దేశీయమైన పదకవిత్వమును దేశిపదకవిత్వమని, శాస్త్రీయమైన పదకవిత్వమును మార్గపదకవిత్వమని వ్యవహరింప వచ్చును

"మార్గదేశివిభాగేన సంగీతం ద్వివిధం మతమ్
ద్రుహిణేన యదుద్దిష్టం యదుక్తం భరతేన చ
తన్మార్గోహి యయా రీత్యా యత్రా ల్లోకానురంజనమ్
దేశ దేశేను సంగీతమ్ తద్దేశీ త్యభిధీయతే"

అని సంగీత దర్పణమునందు కలదు. బ్రహ్మ ఉద్దేశించినది, భరతుడు నిర్దేశించినది మార్గసంగీతము ఆ యా రీతుల ప్రతిదేశమునందు లోకానురంజక మైనది దేశి సంగీతము. సంగీతమన కేవలము గానము కాదు గానము, వాద్యము, నృత్యము మూడును కలసి సంగీతము సముపసర్గము సార్థకము

"గీతం వాద్యం తథా నృత్యం త్రయం సంగీత ముచ్యతే."

అని సంగీత రత్నాకరమునందు కలదు గీతవాద నృత్యములు మూడును పదకవిత్వమునకు ప్రాణ భూతములు ప్రాఙ్నన్నయయుగములోని పదకవిత్వము దేశిపద కావ్యమే.

## పద్య కావ్యములు

నన్నయకు పూర్వము పదరచనము కలదు కావ్యరచనము రాసరాదు కాని, నన్నయకు పూర్వము నన్నెచోడని కుమారసంభవము కలదు, బౌద్ధజైనకావ్యములు కలవు, జినేంద్రపురాణము కలదు ఆదిపురాణము కలదు ఛందోగ్రంథములు కలవు కవిజనాశ్రయము కలదు అను వాదోపవాదములు కలవు.

నన్నెచోడుని కుమారసంభవము

నన్నయకు పూర్వము కలదన్న నన్నెచోడుని కుమారసంభవము నన్నయ నాటిదని, నన్నయతిక్కనల నడిమికాలము నాటిదని, తిక్కన తర్వాతిదని, నాచనసోమనాథుని తర్వాతిదని నానావాదములు వెలసినవి కుమారసంభవము ప్రతి కూటసృష్టి[35]

## బౌద్ధజైనకావ్యములు

జినుడు బోధించినది జైనమతము బుద్ధుడు బోధించినది బౌద్ధమతము. రెండును క్రీస్తు పూర్వము ఆరవ శతాబ్దిని ఆరంభమైనవి. అశోకుని ప్రబోధమున ఆంధ్రదేశమునందు బౌద్ధమతము క్రీస్తుపూర్వము మూడవ శతాబ్దినుండి అభివ్యాప్తమైనది అనంతరము జైనమతము జైత్రయాత్ర చేసినది. బౌద్ధమతము వ్యాపించిన కాలమునందు తెలుగు బౌద్ధకావ్యములు, జైనమతము వ్యాపించిన కాలమునందు తెలుగు జైనకావ్యములు వెలువడి యుండునవి ఊహించుటకు అవకాశము కలదు శంకరాచార్యుల వలన బౌద్ధవాఙ్మయ నాశనము జరిగినదని [36] కుమారిలభట్టువలన జైనవాఙ్మయనాశనము జరిగినదని[37] అభిప్రాయములు కలవు. అంతేకాదు ఆంధ్రదేశమునకు దగ్ధరాష్ట్రమను పేరు కలదని, ఆంధ్రబౌద్ధజైన కావ్యములను దగ్ధము సేయుటవలన ఆ పేరు సిద్ధించినదను అభిప్రాయము కలదు.[38]

కుమారిలభట్టు వాదకుఠారములదు జైనమతశాఖలు విఱిగిన మాట వాస్తవము. శంకరాచార్యుల శాస్త్రశస్త్రములకు బౌద్ధమతలతలు యథాయథలైన మాట కూడ యథార్థము అంత మాత్రమున బౌద్ధజైనవాఙ్మయనాశనము జరిగినదనుట నిజము

కాదు. బౌద్ధమతము క్రీస్తుపూర్వము మూడవ శతాబ్దినుండి క్రీస్తుతర్వాత మూడవ శతాబ్దివఱకు భారతదేశమంతట వైభవము చెందినది. ప్రాకృతభాష ప్రాభవము నందినది. అది మౌర్యులు, శుంగులు, కాణ్వులు, శాతవాహనులు పరిపాలించిన కాలము. మౌర్యులు బౌద్ధమతవ్యాపకులు శుంగులు, కాణ్వులు, శాతవాహనులు బ్రాహ్మణమతస్థాపకులు శుంగకాణ్వులకు లేని బౌద్ధమతసహనము శాతవాహనులకు కలదు శాతవాహనుల రాజ్యకాలము క్రీస్తుపూర్వము ప్రథమశతాబ్ది తుదినుండి క్రీస్తుశకము మూడవ శతాబ్దితుదివఱకు మాత్రమే [39] (క్రీ. పూ 31—క్రీ శ 252) శాతవాహనులు ఆంధ్రులైనను రాజభాష ప్రాకృతము కారణము శాతవాహనులు ఆంధ్రదేశమును మాత్రమే పరిపాలింపలేదు మగధసామ్రాజ్యమును కాక పోయినను, దక్షిణాపథమును పరిపాలించిరి అందు ఆంధ్ర కర్ణాట విదర్భ మహారాష్ట్రదేశములు కలవు ఆ కాలము నందు బౌద్ధమత గ్రంథములు ఆంధ్రదేశమునందును ప్రాకృతభాషలోనే వెలువడినవి. మహాయానసూత్రము, కాలచక్రము ఆంధ్రదేశమునందు వెలువడిన బౌద్ధమతగ్రంథములు.[40] అంధాట్టకథ ఆంధ్రదేశగ్రంథమని కొందఱి అభిప్రాయము[42] అది వినయపిటకమునకు ఆంధ్రచైతిక సంప్రదాయానుసారమైన వ్యాఖ్యానము [42] ఆంధ్రదేశగ్రంథమే అగును. పిటకకథలే పిట్టకథలు. ఆంధ్రదేశమునందు వెలువడిన బౌద్ధమతగ్రంథములు పాళీప్రాకృతమునందు కలవు హాలసంకలితమైన గాథాసప్తశతి మహారాష్ట్రీ ప్రాకృతము నందు కలదు గుణాఢ్యుని బృహత్కథ పైశాచీప్రాకృతమునందు కలదు. ఆ కాలమునందు తమిళమునందు, కన్నడమునందును బౌద్ధకావ్యములు లేవు తమిళసంఘసారస్వతము పదకవితాప్రాయము తెలుగు బౌద్ధ కావ్యములు వెలువడుటకు అవకాశము లేదు శంకరాచార్యుల శాస్త్రశస్త్రములకు ఆంధ్రదేశ ప్రాకృత బౌద్ధమతగ్రంథములు నాశనము కాలేదు తెలుగు బౌద్ధకావ్యములు నాశనమయ్యెననుట సమ్మదగిన విషయము కాదు

అశోకుని పితామహుడైన మౌర్యచంద్రగుప్తుని కాలమునందే —అనగా క్రీస్తుపూర్వము నాల్గవ శతాబ్దినే జైనమతము దక్షిణాపథమునకు వలస వచ్చినట్లు జైనగ్రంథములందు కలదు [43] మౌర్యచంద్రగుప్తుడు మగధసామ్రాజ్యసింహాసనమును త్యజించి, జైనగురువు భద్రబాహునితోను, జైన సంఘములతోను కన్నడదేశములోని శ్రావణబెళగొళకు వలస వచ్చి శేషజీవితమును గడిపినట్లును జైనగాథ కలదు [44] ఆ గాథలోని అంశములు ఐదవ శతాబ్ది శ్రావణబెళగొళ శాసనమునందు

కలవు [45] ఆరవ శతాబ్ది శ్రావణబెళగొళ శాసనమునందు భద్రబాహుగురు, చంద్రగుప్తముని యగ్మ ప్రసక్తి, జైనధర్మానసరణ విషయము కలదు [46] అయినను తమిళజైన కావ్యములు కాని, కన్నడజైన కావ్యములు రాని వెలువడలేదు తెలుగు జైనకావ్యములను వెలువడుటకు అవకాశములేదు. ఇది క్రీస్తు పూర్వము మూడవ శతాబ్ది సంది క్రీస్తుశకము మూడవశతాబ్దివఱకు మాత్రమేగాక, అయిదవ శతాబ్దివఱకు దక్షిణాపథస్థితి

ఆఱేదు శతాబ్దులందు పడుమనార్ సంకలనము చేసిన నాలడి, అస్వకవికృతమైన పళమొళి, ఏడెనిమిదిశతాబ్దులందు ఏలాది, శిలుపంచగమ్ అను తమిళజైన కావ్యములు వెలువడినవి [47] ఎనిమిదవ శతాబ్దని శీత్తలైశాత్తనార్ రచించిన మణిమేకలై, ఇళంగో రచించిన శిలప్పదిగారమ్ అను తమిళ బౌద్ధమహాకావ్యములు, తొమ్మిదవ శతాబ్దిని తిరుత్తక్కదేవర్ రచించిన ముడిమొదల్ లొడల్ చిన్తామణి (జీవక చరిత్రము, అను జైనకావ్యము వెలువడినవి.[48] తొమ్మిదవ శతాబ్ది అమోఘవర్షనృపతుంగుని కవిరాజమార్గమునకు సమకాలమునందు, పూర్వకాలమునందు కన్నడజైన కావ్యములు ఉండవచ్చును [49] తర్వాత కలవు. శివకోట్యాచార్యుని వడ్డారాధనము గద్యకావ్యము,పంపని ఆదిపురాణము పద్యగద్యకావ్యము పదవశతాబ్ది కన్నడజైనకావ్యములు.[50] అవి కుమారిలభట్టు వాదకుఠారములకు గాని, శంకరాచార్యుల శాస్త్రశస్త్రములకుగాని నాశనము రాలేదు. తెలుగు జైనకావ్యములు నాశనమయ్యెననుట రూడ సమ్మదగిన విషయము కాదు.

ఆంధ్రదేశమును శాతవాహనుల అనంతరము పరిపాలించిన ఇక్ష్వాకులు బృహత్ఫలాయనులు, ఆనందగోత్రజులు, శాలంకాయనులు, విష్ణుకుండులు, పల్లవులు, రేనాటి చోళులు, తూర్పుచాళుక్యులు బ్రాహ్మణమతస్థులు బృహత్ఫలాయనులు శివభక్తులు శాలంకాయనులు శివభక్తులు, విష్ణుభక్తులును. రేనాటి చోళులు బౌద్ధమత గౌరవము కలవారు. తూర్పు చాళుక్యులు బౌద్ధజైనమతసహనముకలవారు. ఆంధ్రదేశమును పరిపాలించిన రాజులందఱును ప్రాధాన్యవిషయము బ్రాహ్మణమతస్థులే అయినను ఆ కాలమునందు బ్రాహ్మణ కావ్యములు బౌద్ధజైనకావ్యములు అవతరించి యుండుననుట అసంగతము. తెలుగు బౌద్ధజైనకావ్యములను బ్రాహ్మణమతస్థులు నాశనము చేసిరనుట, తెలుగు బ్రాహ్మణకావ్యములను బౌద్ధజైనమతస్థులు నాశనము చేసిరనుట విపరీతము తమిళకన్నడ ప్రాకృతబౌద్ధజైనకావ్యములు మతప్రాతిపదికను నాశనము కానపుడు తెలుగు బౌద్ధజైనకావ్యములు మాత్రమే మతప్రాతిపదికను నాశనమగుట అసంభవము.

ఆంధ్రదేశమునకు దగ్ధరాష్ట్రమను పేరు కలదనుటకు ఆధారము మృగ్యము. వేంగి దేశమునకుమాత్రమే దగ్ధరాష్ట్రమను పేరు వచ్చుటకు అవకాశము కలదు. అది కూడ నన్నయ అనంతరము చక్రకోటరాజు సోమేశ్వరుని కురుస్పాల్ శాసనమునందు "స వెంగిదేశఖాండవం వ్యదీపయ త్కిరీటవత్" అని కలదు[52] ఇది ప్రథమతః శత్రురాజు శాసనము తదుపరి వేంగిదేశము ఖాండవవనము కాదు. సోమేశ్వరుడు కిరీటి కాడు. ముందు వీరచోడ నిచే ఓడిపోయినవాడు. సాదృశ్యము నందు స్వాతిశయము కలదు. వీరచోడని రాజధాని పిఠాపురమును తత్పరిసర ప్రాంతమును మాత్రమే సోమేశ్వరుడు దగ్ధము చేసియుండును. అంతమాత్రమున ఆంధ్రదేశములోని బౌద్ధజైనకావ్యములెల్ల అస్యజీవులుకావు బ్రాహ్మణ కావ్యములెల్ల మందపాల సంతానము కావు బౌద్ధజైనకావ్యములు దగ్ధమగుటవలన ఆంధ్రరాష్ట్రమునకు దగ్ధరాష్ట్రమని పేరు వచ్చినదనుట వివదగ్వాదము కాదు వితండవాదము 1060 తర్వాత వేంగిదేశము దగ్ధమైనను, వెంగిదేశమునందే వెలసిన 1060 నాటి నన్నయ భారతము నవనవోన్మేషసహమే.

తూర్పుచాళుక్యులు జైనుల తోపాటు జైనవాఙ్మయమును నశింపజేసిరని[53] చోళులు జైనాలయములను నశింపజేసిరని, వైదికగ్రీష్మాతపమునకు బౌద్ధజైన కావ్యసస్యములు వాడిపోయినవని[54] మతొక అభిప్రాయము కలదు

తూర్పుచాళుక్యులు జైనమతమును ఆదరించిన వారు పరమ భాగవతుడైన కుబ్జవిష్ణువర్ధనుని (624–641) పట్టమహిషి అయ్యణదేవి బెజవాడలో "నడుంబి వసతి" అను జైనమందిరమును కట్టించి, ముసినికుండ అను గ్రామమును దాన మిచ్చెను అది కాలక్రమమున అన్యాక్రాంతము కాగా, మూడవ విష్ణువర్ధనుడు (719–755) మరల ఆ గ్రామమును ఆ వసతికి దానమిచ్చెను. రెండవ అమ్మ రాజవిజయాదిత్యుడు (945–970) జినాలయజీర్ణోద్ధారపూజాపురస్కారాదికము నకు కమ్మనాటిలోని పల్లియపూండి –ఇప్పటి మల్లిపూడి– దానమిచ్చెను అతడు బ్రాహ్మణ మతావలంబి అయినను, అతని సామంతులు జైనమతావలంబులు. వారిలో భీమ, నరవాహనులను సోదరులు అమ్మరాజవిజయాదిత్యుని పేర జినభవనములను కట్టించుట యేగాక, మహారాజుచేత పెదగాడిపట్టు దానమిప్పించిరి. రెండవ అమ్మరాజవిజయాదిత్యుని భోగిని చామెకాంబ, తన గురువైన సర్వలోకాశ్రయజినభవనాధిపతి అర్హనందిమునికి అత్తిలివిషయములోని కలుచుంబఱ్ఱు– ఇప్పటి కంచుమఱ్ఱు– దానమిప్పించెను. విమలాదిత్యుడు(1011–1018) అవసానదశను జైనమతమును అవలంబించి

నట్లు ఒక అభిప్రాయము కలదు. ఇట్టి తూర్పుచాళుక్యులు[55] జైనుల తోపాటు జైన వాఙ్మయమును నశింపజేసిరనుట నిజము కాదు.

చోళులన రేనాటి చోళులు, చాళుక్యచోళులు, వెలనాటి చోళులు, నెల్లూరు చోళులు మొదలైన తెలుగు చోళులు. ఆరేడెనిమిది శతాబ్దుల రేనాటి చోళులు బౌద్ధ మతమును ఆదరించినట్లు పూర్వోదాహృతమైన ఎఱ్ఱగుడిపాడు శాసనమునందే కలదు. వారు జైనాలయములను నశింపజేసిరనుటకు ఆధారము లేదు. పదకొండు, పండ్రెండవ శతాబ్దుల చాళుక్యచోళులు జైనమతమును ఆదరించినట్లు ఆధారములు కలవు.[56] పండ్రెడవ శతాబ్ది వెలనాటి చోళులును బౌద్ధమతము తోపాటు జైనమతమును ఆదరించినట్లు ఆధారములు కలవు.[57] పదమూడవ శతాబ్ది నెల్లూరు చోళులు, ఇంకను పొత్తపి చోళులు, కొణిదెన చోళులు మొదలైన చోళులు జైనాలయములను నశింపజేసిరనుటకు ఆధారములు లేవు. ఇట్టి చోళులు జైనాలయములను నశింపజేసిరనుట కూడ యథార్థము కాదు.

నాగపట్టణములోని జైనాలయమునకు కవాటోద్ఘాటనము కావించి, సుదీర్ఘమైన సువర్ణజైన (బౌద్ధ ?) విగ్రహమును శ్రీరంగమునకు తెప్పించి, కరగించి, శ్రీరంగనాథ మందిర నిర్మాణమును పరకాలయోగి పచరించినట్లు తాళ్ళపాక చిన్నన్న పరమయోగివిలాసమునందు కలదు (10261-10650 పం 7 ఆ). అది కూడ చోళుల వలన జరుగలేదు. చోళుల వలన జరిగినది. ఆంధ్రదేశమునందు కాదు. తమిళదేశమునందు. అయినను తమిళ బౌద్ధ జైన కావ్యములు నాశనము కాలేదు. బౌద్ధారామములను, జినభవనములను ఎవరు కొల్లగొట్టినను, కూలగొట్టినను తెలుగు బౌద్ధజైన కావ్యములు నాశనము కావు.

బౌద్ధజైన మతములు చెదరి, చెలగిన వైదిక గ్రీష్మాతపమునకు తెలుగు బౌద్ధజైన కావ్యసస్యములు వాడిపోవుట కూడ వాస్తవము కాదు. వైదికగ్రీష్మాతపము తెలుగుదేశమునందే కలిగియలేదు. యావద్భారతదేశమునందును విలసినది. వైదిక మతమునకు పట్టుగొమ్మ సంస్కృతము. సంస్కృతభాషలోని బౌద్ధజైన కావ్యములు వాడిపోలేదు సరికదా పాడిపంటలు సమృద్ధిగా ప్రసాదించినవి. కాబట్టి వైదికగ్రీష్మాతపమునకు తెలుగు బౌద్ధజైన కావ్యములు ఊచముట్టుగ వాడిపోవలసిన ఆవశ్యకము లేదు. మతోద్రేకముల వలన కొన్ని మతగ్రంథములు వాడిపోవచ్చును. అన్ని కావ్యగ్రంథములు వాడిపోవు.

# జినేంద్ర పురాణము

పెదపాటి జగన్నాధకవి ప్రబంధరత్నాకరమునందు పద్మకవి జినేంద్ర పురాణము నుండి ఒక సీసపద్యము కలదు అది ప్రాచీనతర రచనము కాదని ఒక అభిప్రాయము కలదు [58] ప్రాఙ్నన్నయయుగ కావ్యమని మరొక అభిప్రాయము కలదు [59] ప్రాఙ్నన్నయయుగ కావ్యమనుటకు ప్రదర్శించిన ఉపపత్తులివి .

1. కన్నడకవి పంపకవియే పద్మకవి అని "నాడోజపంప" అను గ్రంథము నందు పండిత నిరూపణము
2 పంపకవి ఆంధ్రదేశస్థమగు వేంగీపుర (వేంగిపట్టు) వాస్తవ్యుడగుటవలన తెలుగు కావ్యము రచించుట సంభావ్యము
3. పంపకవి లౌకిక సాహిత్యమునకు సంబంధించిన భారతమే కాక, జినాగమమునకు సంబంధించిన అది పురాణము కూడ రచించుట.
4 ప్రాచీనతకు సందేహము కలిగించు శ్లేష చేరు చిత్రకవిత నన్నెచోడకవి ఉపయోగించుట, నృపతుంగుడు కవి రాజమార్గమున అట్టి రచనలు పేర్కొనుట వలన బాధకము కాదు.

కన్నడ భాషలోని చిత్రకవిత్వ నిర్దేశములనబట్టి మాత్రమేగాక, సంస్కృత భాషలోని చిత్రకవిత్వ నిర్ధారములను బట్టి సహితము, నన్నయకు పూర్వము తెలుగు కావ్యము కలదని, అందు శ్లేష చేరు చిత్ర కవిత్వముండుట అసంభవము కాదు అంతమాత్రమున చిత్రకవిత్వము కల పద్మకవి జినేంద్రపురాణము ప్రాఙ్నన్నయయుగ కావ్యము కాజాలదు. తర్వాతను చిత్రకవిత్వము కలదు. సందేహనివృత్తికి సమర్థము

పంపకవి వైదికమతమునకు సంబంధించిన భారతమునేగాక, జైనమతమునకు సంబంధించిన ఆదిపురాణమును రచించిన మాట నిజము అది రెండు భిన్న మతములకు సంబంధించిన కావ్యములను ఒక కవి రచింప వచ్చుననుటకు మాత్రమే ఉపబలకము పంపకవి తెలుగు కావ్యము రచించెననుటకు ఉపబలకము కాదు

పంపకవి ఆంధ్రుడు, ఆంధ్రదేశములోని వేంగిపట్టునివాసి. వేములవాడ ఉద్యోగి కన్నడ భారతము వెములవాడలోనే రచించెను తెలుగు కావ్యమును

రచించుట సంభావ్యమే కాని రచించినట్లు ప్రమాణములేదు అంతేకాదు. తెలుగు కందపద్యములు వ్రాసిన పంపకవి సోదరుడు జినవల్లభుడు తెలుగు కావ్యము రచించినట్లును ప్రమాణము లేదు తెలుగు కవులు పాలకుఱికి సోమనాథుడు, చక్రపాణి రంగనాథుడు కన్నడకృతులు రచించినట్లు ప్రమాణములు కలవు

నాడోజపంప అను గ్రంథమునందు పంపనామము, "పద్మప్రభ"- అను ఆరవ జైన తీర్థంకరుని పేరునకు తద్భవరూపమని నిరూపించినను, అది పండిత వ్యుత్పత్తి కాని శాస్త్రీయ వ్యుత్పత్తి కాదు "పద్మప్రభ" అను శబ్దసంపుటి నుండి "పద్మప్ప" అను శబ్దము నిష్పన్నమగుట దుర్ఘటము. అది పమ్మప్ప అయి పంప అగుట దుశ్శకము "ప్రభ" అను శబ్దమునుండి "ప్ప" అను ద్విత్వవర్ణము నిష్పన్నము కాదు ప్రభ పెబ అగును పద్మప్ప అను పేరులోనిది "ప్ప" అను వర్ణము కాదు "అప్ప" అను శబ్దము అది పద్దప్ప అగును గాని పమ్మప్ప కాదు. పమ్మప్ప శబ్దమునుండి పంపశబ్దము నిష్పన్నమైనచో, తిమ్మప్ప శబ్దము నుండి తింప, తమ్మప్ప శబ్దమునుండి తంప, కొమ్మప్ప శబ్దమునుండి కొంప అను శబ్దములు నిష్పన్నములు కావలయును కాలేదు సంస్కృత జైననామమగు "పద్మ" నామమే కన్నడమున "పమ్మ" అయి, తెనుగున "పెమ్మ" అయినదనుట కూడ అశాస్త్రీయము అంతేకాదు పంపకవి విక్రమార్జున విజయము (భారతము) నందుగాని, ఆదిపురాణము నందుగాని పద్మకవి అని లేదు కన్నడ గ్రంథము లందు ఒక పేరు, తెలుగు గ్రంథమునందు మఱొక పేరు చెప్పుకొనవలసిన ఆవశ్యకము కవికి లేదు. కాబట్టి తెలుగు పద్మకవి కన్నడ పంపకవి కాడు. ఇంతకు పద్మకవి పద్యమిది.

"హరినిలయంబును హరనిలయంబును
  నిషధరాన్వయంబును నిషధరాద్రి
మప్పరోమయంబును నప్పరోమయమును
  వనవిలాసంబును దావనవిలాస
మున్నత కరశృంగ మున్నతకరశృంగ
  మింపుకాంతప్రప మింపుకాంత
మురకలసకులంబు సురకలసకులంబు
  సంపకాంతద్యోతితాంపకాంత

మొనర నపశతసాహస్రయోజనోన్న
తమును బదివేలు యోజనా లమర వలము
గగిగి కనకాద్రి పెన్మూలటం గలిగి తనరి
ప్రథితమై యొప్పు మందరపర్వతంబు"

ఇది సీసపద్యము ఇందు యతినియతి లేదు ఎత్తుగీతము ఆటవెలది కాదు. తేటగీతి. కందుకూరు శాసనములోని సీసపద్యమునందు యతినియతి కలదు ఎత్తు గీతము ఆటవెలది ధర్మవరము శాసనములోని సీసపద్యమునందును యతినియతి కలదు. ఎత్తుగీతము ఆటవెలది. ఆ సీసపద్యములు పూర్వోదాహృతములు నన్నయ భారతమునందు రెండు వందల యేబదియొకటి సీసపద్యములు కలవు అందు నాలుగు సీసపద్యములందు దప్ప అన్ని సీసపద్యములందును యతినియతి కలదు [60] నన్నయ సీసపద్యములందు ఆటవెలదులు అత్యధికము తేటగీతులు అత్యల్పము. యతినియతి, ఆటవెలది ప్రాచీన సీసపద్య లక్షణము పద్మకవి జినేంద్రపురాణము లోని సీసపద్యము ప్రాచీన సీసపద్యలక్షణ లక్షితము కాదు కాబట్టి పద్మకవి జినేంద్రపురాణము ప్రాఙ్నన్నయ యుగ కావ్యము కాదు అంతేకాదు. జినేంద్ర పురాణ పద్యమునందు "యోజనాలు" అను శబ్ద ప్రయోగము కలదు. అది యోజనములు అను శబ్దమునకు అర్వాచీనరూపము కాబట్టి పద్మకవి జినేంద్ర పురాణము అర్వాచీనకావ్యమే

## ఆదిపురాణము

పెదపాటి జగన్నాథకవి ప్రబంధరత్నాకరమునందు, సర్వదేవుని ఆది పురాణమునుండి మత్తేభకందపద్యములు రెండు, విరాటమునుండి సీసపద్యమొకటి కలవు. అవి ప్రాచీనతరరచనములు కావని ఒక అభిప్రాయం కలదు విరాటమును విస్మరించి, సర్వదేవుని ఆదిపురాణము ప్రాఙ్నన్నయయుగకావ్యమని మఱొక అభిప్రాయము కలదు [62] ఆదిపురాణము ప్రాఙ్నన్నయయుగకావ్యమనుటకు ప్రదర్శించిన ఉపపత్తులివి.

1 సర్వదేవుడను కవి యున్నట్లు కృష్ణదేవరాయల కాలము వాడగు ఎడపాటి ఎఱ్ఱన మల్హణచరిత్రములోని పూర్వకవిస్తుతియందు కలదు

2 కన్నడ రత్నత్రయములోని పొన్నకవి తెలుగువాడు వెంగిదేశములోని కమ్మనాడె పుంగనూరునివాసి సర్వదేవకవి యాతని నామమని కలదు.

3. ఆదిపురాణము జైనకావ్యము జినసేనుడను కవి సంస్కృతమునందు, పంపకవి కన్నడమునందు రచించిరి పంపకవి కన్నడమున రచింపఁగా పొన్నకవి తెనుగును రచించుట పొసగును

4 పంపకవి ఆదిపురాణమునకు, సర్వదేవుని ఆదిపురాణమునకు పద సామ్యము కలదు

పంపకవి ఆదిపురాణములోని ఒక పద్యమునకు, సర్వదేవుని ఆదిపురాణము లోని కందపద్యమునకు పదసామ్యము, భావసామ్యము కలదు అంతమాత్రమున సర్వదేవుడు పొన్నకవి కావలసిన ఆవశ్యకము లేదు కర్ణాటభాషాకావ్యజ్ఞుడైన చాలును అంతేకాదు పద, భావసామ్యములకు కారణము సంస్కృతాదిపురాణము కావచ్చును.

పొన్నకవి తెలుగువాడే పుంగనూరునివాసియే అతని పేరు సర్వదేవకవి అని లేదు శాంతిపురాణమునందు "పొన్ననుం సర్వదేవకవీంద్రం" అని కలదు అది పొన్నకవికి విశేషణము బిరుదనామమగును వ్యక్తినామము కాదు. అంతేకాదు పొన్నకవి కన్నడకృతులందు సర్వదేవకవీంద్రుడని లేదు పొన్న డనియే కలదు మల్లణచరిత్రమునందు సర్వదేవుడని కలదు సర్వదేవకవీంద్రుడని లేదు సర్వదేవనాముడు, సర్వదేవకవీంద్రబిరుదనాముడు భిన్నులు కావచ్చును. సర్వదేవుడు ఎడపాటి ఎఱ్ఱనకంటె పూర్వుడగును నన్నయకంటె పూర్వుడైనచో సర్వదేవుడు విరాటము రచించినది నన్నయకంటె పూర్వమే అగును నన్నయ భారతముకంటె పూర్వము సర్వదేవుడు విరాటము రచింపవలసిన ఆవశ్యకము లేదు నన్నయభారతముకంటె తర్వాత కలదు ఇంతకు సర్వదేవుని విరాటములోని పద్యమిది

"ఇక్షురసాబ్ధి నీరెట్టిదో యని మది
 నూహించి యువ్విళు లూరకుండ
విరసంపు ముదిమిచేఁ బరిహరంబగు రసా
 యనము మీఁదికెఁ జిత్త మురుగకుండ
దివిరి దేహమ్ము వెధించు సిద్ధరసంబు
 కందువ యచ్చోటి కందకుండ
వాయువుఁ జిరతరస్థాయిగా జేయు సు
 ధారసంబున వెడ్క దగులకుండ
సఖిలజనులకుఁ బంకేరుహాసనుండు
నేర్చి యన్నింటి రుచు లొడఁగూర్చి తెచ్చి
సంచితంబులుగా సంగ్రహించె ననఁగ
భరితజలములై పురసరోవరము లొప్పు"

ఇది సీసపద్యము యతినియతి లేదు. ఎత్తుగీతము ఆటవెలది కాదు తేటగీతి. పద్మకవి జినేంద్రపురాణము వలె సర్వదేవుని ఆదిపురాణము, విరాటుని కూడ ప్రాఙ్నన్నయ యుగకావ్యములు కావు.

## ఛందోగ్రంథములు

పాలకురికి సోమనాథుని పండితారాధ్యచరిత్రమునందు ఇట్లు కలదు

"తేట తెనుంగున ద్విపద రచింతుఁ
బాలిగాఁ దత్కథాప్రౌఢి యెట్లనిన
జాలులు మాత్రాను సంధానగణవి
నీతులు గాన 'యనియతగణై' ర
నియుఁ 'బ్రాసోవా' యనియు 'యతిర్వా' య
నియుఁ జెప్ప ఛందోవినిహితోక్తి గాన
ప్రాసమైనను యతిపై వడియైన
దేసిగా నిలిపి యాదిప్రాసనియతి
దప్పకుండఁగ ద్విపదలు రచియింతు" ప్ర. సం పుట 18

ఇందు ద్విపదలక్షణము సంస్కృతమునందు కలదు. అది తెలుగునకు సంబంధించిన సంస్కృత భాషా ఛందో గ్రంథములోని దగును. ఆ ఛందో గ్రంథము నన్నయకు "అంతగా నర్వాచీనము కాఁగూడదు ప్రాచీనమెమో" అని ఒక అభిప్రాయము కలదు [63] ఇది ఊహ మాత్రమె అది నన్నయకు పూర్వము కావలసిన ఆవశ్యకము లేదు పాలకురికి సోమనాథుని కంటె పూర్వమయిన చాలును నన్నయ కాలము పదునొకండవ శతాబ్ది పాలకురికి సోమనాథుని కాలము పదమూడవ శతాబ్ది. తెలుగునకు సంబంధించిన సంస్కృతభాషా ఛందోగ్రంథము కాలము పండ్రెండవ శతాబ్ది కావచ్చును

"యాప్పిరంగలమ్" అను తమిళచ్ఛందోగ్రంథమునందు "వాంచియార్ శెయిద వడగు చందవుం" అని కలదు వాంచియార్ రచియార్ కావచ్చును అతడు రచన అగును కవిజనాశ్రయము నన్నయకు ప్రాచీనగ్రంథమగునేమో అని మఱొక అభిప్రాయము కలదు [64] కాని "వాంచియార్ . . చందవుం" అను పంక్తి కారికా గ్రంథమునందు లేదు వృత్తి గ్రంథమునందు కలదు కారికా గ్రంథ కర్త అమృత సాగరుడే వృత్తిగ్రంథమును రచించినట్లు జనశ్రుతి కలదు గాని నిర్ధారక సాధనము లేదు కర్తృకాలములు సరిగా తెలియని వృత్తి గ్రంథమును బట్టి నన్నయకు పూర్వము తెలుగు ఛందోగ్రంథము కలదనుట ప్రామాణికము కాదు.

# కవిజనాశ్రయము

కవిజనాశ్రయములోని సంజ్ఞాధికారమునందు "మల్లియరేచనసుకవి కవిజనాశ్రయమను ఛందము" రచించినట్లు కలదు (౮ ప) వృత్తాధికారమునందు "శ్రావకాభరణ" (78 ప) "శ్రావకాభరణాంక" (92 ప) అను సంబుద్ధులు కలవు అధికారాంతగద్యములందు "వాదీంద్ర చూడామణి చరణసరసీరుహమధుకరాయమాణ శ్రావకాభరణాంకవిరచితం" బని కలదు కావున మల్లియరేచన వాదీంద్ర చూడామణి శిష్యుడు కావలయును కాకినాడ ఆంధ్ర సాహిత్య పరిషత్కార్యాలయము ప్రకటించిన కవిజనాశ్రయములోని సంజ్ఞాధికారమునందు అధఃకరించిన ఒక పద్యములోని "యాచకాభరణుడు" అను విశేషణమును "వాచకాభరణుడు" అని సంస్కరించి, స్రగ్విణీవృత్తలక్షణమున మల్లియరేచనకు గల "వాగ్భూషావల్లభ" అను సంబోధనమును వాగ్భూషావరవల్లభ విశేషణముగ సాగదీసి, జినవల్లభునికి ముడిపెట్టి, కవిజనాశ్రయము పదవ శతాబ్ది గ్రంథమని ఒక అభిప్రాయము కలదు [65] కవిజనాశ్రయము అవతారికలోని రెండవ పద్యము రెండవ పాదము "భీమేశ్వరు కరుణ గల్గు భీమనసుకవినేఁ" అను పాఠమును "నేమేశ్వరు కరుణ గల్గు నే భీమకవిన్" అని దిద్దివైచి, కవిజనాశ్రయము ప్రాఙ్నన్నయ యుగములోని ఛందో గ్రంథమని మఱొక అభిప్రాయము కలదు [66] ఇది "అహో మూలచ్ఛేదీ తవ పాణ్డిత్యప్రకర్షః అనిపించునది

కవిజనాశ్రయము గ్రంథాంతపద్యమిది.

"జయదేవాదిచ్ఛందో
నయమున సంక్షేపరూపునం జెలువుగ మ
ల్లియరేచన సుకవిజనా
శ్రయుఁ డిఛందముఁ జెప్పె జనులకుఁ దెలియన్" ౮ప

ఇందు కవిజనాశ్రయము "జయదేవాదిచ్ఛందోనయమున" చెప్పినట్లు ఇది ముఖ్యముగ కలదు "జయదేవాదిచ్ఛందోనయమున" అనగా జయదేవుడు మొదలైన వారి ఛందోగ్రంథముల సరణిఅని స్పష్టము జయదేవాదులు జయదేవుడు, కేదారుడు, జయకీర్తి, హేమచంద్రుడు మొదలైనవారు కవిజనాశ్రయమునందు అధికార విభాగము కలదు అది జయకీర్తి ఛందోనుశాసనమునకు అనుకరణము కవిజనాశ్రయములేని ఛందోనామములు హేమచంద్రుని ఛందోనుశాసనములోని ఛందోనామములను సంవదించునవి. జయదేవాదుల కాలములు పది, పదొకండు, పండ్రెండు

శతాబ్దులు కాఁబట్టి కవిజనాశ్రయము పంద్రెండవ శతాబ్దికంటె తర్వాతి గ్రంథము కావలయును.

"అమరఁగ వేల్పులచేఁ గ
బ్బము సెప్పియ కాదె వరము వడసిరి బా
ణ మయూరాదులు, సత్కా
వ్యము సెప్పినఁ బడయరాని వస్తువు గలదే." 7ప.

ఇది సంజ్ఞాధికారములోని పద్యము. అంతేకాదు మడికి సింగన సకలనీతి సమ్మతమునందు ఉదాహృతము- (24ప.1ఆ.) ఇందు బాణమయూరాదులు కావ్యములు చెప్పి దేవతావరములు పడసినట్లు కలదు. బాణుడు కావ్యములు చెప్పి దేవతా వరములు పడసినట్లు సంస్కృతవాఙ్మయమునందు కానరాదు మయూరుఁడు సూర్య శతకము చెప్పి సూర్యవరము పడసినట్లు సంస్కృతవాఙ్మయమునందు ప్రసిద్ధము. బాణుడు రెండు చేతులు దునిమి శివుని అర్చించి మఱల పడసినట్లు మల్లికార్జునపండితుని శివతత్త్వసారమునందు కలదు (396ప) కావ్యము చెప్పినట్లు లేదు బాణుడు, మయూరుఁడు, కాళిదాసు గద్యకావ్యములు చెప్పి శివుని వరములు పడసినట్లు పాలకుఱికి సోమనాథుని పండితారాధ్య చరిత్రమునందు కలదు (ద్వి సం పుటలు105-107) అది మల్లికార్జునపండితుని ఊర్ధ్వనేత్రలాభకథనమునకు ఉపబలకముగ పాలకుఱికి సోమనాథుడు కల్పించినది. అందలి బాణమయూరకాళిదాసులె ఇందలి బాణమయూరాదులు. పాలకుఱికి సోమనాథుని కాలము పదమూడవ శతాబ్ది కాఁబట్టి కవిజనాశ్రయము పదమూడవ శతాబ్ది కంటె తర్వాతి గ్రంథము కావలయును

"సురరాజు సురరాజుఁ గూడి సూర్యుతో నొడఁబడి మఱియుఁ
గరమొప్ప నిప్పాట నాలు గణములు మధ్యాక్కరంబు- 26ప జా ఆ.

ఇది కవిజనాశ్రయములోని మధ్యాక్కరపద్యలక్షణము. ఇందు నాల్గవ గణము మొదటి అక్షరముతో యతిమైత్రి కలదు యుద్ధమల్లుని బెజవాడ శాసనము లోని అయిదు మధ్యాక్కరపద్యములందును, నన్నయ భారతములోని అన్ని మధ్యాక్కరపద్యములందును ఐదవ గణము మొదటి అక్షరముతో యతిమైత్రి కలదు. ఎఱ్ఱన అరణ్యపర్వశేషములోని అన్ని మధ్యాక్కరపద్యములందును నాల్గవ గణము మొదటి అక్షరముతో యతిమైత్రి కలదు. లక్ష్యము లేకుండ లక్షణము పుట్టదు.

ఎఱ్ఱన ముఖ్యాక్షరముల లక్ష్యములుగ కవిజనాశ్రయములోని ముఖ్యాక్షరపద్యలక్షణము సంగతమగును ఎఱ్ఱన కాలము పదునాల్గవశతాబ్ది పూర్వార్థము కాబట్టి కవిజనాశ్రయము పదునాల్గవశతాబ్ది పూర్వార్థము కంటె తర్వాతి గ్రంథమగుట తథ్యము కవిజనాశ్రయము రచనాకాలము స్థూలముగ పదునాల్గవ శతాబ్ది ఉత్తరార్థము. కాబట్టి కవిజనాశ్రయము ప్రాఙ్నన్నయయుగచ్ఛందో గ్రంథము కాదు

## గజాంకుశము

మడికి సింగన సకలనీతిసమ్మతమునందు గజాంకుశమను గ్రంథనామము కలదు (7వచ 1ఆ) అది రాష్ట్రకూటరాజైన మూడవకృష్ణరాజు మంత్రి, గజాంకుశసంజ్ఞితుడైన నారాయణుని రాజనీతిశాస్త్రగ్రంథము అతడు తెనుగుకవి అని, నన్నయకు పూర్వుడని ఒక అభిప్రాయముకలదు [67] కాని నారాయణమంత్రి గజాంకుశము తెలుగుగ్రంథము కాదు అది అనుపలబ్ధమైనను 1049 నాటి శ్రీధరాచార్యులు, 1112 నాటి నయసేనుడు, 1145 నాటి దుర్గసింహుడు, 1245 నాటి మల్లికార్జునుడు ప్రశంసించిరి వారు కన్నడకవులు [68] నారాయణమంత్రి గజాంకుశము కన్నడగ్రంథము తదనువాదమైన తెలుగు గ్రంథము తదనంతరకాలిక మగును కాబట్టి గజాంకుశ రాజనీతిశాస్త్రగ్రంథము ప్రాఙ్నన్నయయుగ గ్రంథము కాదు.

“నన్నయ భారతము మహాకావ్యము, నన్నయకు పూర్వము ఎట్టి కావ్యమును లేకుండ, అట్టి మహాకావ్యము అకాంతము ఉట్టిపడదు, కావున ఏవో కావ్యములు ఉండియుండును” అనుట కూడ ఊహామాత్రశరణ్యము సంస్కృతమునందు వాల్మీకి రామాయణము మహాకావ్యము కాని వాల్మీకికి పూర్వము ఏ సంస్కృతకావ్యమును లేదు వ్యాసుని భారతము కలదను నవీనవాదము కలదు ఆ వాదమును వాదపక్షముగ అంగీకరించినను, వ్యాసునికి పూర్వమును ఏ సంస్కృతకావ్యమును లేదు వాల్మీకి రామాయణము ఆదికావ్యముగ సుప్రసిద్ధము అట్లు నన్నయ భారతమును ఆదికావ్యముగ సుప్రసిద్ధము వాల్మీకి రామాయణము స్వోపజ్ఞము నన్నయ భారతము స్వోపజ్ఞము కాదు సంస్కృతభారతమునకు తెలుగుసేత స్వయంజాతరసాలము కాదు తెలుగుమొక్కను సంస్కృతశాఖను అంటుకట్టిన సంక్రాంతరసాలము తెలుగు కావ్యము సంస్కృతకావ్యము కంటె భిన్నము కాదు. సహజము సంస్కృత

కావ్యములెల్ల నన్నయకు మార్గదర్శకములు. సంస్కృతాలంకారశాస్త్రములెల్ల ఆదర్శప్రాయములు. కన్నడకావ్యములు తోడునీడలు. కాబట్టి నన్నయకుపూర్వము ఏవో తెలుగుకావ్యములు ఉండవలసిన ఆవశ్యకము లేదు. ఉన్నట్లు ఆధారము లేదు. కావ్యాభావమే కలదు. అది ప్రాగభావమా? ప్రధ్వంసాభావమా? అను తర్కము వ్యర్థము అభావము మాత్రము నిర్నిమిత్తము కాదు. తమిళసాహిత్యము ప్రథమశతాబ్ది నుండి కలదు. కన్నడసాహిత్యము తొమ్మిదవశతాబ్ది నుండి కలదు. తెలుగుసాహిత్యము పదొకండవశతాబ్దినుండి కలదు. కారణము? తమిళజాతి పురాతనకాలము నుండి స్వతంత్రము. కన్నడజాతి మధ్యకాలమునుండి స్వతంత్రము. ఆంధ్రజాతి ఆదికాలమునుండి పరతంత్రము. స్వతంత్రజాతికి స్వస్థానవేషభాషాభిమతములు సద్యఃఫలములు. పరతంత్రజాతికి సావకాశఫలములు. ఆంధ్రుల స్వస్థానవేషభాషాభిమానముల కంటె కర్ణాటకుల స్వస్థానవేషభాషాభిమానములు అధికము. అంతకంటె తమిళుల స్వస్థానవేషభాషాభిమానములు అత్యధికము. అది సంకుచితదృక్పథమైనను స్వజాతి వికాసమునకు సువిశాలఘంటాపథము. "కవితా వనితా లతా నిరాశ్రయా న శోభన్తే" అని ఒక ఆభాణకము కలదు. తమిళకవిత్వమునకు రాజాశ్రయము, ప్రజాశ్రయము ను తారస్థాయిని కలదు. కన్నడకవిత్వమునకు రాజాశ్రయము, ప్రజాశ్రయము ను మంద్రస్థాయిని కలదు. తెలుగుకవిత్వమునకు రాజాశ్రయము, ప్రజాశ్రయము ను మందస్థాయిని కలదు. ఇది పూర్వస్థితిమాత్రమే కాదు; వర్తమానవైభవమును ఇంతే.

# నన్నయ యుగము

## ఆదికవి

నన్నయ యుగకర్త అంతేకాదు. ఆంధ్రసాహిత్య సృష్టికర్త ప్రథమాంధ్ర కావ్యకర్త అందువలన ఆదికవి సంస్కృత లౌకికసారస్వతమునందు వాల్మీకి ఆదికవి వలె, ఆంధ్రసాహిత్యమునందు నన్నయ ఆదికవి నన్నయకు పూర్వము పద్యరచనము కలదు. వాల్మీకికి పూర్వమును శ్లోకరచనము కలదు నిషాదునిచేత నిహతమైన మగక్రౌంచము గురించి విలపించు ఆడక్రౌంచమును చూచి, కరుణార్ద్ర హృదయుడైన వాల్మీకి నోట మానిషాదేత్యాది వాక్యము వెలువడినది. అనంతరము వాల్మీకి ఆలోచించి, శిష్యుడైన భరద్వాజునితో ఇట్లనెను.

"పాదబద్ధో ఒక్షరసమ స్తన్త్రీలయసమన్వితః
శోకార్తస్య ప్రవృత్తో మే శ్లోకో భవతు నాన్యథా "

18 శ్లో 2 స. బా. కాం.

పలికెనది "పాదబద్ధము, అక్షరసమము, తంత్రీలయసమన్వితము నా శోకార్త ప్రవృత్తము శ్లోకమే అగును మరొకటి కాదు " అని అర్థము. అంతకు ముందు శ్లోకము లేనిచో, శ్లోకమే అగుననుట అనుపపన్నమగును. కాబట్టి వాల్మీకికి పూర్వము శ్లోకరచనము కలదని గ్రాహ్యము అయినను వాల్మీకి ఆదికవి. కారణము వాల్మీకికి పూర్వము కావ్యరచనము లేదు వాల్మీకి రామాయణమే ఆది కావ్యము. ఆదిశ్లోకకర్త కాక, ఆది కావ్యకర్త ఆదికవి అట్లు నన్నయకు పూర్వము పద్యరచనము కలదు అయినను నన్నయ ఆదికవి కారణము నన్నయకు పూర్వము కావ్యరచనము లేదు కలదను వాదములు నిష్కృష్ట సిద్ధాంతములు కావని పూర్వోక్తము నన్నయ భారతమే తెనుగున ఆది కావ్యము ఆది పద్యకర్త కాక, ఆదికావ్యకర్త ఆదికవి.

"ఆంధ్రకావ్యపదము దీర్చిన నన్నయభట్టుగారి .. నభినుతించి"

అని కొలను గణపతిదేవుని శివయోగసారమునందు కలదు [1] అంతేకాదు సర్వాంధ్రకవుల పూర్వకవిస్తుతులందును నన్నయ ఆదికవిగ నతశీర్షనమస్కృతు లందెను.

ఆదికవి నన్నయ అవిరళజపహోమతత్పరుడు. విపులశబ్దశాసనుడు — సంహితాభ్యాసుడు— బ్రహ్మాండాది నానాపురాణ విజ్ఞాన నిరతుడు లోకజ్ఞుడు ఉభయభాషా కావ్యరచనాభిశోభితుడు సత్ప్రతిభాభియోగ్యుడు. నిత్యసత్యవచనుడు మత్యమరాధిపాచార్యుడు. రాజరాజనరేంద్రుని కులబ్రాహ్మణుడు

"తన కుల బ్రాహ్మణు ననురక్తు నవిరళ
జపహోమతత్పరు విపులశబ్ద
శాసను సంహితాభ్యాసు బ్రహ్మాండాది
నానాపురాణ విజ్ఞాన నిరతుఁ
బాత్రు నాప స్తంబసూత్రు ముద్గలగోత్ర
జాతు సద్వినుతావదాత చరితు
లోకజ్ఞు నుభయభాషాకావ్యరచనాభి
శోభితు సత్ప్రతిభాభియోగ్యు
నిత్యసత్యవచను మత్యమరాధిపా
చార్యు సుజను నన్నపార్యుఁ జూచి
పరమధర్మవిదుఁడు వరచళుక్యాన్వయా
భరణుఁ డిట్టులనియెఁ గరుణతోడ" 9 ప. 1 ఆ. ఆ. ప.

"తన కులబ్రాహ్మణుఁ"డన "వరచళుక్యాన్వయాభరణుఁ"డైన రాజరాజ నరేంద్రుని కుల బ్రాహ్మణుడని అర్థము— కుల బ్రాహ్మణశబ్దము నిఘంటువులందు మృగ్యము కులవిప్రశబ్దము కలదు రెండును పర్యాయపదములు సమానార్థకములు. "కులక్రమాగతః విప్రః వంశక్రమాగతే పురోహితే"అని వాచస్పత్యము నందు కులవిప్రశబ్దమునకు అర్థము కలదు కులగురువు, కులపురోహితుడు అను వ్యవహారములు నేడును కలవు కులక్రమాగతగురువు కులగురువు కులక్రమాగత పురోహితుడు కులపురోహితుడు కులక్రమాగతవిప్రుడు కులవిప్రుడు. కులక్రమాగత బ్రాహ్మణుడు కులబ్రాహ్మణుడు. కులమన వంశము చళుక్యవంశమునందు కులబ్రాహ్మణులు కలరు రాజరాజనరేంద్రుని పినతాత రెండవ అమ్మరాజ విజయాదిత్యుని శాసనమునందు "మత్కుల బ్రాహ్మణాయ" అని కలదు. [2] ముత్తాత మొదటి అమ్మరాజమహేంద్రుని శాసనమునందు "బ్రాహ్మణోచిత విద్యాకర్మ షట్కర్మవిధాయుడు, వేదవిద్యావిదిత శాస్త్రసమూహుడు, అయిన విద్ధమయ్య కుల క్రమాయాతుడని కలదు [3] కులక్రమాయాతు డనగా కులక్రమాగతుడే. విద్ధమయ్య

కొడుకు కోరమియ కూడ కులక్రమాగతుడే అగును. అతడు సువర్ణభాండాగార శ్రీకరము ఖ్యడ [4] కాఁబట్టి రాజరాజనరేంద్రుని తాత ముత్తాతల కాలమునుండి కులబ్రాహ్మణ వ్యవహారము కలదని స్పష్టము.

"అనఘుల శాస్త్ర విధిజ్ఞుల
ననురక్తులఁ బితృపితామహక్రమమున వ
చ్చిన విప్రుల మంత్రులఁగా
నొనరించితె కార్యసంప్రయోగము వొంపెన్" 26 ప. 1 ఆ స ప

అని నన్నయ భారతమునందు కలదు ఇది ధర్మరాజును సందర్శించిన నారదుడు కుశలప్రశ్నల అనంతరము వైచిన రాజనీతి ప్రశ్న. సంస్కృతభారతము నందు "కులీనా శ్చానురక్తాశ్చ కృతాస్తే వీర మన్త్రిణః" అని కలదు (16 శ్లో 5 అ. స ప.) కులీను లనగా ఉత్తమకుల సంజాతులు వారి స్థానమున "పితృ పితామహక్రమమున వచ్చిన విప్రులు" నన్నయ భారతమందు కలదు. కులీనులు పితృపితామహక్రమమున వచ్చిన విప్రులే కానక్కఱలేదు. ఇతరులును కావచ్చును. పితృపితామహక్రమమున వచ్చిన విప్రులు కులీనులు, కుల విప్రులును వారు కావ్య సంప్రయోగము కొఱకు మంత్రులు కావలయును. ఒక్క మంత్రులే కారు; పురోహితులు, రాజోద్యోగులు, కవిపండితులును కావచ్చును. నన్నయ తన కుల క్రమమును తెలుపలేదు కాని, రాజరాజ నరేంద్రుని నందమపూడి, మండ శాసనముల కావ్యకర్త నన్నయభట్టు [5] వలె; కోరుమిల్లి, కలిదిండి శాసనముల కావ్యకర్త బేతనభట్టు [6] రాజరాజనరేంద్రుని తండ్రి విమలాదిత్యుని రణస్థిపూడి శాసనమునకు కావ్యకర్త భీమనభట్టు [7] పినతాత రెండవ అమ్మరాజ విజయాదిత్యుని ఎలవఱ్ఱు శాసనమునకు కావ్యకర్త పోతనభట్టు [8] పలకలూరు శాసనమునకు కావ్య కర్త మాధవభట్టు [9] మాధవభట్టు, పోతనభట్టు, భీమనభట్టు, బేతనభట్టు, నన్నయభట్టు పితృపితామహక్రమము కావచ్చును కాఁబట్టి నన్నయ రాజరాజనరేంద్రుని కుల బ్రాహ్మణు డనగా పితృపితామహక్రమమున వచ్చిన– కులక్రమాయాతుడైన, కుల క్రమాగతుడైన బ్రాహ్మణుడని అర్థము.

నన్నయ పేరు ప్రథమతః "నన్నపార్యు"డని కలదు. ఆర్యశబ్దము శ్రేష్ఠతావాచకము అసలు పేరు నన్నప. అనగా నన్నప్ప తదుపరి "సారమతి" పద్యమునందు (25 ప. 1 ఆ ఆ ప) "నన్నయభట్టు" అని కలదు. ఆశ్వాసాంత గద్యలందును నన్నయభట్టు అని కలదు. నందమపూడి శాసనమునందు "నన్నియ

భట్టః" అని కలదు. నన్ని+అప్ప=నన్నప్ప = నన్నప = నన్నప. నన్ని + అయ్య = నన్నయ్య = నన్నయ, నన్నియ భట్టశబ్దమునకు బహ్వర్థము కలవు అందు ఒక అర్థము పండితబిరుదము కుమారిలభట్టు వలె నన్నయభట్టు అంతేకాదు. కావచ్చునన్న నన్నయ పితృపితామహక్రమములోని వారందరును భట్టశబ్దవాచ్యులే నన్నయభట్టారకుడను వ్యవహారమును కలదు. భట్టార, భట్టారక శబ్దములు గౌరవవాచకములు అగ్నిభట్టారకుడు, వ్యాసభట్టారకుడు, విష్ణుభట్టారకుడు, భర్గభట్టారకుడు, భట్టారా, భట్టారకా అని నన్నయ బహుధా ప్రయోగించెను. నన్నయభట్టు సహాధ్యాయుడు నారాయణభట్టు. శ్రీనాథుడు "శ్రీనాథభట్టసుకవి" యని చెప్పుకొనుటలోని అంతర్గమును పండితబిరుదమే. నన్నయభట్ట నామధేయములోని భట్టశబ్దము పండితబిరుదవాచకము. నన్నయభట్టారక వ్యవహారములోని భట్టారకశబ్దము గౌరవవాచకము.

# ఆంధ్ర మహాభారతావతరణము చారిత్రికనైపథ్యము

"మహాభారత"మును "తెనుగున రచియింపు"మని (16 ప) రాజరాజ నరేంద్రుడు (2 వచ) నన్నపార్యునికి (9 ప) ఆనతిచ్చినట్లు (18 వచ.) నన్నయ అవతారికయందు కలదు అంతేకాదు "వెంగిదేశంబునకు నాయకరత్నంబునుం బోని రాజమహేంద్రపురంబు" నందు "సుఖోపవిష్టుండయి" ఆనతిచ్చినట్లును కలదు (8 వచ) రాజరాజనరేంద్రుడు వేంగిదేశమును పరిపాలించిన తూర్పు చాళుక్యరాజు వెంగిదేశము స్థూలముగ మధ్యతీరాంధ్రదేశము. రాజధాని రాజమహేంద్రపురము తూర్పుగోదావరి జిల్లాలోని రాజమహేంద్రవరము రాజమంద్రి

రాజరాజనరేంద్రుని రాజ్యకాలము [10] 1019–1061 వేతనభట్టు రచించిన కోరుమిల్లి శాసనకాలము 1022 వ సంవత్సరము. [11] కలిదిండి శాసనకాలము 1042 వ సంవత్సరము [12] నన్నయభట్టు రచించిన నందమపూడి శాసనకాలము 1053 వ సంవత్సరము [13] మండ శాసనకాలము 1054 వ సంవత్సరము [14] కాబట్టి నన్నయభట్టు రాజరాజనరేంద్రుని ఆస్థానకవి అయిన కాలము స్థూలముగ 1051–61 మధ్య కావచ్చును నన్నయభట్టు భారత రచనాకాలము స్థూలముగ 1056–1060 మధ్య అగును.

తూర్పు చాళుక్యరాజులు బ్రాహ్మణమతావలంబులు బ్రాహ్మణమతోద్ధారకు లును బ్రాహ్మణమతమునకు మూలాధారములు దేవాలయములు మూలస్తంభములు విద్యాలయములు మూలస్థానములు అగ్రహారములు దేవాలయనిర్మాణము, విద్యాలయస్థాపనము, అగ్రహారసంవర్ధనము తూర్పు చాళుక్యరాజుల నిత్యకృత్యములు మొదటి జయసింహుడు (641 – 73) అసనపురమునందు ఘటికాస్థానమును స్థాపించెను [15] ఘటికాస్థానము నేటి విశ్వవిద్యాలయము వంటిది. రెండవ విజయాదిత్యుడు (808 – 47) నూటయెనిమిది శివాలయములు కట్టించెను [16] గుణక విజయాదిత్యుడు (849 – 92) పండరంగ మహేశ్వరాలయమును నిర్మింపజేసెను. [17] మొదటి చాళుక్యభీముడు (891 – 921) మూడువందల అరువది చాళుక్యభీమేశ్వరాలయములను కట్టించెను [18] చళుక్యభీమవరము (సామర్లకోట) లోని చాళుక్యభీమేశ్వరాలయము పంచారామములలో ఒకటి మఱొకటి దక్షారామము (ద్రాక్షారమము)లోని భీమేశ్వరాలయము సుప్రసిద్ధము. అది చాళుక్యభీముడు నిర్మింపజేసినదియే [19] విజయవాడలోని బృహత్పరిమాణముగల ద్వారపాలక విగ్రహములు, మంటప స్తంభచూళికలు చాళుక్యదేవాలయమునకు చిహ్నపతాకలు. [20] బిక్కవోలు లోని గోలింగేశ్వరాలయము, చంద్రశేఖరాలయము, రాజరాజేశ్వరాలయము చాళుక్య దేవాలయములే [21] రాజరాజనరేంద్రుడు అనేక శివాలయములు నిర్మించెను [22] వేంగిదేశములోని రాజరాజేశ్వరాలయములు రాజరాజనరేంద్రుడు కట్టించినవే అగును తూర్పు చాళుక్యరాజులు బ్రాహ్మణులకు దానమిచ్చిన అగ్రహారము లనేకము అగ్రహార ప్రదానము భోగానుభవమునకు కాదు బ్రాహ్మణ ధర్మాచరణమునకు, యజనము, యాజనము, అధ్యయనము, అధ్యాపనము, దానము, ప్రతిగ్రహము అను షట్కర్మలు బ్రాహ్మణ ధర్మములు. తదాచరణార్థమైన అగ్రహారప్రదానము బ్రాహ్మణమతోద్ధరణ ప్రయత్నమే.

ఇంతగా తూర్పు చాళుక్యరాజులు బ్రాహ్మణమతోద్ధరణము కావించినను, కుమారిలభట్టు వాదకుఠారఖండనములకు కూకటివ్రేళ్లు తెగినను, శంకరాచార్యుల శాస్త్ర శస్త్ర ప్రచారములకు తల్లి వ్రేళ్ల తల్లడిల్లినను, బౌద్ధజైనమత వటవృక్షములు పూర్తిగా నేల సపాటము కాలేదు. 1146 వ సంవత్సరమున పంచారామములందు మహాదేవరల తోపాటు బుద్ధదేవరకును అఖండదీపతతులు మండలికభీమన సంధివిగ్రహి సోమనపెగ్గడ నిలిపినట్లు శాసన ప్రమాణము కలదు. [23] 1182 వ సంవత్సరమున కృష్ణానది దక్షిణ షట్సహస్రావనీ మండలము నేలిన రెండవ కోట

కేతరాజు దేవబ్రాహ్మణులతోపాటు బుద్ధదేవరకును గ్రామదానములు చేసినట్లు శాసన ప్రమాణము కలదు [24] వెలనాటి రెండవ రాజేంద్రచోడరాజు బౌద్ధమతమును అవలంబించినట్లు పండితారాధ్య చరిత్రమున కలదు జైనమతము పదునైదవ శతాబ్ది తుది వఱకును ఆంధ్రదేశమునందు కలదు. [25] అంతేకాదు. రాజరాజనరేంద్రుని తండ్రి విమలాదిత్యుడు చివఱి సంవత్సరములలో జైనమతమును స్వీకరించినట్లు శాసనప్రమాణము కలదు [26] ఆ శాసనములోని విమలాదిత్యుఁడు తూర్పు చాళుక్య రాజు కాడని ఒక అభిప్రాయము [27] కలదు గాని, శాసనములోని "సర్వలోకాశ్రయ శ్రీవిష్ణువర్ధన మహారాజ రాజమార్తాండ ముమ్మడి భీమన" బిరుదావళి తూర్పు చాళుక్యరాజునకు వర్తించునట్లే కలదు. రాజరాజనరేంద్రుని కాలమునందు బౌద్ధజైన మతముల ప్రభావము కలదు అది రాజరాజనరేంద్రుని స్వభావమునకు విరుద్ధము.

రాజరాజనరేంద్రుడు పరమభట్టారకుడు, పరమమాహేశ్వరుడు, పరమ బ్రహ్మణ్యుడు అని నందమపూడి శాసనమునందు కలదు "స సర్వలోకాశ్రయ శ్రీ విష్ణువర్ధన మహారాజాధిరాజో రాజపరమేశ్వరః. పరమభట్టారకః. పరమ మాహేశ్వరః పరమబ్రహ్మణ్యః శ్రీ రాజరాజదేవః–" మహాగౌరవార్హుడు, మహాశివ భక్తుడు, మహాబ్రాహ్మణహితుడు అని అర్థము మహాశివభక్తుడైనను వీరశైవుడు కాడు.

"శ్రీ వాణీగిరిజా శ్చిరాయ దధతో వక్షోముఖాఙ్గేషు యే
లోకానాం స్థితి మావహ న్త్యవిహతాం స్త్రీ పుంసయోగోద్భవామ్
తే వేదత్రయ మూర్తయః త్రి పురుషా స్సమ్పూజితా వ స్సురై
ర్భూయాసుః పురుషోత్తమామ్బుజభవ శ్రీకన్ధరా శ్శ్రేయసే" 1 శ్లో.

అని త్రిమూర్తులను "స్తుతియించు" వాడు (2 వచ.) అంతేకాదు.

"ఆశ్రితపోషణంబున వసంత విలాసమునన్ మనీషి వి
ద్యాశ్రమతత్త్వవిత్తమున దానగుణాభిరతిన్ సమస్తవ
ర్ణాశ్రమ ధర్మరక్షణమహామహిమన్ మహి నొప్పు సర్వలో
కాశ్రయుఁ డాదిరాజనిభుఁ డత్యకలంక చరిత్ర సంపదన్. 6 ప.

నిజమహీ మండల ప్రజఁ బ్రీతిఁ బెంచుచుఁ
  బరమండలంబుల ధరణిపతుల
నదిమి కప్పంబుల ముదముతోఁ గొనుచును
  బలిమినీయని భూమివలయపతుల

సుక్కడఁగించుచు దిక్కులఁ దన యాజ్ఞ
వెలిఁగించుచున్ విప్రకులములనెల్లఁ
బ్రోచుచు శరణన్నఁ గాచుచు భీతుల
నగ్రజన్ములకు ననుగ్రహమునఁ
జారుతరమహాగ్రహారంబు లిచ్చుచు
దేవభోగముల మహావిభూతిఁ
దనరఁ జేయు చిట్లు మనుమార్గుఁ డగు విష్ణు
వర్ధనుండు వంశవర్ధనుండు. 7 ప. 1 ఆ. ఆ. ప.

ఇందు "సమస్త వర్ణాశ్రమ ధర్మరక్షణ మహామహిమన్ మహి నొప్పు"ట, "విప్రకులములనెల్లఁ బ్రోచు"ట, "అగ్రజన్మలకు ననుగ్రహమునఁ జారుతర మహాగ్రహారంబు లిచ్చు"ట, "దేవభోగముల మహావిభూతిఁ దనరంజేయు"ట, "మనుమార్గుఁ డగు"ట రాజరాజనరేంద్రుని పరమబ్రహ్మణ్యమునకు పరమనిదర్శనము వర్ణాశ్రమ ధర్మరక్షణము, విప్రకుల సంరక్షణము, బ్రాహ్మణాగ్రహార ప్రదానము, దేవభోగ మహావైభవ నివేదనము, మను మార్గానుసరణము రాజరాజ నరేంద్రుని తాత ముత్తాతలును చేసిన పనియే అపూర్వము కాదుగాని అనర్హము. అభ్యధిక ప్రయత్నమునకు ఆలంబనము

రాజరాజనరేంద్రుని తల్లి -విమలాదిత్యుని భార్య- కుందవాంబ తమిళచోళ రాజైన రాజరాజచోళుని పుత్రిక [28] రాజరాజనరేంద్రుని భార్య అమ్మంగదేవి తమిళచోళరాజైన మొదటి రాజేంద్రచోళుని తనయ [29] రాజరాజనరేంద్రుని కోడలు- కులోత్తుంగచోళుని భార్య- మధురాంతకి తమిళచోళరాజైన రాజేంద్రచోళుని దుహిత [30] తన్నిమిత్తమున రాజరాజనరేంద్రుడు బాల్యమునుండి తమిళదేశమునకు రాకపోకలు జరుపుచుగ సాగించుట తథ్యము అంతేకాదు, రాజరాజనరేంద్రునికి రాజ్యాధికారము 1019 వ సంవత్సరమునందే సంక్రమించినను, అది నిస్సపత్నము కాలేదు. సవతి సోదరుడు విజయాదిత్యుడు కర్ణాట చాళుక్యరాజైన జయసింహుని, కళింగగాంగరాజైన మధుకామార్ణవుని సహాయమునంది రాజ్యమును కబళించెను. [31] రాజరాజనరేంద్రుడు తన మేనమామ తమిళ చోళరాజైన మొదటి రాజేంద్రచోళుని సహాయమునంది రాజ్యమును స్వాధీనము చేసికొని, మేనమామ తనయ అమ్మంగ దేవిని వివాహమాడి 1022 వ సంవత్సరమునందు పట్టాభిషిక్తుడయ్యెను [32] పట్టాభిషిక్తుడైన రాజరాజనరేంద్రుడు పట్టుమని పది సంవత్సరములైనను పరిపాలింప

కుండ, 1031 వ సంవత్సరమునందు విజయాదిత్యుడు మరల కర్ణాట సైన్యముతో దండెత్తి వచ్చి, అప్పుడు వెంగీదేశమునకు రాజధాని అయిన బెజవాడను ఆక్రమించుకొని పట్టాభిషిక్తుడయ్యెను [33] రాజరాజనరేంద్రుడు తమిళదేశమున కేగెను. మేనమామ మాత్రమేగాక మామ కూడ అయిన మొదటి రాజేంద్రచోళుడు సహింపక జాలక మరల దండయాత్ర సాగించెను [34] కృష్ణాజిల్లాలోని కలిదిండి కురుక్షేత్రమయ్యెను మొదటి రాజేంద్రచోళుని కుమారుడు, రాజరాజనరేంద్రుని బావమరది అయిన రెండవ రాజేంద్రచోళుడు శ్రీకృష్ణుడు ధర్మరాజును వలె రాజరాజనరేంద్రుని సింహాసనాధ్యాసీని చేసెను [35] 1035 వ సంవత్సరము నాటికి రాజరాజనరేంద్రుడు పునఃప్రతిష్ఠితుడైనను వేంగీదేశమునందు యుద్ధమేఘములు విచ్చిపోలేదు మొదటి రాజేంద్రచోళుని అనంతరము తమిళచోళరాజైన రెండవ రాజేంద్రచోళునకు, జయసింహుని అనంతరము కర్ణాట చాళుక్యరాజైన సోమేశ్వరునకు వెంగీదేశము రణరంగమయ్యెను [36] 1045 వ సంవత్సరమునందు ధరణికోటలోను, 1056 వ సంవత్సరమునందు మఱొక చోటను తమిళచోళులకు, కర్ణాట చాళుక్యులకు యుద్ధములు జరిగెను [37] తన్మధ్యకాలమున బహుశః 1051 వ సంవత్సరమునందు రాజరాజనరేంద్రుడు రాజధానిని బెజవాడనుండి రాజమహేంద్రవరమునకు తరలించెను. రాజమహేంద్రవరము రాజధాని అయిన తర్వాత రాజరాజనరేంద్రుని రాజ్యపాలనము శాంతియుతముగ సాగెను అంతవఱకు తమిళదేశమునకు రాజరాజనరేంద్రుని రాకపోకలు అధికమైనవి. 1050 వ సంవత్సరమునందు తంజావూరునకు సమీపమందలి తిరువయ్యారులోని శివాలయమునకు రాజరాజనరేంద్రుడు మూడువందల రాజరాజమాడలు దానమిచ్చినట్లు అచట శాసనము కలదు [38] అప్పటికి తమిళసాహిత్యము ఎంతో అభివృద్ధి చెందినది అది రాజరాజనరేంద్రునికి శ్రుతచరము అంతేకాదు, పరితపారము. అది రాజరాజనరేంద్రుడు ఆంధ్రసాహిత్యమును అవతరింపజేయుటకు ఉద్దీపనము.

అయినను రాజరాజనరేంద్రుడు తమిళకావ్యమును "తెనుగున రచియింపు" మనలేదు సంస్కృతములోని ఆదికావ్యము వాల్మీకిరామాయణమును "తెనుగున రచియింపు" మనలేదు వ్యాసభారతమును "తెనుగున రచియింపు" మనెను. అది నిర్నిమిత్తము కాదు.

"విమలమతిం బురాణములు వింటి ననేకము లర్థధర్మశా
స్త్రముల తెలింగెలింగితి నుదాత్త రసాన్విత కావ్యనాటక
క్రమములు పెక్కు సూచితి జగత్పరిపూజ్యములైన యీశ్వరా
గమములయందు నిల్పితిఁ బ్రకాశముగా హృదయంబు భక్తిలోన్ 10.

అయినను నాకు ననవరతంబును శ్రీమహాభారతంబునందలి
యభిప్రాయంబు విన నభిలాష పెద్దయై యుండు. 11.

ఇవి యేనునున్ సతతంబు నాయెడఁ గరం బిష్టంబులై యుండుఁ బా
యవు భూదేవకులాభితర్పణ మహీయఃప్రీతియున్ భారత
శ్రవణాసక్తియుఁ బార్వతీపతి పదాబ్జధ్యానపూజామహో
త్సవమును సంతతదానశీలతయు శశ్వత్సాధు సాంగత్యమున్. 12.

మఱి యదియునుంగాక 13.

హిమకరుఁ దొట్టి పూరుభరతేశ కురుప్రభుపాండుభూపతుల్
క్రమమున వంశకర్త లనఁగా మహి నొప్పిన యస్మదీయవం
శమునఁ బ్రసిద్ధులై విమలసద్గుణ శోభితులైన పాండవో
త్తముల చరిత్ర నాకు సతతంబు వినంగ నభీష్ట మెంతయున్. 14.

అమల సువర్ణశృంగఖురమై కపిలంబగు గోశతంబు ను
త్తమబహువేద విప్రులకు దానము సేసినఁ దత్ఫలం బు త
థ్యమ సమకూరు భారతకథాశ్రవణాభిరతిన్ మదీయ చి
త్తము ననిశంబు భారతకథాశ్రవణప్రవణంబు గావునన్. 15.

జననుత కృష్ణద్వైపా
యనమునివృషభాభిహితమహాభారతబ
ద్ధనిరూపితార్థ మేర్పడఁ
దెనుఁగున రచియింపు మధికధీయుక్తి మెయిన్. 16

బహుభాషల బహువిధముల
బహుజనముల వలన వినుచు భారతబద్ధ
స్పృహులగువారికి నెప్పుడు
బహుయాగంబుల ఫలంబు పరమార్థముగన్." 17 ప. 1 ఆ. ఆ. ప.

అనేక పురాణములు ఆలకించినను, అర్థధర్మశాస్త్రములు ఆకళించుకొనినను, ఉదాత్తరసాన్విత కావ్యనాటక క్రమములు పెక్కుసూచినను, ఈశ్వరాగమము

లందు హృదయమును భక్తితో నిలిపినను, రాజరాజనరేంద్రునికి "శ్రీ మహాభారతంబునందలి యభిప్రాయము విన నభిలాష పెద్దయై యుండెను. అది మహాభారతమును తెనుగున రచియింపుమనుటకు ఆదిమకారణము రాజరాజనరేంద్రునికి మిక్కలి ఇష్టమైన అయిదు విషయములందును ప్రథమతః "భూదేవకులాభితర్పణ మహీయః ప్రీతి" కలదు తదుపరి భారతశ్రవణాసక్తి కలదు భూదేవకులాభితర్పణ మహీయఃప్రీతి అనగా బ్రాహ్మణ వంశములను అధికముగ సంతృప్తిపఱచుట యందు అత్యధికమైన సంతోషము. భారత కథాశ్రవణ ప్రవణత్వమునకు నిమిత్తము, ఉత్తమబహువేదవిప్రులకు సువర్ణశృంగఖురమైన కపిలగోశతమును దానము చేసిన ఫలము తథ్యమ సమకూరునను తలంపు చంద్రుడు మొదలు పాండు రాజువఱకు పూరుభరతకురు ప్రభువులు వంశకర్తలగుట వాస్తవము కాదు. కల్పితము. అది కూడ రాజరాజనరేంద్రుని తండ్రి విమలాదిత్యుని రణస్థిపూడి శాసనమునందే కల విషయము. అంతకుముందు చళుక్యరాజులకు చంద్రవంశ సంబంధము లేదు అట్లే చోళులకును ఆదిని సూర్యవంశసంబంధము లేదు చోళులు సూర్యవంశసంబంధమును కల్పించుకొనుట వలన, చోళుల అల్లుడైన విమలాదిత్యుడు చంద్రవంశసంబంధమును కల్పించుకొన్నట్లు కన్పట్టును ఇంతకు రాజరాజ నరేంద్రుడు "తెనుఁగున రచియింపు"మని ఆసతిచ్చినది భారతకథను కాదు. "మహాభారతబద్ధనిరూపితార్థము"ను అదే మహాభారతాభిప్రాయము భారతబద్ధస్పృహులగు వారికి ఎప్పుడును బహుయాగముల ఫలము పరమార్థము బహుయాగఫలము, ఉత్తమబహువేదవిప్ర సువర్ణకవిత కపిల గోశతదానఫలము, భూదేవకులాభితర్పణ మహీయఃప్రీతిఫలము బ్రాహ్మణమత విషయములు అందుకు రాజరాజనరేంద్రుని మహాభారతాభిప్రాయ శ్రవణ మహాభిలాష, మహాభారతబద్ధ నిరూపితార్థ విశదీకరణా దేశము అది రాజరాజనరేంద్రుని బ్రాహ్మణ మతోద్ధరణమున అపూర్వమైన అభ్యధిక ప్రయత్నము

రాజరాజనరేంద్రుడు "బహుభాషల బహువిధముల బహుజనములవలన భారత బద్ధస్పృహు"డగుటకు, "కృష్ణద్వైపాయనముని వృషభాభిహిత మహాభారత"ము కాక, భాసుని నాటకములు, భట్టనారాయణుని వెణీసంహారనాటకము, అనంతభట్టు భారతచంపువు సంస్కృతమందు కలవు తమిళమునందు పెరుందేవనార్ భారతవెంబ కలదు వెంబ ఒక ఛందోభేదము భారతవెంబ తొమ్మిదవ శతాబ్ది తమిళభారతము [39] తమిళభాష రాజరాజనరేంద్రునికి కంఠస్థము తమిళ

భారతము రాజరాజనరేంద్రునికి కరస్థము కన్నడమునందు పంపని విక్రమార్జున విజయము కలదు, అది పదవ శతాబ్ది కన్నడ భారతము 40 (941 సం॥) కన్నడ భాష రాజరాజనరేంద్రునికి కర్ణస్థము కన్నడభారతమును రాజరాజనరేంద్రునికి కర్ణస్థము అయినను రాజరాజనరేంద్రునికి అభిమతమైనది కృష్ణద్వైపాయనముని వ్యాసభావిహిత మహాభారతమె కారణము బ్రాహ్మణమతోద్ధరణమే

నన్నయభట్టు ఉభయభాషా కావ్యరచనాభిశోభితుడు, నారాయణభట్టు సంస్కృత కర్ణాట ప్రాకృత పైశాచి కాంధ్ర భాషాకవిరాజశేఖరుడు అయినను రాజరాజనరేంద్రుడు నారాయణభట్టును మహాభారతమును తెనుగున రచియింపు మనలేదు. నన్నయ భట్టునే "మహాభారతబద్ధ నిరూపితార్థ మేర్పడఁ దెనుఁగున రచియింపు" మనెను కారణము నన్నయ తన కులబ్రాహ్మణుడు. అనురక్తుడు మాత్రమేగాక, అవిరళజపహోమతత్పరుడు, సంహితాభ్యాసుడు, బ్రహ్మాండాదినానా పురాణ విజ్ఞాన నిరతుడును అగుట కావలయును సంహితాభ్యసనము, అవిరళజప హోమతత్పరత బ్రాహ్మణ మత ధర్మములు

రాజరాజనరేంద్రుని బ్రాహ్మణ మతోద్ధరణమునకు నన్నయ వర్ణించిన నాటి వేంగీదేశవిభవము శృంగగ్రాహిక

"... ... ... ... ఉర్విలోన
ననఘమై శిష్టాగ్రహారభూయిష్ఠమై
ధరణీసురోత్తమాధ్వరవిధాన
పుణ్యసమృద్ధమై పొలుచు వేంగీదేశ
విభవంబుఁ జూచుచు ... ..."

అర్జునుడు చూచిన వేంగీదేశ విభవమిది అమూలకము అది ధర్మరాజు నాటిది కాదు రాజరాజనరేంద్రుని నాటిదే.

రాజరాజనరేంద్రుని బహుభాషా పరిచయము, బహుగ్రంథ పరిజ్ఞానము, బ్రాహ్మణ మతోద్ధరణ ప్రయత్నము, నన్నపార్యుని అవిరళజపహోమతత్పరమైన వ్యక్తిత్వమును ఆంధ్ర మహాభారతావతరణమునకు చారిత్రిక నైపథ్యము

# సహ నిర్వహణము

"కృష్ణద్వైపాయనమునివృషభాభిహిత మహాభారతబద్ధ నిరూపితార్థమేర్పడఁ దెనుఁగున రచియింపు మధికధీయుక్తిమెయిన్" అని రాజరాజనరేంద్రుడు ఆనతిచ్చెను "బుద్ధిబాహువిక్రమమున దుర్గమార్థజల గౌరవభారత భారతీసముద్రముఁ దఱియంగ నీఁదను విధాతృనకైనను నేరఁబోలునే" అని నన్నయ ముందు సందేహమును ప్రకటించెను "అయినను దేవా నీ యనుమతంబున విద్వజ్జనుల యనుగ్రహంబునంజేసి నా నేర్చువిధంబున నిక్కావ్యంబు రచియించెదను" అని వెంటనే ఆమోదమును తెలిపెను. (19 ప 20 వచ, 1 ఆ ఆ ప) తదుపరి ఇష్టదేవతాస్తుతి (21 ప) పూర్వకవిస్తుతి (21, 22 ప) చెసి, "సత్సభాంతరసరసీ వనంబుల ముదం బొసరం గొనియాడి వెడుకన్" (23 ప.)

"పాయక పాకశాసనికి భారతఘోరరణంబునందు నా
రాయణునట్లు వాసవ ధరామరవంశవిభూషణుండు నా
రాయణ భట్టు వాఙ్మయధురంధరుఁడుం దనకిష్టుఁడున్ సహా
ధ్యాయుఁడు నైనవాఁ డభిమతంబుగఁ దోడయి నిర్వహింపఁగన్." 24 ప

"—నన్నయభట్టు దెనుంగునన్ మహాభారత సంహితారచన బంధురుఁ డయ్యె"ను.

ఇందు వాఙ్మయధురంధురుడు, ఇష్టుడు, సహాధ్యాయుడును అయిన నారాయణభట్టు తోడయి నిర్వహించినట్లు కలదు. రాజరాజనరేంద్రుని నందమపూడి శాసనమునందు నారాయణభట్టు సంస్కృత కర్ణాట ప్రాకృతపైశాచికాంధ్రభాషా కవిరాజశేఖరుడని కలదు ఆ శాసనము నన్నయ కృతమే అయినను "పాయక పాకశాసనికె" అను పద్యము ప్రక్షిప్తమని ఒక అభిప్రాయము కలదు. 41 అందుకు ప్రదర్శించిన ఉపపత్తులివి.

1 ఈ పద్యము కొన్ని తాళపత్రగ్రంథములందు లేదు. ఉన్న తాళపత్ర గ్రంథములందును "సారమతింగవీంద్రులు" అను పద్యమునకు (25 ప.) ముందు లేదు. తర్వాత కలదు. అనన్వితము

11 నన్నయభట్టుతోపాటు నారాయణభట్టును తెలుగు కవులెవ్వరును తమ పూర్వ కవిస్తుతులలో పేర్కొనలేదు.

111 నన్నయ పాటించని నిత్య సమాసయతికి ప్రామాణికతను ఆపాదించుటకు అప్పకవియే ఈ పద్యమును కల్పించెను అప్పకవీయమునకు (1656) పూర్వమందలి తాళపత్ర గ్రంథమునందును (1652) ఈ పద్యము లేదు

అప్పకవీయమునకు పూర్వమందలి ఒక్క తాళపత్రగ్రంథమునందు "పాయక పాకశాసనికి" అను పద్యము లేనంతమాత్రమున తత్పూర్వ మీ పద్యము లేదనుట సంగతము కాదు అప్పకవీయమునకు పూర్వమందలి బహుప్రతులు లభించి, అన్ని ప్రతులందును ఈ పద్యము లేనిచో, తత్పూర్వ మీ పద్యము లేదనుట సంగతము కావచ్చును లభించినది ఒక్క ప్రతి అదే సర్వస్వము కాదు అంతేకాదు అప్పకవి కల్పించెననుటకు కారణమనిన నిత్యసమాసయతిని నన్నయ పాటించలేదనుట ప్రామాదికము నన్నయ పాటించిన నిత్యసమాసయతికి నారాయణ శబ్దమే మఱొక పద్యమునందు కలదు

"—ర్తమణుల్ దుర్వారవాత్యార్తయమున నరనారాయణుల్ దాఁటి రల్కన్—"

22 ప. 2 ఆ. ఆ. ప

ఇది పాఠాంతరగ్రస్తము కాదు నిర్ధారకప్రయోగము మహాస్రగ్ధరపాదము తొమ్మిది, పదాఱు యతిస్థానములు పదాఱవ యతిస్థానమున నారాయణశబ్దము నిత్యసమాసముగానే యతిమైత్రిఘటితము ఇది నన్నయ నిత్యసమాసయతిని పాటించెననుటకు నిర్ధారక సాధనము అసలు నిత్యసమాసయతి అన్నది అప్పకవి సృష్టికాదు అనంతుని ఛందోదర్పణమునందే కలదు అందు నారాయణశబ్దమును కలదు (98, 99 ప. 1 ఆ) కాబట్టి నిత్యసమాసయతికి ప్రామాణికతను ఆపాదించుటకు "పాయక పాకశాసనికి" అను పద్యమును అప్పకవి కల్పించవలసిన ఆవశ్యకము లేదు. అనగా "పాయక పాకశాసనికి" అను పద్యము అప్పకవీయమునకు పూర్వమందలి తాళపత్రగ్రంథములందు కలదని అవగాహనమగును నన్నయభట్టుతోపాటు నారాయణభట్టును తెలుగు కవులెవ్వరును తమ పూర్వకవిస్తుతులందు పేర్కొనక పోవుటకు హేతువు, నన్నయభట్టు తోపాటు నారాయణభట్టు మహాభారత సంహితా రచన చేయకపోవుట మాత్రమే తోడయి నిర్వహించుట అనగా తోడయి రచించుట కానేకాదు "పాయక పాకశాసనికి" అను పద్యము కొన్ని తాళపత్రగ్రంథములందు లేకపోవుటకు, ఉన్న తాళపత్రగ్రంథములందైనను "సారమతిం గవీంద్రులు" అను పద్యము తర్వాత ఉండుటకును హేతువు లేఖకప్రమాదము కావచ్చును లేఖకులు పండితులు కారు. తాళపత్ర గ్రంథముల సంఖ్యాబలమునుబట్టి గాక, ప్రకరణమును బట్టి, పద్యరచనా పద్ధతినిబట్టి, ప్రతిపాదితాంశమునుబట్టి ప్రక్షిప్తమో నిక్షిప్తమో

నిర్ణయింపవచ్చును "పాయక పాకశాసనికి" అను పద్యము, "సారమతింగవీంద్రులు" అను పద్యమునకు ముందు ప్రకరణోచితము పద్యరచనాపద్ధతి నన్నయ రచనాపద్ధతికి అనుగుణము ప్రతిపాదితాంశము నన్నయ మాత్రమే ప్రతిపాదింపఁదగిన అంశము కాఁబట్టి "పాయక పాకశాసనికి" అను పద్యము ప్రక్షిప్తము కాదు నిక్షిప్తమే

"పాయక పాకశాసనికి" అను పద్యమునుబట్టి మహాభారతసంహితారచన నన్నయ, నారాయణభట్టులు కలిసి చేసిరనుట, ఇద్దఱును జంటకవులనుట అసంబద్ధము. "నా నేర్చు విధంబున" అని ముందు, "నన్నయభట్టు తెనుంగునను మహాభారతసంహితారచన బంధురుఁడయ్యె"నని తర్వాత కలవు అంతేకాదు. రాజరాజనరేంద్రుడు రచియింపుమన్నది "నన్నపార్యు"ని "రచియించెద" నన్నది నన్నయ నారాయణభట్టు "తోడయి నిర్వహింపఁగను" నన్నయభట్టు రచన చేసెను "తోడయి నిర్వహించుట" అనగా సహనిర్వహణము. సహరచనము కాదు. రెండును సమానము కాదు సహనిర్వహణము నందును సాదృశ్యము కలదు. మహాభారత సంహితారచనము భారతఘోరరణముగ, నన్నయభట్టునకు నారాయణభట్టు సహనిర్వహణము పాకశాసనికి నారాయణుని సహనిర్వహణముగ సమాన ధర్మము పద్యమునందు స్పష్టముగ కలదు మహాభారత సంహితారచనమును మహాభారత యుద్ధముగ ఉపమించుటలోని ఉద్దేశము ముందు గ్రహింపవలయును. రచనము రణము కాదు. అయినను తెనుగులో మహాభారత సంహితారచనము మహాభారతయుద్ధ సదృశముగ పద్యమునందు కలదు యుద్ధమునకు రెండు పక్షము లుండును. స్వపక్షము. పరపక్షము. తెనుగులో మహాభారత సంహితరచనము స్వపక్షము తత్ప్రతిపక్షము పరపక్షము స్వపక్షమున రాజానుమతము కలదు పరపక్షమున విద్వజ్జనుల అననుమతమునకు అవకాశము కలదు వేదములు అనాదులు, అపౌరుషేయములు, అలేఖ్యములు అని విశ్వసించు ఆనాటి విద్వజ్జనులు, పంచమవేదము పరివర్తనీయము కాదని ప్రతిఘటించుట సహజము అందుకు "విద్వజ్జనంబుల యనుగ్రహంబునం జేసి" అని ముందే నన్నయ జాగరూకత వహించెను. ఆనాటి విద్వజ్జనుల అనుగ్రహమును సంపాదించుటకు చేయవలసిన ప్రయత్నము వాగ్వాదము అనేక వాగ్యుద్ధము. ఏకలక్షశ్లోకపరిమాణకలితమైన వేదవేదాంత వివిధశాస్త్రార్థనిబిడమైన మహాభారత సంహితాపరివర్తనము ప్రయాయుద్ధము అది, ఇది, కలిసి మహాభారత రచనము యుద్ధసదృశము.

నారాయణభట్టు గురించి "తానును ధరామరవంశ విభూషణుడు వాఙ్మయ ధురంధరుడు, తన యిష్టుడు, సహాధ్యాయుడు" అని "పాయక పాకశాసనికి" అను పద్యమునందు కలదు "తానును" అను చోట "వాసస, వాణస, వాసన, వాసిగ" అను పాఠాంతరములు కలవు. అందు "వాసస" నారాయణభట్టు ఇంటిపేరని ఒక అభిప్రాయము కలదు 42 "వాసస" అను ఇంటిపేరు ఉన్నమాట నిజమేగాని, అది నారాయణభట్టు ఇంటిపేరు అనుటకు ప్రమాణాంతరము లేదు అంతే కాదు "తానును" అను పాఠము అర్థరహితము కాదు తానును అనగా తాను కూడ అనగా నారాయణభట్టు కూడ ధరామరవంశవిభూషణుడు నన్నయభట్టువలె నారాయణ భట్టు ఉత్తమ బ్రాహ్మణుడని అర్థము. నారాయణభట్టు వాఙ్మయ ధురంధరుడని పద్యమునందు కలదు సంస్కృత కర్ణాట ప్రాకృత పైశాచికాంధ్ర భాషాకవి రాజ శేఖరుడు, మనీషాలవ దుర్వివగ్ధకవిగర్వ భంజనుడు, కవిభవజ్రాంకుశుడు, సరస్వతీకర్ణావతంసుడు, అష్టాదశావధారణ చక్రవర్తి అని నన్నయయే రచించిన నందమపూడి శాసనము నందు కలదు కవి అని భారతమునందు ఉదు. పండితుడని శాసనమునందు లేదు సహనిర్వాహణమునకు సరిపోవు విశేషణములు భారతము నందు కలవు అగ్రహార ప్రతిగ్రహమునకు ఉపకరించు విశేషణములు శాసనము నందు కలవు ధరామర వంశ విభూషణత్వము, వాఙ్మయ ధురంధరత్వము, తన యిష్టత, సహాధ్యాయత్వము అనగా సంహితాభ్యాసము మహాభారత యుద్ధ సదృశ మైన మహాభారత సంహితా పరివర్తన సందర్భ పండితోద్భుట వివాద యుద్ధమునకు సమర్థములు మహాభారత సంహితా పరివర్తనమును ప్రతిఘటించు ఆనాటి విద్వజ్జను లెల్ల బ్రాహ్మణులు బ్రాహ్మణులతోనే వాదమును వరింతురు పంచమవేద విషయ మున సంహితాభ్యాసులైన సహింతురు పరివర్తనీయమను సిద్ధాంతమును స్థాపించిన వాఙ్మయధురంధరులను శిరసా వహింతురు నన్నయభట్టునకు ఇష్టుడైన నారాయణ భట్టు అభిమతముగ విద్వజ్జన వివాదమునందు తోడయి వాది ప్రతివాదములను నిర్వ హించుట అట్లు చేసిన నన్నయభట్టునకు "విద్వజ్జనంబుల యనుగ్రహంబు" లభించుట అదొక నారాయణభట్టు సహనిర్వహణము

మహాభారత యుద్ధమునకు ముందు అర్జునుడు సమ్మోహస్థితి నందెను. కృష్ణుడు గీతోపదేశము చేసెను. మహాభారత సంహితా రచనమునకు ముందు నన్నయ సందేహస్థితి నందెను. నారాయణభట్టు హితోపదేశము చేయును. మహా భారత యుద్ధమునందు అర్జునుడు భీష్ముని ధాటికి నొచ్చెను కృష్ణుడు చక్రము

గైకొని భీష్మునిపై లంఘించెను అర్జునుడు నివారించెను కృష్ణుడు సంలాపించెను. మహాభారత రచనమునందు నన్నయ వ్యాసఘట్టములకు నొచ్చుచు నారాయణభట్టు గంటము గైకొని వ్యాసఘట్టములపై లంఘించును నన్నయ నివారించును. నారాయణభట్టు సంతోషించును మహాభారత యుద్ధమునందు అర్జునుడు ప్రతిజ్ఞలు చేసెను కృష్ణుడు మాయోపాయముల నెఱవేర్చెను మహాభారత రచనమునందు నన్నయ ప్రతిజ్ఞలు చేయలేదు నారాయణభట్టు మాయోపాయముల నెఱవేర్చలేదు. మహాభారత యుద్ధమునందు అర్జునుడు శస్త్రాస్త్రములకు గుఱి అయ్యెను కృష్ణుడు తప్పించెను మహాభారత రచనమునందు నన్నయ శాస్త్రార్థములకు గుఱి అగును. నారాయణభట్టు తర్కించును మహాభారత యుద్ధమునందు అర్జునుడు యుద్ధము చేసెను కృష్ణుడు సారథ్యము చెసెను. మహాభారత రచనమునందు నన్నయ రచనము చేసెను నారాయణభట్టు సాహాయ్యము చేయును. కృష్ణుడు యుద్ధము చేయలేదు. నారాయణభట్టు రచనము చేయలేదు చేసినదెల్ల వాక్సహాయము ఇదొక నారాయణభట్టు సహనిర్వహణము

నన్నయ ఉభయ భాషా కావ్యరచనాభిశోభితుడు అనగా సంస్కృతాంధ్ర భాషా కావ్యరచనాభిశోభితుడు నారాయణభట్టు కర్ణాటభాషలోను కవిరాజశేఖరుడు కన్నడము వచ్చినట్లు కలదు తమిళము వచ్చినట్లు లేదు నన్నయకు తమిళ కన్నడములు రెండును వచ్చినట్లు లేదు రాజరాజనరేంద్రునికి తమిళము వచ్చును. తమిళ భారతములోని విశేషములు రాజరాజనరేంద్రుడు వలె, కన్నడభారతములోని విశేషములు నారాయణభట్టు నన్నయకు తెలుపును ఇది కూడ నారాయణభట్టు సహ నిర్వహణము

"పాయక పాకశాసనికి" అను పద్యమునకు ముందు పద్యమిది

"పరమ వివేక సౌరభవిభాసిత సద్గుణ పుంజ వారిజో
త్కర రుచిరంబులై సకలగమ్య సుతీర్థములై మహా మనో
హరసుచరిత్ర పావనపయః పరిపూర్ణములైన సత్కథాం
తర సరసీవనంబుల ముదం బొనరం గొనియాడి వేడుకన్"

23 ప1 ఆ. ఆ ప.

ఇందు నన్నయ సత్కథాంతరసరసీవనములను ముదమార వేడుకతో కొని యాడినట్లు కలదు అది కూడ నారాయణభట్టు "తోడయి నిర్వహింపఁగన్" అనుటకు ముందు పద్యమునందు రూపకము కలదు. **సత్కథాంతరము** లనెడు

సరసీవసములు ప్రధాన రూపకము సత్సభాంతరములు పరముగ, సరసీవసములు పరముగ విశేషణములు కలవు సత్సభాంతరములు పరమ వివేక విభాసితములు సరసీవసములు సౌరభ విభాసితములు సత్సభాంతరములు సద్గుణపుంజమంజుల ములు సరసీవసములు మృణాళపుంజ మంజులములు పద్మసమూహ మనోహర ములు సత్సభాంతరములు సకల గమ్యములు సరసీవసములు సుతీర్థములు. సత్సభాంతరములు మహామనోహర సుచరిత్ర పవిత్రములు సరసీవసములు పవిత్ర పయః పరిపూర్ణములు సత్సభాంతరములు పండిత సభాంతరములు సత్‌— శబ్దమునకు సత్పురుషుడనియేగాక పండితుడని కూడ అర్థము "సతాం హి సందేహ పదేషు ప్రమాణ మన్తఃకరణ ప్రవృత్తయః" అను కాళిదాసు ప్రయోగములోని సత్‌—శబ్దము పండితార్థమని పండితార్థము, పిండితార్థమును సరసీవసములు సరో వరవసములు నారాయణభట్టు తోడయి నిర్వహించుటయందు నన్నయభట్టు పరమ వివేకులు, సద్గుణవంతులు, సకలగమ్యులు, మహాసుచరిత్రులు అయిన పండితు లున్న పండిత సభాంతరములను మదువార చెలుకతో కొనియాడుటకు హేతువు, నారాయణభట్టు సహనిర్వహణమున తత్త్వాధ్యక్ష ్యనీయులైన "విద్వజ్జనంబుల యనుగ్రహంబు" నన్నయకు లభించుటయే అగును పరమ వివేకులు కాని, సద్గుణ వంతులు కాని, సకల గమ్యులు కాని, మహాసుచరిత్రులు కాని పండితులు మహా భారత సంహితా పరివర్తనమును ప్రతిఘటించుట, వాఙ్మయ ధురంధరుడైన నారాయణభట్టు తోడయి నిర్వహింపగ నన్నయభట్టు ప్రతిభచేయుట ప్రతీయ మానము ఆ కాలమునందు పండిత సభలు కలవనుటకు "రాజమహేంద్ర కవీంద్ర సమాజ సురత్నాట" అను రాజరాజ నరేంద్రునికి నన్నయ సంబుద్ధి నిదర్శనము. (ఆది ప. ౧ ఆ. ౨ ప.) రాజమహేంద్ర కవీంద్ర సమాజమున రాజమహేంద్రపుర పండిత సభయే కవీంద్రులు పండితులు కాని అ పండితులు కారు. మహాభారత సంహితా పరివర్తన ప్రతిఘటనమును పరిహరించుటకు, మహాభారత సంహితా పరి వర్తన సందేహములను నివారించుటకు చేసిన వాక్సహాయము మాత్రమే నారాయణ భట్టు సహనిర్వహణము వాదోడుగాని చేదోడు కాదు "సకల సుకవిజననినుత నన్నయభట్ట ప్రణీతంబయిన" అనియే ఆశ్వాసాంత గద్యములందు కలదు

# భారతార్థము

"శ్రీమహాభారతంబు నందలి యభిప్రాయంబు విన నాకు నభిలాష పెద్దయై యుండు" నని ఉపక్రమణము చేసిన రాజరాజనరేంద్రుడు "మహాభారతబద్ధనిరూపితార్థమేర్పడఁ దెనుఁగున రచియింపు"మని ఉపసంహారము చేసెను. తదనంతర పద్యము ఫలశ్రుత్యభిప్రాయము. ఉపక్రమోపసంహారము లివి పరస్పరోపబలకములు. అంతేకాదు. "దుర్గమార్థజలగౌరవ భారత భారతీసముద్రముఁ దఱియంగ నీఁదను విధాతృనకైనను నేరఁ డోలునే" అని ఉపక్రమణము చేసిన నన్నయభట్టు "మహాభారత సంహితారచనాబంధురుఁ డయ్యె" నని ఉపసంహారము చేసెను. ఉపక్రమోపసంహారము లివి కూడ పరస్పరోపబలకములు. రాజరాజనరేంద్రుని ఉపక్రమోపసంహారములు, నన్నయభట్టు ఉపక్రమోపసంహారములును పరస్పరానుగుణములు. "శ్రీమహాభారతంబునందలి యభిప్రాయంబు", "భారతబద్ధనిరూపితార్థము", "దుర్గమార్థజలగౌరవభారతభారతి", "మహాభారతసంహిత" ఒక్కటే. అంతేకాదు మహాభారతాభిప్రాయము, మహాభారతబద్ధనిరూపితార్థము: మహాభారతదుర్గమార్థము, మహాభారతసంహితార్థమును ఒక్కటే. అదే భారతార్థము. అది సంస్కృతాంధ్ర భారతములందు అన్యత్ర సవివరముగ కలదు.

వ్యాసుడు తాఁ జేసిన భారతముగుఱించి, బ్రహ్మకు చెప్పిన విషయము సంస్కృతభారతమునందిట్లు కలదు.

"కృతం మయేదం భగవన్ కావ్యం పరమపూజితమ్
బ్రహ్మన్ వేదరహస్యం చ యచ్చాప్యభిహితం మయా ॥ 68శ్లో.
సాంగోపనిషదాం చైవ వేదానాం విస్తరక్రియా
ఇతిహాసపురాణానా మున్మేషం నిర్మితం చ యత్ ॥ 69శ్లో
విధస్య చ ధర్మస్యహ్యాశ్రమాణాం చ లక్షణమ్
చాతుర్వర్ణ్యవిధానం చ పురాణానాం చ కృత్స్నశః ॥ 71శ్లో
ఋచో యజూంషి సామాని వేదాధ్యాత్మం చ కీర్తనమ్
న్యాయశిక్షా చికిత్సా చ జ్ఞానం పాశుపతం తథా ॥ 73శ్లో "(తెనుగులిపి)

వేదరహస్యము, సాంగవేదవేదాంతవిస్తరము, ఋగ్యజుస్సామాధ్యాత్మ తత్త్వము, ఇతిహాసపురాణోన్మేషము, ఆశ్రమలక్షణము, చాతుర్వర్ణ్యవిధానము, వివిధ

ధర్మనిత్యాసము ప్రతిపాదితమైన కావ్యము మహాభారతము ఇట్లు ఆదిపర్వమునందు కలదు అంతిమపర్వమైన స్వర్గారోహణపర్వమునందును వైశంపాయనుడు జనమేజ యునికి భారతముగురించి చెప్పిన విషయ మిట్లు కలదు.

మహత్వా ద్భారవత్వాచ్చ మహాభారత ముచ్యతే
నిరుక్త మస్య యో వేద సర్వపాపైః ప్రముచ్యతే ॥ 43 శ్లో.
ధర్మే చార్థేచ కామేచ మోక్షేచ భరతర్షభ
యదిహాస్తి తదన్యత్ర యన్నేహాస్తి న కుత్రచిత్ ॥ 44 శ్లో.
ఇతిహాసమిమం పుణ్యం మహార్థం వేదసంమితమ్
వ్యాసోక్తం శ్రూయతే యేన కృత్వా బ్రాహ్మణమస్తతః ॥
52 శ్లో 5అ 18ప. (వావిళ్లతెలుగులిపిముద్రణము)

మహాభారవంత మగుటవలన మహాభారతమని వ్యుత్పత్త్యర్థము ఇది తెలిసిన సర్వపాపములు హరించును ధర్మార్థ కామమోక్షముల గురించి ఇందు కలదే ఇతరత్ర కలదు ఇందు లేనిది ఇతరత్ర లేదు. పుణ్యప్రదము, మహార్థవంతము, వేద సమ్మితము, వ్యాసప్రోక్తమును, అయిన ఇతిహాసమిది విన్నవాడు బ్రహ్మజ్ఞాని అగును.

అది నన్నయ భారతమునందు ఇట్లు కలదు.

"కృష్ణద్వైపాయనుండను బ్రహ్మర్షి ......... వేదవ్యాసుండై నిజతపో మహత్త్వంబునంజేసి బ్రహ్మచేత ననుజ్ఞాతుండై యష్టాదశపురాణంబులును ధర్మ శాస్త్రార్థతత్త్వంబులును జతుర్వేదవేదాంతాభిప్రాయంబులును జతుర్వర్గవర్గానుబంధ బంధురకథేతిహాసంబులును జతుర్యుగమహర్షిరాజవంశచరితంబులును జతుర్వర్ణాశ్రమ ధర్మంబులును జతుర్ముఖప్రముఖనిఖిలసురమునిగణపూజితుండైన శ్రీకృష్ణుని మాహా త్మ్యంబును బాండవాదిభారతవీరుల మహాగుణంబులును దన విజ్ఞానమయంబైన వాగ్దర్పణంబునం దేర్పడ వెలుగుచుండ, 30వచ

ధర్మతత్త్వజ్ఞులు ధర్మశాస్త్రంబని
యధ్యాత్మవిదులు వేదాంతమనియు
నీతివిచక్షణుల్ నీతిశాస్త్రంబని
కవివృషభులు మహాకావ్యమనియు

లాక్షణికులు సర్వలక్ష్యసంగ్రహమని
యైతిహాసికు లితిహాస మనియుఁ
బరమ పౌరాణికుల్ బహుపురాణసముచ్చ
యంబని మహిఁ గొనియాడుచుండ
వివిధవేదతత్త్వవేది వేదవ్యాసుఁ
డాదిముని పరాశరాత్మజుండు
విష్ణుసన్నిభుండు, విశ్వజనీనమై
పరఁగుచుండఁ జేసె భారతంబు. 31ప 1ఆ.ఆ.ప.

ఇందు పురాణము, కథ, ఇతిహాసము మాత్రమేగాక, వేదవేదాంతాభిప్రాయము, ధర్మశాస్త్రార్థతత్త్వము, వర్గవర్గానుబంధబంధురత, వర్ణాశ్రమధర్మవిధానము కూడ వాగ్దర్పణమునం దేర్పడ వెలుగుచుండ వేదవ్యాసుడు రచించెనని ఇద మిత్థముగ నన్నయ భావనము కలదు "వాగ్దర్పణమునం దేర్పడ వెలుగుచుండ" రచించిన మహాభారతమునందు వేదవేదాంతాభిప్రాయాదికము ప్రతిఫలించుట తథ్యము కావున ధర్మతత్త్వజ్ఞులు ధర్మశాస్త్రమని, అధ్యాత్మవిదులు వేదాంతమని అందురని నన్నయ వివరణ. వేదవేదాంతాభిప్రాయాదికమే రాజరాజనరేంద్రునికి మహాభీష్టమైన మహాభారతాభిప్రాయము భారతబద్ధనిరూపితార్థము భారతార్థము అందుకు "విధాతృనకైనను నేరఁబోలునే" అని నన్నయ సందేహము మహాభారతము కేవల పురాణము, కేవలకథ, కేవలేతిహాసమును అయిన బ్రహ్మతరమా? అను సందేహమునకు అవకాశములేదు పురాణసరణి, ఇతిహాసధోరణి అయిన భారతకథ అస్థిపంజరము వేదవేదాంతాభిప్రాయాదికమైన భారతార్థము రక్తమాంసల మైన శరీరము ఇది "చతుర్వర్గవర్గానుబంధబంధురకథేతిహాసంబులును" అను పంక్తిని గర్భితము చతుర్వర్గములు ధర్మార్థకామమోక్షములు పురుషార్థములు ధర్మమునకు గమ్యము మోక్షము. అర్థమునకు ఆధారము ధర్మము గమ్యము మోక్షము కామమునకు ఆధారములు ధర్మార్థములు గమ్యము మోక్షము ఇది వర్గానుబంధము అథవా, ధర్మార్థకామమోక్షములకు సంకటములైన అనుబంధములు అరిషడ్వర్గములు కామక్రోధలోభమోహమదమాత్సర్యములు అవి పురుషార్థములైన ఇవి పురుషార్థములు పురుషార్థ పురస్కారము, పురుషార్థపరిహారము బంధురమైన కథేతిహాసముల కలయిక మహాభారతము వేదార్థపురుషార్థముల వరలి భారతార్థము.

"అమితాఖ్యానక శాఖలం బొరిచి వేదార్థామలచ్ఛాయమై
సుమహావర్గచతుష్క పుష్పవితతిన్ శోభిల్లి కృష్ణార్జునో
త్తమనానాగుణకీర్తనార్థ ఫలమై ద్వైపాయనోద్యానజా
త మహాభారతపారిజాత మమరున్ ధాత్రీసురప్రార్థ్యమై 06ప.

ఇట్లు మహాభారతంబు సనేకవిధ పదార్థప్రపంచ సంచితంబు."

06వచ 1ఆ ఆ. ప.

ఇది నన్నయ స్వీయకవిత్వము మహాభారత మనెడి పారిజాతవృక్షము, అనేకములైన ఆఖ్యానక శాఖలను కలిగి, వేదార్థామలచ్ఛాయతో అమరున అంతే కాదు మిక్కిలి గొప్పవైన చతుర్వర్గము లనెడు పుష్పములతో శోభిల్లున కృష్ణార్జునుల ఉత్తమ నానాగుణ కీర్తనార్థము ఫలమై యొప్పును. ఉపరి అనేక విధములైన శబ్దార్థముల విస్తరణముతో కూడినది. అది ధాత్రీసుర ప్రార్థ్యము. కారణము బ్రాహ్మణ మత గ్రంథము.

"సంచితపుణ్యుఁ డంబురుహసంభవు నంశము దాల్చి పుట్టి లో
కాంచితుఁడైనవాఁడు నిఖిలాగమపుంజము నేర్పడన్ విభా
గించి జగంబులందు వెలిఁగించి సమస్త జగద్ధితంబుగాఁ
బంచమ వేదమై పరఁగు భారత సంహితఁ జేసె నున్నతిన్"

47ప. 2ఆ. ఆ. ప.

ఇది కూడ ఇంచుమించు నన్నయ స్వీయకవిత్వము. ఇందు సంస్కృత భారత సంహిత సమస్తజగద్ధితమైన పంచమవేదమని ఇదవిత్థముగ కలదు ఋగ్యజుస్సామాథర్వములు నాలుగు వేదములు. అయిదవ వేదము భారతసంహిత. అసలు సంహిత అను శబ్దమే వేద సంబంధమైనది నాలుగు వేదములలోని మంత్ర భాగములు సంహితలు తన్మంత్రభాగ సదృశమైనచో, కనీసము సారగ్రహణమైనచో భారతము సంహిత అగును అయినందున పంచమవేదమై పరగును వేదములు స్త్రీలు, శూద్రులు వినరాదు కనరాదు కాని స్త్రీలు, శూద్రులు కూడ వేదవిహితమైన చాతుర్వర్ణ్యములోని వారే కావున వేదార్థము తెలిసికొనవలయును. సంహితార్థముతో బ్రాహ్మణములు బ్రాహ్మణార్థము కలదుగావున భారతసంహిత పంచమవేదము భారతసంహిత అనినను, పంచమవేదమనినను వేదార్థము గతార్థమే చతుర్వేద సారము కావున భారతసంహిత పంచమవేదము. భారతార్థము వేదార్థము.

మహాభారతము "అనేకవిధ పదార్థ ప్రపంచ సంచితంబు." అను నన్నయ భట్టు వచనము," అదరణీయ సారవివిధార్థగతి స్ఫురణంబు గల్గి" (6ప 1ఆ వి ప) అను తిక్కన సోమయాజి పద్య పంక్తిని పరిఢవిల్లినది. అంతేకాదు

"వ్యాసమునీంద్రసార కరుణాతిశయంబున భారతార్థము
ద్భాసితమైన యట్టి సుతభాగ్యునకున్ సకలాగమార్థసం
వాసన మావహిల్లు జనపంక్తులు గీర్తన సేయ శశ్వదు
ల్లాసముఖాన భూతి నచలస్థితి నొప్పనతం డదాత్తుడై" (2ప స్వ ప.

అని తిక్కన తుది తీర్పు అది, ఇది, గ్రహించిన ఎఱ్ఱాప్రెగడ ఆచరించినది—

"భాసురభారతార్థముల భంగుల నిక్కము మెఱుంగ నేరమిన్
గాసట బీసటే చదివి గాథలు ద్రవ్వ లెనంగు వారికిన్
వ్యాసమునిప్రణీతపరమార్థము తెల్లగ జేసినట్టి య
భ్యాసకల్పులం దలంతు నాద్యుల నన్నయ తిక్కనార్యులన్"

9ప. న్ర పు.

వ్యాసమునీంద్రుని సారకరుణాతిశయమున భారతార్థము ఉద్భాసితమైన సుతభాగ్యునకు సకలాగమార్థసంవాసన మావహిల్లునని తిక్కన భాసురభారతార్థముల భంగుల నిక్కము వ్యాసమునిప్రణీతపరమార్థమని ఎఱ్ఱన. సకలాగమములన చతుర్వేదములు సకలాగమార్థసంవాసనమన చతుర్వేదార్థ సంస్కారము ఉద్భాసితమైన భారతార్థము వ్యాసమునిప్రణీతపరమార్థమైన భాసుర భారతార్థముల భంగుల నిక్కము సంస్కృత భారతమును. గాసట బీసటే చదివి గాథలు త్రవ్వుట భారత కథా కాలక్షేపము లెనుగు భారతమును సరిగా చదివిన భారతార్థ ముద్భాసితమగును అది కాలక్షేపము కాదు మోక్ష నిక్షేపము. ఇహపరసాధకము.

భారతార్థమునకు ప్రాధాన్యము లేనిచో, భారతకథ కేవలము యుద్ధకథ అగును అది కూడ దాయాదకలహదావానలమైన యుద్ధకథ రాజ్యాధికారము కొఱకైన యుద్ధకథ రాజ్యాధికారము కొఱకు స్వయముగ దాయాదకలహ దావానలమున అనేక పర్యాయములు చిక్కుకొని అనుభవించిన రాజరాజనరేంద్రునికి భారత యుద్ధకథను బహుభాషల బహువిధముల బహుజనములవలన బహుపర్యాయముల్లు వినుటకు అభిలాష కలుగదు విముఖతయే కలుగును. కాబట్టి భారతార్థమే రాజరాజనరేంద్రుని కాంక్షితార్థము నన్నయభట్టు లక్షితార్థము.

# భారతాంధ్రీకరణము

మహాభారతము మహేతిహాసము అంతేకాదు మహాకావ్యము ఇతిహాసము చరిత్రాత్మకము కావ్యము రసాత్మకము చరిత్ర విషయ ప్రధానము రసము అనుభూతి ప్రధానము విషయప్రధానమైన ఒక భాషలోని గ్రంథమును మఱొక భాషలోనికి మార్చిన అట్లే ఉండవలయును విషయమునకు హాని కలుగరాదు. అది యథా మూలకము అనుభూతి ప్రధానమైన ఒక భాషలోని గ్రంథమును మఱొక భాషలోనికి మార్చిన అట్లే ఉండనక్కఱలేదు అనుభూతికి గ్లాని కలుగ రాదు అది మూల విధేయము యథామూలకమైనది అనువాదము. అనుసృష్టి. మూలవిధేయమైనది భాషాంతరీకరణము పునస్సృష్టి ఆంధ్రభాషాంతరీకరణము ఆంధ్రీకరణము అనువాదమునందు కర్త అస్వతంత్రుడు ఆంధ్రీకరణమునందు కర్త స్వతంత్రుడు స్వతంత్రా స్వతంత్రుడును కాఁబట్టి ఆంధ్రీకరణము త్రివిధము [43] 1 స్వతంత్ర పద్ధతి 2 స్వతంత్రా స్వతంత్ర పద్ధతి 3. అస్వతంత్రపద్ధతి స్వతంత్ర పద్ధతియందు మూలమున శబ్దము, అర్థము, అంశము మూడను కలిసి నిర్వర్తించు మొత్తము పని అనుసరణమునందు గుత్తగొనవలయును. ప్రతిశబ్దము, ప్రతిభావము, ప్రతి కథాంశమును అనుసరణమునకు అలంకరణము కానక్కఱలేదు. మార్పులు, చేర్పులు, కూర్పులు, నేర్పులు ఆంధ్రీకర్త అభీష్టము అనుభూతినిష్ఠము ఇది మాతా పుత్త్రికానుబంధము అస్వతంత్రపద్ధతియందు మూలమున శబ్దము, అర్థము, అంశము మూడును కలిసి నిర్వర్తించు మొత్తము పని కాక, మూడును అనుసరణమునందు హత్తుకొనవలయును ప్రతి శబ్దము, ప్రతిభావము, ప్రతి కథాంశమును అనుసరణమునకు అలంకరణము కావలయును మార్పులు, చేర్పులు, కూర్పులు, నేర్పులు ఆంధ్రీకర్త అభీష్టము కాదు ప్రతిబింబప్రాయము నన్నయ భారతాంధ్రీకరణము స్వతంత్ర పద్ధతి. శ్రీనాథుని నైషధాంధ్రీకరణము స్వతంత్రాస్వతంత్ర పద్ధతి ఏనుగు లక్ష్మణకవి సుభాషితాంధ్రీకరణము అస్వతంత్ర పద్ధతి. అస్వతంత్రమైనను అత్యంత సమర్థము. అస్వతంత్ర పద్ధతి అన్యత్ర అసమర్థము. ఆధునిక నాటకాంధ్రీకరణము లిందుకు ప్రబలనిదర్శనములు.

నన్నయ స్వతంత్రాంధ్రీకరణ పద్ధతిని 1. ప్రపంచీకరణము 2. క్లుప్తీకరణము 3 అస్పృధాకరణము 4. అనాంధ్రీకరణము 5 అన్యాంధ్రీకరణము 6 బ్రహ్మణమత ప్రబోధము అని వర్గీకరింపవచ్చును

**1. ప్రపంచీకరణము :-** మూలమునందు సూచన ప్రాయముగా ఉన్న అంశమును సందర్భమున బట్టి రసోచితముగ ప్రపంచించి రచించుట ప్రపంచీకరణము. ఇందు మూలశ్లోకములు ముకుళములైన ఆంధ్రీకృతపద్య గద్యములు ప్రఫుల్ల కుసుమములగును. మూలమునకు మెఱుగు పెట్టినట్లగును. ఆంధ్రీకర్త ప్రతిభ అభివ్యక్తమగును

"[ఏకాకీ చిన్తయామాస కిం కృత్వా సుకృతం భవేత్]
గూహమానాపచారం తం బన్ధుపక్షభయాత్తదా
ఉత్ససర్జ జలే కున్తీ తం కుమారం సలక్షణమ్ 13 శ్లో. 104అ ఆ.ప

ఇది కర్ణజనన వృత్తాంతములోని తుది ఘట్టము [44]కన్యయైన కుంతికి కర్ణుడు జన్మించెను జరిగిన అపచారమును కుంతి గ్రహించినది బంధువులు నిందింతురను భయముతో తొందఱపడినది "ఏమి చేసిన సుకృతము కలుగును?" అని చింతించి, మహాబలుడైన కుమారుని ఆ నీటిలో విడిచి పెట్టెను అని మాత్రమే మూలమునందు కలదు. ఇందు జరిగిన విపరీత సంఘటనకు సహజమైన కుంతి మనోవితర్కములేదు. ఎంత కన్యయైనను కన్న తర్వాత కన్నతల్లియే కన్నకుమారుని నీటిలో విడిచి పెట్టుటకు మాతృహృదయమునకు సమ్మతము కాదు అంతకంటె గత్యంతరమును లేదు అందుకు కుంతి మనఃక్లేశమును లేదు అంలేకాదు. సందర్భము కరుణరస విషయము రసనిర్భరము కాలేదు రసనిర్భరముగ మానవ సహజ మనోవితర్కము మాతృహృదయదోలాందోళనము కలిసివచ్చునట్లు నన్నయ కావించిన ప్రపంచీకరణమిది

"కొడుకుంజూచి కుంతి దద్దయు విస్మయంబంది యెద్దియుం జేయునదినేరక, (27 వచ)

ఏల యమ్ముని నాకు నిచ్చె నిమ్మంత్ర మిమ్మంత్రశక్తి యే నెఱుఁగంగవేఁడి
యేల పుత్త్రికుఁ గోరి యెంతయు భక్తి నినుఁ దలంచితిఁ బ్రీతి నినుఁడును నాకు
నేల సద్యోగర్భమిచ్చెఁ గుమారుఁ డేల యప్పుడు యుదయించె నింకెట్టు
లీ లోక పరివాద మే నుడిగింతు నింతకు నింతయు నెఱుఁగరె జనులు. 28ప.

ఈ బాలు నెత్తికొని యిందికిఁ జన్న నన్నున్
నా బంధులందఱు మనంబున నేమి నారె
ట్లీ బాలు సూర్యనిభు నిట్టుల డించి పోవం
గా బుద్ధి పుట్టునని కన్య మనంబులోనన్ 29 ప.

వందురి వగచుచున్న దాని పుణ్యంబున నాదిత్య ప్రేరితంబయి
యనర్ఘరత్నవసుభరితంబయిన యొక్క మందస నదీ
ప్రవాహ వేగంబున దనయొద్దకు వచ్చిన దానిలోఁ జెచ్చెఱఁ
దన కొడుకుం బెట్టి కుంతి నిజగృహంబునకు వచ్చె 30వచ ౕఆ ఆ. ప.

ఇందు కుంతి విస్మయము, అసహాయస్థితి, అనూహ్య పరిణామము, మానవ సహజ మనోవితర్కము, మాతృహృదయడోలాందోళనము, దుఃఖాతిశయము మూల సువర్ణ కళికలు పుటము పెట్టినట్లు స్ఫుటములై కరుణరసము కళ ఉట్టిపడి నది

"క్వ ను సా క్షుత్పిపాసార్తా శ్రాన్తా శేతే తపస్వినీ
స్మరన్తీ తస్య మన్దస్య కం వా సాఽద్యోపతిష్ఠతి"
10 శ్లో 64 అ ఆర. ప.

ఇది నలోపాఖ్యానములోని ఒక సంఘటన నలుడు ఋతుపర్ణుని యొద్ద అశ్వాధ్యక్షుడ గాను, సూపాధ్యక్షుడ గాను, వార్ష్ణేయ, జీవలులు సహాయులుగా ఉన్నపుడు ప్రతిసాయంకాలము — "ఆకలిదప్పులకు అలమట చెందిన ఆమె ఎట్లున్నదో? — నిద్రించినప్పుడు తన్ను విడిచిపెట్టిన మందభాగ్యుని ఏమని తలంచునో? — ఆమె ఇప్పుడెక్కడ న్నదో? — అని పైకి అన చుండెడివాడని మూలమునందు కలదు. ఇందు నలుని దమయంతీ విచారము రేఖామాత్రముగ కలదు. అంతే కాదు. నలుని దమయంతీ విరహార్తి స్ఫూర్తి మరిచుగ లేదు ఇది కూడ కరుణరస విషయము. రసనిర్భరముగ లేదు. కావున నన్నయ కావించిన ప్రపంచీకరణమిది

"ఇభరాజగమన నీ వెందుల కరిగి త
త్కృశ కుచాభోగ యెందున్నదాన
వఖల యెవ్వరిచేత నడవులలోఁ బట్టు
వడి తళనాపేక్షఁ బఱచుచున్న

యు(గమృగంబుల యుదరంబులో నున్న
దానవే నీ తలిదం(డు లొద్ద
ధృతి నున్న దానవే దేశాంతరంబుల
నున్న దానవె యంచు నుదితమదన
హతి విమోహితాత్ము(డై హృదయేశ్వరిఁ
దలఁచి రా(తులెల్లఁ దాపమునను
ని(దలేక వంది నిట్టూర్పు లూర్చుచు
నుండె నలుఁడు శోక ముత్కటముగ " 133 ప 2ఆ ఆర ప

దమయంతి ని(దించువేళ దారుణమైన అడవిలో విడిచిపెట్టి వచ్చిన నలుడు- ఆమె ఇభరాజగమన అనగా మందగమన అందువలన అడవి మధ్య నుండి అరుగ లేదు; అయినను ఎందుల కరిగెనో అని, ఆమె అత్యురుకు చాభ్గ అందువలన ఎందున్నను (ప్రమాదమే, అయినను ఎందున్నదో అని, ఆమె అబల అందువలన అడవులలో ఎవ్వరికైన పట్టువడినదో, ఆకలిగొన్న (క్రూర జంతువులకు ఆహారమై నదో అని, తలిదం(డుల చెంతకు ధైర్యము వహించి చేరినదో, దేశాంతరముల పాలైనదో అని వాపోటయేగాక, మన్మథబాధకు తాళరేక, తాపమునంది, రా(తులు ని(దపట్టక, నిట్టూర్పులు విడుచుచు మహాదుఃఖముతో (క్రుందుచున్నట్లు (ప్రపంచీ కరించి రచించుటవలన కరుణరసము పుటపాక (ప్రతీకాశమైనది

**2. క్లుప్తీకరణము :-** మూలమునందు విస్తృతముగ ఉన్న విషయమును (ప్రయోజనమును బట్టి కథోచితముగ క్లుప్తీకరించి రచించుట క్లుప్తీకరణము ఇందు మూలశ్లోకములు మబ్బులగములైన ఆం(ధీకృత పద్య గద్యములు మెఱపుఁదీగ లగును మూలమునకు తఱుగు పెట్టినట్లు కాదు తఱిమెఱ పట్టినట్లగును ఆం(ధీకర్త నైపుణి అభివ్యక్తమగును.

దుశ్శల జన్మవృత్తాంతము మూలమునందు (ప్రత్యేక మొక అధ్యాయము కలదు [45] ఆమె ధృతరాష్ట్రుని తనయ అదే ఘనత ధృతరాష్ట్రునికే లాభము. భారత కథకు లాభనష్టములు రెంటను లేవు ఆమె భర్త సైంధవుడు నిర్వహించిన నీచకార్యములు కలవుగాని, ఆమె నిర్వహించిన రాచకార్యములేదు ఆమె భర్త కాక పోయినను సైంధవుడు ఆ నీచకార్యములు నిర్వహించఁగలడు (ప్రయోజనము లేని దుశ్శల జన్మవృత్తాంతమునకు (ప్రత్యేక మొక అధ్యాయము వ్యర్థవ్యయము కావున నన్నయ కావించిన క్లుప్తీకరణమిది.

"ఆ తనూజుల కందఱు కనుఁడయ్యె ల
రాంగి మశ్కల యను కూఁతు రమరఁబుట్టె
నంపు దౌహిత్ర వంశులదైన పుణ్య
గతియుఁ గాంచు నేననీ పొంగెఁ గౌరవుండు" 10 ప 5 ఆ ఆ ప.

ఇందు మశ్కల జననము గ్రంథస్థమయినది అంతేకాదు ధృతరాష్ట్రుని పుణ్యగతి ప్రతిపాదము సువ్యక్తమయినది ఇది మశ్కల జన్మకు ధన్యత ధృతరాష్ట్రుని ప్రతిఘ పునస్తత్త్వమునను మచ్చునుక

కృష్ణుడు "ఒక్క సధ ధాత్రి కపూర్వముగా నొసఁగ్చి చెచ్చెరఁ గొని రమ్మ" నిన మయుడు సమ్మతించి అరిగిన తదుపరి, కృష్ణుడు ద్వారవతికి బయలుదేరుట ప్రత్యేక మొక అధ్యాయము కలదు (2 అ స ప.) ఇచట కృష్ణుని నిష్క్రమణము నకు ప్రత్యేక విశేషమేమియును లేదు అంతేకాదు రాజసూయయాగానంతరము మరల ఇంద్రప్రస్థమునుండి కృష్ణుడు ద్వారవతికి బయలుదేరును అచట ప్రత్యేక విశేషము కలదు. అచట, ఇచట అదే వర్ణించుట పునరుక్తభూతమగును కావున నన్నయ కావించిన క్లుప్తీకరణమిది.

"అంత నారాయణుండును పాండవుల వీడ్కొని పితృదర్శన
లాలసుండై ద్వారవతీపురంబున కరిగె" 8 వచ 1 ఆ స ప.

ఒక్క వాక్యమున ఒక్క అధ్యాయము ఒదిగిపోయినది కృష్ణుడు నిష్క్రమించు నపుడెల్ల పాండవులు నివ్వాళిపట్టట సహజము సముచితము. నివ్వాళి పట్టు నపుడెల్ల వర్ణించుట అనవసరము అనుచితము

**3. అన్యథాకరణము :** మూలమునందున్న విషయమును అన్యథా కల్పించి అనగా మార్చివైచి రచించుట అన్యథాకరణము మూలశ్లోకములు యథార్థము లైన, అన్యథాకరించిన పద్యగద్యములు కల్పితములగును. అవి మూలమునకు మెఱుగు పెట్టవచ్చును, తఱుగు పెట్టవచ్చును మెఱుగు పెట్టిన ఆంధ్రీకర్త ఉపజ్ఞ, తఱుగు పెట్టిన ఆంధ్రీకర్త యశేచ్ఛ అభివ్యక్తమగును.

"దృష్ట్వా తు సూతం ద్రౌపదీ వాక్య
ముచ్చై ర్జగాద నాహం వరయామి సూతమ్. 22 శ్లో.
సామర్షహాసః ప్రసమీక్ష్య సూర్యం
తత్యాజ కర్ణః స్ఫురితం ధనుస్తత్" 23 శ్లో 187 అ 1 ప.
(వావిళ్ల తెలుగు లిపి ముద్రణము)

ఇవి మత్స్యయంత్రఘట్టములోని శ్లోకములు. ఇందు విహాయసవీథిలోని మత్స్యయంత్రములోని మత్స్యమును గుఱి చూచి విల్లు మోపెట్టి బాణము నేయుటకు కర్ణుడు లేవగానే, ద్రౌపది చూచి నేను సూతుని వరింపనని గట్టిగా అఱచిన సక్రోధ హాసముతో సూర్యుని అదేపనిగ చూచి, కర్ణుడు ఎక్కుపెట్టిన ధనుస్సును పాఱవైచె నని కలదు ఇందు ద్రౌపది నిండుసభలో కర్ణుని సూతుడని పరాభవించినది మందు కర్ణుడు నిండుసభలో ద్రౌపదిని బంధకి అని పరాభవించును అది ప్రతీకారము. అకారణముగ పరాభవించుటకు, సకారణముగ పరాభవించుటకు అంతరము కలదు కర్ణుడు ద్రౌపదిని నిండుసభలో పరాభవించుట దోషమైన, ద్రౌపది కర్ణుని నిండు సభలో పరాభవించుటయు దోషమే అగును అంతేకాదు. కర్ణుడు మత్స్యయంత్ర మును పడగొట్టినచో, అతడు సూతుడైనను సూర్యసుతుడైనను ద్రౌపది వివాహమాడ వలయును. సూతుడు అనర్హుడైన ఆమాట చెప్పవలసినది ద్రౌపది కాదు ద్రుపదుడు ధృష్టద్యుమ్నుడును పణమునకు సిద్ధపడిన స్వయంవరవధూటి పలుకుట ఆమె దురహంకారమునకు మూదల ఇది ద్రౌపది శీలమునకు కళంకము తెచ్చునది కావున నన్నయ కావించిన అన్యథాకరణమిది .

> "అంత శిశుపాలజరాసంధశల్యకర్ణులు దర్పితులై తమ తమ
> లావులు మెఱసి క్రమంబున నలువురు చాపయమమున్దరోపు మాత్రం
> బులు దక్క గొనయం బెక్కించియు మోపెట్ట నశక్యంబయిన నుక్కు
> సెడివెక్కిన——" 178 వచ 7 ఆ ఆ ప.

ఇందు ద్రౌపది నోరెత్తలేదు కర్ణునికి స్థానము శిశుపాల జరాసంధుల సన్నిధిని లభించినది శిశుపాలుడు మినపగింజవాసిలోను, జరాసంధుడు గోధుమ గింజవాసిలోను, కర్ణుడు పెసరగింజవాసిలోను, శల్యుడు వెంద్రుకవాసిలోను తప్ప విల్లు మోపెట్టలేకపోయిరని, శక్తి చెడి సేడ్చిరని కలదు ఇది కర్ణుని ఔత్కృష్ట్యమును కప్పిపుచ్చునది ద్రౌపదిని నిండుసభలో పరాభవించుట నిర్నిమిత్తమయి దోష దూషితుని చేయునది కర్ణుని శీలమునకు కళంకమును ఆపాదించునది మూలమునకు మెఱుగుపెట్టునది కాదు తఱుగుపెట్టునది మాత్రమే కాని సంశోధితముద్రణము సంపదించును. (4, 5 శ్లో 179 అ.)

· నలోపాఖ్యానమునందు విరాతుడు మృతుడైన అనంతరము సుదీర్ఘమైన అరణ్య వర్ణనము మూలమునందు కలదు అంతేకాదు నలపర్ణనము చేయుచు

దమయంతి అరణ్యమునందు తిరుగుచు ఎదురైన పెద్దపులిని, పెద్దకొండను నలుని గురించి అడుగును. నగవర్ణనము తోపాటు నలవర్ణనము సుదీర్ఘముగ కలదు. అదియెల్ల పరిహరించి, నగవర్ణనములోని "చంపకాశోకవకుళపున్నాగై రుప శోభితమ్" అను పంక్తి (8 శ్లో, 61 అ ఆర ప) నిమిత్తమాత్రముగనున్నయ కావించిన అన్యథాకరణమిది

"సహకార! మత్ప్రియసహకారుఁ బున్నాగ!
పున్నాగుఁ దిలక! భూమివసతిలకుఁ
జంపక! బుధహరిచంపకుఁ బుష్పితా
శోక! సుహృజ్జనశోకదమను
వకుళ! కులైకదీపకు నిధితక! ధర్మో
పేతార్తిహరు నలుఁ బ్రీతితోడఁ
గానరె కాననలోన లోకోత్తము
నని ప్రాని ప్రానికి నరిగి యరిగి
యడుగు నడుగు లెండఁ బొడవొడఁ బొక్కిన
నిర్ఝరాంతరముల నిలుచుఁ గొలుచు
గిరుల దరుల యెడల గురుగుహాగృహములఁ
దొంగి తొంగి చూచుఁ దోయజాక్షి" ౪౦ ప 2 ఆ ఆ. ప.

ఇందు దమయంతి నలుని గురించి వృక్షములనే అడిగినది. అడుగుటలోను వృక్షవిశేషమును నలవిశేషణము చేసినది. నామసదృశగుణము సానుభూతి కలిగించునని ఆశ. ఆశయము లోకోత్తరుడైన నలుని కానరే అని కానలలో ప్రాని ప్రానికి అరిగి అరిగి మరియు అడిగినది. అడుగు లెండకు పొక్కి బొబ్బలెక్కిన సెలయేటి నీట నిలిచినది. పొలిచినది కొండలు, గుహలు, పెద్ద పెద్ద గుహాంతర్భాగములు తొంగి తొంగి చూచినది. అది సహజము. దమయంతి అవస్థ దయనీయముగ కలదు. పద్యమునందు అర్థసౌష్ఠవము తోపాటు ఇంచుక శబ్ద చమత్కారము కలదు. హృద్యమైన పద్యము పోతన భాగవతమునందు పోత పోసినది. ఇది మూలమునకు మెఱుగులు తుబగించునది

**4. అనాంధ్రీకరణము :** మూలమునందున్న విషయమును ఆంధ్రీకరించకపోవుట అనాంధ్రీకరణము. అసభ్యము, అశ్లీలము, అనుచితము మొదలైన అంశము లనేకములు ఆంధ్రీకరింపలేదు. ఇందు ఆంధ్రీకర్త వివేకము అభివ్యక్తమగును.

"వజ్రస్య భర్తా భువనస్య గోప్తా
వృత్రస్య హన్తా నముచే ర్నిహన్తా
కృష్ణో౽వసానో వసనే మహాత్మా
సత్యానృతే యో వివినక్తి లోకే 152 శ్లో.

యోవాజినమ్ గర్భ మపాం పురాణం
వైశ్వానరం వాహన మభ్యుపేతః
నమః సదాస్మై జగదీశ్వరాయ
లోకత్రయేశాయ పురన్దరాయ." 153 శ్లో. 36 అ. ఆ. ప.

ఇది ఉదంకుడు నాగలోకమున కనిపించిన పురుషుని స్తుతించిన ఘట్టము. వైదిక మంత్ర విషయము వైదిక మంత్రములు సంస్కృతమునందే ఉండవలయునని, భాషాంతరీకరింపరాదని సంప్రదాయము. అందువలన నన్నయ ఆంధ్రీకరింప లేదు.

"ఒక్క దివ్యపురుషునిం గని విపులార్థవంతంబులైన మంత్రంబుల
నతిభక్తియుక్తుండై స్తుతియించిన" 108 వ. 1 ఆ. ఆ. ప.

అని మాత్రమే సూచించెను.

"కస్యచి త్త్వథ కాలస్య సురాణా మశ్వినౌ నృప
కృతాభిషేకాం వివృతాం సుకన్యాం తా మపశ్యతామ్."
1 శ్లో. 123 అ అర ప.

ఇది సౌకన్యాఖ్యానములోని శ్లోకము ఇందు అశ్వినీదేవతలు, స్నానము చేసి నగ్నముగా ఉన్న సుకన్యను చూచిరని కలదు అశ్లీలము. నన్నయ ఆంధ్రీకరింపలేదు.

"పతికిఁ బరమభక్తిఁ బరిచర్య సేయుచు
నొనరఁగా సుకన్య యుండునంత
నా లతాంగికడకు నాశ్వను లేతెంచి
తమ్మెఱుంగఁ జెప్పి దాని కనిరి" 183 వ. 3 ఆ. ఆర. వ

ఇందు స్నానము చేసి నగ్నముగా ఉన్నప్పుడని కాక, పతికి పరమభక్తి పరిచర్య చేయుచున్నప్పుడు సుకన్యయొద్దకు అశ్వినులు వచ్చిరని సుశీలముగ కలదు.

**5. అన్యాంధ్రీకరణము :** మూలమునందలి శ్లోకములుగాక, అన్య కావ్యములందలి సదృశమైన సన్నివేశములందలి శ్లోకములను ఆంధ్రీకరించుట అన్యాంధ్రీకరణము మూలమునందు శ్లోకములు ఉన్నను, లేకపోయినను అన్య శ్లోకముల ఆంధ్రీకృత పద్యగద్యములు సందర్భోచితములగుచు ఆంధ్రీకర్త బహు ముఖ ప్రజ్ఞ అభివ్యక్తమగును.

"అశోకనిర్భర్త్సిత పద్మరాగ మాకృష్టహేమద్యుతి కర్ణికారమ్
ముక్తాకలాపీకృతసిన్దువారం వసన్తపుష్పాభరణం వహన్తీ."

53 శ్లో. 3 స

ఇది కాళిదాసు కుమారసంభవములోని శ్లోకము పరమతపోనిమగ్నుడైన పరమేశ్వరుని పరమదృఢమైన మనస్సును, సపర్యలు చేయుచున్న పార్వతి యెడల ప్రసరించునట్లు చేయుటకు రతిద్వితీయుడు, వసంతసమేతుడునైన మన్మథుడు పొంచియుండ, అకాలవసంతోదయమును తటస్థోద్దీపనవిభావముగా వర్ణించి, పార్వతి సౌందర్యము సహజోద్దీపన విభావముగా వర్ణించిన శ్లోకమిది పద్మరాగములను పరిహసించు అశోకపుష్పములు, సువర్ణకాంతిని చూఱగొన్న కర్ణికారసుమములును, ముత్యాల హారముగా చేసిన సిందువారకుసుమములు మొదలైన వసంత పుష్పములు ఆభరణములుగా ధరించి పార్వతి పరమేశ్వరుని సమీపించినది పార్వతి సహజ సౌందర్యమునకు ప్రకృతి సహజమైన పుష్పసౌందర్యము తోడైనది. అది పరమ తపస్వి అయిన పరమేశ్వరుని హృదయమున శృంగారసాత్త్విక భావోదయ మగుటకు సమర్థము పరమతపోనిమగ్నుడైన పరమేశ్వరునికి మనోవికార మెంత దుర్ఘటమో, శాపభయవిహ్వలుడైన పాండురాజునకును మనోవికారమంత దుర్ఘటము, అందుచే మూలమునందున్న పట్టికాప్రాయమైన వసంతర్తువర్ణనమును వదిలి. "కమ్మనిలతాంతమ్ములకు మ్మొనసి వచ్చు", "చందనతమాలలతలందు" అను పద్యముల (138, 139 ప 5 ఆ. ఆ ప.) సన్నయ "సర్వభూత సమ్మోహనం బయిన వసంతసమయం"ను తటస్థోద్దీపన విభావముగా వర్ణించి, మాద్రి సౌందర్య మును సహజోద్దీపన విభావముగా సంతరించుటకు కాళిదాసు శ్లోకమును ఆంధ్రీ కరించెను ఆ పద్యమిది.

"చారుసువర్ణహాసినవచంపకభూషయు సిందువారము
క్తారమణీయముక్తవకుళదామవతంసయునై యపూర్వశృం
గారవిలాసలీల యెసఁగం దన ముందట నున్న మాద్రి నం
భోరుహనేత్రఁ జూచి కురుపుంగవుఁ డంగజరాగమత్తుఁడై"

141 ప. 5 ఆ. ఆ ప.

ఇందు ముక్తాకలాపీకృతసిందువారము, సిందువారముక్తా రమణీయమైనది. సువర్ణకాంతిని చూఱగొన్న కర్ణికారములకు మాఱు సువర్ణకాంతి ప్రకాసించు క్రొత్త సంపెంగలు, కాళిదాసు శ్లోకమునందు లేని పొగడపువ్వుల దండ నన్నయ పద్యమునందు కలవు కర్ణికారములకు సువర్ణమే కాని సుగంధము లేదు "వర్ణ ప్రకర్షే సతి కర్ణికారం ధునోతి నిర్గంధతయాస్మ చేతః" అని కాళిదాసు ఉపవర్ణనమే. (28 శ్లో. 3 స. కు. సం) సంపెగలు, పొగడలు సుగంధబంధురములు మత్తె క్కించు సువాసనల తెలుగు పువ్వులు. పాండురాజునకు మత్తెక్కవలయును. మత్తెక్కిన గాని శాపభయము మఱపునకు రాదు. "అంగజరాగమత్తుఁడై" అని పద్యమునందు కలదు అంతేకాదు మాద్రి అపూర్వశృంగార విలాసలీల తొణికిస లాడ ముందట నున్నది. పాండురాజు కురుపుంగవుడు పుంగవశబ్దము శ్రేష్ఠవాచి. వ్యుత్పత్త్యర్థము ఆబోతు ఆలంబనవిభావములు, ఉద్దీపనవిభావములు కలిసి రాగరసమును రంగరించెను అది ప్రకరణమునకు ఆవశ్యకము ఇది నన్నయ అన్యాంధ్రీకరణమునకు ఆణిముత్యము

కణ్వమహాముని ఆశ్రమవర్ణనము మూలమునందు కలదు సుప్రహృష్ట విహంగమము, నానావృక్షసమాకీర్ణము, సంప్రజ్వలితపావకము, మునిగణాన్వితము, బహుపుష్పాలంకృతాగ్ని హోత్రగృహ సముదాయసమేతము, మహాకచ్ఛవిరాజితము, సుఖోదకప్రదమాలినీనదీమండితము, నైకపక్షిగణాకీర్ణము, మనోహరము అని కలదు (15–19 శ్లో 63 అ ఆ. ప. తెలుగులిపి ముద్రణము) పట్టికా ప్రాయమైన వర్ణనమిది కూడ పరిత్యజించి, మురారిశ్లోకముకుళమును పుణికి పుచ్చుకొని నన్నయ ప్రతిభాదోహద ప్రక్రియను బహూకరించిన ప్రఫుల్లపుష్పగుచ్ఛము అన్యాంధ్రీ కరణము.

"వనగజముఖోద్గీర్ణై రాప్యై రపి త్రసరేణుభిః
శిశిరమసృణా మేణాః కచ్ఛస్థలీ మధిశేరతే."

ఇది భట్టమురారి అనర్ఘరాఘవములోని శ్లోకము ఇందు అడవి ఏనుగుల తుండములు వెదఁజల్లిన నీటితుంపురులచేత చల్లనైన, మెత్తనైన ఒడ్డులందు లేళ్లు శయనించినవని కలదు.

"శ్రవణసుఖంబుగా సామగానంబులు
చదివెడు శుకముల చదువు పగిలి
కవలక వినుచుండు కపులును గరికర
శీతలచ్ఛాయఁ బచ్చికరాంబు

కఱకుల చల్లని గాడ్పాసపడి వానిఁ
జెంది సుఖంబున్న సింహములును
భూసురప్రవరులు భూతబలుల్ దెచ్చి
పెట్టు నీవారాన్న పిండతతులు
గడఁగి భక్షింప నొక్కటిఁ గలసియాడు
చున్న యెలుకలుఁ బిల్లులు నొండు సహజ
వైరివర్గంబులయు సహవాసమపుడు
సూచి మునిశక్తి కెంతయుఁ జోద్యమంది—"23ప 1అ ఆ ప.

ఇందు చిలుకలు వీనులు విందుగా చదువు సామగానములు, మందబుద్ధులైన మత్తగజములు శ్రద్ధగా వినుట అపూర్వము ఏనుగుల తొండముల నీడను, తొండములు చల్లు నీటితుంపురుల చల్లని గాలికి ఆసపడి వాని' చెంత లేళ్లు, సింహములు సుఖముండుట మురారి భావమును మూదరించునది. నీవారాన్న పిండతతులను, ఎలుకలు పిల్లులు ఏకమై తినుట వైరిజంతువుల సహవాసమునకు తగిన సాక్ష్యము.

**6. బ్రాహ్మణమతప్రబోధము :** మూలమునందు సూత్రప్రాయముగ కల బ్రాహ్మణప్రశంసను నన్నయ భాష్యప్రాయము చేయును అమూలకముగను అభివర్ణించును. భృగుడను విప్రుడు అగ్నిదేవుని శపించును. అగ్నిదేవుడు తిరిగి శపించడు కారణము "మాన్యాస్తు బ్రాహ్మణా మమ" అని మాత్రమే తెలిపినట్లు సంస్కృత భారతమునందు కలదు (5శ్లో.7అ. ఆ.ప ) ఈ ఒక్కమాటను పట్టుకొని నన్నయ రచించిన పద్యమిది:

"అడిచినఁ దిట్టినన్ మఱి మహాపరుషంబులు వల్కి యల్కతోఁ
బొడిచిన నుత్తమద్విజులు పూజ్యులు వారల కెగ్గుసేసినం
జెడు నిహపరంబు లరయ నిది సిద్ధము గావు దెలింగి భక్తి నె
ప్పుడు ధరణీసురోత్తములఁ బూజల దన్పుదు నల్ల నోడుదున్"

138 ప. 1 అ. ఆ ప.

అణచివైచినను, తిట్టినను, పరుషవాక్కులు పలికి కోపముతో పొడిచివైచినను ఉత్తమద్విజులు పూజ్యులు. వారికి కీడు చేసిన ఇహపరములు రెండును చెడును. ఇది తిరుగులేని తీర్మానము. అది తెలిసి ఎప్పుడును ధరణీసురోత్తములను భక్తితో

పూజించి తనుపుడును. కోపించుటకు భయపడుదును. ఇంత వివరించుటకు హేతువు, ఇహపరములకు సంబంధించిన బ్రాహ్మణమతము.

వైశంపాయనుడు యయాతిగురించి తెలుపునపుడు జనమేజయుడు, పరమ దుర్లభయైన శుక్రతనయను యయాతి ఎట్లు పొందెనని మాత్రమే ప్రశ్నించినట్లు సంస్కృత భారతమునందు కలదు

"యయాతిః పూర్వకోఽస్మాకం దశమో యః ప్రజాపతే
కథం స శుక్రతనయాం లేభే పరమదుర్లభాం" 1 శ్లో 71అ ఆ ప.

ఇది నన్నయ ఇట్లు సంతరించెను

"వర్ణధర్మములఁ గాచుచు వసుధయెల్ల
నసఘచరితుఁడై యేలిన యయ్యయాతి
భూసురోత్తమ భార్గవపుత్త్రియైన
దేవయానిని దానెట్లు దేవిఁ జేసె". 97ప 3అ. ఆ. ప.

శుక్రుడు రాక్షసగురువు కావున శుక్రతనయ పరమదుర్లభ కాఁగలదు. అది మూలములోని సందేహము. భార్గవపుత్త్రియైన దేవయాని బ్రాహ్మణకన్య. యయాతి క్షత్త్రియుడు. అంతేకాదు వర్ణధర్మములు కాపాడుచు వసుధయెల్ల పరిపాలించినరాజు. క్షత్త్రియుడు బ్రాహ్మణకన్యను వివాహమాడుట బ్రాహ్మణమతధర్మవిరుద్ధము. వర్ణధర్మములు కాపాడు వసుధేశ్వరుడు బ్రాహ్మణకన్యను వివాహమాడుట బ్రాహ్మణ మత ధర్మమహావిరుద్ధము ఇది నన్నయభారతములోని ధర్మసందేహము దేవయాని యయాతితో "నన్నువివాహమై" అన్నప్పుడు (161ప. 3అ. ఆ ప) యయాతి,

"సర్వవర్ణాశ్రమధర్మంబులు సంకరంబులు గాకుండ రక్షించుచున్న
యేన యిట్టి యధర్మంబున కొడంబడితినేని జగత్త్రవృద్ధి విపరీతంబగును"

అని ప్రతిఘటించుట (162వచ 3అ ఆ ప.)మూలమునందు లేదు నన్నయ స్వతంత్రకల్పనము యయాతి "సర్వవర్ణాశ్రమధర్మంబులు సంకరంబులు గాకుండ రక్షించు" ట, రాజరాజనరేంద్రుడు "సమస్తవర్ణాశ్రమ ధర్మరక్షణ మహామహిమను మహినొప్పు"ట ఒకటే భంగ్యంతరముగ బ్రాహ్మణమతప్రబోధము

ఇట్లు నన్నయ భారతాంధ్రీకరణము సర్వత్ర స్వతంత్రపద్ధతిని సాగినది. ఇది స్థూలముగ నన్నయభారతాంధ్రీకరణ ప్రణాళిక సోదాహరణనిరూపణము.

# సంహితారచనసరణి

"సారమతిం గవీంద్రులు ప్రసన్న కథాకవితార్థయుక్తి లో
నారసి మేలు నా నితరు లక్షరరమ్యత నాదరింప నా
నాపచిరార్థసూక్తినిధి నన్నయభట్టు దెనుంగునన్ మహా
భారతసంహితారచనబంధురుఁ డయ్యె జగద్ధితంబుగన్" 25ప 1అ ఆ ప.

ఇది నన్నయ రచనగుఱించి పద్యము ఇందు "ప్రసన్నకథాకవితార్థయుక్తి అను పాఠమునకు "ప్రసన్నకథాకలితార్థయుక్తి" అను పాఠాంతరముకలదు ఆ పాఠాంతరమే శ్రేష్ఠతరమను సమన్వయము కలదు. అందు "ప్రసన్నకథాకలితార్థయుక్తి" అను సమాసమునకు ప్రతిపాదించిన అర్థమిది.[46]

"నన్నయగారి కథానిర్మాణవైఖరిని బట్టి చూచినచో 'ప్రసన్న కథాకలితార్థయుక్తి బాగుగానున్నది ప్రసన్నమైన కథతో గూడుకొని యున్న యర్థముల యోజన యని యర్థము అనఁగా నచటనున్న యర్థములను చక్కఁగా పరిశీలించినచో కథ పాఠకునకు ప్రసన్న మగును. అచటనున్న యర్థములను చక్కఁగా యోజించవలయును. అచటనున్న యర్థముల లోపల నారయవలయును"

ఇందు 'ప్రసన్నకథాకలితార్థయుక్తి' అనగా ప్రసన్నమైన కథతో గూడు కొనియున్న యర్థముల యోజన" అని ప్రతిపదార్థము కలదు అంతేకాదు అచట నున్న యర్థములను చక్కఁగా పరిశీలించినచో కథ పాఠకునకు ప్రసన్నమగును ' అని తాత్పర్యము కలదు ప్రతిపదార్థము స్పష్టార్థప్రతిపత్తి కలదేగాని, తాత్పర్యము కాదు ఇట్టి తాత్పర్యమును అపేక్షించు సమాసఘటనము, నన్నయ భారతమునందు ఇతరత్ర మృగము రుచిరతిస్ఫూర్తి నన్నయ సమాసమునకు జీవనాడి. అంతేకాదు. యుక్తి అనగా యోజన, యోజన అనగా చక్కఁగా పరిశీలించుట, చక్కఁగా యోజించుట, లోపలనారయుట అను అర్థములు కవిహృదయమైనచో "లోనారసి" అను కవిప్రయోగము పునరుక్తి వ్యర్థము కావున యుక్తి అనగా యోజన కాదు యుక్తి శబ్దమునకు నన్నయ ప్రయోగాంతరములు కలవు.

1. "రచియింప మధికధీయుక్తి మెయిన్" 16 ప 1 ఆ ఆ ప
2. "కడఁ బ్రశస్తులు సత్త్రివంశ్యులకు గాం
ధర్వరాక్షసములు ధర్మయుక్తి" 54 ప 2 ఆ ॥
3. "కురుభూముల నుత్తరకురువులకంటెను
నధిక లక్ష్మీయుక్తి నతిశయిల్లె" 3ప 5ఆ ॥
4. "ఉత్తముఁడు గాఁడె సద్గుణయుక్తి నతఁడు" 11ప 5ఆ ॥
5. "అందు లోక పూజ్యమై ప్రవర్తిల్లుచు
నుండె శిష్ట సంప్రయుక్తిఁజేసి" 85ప. 5ఆ ॥
6. "పుత్త్రి చేసిన విధులు దత్పురుషఁగాని
తల్లిదండ్రులఁ బొందవు ధర్మయుక్తి" 258ప 6ఆ ॥
7. "—భార్యను బుత్త్రిల నర్థయుక్తితో
నోలిన మేలుగాఁ బడసి" 267ప 6ఆ. ॥
8. "అతఁడ నా తనయకు వరుఁడగు ధర్మయుక్తి" 165ప. 7ఆ. ॥
9. "వివిధ వేణు వీణారవంబును
విస్తరిల్లె విపుల విభవయుక్తి" 282ప. 7ఆ ॥
10. "పూనుగఁ బత్ని నీ వగుము
పూనిత ధర్మ విధాన యుక్తితోన్" 5ప. 8ఆ ॥
11. "తనరుచు దైవయుక్తి మెయి ధర్మువు
సత్యము దప్పకున్న" 36ప 8ఆ ॥
12. "రాజు లందు లోకోత్తర తేజోధర్మయుక్తిఁ దనరుమ"
85ప 1ఆ స ప.
13. "కురువృషభుఁడు గీడ్పడిచెను
వసుధ నేశ్వరుల విసృత వైభవయుక్తిన్" 269ప. 1ఆ ॥
14. "మహా యోగివరులు తత్త్వయుక్తిఁజేసి" 2?ప 2ఆ ॥
15. "సాక్ష్యవిధులు । దప్పఁగాదు తప్పినను నధర్మయుక్తి"
242ప 2ఆ ॥
16 "-వారలతోడి వైరము ధర్మయుక్తిఁ గరం బయుక్తము"
310ప. 2ఆ ॥
17. "ఎఱుఁగని దానఁ గాను ధర్మతత్త్వయుక్తి"
232ప. 1ఆ ఆర ప
18. "హావం గలవార మేము గౌరవ యుక్తిన్" 384 ప. 2ఆ. ॥

ఇందు యుక్తి శబ్దమునకు యోజన, పరిశీలన, చమత్కారము మొదలైన అర్థములు సుసంగతములు కావు. కలన అను అర్థము సర్వసుసంగతము. కలన అనగా కలయిక కూడిక. యుక్తిశబ్దమే కలనార్థకము కాఁబట్టి పారాంతరములోని కలితశబ్దము పునరుక్తి. వ్యర్థము. కావున "ప్రసన్న కథాకవితార్థయుక్తి" అను పాఠమే కవి పాఠము కావలయును

"ప్రసన్న కథాకవితార్థయుక్తి అను సమాసమునకు ప్రతిపాదించిన అర్థమిది 47

> "ప్రసన్న + కథా + [ప్రసన్న] కవితా + అర్థయుక్తి అని పద విభాగము చేసి, ప్రసన్నమైన కథ యొక్కయు, ప్రసన్నమైన కవిత యొక్క యు ప్రయోజనములతో కూడి యుండుట- అని అర్థము చెప్పవచ్చును"

అందు యుక్తి శబ్దమునకు కూడియుండట అని అర్థము కలదు అది కలనార్థకమే "అర్థయుక్తి" లోని అర్థశబ్దమునకు ప్రయోజనమని అర్థము కలదు అది ప్రకరణోచితము కాదు.

> "................................ మదీయచి
> త్తము ననిశంబు భారత కథా శ్రవణ ప్రవణంబు గావునన్.
> 15ప. 1ఆ. ఆ.ప
>
> జననుత కృష్ణద్వైపా
> యనముని వృషభాభిహిత మహాభారతబ
> ద్ధనిరూపితార్థమేర్పడఁ
> దెనుఁగున రచియింపు మధికధీయుక్తి మెయిన్." 16ప. ॥ ॥

అని రాజరాజనరేంద్రుడుని ఆనతి "నా నేర్చు విధంబున నిక్కావ్యంబు రచియించెదనని" నన్నయ ఆమోదము (20వచ 1ఆ ఆ.ప) "సారమతిం గవీంద్రులు ............ జగద్ధితంబుగన్" అని నన్నయ ఆచరణము. (25ప. 1ఆ ఆ ప.) ఇది ప్రకరణము

రాజరాజనరేంద్రుని ఆనతిలోని భారతకథ, మహాభారతబద్ధనిరూపితార్థము. నన్నయ ఆమోదములోని కావ్యత్వము నన్నయ ఆచరణమునకు ఆవశ్యకములు, కాఁబట్టి ప్రసన్నకథా కవితార్థయుక్తిలోని కథ భారతకథ. కవిత కావ్యత్వము. అర్థము మహా భారతబద్ధ నిరూపితార్థము.

అర్థశబ్దమునకును నన్నయ ప్రయోగాంతరము కలదు.

"ఆ నారాయణ పాండవేయ గుణమాహాత్మ్యామలజ్యోత్స్నఁ జి
త్తానందం బొనరించుచున్ జనుల కర్థాంశు ప్రకాశంబుతో
మానై సాత్యవతేయధీవసధి జన్మ శ్రీ మహాభారతా
ఖ్యానాఖ్యామృతసూతి యొప్పు నిఖిలాఘధ్వాంత విధ్వంసియై"
21ప 3ఆ. ఆ ప.

వ్యాసుని తెలివి అనెడు సముద్రమునందు పుట్టిన మహాభారత మనెడు చంద్రుడు, అర్థమనెడు కిరణ ప్రకాశముతో చక్కనై, పాప మనెడు చీకటినెల్ల పోఁగొట్టువాడై, నర నారాయణ ల గుణ మాహాత్మ్య మనెడు వెన్నెలచేత జనులకు హృదయానందము కలిగించుచు ఒప్పునని అర్థము వ్యాసుని మహాభారతము అర్థ మనోహరమై, పాపహరమై, నరనారాయణుల గుణమాహాత్మ్యముచేత ఆనందము కలిగించునని తాత్పర్యము నరనారాయణుల గుణమాహాత్మ్యము కథ అర్థము మహాభారత నిరూపితార్థము అనగా వేదార్థము.

సారమతి పద్యమునందు "నన్నయభట్టు దెనుంగునన్ మహాభారత సంహితా రచన బంధురుఁడయ్యె"నని కలదు మహాభారత సత్కథారచన బంధురు డయ్యెనని లేదు అంతేకాదు మహాభారత కావ్య సంగ్రథన బంధురుఁ డయ్యెనని కూడలేదు. "సంహితారచన బంధురుఁడయ్యె" ననియే కలదు. సంహిత అనగా వేదము. వ్యాసుడు "పంచమ వేదమై పరఁగు భారత సంహితఁ జేసె"నని నన్నయ ప్రతి పాదనమే (47ప 1ఆ ఆ ప.) మఱి నన్నయ మహాభారత సంహిత కూడ పంచమ వేదము కావలయును కాఁబట్టి ప్రసన్న కథాకవితార్థయుక్తిలోని అర్థము వేదార్థమే.

కథ వ్యాసభారతమునందు కలదు అర్థము వ్యాసభారతమునందు కలదు. వ్యాసభారతమునందును కవిత కలదు. కాని నన్నయ భారతమునకు వ్యాసభారతము నకు కేవలాను వాదము కాదు స్వతంత్రాంధ్రీకరణము కాఁబట్టి వ్యాసభారత కథ, వ్యాసభారత కవిత, వ్యాసభారత వేదార్థము యథాతథముగ ఉండదు. స్వతంత్రము గనే ఉండును అది నన్నయ ప్రసన్న కథా కవితార్థయుక్తి ప్రసన్నశబ్దమిట విశేష ణము. విశేషణమైన ప్రసన్న శబ్దమునకు సహితము నన్నయ ప్రయోగాంతరములు కలవు

"కులపవిత్ర సితేతరోత్పల కోమలామలవర్ణ యు
త్పలసుగంధి లసన్మహోత్పలపత్రనేత్ర యరాళకుం
తలవిభాసిని దివ్యతేజముఁ దాల్చి యొక్క కుమారి త
జ్జ్వలన కుండము నందుఁ బుట్టెఁ బ్రసన్నమూర్తి ముదంబుతోన్
19ప 7అ. ఆ. ప

ద్రుపదుడు కోకిలాదేవి పత్నిగా పుత్త్రకామేష్టి చేసిన పుత్త్రుడు, పుత్త్రిక పుట్టిరి పుత్త్రిక "దివ్యతేజముఁ దాల్చి" పుట్టినను ప్రసన్నమూర్తి ప్రసన్నమైన మూర్తి కలది ప్రసన్నమూర్తి. ప్రసన్నమైన మూర్తి అనగా నిర్మలమైన మూర్తి.

"నన్నెఱుఁగవె పాండవుఁడఁ బ్ర
సన్న యశోవీర్యయుతుఁడ సహదేవుఁడ న
త్యున్నతి యేర్పడ నిప్పడ
నిన్నోర్చెదఁ జక్క నెదిరి నిలువుము పోరన్" 388ప 3అ.ఆర.ప.

గమనవేగము తగ్గిన జటాసురునికి అడ్డు వచ్చి సహదేవుడు ఇట్లు పలికెను ప్రసన్నయశోవీర్యయుతుడన ప్రసన్నమైన యశస్సుతోడి బలవంతుడు. ప్రసన్నమైన యశస్సు అనగా స్వచ్ఛమైన యశస్సు

ప్రసన్నశబ్దమునకు నిర్మలము, స్వచ్ఛము, స్పష్టము మొదలైన అర్థములు సందర్భసంఘటితములు కాఁబట్టి ప్రసన్నకథాకవితార్థయుక్తి యనగా స్పష్టమైన కథాకవితార్థయుక్తి అని రుచిరతిస్ఫూర్తిని భాసించును కాని, "సారమతిం గవీంద్రులు ప్రసన్నకథాకవితార్థయుక్తిలో నారసి మేలునాన్" అని నన్నయ నిష్కర్ష. "లోనారసి" అనగా లోపలచూచి పైనచూచి, కాదు కాఁబట్టి "సారమతిం గవీంద్రులు లో నారసి" "మే"లను ప్రసన్నకథాకవితార్థయుక్తి బాహిరమైన విషయము కాదు. అంతరమైన విశేషము బాహిరమైన కథాకవితార్థయుక్తిస్పష్టము వాచ్యార్థము. స్పష్టమైన కథాకవితార్థయుక్తిలోని అంతరమైన విశేషము గంభీరమైనది. వ్యంగ్యార్థము కవీంద్రులన కవిశ్రేష్ఠులు కావ్యనిర్మాణదక్షులు. కావ్యనిర్మాణదక్షుల కావ్యానుశీలనము కావ్యాంతర్యపర్యంతము పర్యాప్తమగును. నన్నయ భారతము స్వతంత్ర కావ్యము కానందున, స్వతంత్రాంధ్రీకరణమైనందున, కవీంద్రులు సంస్కృతాంధ్ర భారతసమ్యక్పరిశీలనముతోపాటు సారమతితో లో నారసిన ప్రసన్నకథాకవితార్థయుక్తి ఆంతర్యము వ్యక్తమగును బాహిరమైన వాచ్యార్థము గాక, అంతరమైన వ్యంగ్యార్థము ఆనందవర్ధనమైన ధ్వన్యర్థము. అది కథాపరముగ, కవితాపరముగ

అర్థపరముగ కలదు కాఁబట్టి ప్రసన్నకథాకవితార్థయుక్తి అను సమాసమునకు ప్రసన్నకథ, ప్రసన్నకవిత, ప్రసన్నార్థముల కలయిక అను అర్థము కవిహృదయము కావలయును

"దివ్యతేజముఁ దాల్చి"న "ప్రసన్నమూర్తి" వలె ధ్వన్యర్థము గర్భితమైనది నన్నయ ప్రసన్నకథాకవితార్థయుక్తి

ఇక మిగిలినది "ఇతరు లక్షరరమ్యత నాదరింప "—

ఇతరులు పండితులు, అక్షరము క్షరము కానిది, క్షరము కానిది మోక్షము, మోక్షరమ్యత అక్షరరమ్యత— అని ఒక అభిప్రాయము కలదు [48] అక్షరము క్షరము కానిదే అది మోక్షమే అనవచ్చును. కాని మోక్షము రమ్యము కాదు. గమ్యము. జనన మరణ, సుఖదుఃఖ, రమ్యారమ్యతాదిద్వంద్వములకు అతీతము. అంతేకాదు కవీంద్రులు అపండితులు కారు పండితు లందఱును కవులు కారు గాని, ప్రాచీన కాలమునందు కవు లందఱును పండితులే కాఁబట్టి ఇతరులు పండితులు కారు అక్షర రమ్యత మోక్షరమ్యత కాదు

"అక్షరమనఁ వర్ణము, వర్ణములు గుణబోధకములు, రీతులు గుణసమూహరూపములు పరివృత్తసహిష్ణువుగా గుణములను సంకలనము చేయుటయే శయ్యయగును. దీనినే నన్నయ 'అక్షరరమ్యత'యని చెప్పినాఁడు" అని మఱొక అభిప్రాయము కలదు [49] అక్షరము వర్ణమే వర్ణములు గుణబోధకములే. గుణసంకలనము శయ్యయే అదే నన్నయ అక్షరరమ్యత అని చెప్పెననుట స్థూలనిర్దేశము. అంతేకాదు ఇతరులు ఎవ్వరో ఇదమిత్థముగ లేదు సహృదయులు కావలయును. కవీంద్రులును సహృదయులె సహృదయు లందఱును కవులు కారు గాని, నవీన కాలమునందు కవు లందఱును సహృదయులే కాఁబట్టి ఇతరులు సహృదయులును కారు అక్షరరమ్యత శయ్యాసామస్త్యమును కాదు.

ఇతరులనగా "తదితరులు"(=కవీంద్రేతరులు), అక్షరరమ్యత అనగా "రమణీయార్థమును ప్రతిపాదించు అక్షరముల రమ్యత" అని వేఱొక అభిప్రాయము కలదు [50] ఇతరులు కవీంద్రేతరులు అనగా కవీంద్రులు కాని వారు అగుదురు కాని, రమణీయార్థమును ప్రతిపాదించు అక్షరముల రమ్యత అక్షరరమ్యత అనుట బలవదాకృష్టము కారణము రమణీయార్థమును ప్రతిపాదించునవి అక్షరములు కావు. శబ్దములు. అక్షరములెల్ల శబ్దములు కావు అర్థవంతమైన కొన్ని ఏకాక్షరములు,

అన్ని అక్షరసముదాయములు మాత్రమే శబ్దములు. అక్షరములు శబ్దపర్యాయములు కావు. వర్ణపర్యాయములు. "రమణీయార్థప్రతిపాదకః శబ్దః కావ్యమ్", "ఇదం చ చమత్కారజనకభావనావిషయార్థప్రతిపాదకశబ్దత్వమ్" అనియే పండితరాయల అభిప్రాయము "వర్ణః కావ్యమ్", "- వర్ణత్వమ్" అనలేదు కాన అక్షరరమ్యత అనగా శబ్దసంయోజనరమ్యత కాజాలదు. వర్ణసంయోజనరమ్యతయే కావలయును.

"సారమతిం గవీంద్రులు ప్రసన్న కథాకలితార్థ యుక్తి లో నారసి మేలు నా నితరు లక్షరరమ్యత నాదరింప" అను ఏకవాక్యమునందు కవీంద్రులు, ఇతరులు ఒకరు కారు. ఒకరు కవీంద్రులు మఱొకరు ఇతరులు ఉభయులును భిన్నులు. ఇతరులు కవీంద్రేతరులు కవీంద్రులు కాని వారు అని చెప్పి కవీంద్రులు కాని అందఱును కారు. నన్నయ భారతమును చదివెడు కవీంద్రులు కాని పాఠకులు, వినెడు కవీంద్రులు కాని శ్రోతలును ప్రాచీన కాలమునందు శ్రవ్యదృశ్య కావ్యభేద పరిగణనమేకాని పాఠ్యకావ్యభేదపరిగణనములేదు నన్నయ భారతము శ్రవ్యకావ్యము. శ్రవ్యకావ్యమును ఒకడు చదువును వెక్కుమంది విందురు పాఠకులసంఖ్య తక్కువ. శ్రోతల సంఖ్య ఎక్కువ అల్పసంఖ్యాకులైన పాఠకులు చదువుటకు, అత్యధిక సంఖ్యాకులైన శ్రోతలు ఆలకించుటకు ఆదరించునది అక్షరరమ్యత అక్షరమన వర్ణము. శబ్దము కాదు అక్షర సమామ్నాయము వర్ణసమామ్నాయము కాని శబ్ద సమామ్నాయము కాదు అక్షరరమ్యత అనగా వర్ణవిన్యాసవక్రత. కుంతక ప్రోక్తము వర్ణముల విశిష్టమైన సంయోజనము వర్ణవిన్యాసము. వర్ణవిన్యాసము యొక్క వక్రత వర్ణవిన్యాసవక్రత వక్రత ఆహ్లాదకారి. రమ్యత కూడ ఆహ్లాదకారి. అక్షరముల విశిష్టమైన సంయోజనము యొక్క రమ్యత అక్షరరమ్యత అది లయాన్వితము· ఆపాతమధురము "సారమతిం గవీంద్రులు లో నారసిమే"లను ప్రసన్న కథాకలితార్థయుక్తి ధ్వని గర్భితము ఆలోచనామృతము ఆపాతమధురమైన అక్షర రమ్యతను సారమతితో లో నారయవలసిన ఆవశ్యకము లేదు. కవీంద్రులు కావలసిన అక్కఱయును లేదు కవీంద్రులు కాని పాఠకులు చదువుటకు, శ్రోతలు వినుటకు అక్షరరమ్యత దోహదము చేయును అందువలన కవీంద్రులు కాని పాఠకులు, శ్రోతల ఆదరింతురు. కాబట్టి ఇతరులు కవీంద్రులు కాని పాఠకులు శ్రోతలును. అక్షరరమ్యత వర్ణవిన్యాస వక్రత అది శయ్యాసామస్త్యము కాదు. శయ్యైకదేశము.

ఇక "నానారుచిరార్థ సూక్తి నిధి." ఇది నన్నయభట్టునకు విశేషణము.

"తన కవితలో నానారుచిరార్థ సూక్తులుండుట నన్నయగారు తన కదియొక బిరుదుగా చెప్పికొన్నట్లు భాసించుచున్నది ... ప్రతి ధర్మము వేరొక పద్యముగా వ్రాయబడి యుండును ...... ఆయన సూక్తులు పైకి సూక్తులుగా నుండును. విచారించినచో నానారుచిరార్థములు భాసించును ...

నానారుచిరార్థ సూక్తినిధి యనఁగా నిది యర్థము

అని ఒక సమన్వయము. అందు ఉదాహరించిన పద్యమిది.

"వగవఁగ సాంగోపాంగము
లగు నాలుగు వేదములయు నధ్యయనము పొ
ల్పుగ నొక సత్యముతో నెన
యగునే యవ్వియును బోల వలె సత్యంబున్." 82ప. 3ఆ ఆర.ప.

ఇది వ్యాసభారతములోని,

"ఏక శ్చతురో వేదా స్సాఙ్గా పాఙ్గా స్సవిస్తరాః
స్వధీతాస్తే వరశ్రేష్ఠ సత్య మేకం కెలైకతః"

అను శ్లోకమునకు అనువాదము. ఇదే కాదు ఇట్టి సుభాషితములు నన్నయ భారతములోనివి ఇంచుమించు అన్నియును వ్యాసభారతములోనివే నన్నయ భారతములోని సూక్తులను విచారించినచో నానారుచిరార్థములు భాసించిన, వ్యాస భారతములోని సూక్తులను విచారించినను నానారుచిరార్థములు భాసించును. అంతే కాదు. అనేక ధర్మములు ప్రత్యేక పద్యములుగా ఉన్నట్లు వ్యాసభారతమునందును ప్రత్యేక శ్లోకములుగ లేకపోలేదు నానారుచిరార్థసూక్తి నన్నయ బిరుదము కాదు విశేషణము ఆ విశేషణమును వైయక్తిక విశేషణము కాదు నన్నయ వైయక్తిక విశేషణములు "తనకుల బ్రాహ్మణు" అను పద్యమునందు కలవు అందు నానారుచిరార్థ సూక్తినిధి విశేషణము లేదు. "సారమతి" పద్యమునందు వైయక్తిక విశేషణములు లేవు నానారుచిరార్థ సూక్తినిధి విశేషణము మాత్రమే కలదు. ఇది వైయక్తికము కాదు రచనాపరము.

సూక్తి అను శబ్దమునకు సుభాషితము అర్థము సుప్రసిద్ధము. అందువలన సుభాషితములకు నిధి అను భ్రాంతి కలుగుట సహజము కాని సూక్తిశబ్దమునకు

సుభాషితమనియే అర్థము కాదు సుమధురవాక్కను అర్థమును కలదు అది కూడ అంత సుప్రసిద్ధము కాకపోయినను కొంత సుప్రసిద్ధమె

"వన్దే కవీన్ద్రవక్త్రేన్దు లాస్యమన్దిరనర్తకీం
దేవీం సూక్తి పరిస్పన్దసున్దరాభినయోజ్జ్వలామ్"

ఇది కుంతకుని వక్రోక్తి జీవితమురోని కారికా ప్రారంభశ్లోకము. ఇందు సూక్తి అనగా సుమధుర వాక్కని కుంతకుని అర్థమె. సు + ఉక్తి = సూక్తి. ఉక్తి శబ్దమునకు నన్నయ ప్రయోగము కలదు

"ఈ తన్వి౯ దోడ్కొని నీ తమ్ము లిరువురు
ప్రీతి నేతెంచి యీ భిక్ష యొప్పు
గొనుమని నాకు౯ జెప్పినను నేవురు నుప
యోగింపు౯ డంటి నా యుక్తి దొర్లి
యనృత మెన్నండు౯ గాదు ........." 20గప 7ఆ. ఆ ప.

ఇది కుంతి ధర్మరాజునకు చెప్పినది ఇందు కుంతి ఉక్తి ఇది వఱకెన్న డును అబద్ధము కాలేదని కలదు అనగా ఆమె వాక్కు అబద్ధము కాలేదని అర్థము. ఉక్తి = వాక్కు. వాక్కు అర్థమంతమే కాని వాగర్థములని కాళిదాసు ప్రయోగము కలదు

"వాగర్థావివ సంపృక్తౌ వాగర్థ ప్రతిపత్తయే
జగతః పితరౌ వన్దే పార్వతీ పరమేశ్వరౌ" 1శ్లో 1స రఘువంశము.

వాగర్థముల వలె పార్వతీ పరమేశ్వరులు సంయుక్తులు ఒకరు వాక్కు మఱొకరు అర్థము కాఁబట్టి నానారుచిరార్థ సూక్తినిధి అను విశేషణమునకు అనేక విధములైన రుచిరార్థములకు సూక్తులకు నిధి అని అర్థము రుచిరార్థములన మనోహరములైన అర్థములు సూక్తులన మధురములైన వాక్కులు మనోహరములైన అర్థములు కవీంద్రులు లో నారసి మేలనుటకు, మధురములైన వాక్కులు కవీంద్రులు కాని పాఠకులు శ్రోతలు ఆదరించుటకు సమర్థములు నానారుచిరార్థ సూక్తి నిధి విశేషణార్థము మహాభారత సంహితా రచన సామర్థ్య మగుటయే సార్థకము.

మఱి జగద్ధితము. "నన్నయభట్టు దెనుంగునను మహాభారత సంహితారచన బంధురుఁడయ్యె జగద్ధితంబుగ౯" అన్న నన్నయభట్టు, వ్యాసుడు "సమస్త జగద్ధితం

బుగాఁ బంచమవేదమై పరగు భారత సంహితఁజేసె నన్నతిన్" అనెను. (47ప. 2ఆ ఆ. ప) అంతేకాదు జగద్ధిత శబ్దమునకు నన్నయ ప్రయోగాంతరములు కలవు.

"అనిశము సేవింతురె ని
న్ననఘా యష్టాంగమైన యాయుర్వేదం
బున దక్షులైన వైద్యులు
ఘనముగ ననురక్తులై జగద్ధితబుద్ధిన్" 33ప 1ఆ స ప.

అష్టాంగమైన ఆయుర్వేదమున దక్షులైన వైద్యుల జగద్ధిత బుద్ధి ఇహము నకు సంబంధించినది

"ధర్మరాజు రాజసూయంబు సేయ సమకట్టి దీనిని నిర్విఘ్నంబున నిర్వహించుట కనాదినిధనుం డాది పురుషుండు పురుషోత్తముండు పుండరీకాక్షుం డజుండయ్యును జగద్ధితంబుగా మర్త్యంబున యమ్మహాత్ముండు వాసుదేవుండ యోపుంగాని యన్యుల కశక్యంబని-" 78వచ 1ఆ. స ప.

జన్మము లేని వాడైనను జగద్ధితముగ పుండరీకాక్షుడు వాసుదేవుడై జన్మించుట ఇహపరములకు సంబంధించినది కాఁబట్టి ఇహపరములు రెండింటికి సంబంధించిన జనుల హితము జగద్ధితము భారత కథ ఇహమునకు సంబంధించిన జగద్ధితమును ప్రబోధించును భారతార్థము ఇహపరములకు సంబంధించిన జగద్ధితమును ప్రబోధించును "కవివృషభులు మహాకావ్యమనియుఁ గొనియాడు" (31ప. 1ఆ ఆ.ప) సంస్కృత భారతమునకు సమస్త జగద్ధితము, స్వతంత్రాంధ్రీకరణమైన ఆంధ్రభారతమునకు ఆంధ్రజగద్ధితము కావ్య ప్రయోజనము

# ప్రసన్నకథా కవితార్థయుక్తి

ప్రసన్నకథా కవితార్థయుక్తి అనగా ప్రసన్నకథ, ప్రసన్నకవిత, ప్రసన్నార్థములు కలయిక ప్రసన్నమైన అనగా స్పష్టమైన బాహిరముగా స్పష్టమైన– అనగా – వాచ్యార్థమున స్పష్టమైన ప్రసన్నకథాకవితార్థయుక్తిని కవీంద్రులు సారమతితో నారసిన ఆంతరమైన– అనగా– వ్యంగ్యార్థమైన విశేషము వ్యక్తమగును అందుకు వారు మేలందురు మెచ్చుకొందురు ప్రశంసార్హమైన ప్రసన్న కథాకవితార్థయుక్తి వ్యంగ్యవైభవము రాశీభూతమైన మహాభారత సంహితారచనకు యయాతిచరిత్రము ప్రముఖోదాహరణము

## ప్రసన్నకథ

యయాతిచరిత్రమునందు ముందు కచదేవయానుల కథ కలదు. కథాంతమున దేవయాని కచుని వివాహమాడుమని కోరినట్లు వ్యాసభారతము నందు కలదు

"గృహాణ పాణిం విధివ న్మమ మన్త్రపురస్కృతమ్ "

5 శ్లో. 77 అ. ఆ ప.

విధ్యుక్తమైన, సమంత్రకమైన పాణిగ్రహణము దేవయాని స్పష్టప్రతిపాదనము ఇది నన్నయ భారతమునందు ఇట్లు కలదు

"నీవును బ్రహ్మచారివి వినీతుఁడ నేనును గన్యకన్ మహీ
దేవకులావతంస రవితేజ వివాహము నీకు నాకు ముచ్
భావజశక్తినైన యది పన్నుగ నన్నుఁ బరిగ్రహింపు సం
జీవనితోడ శుక్రు దయఁజేయుము నాకు మనఃప్రియంబగుచ్."

129 ప 3 ఆ ఆ. ప.

ఇందు వివాహమాడుమను ప్రతిపాదనము లేదు వివాహమైపోయినదను సిద్ధాంతము కలదు కాని పూర్వకథయందు కచదేవయానుల వివాహమైనట్లు కాదు. సరికదా, కచుడు దేవయానిని ప్రేమించినట్లు గాని, దేవయాని కచుని ప్రేమించినట్లు గాని, కచదేవయానులు పరస్పరము ప్రేమించుకొన్నట్లు గాని ఒక్క మాట లేదు. కనీసము శంకించుటకైనను ఆస్కారము నన్నయ భారతమునందు లేదు. అది సంస్కృత భారతమునందు కలదు

"నిత్య మారాధయిష్యంస్తాం యువా యౌవనగోచరః
గాయ న్నృత్యన్ వాదయంశ్చ దేవయానీ మతోషయత 22 శ్లో.
సశీలయన్ దేవయానీం కన్యాం సంప్రాప్తయౌవనామ్
పుష్పైః ఫలైః ప్రేషణైశ్చ తోషయామాస భారత 23 శ్లో.
దేవయాన్యపి తం విప్రం నియమవ్రతధారిణమ్
గాయన్తీ చ లలన్తీ చ రహః పర్యచరత్తథా" 24 శ్లో. 76 అ ఆ ప

యౌవనము గోచరించినపుడు పాడుచు, నృత్యమాడుచు, వాద్యములు మ్రోగించుచును; యౌవనము సంప్రాప్తించినపుడు పువ్వులతోను, ఫలములతోను, ప్రేషణములతోను దేవయానిని కచుడు సంతోషపెట్టెను. దేవయాని కూడ నియమ వ్రతధారియైన కచుని పాడించుచు, నృత్యమాడించుచు రహస్యముగ సంచరించెను. ఆటపాట లివి ప్రేమవ్యవహారము లనిపించును. ఇది నన్నయ భారతమునందు ఇట్లు కలదు.

"దేవయానికి సువిధేయుఁడై ప్రియహిత
భాషణములఁ బుష్పఫలవిశేష
దానములను సంతతప్రీతిఁ జేయుచు"
"గురుతనూజఁ గొలిచి ... నెమ్మి వడసెఁ
దనదు నేర్పు పేర్మి" 110 ప 3 అ ఆ ప.

ఇందు ఆటపాటలు లేవు. వాద్యములు లేవు. ప్రేషణములు లేవు. ప్రియహిత భాషణములు ప్రేమపారములు కావు. ఇష్టమైన, శ్రేయస్కరమైన మాటలు పుష్ప ఫలవిశేషదానములతోను కచుడు దేవయానిని సేవించెను. అనుగ్రహమునందెను.

కచుడు ఇంటికి రాలేదని మొదటిసారి దేవయాని తండ్రి శుక్రునితో మొఱ పెట్టుకొన్నట్లు సంస్కృత భారతమునందు కలదు.

"ఆహుతం చాగ్నిహోత్రం తే సూర్యశ్చాస్తంగతః ప్రభో
అగోపాశ్చాగతా గావః కచ స్తాత న దృశ్యతే
వ్యక్తం హతో మృతో వాపి కచః తాత భవిష్యతి
తం వినా న చ జీవేయం కచం సత్యం బ్రవీమితే"
28, 29 శ్లో. 71 అ ఆ ప.

ఇందు దేవయాని రెండు శ్లోకములకు కచుడు కచుడు కచుడు అని ముమ్మారు పలవరించినది "కచుడు హతుడైనను, మృతుడైనను కచుడు లేకుండ బ్రదుకను నిజము" అని నిశ్చయముగ చెప్పినది అది కలిగిన సంశయమును బలపఱుచును ఇది నన్నయ భారతమునందు ఇట్లు కలదు

"వాఁడి మయూఖముల్ గలుగు వాఁ డపరాంబుధిఁ గ్రుంకె ధేనువుల్
నేఁడిట వచ్చె నేకతమ నిష్ఠమెయిన్ భవదగ్నిహోత్రముల్
వేఁడిగ వేల్వఁగాఁ బడియెఁ బ్రొద్దును బోయెఁ గచుండు నేఁడియున్
రాఁడు వనంబులోన మృగరాక్షసపన్నగబాధనొందెనో"

112 ప ౩ ఆ ఆ ప.

ఇందు కచుని గుఱించి దేవయాని పలవరింత లేదు హతుడైనను మృతుడైనను అను అమంగళపదములు లేవు. "కచుడు లేకుండ బ్రదుకను నిజము" అను నిశ్చయ ప్రకటనము లేదు "కచుడే రాఁడు వనములో మృగరాక్షస పన్నగ బాధనొందెనో" అను సందేహముతోడి ఆందోళనమే కలదు అది సానుభూతియే గాని సానురాగము కాదు.

మఱల రాక్షసులు సంహరించినపుడు కూడ, దేవయాని పలవరింత, నిశ్చయ ప్రకటనము మొదటిసారి వలె సంస్కృతభారతమునందు కలదు

"పుష్పాహారః ప్రేషణకృత్కచః తాత న దృశ్యతే"

34 శ్లో. 71 అ ఆ. ప

[వ్యక్తం హతో మృతో వాపి కచ స్తాత భవిష్యతి
తం వినా న చ జీవేయం కచం సత్యం బ్రవీమి తే —]

"కచుడు లేకుండ బ్రదుకను నిజము" అను కన్య, సంప్రాప్తయౌవన అగుట దేవయాని పునరుద్ఘాటనము బలపడిన సంశయమును ధ్రువపఱచును. అంతేకాదు

"స బ్రహ్మచారీ చ తపోధనశ్చ సదోత్థితః కర్మసు చైవ దక్షః
కచస్య మార్గం ప్రతిపత్స్యే న భోక్ష్యే ప్రియోహి మే తాత కచోభిరూపః"

38 శ్లో. 71 అ. ఆ ప

అని దేవయాని అన్నట్లు సంస్కృతభారతమునందు కలదు. కాదు "అభిరూపుడైన కచుడు నా ప్రియుడు" అని దేవయాని స్పష్టప్రతిపాదనము కలదు. అభిరూపుడను అధికరూపుడు, మనోహరుడు అని మాత్రమేగాక, పండితుడు అని కూడ అర్థము కలదు కాబట్టి దేవయాని కచుని ప్రేమించినట్లు వాచ్యముగ సంస్కృతభారతమునందు కలదు నన్నయభారతమునందు లేదు కాని,

"యస్యాఙ్గిరా వృద్ధతమః పితామహో బృహస్పతిశ్చాపి పితా తపోధనః ఋషేః పుత్త్రం త మథోవాపి పౌత్త్రం కథం న శోచేయ మహం న రుద్యామ్"

36 శ్లో. 7. అ ఆ ప.

అను వ్యాసభారతములోని శ్లోకమునకు నన్నయ స్వతంత్రాంధ్రీకరణమిట్లు కలదు

"మతిలోకోత్తరుఁడైన యంగిరసు మన్మండ్రాశితుండా బృహ
స్పతికిం బుత్త్రుఁడు మీకు శిష్యుఁడు సురూపబ్రహ్మచర్యాశ్రమ
వ్రతసంపన్నుఁ డకారణంబ దనుజవ్యాపాదితుండైన య
చ్యుతధర్మజ్ఞ మహాత్మ యక్కచునకే శోకింప కెట్లుండుదున్"

113 ప 3 అ ఆ ప

ఇది "ఎల శోకింపఁగన్" అను శుక్రుని ప్రశ్నకు, ఇన్న తాంబూల "శోకింప కెట్లుండుదున్" అని దేవయాని సమాధానము అంతేకాదు కచుడు శుక్రుని యొద్దకు వచ్చినపుడు తాను అంగిరసుని మనుమడనని, బృహస్పతి కుమారుడనని చెప్పినట్లు సంస్కృతమునందు కలదు

"ఋషే రఙ్గిరసః పౌత్త్రం పుత్త్రం సాక్షా ద్బృహస్పతేః
నామ్నా కచ ఇతి ఖ్యాతం శిష్యం గృహ్ణాతు మాం భవాన్"

17 శ్లో 71 ఆ. అ. ప.

ఇది నన్నయ భారతమునందు ఇట్లు కలదు

"ఏను గచుండను వాఁడ మ
హానియమసమన్వితుఁడ బృహస్పతి సుతుఁడన్
మానుగ వచ్చితి నీకును
భానునిభా శిష్యవృత్తిఁ బని సేయంగన్."    108 ప. 3 ఆ. ఆ. ప.

ఇందు కచుడు "బృహస్పతిసుతుఁ" డని కలదుగాని, అంగిరసుని మనుమడని లేదు. అచట అంగిరసుని మనుమడని సంస్కృతభారతమునందు కలదుగాని, అంగిరసుని మునిలోకోత్తరుడని లేదు. ఇచట కూడ సంస్కృతభారతమునందు లేదు. నన్నయ భారతమునందు మాత్రమే కలదు ఇది వచ్చినప్పుడు కచుడు చెప్పగా దేవయాని విన్నది కాదు అనగా కాలక్రమమున దేవయాని కచుని పుట్టుపూర్వోత్తరములు తెలిసికొన్నదని అవగాహనమగును. తండ్రి శిష్యుడని కచుని పుట్టుపూర్వోత్తరములు తెలిసికొనవలసిన ఆవశ్యకము లేదు అయినను తెలిసికొన్నది. కారణము కచుని వివాహమాడు సంకల్పము కావలయును తన ఆంతర్యము తండ్రి గ్రహించునేమో అని వెంటనే "ఆశ్రితుఁ" డన్నది దేవయానికి గాని, శుక్రునికిగాని కచుడు ఆశ్రితుడని సంస్కృత భారతమునందు లేదు ఆశ్రితుడనిన దేవయాని ఆంతర్యము గ్రాహ్యముకాదు కాని అవజ్ఞకలుగును అందుకువెంటనే "ఆబృహస్పతికిం బుత్త్రుఁడు" అన్నది అచటగాని ఇచటగాని బృహస్పతికి ఆ అను నిర్దేశము సంస్కృతభారతమునందు లేదు ఆ బృహస్పతి అనగా ఏ బృహస్పతి?— వృషపర్వునికి శుక్రుడు గురువైనట్లు దేవేంద్రునికి గురువైన బృహస్పతి శుక్రుడు రాజనీతిశాస్త్రజ్ఞుడైనట్లు రాజనీతిశాస్త్రజ్ఞుడైన బృహస్పతి శుక్రుడు భృగువంశీయుడైనట్లు బ్రహ్మవంశీయుడైన బృహస్పతి అంగిరసుడు బ్రహ్మమానసపుత్త్రుడు. ఉభయులును బ్రాహ్మణులు సమస్కంధులు ఆభిజాత్యము, వంశసామ్యము దేవయాని సంకల్పమునకు అనుకూలము తన ఆంతర్యమిది కూడ తండ్రి గ్రహించునేమో అని "నీకు శిష్యుఁడు" అన్నది. సాన్నిహిత్యము దేవయాని సంకల్పమునకు సాధకము తన ఆంతర్యమిదియును తండ్రి గ్రహించునేమో అని "సురూపబ్రహ్మచర్యాశ్రమవ్రతసంపన్నుఁ" డన్నది. సురూపశబ్దము సంస్కృతభారతమునందు లేదు అభిరూపశబ్దము నన్నయ భారతమునందు లేదు అభిరూపశబ్దమునకు మనోహరుడు, మన్మథుడు అను అర్థములు వచ్చును సురూపశబ్దమునకు రావు. సురూపమనగ సుందరమైన రూపము "కన్యా వరయతే రూపమ్" అని ప్రసిద్ధమైన ఆభాణకము కలదు కన్య, సంప్రాప్తయౌవన అయిన దేవయాని కచునిగురించి సురూప— అను సరికి, కచుని వరించినదని వ్యక్తమగుచున్నది అది తండ్రి గ్రహించునేమో అని వెంటనే బ్రహ్మచర్యాశ్రమవ్రతసంపన్నుడన్నది కచుడు బ్రహ్మచారి, తపోధనుడు అని సంస్కృతభారతమునందు కలదుగాని, అభిరూపశబ్దమునకు అన్వితమై లేదు నన్నయ భారతమునందు సురూపశబ్దము అన్వితమై కలదు ఏకరూప సురూపప్రస్తావము పాపశంకా

వహము బ్రహ్మచర్యాశ్రమవ్రతసంపన్నత తత్పరిహారము. కచుడు వచ్చినప్పుడే "మహానియమసమన్వితుడ"నని చెప్పినట్లు నన్నయ భారతమునందు కలదు మహానియమసమన్వితస్థితియే వ్రతసంపన్నత. ఇంతకాలము కచుని మహానియమవ్రతసంపన్నత శుక్రునికి తెలియును ఇప్పుడు దేవయాని నిర్ధరించినది దేవయాని సంకల్పము, సాహసికత, సావకాశము,వరణము శుక్రునికి తెలియదు కవీంద్రులు కాని పాఠకులకు, శ్రోతలకు తెలియదు సారవతితో లో నారయు కవీంద్రులకు తెలియును. ఇంతకు దేవయాని కచుని ప్రేమించుట ప్రసన్నకథలోని అంతరవిశేషము

దేవయాని కచుని వరించినది కచుడు దేవయానిని వరించలేదు అయినను దేవయాని "వివాహము నీకు నాకు మున్ భావజశక్తినైనయది" అన్నది భావజశక్తి అనగా మన్మథశక్తి అని ఒక అర్థము— భావమునందు పుట్టిన శక్తి అని మఱొక అర్థము భావమునందు పుట్టినవాడే మన్మథుడు. అతడు పుష్పాయుధుడు. అతని శక్తి పుష్పములందు కలదు కచుడు దేవయానిని పుష్పములతో సంతోషపెట్టెనని సంస్కృత భారతమునందు కలదు పుష్పసమర్పణమున గురుపుత్త్రిని కొలిచినట్లు నన్నయ భారతమునందు కలదు అంతేకాదు కచుడు దేవయానిని సంతోషపెట్టిన కాలము అయిదువందల సంవత్సరములని సంస్కృతభారతమునందు కలదు "పఞ్చవర్షశతాన్యేవం కచస్య చరతో వ్రతమ్" (25శ్లో) కచుడు గురుపుత్త్రిని కొలిచిన "పెక్కులేండ్లు" అనియే నన్నయ భారతము నందు కలదు (110ప) ఇన్ని సంవత్సరములని లేదు ఎన్ని సంవత్సరములు కథకు సముచితమో అన్ని సంవత్సరములు పెక్కులేండ్లు బహుకాలము కచుడు బహుకాలము "సంతతప్రీతి" కలిగించు పుష్పసమర్పణము కావించెను కచుని దృష్టిలో పుష్పములు పూజాద్రవ్యములు దేవయాని భావములో ప్రేమ బహుమానములు అవి మన్మథుని ఆయుధములు "పుష్పాహారప్రేషణకృత్ కచః" అను సంస్కృత భారతములోని పంక్తికి (34శ్లో), "అడవికి బువ్వులు దేరంగ వడి నరిగిన కచుని" అని నన్నయ భారతమునందు కలదు. (114ప) ఇందు ఆహారములేదు ప్రేషణములేదు ప్రేషణ మనపంపుట ఒక్క పువ్వులకోసమే కచుడు తానే వెళ్లెను అది కూడ వేగమే వెళ్లెను. కచుని స్వప్రయత్నము, సత్వరాచరణము, సంతతప్రీతి సంధానము సంయుక్తమైన పుష్ప సమర్పణము దేవయానికి ప్రేమ పురస్కారమను భావమును ప్రోదిసేయును. కచుడు తన్ను ప్రేమించినట్లు తలంచును దేవయాని తాను కచుని ప్రేమించినది కచుడు తన్ను ప్రేమించినట్లు తలంచినది. తాను కచుని ప్రేమించుట మన్మథశక్తి మహిమ.

తన్నుకచుడు ప్రేమించినట్లుతలంచుట భావమునందు పుట్టిన శక్తివిలాసము కాబట్టి "వివాహము నీకు నాకు మున్ భావజశక్తి నైనయది" అని సిద్ధాంతము చేసినది

ఇంతకుముందే తమకు వివాహమైనట్లు భావించిన దేవయాని ఇంతవఱకును చెప్పలేదు కారణము కచుడు బ్రహ్మచారి మహానియమసమన్వితుడైన బ్రహ్మచారి. బ్రహ్మచారి అనగా అవివాహితుడని అర్థపరిణామము "బ్రహ్మేచరతీతి బ్రహ్మచారిః" అని వ్యుత్పత్త్యర్థము బ్రహ్మసన్నిధియందు సంచరించువాడు బ్రహ్మ అన గురువు గురువుసన్నిధిని సంచరించువాని కర్తవ్యము. విద్యా సముపార్జనము వివాహము కాదు బ్రహ్మ చర్యాశ్రమానంతరమే గృహస్థాశ్రమ స్వీకారము. ఇంతకాలము కచుని బ్రహ్మచర్యాశ్రమవ్రతకాలము వివాహప్రసక్తికి వీలులేదు ఇక గృహస్థాశ్రమస్వీకారము వివాహప్రసక్తికి వీలు కలదు. కాని కచుడు దేవలోకము నకు ప్రయాణమైన కాలమిది వాదప్రతివాదములకు కాలవ్యవధానము లేదు కాబట్టి "వివాహము నీకు నాకుమున్ భావజశక్తినైనయది" అని దేవయాని సిద్ధాంతము.

కచుడు స్వర్లోకవాసి దేవయాని భూలోకవాసిని కచదేవయానుల వివాహము కులాంతర వివాహము కాదుగాని, లోకాంతరవివాహమగును. కచుడు దేవతలకు గురువైన బృహస్పతి సుతుడు దేవయాని రాక్షసులకు గురువైన శుక్రుని తనయ. కచదేవయానుల వివాహము ప్రేమవివాహము కాదుగాని వైరవివాహమగును కావున కచుడు కాదనవచ్చును. కాదనకుండ దేవయాని జాగరూకత వహించినది. కచుడు ఎంత స్వర్లోకవాసి అయినను, బహుకాలము భూలోకవాసి. శాశ్వతభూలోకవాసి కావచ్చును దేవతలకు, రాక్షసులకు ఎంత బద్ధవైరమైనను, కచుడు రాక్షసగురువు విద్యాదానమును స్వీకరించెను. కన్యాదానమును స్వీకరింపవచ్చును అందుకు దేవయాని "వివాహము నీకు నాకు మున్ భావజ శక్తినైనయది" అనుటకు ముందే, కచుని "మహీదేవకులావతంస! రవితేజ!" అని సంబోధించినది. అసలు కచుడు అంగిరసుని మనుమడు కావున మహీదేవకులావతంసుడు. కాని దేవతల గురువైన బృహస్పతి సుతుడు కావున దేవకులావతంసుడు తన్ను వివాహమాడిన కచుడు మఱల మహీదేవకులావతంసుడగును లోకాంతరవివాహశంక కలదేని శాశ్వత భూలోకవాసివి కమ్మని ఆశయము. ఇది దేవకులావతంసుడైన కచుని మహీదేవ కులావతంస! అని సంబోధించుటలోని ఆంతర్యము కచుడు శిష్యుడగుటకు శుక్రుని "భానునిభా!" అని తొలుత ఆమంత్రణము చేసెను (108 ప) భానునిభు డన

సూర్యసన్నిభుఁడు సూర్యునితోడి సాదృశ్యము ప్రతాప విషయమున ప్రసిద్ధము. శుక్రుఁడు ప్రతాపవంతుఁడు కాఁడు. కచుఁడు శుక్రుని శిష్యుఁడగుటకు శుక్రునికి ప్రతాపము అవశ్యకము కాదు గురువును సూర్యసన్నిభుఁడనుటలోని అంతర్యము ప్రతాపము కాదు గురువు పండితుఁడు పండితులు సమదర్శనులు. "గవి శుని చైవపణ్డితాః సమదర్శినః" — సూర్యుఁడును సమదర్శి నిమ్నోన్నతభేదము లేకుండ సర్వత్ర ప్రకాశించును. సూర్యుని వలె శుక్రుఁడు సమదృష్టి కలవాఁడై సురాసురభేదము లేకుండ తనకు విద్యాదానము చేయవలయునని కచుని ఆశయము. అది వినుటకు అవకాశమున్న దేవయాని కచుని వివాహవిషయమున రవితేజ అని సంబోధించినది రతిరాజ అని సంబోధించలేదు సూర్యుని తేజస్సు వంటి తేజస్సు కలవాడు రవితేజుఁడు సూర్యుని తేజస్సే ప్రకాశము శుక్రుడు సమదృష్టిలో చేసిన విద్యాదానమును స్వీకరించినట్లు, శుక్రుడు చేయు కన్యాదానమును కచుడు సూర్యప్రకాశము వలె సమదృష్టితో స్వీకరింపవలయునని దేవయాని ఆశయము కాఁబట్టి "నన్నుఁ బరిగ్రహింపు సంజీవనితోడ శుక్రు దయఁజేయుము నాకు మనఃప్రియం బగున్" అని దేవయాని అభ్యర్థనము ఇది ప్రసన్నకథలోని అంతరవిశేషము

ఇంత వ్యంగ్యమర్యాద నన్నయ భారతమునందు కలదు అంత స్పష్టప్రతిపాదన సంస్కృతభారతమునందు కలదు అంతేకాదు దేవయాని పాణిగ్రహణాభ్యర్థనమునకు కచదేవయానుల వాదప్రతివాదములందు ప్రధానమైన విషయము సంస్కృతభారతమునందు వాచ్యముగ కలదు నన్నయ భారతమునందు వ్యంగ్యముగ కలదు

"ఆ కచుఁ డత్యంతవిషా
దాకులుఁడై లోకనింద్యమగు నర్థము నీ
వాకునకుఁ దెచ్చు టుచితమె
నాకు సహోదరివి నీవు నా చిత్తమునకున్" 130 ప 3 ఆ ఆ. ప

దేవయాని ప్రతిపాదనమునకు కచుడు అత్యంతవిషాదాకులుడై, ఆమె ప్రతిపాదన లోకనింద్యమైన అర్థమని, అది వాకునకు తెచ్చుటే అనుచితమని, నాకు సహోదరివి అనుట నిరుపపత్తి అగుట వలన అని వాచ్యార్థము. సహోదరీశబ్దమున వ్యంగ్యార్థవిలసితము సహోదరులన ఏకోదరులు సంతానము ఉదరసంజాతము. దేవయాని శుక్రుని ఉదరసంజాత కచుడు కూడ శుక్రుని ఉదరసంజాతుడు. రెండవసారి రాక్షసులు కచుని చంపి కాల్చి, ఆ బూడిదను సురలో కలిపి శుక్రుని

చేత త్రాగించిరి. "తన యుదరంబున నున్న" కచుని గని శుక్రుడు సంజీవితుని చేసెను సంజీవితుడైన కచుడు శుక్రుని ఉదరభిదాముఖమున అభ్యుదితుడయ్యెను. సహజముగ దేవయాని శుక్రుని ఉదరసంజాత సంఘటనాత్మకముగ కచుడు శుక్రుని ఉదరసంజాతుడు. ఉభయులును ఏకోదరులు సహోదరులు ఇది వ్యంగ్యార్థము "నీవు వసించిన శుక్రుని కుక్షియందే నేను కూడ వసించితిని కావున నీవు నాకు భగినివి" అని సంస్కృతభారతమునందు కలదు "యత్రోషితం...త్వయా ... తత్రాహ ముషితో ... కుక్షౌ కావ్యస్య... భగినీధర్మతః– "(13, 14 శ్లో. 72 అ ఆ ప) భగినీ శబ్దము ఉదర సంబంధమును వ్యక్తము చేయదు సహోదరీ శబ్దము వ్యక్తము చేయును

ఇట్లు సంస్కృతాంధ్రభారత సమ్యక్పరిశీలనముతోపాటు కవీంద్రులు సార మతితో లో నారసిన నన్నయ ప్రసన్నకథలోని ఆంతరవిశేషములు అనేకములు అభివ్యక్తము లగును. అభివ్యక్తములగుట వలన కవీంద్రులు అభినుతింతురు

వ్యాసభారతములోని కథాస్రవంతి సంకీర్ణసలిలము నన్నయ భారతములోని కథాస్రవంతి ప్రసన్నసలిలము సంకీర్ణసలిలస్రవంతి పరిణాహగంభీరము ప్రసన్న సలిలస్రవంతి సంక్షేపగంభీరము.

## ప్రసన్న కవిత

ప్రసన్న కవిత అనగానే "ప్రసన్న కవితాగుణ"మని ప్రయుక్తమైన పంప భారతములోని పద్యము ప్రతిభటించును ఆ పద్యమిది·

"లలిత పదం ప్రసన్న కవితా గుణమిల్లదె పూణ్దు పేళ్ద బె
ళ్గళ కృతిబంధముం బరెతకాబర కైగళ కేడు నుణ్ణన
ప్పళకద కేడు పేళిసి దొడర్ధద కే డెనపేళ్దు బీగి పో
ప్పెళిసి నెగళ్దెగాటిసువ దుష్కవియం కవియం బలెక్కమే 12ప. 1ఆ

లలితపదము, ప్రసన్న కవితా గుణము లేని కావ్యము వ్రాయసగాండ్రచేతి నొప్పి మృదునైన తాటాకువృథా దబ్బిచ్చి చదువుమనిన దబ్బు దండుగ. ఇటువంటి కావ్యము రచించి అహంకారముతో కీర్తిని అపేక్షించు దుష్కవియును కవియేనా ? అని అర్థము. లలిత పదము, ప్రసన్న కవితాగుణము కావ్యమునకు ప్రధానమని తాత్పర్యము ప్రసన్న కవితా గుణమన ప్రసాదగుణము "ప్రసాద వత్ప

సిద్ధార్థమ్" అని దండి లక్షణములు ప్రసిద్ధార్థ పద సంధానము ప్రసాద గుణము. నన్నయ కవిత్వమెల్ల ప్రసిద్ధార్థ పద సంధానమే ప్రసిద్ధార్థము వాచ్యార్థము. వాచ్యార్థము స్పష్టమైన నన్నయ ప్రసన్నకథను కవీంద్రులు సారమతితో దో నారసిన వ్యంగ్యార్థము అనగా ధ్వన్యర్థము వ్యక్తమగును.

కచదేవయానల కథ అనంతరము శర్మిష్ఠా దేవయానల వివాదము కలదు శర్మిష్ఠ రాజైన వృషపర్వుని కూతురు దేవయాని రాజగురువైన శుక్రుని కూతురు ఇద్దఱి నడమ జగడము పెరిగి, శర్మిష్ఠ తన సఖిజనము చేత దేవయానిని నూతిలో నికి త్రోసి వెయించి వెడలిపోయెను మృగయా వినోదమున అలసిపోయిన యయాతి మంచినీరు కోసము ఆ నూతి దగ్గఱకు వచ్చి అగ్నిశిఖ వలె నున్న దేవ యానిని చూచెనని సంస్కృత భారతమునందు కలదు "దదర్శ కన్యాం తాం తత్ర దీప్తా మగ్నిశిఖామివ" (15శ్లో 73 అ ఆ ప) యయాతి నూతిలో అగ్నిశిఖ వలె నున్న దేవయానిని చూచెనని అర్థము ఇది నిమిత్తముగ నన్నయ రచించిన పద్య మిది.

"చనుదెంచి యమ్మహాజనపతి జల మపే
 క్షించి యచ్చో విశ్రమించి చూచి
తత్కూపమున విలసత్కూలఘనవల్లి
 యన్నిష్టసఖి నూఁది యున్నదాని
గురుకుచ యుగముపైఁ బరువడిఁ దొరఁగెడు
 కన్నీరు పూరించుచున్నదానిఁ
దన సమీపమునకు జనుల యాగమనంబు
 పన్నుగాఁ గోరుచు నున్నదాని
వరుణదేవు తోడఁ గరమల్గి జల నివా
సంబు విడిచి భూస్థలంబు వలని
కరుగుదేరనున్న వరుణేంద్రు దేవియ
పోని దాని దేవయానిఁ గనియె" 140ప విఆ ఆ.ప

ఇది కవిత్వము నన్నయ స్వీయ కవిత్వము. ఎవరైన నూతిలోనికి త్రోసి వేయఁబడిన మునిగి పోవుట, చనిపోవుట సహజము. దేవయాని చనిపోయినదని తెలిసికొనియే శర్మిష్ఠ వెడలిపోయినట్లు సంస్కృత భారతమునందు కలదు. "హతేయ

మితి విజ్ఞాయ" (1౯శ్లో) కాని దేవయాని చనిపోలేదు అగ్నిశిఖ వలె ఉన్న దేవయానిని యయాతి చూచెనని సంస్కృత భారతమునందే కలదు. అగ్నిశిఖ వలె అనుటవలన ఆగ్రహోదగ్రయై ఉన్నదని అర్థము ఎట్లున్నది సంస్కృత భారతమునందు లేదు నన్నయ భారతమునందుకలదు ఆ నూతిలో ఒప్పుచున్న, ఒడ్డుననున్న పెద్దతీగ అను ఇష్టసఖినిపట్టుకొని యున్నది ఘనవల్లి అను ఇష్టసఖి రూపకము పెద్దతీగను పట్టుకొనియుండి కన్నీరు ప్రవహింపఁ జేయుచున్నది అదిసహజము అంతేకాదు తనసన్నిధికి జనుల రాక సంభవమగునట్లు కోరుచున్నది. స్వయముగ పైకి రాలేక, వచ్చుటకు సహాయముగ మఱొకరు రావలయునని కోరుట కూడ సహజము అయినను వరుణదేవునిపై మిక్కిలి అలిగి, జల నివాసమును వదలి భూస్థల నివాసమునకు బయలుదేరు వరుణదేవుని దేవేరివలె దేవయాని ఉన్నది వరుణుని దేవేరితో ఉపమానము నూతిలో నుండి పైకి రాఁగోరుచున్నదని అర్థము. ఇదియెల్ల వాచ్యార్థమే స్పష్టమే.

పద్యమునందు రూపకోపమాలంకారములు కలవు ఇష్టసఖితోడి రూపకము వలన దేవయాని నూతిలో ఇబ్బంది లేకుండ ఉన్నదని ధ్వనించును. వరుణుని దేవేరితోడి సాదృశ్యము దేవయాని సౌందర్యమును ప్రతీయమానము సేయును. కచదేవయానుల కథలో నన్నయ భారతమునందు దేవయాని సౌందర్యము గుఱించి ప్రసక్తి మాత్రమును లేదు సంస్కృత భారతమునందు ప్రసక్తి ప్రాయముగ కలదు కచదేవయానుల కథలో కచదేవయానుల వివాహము జరుగలేదు. దేవయాని సౌందర్యముతో నిమిత్తము లేదు సౌందర్యముతోనే కలదు దేవయానీ యయాతుల కథలో దేవయానీ యయాతుల వివాహము జరుగును. దేవయాని సౌందర్యముతో నిమిత్తము కలదు జరుగఁబోవు వివాహమున కిది ప్రాతిపదిక. నూతిలో త్రోసివేయఁబడిన దేవయాని, యయాతి చూచునరికి పెద్ద తీగను పట్టుకొని యున్నను ముందు నీటిలో మునిగి పోయియుండవలయును లేనిచో శర్మిష్ఠ దేవయాని చనిపోయినదని వెడలిపోదు ముందు నీటితో మునిగి, తర్వాత పైకి లేచిన దేవయాని పెద్దతీగను పట్టుకొనియుండును నీటిలో మునిగినప్పుడు దేవయాని ఒడలెల్ల తడిసిపోవును తడిసిన దేవయాని తనుద్యుతి ద్విగుణీభూతమగును వరుణుడు దేవుడు వరుణుని దేవేరి దేవత దేవయాని సౌందర్యము దేవతాసౌందర్యమునకు సమానము వరుణుడు జలాధిదేవత. వరుణదంపతులు జలనివాసులు జలనివాసము వదలి భూస్థలనివాసమునకు బయలుదేరు వరుణదేవుని దేవేరితోడి సాదృశ్యము దేవ

యాని దేహసౌందర్యమును మాత్రమేగాక, ఆర్ద్రదేహసౌందర్యమునుసహితము ధ్వనించును ఇదియెల్ల జరుగఁబోవు దేవయానీయయాతుల వివాహమునకు కవితాకల్యాణవేదిక దేవయాని నాయిక యయాతి నాయకుడు. దేవయాని సౌందర్యము సహజోద్దీపనవిభావము కవీంద్రులు సారమతితో లో నారసిన మేలనిపించు రసధ్వని

ఇక యయాతి దేవయానిని నూతిలోనుండి పైకి తీయుట సంస్కృతభారతమునందు ఇట్లు కలదు

"గృహీత్వా దక్షిణే పాణౌ వుజ్జహార తతో ఉదపాత్
ఉద్ధృత్యచైనాం తరసా తస్మాత్కూపాత్ నరాధిపః. "22,2౦ శ్లో
7౦అ ఆ ప

నరాధిపుడైన యయాతి దేవయానిని దక్షిణపాణితో పట్టుకొని, ఆ నూతిలో నుండి పైకి తీసెను ఇది నన్నయ భారతమునందు ఇట్లు కలదు.

జలధివిలోలవీచికలసత్కలకాంచిసమంచితావనీ
తలవహనక్షమం బయిన దక్షిణహస్తమునం దదున్నమ
ద్గళదురుఘర్మవారికణక్రమకరాబ్జము వట్టి నూతిలో
వెలువడఁ గోమలిం దిగిచె విశ్రుతకీర్తి యయాతి ప్రీతితోన్ "
144ప 3 ఆ ఆ ప.

యయాతి దక్షిణహస్తమునకు సంస్కృతభారతమునందు విశేషణము లేదు. నన్నయ భారతమునందు సుదీర్ఘమైన విశేషణము కలదు "జలధివిలోలవీచికలసత్కలకాంచిసమంచితావనీతలవహనక్షమంబయిన" అని చతురంబోధిపరీతభూతలపాలనదక్షమైన దక్షిణహస్తమని తాత్పర్యము మహారాజని ఒక ధ్వన్యర్థము ధర్మాచరణచణుడని మఱొక ధ్వన్యర్థము ఆజానుబాహువని సమాసధ్వని ఆజానుబాహువు అదృష్టవంతుడు అంగసౌష్ఠవగరిష్ఠుడు. "అమరసన్నిభ" అని దేవయాని అంతకు ముందే యయాతిని సంబోధించినది (142ప) అంగసౌష్ఠవమే అమరసన్నిభత్వమునకు నిమిత్తము దేవయాని దేవతాసౌందర్యమును యయాతి చూచెను. యయాతి దేవతాసౌందర్యమును దేవయాని చూచెను అట్లు దేవయాని సౌందర్యము ధ్వనితము ఇట్లు యయాతి సౌందర్యము ధ్వనితము ఇద్దఱి సౌందర్యమును ఇద్దఱి వివాహమునకు అనురూపము ఇది యయాతి దక్షిణహస్త విశేషణములోని అంతర విశేషము మఱి దేవయానిహస్తము మాటయే సంస్కృతభారతము నందు లేదు "తదున్నమద్గళదురుఘర్మవారి కణక్రమకరాబ్జము" అని నన్నయ భారతము

నందు కలదు అది యయాతి దక్షిణహస్తము పట్టుకొన్న దేవయాని హస్తమునకు విశేషణము జాఱుచున్న ఎక్కువచెమట బిందువులచేత మనోజ్ఞమైన పద్మము వంటి దేవయాని పైకెత్తుచున్న హస్తము ఇంతవఱకు లేని స్వేదబిందువులు దేవయానికి ఇప్పు డుత్పన్నములైనవి కావున శ్రామికస్వేదము కాదు. సాత్త్వికస్వేదము అది శృంగారరసవర్గులలో ఒకటి యయాతి హస్తస్పర్శవలన దేవయాని హస్తమునస్వేదము జనించినది అనగా దేవయాని అంతరంగమునందు శృంగారరసోదయమైనదని అంతరార్థము ప్రసన్నకవితలోని అంతరవిశేషము

ఇంతకు దేవయానికి శృంగారరసోదయమైనది యయాతికి కాలేదు "ప్రీతితో" నూతిలోనుండి దేవయానిని పైకి తీయుట ధర్మాచరణపరాయణమే ప్రేమకాదు కాఁబట్టి నిశింతగా నిష్క్రమించెను శృంగారరసోదయమైన దేవయాని నిరోధింపలేదు నూతిలోనుండి పైకి తీసిన యయాతిని వివాహమాడుటకంటె, నూతిలోనికి త్రోయించి వైచిన శర్మిష్ఠపై ప్రతీకారము తీర్చుకొనుట ప్రధానసమస్య. తర్వాత ప్రతీకారమే తీర్చుకొన్నది సహస్రసఖీసమేతముగా శర్మిష్ఠ దేవయానికి దాసి అయినది దాసీ జనముతో దేవయాని వనవిహారమునకు వచ్చెను మఱల యయాతి వచ్చెను మృగయావినోదమున అలసిపోయిన యయాతి మంచినీరు కోసమే మఱల వచ్చినట్లు సంస్కృత భారతమునందు కలదు

"పునశ్చ నాహుషో రాజా మృగలిప్సు ర్యదృచ్ఛయా
తమేవదేశం సంప్రాప్తో జలార్థీ శ్రమకర్శితః" ౹ శ్లో76అ ఆ ప.

నహుషనందనుడైన యయాతి మఱల మృగయావినోదమున అలసిపోయి, జలార్థియై యాదృచ్ఛికముగ అచటికే వచ్చెనని అర్థము ఇది నన్నయ భారతము నందు ఇట్లు కలదు

"అంగనాజనుల యుత్తుంగసంగతకుచ
కుంకుమ చందనపంకములయు
వారివ ధమ్మిల్లభారావకలిత ది
వ్యామోదపుష్పదామములయు
వారివ ముఖసకర్పూరతాంబూలాది
వాసనాసురభినిశ్వాసములయు
వారివ పరిధాన చారు ధూపములయు
విలసితసౌరభావలులు దార్చి

యనిలుఁ డను దూత వోయి తోడ్కొనియుఁ దెచ్చె
దేవయాని పాలికి మృగతృష్ణఁ జేసి
కానంబున గ్రుమ్మరు వాని వీరు
నతిపరిశ్రాంతుఁడైన యయాతి నంత." 1౯౭౩ప౩.ఆ ఆ.ప

అంగనాజనులు దేవయాని, శర్మిష్ఠ మాత్రమే కాదు శర్మిష్ఠ సహస్రసఖులు కూడ. శర్మిష్ఠ రాకుమారి ఆమె సహస్రసఖులు రాచపరిచారికలు అందఱును దేవయాని దాసీజనులు అందఱును దట్టముగా అలదుకొన్న కుంకుమచందనముల సుగంధములు,దిట్టముగా తురుముకొన్న పూలదండల దివ్యపరిమళములు, చర్వణము చేసిన కర్పూరతాంబూలముల నిశ్వాససురభిళములు, కట్టుకొన్న పట్టుబట్టలకు వెసిన ధూపముల సువాసనలు వాయువిలీనములై, అడవిలో మృగయావినోదమున అలసిపోయినను వీరుడై విహరించుచున్న యయాతిని లాగుకొని వచ్చినవి యయాతి జలార్థియై రాలేదు యాదృచ్ఛికముగ రాలేదు సంఘటనాత్మకముగనే వచ్చెను. పద్యమునందు "అనిలుఁడను దూత వోయి తోడ్కొనియుఁదెచ్చె" నని కలదు అనిలుడను దూత రూపకము "తోడ్కొనియు" సముచ్చయాంతము అనిలుడు అంగనాజనులయొద్దకు యయాతిని తీసికొనివచ్చిన దూత. రాజదూత కాడు శృంగారదూత అంగనాజనులు పంపలేదు స్వయందూత సందేశమును మోసికొని రాలేదు సంకేతమును తీసికొనివచ్చెను తీసికొనివచ్చి నిలిచిపోలేదు నిష్క్రమించ లేదు అంగనాజనుల సన్నిధికి యయాతిని "తోడ్కొనియుఁదెచ్చె"ను అనగా యయాతి తోపాటు అనిలుడు కూడ వచ్చెనని అర్థము అనిలుడు వచ్చుకొలది పరిమళములు అతిశయించును పరిమళములు అతిశయించుకొలది ఆకర్షణ అధికమగును అది యయాతి అనంతరకథలో దేవయానిని పెండ్లియాడుటకు ప్రేరణము కలిగించును కారణము దేవయాని దేవతాసౌందర్యము తోపాటు శృంగారనైపథ్యము. అది సహజోద్దీపనవిభావమైన, ఇది తటస్థోద్దీపనవిభావము ప్రసన్నకవితలోని అంతరార్థము

దేవయాని యయాతిని సూటిగా తన్ను వివాహమాడుమని అడిగినట్లు సంస్కృతభారతమునందు కలదు

"ద్వాభ్యాం కన్యాసహస్రాభ్యాం దాస్యా శర్మిష్ఠయా సహ
త్వదధీనాస్మి భద్రం తే సఖా భర్తా చ మే భవ."

16 శ్లో. 76 అ ఆ ప

కన్యాసహస్రముతోను దాసియైన శర్మిష్ఠతోను నీ అధీనురాలిని అగుదును సఖా! నీకు సుఖము నాకు భర్తవు కమ్ము అని అర్థము నన్నయ భారతమునందు "నన్ను వివాహమై . నరలోకభోగము లనేకము లందుము" అనుటకు ముందు ఇట్లు కలదు

> "నిగ్రహమేది నన్ను ధరణీవర కూపము వెల్వరించు నా
> డుగ్రమయూఖు సాక్ష్యముగ నున్నత దక్షిణపాణిఁ జేసి భూ
> పాగ్రణి నాదు దక్షిణకరాబ్జము వట్టితి కాన మున్న పా
> ణిగ్రహణంబు సేసి తది నీ యెడ విస్మృతిఁ బొందఁ బాడియే"
>
> 160 ప 3 ఆ

"నిగ్రహము లేకుండ నీవు నన్ను నూతిలోనుండి పైకితీసినప్పుడు సూర్యుడు సాక్షిగ నీ ఉన్నతమైన దక్షిణ హస్తములో నా దక్షిణ కరాబ్జము పట్టితివి కావున పాణిగ్రహణము చేసితివి అది నీ విషయమునందు విస్మరింపఁబడుట అధర్మము" అని దేవయాని ప్రతిపాదనము

నిజమునకు యయాతి నిగ్రహము లేకుండ వ్యవహరింపలేదు వ్యవహరించిన దేవయానిని నూతిలోనుండి పైకితీసి నిశ్చింతగ నిష్క్రమించుట సంభవము కాదు. అంతేకాదు యయాతి తన దక్షిణపాణితో దేవయాని దక్షిణకరాబ్జము పట్టుకొన్నట్లు "జలధివిలోల" పద్యమునందు లేదు "క్రమకరాబ్జ"మని కలదు క్రమకరాబ్జమును పట్టుకొనుట కూడ ఉద్ధరణార్థము కాని, పాణిగ్రహణముకాదు పాణిగ్రహణము అగ్ని సాక్షికము కానిసూర్యసాక్షికము కాదు దేవయానిది శృంగారరసోదయమైనది కాని **యయాతికికాలేదు యయాతి విషయమునందు విస్మరింపఁబడుటలేదు అధర్మముకాదు.** అయినను యయాతి ఆ మాట అనలేదు దేవయాని ప్రతిపాదనమును అంగీకరించి నట్లే కలదు ప్రసక్తమైన ప్రసన్నకవితలో రెండు ఆంతరవిశేషములు కలవు. 1 అప్పుడు దేవయాని దేవతాసౌందర్యము 2 ఇప్పుడు దేవయాని శృంగార నైపథ్యము సర్వాంగోద్దీపనవిభావమైన దేవయాని దేవతాసౌందర్యము యయాతికి ఆకర్షణ కలిగించును కాని యయాతి నిగ్రహము వహించెను కారణము ధర్మాచరణము తదుద్దీపనవిభావమైన దేవయాని శృంగారనైపథ్యము ఆకర్షణమును అతిశయింపఁజేయును కావున యయాతి నిగ్రహము నీపుగాఁ బోవును కారణము సౌందర్యదర్శనము అప్పుడు దేవయానిది శృంగారరసోదయమైనది ఇప్పుడు **యయాతిది** శృంగారరసోదయమగును. యయాతి తన దక్షిణపాణితో పట్టుకొన్నది

దేవయాని దక్షిణకరాబ్జమే అగును. పట్టుకొనుటకు, పైకెత్తుటకును అప్రయత్నముగ దక్షిణహస్తమే సిద్ధమగును దేవయానిని నూతిలో నుండి పైకితీయుటకు యయాతి దక్షిణహస్తమును సాచినట్లు, దేవయాని నూతిలోనుండి పైకి వచ్చుటకు యయాతికి దక్షిణహస్తమే అందిచ్చును దేవయాని దక్షిణకరాబ్జమును యయాతి పట్టుకొనుట ఉద్ధరణార్థమే కాని జరిగినది పాణిగ్రహణమే వరుడు దక్షిణహస్తముతో వధువు దక్షిణహస్తమును పట్టుకొనుట పాణిగ్రహణము వధూవరుల పాణిగ్రహణము అగ్నిసాక్షికమే కాని, యయాతిదేవయానులు వధూవరులు కారు స్త్రీ పురుషులు. పురుషుడు దక్షిణహస్తముతో స్త్రీ దక్షిణహస్తమును పట్టుకొనుట భారత సంప్రదాయమున పాణిగ్రహణమగును. పాణిగ్రహణమన కరచాలనము కాదు యయాతి వరుడు కాకపోయినను ధరణీవరుడు వరాంశ కలదు దేవయాని కన్య వధ్వంశ కలదు సూర్యుడు అగ్నికంటె అధికుడు కర్మసాక్షి అగ్నిసాక్ష్యముకంటె సూర్యసాక్ష్యము బలీయము అది విస్మరింపబడుట భూపాగ్రణి అనగా రాజశ్రేష్ఠుడైన యయాతి విషయమునందు అధర్మమే యయాతి ధర్మాచరణచణుడు. అందువలన దేవయాని ప్రతిపాదనమును యయాతి ప్రత్యాఖ్యానము చేయలేదు. దేవయాని కచునితో "వివాహము నీకు నాకు ముక్తి భావజశ క్తినైనయది" అనుట ప్రత్యాఖ్యానయోగ్యము యయాతితో "మున్న పాణిగ్రహణంబు చేసితివి" అనుట ప్రత్యాఖ్యానవిధాయకము కాదు ఇది ప్రసన్న కవితలోని ఫలితార్థమైన అంతరవిశేషము.

వ్యాసభారతము నైమిశారణ్యము. నన్నయ భారతము నందనవనము

## ప్రసన్నార్థము

అర్థమన మహాభారత బద్ధనిరూపితార్థము మహాభారతమునందు బద్ధమైన, నిరూపితమైన అర్థము వేదార్థము అమితాఖ్యానక శాఖల వేదార్థామలచ్ఛాయలు అసంఖ్యాకములు వేదార్థము కర్మబ్రహ్మస్వరూపము ప్రవృత్తి మార్గమైన కర్మస్వరూపము ధర్మము నివృత్తి మార్గమైన బ్రహ్మస్వరూపము జ్ఞానము సంహితా బ్రాహ్మణములు ప్రతిపాదించునది ధర్మము. ఉపనిషత్తులు ప్రతిపాదించునది జ్ఞానము వేదధర్మములు విధినిషేధరూపములు సత్యం బ్రూయాత్ – విధి. న సురాం పిబేత్ – నిషేధము అని మహాభారతమునందు బద్ధముగను, నిరూపితము గను కలవు బద్ధము కట్టబడినది నిరూపితము ఋజువు చేయబడినది కథయందు కట్టబడినది బద్ధము కథచేత ఋజువు చేయబడినది నిరూపితము

కచుడు బృహస్పతి సుతుడు. బృహస్పతి దేవతల గురువు శుక్రుడు రాక్షసుల గురువు రాక్షసులకు దేవతలకు బద్ధవైరము యుద్ధములందు ఉభయులును మృతులగుచున్నారు మృతులైన రాక్షసులను శుక్రుడు మృతసంజీవనీ విద్యచేత బ్రదికించు చున్నాడు మృతులైన దేవతలను మృత సంజీవనీ విద్య తెలియని బృహస్పతి బ్రదికింపలేక పోవుచున్నాడు అందువలన రాక్షసుల సంఖ్య తరుగుట లేదు. దేవతల సంఖ్య తరుగు చున్నది అందుకు శుక్రుని యొద్ద మృత సంజీవనీవిద్య నేర్చుకొని రమ్మని దేవతలు బృహస్పతి సుతుడైన కచుని పంపించిరి మృత సంజీవనీ విద్య నేర్చిన శుక్రుడు దూరదర్శన విద్య నేర్చుట అబ్బురము కాదు కచుడు బృహస్పతి సుతుడని, మృతసంజీవనీవిద్య కొఱకు వచ్చెనని గ్రహింప వచ్చును గ్రహించిన శిష్యునిగ స్వీకరింపడు. నిజము చెప్పిన మెదటనే మోసము అబద్ధము చెప్పిన శుక్రుడు అంతగా పట్టించుకొనక పోవచ్చును శుక్రుడు శిష్యునిగ స్వీకరించును మృతసంజీవనీవిద్య నేర్చుకొనవచ్చును అయినను కచుడు అబద్ధమాడ లేదు నిజమె చెప్పెను సత్యం బ్రూయాత్ అను వేదవిధిని అనుసరించెను. సత్యము కార్య సాధకము. బాధకము కూడ బృహస్పతి సుతుడని రాక్షసులు కచుని చంపిరి. దేవయాని వలన శుక్రుడు బ్రదికించెను మరల రాక్షసులు చంపిరి ఈసారి చంపి ఊరుకొనలేదు చంపి, కాల్చి, ఆ బూడిదను సురతో కలిపి శుక్రునిచె పట్టించిరి, మరల దేవయానివలన మరల శుక్రుడు బ్రదికించెను. బ్రదికించుటకు మృత సంజీవనీ విద్యను నేర్పెను బాధకము సాధకమైనది కచుని సత్యము కార్యసాధకమైనది సత్యప్రయోజనము కథచేత నిరూపితమైనది. ఇది సంస్కృత భారతమునందు, నన్నయ భారత మునందు నిరూపితమైన భారతార్థము కాని, సంస్కృత భారతమునందు కచుడు మొదటిసారి రాక్షసులు చంపిన విధానమును దేవయానికి వివరించును. రెండవసారి రాక్షసులు చంపిన విధానము శుక్రునికి వివరించును. మొదటి వివరము నిరుపయోగము రెండవ వివరము ఉపయోగకరమైనను అది శుక్రుడు "యోగదృష్టిం వాచి" తెలిసికొన్నట్లు నన్నయ భారతమునందు కలదు. (119వచ) మృతసంజీవనీవిద్య నేర్చుకొనుటకు వచ్చినప్పుడు "ఏను గచుం డను వాఁడ" అను పద్యము, మృత సంజీవనీవిద్య శుక్రుడు నేర్పుచు నుండు "తను వును జీవము" అను పద్యము (123వ) మాత్రమే కచుని పరముగ నన్నయ భారతమునందు కలదు సత్యప్రకటనమునకు ఒక పద్యము, సత్యఫలితముగను మఱొక పద్యము, నిరూపితార్థమునకు నిదర్శనము.

మహాభారతమునందు సురాపాన నిషేధము కలదు శుక్రుని శాపము.

"యో బ్రాహ్మణోద్యప్రభృతీహ కశ్చి న్మోత్సురాం పాస్యతి మన్దబుద్ధిః
అపేత ధర్మా బ్రహ్మహాచైవ స స్యా దస్మిన్ లోకే గర్హితః స్యా త్పరేచ."
54శ్లో 71అ.

ఇది మొదలు మంద బుద్ధులైన బ్రాహ్మణులు మోహముతో సురాపానము చేసినచో, అధర్ములగుదురు. బ్రహ్మహంత లగుదురు. ఇహపరములందు గర్హింపఁబడుదురు అని అర్థము.

ఇది నన్నయ భారతమునందు ఇట్లు కలదు.

"మొదలి పెక్కుజన్మములఁ బుణ్యకర్మముల్
పరఁగఁ బెక్కుసేసి పడయఁబడిన
యట్టి యెఱుక జనుల కా క్షణమాత్రన
చెఱుచు మద్యసేవ సేయనగునె. 120ప.

భూసురు లాదిగ ఁగల జను
లీ సుర సేవించిరేని నిది మొదలుగఁ బా
పాసక్తిఁ బతితు లగుదురు. 121ప. ౧ఆ. ఆ.ప.

ఇందు పెక్కు పూర్వజన్మములందు పెక్కు పుణ్యకర్మములు చేసి సంపాదించుకొన్న జ్ఞానమును మద్యపానము చెడఁగొట్టును. బ్రాహ్మణు లాదిగ సమస్త జనులు సురాపానము చేసిన పాపాసక్తి చేత పతితు లగుదురు" అని కలదు మద్య నిషేధము సంస్కృతభారతమునందు బ్రాహ్మణులకు మాత్రమే పరిమితము. నన్నయ భారతమునందు బ్రాహ్మణులకు మాత్రమేగాక సర్వజనులకును పర్యాప్తమైనది. పర్యాప్తార్థము ప్రశంసార్హము ఇది బద్ధమైన భారతార్థము.

# అక్షరరమ్యత

అక్షరముల విశిష్ట సంయోజనము యొక్క రమ్యత అక్షరరమ్యత అక్షర మన వర్ణము వర్ణవిన్యాస వక్రత అక్షరరమ్యత వర్ణవిన్యాసవక్రత గురించి కుంత కుని వక్రోక్తి జీవితమునందు ఇట్లు కలదు

"ఏకో ద్వౌ బహవో వర్ణా బధ్యమానా పునః పునః
స్వల్పాన్తరా త్రిధా సోక్తా వర్ణవిన్యాస వక్రతా 1శ్లో
వర్ణానయోగినః స్పర్శా ద్వియుక్తాస్తలనాదయః
శిష్టాశ్చ రాది సంయుక్తాః ప్రస్తుతౌచిత్య శోభినః 2శ్లో.
క్వచి దవ్య వధానేఽపి మనోహారిని బన్ధనా
సా స్వరాణా మసారూప్యాత్ పరాం పుష్ణాతి వక్రతామ్ 3శ్లో 2 అ.

ఒకటి లేక రెండు లేక ఎక్కువ వర్ణములు తక్కువ వ్యవధానముతో మరల మరల కూర్చిన వర్ణవిన్యాసవక్రత అగును అది త్రివిధము 1. వర్గపంచ మాక్షరములతో కూడిన కచటతప వర్గాక్షరములు మరల మరల కూర్చినవి ఒక విధము.2 ద్విత్వములైన తకార,లకార, నకారాదులు మరలమరల కూర్చినవి మరొక విధము 3. మిగిలిన వర్ణములు రేఫము మొదలైన వానితో సంయుక్తాక్షరములుగ సందర్భోచితముగ కూర్చినవి ఇంకొక విధము అరుదుగా వ్యవధానము లేకపోయి నను అక్షర సంయోజనము మనోహరముగా ఉండును స్వరములకు సారూప్యము లేనిచో మిక్కిలి శోభకలుగును

1. "త్రేతాద్వాపర సంధి నుద్ధత మదాంధీభూత విద్వేషి జీ
మూతో గ్రగ్వసనుండు రాముఁ డలుకన్ మ్రుయ్యేడు మాయిల్ రణ
ప్రీతిన్ వైరి ధరాతలేశ్వరులఁ జంపెం బల్వురన్ దీర్ఘ ని
స్త్రాత క్రూర కుఠార లూన నిఖిలక్షత్త్రోరు కాంతారుఁడై" 78ప 1ఆ ఆ ప.

ఇందు "రాముఁ డలుకన్ మ్రుయ్యేడు మాయిల్ రణప్రీతిన్ వైరిధరాతలేశ్వ రులఁ జంపెం బల్వురన్" అను ప్రధానమైన అభిప్రాయము, ఇతరులకు అనగా కవీంద్రులుకాని పాఠకులకు శ్రోతలకు అర్థమగును "ఉద్ధత మదాంధీభూత విద్వేషి జీమూతో గ్రగ్వసనుండు, దీర్ఘ నిస్త్రాత క్రూర కుఠారలూన నిఖిలక్షత్త్రోరు కాంతారుఁడై" అను సమాసములు అర్థము కావు అయినను ఆదరింపబడు కారణము

అక్షర రమ్యత "ఉద్ధత మదాంధీభూత" వఱకు అంతకు ముందున్న "సంధ" లోని ధకారము మఱల మఱల కలదు." "ఉద్ధతమదాంధీభూత విద్వేషిడేమూతో గ్రశ్వస నుండు"లో తకారము మఱల మఱల కలదు. సంయుక్తవకార ము మఱల కలదు "దీర్ఘనిర్ఘాత"వఱకు ర్ఘ సంయుక్తాక్షరము మఱల కలదు. "దీర్ఘనిర్ఘాత ప్రాకారకురార" వఱకు రేఫము మఱల మఱల కలదు కకారము మఱల మఱల కలదు "లూనని ఖిల"లో లకారము మఱల కలదు "క్షత్త్రోరు కాంతారుడై"లో కకార, తకార, రేఫములు మఱల మఱల కలవు ఒకటి రెండు వర్ణములు కాక ఎక్కువ వర్ణములు తక్కువ వ్యవధానమున పునః పునః బధ్యమానములైనవి భిన్న భిన్న వర్ణ పౌనః పున్యము వలన పద్యము లయాత్మకమైనది. అది కవీంద్రులు కాని పాఠకులు చదువుటకు, శ్రోతలు వినుటకు ఆదరింతురు.

2. "వివిధోత్తుంగ తరంగ ఘట్టన లసద్వేలావనైలావలీ
లవలీ లుంగ లవంగ సంగతలతా లాస్యంబు వీక్షించుచున్
ధవళాశ్వుల్ సని కాంచి రంత నెదురం దత్తీర దేశంబునం
దవదాతాంబుజ ఫేన పుంజనిభు నయ్యశ్వోత్తమున్ దవ్వులన్."

30ప 2ఆ. ఆ ప.

ఇందు ఉత్తరార్ధములోని ప్రధానమైన అభిప్రాయము— కద్రూవినతలు సముద్రతీరము నందు దూరముగా ఉన్న తెల్లని అశ్వరాజమును చూచిరను అంశము- పాఠకులకు, శ్రోతలకు అర్థమగును. ఇంచుమించు పూర్వార్ధమైన "వివిధో త్తుంగ తరంగ ఘట్టన లసద్వేలావ నైలావలీలవలీ లుంగ లవంగ సంగతలతా లాస్యంబు"లను సుదీర్ఘ సమాసము అర్థము కాదు అయినను ఆదరింతురు. కారణము అక్షరరమ్యత. "ఉత్తుంగతరంగ"లో బిందుపూర్వక గకారము, తకారము, మఱల కలదు "వేలావనైలావలీలవలీ"లో వకారము మఱల మఱల కలదు. "లసద్వేలావనైలావలీలవలీలుంగ లవంగ సంగతలతా లాస్యంబు"లో లకారము మఱల మఱల, మఱల మఱల కలదు "లుంగలవంగ సంగత"లో మఱల బిందు పూర్వకగకారము మఱల మఱల కలదు ఒకటి రెండు వర్ణములు కాక, ఎక్కువ వర్ణములు తక్కువ వ్యవధానమున పునః పునః బధ్యమానములైనవి భిన్న భిన్న వర్ణ పౌనః పున్యము వలన పద్యము లయాత్మకమైనది అది కవీంద్రులు కాని పాఠకులు చదువుటకు, శ్రోతలు వినుటకు ఆదరింతురు. "అవదాతాం బుజ ఫేన పుంజ నిభు" అను చిన్న సమాసమునందును జకార, సకార, పకారములు మఱల కలవు.

3. "ఆతతపక్షమారుతరయ ప్రవికంపిత ఘూర్ణితాచల
వ్రాతమహార్ణవుండు బలవన్నిజదేహసముజ్జ్వలప్రభా
ధూతపతంగతేజుఁ డుదితుండయి తార్క్ష్యుఁడు తల్లికెన్ మనః
ప్రీతి యొనర్చుచున్ నెగసె భీమజవంబున నభ్రవీధికిన్ 38ప 2ఆ ఆ ప.

ఇంచు వినతకు గరుత్మంతుడు పుట్టి తల్లికి మనఃప్రీతి కలిగించుచు భీమ జవమున అభ్రవీధికి ఎగసె నను ప్రధానమైన అభిప్రాయము పాఠకులకు శ్రోత లకు అర్థమగును తార్క్ష్యుఁడు అను శబ్దమే అర్థము కాదు "ఆతతపక్షమారుతరయ ప్రవికంపిత ఘూర్ణితాచల వ్రాతమహార్ణవుండు, బలవన్నిజదేహసముజ్జ్వల ప్రభా ధూత పతంగతేజుడు" అను సమాసములును అర్థముకావు తృక్షుని కొడుకు తార్క్షుడు, తార్క్షుని కొడుకు తార్క్ష్యుడు తార్క్ష్యుడు కశ్యపుడు తార్క్ష్యుడు గరుత్మంతుడు. తార్క్ష్యుడులోని తకారము అర్థము కాని రెండు సమాసములందును, అర్థమగు మూడవ పాదమునందును మఱల మఱల కలదు "మారుతరయ ప్రవికంపిత" లో రేఫము, "ఘూర్ణితాచలవ్రాత మహార్ణవుండు"లో ర్ణసంయుక్తాక్షరము మఱల కలదు "ఆతత పక్షమారుత ... ఘూర్ణితాచలవ్రాత ... ధూత పతంగతేజుఁ డుదితుండయి తార్క్ష్యుడు తల్లికెన్ మనః ప్రీతి" అనునెడ తకారము మఱల మఱల, మఱల మఱల కలదు. ఒకటి రెండు వర్ణములు కాకపోయినను తకారము- ఏకవర్ణము పునః పునః బధ్యమానమై పద్యము లయాత్మకమైనది. అది పాఠకులు చదువుటకు, శ్రోతలు వినుటకు ఆదరింతురు

4. "గంగ నిజాంగదీప్తు లెసఁగం జనుదెంచి లతాంగి సంతతో
త్తుంగ పయోధరద్వితయ తోయరుహాయత చారునేత్ర ది
వ్యాంగనయై ప్రతీపవసుధాధిపు శాల విశాల దక్షిణో
త్సంగమునందు మన్మథవశంబున నుండెఁ గరంబు లీలతోన్.
134ప. 4ఆ ఆ ప.

ఇందు సుదీర్ఘసమాసములు లేవు అల్ప సమాసములు కలవు. అర్థము కావచ్చును. కాకపోయినను గంగ ప్రతీపుడను రాజు దగ్గఱ మన్మథ వశమున ఉన్నట్లు అర్థమగును. అల్పసమాసములందును బిందు పూర్వక గకారము, తకా రము, యకారము, రేఫము, ధకారము, శకారము లకారము మఱల మఱల కలవు భిన్న భిన్న వర్ణావృత్తిః పున్యము తక్కువ వ్యవధానమున ఉండుట వలన పద్యము లయాత్మకమైనది. అది పాఠకులు చదువుటకు, శ్రోతలు వినుటకు ఆదరించు అక్షర రమ్యత.

5. "సాలప్రాంశు నిజోజ్జ్వలత్కవచు శశ్వత్కుండలోద్భాసితున్
బాలార్క ప్రతిమున్ శరాసనధరున్ బద్ధోగ్రనిస్త్రింశు శౌ
ర్యాలంకారు సువర్ణవర్ణు ఘనుఁ గర్ణాఖ్యున్ జగత్కర్ణ పూ
ర్ణాలోలద్గుణుఁ జూచి చూపఱు ప్రభూతాశ్చర్యులై రచ్చటన్."

30ప. 6ఆ. ఆ. ప.

ఇందును సుదీర్ఘ సమాసములు లేవు అల్ప సమాసములే కలవు. అర్థము కావచ్చును కాకపోవచ్చును అయినను ఆదరింతురు. కారణము అక్షరరమ్యత. మొదటి పాదమునందు లకారము తసంయుక్తాక్షరము, రెండవ పాదమునందు రేఫము, మూడవ పాదమునందు ర్ణసంయుక్తాక్షరము, నాల్గవ పాదమునందు రేఫము మఱల మఱల కలవు ఒకటి రెండు వర్ణములు కాక ఎక్కువ వర్ణములు తక్కువ వ్యవధానమున పునఃపునః బధ్యమానములైనవి. భిన్న భిన్న వర్ణ పౌనఃపున్యము వలన పద్యము లయాత్మకమైనది. అది పాఠకులు చదువుటకు, శ్రోతలు వినుటకు ఆదరింతురు.

6. "క్వణదణుకింకిణీ కలిత కాంచన కాంచికలాపమున్ రణ
న్మణి కలనూపురంబులు సమధ్వని నొప్పఁగఁ భక్తి పాదచా
రిణి యయి కన్యకాజనపరీత సుభద్ర తదద్రిపూజన
ప్రణతులు సేసె నింద్రసుతుఁ భర్త నిజేశ్వరుగాఁ దలంచుచున్."

178 ప. 8ఆ. ఆ.ప.

ఇందు సుదీర్ఘ సమాసము, అల్పసమాసము, అసమాసము మూడను కలవు సుదీర్ఘ సమాసము పాఠకులకు శ్రోతలకు అర్థము కాదు. అల్పసమాసము అర్థము కావచ్చును కాకపోవచ్చును. సుభద్ర చెలికత్తెలతో అర్జునుని యొద్దకు భర్తగా భావించుచు వచ్చెనను ప్రధానమైన అభిప్రాయము తెలియును. "క్వణదణు కింకిణీకలిత కాంచన కాంచి కలాపమున్" అను సుదీర్ఘసమాసమునందు ణకారము కకారము, బిందుపూర్వక చకారము మఱల మఱల కలవు "రణన్మణి కలనూపురంబులు" అను అల్పసమాసమునందు రేఫము, ణకారము, నకారము మఱల కలవు సుభద్ర, తదద్రి, ఇంద్రసుతు అను అసమాసస్థలములందు ద్రసంయుక్తాక్షరము మఱల మఱల కలదు ఒకటి రెండు వర్ణములు కాక ఎక్కువ వర్ణములు తక్కువ వ్యవధానమున పునః పునః బధ్యమానములైనవి. భిన్న భిన్న వర్ణముల

పౌనఃపున్యము వలన పద్యము లయాత్మకమైనది అది పాఠకులు చదువుటకు, శ్రోతలు వినుటకు ఆదరింతురు

7. "మదమాతంగ తురంగ కాంచన లసన్మాణిక్య గాణిక్య సం
పద లోలిం గొనివచ్చి యిచ్చి ముదమొప్పం గాంచి సేవించి ర
య్యుద యాస్తాచలసేతు శీతనగ మధ్యోర్వీపతుల్ సంతతా
భ్యుదయున్ ధర్మజుఁ దత్సభాస్థితు జగత్పూర్ణ ప్రతాపోదయున్."

19ప 1ఆ స. ప

ఇందు ఉర్వీపతులు సంపద లోలిం గొనివచ్చి యిచ్చి ధర్మరాజును ముద మొప్పంగాంచి సేవించిరను ప్రధానమైన అభిప్రాయము కవీంద్రులు కాని పాఠకులకు శ్రోతలకు అర్థమగును "మదమాతంగ తురంగ కాంచసలసన్మాణిక్యగాణిక్య సంపదలు" "అయ్యుద యాస్తాచల సేతుశీతనగమధ్యోర్వీపతుల్" "జగత్పూర్ణ ప్రతాపోదయున్" అను సమాసములు అర్థము కావు. అయినను ఆదరింతురు. కారణము అక్షరరమ్యత. "మదమాతంగతురంగ" వఱకు మకారము, తకారము, బిందుపూర్వక గకారము మఱల కలదు "మాణిక్య గాణిక్య"లో ణకారము. క్యసంయుక్తాక్షరమునుఱల కలదు "ఉదయాస్తాచలసేతుశీతనగమధ్యోర్వీపతులు"లో తకారము మఱల మఱల కలదు "జగత్పూర్ణప్రతాపోదయున్"లో తకారము మఱల, షకారము మఱల మఱల కలదు ఒకటి రెండు కాక ఎక్కువ వర్ణములు తక్కువ వ్యవధానమున పునః పునః బధ్యమానములైనవి. భిన్న భిన్నవర్ణ పౌనః పున్యము వలన పద్యము లయాత్మకమైనది అది పాఠకులు చదువుటకు, శ్రోతలు వినుటకు ఆదరింతురు

8. "రయవిచల త్తురంగమ తరంగములన్ మదనాగనక్ర సం
చయముల సంచలచ్చటుల సైనికమత్స్యములన్ భయంకరం
బయి యదువృష్ణిభోజ కుకురాంధక వాహినియుం గలంగె ని
ర్దయతర రోషమారుతనితాంత సమీరితమై క్షణంబునన్"

33ప 2ఆ. స ప.

ఇందు సైన్యము కలగుండు వడెనను ప్రధానమైన అభిప్రాయము కవీంద్రులు కాని పాఠకులకు, శ్రోతలకు అర్థమగును. "రయవిచలత్తురంగమతరంగములన్," మదనాగనక్రసంచయముల సంచలచ్చటుల సైనిక మత్స్యములన్,"

"నిర్దయతరరోషమారుత నితాంత సమీరితమై" అను సమాసములు అర్థము కావు. అయినను ఆదరింతురు. కారణము అక్షరరమ్యత "రయవిచలత్తురంగమతరంగములన్" అను సమాసమునందు లకారము, తకారము, రేఫము, బిందుపూర్వక గకారము, వకారము మరల కలదు మకారము "మదనాగ"లో మరల కలదు. "సంచయమల సంచలచ్చటుల సైనిక మత్స్యములన్" అను సమాసమునందు, సకారము, చకారము మరల మరల కలదు "నిర్దయతరరోష మారుతనితాంత సమీరితమై" అను సమాసమునందు రేఫము, మకారము, తకారము మరల మరల కలదు. ఒకటి రెండు కాక ఎక్కువ వర్ణములు తక్కువ వ్యవధానమున పునఃపునః బధ్యమానములైనవి భిన్న భిన్న వర్ణ పౌనఃపున్యమువలన పద్యము లయాత్మకమైనది అది పాఠకులు చదువుటకు, శ్రోతలు వినుటకు ఆదరింతురు.

9. "శారద రాత్రు లుజ్జ్వలలసత్తర తారక హార పంక్తులం
   జారుతరంబులయ్యె వికసన్నవకైరవ గంధబంధురో
   దార సమీరసౌరభము తాల్చి సుధాంశువికీర్యమాణ క
   ర్పూర పరాగ పాండురుచిపూరము లంబర పూరితంబులై."

142ప. 4ఆ. అర ప.

ఇందు శారదరాత్రులు చారుతరములయ్యెనను ప్రధానమైన అభిప్రాయము కవీంద్రులు కాని పాఠకులకు, శ్రోతలకు అర్థమగును "ఉజ్జ్వలలసత్తరతారకహార పంక్తులన్", "వికసన్నవకైరవగంధబంధురోదారసమీర సౌరభము," సుధాంశు వికీర్యమాణ కర్పూర పరాగ పాండు రుచిపూరములు" అను సమాసములు అర్థము కావు. అయినను ఆదరింతురు కారణము అక్షరరమ్యత. ఉజ్జ్వల లసత్తరతారక హార పంక్తులన్" అను సమాసమునందు లకారము, తకారము మరల, రేఫము మరల మరల కలదు "వికసన్నవ కైరవ గంధ బంధురోదార సమీర సౌరభము" అను సమాసమునందు కకారము, రకారము, బిందుపూర్వక ధకారము మరల, రేఫము మరల మరల కలదు "సుధాంశు వికీర్యమాణ కర్పూర పరాగ పాండురుచి పూరము లంబర పూరితంబులై" అనునెడ కకారము మరల, పకారము, రేఫము మరల మరల కలవు ఒకటి రెండుకాక ఎక్కువ వర్ణములు తక్కువ వ్యవధాన మున పునఃపునః బధ్యమానములైనవి. భిన్న భిన్న వర్ణ పౌనఃపున్యము వలన పద్యము లయాత్మకమైనది అది పాఠకులు చదువుటకు, శ్రోతలు వినుటకు ఆదరింతురు.

లయాత్మకము కాని పద్యమును గాయకులు శ్రావ్యముగ చదువుదురు. శ్రోతలు విందురు కాని గాయకుల గానము పద్యముపై ఆరోపితమగునది. పాఠకుల పఠనము, పద్యమునందు ఆరోపితమగునది కాదు. అంతర్గతమైనది. అక్షరముల విశిష్టమైన సంయోజనము వలన సంక్రమించునది. అది రమ్యత. అక్షరరమ్యత.

# శైలి

అసలు శైలి అనుశబ్దము సంస్కృతము కాని స్టైల్ అను ఆంగ్లశబ్దమునకు వికృతి అని ఒక అభిప్రాయము కలదు[58]. అందుకు హేతువులు అలంకార శాస్త్రములందు రీతి, శయ్య అను శబ్దములే గాని, శైలి అను శబ్దము లేకపోవుట, స్టైల్ అను ఆంగ్లశబ్దము వ్యవహారములోనికి వచ్చిన కాలమునందే శైలీశబ్దమును వ్యవహారములోనికి వచ్చుట, శబ్దసంగతి ఉండుట కావచ్చును. కాని, "శైలీ రీత్యాం" అని నానార్థరత్నమాల అను నిఘంటువునందు కలదు. రీతి అను అర్థమునందు శైలి అను శబ్దము కలదని అర్థము. కుల్లూకభట్టు మనుస్మృతి వ్యాఖ్యానమునందును శైలీశబ్దప్రయోగము కలదు. ఇది ఆప్టే నిఘంటువునందు కలదు. మనుస్మృతి వ్యాఖ్యానమునందు ఇట్లు కలదు.

"ప్రాయేణాచార్యాణామియం శైలీ యత్స్వాభిప్రాయమపి
పరోపదేశమివ వర్ణయంతి. అత ఏవ 'కర్మాణ్యపి' జైమినిః
'ఫలార్థత్వా'దితి బాదరాయణస్యైవ శారీరకసూత్రం."

మనువు రచించిన మనుస్మృతియందు మనువు చెప్పినట్లు ఉట్టంకనము కలదు. అందుకు– జైమిని రచించిన సూత్రములందు జైమిని చెప్పినట్లు, బాదరాయణుడు రచించిన బ్రహ్మసూత్రములందు బాదరాయణుడు చెప్పినట్లు ఉట్టంకనములు కలవని,– స్వాభిప్రాయమును కూడ పరోపదేశమువలె చెప్పుట ప్రాయికముగ ఆచార్యుల శైలి అని కుల్లూకభట్టు అభిప్రాయము ఆచార్యుల శైలి కవుల శైలి కాదు శైలీశబ్దమునకు ప్రాచీన ప్రయోగము సాహిత్యపరముగ మృగ్యము. సంగీత పరముగ నిర్ధారకప్రయోగము శ్రీనాథుని శృంగార నైషధమునందు కలదు.

"టంకముఖంబుల న్మణివిటంకములన్ లిఖియించియున్న మీ
నాంకరసప్రసంగ మధురాదిమగాథలు పారదారికా
హుంకరణక్రియా సమభిహార మహాపరిహాస సంకథా
సంకలితంబు లొప్పిదపు శైలిఁ బఠింతురు ప్రౌఢభామినుల్." 157ప, 7ఆ,

ప్రౌఢభామినులు కథలు, గాథలు పఠించు ఒప్పిదపు శైలి సంగీతపరము. సాహిత్యపరమైన శైలిశబ్ద వ్యవహారము నవీన ప్రయోగమే.

కవుల చరిత్రలందు కవుల శైలికి కతిపయపద్యోదాహరణములు కలవు. సాహిత్య చరిత్రలందు, సాహిత్య విమర్శలందు ఆఖ్యానశైలి, నాటకీయశైలి, వర్ణనాత్మక శైలి అను పరిగణనము కలదు కతిపయపద్యోదాహరణము లొసగిన కవుల శైలి పద్యరచనమునకు సంబంధించినది. ఆఖ్యాన, నాటకీయ, వర్ణనాత్మక భేదపరిగణనమైన శైలి కథాకథనమునకు సంబంధించినది పద్య గద్య రచనమునకు సంబంధించిన శైలి అలంకార శాస్త్రగ్రంథములలోని రీతి. కథాకథనమునకు సంబంధించిన శైలి ఆంగ్లసాహిత్య విమర్శ గ్రంథములలోని పద్ధతి

## రీతి

అలంకార శాస్త్రములందు రీతి భేదములు అనేకము కలవు. అందు ముఖ్యమైనవి మూడు మాత్రమే 1. వైదర్భి 2. గౌడి 3 పాంచాలి. మాధుర్యగుణము కలది వైదర్భి ఓజోగుణము కలది గౌడి ప్రసాదగుణము కలది పాంచాలి. అసమాసకమైన అల్ప సమాసకమైన రచనము కలది వైదర్భీరీతి. దీర్ఘ సమాసకమైన రచనము గౌడీరీతి తన్మధ్యస్థమైనది పాంచాలీరీతి. శృంగార కరుణ శాంత రసములకు వైదర్భీరీతి, వీరరౌద్ర బీభత్స భయానకరసములకు గౌడీరీతి ప్రసిద్ధము. ఈ మూడు రీతులును నన్నయ భారతమునందు కలవు.

1. "క్రచ్చఱ వేఁట వచ్చి యిట కణ్వమహామునిఁ జూచి పోవఁగా
వచ్చితి మెందుఁ బోయిరొకో వా రనినన్ విని యా లతాంగి వా
ర్చచ్చటనుండి యీ క్షణమ యేఁగిరి కానకుఁ బండ్లు దేర మీ
వచ్చు టెఱింగిలేని జనవల్లభ వారును వత్తు రింతకున్ "

27 ప 4ఆ. ఆ ప.

ఇది శకుంతలా దుష్యంతుల ప్రథమ సమావేశములోని ప్రప్రథమ సంభాషణము. ప్రథమ సమావేశమది శకుంతలా దుష్యంతుల గాంధర్వ వివాహమునకు ప్రారంభ సన్నివేశము. గాంధర్వవివాహము శృంగారరసవిషయము. శృంగారరసోచితముగ వారి ప్రప్రథమ సంభాషణమైన పద్యము అసమాసకమైన వైదర్భీరీతిలో కలదు.

2. "దాని శరీరసౌరభము దాని విలోలవిలోకనంబులున్
దాని మనోహరాకృతియు దాని శుచిస్మితవక్త్రకాంతియున్
దాని విలాసముం గడు ముదంబునఁ జూచి మనోజబాణసం
తాన హతాత్ముఁడై నృపతి దానికి నిట్లనియెం బ్రియంబునన్."
171ప 4ఆ. ఆ. ప.

ఇది శంతనుదు యోజనగంధి సౌందర్యమునకు మన్మధవివశుడగుటను తెలుపునది మన్మథపారవశ్యము శృంగారరసవిషయమే యోజనగంధి సౌందర్య వర్ణనము అల్పసమాసకమైన వైదర్భీరీతిలో కలదు.

3. "తడయక పుట్టిన నాఁడ తల్లిచేఁ దండ్రిచే విడువఁ
బడితి నిప్పుడు పతిచేతను విడువఁబడియెదనొక్కొ
నుడువులు వేయు నింకేల యిప్పాటి నోములు దొల్లి
కడఁగి నోఁచితిని గాకేమి యనుచుసు గండె డెందమున"
102 ప 4 ఆ. ఆ. ప.

ఇది శకుంతల దుఃఖము. "అయుక్తంబు లయిన పలుకులు పలుకక నీ యాశ్రమంబునకుఁ బొమ్ము" అని దుష్యంతుడు నిరాకరింపఁగపుడు, "అత్యంత సంతాపితాంతఃకరణయై ఇట్లు దద్దయు దుఃఖించి విగతాశయై"నది శకుంతల. ప్రత్యాశ లేని పరితాపమిది కరుణరసవిషయము కరుణరసోచితముగ అసమాసక మైన వైదర్భీరీతిలో శకుంతల దుఃఖము వర్ణితము

4 "నా కెడ యిమ్ము లెమ్ము కురునాధు మనఃప్రియధర్మపత్ని నే
నేకత మెట్టు లుండుదు మహీపతితోడన పోదుఁ బుత్త్రులం
జేకొని పెన్పు నా పనుపుఁ జేయుము నావుఁడు మాద్రి దద్దయున్
శోకపరీతచిత్తయగుచుం బృథ కిట్లనియెన్ భయంబునన్"
144 ప 5 ఆ ఆ. ప

ఇది పాండురాజు మరణమునకు కుంతీమాద్రుల శోకము శోకస్థాయిక మైనది కరుణరసము కరుణరసోచితముగ కుంతీమాద్రుల శోకము, అల్పసమాస ములు కలవై దర్భీరీతిలో కలదు.

4 "పతదుర్వీధరధాతునిర్ఝరజలాభంబై మహాదేహని
ర్గతసాంద్రారుణపూర మొక్క మొగి నొల్కం ద్రెస్సి నారాయణో
న్నతదోర్దండ విముక్త చక్రనిహతిన్ నాకద్విషన్మస్తక
ప్రతతుల్ ఘోరరణంబునం బడియె భూభాగంబు గంపింపఁగన్."

24 ప 2 ఆ ఆ ప.

ఇది అమరాసురుల అతిఘోరయుద్ధ వర్ణన అది వీరరసనిషయము. వీరరసోచితముగ గౌడీరీతి కలదు

6. "ధారుణిరాజ్యసంపదమదంబునఁ గోమలిఁ గృష్ణఁ జూచి రం
భోరునిజోరుదేశమున నుండఁగఁ బిల్చిన యిద్దురాత్ము దు
ర్వారమదీయబాహుపటువ్రతచండగదాభిఘాత భ
గ్నోరుతరోరుఁ జేయుదు సుయోధను నుగ్రరణాంతరంబునన్"

249 ప. 2 ఆ స ప.

ఇది ద్రౌపదిని దుర్యోధనుడు "తన రమ్యపృథూరుతలంబు నెక్కఁగా రమ్మని సన్న సేసి" నపుడు క్రుద్ధుడైన భీముడు చేసిన శపథము క్రోధము స్థాయిభావమైన రసము రౌద్రము రౌద్రరసోచితముగ గౌడీరీతి కలదు.

7 "అశనాశావివృతాస్యగహ్వరుఁ గృతాంతాకారు నిశ్వాసధూ
మశిఖాధూసరితోగ్రదుర్గతరుగుల్మవ్రాతు హారిద్రవ
ర్ణశరీరున్ భృశరూక్షదర్శను మహానాగప్రభుం గాంచె న
ర్ధశశాంకద్యుతిహాసి దారుణచతుర్దంష్ట్రున్ జగత్త్రాసకున్"

105 ప 4 ఆ. అర ప.

ఇది భీముడు హిమాలయప్రాంతారణ్యమున ఒంటరిగ చూచిన అజగరము యొక్క భయానకస్వరూపము. భయము స్థాయిభావమైన రసము భయానకము. భయానకరసోచితముగ గౌడీరీతి కలదు

8. "నీలగిరీంద్ర శృంగమున నిర్మలమైన సువర్ణవల్లరీ
జాలము వోని పింగళవిశాలజటాచయ మొప్పఁగా వచ
శ్శీలలితుండు వచ్చి నిలిచెన్ హరినీలవినీలవిగ్రహా
రాశరుచుల్ వెలుంగఁగఁ బరాశరసూనుఁడు తల్లి ముందటన్."

239 ప, 4 ఆ, ఆ, ప,

ఇది సత్యవతి స్మరించినంతమాత్రమున సాక్షాత్కరించిన వ్యాసుని వర్ణనము. అల్పసమాసకమైన వైదర్భీరీతికి, దీర్ఘసమాసకమైన గౌడీరీతికి మధ్యస్థముగ కలదు కాఁబట్టి పాంచాలీరీతికి ఉదాహరణప్రాయము.

9 "పాలితదుర్ణయుండు శిశుపాలుఁడు బాలుఁడు వీని నేల భూ
పాలక నీకుఁ బట్టువఱుపన్ మఱి ధర్మ వెఱుంగ వీనికిం
బోలునె రాగకోపపరిభూతమనస్కున కల్పరాజ్యల
క్ష్మీలలనాంధబుద్ధి కనిమి త్తమహత్పరివాదశీలికిన్ "

22 ప 1 ఆ స ప.

ఇది శిశుపాలుని అనునయించు ధర్మరాజునకు భీష్ముడు చెప్పినది అల్ప సమాసకమైన వైదర్భీరీతికి, దీర్ఘసమాసకమైన గౌడీరీతికి మధ్యస్థముగ కలదు. కాఁబట్టి పాంచాలీరీతి

వైదర్భీరీతియందు మాధుర్యగుణము, పాంచాలీరీతియందు ప్రసాదగుణము మాత్రమేగాక, గౌడీరీతియందు ఓజోగుణముతోపాటు ప్రసాదగుణమును నన్నయ ప్రత్యేకత

## పద్ధతి

నన్నయ "శైలిని" మూఁడు జాతులుగా విభజింప వచ్చును. (౧) ఆఖ్యాన శైలి. అనగా ఇట్లు జరిగెనని వృత్తాంతముల చరిత్రకారునట్లు వ్రాయుట. ఇది రస ప్రధానము కానేరదు ... (౨) పాత్రల సంభాషణలు: ఇవి ఎంతయు సహజములు. కావున హృదయ రంజకములు ... (౩) ప్రకృత్యాదివర్ణనలు: ప్రకృతివర్ణనమున నితఁడును, ఎఱ్ఱనయు నగ్రగణ్యులు ... " అని ఒక అభిప్రాయము కలదు [53]

"శైలి ద్వివిధము (1) కావ్యసామాన్యలక్షణము (ii) పదగుంభనసరణి లేక శబ్దప్రయోగవైఖరి (1) కావ్యసామాన్యలక్షణము : 1 ఆఖ్యానశైలి [Narrative Style] కవి కథకుడై నిర్వక్రముగా సూటిగా ప్రసన్నముగా కథ చెప్పును. నన్నయది ఆఖ్యానశైలి ... 2. నాటకీయశైలి (Dramatic Style) కవి సూత్రధారియై పాత్రల ముఖమున కథ నడుపును. (తిక్కన) 3. వర్ణనాత్మక శైలి (Descriptive Style) కవి భావమును, రంగమును, పాత్రమును కథను వర్ణించును. ఈ వర్ణనము కథకు సుందరాంగము. (ఎఱ్ఱన) ఈ మూడింటియందు ఏ

యొక్కటియు తానై ప్రవర్తింపదు. ఒకటి ప్రాధాన్యము వహించును. నన్నయ శైలి ప్రధానముగా ఆఖ్యాయికము" అని మఱొక అభిప్రాయము కలదు [54]

ఇందు మొదటి అభిప్రాయము లోని మొదటి రెండు అంశములును ఆంగ్ల సాహిత్య విమర్శను అనుసరించినవి రెండవ అభిప్రాయములోని మూడు అంశములును, మొదటి అభిప్రాయములోని మూడు అంశములను కొంత అన్యథాకరించినవి. అవి నన్నయది ఆఖ్యానశైలి, తిక్కనది నాటకీయశైలి, ఎఱ్ఱనది వర్ణనాత్మకశైలి అను ప్రసిద్ధమైన అభిప్రాయమును పాదుకొల్పినవి. రెండు అభిప్రాయములందును శైలీశబ్దము కలదు. కాని, ఆంగ్లసాహిత్య విమర్శగ్రంథమునందు లేదు. అంతేకాదు. వర్ణనాత్మకభేదమును లేదు ఉన్న విషయమిది : [55]

"In a broad way, poetry may be devided into two classes. .. The former class we may call personal or subjective poetry, or the poetry of self-delineation and self expression. The later we may call unpersonal or objective poetry or the poetry of representation or creation . . impersonal poetry falls naturally into two groups—the narrative and the dramatic
The last division of objective poetry is the Dramatic . . .
Poetry, that is, in which the poet merges himself in his character or characters, and doest not, as in subjective poetry or ordinary narrative. describe or relate in his own person and from the outside. In all varieties of narrative poetry the dramatic element commonly appears more or less prominently in the shape of dialogue;

## : సంగ్రహానువాదము :

"కవిత్వము స్థూలముగ ద్వివిధము 1. ఆత్మాశ్రయకవిత్వము 2 వస్త్వాశ్రయ కవిత్వము అందు వస్త్వాశ్రయ కవిత్వము సహజముగ ద్వివిధము. 1 ఆఖ్యాయికము. 2. నాటకీయము ఆత్మాశ్రయకవిత్వమునందు లేదా సాధారణాఖ్యానమునందు వలె, ఆత్మపరముగ వర్ణింపకుండ, ఆవలనుండి వివరింపకుండ, కవి పాత్ర లేదా పాత్రలందు లీనమగు కవిత్వము నాటకీయము అన్నివిధములైన ఆఖ్యానములందును నాటకీయత ఎక్కువో తక్కువో ప్రముఖముగ సంభాషణ రూపమున సాధారణముగా కనిపించును."

ఇందు ఆఖ్యాయిక, నాటకీయభేదములు శైలికి సంబంధించి లేవు కవిత్వము నకు సంబంధించి కలవు అవి కూడ కథనమునకు సంబంధించినవి కవి తానై కథను చెప్పుట ఆఖ్యానపద్ధతి. పాత్రల సంభాషణ ద్వారా కథను ప్రవర్తిల్లఁజేయుట నాటకీయపద్ధతి "కవి భావమును, రంగమును, పాత్రమును, కథను వర్ణించు"ట ఆఖ్యానపద్ధతియే అంతేకాదు పాత్రధారులు రంగస్థలమున ప్రదర్శించు ఆంగిక వాచిక సాత్త్వికాభినయములను వర్ణించుట కూడ ఆఖ్యానపద్ధతియే నగరార్ణవశైలాదు లను వర్ణించుట మాత్రము వర్ణనపద్ధతి అనవచ్చును ఈ మూడు పద్ధతులును కవిత్రయము వారి కవిత్వమునందే కాదు, సర్వకవుల కవిత్వములందును ఉండుట సహజము ఎక్కువ తక్కువలనుబట్టి చేయు సూత్రమునకు అపవాదములు బహుళ మగును పై రెండవ అభిప్రాయము కంటె మొదటి అభిప్రాయమే ఆమోద యోగ్యము.

## ఆఖ్యాన పద్ధతి :

"అనలతేజులు దీర్ఘదేహులునై న యట్టి తనూజులన్
వినుతసత్త్వులఁ గోరెఁ గద్రువ వేవురం గడు వేడ్కతో
వినత గోరె సుపుత్త్రులన్ భుజవీర్యవంతుల వారి కం
టెను బలాధికులైన వారిఁ గడింది వీరుల నిద్దఱన్." ఆప 2ఆ ఆ.ప.

"ఆ ధృతరాష్ట్రుచేసిన యనర్థమశిప్రకరానుబద్ధశో
భాధృతి నొప్పుచున్న సభ పార్థివముఖ్యుఁడు ధర్మజుండు దు
ర్యోధనుఁ డర్థిఁ జూపఁగ సహోదరవీరులుఁ దానుఁ జూచి ల
క్ష్మీధరమూర్తి యెంతయును మెచ్చె మనంబునఁ దద్విభూతికిన్"
162ప.2ఆ స.ప.

"కడువడి గాడ్పుచే విఱుఁగఁగాఁ బడి త్రెళ్లు మహీరుహాళి చ
ప్పుడు విని యంచలుం జెవరి భూమిపయిన్ గగనం బుదగ్రతం
బడియెనొ శైలశృంగములు భగ్నములయ్యెనొ యంచు ధూళి నె
క్కడిఁ జన నేర కొందొరులఁ గానక యుండిరి సంచలాత్ములై"
295ప.3ఆ.ఆర.ప

## : నాటకీయపద్ధతి :

"కద్రువ (వినతం జూచి) చూడవె యల్ల యతిధవళంబైన యశ్వంబునందు సంపూర్ణ చంద్రునందు నల్లయుం బోలె వాలప్రదేశంబునందు నల్లనై యున్నది (యనిన విని)

వినత : (నగి) నీవే కన్నులం జూచితే యక్క యెక్కడిది నల్ల యీ యశ్వ రాజమూర్తి మహాపురుషకీర్తియుం బోలె నతినిర్మలంబై యొప్పుచున్న యది (యనిన విని నవ్వి వినతకు)

కద్రువ . (ఇట్లనియె)

అమ్మహాశ్వంబు ధవళదేహంబునందు
నల్ల గలిగిన నీ విప్డు నాకు దాసి
వగుము మఱి యందు నల్ల లేదయ్యెనేని
నీకు నే దాసి నగుదుఁ బన్నిదము నఖుము

(అని యిద్దఱు నొండొరులకు దాసీత్వంబు పణంబుగా నొడివి పన్నిదంబు నఖచిన)

వినత : అయ్యశ్వంబు డాసి చూతము రమ్ము (అనిన)

కద్రువ ఇప్పుడు ప్రొద్దు లేదు. రేపకడ చూతము" 31–33వచ 2ఆ. ఆ ప.

XXX XXX XXX

శకుని : భానుప్రభులగు పాండుమ
హీనాధాత్మజుల లక్ష్మి యెల్లను నీకున్
నే నపహరించి యిత్తు ధ
రానుత మాయాదురోదరవ్యాజమునన్

ధర్మతనయుండు జూదంబునకు బ్రియుండు గాని యందుల యుక్కివం బెఱుంగఁ డే నక్షవిద్యయం దతిదక్షుండ నాతని నస్రశమం బస నోడించి తదీయరాజ్య విభూతి నీ కెచ్చెద వగవకుండు (మని పలికిన శకుని పలుకులకు సంతసిలి)

దుర్యోధనుండు . (దండ్రి పాదంబులం బడి మ్రొక్కి) యీ శకుని మతంబున కొడంబడవలయు ననినఁ గొడుకునకు)

ధృతరాష్ట్రుండు : (ఇట్లనియె)

ధీరమతి విదురుతోడ వి
చారింతము వాఁడు నయవిశారదుఁడు కళా
పారఁగుఁడు దీర్ఘదర్శి య
పారహితారంభుఁ డుభయపక్షంబులకున్

సురపతిగురుండైన బృహస్పతి సేసిన నీతిశాస్త్రరహస్యంబులం దెవ్వరికంటె విదురుం డెంతయు విశారదుం డాతని బుద్ధిబలంబునను నాపగేయబాహుబలంబున నుం జేసి యీ రాజ్యతంత్రంబు వర్తిల్లు చున్నయది గావున నవ్విదురానుమతంబున నెగడుట లగ్గుగు (ననిన)

దుర్యోధనుండు (ఇట్లనియె)

పాండుపుత్త్రుల కెప్పుడుఁ బక్షపాతి
విదురుఁ డని చెప్పెఁ దొల్లియు విందు దీని
నెఱిఁగి వారించుఁ గా కతడేల శకుని
కైతవంబున కోడఁబడుఁ గౌరవేంద్ర
దీని కోడఁబడు మొడఁబడవేని నేఁడ
యీక్షణమ సర్వభక్షుచే భక్షితుండ
నగుదుఁదెల్ల మే నక్లైన వగపు దక్కి
విదురుఁడును నీవు నుండుఁడు ముదముతోడ".

121–127–ప.2ఆ–స.ప.

XXX XXX XXX

"వాసుదేవుండు : (ఇట్లనియె)

తనుకుచున్న నీ హృదయతాపనిమిత్తమునన్ సురేంద్రనం
దన పటుబాణపాతహతిఁ దద్ధృతరాష్ట్రబలంబు మృత్యుసా
దనమున కేఁగుఁజు మ్మిదియ తథ్యము నా వచనంబు దప్ప ది
వ్యనిధి లేడు నింపెన దివంబును రాత్రియు సంచలించినన్.

(అనిన)

అర్జునుడు. (ద్రౌపదిం జూచి యిట్లనియె )

ఈ పురుషోత్తముండు మన కిందఱకుం గుశలంబు సేయుచుం
బాపకలంకపంకములఁ బాయఁగఁ జేయుటఁ జేసి ధర్మదో
ర్దీపిత శత్రు సంహతిహతిం బరమార్థము పొందు నేల సం
తాపము నీకుఁ జేయఁగఁ ద్రిధామజయోన్నతి గల్గియుండఁగన్.

(అనిన)

ధృష్టద్యుమ్నుండు:– (ఇట్లనియె)

వినయవిహీనుల దుర్యో
ధనదుశ్శాసనులఁ బవనతనయుఁడు రాధా
తనయుని నరుఁ డేఁ గుంభజు
నని జంపుదు మేల వగవ నంబుజనేత్రా"

140-145ప 1ఆ.ఆర ప.

## : వర్ణనపద్ధతి :

"పరిఘుజలంబులం దమలపంకరుహోత్పలకైరవాదిసుం
దరకుసుమంబులు౯ ఘనపథంబున నుజ్జ్వలతారకానిరం
తరకుసుమంబులున్ వెలయుఁ దత్పురవప్రము పాదపీఠికా
శిరముల కొప్ప నర్చనలు సేసిన పువ్వుల యవ్విధంబునన్."

76ప–8ఆ ఆ ప.

"అలఘుఫణీంద్రలోకకుహరాంతరదీప్తమణిస్ఫురత్ప్రభా
వళి గల దాని శశ్వదుదవాసమహావ్రతశీతపీడితా
చలమునిసౌఖ్యహేతువిలసద్బడబాగ్నిశిఖాచయంబుల౯
వెలిఁగెడు దానిఁ గాంచె రథవింధనిభానన లమ్మహోదధిన్. "

28ప.2ఆ.ఆ.ప.

## గంధమాదనపర్వతము

"నానావర్ణశిలావిహ
గానేకమృగాభిరామమై భూనారీ
నానాభరణవిభూషిత
పీనోన్నతకుచముఁ బోలె వెలిఁగెడు దానిన్.

లలితాచ్ఛస్ఫటికశిలా
తలములపైఁ బాఱు విమలతరనిర్ఝరిణీ
జలపూరములను తారో
ల్లలదురుహారాళి నుజ్జ్వలంబగు దానిన్" 292,293ప.3ఆ అర ప.

## ఉభయవాక్ప్రౌఢి

"భాషింతు నన్నయభట్టు మార్గంబున నుభయవాక్ప్రౌఢి నొక్కొక్కమాట" అని శ్రీనాథుని కాశీఖండమునందు కలదు (13ప 1ఆ.) ఉభయవాక్ప్రౌఢి అనగా సంస్కృతప్రౌఢి. తెనుగునుడికారము. గౌడీరీతి, రీత్యంశమైన అక్షరరమ్యత సంస్కృతప్రౌఢి. వైదర్భీరీతి తెనుగునుడికారము అంతేకాదు.

"బాలుఁ డొక్కండు కొండొక కోల సేతఁ
బట్టికొని యేను రక్కసుఁ గిట్టి చంపి
చులుకఁగా వత్తు మీ రేడ్వవలవ దనుచుఁ
గలయ నూరార్చెఁ దన తొక్కుఁబలుకు లొప్ప" 260ప.6ఆ ఆ.ప

"అన్న సహదేవ నీవును
నన్నలతో నరిగెదయ్య యట యదవుల కీ
పున్నను సుతులందఱు నిం
దున్నట్టుల నాకుఁ జిత్త మూఱడి యుందున్." 288ప.2ఆ స.ప

"ఇల్వలుండు ననుజు నెప్పటిక్రియఁ బిల్వ
నెఱిఁగి దాని నమ్మునీశ్వరుండు
గడుపుఁ దడవి కొనుచుఁ గఱ్ఱునఁ ద్రేఁచిన
నసుర జీర్ణమయ్యె నాక్షణంబ." 345ప.ఆ.2ఆర ప.

ఇత్యాది పద్యములను, "రోయు తీఁగకాళ్లం బెనఁగెన్" (220ప.5ఆ.అ.ప.) వంటి సామెతలు, "కుంతి కడుపు చల్లగాఁ బుట్టిన" (18ప 6ఆ అ ప.) వంటి నానుడులు, "వీరెవ్వరయ్య ద్రుపదమహారాజులె" (89ప.6ఆ.అ ప.) వంటి పలుకుబడులు తెనుగనుడికారమునకు మచ్చుతునకలు

నన్నయ భారతమునందు సంస్కృత కావ్యములలోని పదబంధములు కలవు అంతేకాదు కన్నడ కావ్యములలోని పదబంధములును కలవు.[56]

## సంస్కృత కావ్యానుసరణములు :

| | |
|---|---|
| "గుర్వర్థమర్థీ శ్రుతపారదృశ్వా" | 24శ్లో 5స ర. వం |
| "గుర్వర్థమర్థినై మానవేశ" | 94ప. 1ఆ. ఆ. ప |
| "ప్రవర్తితో దీప ఇవ ప్రదీపాత్" | 37శ్లో. 5స. ర. వం |
| "దీపంబువలన కొండొక దీపంబు పుట్టించినట్లు" | 89ప. 1ఆ ఆ. ప |
| "దారక్రియా యోగ్యదశం చ" | 40శ్లో 5స. ర వం |
| "చనఁ పేడికి దారక్రియయును" | 14ప. 1ఆ స. ప. |

## కన్నడ కావ్యానుసరణములు :

| | |
|---|---|
| "సరళతమాలతాళహరి చందననందన భూజరాజియుం" | 52ప 5ఆ పం. భా. |
| "సరళతమాలతాళహరిచందన చంపక నారికేళ" | 78ప 8ఆ. ఆ. ప. |
| "ఏలాలవంగలవలీ వేలావన భూమియోళ్" | 13ప 2ఆ ఆ. పు. |
| "ఏలావన రమ్యములగు వేలావనములను | 137ప. 8ఆ. ఆ ప. |
| "కురువృద్ధం కులవృద్ధం" | 44ప. 6ఆ. పం. భా. |
| "కురువృద్ధులె గురువృద్ధ బాంధవులు" | 233ప. 2ఆ. స ప. |

పదబంధములు, సమాసములు మాత్రమేగాక, కన్నడ పద్యరచనా పద్ధతిని నన్నయ పాటించెను సంస్కృత శ్లోకములందు పాదాంత విరతి కలదు అది నన్నయకు పూర్వము తెలుగు పద్యములందును కలదు. కన్నడ పద్యములందు లేదు. నన్నయ పద్యములందును లేదు.

"సాల్ప్రాంశు విశాలశీల సయనం ప్రోద్యద్భుజస్కంధసున్నీలతే—"
68ప 1ఆ. పం భా.

"ఆ మష్యంతుఁ డనంతసత్త్వుఁడు సపస్తాశాంత మాతంగమర్యాద—"
8ప. 4ఆ ఆ ప

"సకలక్ష్మాచరఖేచరాంచిత మహామాణిక్య గాణిక్యహ స్తిక"
16ప. 8ఆ పం భా

"మదమాతంగ తురంగ కాంచన లసన్మాణిక్య గాణిక్యసంపద"
18ప 1ఆ స ప

"సరసమృణాళనాళ వలయంగళోజ్జ్వల వృత్త మౌక్తికా భరణ"
16ప 5ఆ పం. భా.

"అతి రుచిరాగతుం డయిన యాతనిచిన్ హృదయప్రమోదమూతతముగ"
17ప 4ఆ ఆ ప.

ఇట్లు పాదాంతవిరతిని పాటించక పోవుటలోను పద్యగమనమునకు ఒక ప్రత్యేకత కలదు అది సార్వపక్షీసత తటెల్లతాసటనము

# ఆత్మీయత

కవి ఆత్మీయత కావ్యమునందు ప్రతిఫలించుట సహజము. అది స్వతంత్ర కావ్యమునందు సర్వత్ర కనిపించును ఆంధ్రీకరణములందు అమూలక స్థలము లందు, అన్యథా మూలక స్థలములందు, స్వతంత్ర కల్పనములందు కనిపించును. ఆత్మీయత అనగా చదువు, సంస్కారము, శీలము రాశీభూతమైన వ్యక్తిత్వము. కావ్యమునందు ప్రతిఫలించిన కవి ఆత్మీయతను కనుగొనుటకు కవి జీవితచరిత్ర తెలియవలయును. మన పూర్వకవులకు జీవితచరిత్రలు లేవు కట్టుకథలు, పుక్కిటి పురాణములు, జనశ్రుతులు మాత్రమే కలవు అవి చరిత్రాంశములు కావు అలతి అలతి జీవిత చరిత్రాంశములు కవుల అవతారికలందు కలవు అతిశయోక్తులైనను లబద్ధములు కావు సత్య గర్భితములు కవుల అవతారికలలోని కవుల జీవిత చరిత్రాంశములే కావ్యదర్పణములందు ప్రతిఫలించిన కవుల ఆత్మీయతలకు కర దీపికలు

నన్నయ "అవిరళజపహోమతత్పరుడు సంహితాభ్యాసుడు బ్రహ్మాండాది నానా పురాణ విజ్ఞాననిరతుడు" అని నన్నయ అవతారికయందు కలదు. జప

హోమములు వేదనిధులు సంహితలు వేదనిధులు బ్రహ్మాండాదినానా పురాణ విజ్ఞానము-"బ్రహ్మాండాది మహాపురాణచయతాత్పర్యార్థ నిర్ధారిత బ్రహ్మజ్ఞానము." వేదవిధ్యనుష్ఠానము కర్మమార్గము బ్రహ్మజ్ఞానము జ్ఞానమార్గము ధర్మజిజ్ఞాస కావించునది పూర్వమీమాంస బ్రహ్మజిజ్ఞాస కావించునది ఉత్తరమీమాంస. "నన్నయది పూర్వమీమాంస, తిక్కనది ఉత్తరమీమాంస" అని ఒక అభిప్రాయము కలదు[57] కాని, పూర్వమీమాంసా పురస్కారమైన కర్మమార్గము, ఉత్తర మీమాంసా పురస్కారమైన జ్ఞానమార్గము" పంచమ వేదమై పరగు భారత సంహిత" యంచే కలవు ఆదిసభారణ్యపర్వములందు కర్మమార్గము, ఉద్యోగభీష్మ శాంత్యాది పర్వములందు జ్ఞానమార్గము ప్రాధాన్యము వహించును కర్మమార్గము కర్తవ్యము జ్ఞానమార్గము గంతవ్యము ఉభయమార్గములను అనుసరించువారు ఉత్తములు సచ్చరితులు నన్నయ "సద్వినుతావదాతచరితుడు" అని కూడ అవతారికయందు కలదు. అట్టివారిని నన్నయ అధికరించును. సవిశేషణముగ బ్రాహ్మణశబ్దమును నన్నయ బహుధా ప్రయోగించును.

"ఉత్తమ బహువేద విప్రులకు" (15ప 1ఆ ఆ ప.) "జగన్నుత విప్రుల యందు" (100ప 1ఆ. ఆ. ప) "ఉత్తమద్విజులు, ధరణీసురోత్తముల" (130ప. 1ఆ ఆ ప.) "సద్విజ భక్తుఁడనేని" (148ప. 1ఆ. ఆ. ప.) "భూసురోత్తమ" (152ప 2ఆ ఆ. ప) "భూసుర ప్రవరుండు" (158ప. 2ఆ. ఆ ప) "ద్విజవరులన్" (195ప 2ఆ. ఆ ప) "భూసురోత్తమ" (209ప 2ఆ. ఆ. ప.) "భూసురోత్తమ" (123ప 3ఆ ఆ. ప) "భూసుర ప్రవరుల" (23ప.4ఆ ఆ.ప.) "భూసురవర్యా" (4ప 5ఆ ఆ. ప.) "నుతభూసురోత్తమున్" (185ప 5ఆ ఆ ప.) "జగన్నుత విప్రులకు" (200ప 5ఆ ఆ ప) "సద్విజులు" (235ప. 6ఆ. ఆ. ప.) "బ్రాహ్మణప్రవరుల" (173 ప 7ఆ. ఆ. ప) "సద్విజుల్" (183ప. 7ఆ ఆ ప) "భూసురోత్తములు" (186ప. 7ఆ ఆ ప) "ధరామరేంద్ర వరుల" (4ప 9ఆ ఆ ప) "ధరణీసురోత్తమ" (139ప. 8ఆ. ఆ. ప.) "బ్రాహ్మణ ప్రవరుల" (121ప. 2ఆ స ప) "మహీసురప్రవరులు" (11ప 1ఆ. అర ప) "భూమిసురోత్తమున్" (206ప. 1ఆ. అర. ప.) "జగతీదేవోత్తములు" (141ప 2ఆ అర ప) "బ్రాహ్మణ ప్రవరులు (14ప. 3ఆ అర. ప.) "ఉత్తమద్విజుడు" (128ప. 3ఆ. అర ప)

ఇందలి ఉత్తమ, సత్, వర, ప్రవర, వరేణ్య, జగన్నుత ప్రభృతి విశేషణములు కర్మమార్గమును అనుష్ఠించు, జ్ఞానమార్గమును ప్రతిష్ఠించు బ్రాహ్మణులకే వర్తించును. వారి కరవిధులను, జ్ఞాననిధులను మూలాతిశాయిగాను, అమూలకముగను నన్నయ అభివర్ణించును.

ధృతరాష్ట్రి పాండుకుమారుల బాల్యమునందు, భీష్ముని అనుశాసనమున కౌరవరాజ్యము గౌరవమందుటను వర్ణించునెడ- ప్రజలు దానపరులు, ధర్మశీలురు, యజ్ఞవ్రతపరాయణులు, అన్యోన్యప్రీతి సంయుక్తులునై అభివృద్ధి చెందిరని మూలమునందు కలదు

"దానక్రియా ధర్మశీలా యజ్ఞవ్రతపరాయణాః
అన్యోన్యప్రీతి సంయుక్తా వ్యవర్ధన్త ప్రజా స్తదా." 6శ్లో. 102అ 1ప.

ఇందలి "యజ్ఞవ్రతపరాయణా" అను ఒక్క అంశమునకు నన్నయ రచించిన పద్యమిది :

"అమలాచార్య పవిత్ర భూసురవరేణ్యాగార పుణ్యప్రదే
శములం దధ్యయనారవంబు విధివత్స్వాహాస్వధాస్వస్తిశ
బ్దములుఁ మంగళతూర్యఘోషములు నుద్యత్కౌతుకాశీర్నినా
దములున్ రమ్యతరంబులయ్యె ధరణిం దద్రాజ్య సంవృద్ధితోన్."

4ప. 5అ. ఆ. ప.

ఇందు స్వచ్ఛమైన ఆచారములచేత పవిత్రమైనబ్రాహ్మణ శ్రేష్ఠుల అగ్రహారములందు వేదాధ్యయనరావము, మంత్రపారాయణధ్వానము, మంగళతూర్యఘోషములు, ఆశీర్నినాదములు రాజ్యాభివృద్ధి తోపాటు రమ్యతరములైనవని కలదు. వేదాధ్యయనము, వేదవిధ్యనుష్ఠానము రమ్యతరమగుట నన్నయ ఆత్మీయతకు రత్నముకురము

అర్జునుడు మత్స్యయంత్రమును పడగొట్టుట చూచిన సమస్తజనులు విస్మితులై పొగడుటను నన్నయ అమూలకముగ రచించిన పద్యమిది

"ఫలపవనాంబుభోజనకృశవ్రతవృత్తులఁ జేసి చూడ దు
ర్బలతనులయ్యు బ్రాహ్మణు లపారతపోబలసంపదన్ మహా
బలయుతు లట్టి వారలకు భవ్యుల కెందు నసాధ్యమెద్దియుం
గలదె చరాచరాఖిలజగంబులఁ బెద్దల కారె సద్ద్విజుల్."

183 ప. 7 అ. ఆ. ప,

అర్జునుడు బ్రాహ్మణవేషధారి అగుటవలన అందఱును బ్రాహ్మణుడని భావించిరి. క్షత్రియుడు చేయవలసిన పని, క్షత్రియుడు చేయలేక పోగా బ్రాహ్మణుడు చేయుట విస్మయము కలిగించినది. ఏ క్షత్రియునికిని లేని శక్తి ఈ బ్రాహ్మణునికి ఉండుటకు హేతువు, ఫలాహారము, వాయుభక్షణము, జలపానము మాత్రమే నియమితమైన వ్రతవిధానము. అది శరీరమును కృశింపఁజేసినను, అపారమైన ఆత్మబలమును సమకూర్చును అట్టి వారికి ఎక్కడను అసాధ్యమన్నది ఏదియును లేదు అంతేకాదు శుభవ్రత వృత్తుల వలన సమస్తచరాచరజగత్తులోను సద్ద్విజులు అని సమస్తజనుల నిష్కర్ష ఇది నన్నయ ఆత్మప్రత్యయము.

సంస్కృతభారతమునందు బహుస్థలములందు బ్రాహ్మణుల మాంసాహారము కలదు. కల్మాషపాదుని కథ ప్రథమోదాహరణము ఒక బ్రాహ్మణుడు కల్మాషపాదుని "సమాంసంబయిన భోజనం" బడుగును. (114 వచ. 7 ఆ. ఆ ప.) అని నన్నయ భారతమునందును కలదు. అది పరిహరించుటకు అవకాశము లేనిది. బౌద్ధజైనమతముల అహింసాసిద్ధాంతమువలన మాంసాహారము నిషిద్ధమైన బ్రాహ్మణులలో ఆంధ్రులు కలరు. ఆంధ్రుడైన నన్నయ అన్యస్థలములందు బ్రాహ్మణుల మాంసాహారమును పరిహరించెను మయుడు నిర్మించిన సభలో ప్రవేశించినపుడు ధర్మరాజు నానాదిక్కులనుండి వచ్చిన బ్రాహ్మణులను నేయి, పాయసము, మాంసభక్ష్యములు, మాంసఖాద్యములు, చోష్యములు, పానీయములతో భుజింపఁజేసినట్లు సంస్కృత భారతమునందు కలదు

"తతః ప్రవేశనం చక్రే తస్యాం రాజా యుధిష్ఠిరః
అయుతం భోజయామాస బ్రాహ్మణాన్ నరాధిపః ॥
[సాజ్యేన పాయసేనైవ మధునా మిశ్రితేన చ
భక్ష్యై ర్మూలైః ఫలైశ్చైవ మాంసై ర్వారాహహారిణైః ॥
కృసరేణాథ జీవన్త్యాహవిష్యేణ చ సర్వశః
మాంసప్రకారై ర్వివిధైః ఖాద్యై శ్చాపి తథా నృప ॥
చోష్యైశ్చ వివిధైః రాజన్ పేయైశ్చ బహువిస్తరైః ]
అహతైశ్చైవ వాసోభి ర్మాల్యై రుచ్చావచైరపి ॥
[తర్పయామాస విప్రేన్ద్రాన్ నానాదిగ్భ్య స్సమాగతాన్ ]
దదౌ తేభ్య స్సహస్రాణి గవాం ప్రత్యేకశః పునః"

1-3 శ్లో. 4 అ. స. ప.

ఇది నన్నయ భారతమునందు ఇట్లు కలదు.

"వీరుఁడు ధర్మజుండు పదివేవురు విప్రుల కొప్పఁ బాయసా
హారము భక్తిఁ బెట్టి మఱి యందఱకుం జెఱు వేయు నేసి వి
స్తారయశుండు ధేనువుల ధర్మవిధిన్ మణిముద్రికాద్యలం
కారదుకూల పుష్పఫలగంధయుతంబుగ నిచ్చి లీలతోన్. 14 ప.

మంచిగ భూరిభూసురసమాజము లెల్లను భక్తితోడఁ బూ
జించి యభీష్టదానములు సేసి ధనార్థులఁ దన్పి దిక్కులన్
నించె యశంబు బంధులకు నెయ్యురకున్ హృదయప్రియంబు గా
వించె విభూతి యేర్పడఁ బవిత్రుఁడు ధర్మసుతుండు నెమ్మితోన్.
16 ప. 1 అ. స. ప.

ఇందు పాయసాహారమే గాని మాంసాహారము లేదు. అంతేకాదు, మణులు పొదిగిన ఉంగరములు మొదలైన ఆభరణములు పుష్పఫలయుతముగ ఇచ్చి, బ్రాహ్మణ సమాజములనెల్ల భక్తితో పూజించి, సహస్రగోదానమేగాక అభీష్టదానములును చేసి, ధర్మరాజు యశస్సు గడించెనని కలదు. మాంసాహారపరిహారము, మణి ముద్రికా ప్రదానమును ఆంధ్రదేశవ్యవహారము, ఆంధ్రుడైన నన్నయ ఆత్మీయతకు నిదర్శనము.

ఇంద్రాగ్నియమవరుణకుబేరులు విష్ణువుతో, కాలకేయులు బ్రాహ్మణులను రాత్రులు వధించుచున్నారని, బ్రాహ్మణులు క్షీణించిన భూమి క్షయమగునని, భూమి క్షీణించిన త్రిదివములు క్షయమగునని చెప్పినట్లు మూలమునందు కలదు.

"క్షీణేషు చ బ్రాహ్మణేషు పృథివీ క్షయ మేష్యతి
తతః పృథివ్యాం క్షీణాయాం త్రిదివం క్షయ మేష్యతి."
4 శ్లో. 101 అ. అర. ప.

ఇది నన్నయ భారతమునందు ఇట్లు కలదు.

"కాలకేయులు మహాకాయులు పగలెల్ల
జలదుర్గబలమున జలధినుండి
రేలెల్లఁ జని నలిరేఁగి మునీశ్వ రా
శ్రమముల సద్ధర్మచారులైన

బ్రాహ్మణప్రవరులఁ బాయక వధియింతు
రెట్టి పాపాత్ములు నెయ్యుగముల
బ్రాహ్మణహింస యాపాదింతురే యది
వీరల వలనన వినఁగఁబడియెఁ

బరమసాధులైన బ్రాహ్మణులకు బాధ
యగుడు మహికి బాధ యగు ధరిత్రి
కైన బాధఁజేసి యఖిలలోకంబులుఁ
గరము బాధ నొందుఁ గమలనాభ. 14 ప.

ఎట్లనిన వేదంబులు ధరియించి విప్రులు వేదచోదితంబులైన
పుణ్యకర్మంబులు విధియించుటంజేసి హవ్యకవ్యంబుల
దేవతలుం బితరులుఁ దృప్తులైన వారివలన నెల్లలోకంబులకు
సుఖంబగుం గావున బ్రాహ్మణోపద్రవంబు పరిహరించి
లోకంబులు రక్షింపుము." 15 ప 3 ఆ. అర ప.

ఇందు బ్రాహ్మణప్రవరులు, సద్ధర్మచారులు, పరమసాధువులును అని, ఎట్టి పాపాత్ములను ఏ యుగములందును బ్రాహ్మణహింస చేయలేదని అమూలకముగ కలదు. అంతేకాదు "బ్రాహ్మణులకు బాధ కలిగిన, ధరిత్రికి బాధకలుగును; ధరిత్రికి బాధ కలిగిన అఖిల లోకములకును బాధ కలుగును." అను మూలాభిప్రాయమునకు అమూలకముగ హేతుకల్పనము కలదు. బ్రాహ్మణులు వేదాధ్యయనము చేయుట, వేదవిధ్యనుష్ఠానము చేయుట వలన సమస్తలోకములకు సుఖశాంతులు కలుగునని హేతుకల్పనము అది నన్నయ ఆత్మీయతాముద్రయే.

ద్రౌపది స్వయంవర పుష్పహారమును బ్రాహ్మణ వేషధారియైన అర్జునుని మెడలో వైచిన అనంతరము, రాజు లందఱును ద్రుపదుని తోబాటు బ్రాహ్మణుని కూడ అధిక్షేపించినట్లు మూలమునందు కలదు.

"బ్రాహ్మణో యది చాపల్యా ల్లోభా ద్వా కృతవా నిదం"

బ్రాహ్మణుడు చాపల్యము చేతనో, ప్రలోభము వలననో మత్స్యయంత్రమును భేదించి రాజకుమారిని వివాహమాడెనని అధిక్షేపణ బ్రాహ్మణుని అధిక్షేపించుటకు మాఱు సమర్థించినట్లు, ద్రుపదునే దూషించినట్లు నన్నయ అన్యథా కరించెను.

"తన విద్య పేర్మి నృపసం
దనఁ బడసెను విప్రుఁ డితని తప్పే కడు దు
ర్జనుఁ డీ ద్రుపదుఁడు నృపతుల
ననయంబును మెచ్చఁడయ్యె నతిగర్వితుఁడై" 190ప 7ఆ ఆ. ప.

ఇందు విప్రుని తప్పు లేదని సమర్థనము, ద్రుపదుడు దుర్జనుడని దూషణము కలదు విప్రసమర్థనమునకు నిమిత్తము విప్రవిద్య. వేదవిద్యతోపాటు ధనుర్వేద విద్యయును విప్రవిద్యయే అన్యథాకరణమిది నన్నయ ఆత్మీయతకు నిదర్శనమే.

పూర్వోదాహృతమైన వేంగిదేశ విభవ వర్ణనమును నన్నయ ఆత్మీయతకు ప్రబల నిదర్శనము

ధర్మరాజు రాజసూయయాగము చేయుటకు బ్రాహ్మణులతోను బంధువర్గము తోను, మంది మార్బలనుతోను యజ్ఞాయతనమునకు అరిగెనని మూలమునందు కలదు.

"జగామ యజ్ఞాయతనం (సం) వృతో విప్రైః స్వహస్రశః
భ్రాతృభిః జ్ఞాతిభిశ్చైవ సుహృద్భి స్సచివై స్సహ."
44–45శ్లో 30అ స ప.

ఇది నిమిత్తముగ నన్నయ ఇట్లు వర్ణించెను

"బ్రహ్మవిదులయిన నిఖిల
బ్రాహ్మణసత్తములచేతఁ బరివేష్టితుఁడై
బ్రహ్మణ్యుఁ డొప్పెఁ గురుపతి
బ్రహ్మర్షిపరీతుఁ డయిన బ్రహ్మయ పోలెన్." 290ప 1ఆ స. ప.

ఇందు నిఖిల బ్రాహ్మణసత్తములును బ్రహ్మవిదులు బ్రహ్మవిదులన బ్రహ్మ జ్ఞానవిదులు కర్మమార్గముతోపాటు జ్ఞానమార్గమును నన్నయ కాంక్షితార్థము.

## అంకితము

నన్నయ భారతము రాజరాజనరేంద్రాంకితము. అయినను కాదను అభి ప్రాయములు కలవు[58] అందుకు ప్రదర్శించిన ఉపపత్తులివి :

1 సంస్కృతకావ్యమును అంకితమిచ్చు సంప్రదాయము లేదు
2 నన్నయ భారతమునందు అంకితమను మాట లేదు.

3. రాజరాజనరేంద్రుడు అంకితమిమ్మని అడుగలేదు
4 అంకితచిహ్నములైన షష్ఠ్యంతపద్యములు లేవు.
5. రాజరాజనరేంద్రుడు కృతి భర్త కాడు ప్రధానశ్రోత

సంస్కృతకావ్యమును అంకితమిచ్చు సంప్రదాయము లేని మాట నిజము. కాని, ప్రాకృత కావ్యమును అంకితమిచ్చు సంప్రదాయము కలదు. కన్నడకావ్యమును అంకితమిచ్చు సంప్రదాయము కలదు నన్నయ భారతమునందు అంకితమను మాట లేని మాట వాస్తవము తిక్కన భారతమునందు, ఎఱ్ఱన హరివంశమునందు అంకితమను మాట లేదు తిక్కన భారతము హరిహరనాధునికి అంకితము. ఎఱ్ఱన హరివంశము ప్రోలయ వేమారెడ్డికి అంకితము రాజరాజనరేంద్రుడు అంకితమిమ్మని అడుగనిమాట యధార్థము ప్రోలయ వేమారెడ్డి కూడ అంకితమిమ్మని అడుగలేదు నన్నయ భారతమునందు అంకితచిహ్నములైన షష్ఠ్యంత పద్యములు లేని మాట సత్యము గోడగి త్రిపురారికి అంకితమైన పాలకురికి సోమనాధుని అనుభవసారమునందు, మనుమసిద్ధికి అంకితమైన తిక్కన ఉత్తర రామాయణమునందు, హరిహరులకు అంకితమైన కొఱవిగోపరాజు సింహాసనద్వాత్రింశికయందును షష్ఠ్యంతపద్యములు లేవు నన్నయ భారతమునందు అంకితచిహ్నములైన ఆశ్వాసాద్యంత పద్యములు కలవు ప్రధానశ్రోత కృతిభర్తయే. స్మృత్యంకితము లందు ప్రధానశ్రోత, కృతిభర్త భిన్నులు ఆశ్వాసాద్యంతపద్యములు అంకితచిహ్నములు కానిచో, ఎఱ్ఱన అరణ్యపర్వ శేషములోని ఆశ్వాసాద్యంతపద్యములు రాజరాజనరేంద్రుని పరము కావు. అంకిత మనగా పేర వెలయించుట నన్నయ భారతములోని ఆశ్వాసాద్యంతపద్యములు రాజరాజనరేంద్రుని పేరనే కలవు. నన్నయ భారతము రాజరాజనరేంద్రాంకితమే.[59]

# ఇతర కృతులు

నన్నయభట్టు రాఘవాభ్యుదయము, ఇంద్ర విజయము, చాముండికా విలాసము అను కావ్యములు, ఆంధ్రశబ్ద చింతామణి అను వ్యాకరణశాస్త్రగ్రంథము, లక్షణసారము అను ఛందోగ్రంథము రచించినట్లు కలదు. అవి నన్నయభట్టు రచింపలేదని కలదు.[60] ఆంధ్రశబ్ద చింతామణి, లక్షణసారము ఆదికవి నన్నయభట్టు రచించినవి కావు అపరనన్నయభట్ట కృతములు.[61] రాఘవాభ్యుదయము, ఇంద్ర విజయమును అపరనన్నయభట్టు కృతములు కావచ్చును. చాముండికా

విలాసము కూట సృష్టి. కూటసృష్టిలోను కూటసృష్టి కలదు చాముండికా విలాసము నందు చాముండిక అని ఉన్న స్థలములందెల్ల చౌడేశ్వరి అని ఉండి, చౌడేశ్వరీ విలాసము కలదు [62] అది, ఇది పరమార్వాచీనగ్రంథములు. అందిట్లు కలదు.[63]

"వ్యాసాదిఋషులకు వందన మొనరించి
కవిమల్లులను జాల ఘనత నెంచి
సుకవీశ్వరులనెల్ల సొంపుగా వినుతించి
గురుపాదయుగ్మము ల్పరవిఁ గొలిచి
యిష్టదేవాళి సంతుష్టత సేవించి
మంత్రాధిదేవత మదిఁ దలంచి
సర్వజనాళికి సంతోష మొనరించి
పార్థివసభల వైభవము గాంచి
యాంధ్రవాక్యానుశాసనం బతిశయిల్లఁ
జేసి లోకోపకారార్థసిద్ధిఁ జేసి
ఘనత రాజనరేంద్రుని కరుణఁ బడసి
సటివాఁడను నన్నయభట్ట నేను"

ఇది సీసపద్యము అందు యతిప్రాసయతి లేదు ఆదికవి నన్నయభట్టు పేర అర్వాచీనకవి చేసిన కూటసృష్టి అనుట కిది చాలును.

నన్నయ శారదగాత్రము భారత శారద రాత్రము

# ఇతర కవులు

**పావులూరి మల్లన :** ఇతడు సారసంగ్రహగణితమును రచించెను. అది మహా వీరాచార్యుని సారసంగ్రహగణితమునకు అనుసరణము. [64] అందు గ్రంథకర్త పావులూరి మల్లన "కమ్మనాఁటిలోపల విలసిల్లిన పావులూరివిభుఁడు" అని కలదు (5 ప.) పావులూరి గ్రామకరణమగును అతని సారసంగ్రహగణితము నందు సివ్వన పుత్త్రుడు మల్లన, మల్లన పుత్త్రులు సివ్వన, చిమ్మన, గుణసూర్య దేవుడు, ప్రోలనార్యుడు అని, అందు సివ్వన పుత్త్రుడు మల్లన అని కలదు మల్లన పుత్త్రులు నలుగురిని తెలుపు పద్యము (7 ప.) కొన్ని ప్రతులందు లేదు. పెక్కు

ప్రతులందు కలదు. [65] అది తద్భవవ్యాజయతికి లక్ష్యముగ పలువురు లాక్షణికులు ఉదాహరించినది ప్రక్షిప్తము కాఁజాలదు ఆ పద్యమిది :

"శ్రీనిలయుండు సిద్ధనయుఁ జిమ్మనయుం గుణసూర్యదేవుఁడున్
ధీనిధి ప్రోలనార్యుఁడును దేజమున న్రవి తుల్యులైన యా
సూనుల నల్వురం బడసె సూరిజనస్తుతులైన సత్యవి
జ్ఞానులు పద్మగర్భువదనంబులు నాలుగుఁ బోలు వారిలోన్"

ఇందు నాల్గవ పాదమునందు తద్భవవ్యాజయతి మైత్రి కలదు. తాత మల్లన "రాజరాజభూపాలకు చేతఁ బీఠపురపార్శ్వమునన్ నవఖండవాడయన్ ప్రోలు మహావిభూతితోఁ బడసి"నట్లు సారసంగ్రహగణితమునందు కలదు (6 ప.) సారసంగ్రహగణితకర్త మనుమడు మల్లన. పిఠాపురము దగ్గఱి నవఖండవాడకు "కమ్మనాఁడిలోపల విలసిల్లిన" సారసంగ్రహగణితశాస్త్ర కర్త మనుమడు మల్లన ప్రతిగ్రహీత అగుట కంటె తాత మల్లన అగుట సుసంగతమగును నవఖండవాడ శాసనము కానరాదు. ఇంతకు, సారసంగ్రహగణితము కావ్యము కాదు గణితశాస్త్ర గ్రంథము. తెలుగు శాస్త్రవాఙ్మయ చరిత్రకు ప్రథమగణ్యము

నన్నయ కాలమునందు రాజమహేంద్ర కవీంద్రులు కలరుగాని, వారు తెలుగు కావ్యములు రచించినట్లు నిదర్శనము లేదు.

నన్నయ యుగమునందు నన్నయ ఒక్కడే కవి. మహాకవి.

# యుగప్రాముఖ్యము

"ఆంధ్రకవిత్వ విశారదుండు, విద్యాదయితుండు" అని తిక్కన (6 ప. 1 ఆ ని. ప) "నన్నయభట్టు మహాకవీంద్రుఁ"డని ఎఱ్ఱన (469 ప. 7 ఆ. అర ప) "నన్నయభట్టోపాధ్యాయ సార్వభౌముఁడు, కవితాపట్టాభిషిక్తుఁడు; భారతఘట్టోల్లంఘన పటిష్ఠ గాఢప్రతిభుఁడు" అని శ్రీనాథుడు ప్రశంసించిన నన్నయ ఆదికవి ఆచార్యకవి.

ఆదిని అజ్ఞాతవాసము చేసి, అనంతరము ప్రాకృత సంస్కృతభాషాయవనికాభ్యంతరముల ఓలమాసగొని, క్రమముగ శాసనఫలకముల శయనించి, చాటుమాటుగ వాడవాడల పయనించి, గాలిమేడల తేలియాడిన ఆంధ్రసరస్వతిని-నన్నయ కవితా మహా సామ్రాజ్యభద్రాసనాసీనురాలిని చేసెను. అందుకు

సంస్కృతసువర్ణాభరణములు కై సేసెను. సంస్కృత కర్ణాటకావ్యసమాసకుసుమా వళులను గుబాళింపఁజేసెను. దేశిచ్ఛందస్సుల కర్పూరరసమును, కన్నడచందస్సుల కస్తూరిని కలిపి మంగళనీరాజనమొసగెను వ్యాసమునీంద్రుని రసభావపదార్థములు కాచి వడబోసి, కరువు కట్టి గండరువు చేసి భారతబద్ధ నిరూపితార్థ చామరమును వీచెను సర్వప్రామాణ్యచ్ఛత్రమును పట్టెను వామనుని రీతిసిద్ధాంతము, ఆనంద వర్ధనుని ధ్వని సిద్ధాంతము, కుంతకుని వక్రోక్తి సిద్ధాంతమును త్రివేణీసంగమము వలె తీర్థమాతము చేసెను సుమనోదామసుహాసమో, శరజ్జ్యోత్స్నాసుధా పూరవికా సమో, లసన్మాణిక్యలావణ్యలాస్యవిలాసమో అనిపించునట్లు ఆంధ్రకవితా పట్టాభి షేకము కావించెను.

సంస్కృత పద్యవిద్యకు వాల్మీకి ఆద్యుడు వలె, తెనుగు పద్యవిద్యకు నన్నయ ఆద్యుడు అంతేకాదు నన్నయ గద్యవిద్యకును ఆద్యుడు. నన్నయ పద్యము వలె వచనమును లయాత్మకము నన్నయ పద్యములు బుక్కుల వలె నినదించునని ప్రసిద్ధము నన్నయ వచనములును సప్తస్వరముల వలె రవళిం చును నాదమాధుర్యము నన్నయ పద్యగద్యములకు సమానము. నవ్యనవనీత సమానము నన్నయ కవిత్వము మొత్తము రసవత్తరము నన్నయకు సర్వాంధ్ర కవిసమాజము సతశీర్షనమస్కృతము

ఆంధ్రజాతికి సాహిత్యసంపదను అందఁజేసిన రాజరాజనరేంద్రుడు, అందిచ్చిన నన్నయ ఆంధ్రులకు ప్రాతఃస్మరణీయులు.

* * *

# శివకవియుగము

## చారిత్రిక నైపథ్యము

రాజరాజనరేంద్రుని అనంతరము తూర్పు చాళుక్యులకు తుదిఘడియలు సమీపించినవి. వేంగిదేశము వెలుగులు వెలవెలఁబోయినవి. రాజరాజనరేంద్రుని సవతి సోదరుడు విజయాదిత్యుడు తన కుమారుడు రెండవ శక్తివర్మకు 1061వ సంవత్సరమునందు పట్టము కట్టెను. అతడు సంవత్సరము తిరుగుసరికి వీరస్వర్గమలంకరించెను. విజయాదిత్యుడే రాజయ్యెను 1076వ సంవత్సరము వఱకు పరిపాలించెను[2] 1070వ సంవత్సరమునందు రాజరాజనరేంద్రుని కుమారుడు మొదటి కులోత్తుంగచోళుడు తమిళ దేశమునందు చోళ సామ్రాజ్య సింహాసనమును అధిష్ఠించెను.[3] అతని రాజ్యకాలము 1070–1118 రాజధాని గంగైకొండ చోళపురము. అతని కుమారులు రాజరాజముమ్మడిచోడుడు (1076–79), వీరచోడుడు (1079–84), రాజరాజ చోడగంగు (1084–89), మఱల వీరచోడుడు (1089–94), వీరపెర్మాడిచోడుడు (1094–1107), పరాంతకచోడుడు (1107–19) వేంగిదేశమునకు రాజప్రతినిధులు.[4] చాళుక్యచోళుడైన మొదటి కులోత్తుంగ చోడుడు 1106వ సంవత్సరమునందు కుమారులైన రాజప్రతినిధులకు బాసటగ కులక్రమాగతులైన రాజోద్యోగులను, సేనాధిపతులను సామంత మండలికులుగ నియమించెను.[5] వారు వెలనాటి చోళులు, కోన హైహయులు మొదలైనవారు

కళ్యాణి చాళుక్యరాజైన త్రిభువనమల్ల విక్రమాదిత్యుడు 1084లోను, 1086లోను వేంగి దేశముపై దండయాత్రలు సాగించెను[6] అతని దండనాయకుడైన అనంతపాలుడు 1115 ప్రాంతమున కృష్ణానదికి దక్షిణమునందలి కొంత వేంగిదేశమును, 1118 ప్రాంతమున కృష్ణా గోదావరీనదుల నడిమి వేంగిదేశమును జయించెను.[7]

మొదటి కులోత్తుంగచోళుని తర్వాత అతని కుమారుడు, పరాంతకచోడుని తమ్ముడు అయిన విక్రమచోళుడు చోళసింహాసనమును అధిష్ఠించెను[8] అతని రాజ్యకాలము 1118–35. అతడు వేంగిదేశమును తిరిగి జయింపవలెనని తీవ్రముగ ప్రయత్నించెను. 1127 ప్రాంతమున త్రిభువనమల్ల విక్రమాదిత్యుని ఓడించెను.

కృష్ణా గోదావరీనదుల నడిమి వెంగిదేశమును జయించెను.[9] ఆ యుద్ధమునందు ప్రముఖపాత్ర వహించిన చాళుక్య యుద్ధమల్లుని సంతతిలోని మల్లభూపతిని సామంత మాండలికుని చేసెను.[10] కాని త్రిభువనమల్ల విక్రమాదిత్యుని తర్వాత కళ్యాణి చాళుక్యరాజైన భూలోకమల్ల సోమేశ్వరుడు 1132 ప్రాంతమున సింహాచల పర్యంతము వెంగిదేశమును జయించెను.[11] విక్రమచోళుడు తన రాజ్యకాలము చివర, మరల వెంగిదేశమును జయించెను.[12]

విక్రమచోళుని తర్వాత అతని దౌహిత్రుడు రెండవ కుళోత్తుంగచోళుడు చోళసింహాసనమును అధిష్ఠించెను.[13] అతని రాజ్యకాలము 1135-50 రెండవ కుళోత్తుంగచోళుని తర్వాత అతని కుమారుడు రెండవరాజరాజచోళుడు చోళ సింహాసనమును అధిష్ఠించెను.[14] అతని రాజ్యకాలము 1150-79 రెండవ రాజరాజచోళుని తర్వాత అతని దౌహిత్రుడు రెండవ రాజరాజు చోళసింహాసనమును అధిష్ఠించెను.[15] అతని రాజ్యకాలము 1168-79 వీరి కాలమున వేంగి దేశమునందు చాళుక్యచోళుల అధికారము నిరాఘాటముగా సాగెను. అనంతరము వేంగిదేశమునందు చాళుక్య చోళుల అధికారము ముగిసెను.

మొదటి కుళోత్తుంగచోళుడు తమిళ దేశమునందు చోళసామ్రాజ్యాధిపతి, అతని కుమారులు వేంగిదేశమునందు రాజప్రతినిధులును అగుటవలన, ఆ కాలమునందు తమిళాంధ్రుల రాకపోకలు సాగుట తథ్యము. అంతేకాదు తమిళదేశమునందు అప్పటికే ప్రసిద్ధమైన సంస్కృతభాషలోని శైవాగమగ్రంథములు ఆంధ్రులకు మనోహరములగుట, తమిళభాషలోని అఱువత్తుమువ్వారు అను గ్రంథములోని అరువదిముగ్గురు శివభక్తుల కథలు కర్ణరసాయనములగుట సహజము. తన్నిమిత్తమున శైవాగమగ్రంథములలోని శివతత్త్వము, అఱువత్తుమువ్వారులోని భక్తితత్త్వము, ఆంధ్రత్వము సమ్యక్సమ్మిళితమైన నూతన శైవమతము తెలుగు దేశమునందు తేజరిల్లినది. అది వీరశైవమతము పండితత్రయప్రతిపాదితము. పూర్వరంగప్రవర్తకుడు శ్రీపతిపండితుడు. నాందీసూత్రధారి శివలెంక మంచన పండితుడు. నాంద్యంత సూత్రధారి మల్లికార్జున పండితుడు.

"కడు సద్ధి సుత్పత్తికర్త నా బ్రహ్మ
వడి బ్రహ్మమను బ్రహ్మవాదులఁ ద్రుంచి
హరభక్తి యుత్పత్తి కధిపతి నాఁగఁ
బరగెఁ దాఁ దొల్లి శ్రీపతి పండితయ్య;

అర్జునుండు. (ద్రౌపదిం జూచి యిట్లనియె )

ఈ పురుషోత్తముండు మన కిందఱకుం గుశలంబు సేయుచుం
బాపకలంకపంకములఁ బాయఁగఁ జేయుటఁ జేసి ధర్మదో
ర్దీపిత శత్రు సంహతిహతిం బరమార్థము పొందు నెల సం
తాపము నీకుఁ జేయఁగఁ బ్రధిమజయోన్నతి గల్గియుండఁగన్.

(అనిన)

ధృష్టద్యుమ్నుండు:— (ఇట్లనియె)

వినయవిహీనుల దుర్యో
ధనదుశ్శాసనులఁ బవనతనయుఁడు రాధా
తనయుని నరుఁ డేఁ గుంభజు
ననిఁ జంపుదు మేల వగవ నంబుజనేత్రా"

140–145ప.1ఆ ఆర.ప.

## : వర్ణనపద్ధతి :

"పరిఘుజలంబులం దమలపంకరుహోత్పలకైరవాదిసుం
దరకుసుమంబులొ ఘనపథంబున నుజ్జ్వలతారకానిరం
తరకుసుమంబులొ వెలయుఁ దత్పురవప్రము పాదపీఠికా
శిరముల కొప్ప నర్చనలు సేసిన పువ్వుల యవ్విధం బనన్."

76ప—8ఆ ఆ.ప.

"అలఘుఫణీంద్రలోకకుహరాంతరదీప్తమణిస్ఫురత్ప్రభా
వలి గల దాని శశ్వదుదవాసమహాప్రతశీతపీడితా
చలమునిసౌఖ్య హేతువిలసద్బడబాగ్నిశిఖాచయంబులొ
వెలిఁగెడు దానిఁ గాంచె రరవిందనిభానన లమ్మహోదధిన్. "

28ప.2ఆ.ఆ.ప.

## గంధమాదనపర్వతము

"నానావర్ణశిలావిహ
గానేకమృగాభిరామమై భూనారీ
నానాభరణవిభూషిత
పీనోన్నతకుచముఁ బోవె వెలిఁగెడు దానిన్

లలితాచ్ఛస్ఫటికశిలా
తలములపైఁ బాఱు విమలతరనిర్ఝరిణీ
జలపూరములను తారో
ల్లలదురుహారాళి నుజ్జ్వలంబగు దానిన్" 292,293ప.3ఆ ఆర ప.

## ఉభయవాక్ప్రౌఢి

"భాషింతు నన్నయభట్టు మార్గంబున నుభయవాక్ప్రౌఢి నొక్కొక్కమాట"
అని శ్రీనాథుని కాశీఖండమునందు కలదు (1ప.1ఆ.). ఉభయవాక్ప్రౌఢి అనగా సంస్కృతప్రౌఢి. తెనుగునుడికారము. గౌడీరీతి, రీత్యంశమైన అక్షరరమ్యత సంస్కృతప్రౌఢి వైదర్భీరీతి తెనుగునుడికారము అంతేకాదు.

"బాలుఁ డొక్కండు కొండొక కోల సేతఁ
బట్టికొని యేను రక్కసుఁ గిట్టి చంపి
చులుకఁగా వత్తు మీ రేద్వవలవ దనుచుఁ
గలయ నూరార్చెఁ దన తొక్కుఁబలుకు లొప్ప." 260ప.6ఆ ఆ ప

"అన్న సహదేవ నీవును
నన్నలతో నరిగెదయ్య యట యదవుల కే
పున్నను సుతులందఱు నిం
దున్నట్టుల నాకుఁ జిత్త మూఱడి యుండున్." 288ప.2ఆ స.ప.

"ఇల్వలుండు ననుజు నెప్పటిక్రియఁ బిల్వ
నెఱిఁగి దాని నమ్మునీశ్వరుండు
గడుపుఁ దడవి కొనుచుఁ గ్రుస్సున ద్రేఁచిన
నసుర జీర్ణమయ్యె నాక్షణంబ." 345ప.ఆ.2ఆర.ప.

ఇత్యాది పద్యములను, "రోయు తీఁగకాళ్లం బెనఁగెన్" (220ప.5ఆ ఆ ప.) వంటి సామెతలు, "కుంతి కడుపు చల్లగాఁ బుట్టిన" (18ప.6ఆ ఆ ప) వంటి నానుడులు, "వీరెవ్వరయ్య ద్రుపదమహారాజులె" (89ప.6ఆ.ఆ.ప) వంటి పలుకు బడులు తెనుగునుడికారమునకు మచ్చుతునకలు

నన్నయ భారతమునందు సంస్కృత కావ్యములలోని పదబంధములు కలవు. అంతేకాదు కన్నడ కావ్యములలోని పదబంధములును కలవు.[56]

## సంస్కృత కావ్యానుసరణములు :

| | |
|---|---|
| "గుర్వర్థమర్థీ శ్రుతపారదృశ్వా" | 24శ్లో. 5స. ర. వం. |
| "గుర్వర్థమర్థినై మానవేశ" | 94ప. 1ఆ ఆ ప |
| "ప్రవర్తితో దీప ఇవ ప్రదీపాత్" | 37శ్లో. 5స. ర వం |
| "దీపంబువలన కొండొక దీపంబు పుట్టించినట్లు" | 89ప. 4ఆ ఆ ప |
| "దారక్రియా యోగ్యదశం చ" | 40శ్లో. 5స ర వం |
| "చనఁ బేడికి దారక్రియయును" | 14ప. 1ఆ. స. ప. |

## కన్నడ కావ్యానుసరణములు :

| | |
|---|---|
| "సరళతమాలతాళహరి చందననందన భూజరాజియుం" | 52ప. 5ఆ పం. భా. |
| "సరళతమాలతాళహరిచందన చంపక నారికేళ" | 78ప. 8ఆ ఆ. ప |
| "ఏలాలవంగలవలీ వెలావన భూమియోళ్" | 13ప. 2ఆ ఆ. పు. |
| "ఏలావన రమ్యములగు వేలావనములను | 137ప. 8ఆ. ఆ. ప. |
| "కురువృద్ధం కులవృద్ధం" | 44ప. 6ఆ. పం. భా. |
| "కురువృద్ధులో గురువృద్ధ బాంధవులు" | 233ప. 2ఆ. స. ప. |

పదబంధములు, సమాస మాత్రమేగాక, కన్నడ పద్యరచనా పద్ధతిని నన్నయ పాటించెను సంస్కృత శ్లోకములందు పాదాంత విరతి కలదు అది నన్నయకు పూర్వము తెలుగు పద్యములందును కలదు. కన్నడ పద్యములందు లేదు. నన్నయ పద్యములందును లేదు .

"సాల ప్రాంశు విశాలదోల నయనం ప్రోద్యద్భుజస్కంధసన్మీలతే-"

68ప 1ఆ పం భా.

"ఆ మహాంశుడు దనంతసత్త్వుడు సమస్తాక్రాంత మాతంగమర్యాద-"

8ప 4ఆ ఆ ప

"సకలక్ష్మాచరఖేచరాంచిత మహామాణిక్య గాణిక్యహ స్తిక"

16ప. 8ఆ పం భా

"మదమాతంగ తురంగ కాంచన లసన్మాణిక్య గాణిక్యసంపద"

18ప 1ఆ స ప

"సరసమృణాళనాళ వలయంగళౌజ్జ్వల వృత్త మౌక్తికా భరణ"

16ప 3ఆ పం భా

"అతి రుచిరాగతుం డయిన యాతనిచే హృదయప్రమోదజాతతముగ"

17ప 4ఆ ఆ ప.

ఇట్లు పాదాంతవిరతిని పాటించక పోవుటలోను పద్యగమనమునను ఒక ప్రత్యేకత కలదు. అది సార్వపథీనత తటిల్లతానటనము

# ఆత్మీయత

కవి ఆత్మీయత కావ్యమునందు ప్రతిఫలించుట సహజము. అది స్వతంత్ర కావ్యమునందు సర్వత్ర కనిపించును ఆంధ్రీకరణములందు అమూలక స్థలము లందు, అన్యథా మూలక స్థలములందు, స్వతంత్ర కల్పనములందు కనిపించును ఆత్మీయత అనగా చదువు, సంస్కారము, శీలము రాశీభూతమైన వ్యక్తిత్వము కావ్యమునందు ప్రతిఫలించిన కవి ఆత్మీయతను కనుగొనుటకు కవి జీవితచరిత్ర తెలియవలయును మన పూర్వకవులకు జీవితచరిత్రలు లేవు కట్టుకథలు, పుక్కిటి పురాణములు, జనశ్రుతులు మాత్రమే కలవు అవి చరిత్రాంశములు కావు అలతి అలతి జీవిత చరిత్రాంశములు కవుల అవతారికలందు కలవు అతిశయోక్తులైనను అబద్ధములు కావు సత్య గర్భితములు కవుల అవతారికలలోని కవుల జీవిత చరిత్రాంశములే కావ్యదర్పణములందు ప్రతిఫలించిన కవుల ఆత్మీయతలకు కర దీపికలు

నన్నయ "అవిరళజపహోమతత్పరుడు సంహితాభ్యాసుడు బ్రహ్మాండాది నానా పురాణ విజ్ఞాననిరతుడు" అని నన్నయ అవతారికయందు కలదు. జప

హోమములు వేదవిధులు సంహితలు వేదనిధులు. బ్రహ్మాండాదినానా పురాణ విజ్ఞానము "బ్రహ్మాండాది మహాపురాణచయతాత్పర్యార్థ నిర్ధారిత బ్రహ్మజ్ఞానము" వేదవిధ్యనుష్ఠానము కర్మమార్గము బ్రహ్మజ్ఞానము జ్ఞానమార్గము. ధర్మజిజ్ఞాస కావించునది పూర్వమీమాంస బ్రహ్మజిజ్ఞాస కావించునది ఉత్తరమీమాంస "నన్నయది పూర్వమీమాంస, తిక్కనది ఉత్తరమీమాంస" అని ఒక అభిప్రాయము కలదు.[57] కాని, పూర్వమీమాంసా పురస్కారమైన కర్మమార్గము, ఉత్తర మీమాంసా పురస్కారమైన జ్ఞానమార్గము" పంచమ వేదమై పరగు భారత సంహిత" యందే కలవు ఆదిసభారణ్యపర్వములందు కర్మమార్గము, ఉద్యోగభీష్మ శాంత్యాది పర్వములందు జ్ఞానమార్గము ప్రాధాన్యము వహించును. కర్మమార్గము కర్తవ్యము జ్ఞానమార్గము గంతవ్యము ఉభయమార్గములను అనుసరించువారు ఉత్తములు సచ్చరితులు నన్నయ "సద్వినుతావదాతచరితుడు" అని కూడ అవ తారికయందు కలదు. అట్టివారిని నన్నయ అధికరించును. సవిశేషముగ బ్రాహ్మణశబ్దమును నన్నయ బహుధా ప్రయోగించును.

"ఉత్తమ బహువేద విప్రులకు" (15ప. 1ఆ. ఆ ప) "జగన్నుత విప్రుల యందు" (100ప 1ఆ ఆ ప.) "ఉత్తమద్విజులు, ధరణీసురోత్తముల" (130ప. 1ఆ. ఆ. ప.) "సద్విజ భక్తుడనేని" (148ప. 1ఆ. ఆ. ప.) "భూసురోత్తమ" (152ప. 2ఆ. ఆ ప) "భూసుర ప్రవరుండు" (158ప. 2ఆ ఆ. ప.) "ద్విజవరులన్" (195ప. 2ఆ. ఆ. ప.) "భూసురోత్తమ" (209ప. 2ఆ. ఆ. ప.) "భూసురోత్తమ" (123ప. 3ఆ. ఆ. ప.) "భూసుర ప్రవరుల" (23ప.4ఆ ఆ ప.) "భూసురవర్యా" (4ప 5ఆ ఆ. ప) "నుతభూసురోత్తమున్" (185ప 5ఆ ఆ ప) "జగన్నుత విప్రులకు" (200ప 5ఆ ఆ. ప) "సద్విజులు" (235ప 6ఆ. ఆ ప) "బ్రాహ్మణప్రవరుల" (173 ప 7ఆ. ఆ. ప) "సద్విజుల్" (183ప 7ఆ ఆ ప) "భూసురోత్తములు" (186ప 7ఆ. ఆ ప) "ధరాసురేంద్ర వరుల" (4ప 8ఆ. ఆ. ప) "ధరణీసురోత్తమ" (139ప. 8ఆ ఆ. ప.) "బ్రాహ్మణ ప్రవరుల" (121ప 2ఆ స. ప.) "మహీసురప్రవరులు" (11ప. 1ఆ అర ప) "భూమిసురోత్తమున్" (206ప. 1ఆ. అర. ప.) "జగతీదేవోత్త ములు" (141ప 2ఆ అర ప) "బ్రాహ్మణ ప్రవరులు (14ప. 3ఆ. అర. ప.) "ఉత్తమద్విజుడు" (128ప 3ఆ. అర ప)

ఇందలి ఉత్తమ, సత్, వర, ప్రవర, వరేణ్య, జగన్నుత ప్రభృతి విశేషణ ములు కర్మమార్గమును అనుష్ఠించు, జ్ఞానమార్గమును ప్రతిష్ఠించు బ్రాహ్మణులకే వర్తించును. వారి కరవిధులను, జ్ఞానవిధులను మూలాతిశాయిగాను, అమూలకము గను నన్నయ అభివర్ణించును.

ధృతరాష్ట్రి పాండుకుమారుల బాల్యమునందు, భీష్ముని అనుశాసనమున కౌరవరాజ్యము గౌరవమందుటను వర్ణించునెడ- ప్రజలు దానపరులు, ధర్మశీలురు, యజ్ఞవ్రతపరాయణులు, అన్యోన్యప్రీతి సంయుక్తులునై అభివృద్ధి చెందిరని మూలమునందు కలదు

"దానక్రియా ధర్మశీలా యజ్ఞవ్రతపరాయణాః
అన్యోన్యప్రీతి సంయుక్తా వ్యవర్ధన్త ప్రజా స్తదా." 6శ్లో 102అ 1ప.

ఇందలి "యజ్ఞవ్రతపరాయణా" అను ఒక్క అంశమునకు నన్నయ రచిం చిన పద్యమిది :

"అమలాచార్య పవిత్ర భూసురవరేణ్యాగార పుణ్యప్రదే
శములం దధ్యయనారవంబు విధివత్స్వాహాస్వధాస్వస్తిశ
బ్దములుఁ మంగళతూర్యఘోషములు నుద్యత్కౌతుకాశీర్ని నా
దములున్ రమ్యతరంబులయ్యె ధరణిం దద్రాజ్య సంవృద్ధితోన్."

4ప. 5ఆ. ఆ. ప.

ఇందు స్వచ్ఛమైన ఆచారములచేత పవిత్రమైనబ్రాహ్మణ శ్రేష్ఠుల అగ్ర హారములందు వేదాధ్యయనరావము, మంత్రపారాయణధ్వానము, మంగళతూర్య ఘోషములు, ఆశీర్నినాదములు రాజ్యాభివృద్ధి తోపాటు రమ్యతరములైనవని కలదు. వేదాధ్యయనము, వేదవిధ్యనుష్ఠానము రమ్యతరమగుట నన్నయ ఆత్మీయతకు రత్న ముకురము

అర్జునుడు మత్స్యయంత్రమును పడగొట్టుట చూచిన సమస్తజనులు విస్మి తులై పొగడుటను నన్నయ అమూలకముగ రచించిన పద్యమిది

"ఫలపవనాంబుభోజనశుభవ్రతవృత్తులఁ జేసి చూడ దు
ర్బలతనులయ్యు బ్రాహ్మణు లపారతపోబలసంపదన్ మహా
బలయుతు లట్టి వారలకు భవ్యుల కెందు నసాధ్యమెద్దియుం
గలదె చరాచరాఖిలజగంబులఁ బెద్దల కారె సద్ద్విజుల్."

183 ప 7 ఆ, ఆ, ప,

అర్జునుడు బ్రాహ్మణవేషధారి అగుటవలన అందఱును బ్రాహ్మణుడని భావించిరి. క్షత్రియుడు చేయవలసిన పని, క్షత్రియుడు చేయలేక పోఁగా బ్రాహ్మణుడు చేయుట విస్మయము కలిగించినది ఏ క్షత్రియునికిని లేని శక్తి ఈ బ్రాహ్మణునికి ఉండుటకు హేతువు; ఫలాహారము, వాయుభక్షణము, జలపానము మాత్రమే నియమితమైన వ్రతవిధానము అది శరీరమును కృశింపఁజేసినను, అపారమైన ఆత్మబలమును సమకూర్చును అట్టి వారికి ఎక్కడను అసాధ్యమన్నది ఏదియును లేదు అంతేకాదు శుభవ్రత వృత్తుల వలన సమస్తచరాచరజగత్తులోను సద్ద్విజులు అని సమస్తజనుల నిష్కర్ష ఇది నన్నయ ఆత్మప్రత్యయము.

సంస్కృతభారతమునందు బహుస్థలములందు బ్రాహ్మణుల మాంసాహారము కలదు కల్మాషపాదుని కథ ప్రథమోదాహరణము. ఒక బ్రాహ్మణుడు కల్మాషపాదుని "సమాంసంబయిన భోజనం" బడుగును (114 వచ. 7 ఆ. ఆ ప.) అని నన్నయ భారతమునందును కలదు. అది పరిహరించుటకు అవకాశము లేనిది. బౌద్ధజైనమతముల అహింసాసిద్ధాంతమువలన మాంసాహారము నిషిద్ధమైన బ్రాహ్మణులలో ఆంధ్రులు కలరు ఆంధ్రుడైన నన్నయ అన్యస్థలములందు బ్రాహ్మణుల మాంసాహారమును పరిహరించెను. మయుడు నిర్మించిన సభలో ప్రవేశించినపుడు ధర్మరాజు నానాదిక్కులనుండి వచ్చిన బ్రాహ్మణులను నేయి, పాయసము, మాంసభక్ష్యములు, మాంసఖాద్యములు, చోష్యములు, పానీయములతో భుజింపఁజేసినట్లు సంస్కృత భారతమునందు కలదు.

"తతః ప్రవేశనం చక్రే తస్యాం రాజా యుధిష్ఠిరః
అయుతం భోజయామాస బ్రాహ్మణాన్ నరాధిపః ॥
[సాజ్యేన పాయసేనైవ మధునా మిశ్రితేన చ
భక్ష్యై ర్మూలైః ఫలైశ్చైవ మాంసై ర్వారాహహారిణైః ॥
కృసరేణాథ జీవన్త్యాహవిష్యేణ చ సర్వశః
మాంసప్రకారై ర్వివిధైః ఖాద్యైశ్చాపి తథా నృప ॥
చోష్యైశ్చ వివిధైః రాజన్ పేయైశ్చ బహువిస్తరైః ]
అహతైశ్చైవ వాసోభి ర్మాల్యై రుచ్చావచైరపి ॥
[తర్పయామాస విప్రేన్ద్రాన్ నానాదిగ్భ్య స్సమాగతాన్ ]
దదౌ తేభ్య స్సహస్రాణి గవాం ప్రత్యేకశః పునః"

1-3 శ్లో. 4 అ. స. ప.

ఇది నన్నయ భారతమునందు ఇట్లు కలదు.

"పిఱుఁడు ధర్మజుండు పదివేవురు విప్రుల కొప్పఁ బాయసా
హారము భక్తిఁ బెట్టి మఱి యందఱకుం జెఱు వేయ నేసి వి
స్తారయశుండు ధేనువుల ధర్మవిధిన్ మణిముద్రికాద్యలం
కారదుకూల పుష్పఫలగంధయుతంబుగ నిచ్చి లీలతోన్. 14 ప.

మంచిగ భూరిభూసురసమాజము లెల్లను భక్తితోడఁ బూ
జించి యభీష్టదానములు సేసి ధనార్థులఁ దన్పి దిక్కులన్
నించె యశంబు బంధులకు నెయ్యురకున్ హృదయప్రియంబు గా
వించె విభూతి యేర్పడఁ బవిత్రుఁడు ధర్మసుతుండు నెమ్మితోన్.
16 ప 1 ఆ. స. ప.

ఇందు పాయసాహారమే గాని మాంసాహారము లేదు. అంతేకాదు, మణులు పొదిగిన ఉంగరములు మొదలైన ఆభరణములు పుష్పఫలయుతముగ ఇచ్చి, బ్రాహ్మణ సమాజములనెల్ల భక్తితో పూజించి, సహస్రగోదానమేగాక అభీష్టదానములును చేసి, ధర్మరాజు యశస్సు గడించెనని కలదు. మాంసాహారపరిహారము, మణిముద్రికా ప్రదానమును ఆంధ్రదేశవ్యవహారము. ఆంధ్రుడైన నన్నయ ఆత్మీయతకు నిదర్శనము.

ఇంద్రాగ్ని యమవరుణకుబేరులు విష్ణువుతో, కాలకేయులు బ్రాహ్మణులను రాత్రులు వధించుచున్నారని, బ్రాహ్మణులు క్షీణించిన భూమి క్షయమగునని, భూమి క్షీణించిన త్రిదివములు క్షయమగునని చెప్పినట్లు మూలమునందు కలదు

"క్షీణేషు చ బ్రాహ్మణేషు పృథివీక్షయ మేష్యతి
తతః పృథివ్యాం క్షీణాయాం త్రిదివం క్షయ మేష్యతి "
4 శ్లో. 101 అ. ఆర ప.

ఇది నన్నయ భారతమునందు ఇట్లు కలదు.

"కాలకేయులు మహాకాయులు పగలెల్ల
జలదుర్గబలమున జలధినుండి
రేలెల్లఁ జని నలిరేఁగి మునీశ్వ రా
శ్రమముల సద్ధర్మచారులైన

బ్రాహ్మణప్రవరులఁ బాయక వధియింతు
రెట్టి పాపాత్ములు నెయ్యుగముల
బ్రాహ్మణహింస యాపాదింతురే యది
వీరల వలనన వినఁగఁబడియెఁ

బరమసాధులైన బ్రాహ్మణులకు బాధ
యగుడు మహికి బాధ యగు ధరిత్రి
కైన బాధఁజేసి యఖిలలోకంబులుఁ
గరము బాధ నొందుఁ గమలనాభ. 14 ప.

ఎట్లనిన వేదంబులు ధరియించి విప్రులు వేదచోదితంబులైన
పుణ్యకర్మంబులు విధియించుటంజేసి హవ్యకవ్యంబుల
దేవతలుం బితరులుఁ దృప్తులైన వారివలన నెల్లలోకంబులకు
సుఖంబగుం గావున బ్రాహ్మణోపద్రవంబు పరిహరించి
లోకంబులు రక్షింపుము" 15 ప. 3 ఆ. ఆర ప.

ఇందు బ్రాహ్మణప్రవరులు, సద్ధర్మచారులు, పరమసాధువులును అని, ఎట్టి పాపాత్ములును ఏ యుగములందును బ్రాహ్మణహింస చేయలేదని అమూలకముగ కలదు అంతేకాదు. "బ్రాహ్మణులకు బాధ కలిగిన, ధరిత్రికి బాధకలుగును; ధరిత్రికి బాధ కలిగిన అఖిల లోకములకును బాధ కలుగును." అను మూలాభిప్రాయమునకు అమూలకముగ హేతుకల్పనము కలదు. బ్రాహ్మణులు వేదాధ్యయనము చేయుట, వేదవిధ్యనుష్ఠానము చేయుట వలన సమస్తలోకములకు సుఖశాంతులు కలుగునని హేతుకల్పనము. అది నన్నయ ఆత్మీయతాముద్రయే.

ద్రౌపది స్వయంవర పుష్పహారమును బ్రాహ్మణ వేషధారియైన అర్జునుని మెడలో వైచిన అనంతరము, రాజు లందఱును ద్రుపదుని తోబాటు బ్రాహ్మణుని కూడ అధిక్షేపించినట్లు మూలమునందు కలదు

"బ్రాహ్మణో యది చాపల్యా ల్లోభా ద్వా కృతవా నిదం"

బ్రాహ్మణుడు చాపల్యము చేతనో, ప్రలోభము వలననో మత్స్యయంత్రమును భేదించి రాజకుమారిని వివాహమాడెనని అధిక్షేపణ. బ్రాహ్మణుని అధిక్షేపించుటకు మాఱు సమర్థించినట్లు, ద్రుపదునే దూషించినట్లు నన్నయ అన్యథా కరించెను.

"తన విద్య పేర్మి నృపనం
దనఁ బడసెను విప్రుఁ డితని తప్పే కడు దు
ర్జనుఁ డీ ద్రుపదుఁడు నృపతుల
ననయంబును మెచ్చఁడయ్యె నతిగర్వితుఁడై" 190ప. 7ఆ ఆ. ప

ఇందు విప్రుని తప్పు లేదని సమర్థనము, ద్రుపదుడు దుర్జనుడని దూషణము కలదు విప్రసమర్థనమునకు నిమిత్తము విప్రవిద్య. వేదవిద్యతోపాటు ధనుర్వేద విద్యయును విప్రవిద్యయే అన్యథాకరణమిది నన్నయ ఆత్మీయతకు నిదర్శనమే.

పూర్వోదాహృతమైన వేంగీదేశ విభవ వర్ణనమును నన్నయ ఆత్మీయతకు ప్రబల నిదర్శనము

ధర్మరాజు రాజసూయయాగము చేయుటకు బ్రాహ్మణులతోను బంధువర్గము తోను, మంది పార్థివులనుతోను యజ్ఞాయతనమునకు అరిగెనని మూలమునందు కలదు.

"జగామ యజ్ఞాయతనం (సం) వృతో విప్రైః స్సహస్రశః
భ్రాతృభిః జ్ఞాతిభిశ్చైవ సుహృద్భి స్సచివై స్సహ."

44–45శ్లో 30అ స ప.

ఇది నిమిత్తముగ నన్నయ ఇట్లు వర్ణించెను

"బ్రహ్మవిదులయిన నిఖిల
బ్రాహ్మణసత్తములచేతఁ బరివేష్టితుఁడై
బ్రహ్మణ్యుఁ డొప్పెఁ గురుపతి
బ్రహ్మర్షిపరీతుఁ డయిన బ్రహ్మయ పోలెన్" 290ప 1ఆ. స. ప.

ఇందు నిఖిల బ్రాహ్మణసత్తములును బ్రహ్మవిదులు బ్రహ్మవిదులన బ్రహ్మ జ్ఞానవిదులు కర్మమార్గముతోపాటు జ్ఞానమార్గమును నన్నయ కాంక్షితార్థము

## అంకితము

నన్నయ భారతము రాజరాజనరేంద్రాంకితము అయినను కాదను అభిప్రాయములు కలవు.[58] అందుకు ప్రదర్శించిన ఉపపత్తులివి .

1. సంస్కృతకావ్యమును అంకితమిచ్చు సంప్రదాయము లేదు
2. నన్నయ భారతమునందు అంకితమను మాట లేదు.

3. రాజరాజనరేంద్రుడు అంకితమిమ్మని అడుగలేదు.
4 అంకెతచిహ్నములైన షష్ఠ్యంతపద్యములు లేవు
5. రాజరాజనరేంద్రుడు కృతి భర్త కాడు. ప్రధానశ్రోత.

సంస్కృతకావ్యమును అంకితమిచ్చు సంప్రదాయము లేని మాట నిజము. కాని, ప్రాకృత కావ్యమును అంకితమిచ్చు సంప్రదాయము కలదు. కన్నడకావ్యమును అంకితమిచ్చు సంప్రదాయము కలదు నన్నయ భారతమునందు అంకితమను మాట లేని మాట వాస్తవము. తిక్కన భారతమునందు, ఎఱ్ఱన హరివంశమునందు అంకితమను మాట లేదు తిక్కన భారతము హరిహరనాథునికి అంకితము. ఎఱ్ఱన హరివంశము ప్రోలయ వేమారెడ్డికి అంకితము. రాజరాజనరేంద్రుడు అంకితమిమ్మని అడుగనిమాట యథార్థము. ప్రోలయ వేమారెడ్డి కూడ అంకితమిమ్మని అడుగలేదు. నన్నయ భారతమునందు అంకెతచిహ్నములైన షష్ఠ్యంత పద్యములు లేని మాట సత్యము గోడగి త్రిపురారికి అంకితమైన పాలకుఱికి సోమనాథుని అనుభవసారమునందు, మనుమసిద్ధికి అంకితమైన తిక్కన ఉత్తర రామాయణమునందు, హరిహరులకు అంకితమైన కొఱవిగోపరాజు సింహాసనద్వాత్రింశికయందును షష్ఠ్యంతపద్యములు లేవు. నన్నయ భారతమునందు అంకెతచిహ్నములైన ఆశ్వాసాద్యంత పద్యములు కలవు ప్రధానశ్రోత కృతిభర్తయే స్మృత్యంకితము లందు ప్రధానశ్రోత, కృతిభర్త భిన్నులు ఆశ్వాసాద్యంతపద్యములు అంకితచిహ్నములు కానిచో, ఎఱ్ఱన అరణ్యపర్వ శేషములోని ఆశ్వాసాద్యంతపద్యములు రాజరాజనరేంద్రుని పరము కావు. అంకెత మనగా పేర వెలయించుట. నన్నయ భారతములోని ఆశ్వాసాద్యంతపద్యములు రాజరాజనరేంద్రుని పేరనే కలవు. నన్నయ భారతము రాజరాజనరేంద్రాంకెతమే.[59]

## ఇతర కృతులు

నన్నయభట్టు రాఘవాభ్యుదయము, ఇంద్ర విజయము, చాముండికా విలాసము అను కావ్యములు, ఆంధ్రశబ్ద చింతామణి అను వ్యాకరణశాస్త్రగ్రంథము, లక్షణసారము అను ఛందోగ్రంథము రచించినట్లు కలదు అవి నన్నయభట్టు రచింపలేదని కలదు.[60] ఆంధ్రశబ్ద చింతామణి, లక్షణసారము ఆదికవి నన్నయభట్టు రచించినవి కావు. అపరనన్నయభట్ట కృతములు.[61] రాఘవాభ్యుదయము, ఇంద్ర విజయమును అపరనన్నయభట్టు కృతములు కావచ్చును. చాముండికా

విలాసము కూటసృష్టి కూటసృష్టిలోను కూటసృష్టి కలదు. చాముండికా విలాసము నందు చాముండిక అని ఉన్న స్థలములందెల్ల చౌడేశ్వరి అని ఉండి, చౌడేశ్వరీ విలాసము కలదు [67] అది, ఇది పరమార్వాచీనగ్రంథములు. అందిట్లు కలదు [63]

"వ్యాసాదిఋషులకు వందన మొనరించి
కవిమల్లులను జాల ఘనత నెంచి
సుకవీశ్వరులనెల్ల సొంపుగా వినుతించి
గురుపాదయుగ్మము ల్సరవిఁ గొలిచి
యిష్టదేవాళి సంతుష్టత సేవించి
మంత్రాదిదేవత మదిఁ దలంచి
సర్వజనాళికి సంతోష మొనరించి
పార్థివసభల వైభవము గాంచి

యాంధ్రవాక్యానుశాసనం బతిశయిల్లఁ
జేసి లోకోపకారార్థసిద్ధిఁ జేసి
ఘనత రాజనరేంద్రుని కరుణఁ బడసి
నట్టివాఁడను నన్నయభట్ట నేను"

ఇది సీసపద్యము అందు యతిని యతి లేదు. ఆదికవి నన్నయభట్టు పేర అర్వాచీనకవి చేసిన కూటసృష్టి అనుట కిది చాలును.

నన్నయ శారదగాత్రము భారత శారద రాత్రము.

## ఇతర కవులు

**పావులూరి మల్లన :** ఇతడు సారసంగ్రహగణితమును రచించెను. అది మహావీరాచార్యుని సారసంగ్రహగణితమునకు అనుసరణము. [64] అందు గ్రంథకర్త పావులూరి మల్లన "కమ్మనాఁటిలోపల విలసిల్లిన పావులూరివిభుఁడు" అని కలదు (5 ప) పావులూరి గ్రామకరణమగును. అతని సారసంగ్రహగణితము నందు సివ్వన పుత్త్రుడు మల్లన; మల్లన పుత్త్రులు సివ్వన, చిమ్మన, గుణసూర్య దేవుడు, ప్రోలనార్యుడు అని, అందు సివ్వన పుత్త్రుడు మల్లన అని కలదు మల్లన పుత్త్రులు నలుగురిని తెలుపు పద్యము (7 ప) కొన్ని ప్రతులందు లేదు. పెక్కు

ప్రతులందు కలదు [65] అది తద్భవవ్యాజయతికి లక్ష్యముగ పలువురు లాక్షణికులు ఉదాహరించినది ప్రక్షిప్తము కాఁజాలదు ఆ పద్యమిది :

"శ్రీనిలయుండు నివ్వనయుఁ జిమ్మనయుం గుణసూర్యదేవుఁడున్
ధీనిధి ప్రోలనార్యుఁడును దేజమున న్రవి తుల్యులైన యీ
సూనుల నల్వురం బడసె సూరిజనస్తుతులైన సత్త్వవి
జ్ఞానులు పద్మగర్భవదనంబులు నాలుగుఁ బోలు వారిలోన్"

ఇందు నాల్గవ పాదమునందు తద్భవవ్యాజయతి మైత్రి కలదు తాత మల్లన "రాజరాజభూపాలకు చేతఁ బీఠపురపార్శ్వమునన్ నవఖండవాడయన్ ప్రోలు మహావిభూతితోఁ బడసి"నట్లు సారసంగ్రహగణితమునందు కలదు. (6 ప.) సారసంగ్రహగణితకర్త మనుమడు మల్లన. పిఠాపురము దగ్గఱి నవఖండవాడకు "కమ్మనాఁటిలోపల విలసిల్లిన" సారసంగ్రహగణితశాస్త్ర కర్త మనుమడు మల్లన ప్రతిగ్రహీత అగుట కంటె తాత మల్లన అగుట సుసంగతమగును. నవఖండవాడ శాసనము కానరాదు ఇంతకు, సారసంగ్రహగణితము కావ్యము కాదు. గణితశాస్త్ర గ్రంథము తెలుగు శాస్త్రవాఙ్మయ చరిత్రకు ప్రథమగణ్యము

నన్నయ కాలమునందు రాజమహేంద్ర కవీంద్రులు కలరుగాని, వారు తెలుగు కావ్యములు రచించినట్లు నిదర్శనము లేదు

నన్నయ యుగమునందు నన్నయ ఒక్కడే కవి. మహాకవి

## యుగప్రాముఖ్యము

"ఆంధ్రకవిత్వ విశారదుండు, విద్యాదయితుండు" అని తిక్కన (6 ప. 1 ఆ వి ప) "నన్నయభట్టు మహాకవీంద్రుఁ"డని ఎఱ్ఱన (469 ప. 7 ఆ. అర. ప) "నన్నయభట్టోపాధ్యాయ సార్వభౌముఁడు, కవితాపట్టాభిషిక్తుఁడు; భారతఘట్టోల్లంఘన పటిష్ఠ గాఢప్రతిభుఁడు" అని శ్రీనాథుడు ప్రశంసించిన నన్నయ ఆదికవి ఆదర్శకవి

ఆదిని అజ్ఞాతవాసము చేసి, అనంతరము ప్రాకృత సంస్కృతభాషాయవనికాభ్యంతరముల ఓలమాసగొని, క్రమముగ శాసనఫలకముల శయనించి, చాటుమాటుగ వాడవాడల పయనించి, గాలిమేడల తేలియాడిన ఆంధ్రసరస్వతిని- నన్నయ కవితా మహాసామ్రాజ్యభద్రాసనాసీనురాలిని చేసెను. అందుకు

సంస్కృతసువర్ణాభరణములు కై సేసెను. సంస్కృత కర్ణాటకావ్యసూనకుసుమా వళులను సుబాళింపఁజేసెను. దేశిచ్ఛందస్సుల కర్పూరమును, కన్నడచందస్సుల కస్తూరిని కలిపి మంగళనీరాజనమొసగెను. వ్యాసమునీంద్రుని రసభావపదార్థములు కాచి వడపోసి, కరువు కట్టి గండపవు చేసి భారతబద్ధ నిరూపితార్థ చామరమును వీచెను. సర్వప్రామాణ్యచ్ఛత్రమును పట్టెను. వామనుని రీతిసిద్ధాంతము, ఆనంద వర్ధనుని ధ్వని సిద్ధాంతము, కుంతకుని వక్రోక్తి సిద్ధాంతమును త్రివేణీసంగమము వలె తీర్థభూతము చేసెను. సుమనోదామసుహాసమో, శరజ్జ్యోత్స్నాసుధా పూరవికా సమో, లసన్మాణిక్యలావణ్యలాస్యవిలాసమో అనిపించునట్లు ఆంధ్రకవితా పట్టాభి షేకము కావించెను.

సంస్కృత పద్యవిద్యకు వాల్మీకి ఆద్యుడు వలె, తెలుగు పద్యవిద్యకు నన్నయ ఆద్యుడు. అంతేకాదు నన్నయ గద్యవిద్యకును ఆద్యుడు. నన్నయ పద్యము వలె వచనమును లయాత్మకము. నన్నయ పద్యములు బుక్కాల వలె నినదించునని ప్రసిద్ధము. నన్నయ వచనములును సప్తస్వరముల వలె రవళిం చును. నాదమాధుర్యము నన్నయ పద్యగద్యములకు సమానము. నవ్యనవనీత సమానము నన్నయ కవిత్వము మొత్తము రసవత్తరము. నన్నయకు సర్వాంధ్ర కవిసమాజము నతశీర్షనమస్కృతము.

ఆంధ్రజాతికి సాహిత్యసంపదను అందఁజేసిన రాజరాజనరేంద్రుడు, అందిచ్చిన నన్నయ ఆంధ్రులకు ప్రాతఃస్మరణీయులు.

* * *

# శివకవియుగము

## చారిత్రిక నైపథ్యము

రాజరాజనరేంద్రుని అనంతరము తూర్పు చాళుక్యులకు తుదిఘడియలు సమీపించినవి. వేంగిదేశము వెలుగులు వెలవెలఁబోయినవి. రాజరాజనరేంద్రుని సవతి సోదరుడు విజయాదిత్యుడు తన కుమారుడు రెండవ శక్తివర్మకు 1061వ సంవత్సరమునందు పట్టము కట్టెను. అతడు సంవత్సరము తిరుగుసరికి వీరస్వర్గమలంకరించెను. విజయాదిత్యుడే రాజయ్యెను. 1076వ సంవత్సరము వఱకు పరిపాలించెను.[2] 1070వ సంవత్సరమునందు రాజరాజనరేంద్రుని కుమారుడు మొదటి కుళోత్తుంగచోళుడు తమిళ దేశమునందు చోళ సామ్రాజ్య సింహాసనమును అధిష్ఠించెను.[3] అతని రాజ్యకాలము 1070–1118 రాజధాని గంగైకొండ చోళపురము. అతని కుమారులు రాజరాజముమ్మడిచోడుడు (1076–79), వీరచోడుడు (1079–84), రాజరాజ చోడగంగు (1084–89), మఱల వీరచోడుడు (1089–94), వీరపెర్మాడిచోడుడు (1094–1107), పరాంతకచోడుడు (1107–19) వేంగిదేశమునకు రాజప్రతినిధులు.[4] చాళుక్యచోళుడైన మొదటి కుళోత్తుంగ చోడుడు 1106వ సంవత్సరమునందు కుమారులైన రాజప్రతినిధులకు బాసటగ కులక్రమాగతులైన రాజోద్యోగులను, సేనాధిపతులను సామంత మండలికులుగ నియమించెను.[5] వారు వెలనాటి చోళులు, కోన హైహయులు మొదలైనవారు.

కళ్యాణి చాళుక్యరాజైన త్రిభువనమల్ల విక్రమాదిత్యుడు 1084లోను, 1086లోను వేంగి దేశముపై దండయాత్రలు సాగించెను.[6] అతని దండనాయకుడైన అనంతపాలుడు 1115 ప్రాంతమున కృష్ణానదికి దక్షిణమునందలి కొంత వేంగిదేశమును, 1118 ప్రాంతమున కృష్ణా గోదావరీనదుల నడిమి వేంగిదేశమును జయించెను.[7]

మొదటి కుళోత్తుంగచోళుని తర్వాత అతని కుమారుడు, పరాంతకచోడుని తమ్ముడు అయిన విక్రమచోళుడు చోళసింహాసనమును అధిష్ఠించెను.[8] అతని రాజ్యకాలము 1118–35. అతడు వేంగిదేశమును తిరిగి జయింపవలెనని తీవ్రముగ ప్రయత్నించెను 1127 ప్రాంతమున త్రిభువనమల్ల విక్రమాదిత్యుని ఓడించెను.

కృష్ణా గోదావరీనదుల నడిమి వెంగిదేశమును జయించెను.[9] ఆ యుద్ధమునందు ప్రముఖపాత్ర వహించిన చాళుక్య యుద్ధమల్లుని సంతతిలోని మల్లభూపతిని సామంత మాండలికుని చేసెను.[10] కాని త్రిభువనమల్ల విక్రమాదిత్యుని తర్వాత కళ్యాణి చాళుక్యరాజైన భూలోకమల్ల సోమేశ్వరుడు 1132 ప్రాంతమున సింహాచల పర్యంతము వెంగిదేశమును జయించెను.[11] విక్రమచోళుడు తన రాజ్యకాలము చివర, మరల వెంగిదేశమును జయించెను.[12]

విక్రమచోళుని తర్వాత అతని దౌహిత్రుడు రెండవ కుళోత్తుంగచోళుడు చోళసింహాసనమును అధిష్ఠించెను.[13] అతని రాజ్యకాలము 1135–50 రెండవ కుళోత్తుంగచోళుని తర్వాత అతని కుమారుడు రెండవరాజరాజచోళుడు చోళ సింహాసనమును అధిష్ఠించెను.[14] అతని రాజ్యకాలము 1150–79 రెండవ రాజరాజచోళుని తర్వాత అతని దౌహిత్రుడు రెండవ రాజరాజు చోళసింహాసనమును అధిష్ఠించెను [15] అతని రాజ్యకాలము 1168–79 వీరి కాలమున వేంగి దేశమునందు చాళుక్యచోళుల అధికారము నిరాఘాటముగా సాగెను అనంతరము వేంగిదేశమునందు చాళుక్య చోళుల అధికారము ముగిసెను.

మొదటి కుళోత్తుంగచోళుడు తమిళ దేశమునందు చోళసామ్రాజ్యాధిపతి, అతని కుమారులు వెంగిదేశమునందు రాజప్రతినిధులును అగుటవలన, ఆ కాలము నందు తమిళాంధ్రుల రాకపోకలు సాగుట తథ్యము అంతేకాదు. తమిళదేశము నందు అప్పటికే ప్రసిద్ధమైన సంస్కృతభాషలోని శైవాగమగ్రంథములు ఆంధ్రు లకు మనోహరములగుట, తమిళభాషలోని అఱువత్తుమూన్నావరు అను గ్రంథము లోని అరువదిముగ్గురు శివభక్తుల కథలు కర్ణరసాయనములగుట సహజము. తన్నిమిత్తమున శైవాగమగ్రంథములలోని శివతత్త్వము, అఱువత్తుమూన్నావరులోని భక్తితత్త్వము, ఆంధ్రత్వము సమ్యక్సమ్మిళితమైన నూతన శైవమతము తెలుగు దేశమునందు తేజరిల్లినది అది వీరశైవమతము పండితత్రయప్రతిపాదితము. పూర్వాంగప్రవర్తకుడు శ్రీపతిపండితుడు నాందీసూత్రధారి శివలెంక మంచన పండితుడు నాంద్యంత సూత్రధారి మల్లికార్జున పండితుడు.

> "కడు సర్ధి సుత్పత్తికర్త నా బ్రహ్మ
> వడి బ్రహ్మమును బ్రహ్మవాదులఁ ద్రుంచి
> హరిభక్తి యుత్పత్తి కధిపతి నాఁగఁ
> బరగెఁ దాఁ బొల్లి శ్రీపతి పండితయ్య;

స్థితికర్త హరి నుమాపతికి మ్రొక్కించి
క్షితి విష్ణువాదులఁ గీటడఁగించి,
చెనసి భక్తిక్రియాస్థితికర్త యనఁగఁ
జనియెను లెంక మంచనపండితయ్య;
గాథగా సంహారకర్తయ యనుచు
సాధారణముగ నీశ్వరుఁ బల్కు భక్తి
దూరాన్యసమయసంహారుఁడైచనియె
ఘూరుండు మల్లికార్జున పండితయ్య," 7పు.దీ ప్ర

అని పండితారాధ్యచరిత్రమునందు కలదు. శివతత్త్వసారమునందును ఇట్లు కలదు.

"ఒక్కఁడ దైవము శివుఁడని
నిక్కము సేయుటకు ముడిచె నిప్పులు చీరన్
స్రుక్కక శ్రీపతి పండితుఁ
డక్కజముగ విజయవాడ నల జమ్మి శివా!" 406ప

ఇది బెజవాడ మల్లేశ్వరాలయములోని మహామండలేశ్వరపల్లకేతుని శాసనమునందు కూడ కలదు [16]

"తతః శ్రీపండితారాధ్యనామ్నా భక్తోత్తమేన చ
శివభక్త ఏవ నూనం దేవర్షిభ్యోఽధిక ఇతి,
చీనాంబరేఽగ్నిం సంస్థాప్య శమీకోమలశాఖయా
బద్ధే మల్లేశ్వరః ప్రీతః ప్రత్యక్షః సమజాయత;"

ఇందు శ్రీపండితారాధ్యుడు చీనాంబరమునందు అగ్నిని సంస్థాపించి శమీవృక్షశాఖకు కట్టినట్లు కలదు. ఈ పండితారాధ్యుడు శ్రీపతిపండితుడే.

"భక్తుండు శ్రీపతిపండితుం డీశు
భక్తుని కెలఁ గోచె బ్రాహ్మణులైన
నెస యన్న నాలుక నేఁ గోసివైతు
ననుచు ననంతపాలుని సభాస్థలిని
నెక్కొనఁగాఁ జంద్రదసిప్పులు గాడె
చక్కన వొత్తిపచ్చడమున ముడిచె" 111—116పం 7ఆ.

అని బసవపురాణమునందు కలదు. ఇందు శ్రీపతిపండితుడు తన మహిమను అనంతపాలుని సభాస్థలిని ప్రదర్శించినట్లు కలదు. అనంతపాలుడు కళ్యాణి చాళుక్యరాజైన త్రిభువనమల్లవిక్రమాదిత్యుని దండనాయకుడని 1115 ప్రాంతమున కృష్ణానదీ దక్షిణముసందలి కొంత వెంగిదేశమును 1118 ప్రాంతమున కృష్ణా గోదావరీనదుల నడిమి వెంగిదేశమును జయించెనని పూర్వోక్తము. అతడు బెజవాడలో ఉన్న కాలము 1115-1135 అతని సభాస్థలిని మహిమను ప్రదర్శించిన శ్రీపతి పండితుని కాలమును అదే అగును. పదునొకండవ శతాబ్ది చతుర్థపాదము, పండ్రెండవ శతాబ్ది పూర్వార్ధము కావచ్చును. శ్రీపతిపండితునికి శివలెంక మంచనపండితుడు యువసమకాలికుడు మల్లికార్జున పండితుడు బాలసమకాలికుడును అగుదురు.

శ్రీపతిపండితుడు అద్వైతసిద్ధాంతమును ఖండించి, శివభక్తి ఉత్పత్తికి అధిపతి అయ్యెనని, శివలెంక మంచన విష్ణువుచేతనే శివునికి మ్రొక్కించి శివాధిక్యమును స్థాపించెనని, మల్లికార్జునపండితుడు భక్తిమార్గమైన అన్యమతములను ఖండించెనని పండితారాధ్యచరిత్రమునందు స్పష్టముగ కలదు. కావున్న పండితత్రయము వ్యాప్తికి తెచ్చినది వీరశైవమే.

"ఇష్టలింగవియోగే వా వ్రతానాం వా పరిచ్యుతౌ ॥
తృణవత్ప్రాణసంత్యాగ ఇతి వీరవ్రతం మతమ్
భక్త్యుత్సాహవిశేషోఽపి వీరత్వమితి కథ్యతే ॥
వీరవ్రతసమాయోగా ద్వీరశైవం ప్రకీర్తితమ్— "40–42శ్లో 10ప.

అని చంద్రజ్ఞానాగమమునందు కలదు.

ఇష్టలింగవియోగమునందుగాని, గురులింగజంగమారాధనవ్రతలోపము నందుగాని తృణప్రాయముగ ప్రాణత్యాగము చేయుట వీరవ్రతము. భక్త్యుత్సాహ విశేషము కూడ వీరత్వము. వీరవ్రతముతో కూడినది వీరశైవము.

"విశబ్దేనోచ్యతే విద్యా శివజీవైక్యబోధికా
తస్యాం రమంతే యే శైవా వీరశైవాస్తు తేమతాః॥
వేదాంతజన్యం యద్జ్ఞానం విద్యేతి పరికీర్త్యతే,
విద్యాయాం రమతే యః స వీర ఇత్యభిధీయతే ॥"15,16శ్లో 5పరి.

అని సిద్ధాంతశిఖామణియందు కలదు.

'వి' అను వర్ణము శివజీవైక్యమును బోధించు విద్యకు గుర్తు. ఆ విద్యయందు రమించువారు వీరశైవులు. వేదాంతజన్యమైన జ్ఞానము విద్య. ఆ విద్యయందు

రమించువాడు వీరుడు అనఁబడును ఈ అర్థమున వీరులైన శైవులు వీరశైవులు వారే వీరశైవులు వీరమాహేశ్వరులు

వీరులు, వీరత్వము యుద్ధవిషయమునందు ప్రసిద్ధము. ధర్మదానదయాది విషయములందును కలదు యుద్ధవీరము, ధర్మవీరము, దానవీరము, దయావీరము మొదలైన వీరరసభేదములు కలవు వీరరసమునకు ఉత్సాహము స్థాయిభావము. కాఁబట్టి భక్తుత్సాహవిశేషము వీరత్వము శివజీవైక్య బోధక విద్యారులు వీరులు ఏ వీరులైనను సాహసోపేతులు. ఏ వీరత్వమైనను సాహసకృత్యసంభరితము సాహసోపేతులైన, సాహసకృత్య సంభరితులైన శివభక్తులు వీరశైవులు అఱువత్తుమున్నూవరులోని శివభక్తులు సాహసోపేతులు సాహసకృత్య సంభరితులు అఱువత్తుమున్నూరులోని చిఱుతొండనంబి (శిఱిత్తొండక) (400,483 ప.) ఒడయపిళ్ళ (పిళ్లనయనార్) (405ప.) ఒడయనంబి (సుందరనయనార్) (407ప) కన్నప్ప (కణ్ణప్పన్) (424ప) అంబన (అప్పర్?) (426ప.) ఇఱుదత్తుడు (ఇఱపత్తినాయనార్) (439ప) మొదలైనవారి గుఱించి శివతత్త్వసారమునందు కలదు. ఇది మల్లికారున పండితునికి అఱువత్తు మున్నూవరు పరిచయము కలదనుటకు నిదర్శనము.

శివతత్త్వసారమునందు వీరచోడన గుఱించి కలదు (479ప) అంతేకాదు పండితారాధ్య చరిత్రమునందు యోగాచార్యగణ సంకీర్తనమునందు వీరపెర్మాడిదేవుడు, వీరచోడడు కలరు (పు83 ప్ర సం) వీరచోడనయే వీరచోడుడు ప్రసిద్ధుఁను మొదటి కుళోత్తుంగచోళుని కుమారులు. వేంగిదేశమునందు రాజప్రతినిధులు. శివభక్తులే వీరచోడుడు మఱియు రాజప్రతినిధియైన కాలము 1089–94. వీరపెర్మాడి చోడుడు రాజప్రతినిధియైన కాలము 1094–1107 వీరివలన అఱువత్తుమున్నూవరు శ్రీపతిపండితునికి లభించును. శ్రీపతిపండితుడు వీరభక్తి విశిష్టమైన వీరశైవమునకు శ్రీకారము చుట్టుటకు సహకరించును. ఇది మల్లికార్జున పండితునికి మాత్రమే గాక శ్రీపతి పండితునికి సహితము అఱువత్తుమున్నూవరు పరిచయము కలదనుటకు సాధకము.

తమిళభాషలోని అఱువత్తుమున్నూవరు సంస్కృతభాషలోని స్కాందోపపురాణ, శివరహస్య, శివభక్తి మాహాత్మ్యములందు, కన్నడభాషలోని అఱువత్తుమూవరు పురాతనచరితె, త్రిషష్టిపురాతనచరితె, అఱువత్తుమూరు పురాతన శరణ్య చరిత్రె అను గ్రంథములందు కలదు[17] సంస్కృత కర్ణాట గ్రంథములు పుత్రికలు తమిళగ్రంథమే మాతృక కాఁబట్టి వీరభక్తి తమిళదేశమునుండి ఆంధ్రదేశమునకును, కన్నడదేశమునకు తరలివచ్చినట్లు స్పష్టము.

ఏకజైక్యజ్ఞానము శివుడు, జీవుడు ఒకడే అను సిద్ధాంతము కాదు. రెండను సిద్ధాంతము. ఐక్యమన ఏకత్వము కాదు. సామరస్యము, జీవాత్మ, పరమాత్మ ఒకటే అని శంకరాచార్యుల సిద్ధాంతము శివుడు, జీవుడున్ను భిన్నులని మాణిక్కవాశగర్ సిద్ధాంతము. అది అద్వైతము. ఇది ద్వైతము శంకరాచార్యుల అద్వైత సిద్ధాంతమును ఖండించి, ప్రథమతః ద్వైత సిద్ధాంతమును పాదుకొల్పినది మాణిక్కవాశగర్ [18] తమిళమహాశివభక్తుడు కాలము తొమ్మిదవ శతాబ్ది ఉత్తరార్ధము ద్వైతమే వీరశైవ మతసిద్ధాంతము అద్వైత సిద్ధాంతఖండనము, ద్వైత సిద్ధాంత సమర్థనము మల్లికార్జున పండితుని శివతత్త్వసారమునందు కలదు (31–68ప.) అంతేకాదు. ఈశ్వరాద్వైతమును కలదు (52, 54ప) శివుడొక్కడే దైవమను భావము ఈశ్వరాద్వైతము శివాధిక్యమును వీరశైవమత సిద్ధాంతము.

బౌద్ధజైన మతములపై ధ్వజమెత్తి, వైష్ణవ మతముతో స్పర్ధ వహించి, బ్రాహ్మణమతములోని కర్మమార్గమును కాదని, జ్ఞానమార్గమును వదలి, భక్తిమార్గమును మాత్రమే గైకొని శివాధిక్యమును విశ్వసించి, వీరభక్తికి వీరవ్రతమునకు దీక్షాకంకణము ధరించినది వీరశైవము. వీరశైవమతమును ఒక మహోద్యమముగ ఆంధ్రదేశమునందు అభివ్యాప్తము చేసిన కవులు శివకవులు. శివకవులు అనుమాట "శివకవిప్రవరుల చిత్తంబు లలర" అని బసవపురాణమునందు (254పం 1ఆ.) "శివకవుల్ హర్షింపఁ జెప్పదుఁ గవిత" అని పండితారాధ్యచరిత్రమునందు (13పు) కలదు శివకవుల యుగము శివకవియుగము

శివకవియుగమునకు యుగకర్తృ నిర్దేశము లేదు మతవిషయమున మల్లికార్జున పండితుడు మార్గదర్శి. కవిత విషయమున పాలకుఱికి సోమనాథుడు క్రాంతదర్శి. అతని శిష్యుడు చక్రపాణి రంగనాథుడు. అనుయాయి యథావాక్కుల అన్నమయ్య నలుగురు వీరశైవ మండపమునకు నాలుగు స్తంభములు మత విషయమున వినా మల్లికార్జున పండితుడు కవిత విషయమున మార్గదర్శి కాడు కవిత విషయమున వినా మతవిషయమున పాలకుఱికి సోమనాథుడు క్రాంతదర్శి కాడు. మతమునకు కవిత్వమునకు అవినాభావసంబంధము కలది శివకవియుగము. ఉభయులును యుగకర్తలనుట ఉభయకుశలమే కాని, ఉచితము కాదు. ఒకడే యుగకర్త అగుట సహజము యుగకర్తృనిర్దేశము లేని యుగవ్యపదేశమే రూఢమైనది శివకవియుగము శివకవులు ఇతరకవులకంటె భిన్నులు ఇతర శైవకవులకంటె, ఇతర వీరశైవులకంటెను ఈ శివకవులు భిన్నులు ఆ పార్థక్యమే శివకవియుగమునకు సార్థక్యము.

# మల్లికార్జున పండితుడు

మల్లికార్జున పండితుని చరిత్రయే పాలకుఱికి సోమనాథుని పండితారాధ్య చరిత్రము అది పరిపూర్ణమైన జీవితచరిత్రము కాదుగాని ప్రధానమైన జీవితచరిత్రము. మల్లికార్జున పండితుని జీవితములోని ప్రధానఘట్టములే కలవు అని కూడ మబ్బుదొంతరల మధ్య మెఱుపుఁదీగలు.

మల్లికార్జున పండితుడు శ్రీశైల మల్లికార్జునదేవుని వరప్రసాదుడు. తన్నా ముడు తల్లి గౌరాంబ తండ్రి దక్షారామభీమేశ్వరదేవుని పురోహిత శ్రేష్ఠుడైన భీమన పండితుడు. దీక్షాగురువు కోటిపల్లి ఆరాధ్యదేవుడు. మల్లికార్జునుడు మహా పండితుడు. వీరవ్రతుడు.

## కా ల ము

మల్లికార్జున పండితుని సమకాలికుడు బసవేశ్వరుడు. కలచురి బిజ్జలుని దండనాయకుడు. బిజ్జలుని సంహారము తర్వాత బసవేశ్వరుని లింగైక్యము, బసవేశ్వరుని లింగైక్యము తర్వాత మల్లికార్జునపండితుని లింగైక్యము జరిగినట్లు బసవ పురాణ, పండితారాధ్య చరిత్రములందు కలదు కలచురి బిజ్జలుని రాజ్యాంతకాలము 1167వ సంవత్సరము కాఁబట్టి బసవేశ్వరుడు లింగైక్యము చెందిన కాలము 1170, మల్లికార్జున పండితుడు లింగైక్యము చెందిన కాలము 1170 లేక 1180 అని చరిత్ర ప్రసిద్ధము కాని ప్రసిద్ధమైన చరిత్రమునకు కాలదోషము పట్టినది. బిజ్జలుడు, బసవేశ్వరుడు, మల్లికార్జునపండితుడు 1180 తర్వాత సజీవులై యున్నట్లు సాక్ష్యాధారములు కలవు

మల్లికార్జున పండితుడు సజీవుడైయున్నట్లు మాత్రమేగాక, దేశసంచారము చేయుచున్నట్లును శాసనము కలదు. అది సంగమేశ్వర శాసనము అందు "శక వర్షములు ౧౧౦౯ యగు ప్లవంగ సంవత్సర కార్తిక శుద్ధ పంచదశి సోమవా ××× " అని కలదు. కాని ప్లవంగనామసంవత్సరము 1107+78=1185 కాదు 1187. కాఁబట్టి శాసనకాలము 1187వ సంవత్సరము. 15-10-1187 తేదీ శాసనమునందు "మల్లికార్జున్ పండితుల" అని ఇదమిత్థముగ కలదు కన్నాటి గోకర్ణదేవుడు మల్లికార్జునపండితుని కాళ్లు కడిగి ధారాపూర్వకముగా దానముచేయుట శాసన విషయము. కాఁబట్టి మల్లికార్జున పండితుని చరమకాలము 1187 తర్వాత కావలయును.

బిజ్జలుని రాజ్యాంతకాలము 1167వ సంవత్సరమైనను, తర్వాత జీవించి యున్నట్లు ఒక అభిప్రాయము కలదు[20] హిప్పరిగె శాసనమునందు "కళచురియ బిజ్జభూపన భుజదండసంతతి రాజ్యదొళిరె" అని కలదు కళచురి బిజ్జభూపుని భుజ బలముచే అతని సంతతి రాజ్యము చేసెనని అర్థము తదనంతరము సేవణ భీముడ రాజ్యము చేసెనని కూడ శాసనమునందు కలదు "తదనంతర యదుకుల లలామ సేవణ భీమం" యదుకులసేవణ భీముడు, యాదవ భిల్లముడు అతని రాజ్యకాలము[21] 1187–91 అయినను, కలచురి కులనిర్మూలనము 1185వ సంవత్సరమునందు జరిగినట్లు చించిలి శాసనమునందు కలదు[22] అంతవఱకు కలచురి బిజ్జలుని కుమారులు రాజ్యము చేయుట నిరాఘాటము వారు బిజ్జభూపుని భుజబలముచే రాజ్యము చేసిరను వాక్యమునకు, అంతవఱకు బిజ్జభూపుడు జీవించి యుండుటయే అర్థమైనచో, బిజ్జలుని చరమకాలము 1185వ సంవత్సరము కావలయును.

బసవేశ్వరుని ఒక వచనమునందు "కెట్టితు కల్యాణి హాళాయిత్తునోడా...... చాళుక్యరాయని ఆళికె తెగియిత్తు" అని కలదు[23] చెడిపోయెను కల్యాణము పాడై పోయెను చూడుమురా...... చాళుక్యరాజు పరిపాలనము ముగిసెను" అని అర్థము బసవేశ్వరుడు లింగైక్యము చెందుటకు ముందు "పస చెడి కటకంబు పాడయ్యె"నని బసవ పురాణమునందును కలదు (1944పం 7ఆ.) కటకమన రాజధాని కల్యాణి కల్యాణికటకము పాడైన కాలము కల్యాణి చాళుక్యుల రాజ్యము నాశనమైన కాలమగును. కల్యాణి చాళుక్యుల రాజ్యమును 1190వ సంవత్సరము నందు హొయసల రాజులు జయించిరి[24] కాని వారి రాజధాని కల్యాణి కాదు. ద్వారసముద్రము. కల్యాణి రాజధాని కాని కాలమునందు చెడిపోవును పస చెడి పాడైపోవును అందుకు కొంతకాలము పట్టును ఆ కాలము 1196వ సంవత్సరము[25] కావచ్చును పతనమైన కల్యాణము గురించి పరితపించిన బసవేశ్వరుడు లింగైక్యము చెందిన కాలమును 1196వ సంవత్సరము[26] కావచ్చును.

బసవేశ్వరుడు లింగైక్యము చెందిన వార్త విని పరితపించిన మల్లికార్జున పండితుడు, శిష్యుడు దోనయ్యతో శ్రీశైలయాత్ర చేసి వెల్లటూరు తిరిగివచ్చిన తదుపరి లింగైక్యము చెందినట్లు పండితారాధ్య చరిత్రమునందు కలదు (పు543–545, ద్వి సం) కాబట్టి మల్లికార్జున పండితుడు లింగైక్యము చెందిన కాలమును 1196వ సంవత్సరము కావలయును. కాకపోయినను, మల్లికార్జున పండితుడు 1187వ సంవత్సరమునందు సజీవుడైయున్నట్లు సంగమేశ్వర శాసనమునందు కలదుగావున, మల్లికార్జున పండితుని కాలము స్థూలముగ 1120–1190 అగును.

## కృతులు

మల్లికార్జునపండితుడు "శివతత్త్వసార పద్యగద్యసమితి" రచించినట్లు పాలకుఱికి సోమనాథుని అనుభవసారమునందు కలదు (7ప.) "శివతత్త్వ సారమన్ శివకృతి" అని పండితారాధ్య చరిత్రమునందు కలదు (పుట 181 ఓ ప్ర.) అంతేకాదు మల్లికార్జున పండితుడు "పంచదూరు నుతించు బంచగద్యముల" అని కూడ అచట కలదు పద్యకృతియైన శివతత్త్వసారము లభించినది కాని అసమగ్రము మూడు గద్యలును కలవు శివభక్తులు "శతకంబు శివతత్త్వసారంబు దీపకళిక మహానాటకము, నుదాహరణములు" మొదలైనవి చదువువారనియును పండితారాధ్య చరిత్రమునందు కలదు (పుట 482-3 ప ప్ర) శతకపద్యమొకడు లాక్షణికోదాహరణము కలదు ఉదాహరణములు పాలకుఱికి సోమనాథునివే ఉపలబ్ధములయినవి దీపకళికాదులు ఎవరి రచనలో తెలియదు పండితారాధ్యచరిత్రము నందు ప్రసక్తమైన గ్రంథములెల్ల మల్లికార్జున పండితుని రచనలు కావు. హరలీల, మహిమ్నస్తవము, మలహణము, అనామయము మొదలైనవి మల్లికార్జునపండితుని కంటె పూర్వకాలికములైన సంస్కృత కృతులు తుమ్మెదపదములు, ప్రభాత పదములు మొదలైనవి తెలుగు దేశిపదకవిత్వము ఉపలబ్ధమైనంతవఱకు శివతత్త్వ సారము, శ్రీగిరి మల్లికార్జునశతకము, శ్రీమహిగద్య, లింగోద్భవగద్య, అక్షరాంక గద్య లేక మల్లికేశ్వరగద్య మల్లికార్జున పండితుని ప్రసిద్ధ కృతులు గద్యలు సంస్కృతకృతులు సార, శతకములు తెలుగు కృతులు

పండితారాధ్యచరిత్రములోని స్తుతిశ్లోకపంచకము, పర్వతాష్టకము, శివశరణ స్తుతి, మల్లికార్జున పండితుని రచనలని ఒక అభిప్రాయము కలదు.[27] ధరాధ్వరపు, గణాడంబరపు శివతత్త్వసారములోనివని మఱొక అభిప్రాయము కలదు[28] ఇట్లు బసవస్తుతిద్విపదలును మల్లికార్జునపండితుని కృతము లనవచ్చును. కాని సిద్ధార్యములు కావు. ఊహామాత్రశరణ్యములు భీమేశగద్య దక్షారామభీమేశ్వర పురోహిత శ్రేష్ఠుని పుత్త్రుడైన మల్లికార్జున పండితుని గద్య కావచ్చును

## శివతత్త్వసారము

శివతత్త్వసారము 489 పద్యముల గ్రంథము లభించినది. అది కన్నడమునలోనికి అనువదింపబడినది. అది కూడ అసమగ్రముగనే లభించినది. తెలుగు గ్రంథములోని 281-472 వఱకు 181 పద్యములు, 728 నుండి 740 వఱకు

12 పద్యములు మొత్తము 181+12=203 పద్యములు, కన్నడ గ్రంథమునందు కలవు [29] వ ఱొక మూడు పద్యములు కలవు అవిగాక గణపవరపు వెంకటకవి ఆంధ్రప్రయోగరత్నాకరమునందు ఒక పద్యము కలదు మొత్తము 489+12+3+1=505 పద్యములు లభించినవి. అందు 728-740 పద్యములు కలవు. కాఁబట్టి శివతత్త్వసారము అష్టశతి లేక సాహస్రి కావచ్చును. రచనాకాలము 1160 ప్రాంతము కావచ్చును.

శివతత్త్వ సారములోని పద్యములన్నియును కందపద్యములు. పద్యాంతము లందు శివా, సర్వానందా, మహేశా, రుద్రా, అజా, మునీంద్రవరేణ్యా, కరుణాంబునిధీ, సమస్తకామాతీతా, హరా, విష్ణువరేణ్యా, పరమానందా, నిత్యానందా, రాజాభరణా, చంద్రాభరణా, ఈశానా, అతి లోకశివా, సర్వజ్ఞా, ఉరగాభరణా, కపర్దీ, జితసంసారా, త్రిలోకసేవితచరణా, పురసంహారా, దురితారాతీ, తత్త్వాతీతా, అంబారమణా అను సంబుద్ధులు కలవు సంబుద్ధులు లేని పద్యములును కలవు. సంబుద్ధి వైవిధ్యము, సంబుద్ధిరాహిత్యము తెలుగు శతకమునకు లక్షణము కాదు. అంతేకాదు శతకలక్షణమైన ఆత్మనివేదనమును శివతత్త్వసారమునందు సార్వత్రికముగ లేదు. సంఖ్యా నియమము లేదు. కాఁబట్టి శివతత్త్వసారము శతకము కాదు. శతక సముచ్చయమును కాదు. అష్టశతియో సాహస్రియో మాత్రమే అగును.

శివతత్త్వసారము తత్త్వశాస్త్రగ్రంథము. అయినను శివకవులకు ఆదర్శ గ్రంథము. అంతేకాదు. శివతత్త్వసారములోని కందపద్యములు కొన్ని పండితారాధ్యచరిత్రమునందు ద్విపదలయినవి

"ఒండేమి మల్లికారున
పండితుఁడన నుం ౯ కంటెఁ బ్రమధులలో నె
న్నండొకొ॥ నీ యాజ్ఞోన్నతి
నుండఁగఁ గాంతునని కోరుచుండుదు రుద్రా॥" 387 ప.

"ఊర్జిత ప్రమథాత్మ యొండేమి మల్లి
కార్జున పండితుఁ డనఁగ నిచ్చోట
నుండుట కంటె నెన్నండకో ప్రమథ
మండలిలో భవన్మహదాజ్ఞఁ జేసి
యుండంగఁ గాంతునకోయని కోరు
చుండుదు నన్నట్టు లునుపఁగదయ్య" 544పు. ప. ప్ర.

పండితారాధ్య చరిత్రములోని ద్విపదలందు సంస్కృతోట్టంకనముల సంఘటనమునకు శివతత్త్వసారములోని కంద పద్యములందలి సంస్కృతోట్టంకనముల సంఘటనమే ఒరవడి.

"వాదేమి 'యనంతా వై
వేదా' యను వేదములు వివిధవివరములన్" 4ప.

"వసుమతిఁ జిత్రమ జితచి
త్తసంభవా 'నకర్మణా న తపసా న జపై
ర్న సమాధిభి' రవ్యయ నీ
యసదృశభక్తికినిఁ బ్రియుఁ డవగు దీశానా!" 111ప.

"వినరె శ్రౌతస్మార్తవిధులు శోధించి
ననిచి 'ధ్యానా దర్చనాద్ధారణాద
పి' యనంగ విష్ణుప్రభృతిసురక మునులు" 49పు. దీ ప్ర.

"గర్భోపనిషది వ్యక్తంబగు సూక్త
ముల 'యది యోఽన్యాః ప్రముంచ్యామి' యనఁగ
నిల 'దంప్రపద్యే మహేశ్వర మ్మనఁగ" 50పు దీ. ప్ర.

శివకవులకు శివతత్త్వసారము ప్రకాణాచి. అందువలన శాస్త్రగ్రంథమైనను శివతత్త్వసారమునకు సాహిత్య రంగమునందు స్థానము కలదు.

శివతత్త్వసారము శ్రీకారాదిగ కలదు. అవతారిక లేదు అవతారికాప్రాయముగ ఆత్మనివేదనము కలదు అందు మూడు షష్ఠ్యంత పద్యములు కలవు అవి మఱి అంకిత చిహ్నములు కావు జయాశంసన పూర్వకములు శివాశంసనపూర్వకములును

జయమగు వేదంబులకును
జయమగుఁ బంచాక్షరికిని జయమగు నిటలా
క్షయమగు భసితంబునకును
జయమగు మాహేశ్వరులకు సంతతము శివా! 18ప.

శివమగు ధార్మికనృపులకు
శివమగు గోబ్రాహ్మణులకు శివమగు మఱియున్
శివానందావిరహితులకు
భువనత్రయజనుల కెల్లఁ బుణ్యంబు హరా! 20ప.

ఇవి షష్ఠ్యంతములే. వేదములకు, శివసంహితలకు (19ప) రాజులకు, ప్రజలకు వర్తించు పద్యములివి కృతిభర్తలకు మాత్రమే పరిమితమైన షష్ఠ్యంత పద్యములకు ఆద్యప్రకృతులు.

ఆగమోక్త ప్రకారమైన పశుపాశపతిజ్ఞానము, శాంభవ దీక్షా స్వరూపము; అఱువత్తుమున్నావరులోని శివభక్తుల కథలు, వీరశైవమతమునకు విశిష్టమైన వీర భక్తి, శివాధిక్యము, శివభక్తాధిక్యము, అన్యమతఖండనము, వర్ణ విచక్షణా రాహిత్యము మొదలైన అనేక విశేషములు శివతత్త్వసారమునందు కలవు.

1 పశుపాశపతిజ్ఞానము : పది పద్యములందు కలదు (21-30) జీవులు పశువులు జీవితము పాశము పశువులకు, పాశములకు పతి శివుడు శివునికి శరణాగతుడైన భవబంధపాశములు తెగును. ఇది పశుపాశపతిజ్ఞానమునకు ప్రాతిపదిక.

"పశువులనఁ జీవరాసులు
పశుపాశంబులకు నీవ పతివనఁ శివ నీ
వ శరణ్యమనం బశుదు
ర్వశభవపాశములు తెగకవచ్చునె యెందున్." 26ప.

2. శాంభవ దీక్షా స్వరూపము : గురుముఖతః దీక్షాస్వీకారము చేసి, విభూతి రుద్రాక్షలింగధారణమున, పంచాక్షరీ మంత్ర పారాయణమున లింగార్చనము చేయుట శాంభ దీక్ష. గురువులేని సహజభక్తులకు శివుడే గురువు

"భవి జన్మాంతర సంస్కా
రవశంబున సహజభక్తి రతి పుట్టి శివున్
ధ్రువముగఁ బూజించు మహో
త్సవునకు నీశ్వరుఁడ గురువు శాంభవదీక్షన్" 227ప.

3 శివభక్తుల కథలు శివతత్త్వసారమునందు నలుబదియెనిమిది పద్యములందు కలవు. (389-446) అందు తెలుగు శివభక్తుల కథలు, కన్నడశివభకుల కథలు, సంస్కృత శివభక్తుల కథలు మాత్రమే గాక, అఱువత్తుమున్నావరులోని చిఱుతొండనంబి, ఒడయపిళ్ళ, ఒడయనంబి, అంబన (?) కన్నప్ప, ఇఱుదత్తుడు కథలు కలవు శివతత్త్వసారములోని శివభక్తులందఱును సాహసోపేతులు, సాహస కృత్యసంభరితులు.

"తన కొడుకుఁ దునిమి వంటక
మొనరఁగ గావించి నీకు నొప్ప నివేదిం
చిన దాన హెచ్చి ముక్తిఁ
బొనరఁగఁ జిఱుతొండనంబి వోఁడె రుద్రా!" 400ప.

4. వీరభక్తి శివలింగము స్థావరలింగము శివుడు, గురువు, శివభక్తుడు జంగమలింగములు గురులింగజంగమారాధనము వీరభక్తికి గుర్తు.

"జంగమలింగంబగు భ
క్తుం గని పూజింపఁడేనిఁ గోటి విధములన్
లింగార్చన చేసిన వృథ
జంగమ ముత్తమముగాఁగ స్థావరమునకున్." 153ప.

5 శివాధిక్యము : త్రిమూర్తులందు శివుడే దేవుడు. బ్రహ్మవిష్ణువులు శివభక్తులు సృష్టిస్థితిలయములకు కర్త శివుడే శివుని మహత్త్వము బ్రహ్మ విష్ణువులకు తెలియదు ఇది శివుడు పరమదైవమను వీరశైవమతము.

"వేదాద్యష్టాదశవి
ద్యాది మహాకర్త నీ మహత్త్వము వొగడన్
శ్రీదయితా వల్లభ వా
ణీదయితా వల్లభులును నేరరు రుద్రా! 97ప.

6. శివభక్తాధిక్యము : ఇతర భక్తులకంటె శివభక్తుడే అధికుడు.

"ఒక వైష్ణవుఁ డొక మీమాం
సకుఁ డొక బౌద్ధుండు నొక్క జైనుఁడు త్రిపురాం
తకు భక్తు నట్ల నిజసా
త్త్విక దృష్టాంత ప్రసిద్ధిఁ గీర్తనఁ గనిరే!" 242ప.

7. అన్యమత ఖండనము · అద్వైత మతఖండనము ముప్పదియాఱు పద్యములందు కలదు (31–66) అందు జీవాత్మ పరమాత్మల అద్వైతము, జగన్మిథ్యావాదము జర్ఝరీభూతమైనది

"అద్వైతమ్ము పురాతన
విద్వన్మునివరుల కెల్ల విద్విష్టము సా
క్షాద్వేదోక్తము గామిని
సద్విద్వద్ద్వైతులకు నసహ్యంబు శివా!" 53ప.

అద్వైత సిద్ధాంతము పూర్వ విద్వాంసులకు సమ్మతము కాదని, అది సాక్షా ద్వేదోక్తము కాదని ఖండించుట మాత్రమేగాక, సద్విద్వాంసులైన ద్వైతులకు సమ్మతము కాదని స్పష్టము అద్వైతులు "మిథ్యావిచ్ఛేదనవేదశాస్త్రవిప్లవవాదులు" అని కూడ కలదు (౯౯ప)

మల్లికార్జున పండితుడు మహాపండితుడు మహావీరవ్రతుడు. అవైదికమనిన వీరశైవమును సవైదికమని స్థాపించినట్లు, వెలనాటి చోడుని ఆస్థానమున [చందవోలు] శ్రుతిస్మృతి పురాణేతిహాసోదాహరణ పూర్వకముగా వేదకర్మకాల వేదాంత సాంఖ్యయోగ చార్వాక పాంచరాత్ర బౌద్ధజైనవాదములను ఖండించి, శివుడు పరమదైవమని వీరశైవమును ప్రతిష్ఠాపించినట్లు పండితారాధ్యచరిత్రము నందు కలదు [వాద ప్రకరణము] ఆ యా మతఖండన మండనములును శివతత్త్వ సారమునకు విషయములగును అనుపలబ్ధమైన మూడు లేక అయిదు వందల పద్యములందు బౌద్ధ జైన వైష్ణవ బ్రాహ్మణ నాస్తికాది మతముల ఖండనములును ఉండుట సంభవము

8 వర్ణవిచక్షణారాహిత్యము : "భక్తి మీఁది వలపు బ్రాహ్మ్యంబులోఁ బొత్తుఁ బాయంగ లేను నే బసవలింగ" అని మల్లికార్జునపండితుడు అన్నట్లు చెప్పుట పరిపాటి. అది సీసపాదము. ఆకరము మృగ్యము బ్రాహ్మ్యమునందు వర్ణ వ్యవస్థ కలదు. కాని వర్ణ సంరక్షణముగాని వర్ణవిచక్షణముగాని శివతత్త్వసారము నందు లేదు అంతేకాదు. శివసంస్కార విహీనుడు అంత్యజునకు అంత్యజుడని, శివసంస్కారనియుక్తుడు అగ్రజునకు అగ్రజుడని కలదు

"శివసంస్కారవిహీనుం
డవు మానవుఁ డంత్యజునకు నంత్యజుఁ డరయన్
శివసంస్కారనియుక్తుం
డవు మానవుఁ డగ్రజునకు నగ్రజుఁ డరయన్." 470ప.

ఇందుకు నిదర్శనముగ చెన్నడు [472ప] కాటకోటడు [481ప] అను భక్తులు ముక్తులైన కథలు శివతత్త్వసారమునందు కలవు.

మల్లికార్జునపండితుడు శివయోగి అని పండితారాధ్యచరిత్రమునందు కలదు. [165పు ది. ప్ర] శివయోగ స్వరూపమును శివతత్త్వసారమునందు కలదు.

"నిన్నె ఱుఁగుచు దన్నె ఱుఁగని
యన్నఁడు శివయోగమగ్నుఁ డనఁబడఁ [డెపుడున్]
నిన్నునుఁ దన్ను నెఱింగెడి
యన్నఁడు శివయోగమగ్నుఁ డనఁబడును శివా!" 269ప.

ఇందు అన్నఁడు అనగా అట్టి[31]వాడనియే అర్థము.

## శ్రీగిరి మల్లికార్జున శతకము

మల్లికార్జునపండితుడు శ్రీగిరి మల్లికార్జున శతకము రచించినట్లు ప్రసిద్ధము. "ఆరాధ్యదేవర మల్లికార్జున శతకము"లోని దని ఒక పద్యము లక్షణ గ్రంథము లలో నుదాహృతమైనదని ఒక అభిప్రాయము కలదు.[32] అదే పద్యము గణపవరపు వేంకటకవి ఆంధ్రప్రయోగ రత్నాకరమునందు స్థానలఘుప్రాసమునకు లక్ష్య ముగ ఇట్లు కలదు.

"ఈ ప్రాసమునకే మల్లికార్జునుఁడు
లోకములెల్ల నీ తనువులోనివ యందు రదంత గల్లవో
నాకపపద్మసంభవ జనార్దనులాదిగ నెల్లవారలున్
నీ కొలఁ దింత పూత్రమన నేరక మ్రొక్కఁ దొడంగిరన్న ని
న్నే క్రియ నే నుతించుఁ బరమేశ్వర శ్రీగిరిమల్లికార్జునా."

శివతత్త్వసారములోని పద్యమును "పండితారాధ్యులు" పేర ఉదహరించిన గణపవరపు వెంకటకవి శ్రీగిరి మల్లికార్జున శతక పద్యమును "మల్లికార్జునుఁడు" పేర ఉదాహరించుట శంకనీయము కాదు. మల్లికార్జున పండితుడు దక్షారామభీమే శ్వరపురోహితశ్రేష్ఠుని పుత్త్రుడైనను శ్రీగిరిమల్లికార్జునదేవుని వరప్రసాదుడు. అంతేకాదు శతకపద్యములోని భావము శివతత్త్వసారములోని పద్యమునందు కలదు

"హరిసరసిజ భవులాదిగఁ
బరమమునీంద్రులకు నెఱుఁగ భరమగు నీ ని
ర్భరభూరిమహిమ పొగడఁగ
నరు లెంతటివా రనాథనాథ! మహేశా!" 6ప.

కాఁబట్టి లాక్షణికోదాహరణరక్షితమైన శ్రీగిరి మల్లికార్జున శతకము మల్లి కార్జున పండితకృతమే. అమూల్యమైన లాక్షణికోదాహృతపద్యమిది ప్రప్రథ మాంధ్ర శతకమునకు చిహ్నపతాక.

## శ్రీముఖదర్శనగద్య

శ్రీముఖగద్యం అని వ్యవహారప్రసిద్ధమైన గద్య శ్రీముఖదర్శనగద్య. ఆద్యం తములివి:[33] "ఆది —

శ్లో. త్రైలోక్యస్య భవానేవ నిగ్రహానుగ్రహక్షమః,
శ్రీ విశ్వేశ్వర మాం పాహి మహేశ్వర, నిరీశ్వర,
జయజయ రుద్ర, వీరభద్ర, విరించపంచమ శిరః ఖండన,
యజ్ఞపురుష శిరఃఖండన—

అంతము :

మల్హణప్రియ, బల్హణప్రియ, కుమ్మరిగుండయ్యప్రియ, అఖిల
భువన భక్తజనప్రియ, దేవాః సురపతిప్రముఖ నిఖిల ప్రార్థిత ప్రథన
పరమేశ్వర, దేవా నమస్తే నమస్తే నమః
శ్రీమాన్ మాహేశ్వర శ్రేష్ఠో మల్లికార్జున పండితః
శ్రీముఖదర్శన గద్యం హృద్యం గ్రథితవాన్ (?)"

ఇది సంస్కృత భాషా సంగ్రథనము. ఆద్యంత శ్లోకములు తన్నిదర్శనము. గద్యశబ్దమును సూచకము. సంస్కృతమునందు గద్యశబ్దమునకు సమానార్థకముగ వచన శబ్దము లేదు. మల్లికార్జున పండితునికి సుమారు శతాబ్ది పూర్వము, రామానుజాచార్యుల గద్యత్రయము కలదు అది వైష్ణవగద్యము ఇది శైవగద్యము.

## లింగోద్భవదేవుని గద్య

లింగోద్భవ గద్య[34] అని వ్యవహారప్రసిద్ధమైన గద్య లింగోద్భవదేవుని గద్య. వెలనాటి చోడుల రాజధాని చందవోలులోని శివుడు లింగోద్భవ దేవుడు. మల్లికార్జున పండితుడు చందవోలులో విడిది చేసినపుడు లింగోద్భవదేవునిపై చెప్పిన గద్యము కావచ్చును గద్యశబ్దమునుబట్టి సంస్కృతభాషాసంగ్రథనమే అగును.

## అక్షరాంకగద్య లేక మల్లికేశ్వరగద్య

ఇది ఆద్యంతములు లేకుండ ముద్రితము[35] ఇందు అక్షరానుక్రమణికను సంబుద్ధులు కలవు అఖిలలోకాధార, ఆనందరసపూర, ఇనచంద్రశిఖినేత్ర – ఇత్యాది. అందువలన అక్షరాంకగద్య అను పేరు. గద్యాంతమునందు "అక్షరాంక స్తోత్ర"

అని కలదు శ్రీ పర్వతలింగ స్తోత్రము కావున మల్లికేశ్వరగద్య. లకారాదివకారాది సంబుద్ధుల మధ్య,

"ప్రమథాయ రుద్రాయ భక్తిప్రదాయ ;
విమలాయ నిత్యాయ విశ్వస్తుతాయ ;

అని, తుదిని శ్రీ పర్వతలింగ నమస్తే నమస్తే నమః" అని కలదు. ఇది కూడ సంస్కృతభాషారచనయే.

మల్లికార్జునపండితుడు అమరావతికి వెళ్ళినప్పుడు అమరేశ్వరాష్టకము చెప్పినట్లు పండితారాధ్య చరిత్రమునందు కలదు అనుపలబ్ధము.

మల్లికార్జున పండితుడు కన్నడమునందు వచనగళు గణసహస్రనామము, ఇష్టలింగస్తోత్రము బసవగీత రచించినట్లు కలదు.[36] ఇష్టలింగస్తోత్రము ఉపలబ్ధము కాలేదు. కన్నడ శివతత్త్వసారమునందు తెలుగు శివతత్త్వసారములోని,

"ఒండేమి మల్లికార్జున
పండితుఁడన నుండుకంటెఁ బ్రమథులలో నె
న్నండొకొ; నీ యాజ్ఞోన్నతి
నుండఁగఁ గాంతునని కోరుచుండుదు రుద్రా!" 387ప.

అను పద్యము అట్లే కలదు అందువలన కన్నడ శివతత్త్వసారమును మల్లికార్జున పండితుని కృతి అని ఒక అభిప్రాయము కలదు.[37] కన్నడకృతులు రచించిన మల్లికార్జున పండితుడు స్వయము శివతత్త్వసారమును కన్నడించుట అసంభవము కాదు కాని శివతత్త్వసారమును ఎవరు కన్నడించినను "ఒండేమి" అను పద్యము అట్లే యుండును. కాఁబట్టి కన్నడ శివతత్త్వసారము మల్లికార్జున పండితుని కృతి అనుటకది నిర్ధారక సాధనము కాదు.

మల్లికార్జున పండితుని అనుభవసారములో మూడు పద్యములందు మూద లించిన, [7–9], వృషాధిప శతకములో ఒక పద్యమునందు ప్రశంసించిన, సహస్రగణమాలికయందు పేర్కొన్న, ప్రత్యేకము ద్విపద కావ్యము రచించిన పాలకురికి సోమనాథుని పండితారాధ్యోదాహరణమునకు పీఠికా ప్రియముగ రెండు శ్లోకములు, రెండు పద్యములు కలవు అందు,

"అద్వైతోద్ధతకుంభికుంభదళనోద్యద్రౌద్ర పంచాననో
గర్వోదంచితపాంచరాత్రనిబడప్రాలేయ చండద్యుతిః

పాషండాబ్ధమహాగజో విజయతే బౌద్ధాద్రిఘోరాశనిః
శ్రీ మత్పండితమల్లికార్జునగురు ర్విద్వత్సభా పూజితః" ౧.

"శ్రీమచ్ఛైవరమావరున్ విసమితశ్రీ చెన్నమల్లేశ్వరున్
ధీమంతున్ నిగమాగమశ్రుతిమతోద్దీలార్థవేత్తన్ బుధ
స్తోమస్థున్ బ్రఖునూర్ధ్వనేత్రుఁడగు నాఘ్యన్ ద్యున్[?] బండితారాధ్యు లన్
గామింతున్ నుతియింతుఁ గొల్తుఁ దలఁతున్ గావ్యార్థసంసిద్ధికిన్ " ౨.

అను శ్లోకపద్యములందు అద్వైత మతవిదళనము, వైష్ణవమత నిర్మూలనము, బౌద్ధమత విధ్వంసనము, పాషండమతఖండనము, నిగమాగమశ్రుతివేతృత్వము, ఊర్ధ్వనేత్రలాభము కలవు. అవి మల్లికార్జున పండితుని వీరశైవమతోద్యమవిజయ పతాకలు

# పాలకురికి సోమనాథుడు

ఇటు మల్లికార్జున పండితునికి, అటు బసవేశ్వరునికి అనుయాయి పాలకురికి సోమనాథుడు. జన్మస్థలము పాలకురికి ఇప్పటి పాలకుర్తి అచటి దైవము సోమేశ్వరుని పేరే అతని పేరు తల్లి శ్రియాదేవి తండ్రి విష్ణురామిదేవుడు దీక్షా గురువు గురులింగము కవితా గురువు కరస్థలి విశ్వనాధయ్య. మఱొక గురువు కట్టకూరి పోతిదేవర

## కాలము

బసవపురాణమునందు పాలకురికి సోమనాధుని గోష్ఠిలోని కరస్థలిసోమ నాథయ్య "పండితారాధ్యకృపాసముద్గతుఁడు" అని కలదు [౬౯పం. 1ఆ.] కృపా సముద్గతుడన శైవమత దీక్షాస్వీకారము చేసిన శిష్యుడు పండితారాధ్యుఁడన మల్లి కార్జున పండితుడు. పండితుని పుత్త్రిడు, పౌత్త్రిలు పండితారాధ్య శబ్దవాచ్యులైనను, వారిని పండితారాధ్యులని పాలకురికి సోమనాధుడు పేర్కొనలేదు. అంతేకాదు. మల్లికార్జునపండితుని అనంతరము కేదారయ్యకు లోకారాధ్యపట్టము కట్టిన దోనయ్యను "పండితారాధ్యహస్తాగ్రజుండు" అనియే పేర్కొనెను. కృపాసముద్గ తుడు వలె హస్తాగ్రజుడును శైవమత దీక్షా స్వీకారము చేసిన శిష్యుడు దోనయ్య మల్లికార్జున పండితుని శిష్యుడు పాలకురికి సోమనాధుడు పారాయణము చేసిన పండితారాధ్యపదబంధము మల్లికార్జునపండితునిదే. కాఁబట్టి కరస్థలి సోమనాథయ్య

మల్లికార్జునపండితుని శిష్యుడే కావలయును అతడు, పాలకుఱికి సోమనాథుడు సమకాలికులు సమకాలికు లనగా సమవయస్కులని అర్థముకాదు సమవయస్కులు కావచ్చును. కాకపోవచ్చును. కరస్థలి సోమనాథయ్యకు పాలకుఱికి సోమనాథుడు యువసమకాలికుడు కావచ్చును మల్లికార్జునపండితునికి కరస్థలి సోమనాథయ్య కూడ యువసమకాలికుడు కావచ్చును.

పండితారాధ్యచరిత్రమునందు పాలకుఱికి సోమనాథుడు వెలిదేవ వేమనారాధ్యుల "మనుమశిష్యుడు" అని కలదు [పుటలు 13-14 దీ ప్ర] వెలిదేవ వేమనారాధ్యుడు మల్లికార్జునపండితుని సందర్శించినట్లును కలదు [పుటలు 162-163 దీ ప్ర] అంతేకాదు వెలిదేవ వేమనారాధ్యుడు "బసవ పాదాంభోజ భాజనస్వాంతుడు" అని కూడ కలదు. [పుట 430. పు.ప్ర] కాబట్టి వెలిదేవ వేమనారాధ్యుడు, మల్లికార్జునపండితుడు, బసవేశ్వరుడు సమకాలికులు కావలయును. పురాతనభక్త కోటిలో చేరిపోయిన వెలిదేవ వేమనారాధ్యునికి బసవేశ్వర, మల్లికార్జున పండితులు యువసమకాలికులు కావచ్చును. మల్లికార్జునపండితుని కాలము స్థూలముగ 1120-1190 అని పూర్వోక్తము కాబట్టి వెలిదేవవేమనారాధ్యుని కాలము స్థూలముగ 1100-1180 కావచ్చును. అతని మనుమని కాలము స్థూలముగ 1160-1240 అగును. మనుమశిష్యుని అనగా పాలకుఱికి సోమనాథుని కాలము స్థూలముగ 1190-1270 అగును మల్లికార్జునపండితుని శిష్యుడైన కరస్థలి సోమనాథయ్య కాలముస్థూలముగ 1170-1250 అగును అయిన బసవపురాణ, పండితారాధ్యచరిత్రములలోని అంశములు సుసంగతములగును.

కాకతిగణపతిదేవచక్రవర్తి "పండితారాధ్యుల కొడుకులకు" గ్రామదానము చేసినట్లు శాసనముకలదు.[38] గణపతిదేవచక్రవర్తిరాజ్యకాలము 1198-1262. మల్లికార్జునపండితుని కాలము 1120-1197 కావున, అతని కొడుకు కేదారయ్య కాలము స్థూలముగ 1150-1230 అగును. అయిన గణపతిదేవచక్రవర్తికేదారయ్యకు గ్రామదానము చేయుటకు అనుకూలము. మల్లికార్జునపండితునికి కొడుకే గాని కొడుకు లున్నట్లు పండితారాధ్యచరిత్రమునందు లేదు కాబట్టి శాసనములోని బహువచనము గౌరవవాచకము.

1296 వ సంవత్సరము నాటి మఱొకశాసనమునందు "నిలువుగన్నులు దాల్చిన పండితారాధ్యుల మనుమలు శ్రీగిరిగారికి" అని కలదు [39] మల్లికార్జునపండితు

నికి మనుమపండితుడు, భీమనపండితయ్య, మహదేవయ్య, చెన్నవిభుడు అను మనుమలే గాని, శ్రీగిరి అను మనుమడు ఉన్నట్లు పండితారాధ్యచరిత్రమునందు లేదు (౫౫౦పు ప్ర) కాబట్టి శ్రీగిరి మునుమనుమడు కావలయును. మునుమనుమని మనుమడనుట కలదు [40] మల్లికార్జునపండితుని కాలము 1120-1197, కేదారయ్య కాలము 1150-1230 కావున మనుమపండితుని కాలము 1180-1260, భీమనపండితయ్య కాలము 1185-1265, మహదేవయ్యకాలము 1190-1270, చెన్నవిభుని కాలము 1195-1275 అగును శ్రీగిరికాలముస్థూలముగ 1225-1305 కావచ్చును అయిన 1296 నాటి శాసన ప్రసక్తికి సంవదించును

పండితారాధ్యచరిత్రమునందు మల్లికార్జునపండితుని మనుమల పేరులే కాని, మునుమనుమల పేరులు లేవు "ఆత్మసంతానతనయపరంపరోత్తరపరంపరలుఁ బరిచితగురుపరంపర దేజరిల్లు" అనియే కలదు. (పుట551.ప్ర.) అనగా మల్లికార్జునపండితుని మునుమనుమల, ముఖ్యముగ శ్రీగిరి వైభవము పాలకుఱికి సోమనాధునికి తెలియదని అవగాహనమగును. కాబట్టి పాలకుఱికి సోమనాధుని కాలము 1296 కంటె పూర్వము కావలయును.

బసవపురాణమునందు పాలకుఱికి సోమనాధుని గోష్ఠిలో మఱొక నలుగురు కలరు. 1. మల్లినాధుడు 2. రెంటాల మల్లినాధుడు 3 దోచమాంబ 4 గోడగి త్రిపురారి. వీరిలో రెంటాల మల్లినాధుడు ఆదివెదాంతసిద్ధాంతపురాణవెదశాస్త్రాగమ విహితమార్గముల జంగమార్చనలు సేయుచు, గ్రామసీమాలంఘనవ్రతుఁడయి, కుమారాద్రికి తూర్పుదెసను సోపానములు కట్టించిన మహాభక్తుడు. దోచమాంబ ప్రతిదినమును అయిదు కరవీరపుష్పములు హరునికి అర్పించుచు, ఒకనాడు ఒక పువ్వు తక్కువై తన నేత్రకమలమును హరునికి అర్పించి, భవునిచే మఱల కన్ను పడసిన మహిమాన్వితురాలు అంబయదేవుని నీలగంగవరశాసనమునందు మొల్లకల్లూరి గ్రామమునకు ప్రతిగ్రహీత రెంద్రదేవుల మల్లినాధుడు కలడు. శాసనానంతరము ప్రసిద్ధురాలైన "దోచయాఖ్య" నేత్రమును పెకలించి శివపూజ చేసినట్లు, కుమారాద్రిపై పూర్వద్వారమున పురారి పురోభాగమున సోపానమార్గమును కట్టించినట్లు కలదు రెంద్రదేవుల మల్లినాధుడే రెంటాల మల్లినాధుడని, రెంద్రదేవుల శబ్దమే క్రమముగా రెంద్రదేల, రెంద్రదేల, రెండాల, రెంటాల అని విపరిణతమైనదని, "దోచయాఖ్య దోచమాంబ అని, శాసనకాలము పాలకుఱికి సోమనాధుని కాలమని ఒక అభిప్రాయము కలదు.[41]" దోచయాఖ్య" దోచమాంబ అగును. కాని రెంద్రదేవుల

మల్లినాథుడు రెంటాల మల్లినాథుడు కాఁజాలడు. కారణము రెండ్రదేవులశబ్దము రెంటాల శబ్దముగ విపరిణామము చెందుట భాషాశాస్త్రమునకు విరుద్ధము. అంతే కాదు. ఏకకాలమునందు రెండు రూపము లుండుట[42], ఏకవ్యక్తికి రెండు ఇంటి పేరు లుండుట కూడ విపరీతము. రెండ్రదేవుల ఒక ఇంటిపేరు. రెంటాల మఱొక ఇంటిపేరు వాడ+రేవు=వాడ్రదేవు, పుట్ట+రేవు=పుడ్రదేవు వలె రెండు+రేవులు= రెండ్రదేవులు అగును అవే వ్యవహారరూపములు. రెంటాల వలె గంటాల అను ఇంటిపేరు కలదు గంటము పట్టిన వారు గంటాలవారు, రెంటము కట్టిన వారు రెంటాలవారు అగుదురు. రెంటమన జంటనేతబట్ట. ధావళి అను మడిబట్ట రెండ్రదే వుల మల్లినాథుడు ప్రతిగ్రహీత రెంటాల మల్లినాథుడు సోపాననిర్మాత నేత్రకమల సమర్పణము తోపాటు సోపాననిర్మాణధర్మకార్యమును శాసనానంతరము దోచయా ఖ్యపరముగ కలదు నీలగంగవరశాసనమునందు దానవిషయము, దాతృవిషయము ప్రతిగ్రహీతృవిషయము, శాసనకాలవిషయము, శాసనకావ్యకర్తృవిషయమునకు ముందు శ్లోకములందు కలదు (1–51పం.) శాసనకావ్యకర్తృవిషయముతో శాస నము సంపూర్ణము. అనంతరము గ్రామదానవిషయము మఱల తెనుగువచనము నందుకలదు (52–60పం.) తదనంతరము దోచయాఖ్యగురించి శ్లోకము (61– 66పం) శ్లోకము సమగ్రమైనను భావము అసమగ్రము అంతేకాదు. శాసనముతో అన్వితము కాదు. ఉపరి రెంటాల మల్లినాథుని సోపాననిర్మాణము దోచయాఖ్యపర మైనది ఆమె దోచమాంబ అగును. దోచమాంబ నేత్రకమలసమర్పణమహిమను రెంటాల మల్లినాథుని సోపాననిర్మాణధర్మకార్యము లోకవ్యవహారమున, కాలక్రమ మున ఆమె పరము కావచ్చును. అది నీలగంగవరశాసనమునందు ఆగమప్రాయము గానే కలదు కాఁబట్టి రెంటాల మల్లినాథుడు, దోచమాంబ, పాలకుఱికి సోమనాథుడు శాసనకాలమునకు పూర్వులు కావలయును శాసనకాలము 1290వ సంవత్సరము. ఇది పాలకుఱికి సోమనాథుని కాలము స్థూలముగ 1190–1270 అను పయి నిర్ణ యమునకు అనుకూలము.

పిడుపర్తి సోమన పద్య బసవపురాణమునందు కల విషయము లివి :

i) శివభక్తులు ఓరుగల్లులో స్వయంభూ దేవాలయమునందు బసవపురాణ మును వినుచుండగా 'హరుని గొల్వఁ బ్రతాపుఁ డచటికి వచ్చి' ప్రశ్నించుట వగైరా.

II) పాలకుఱికె సోమనాథుడు ఓరుగల్లు వచ్చి, ఇందులూరి అన్నయ మంత్రి చేత చెప్పించి పిడుపర్తి శివరాత్రి కొప్పయ్యకు దోకెపురమును అగ్రహారముగ ఇప్పించుట

III) ప్రతాపు డిచ్చిన దోకి పురాగ్రహారము "నడుమ నంకెరి వడిన" పిడుపర్తి పెదసోమయ్య ప్రౌఢరాయల చేత మరల పడయుట.

IV) పాలకుఱికె సోమనాథుడు "కాలత్రయ వెదిగావున" పిడుపర్తి కొప్పయ్య ప్రభృతి శిష్యులకు "ఈ దేశం బింకఁ దురుష్కులచే నాక్రాంతంబు గాఁగల" దని చెప్పుట.

పయి దోకి పురాగ్రహార విషయము పరమ సత్యమైన, రెండు శాసనము లుండును.ఒకటి ప్రతాపుని దోకిపురాగ్రహారదానశాసనము మఱొకటి ప్రౌఢరాయల దోకె పురాగ్రహార పునరుద్ధార శాసనము ఒక్క శాసనమును ఉపలబ్ధము కాలేదు! అయినను పాలకుఱికె సోమనాథుడు మొదటి ప్రతాపరుద్రుని కాలము వాడని, రెండవ ప్రతాపరుద్రుని కాలము వాడని వాదోపవాదములు వెలసినవి పద్యబసవ పురాణములోని విషయములు సమకాలికసమాచారములు కావు. సమీపకాలిక సమాచారములును కావు. అర్వాచీనకాలికసమాచారములు విన్నది కన్నది విలసిల్లును ప్రత్యక్షరము పరమ ప్రమాణము కాదు ఇందు ప్రధానవ్యక్తి ఇందు లూరి అన్నయామాత్యుడు. అతడు రుద్రమదేవి అల్లుడు మంత్రికూడ అనంతరము ప్రతాపరుద్రుని మంత్రి. సేనాధిపతి కూడ. అతడు ప్రతాపరుద్రుని చేత అగ్రహార మిప్పించుట కంటె రుద్రమదేవిచేత అగ్రహార మిప్పించుట తేలిక రుద్రమదేవి కాకతి గణపతి దేవచక్రవర్తి కూతురు. కుమారునిగ పెరిగెను పురుషుడుగనే పరిపాలించెను. ఆమె శాసనములందు రుద్రదేవుడు అని కలదు రుద్రమదేవి ఇచ్చిన దోకెపురశాసనమునందును రుద్రమదేవుడు అని ఉండును ప్రతాపరుద్రుని ప్రాముఖ్యమును బట్టి ఆ రుద్రమదేవుని ప్రతాపరుద్రదేవుడని అర్వాచీనులు భ్రమపడవచ్చును. అది పద్య బసవ పురాణమునందు అక్షరబద్ధమగును రుద్రమదేవి రాజ్యకాలము 1262–1291. పాలకుఱికె సోమనాథుని కాలము 1190–1270. కాఁబట్టి దోకి పురాగ్రహారదాన కాలము 1265 ప్రాంతమగును. అయిన శివరాత్రి కొప్పయ్య కాలము 1240– 1420 కావచ్చును. అతని మనుమడు పెదసోమయ్య కాలము 1320–1400 కావచ్చును. ప్రౌఢరాయలు విజయనగర సామ్రాజ్యాధిపతి మొదటి దేవరాయలు అతని రాజ్యకాలము 1406–1422. అయినను 1381 నుండి యువరాజుగ నిర్వహించిన రాచకార్యములు కలవు. అంతేకాదు 1385వ సంవత్సరమున

మొదటి దేవరాయల పేర శాసనము కలదు [43] కాబట్టి దోకి పురాగ్రహార పున రుద్ధార కాలము 1385 ప్రాంతమగును పెదసోమయ్య రెండవ కొడుకు దేవయ్య కాలము 1365–1445, అతని రెండవ కొడుకు బసవనకాలము 1410–1490, ఇతని పెద్దకొడుకు సోమన కాలము 1440–1520 కావచ్చును. అతడు శ్రీనాధుని పండితారాధ్య చరిత్రము అనుసరించి బసవ పురాణమును పద్యకావ్యముగ రచించుట అనుకూలమే.

పాలకుఱికి సోమనాథుడు కాలత్రయవేది అయిన, దేశము తురుష్కాక్రాంత మగు ననెడి కాలజ్ఞానమునకు కాలనిర్బంధము లేదు ఏ కాలమునందైనను కాలజ్ఞానము కాలత్రయ వేదికి నిరాఘాటమే అంతేకాదు. అది దేశము తురుష్కాక్రాంతము కాక పూర్వము పాలకుఱికి సోమనాథుని గ్రంధనము కాదు దేశము తురుష్కాక్రాంతమైన తదుపరి ఒహకాలమునకు పిడుపర్తి సోమన కధనము. విశ్వాసమునకు సంబంధించిన విషయము. చరిత్రకు సంబంధించిన అంశముకాదు

శివభక్తులు ఓరుగల్లులో స్వయం భూదేవాలయమునందు బసవపురాణమును చదువుచుండగా "హరునిఁ గొల్వ" రుద్రమదేవి "అచటికి వచ్చి" ప్రశ్నించుట వగైరా సంభవమే. ఆమె మహాశివభక్తురాలు. వచ్చినది రుద్రమదేవి అయినను వ్యవహారము రుద్రదేవుడే ప్రతాపరుద్రుడను భ్రమ ప్రాపణీయమే

ఏకామ్రనాథుని ప్రతాపరుద్ర చరిత్రమునందు పాలకుఱికి సోమనాథుడు ప్రతాపరుద్రుని కాలమున ఉన్నట్లు, ప్రతాపరుద్రుడు పాలకుఱికి సోమనాథునికి ఒక గ్రామమును అగ్రహారముగ ఇచ్చినట్లును కలదు [44] ఆ గ్రామము పేరుగొట్టిపరు అని కాకె సర్వప్ప సిద్దేశ్వర చరిత్రమునందు కలదు [45] కాని గొట్టిపరు దానశాసనమును కానరాదు అంతేకాదు ఈ రెండు గ్రంధములందును ప్రతాప రుద్రుని కాలమున మొల్ల ఉన్నట్లును కలదు కాని, శ్రీనాధుని స్తుతించిన, పోతనను అనుకరించిన మొల్ల ప్రతాపరుద్రుని కాలములోని కవయిత్రి కాదు. కాబట్టి పాలకుఱికి సోమనాధుడు ప్రతాపరుద్రుని కాలములోని కవియే కావలసిన ఆవశ్యకము లేదు సిద్దేశ్వర చరిత్రమునందు నరపతిరాయల, కొండవీట నున్నరాయల ప్రసక్తులు కలవు [46] కొండవీటనున్న రాయలు కృష్ణదేవరాయలే కాబట్టి సిద్ధేశ్వర చరిత్రము పదునారవ శతాబ్ది పూర్వార్ధము కంటె తర్వాతి గ్రంథము కావలయును. ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారములోని అముద్రిత గ్రంధమునందు కృష్ణదేవ మహారాయలు, అచ్యుతరాయలు విషయము మాత్రమేగాక, మల్లిఖాను, అతని

కుమారుడు సికందర్ ప్రభృతుల విషయము కలదు. అంతేకాదు. కాగితపు ప్రతి తుదిని "నారాయణ రావు గుమాస్తా యిలాకె కనల్ కాలన్ మక్కెంజీ సర్వేయర్ జనరల్ అనుమకొండ వోరుగంటిలో దరియాత్తి చేసి వ్రాశినది తారీఖు ౨౦ నవం బరు .. 2౯వ ధాతునామ సంవత్సరకార్తీక బ 30-" అను వాక్యమును కలదు. 47 అనగా ప్రతాపరుద్ర చరిత్రము కల్నల్ మెకంజీ కాలమునందు ఒక గుమాస్తా జనశ్రుతులను బట్టి వ్రాసిన గ్రంథమని అవగాహనమగును ఇట్టి గ్రంథములను బట్టి పాలకుఱికి సోమనాథుని కాలము నిర్ణయించుట ప్రామాణికము కాదు ప్రామాదికము.

పాలకుఱికి సోమనాథుని పండితారాధ్య చరిత్రమునందు తురుష్కదేశము (పు. 391 ప ప్ర) తురకతోడిరాగము (పు 455. ప. ప్ర.) ప్రసక్తమైనవి. కాఁబట్టి పాలకుఱికి సోమనాథుని కాలము ప్రతాపరుద్రుని కాలమే అనవచ్చును. కాని నన్నయ భారతమునందే, అర్జునుడు "పార్వతీయుల గర్వంబుడిపి బర్బర శబర తురుష్కపతుల వశగతులం జేసి" అని (235వచ. 1ఆ. స ప.) యుధిష్ఠిరునికి "మేరుమందర మధ్యకీచకవన వాసులయిన కుళిందబర్బర తురుష్క చేంకణకోంక ణాధిపతులును వశగతులై అని (11౯వచ 2ఆ.స.ప.) కలదు అందలి తురుష్కపతులు గాని తురుష్కాధిపతులు గాని పారాంతర గ్రస్తులు కాలేదు నిర్ధారక ప్రయోగములు. పదొకండవ శతాబ్దిని పరిచితులైన తురుష్కపతులవలె, పదమూడవ శతాబ్దిని తురుష్కదేశము, తురకతోడి రాగము కూడ పరిచితము కావచ్చును కాఁబట్టి పాలకుఱికి సోమనాథుని కాలము ప్రతాపరుద్రుని కాలమే కావలసిన ఆవశ్యకము లేదు.

పండితారాధ్య చరిత్రమునందు జలపోసనములు అను పదము కలదు అవి రెండు చోటులందు జంగమకోటులు ధరించినవి. (పు 310, 311, 436 ద్వి సం. ఒక చోట నటీనటులు ధరించినవి. (పు 436 ద్వి సం.) జలపోసనము అను పదము తద్భవము కాదు దేశ్యము కాదు. అన్యదేశ్యము "జర్‌పోష్" అను పారసీక పదము నుండి ప్రభవించినది జరీవస్త్రవిశేషమగును. ఈ శబ్దప్రయోగమును బట్టి పండితారాధ్యచరిత్ర పంద్రెండవ శతాబ్ది రచన కాదని, పదునాల్గవ శతాబ్ది రచన మని ఒక అభిప్రాయము కలదు 48 పండితారాధ్యచరిత్ర పంద్రెడవ శతాబ్ది రచన కాని మాట నిజమే. పదమూడవ శతాబ్ది రచన కావచ్చును. ఇట్టిదే మఱొక అన్యదేశ్యము చతుర్వేద సారమునందు కలదు.

"త్రాసునందున మఱి దేసి లేకయ యొక్క-
చందమై తూకంబు వొందినట్లు" 297 ప

ఇందలి త్రాసుశబ్దము కూడ తరజూ అను పారసీకపదము నుండి ప్రభవించినదియే. ఈ శబ్ద ప్రయోగము తిక్కన భారతమునందు కలదు. అది సూర్యరాయాంధ్ర నిఘంటువునందు ఉదాహరింపబడినది. అంతేకాదు. త్రాసు శబ్దమును బట్టి యేర్పడిన "త్రాసునాయము" అను పదబంధమునకు రుద్రమదేవి ఈపూరు శాసనములోని రెండు ప్రయోగములును సూర్యరాయాంధ్ర నిఘంటువునందే ఉదాహరింపబడినవి రెండు శాసనముల కాలము 1278 వ సంవత్సరము కాకతిగణపతి దేవచక్రవర్తి కాలమునందే ఓరుగల్లులో "స్వదేశిపరదేశి బేహారుల నానాదేశి" వస్తు వ్యాపారము విరివిగ జరిగినట్లు వరంగల్లు శాసనమునందు కలదు [49] నానాదేశి వస్తు వ్యాపారము వలన త్రాసులు, జలపోసనములు నాడేవ్యవహారమునకువచ్చును. త్రాసుమానము అను మిశ్ర పదబంధము 1278 వ సంవత్సరమునందు శాసన ప్రయుక్తమైనందున, తన్మూలమైన త్రాసుశబ్దము తత్పూర్వమే ఆంధ్రభాషలో ప్రవేశించును. ఓరుగల్లు ప్రాంతమునందే గాక, రాజమహేంద్రవర ప్రాంతమునందును పారసీకవ్యాపారము నన్నయ నాటికే కలదు సుభద్రకు కృష్ణడిచ్చిన అరణమునందు,

"బడబానాం చ శుద్ధానాం చంద్రాంశు సమవర్చసామ్
దదౌ జనార్దనః ప్రీత్యా సహస్రం హేమ భూషితమ్."

42 శ్లో. 213 అ ఆ ప.

అని సంస్కృత భారతమునందు కలదు. ఇందు వెన్నెల వలె తెల్లనైన వేయి ఆడు గుఱ్ఱములను ఇచ్చినట్లు కలదు. ఇది నన్నయ భారతమునందు ఇట్లు కలదు.

"... ... ... ... ... సింధు
బాహ్లిక కాంభోజ పారసీక
జాతమైన తురగ శతసహస్రము (నిచ్చె) 221ప. 8ఆ. ఆ ప.

ఇందు సింధుదేశమునందు, బాహ్లిక దేశమునందు, పారసీక దేశమునందు పుట్టిన గుఱ్ఱములని ఇదమిత్థముగ కలదు. నాటికి పారసీకవ్యాపారము లేనిచో నన్నయకు పారసీక జవనాశ్వముల పరిచయము కలదు. అరబ్బులు, పారసీకులు,

తురుష్కులు ఎనిమిదవ శతాబ్దికే దక్షిణ భారతదేశములోని పశ్చిమ తీరమున ప్రవేశించి ఆసేతుహిమాచలము వ్యాపారము సాగించుట చరిత్రప్రసిద్ధము. 80 అందువలన వ్యాపార సంబంధమైన అరబీ, పారసీక, తురుష్క శబ్దములు అప్పటి నుండి ఆంధ్రభాషలో ప్రవేశించుట నిరాఘాటము. యుద్ధ సంబంధమైన అన్యదేశ్యములు పదునాల్గవ శతాబ్దినుండి మాత్రమే ఆంధ్రభాషలో ప్రవేశించును మడిగట్టుకొన్న మహాభారతసంహితారచనబంధురుడు నన్నయభట్టు వ్యావహారిక భాషలోని వ్యాపార సంబంధమైన అన్యదేశ్యములను ప్రయోగింపక పోవుట సహజము అవి వైరి సమాసములను వలె పాలకురికి సోమనాథుడు ప్రయోగించుట అంతకంటె సహజము వ్యాపారసంబంధమైన అన్యదేశ్యములు వినా యుద్ధసంబంధమైన అన్యదేశ్యములు పాలకురికి సోమనాథుని కృతులందు మృగ్యము కాఁబట్టి పాలకురికి సోమనాథుని కాలము పదునాల్గవ శతాబ్ది కావలసిన అవశ్యకములేదు పదమూడవ శతాబ్ది కావచ్చును.

తిక్కన ఉత్తరరామాయణము అవతారికలోని పూర్వకవితా పరోక్ష విమర్శ యథావాక్కుల అన్నమయ్య సర్వేశ్వర శతకములోని పూర్వకవితాచర్వణము ఆంతరంగిక సాక్ష్యములుగ పాలకురికి సోమనాథుని తెలుగుకృతుల రచనాకాలము స్థూలముగ 1215–1240; కన్నడ, సంస్కృత కృతుల రచనాకాలము స్థూలముగ 1240–60 అగును.

## కృతులు

పాలకురికి సోమనాథుని కృతులు తెలుగు, కన్నడము, సంస్కృతము–మూడు భాషలందును కలవు 1. అనుభవసారము 2. బసవపురాణము, 3.వృషాధిప శతకము 4. బసవోదాహరణము 5 బసవరగడ 6 శ్రీబసవాఢ్యరగడ 7 గంగోత్పత్తి రగడ 8 సహస్రగణమాలిక 9 చెన్నమల్లు సీసములు 10 చతుర్వేదసారము 11 పండితారాధ్య చరిత్ర 12. పండితారాధ్యోదాహరణము తెలుగు కృతులు 1. అక్షరాంక పద్యములు 2 శరణుబసవరగడ 3 బసవలింగనామావళి 4 సద్గురు రగడ 5. చెన్నబసవరగడ 6 శివసహస్రగణనామ 7. శీల సంపాదన. కన్నడ కృతులు 1 పంచప్రకారగద్య 2. నమస్కారగద్య. 3 అక్షరాంక గద్య 4. బసవోదాహరణము 5. బసవ పంచరత్నములు 6. వృషభాష్టకము 7. బసవాష్టకము

8. త్రివిధలింగాష్టకము 9 అష్టోత్తర శతనామగద్యము 10 సోమనాథభాష్యము 11. రుద్రభాష్యము సంస్కృత కృతులు.

ఇవి గాక 1. సోమనాథస్తవము 2 బసవలింగశతకము పాలకురికి సోమనాధుని కృతులుగ ముద్రితమైనవి 3 మల్లమదేవి పురాణము పాలకురికి సోమనాధుని తెలుగు కృతిగ తెలుపుట కలదు 4 సోమేశ్వర శతకము పాలకురికి సోమనాధుని కన్నడ కృతిగ తలంచుట కలదు సోమనాథస్తవము 127 ద్విపదలు కల లఘుకృతి ఇందు కర్తృ నిర్దేశము లేదు "శ్రీ పాలకురికి సోమేశ" అను సంబోధనము, "పాలకుర్తి నిలయుఁడు" అను ప్రతిపాదనము కలవు అది పాలకురికి సోమనాధుని కృతి కావచ్చును అన్యకవి కృతి కూడ కావచ్చును. బసవలింగ శతకము 1914 వ సంవత్సరమునందు ముద్రింపఁబడినది.[51] అది చతుర్వేద సారము. మల్లమదేవిపురాణమును పాలకురికి సోమనాధుడు రచించినట్లు ఒకరు చెప్పుట, ఆ గ్రంథమును చూచినట్లు వేఱొకరు వ్రాయుట మాత్రము కలదు.[52] గ్రంథ సప్రిగానీ, గ్రంథము గాని కానరాదు కన్నడ సోమేశ్వర శతకము నందు పులిగిరికి చెందిన సోమనాధుడు రచించినట్లు కలదు.[53] మకుటము "హర హరా! శ్రీ చెన్న సోమేశ్వరా!" అని కలదు గాని, విషయము వీరశైవము కాదు. సామాన్యశైవమును కాదు సామాన్య నీతి మాత్రమే[54] అది పులిగిరి సోమనాధుని కృతియే అగును ఇవి పాలకురికి సోమనాధుని కృతులుగ నిర్ధరించి చెప్పుటకు నిదర్శనములు లేవు

## అనుభవసారము

ఇది పాలకురికి సోమనాధుని తొలి కృతి మల్లికార్జున పండితుని వీరశైవము నకు మాఱాకు వైచిన లఘుకృతి అంతేకాదు శివతత్త్వసారము వలె నిర్వచన గ్రంథము 243 పద్యములు కలవు కందపద్యములు 162, సీసపద్యములు 23, చంపకమాలలు 23, ఉత్పల మాలలు 16, మత్తేభములు 5, శార్దూలములు 5, తరువోజలు 2, తేటగీతి 1, మహాస్రగ్ధర 1, త్రిభంగి 1, క్రౌంచపదము 1, మాలిని 1, వనమయూరము 1 ఇందు కంద పద్యములు అత్యధికము. ఇది అనుభవ సారము మల్లికార్జునపండితుని శివతత్త్వసారమునకు సమీపకాలికమగుటకు సాధకము. ఇరువది మూడు సీస పద్యములందును ఎత్తుగీతములు ఆట వెలఁదులే కలవు ఒక్క సీస పద్యమునందును తేటగీతి లేదు. విడిగాను ఒక్క

తేటగీతియే కలదు నన్నయ సీసపద్యములందు ఆటవెలదులు అత్యధికము. తిక్కన సీసపద్యములందు తేటగీతులు అత్యధికము ఆటవెలదులే సీసపద్యము లందున్న అనుభవసారము తిక్కనకు తర్వాతి గ్రంధమగుట కంటె పూర్వ గ్రంధమగుటయే పొసగును. ఇది పాలకుఱికి సోమనాధుని కాలము 1190–1270 అగుటకు ప్రోద్బలకము. అనుభవసారము రచనాకాలము స్థూలముగ 1215 ప్రాంతము కావచ్చును

అనుభవసారము గోడగి త్రిపురారికి అంకితము "గోడగి త్రిపురారి మదీయ సత్కృతికి నొడయఁడ గాన్" అని కవి కంఠోక్తి. (25ప) అంతేకాదు "విభవో ద్భవమస్తలనీలకంఠ్రదయఁ గృతిపతికిన్" అని కూడ కవి కంఠోక్తి (242ప) అనేక పద్యములందు కృతిపతిసంబోధనములును కలవు అవి కృతిపతి ప్రధానశ్రోత అని కూడ ప్రకటించును గోడగి త్రిపురారి గోడగి నారయ్య అగ్రతనూజుడు. (21ప) గురులింగహస్తజాతుడు (24ప.) మున్నయదేవయోగీశుని కూరిమి శిష్యుడు. నిగమార్థవేత్త పాలకుఱికి సోమనాథుని గోష్ఠిమిత్రుడు. (81–86పం.బ.పు.) అనుభవసారము మిత్రాంకితమైన కృతి. శివతత్త్వసారము వలె ఆశ్వాసవిభాగము లేనిది. అంతేకాదు. పాలకుఱికి సోమనాథ్యుడు "మల్లికార్జునపండితయ్యగారిఁ దలఁతు "నను దినంబు" అని మల్లికార్జునపండితుని మూడు సీసపద్యములందు మూదలించి రచించిన కృతి అనుభవసారము పాలకుఱికి సోమనాథుడుస్మ్రపతిడి. ుసు మల్లికార్జున పండితుని తలంచుటకు హేతువులు– మల్లికార్జునపండితుడు శివుడే పరమదైవమని శివుని మహిమను తెలుపుట, లింగార్చనమును నమ్మి ఉభయలింగభక్తియుక్తిని తనరుట, శివధర్మములను శివధర్మశాస్త్రదృష్టిని శివప్రసాదమహిమను తెలుపుట, వేదప్రామాణ్యమును పురాణప్రామాణ్యమును నిరూపించుట మాత్రమే అదే పాలకుఱికి సోమనాథుని అనుభవసారములోని అంశము కూడ.

> "అనుభవసారం బనఁగా
> మనసిజహరు శుద్ధభక్తిమార్గము వేదో
> క్తనిరూఢిఁ బురాణరహ
> స్యనియు కిని విల్తిరింతు నదియెట్లనినన్" నెంప.

అని పాలకుఱికి సోమనాధుని స్పష్టప్రతిపాదనము. ఇది మల్లికార్జునపండితుని మార్గదర్శకత్వమునకు నిదర్శనము. అనుభవసారములోని శుద్ధశివభక్తిమార్గము మల్లికార్జునపండితుని శివతత్త్వసారమును అనుసరించునది. గురుభక్తిమహిమ, శివ

భక్తిమహిమ, లింగార్చనవిధి, భావక్రియార్చనవిధి, షట్స్థలస్వరూపము మొదలైన వీరశైవవిశేషములు కలది

అనుభవసారము శ్రీతో మొదలై శ్రీలతో ముగిసినది "శ్రీగురులింగ" అని ప్రారంభము "మంగళమహాశ్రీలు" అని ముగింపు అంతేకాదు. "కవితావిశేషంబు గారవించి నను గరుణించు శివుఁడు మంగళమహాశ్రీలు" అని కలదు అనుభవసారమునందు గారవించవలసిన కవితావిశేషము కలదు భాష సరళము. సలక్షణము. ఛందస్సు వైవిధ్యవిలసితము.కందపద్యములు మల్లికార్జునపండితుని కందపద్యములను, వృత్తములు నన్నయ వృత్తములను తలపించును. సీసపద్యములందు పాదాంతవిరతిని పాటించిన సందర్భములు బహుళము పాటించని సందర్భములు క్వాచిత్కముగ కలవు భావములు రసజీవములు. నన్నయ "అమితాఖ్యానక"పద్యమును అనుసరించిన పద్యము కలదు.

"గురుమూర్తి యను కల్పతరువొప్పుఁ దత్తరు
మూలంబు కరుణాంచితలదృష్టి
యాద్యశాఖోన్నతి యాజ్ఞామహత్త్వ మ
య్యుపశాఖ లాదితత్త్వోదితములు
పల్లవంబులు శ్రుతుల్ ప్రసవముల్ మంత్రముల్
ఫలము లింగంబు తత్పరిమళంబు
జంగమబోధల సారంబు నిత్యప్ర
సాదాదికనయనోత్సవము ముక్తి
యగుచు నాది కాది యగుచు నఖండితం
బగుచు సకలనిష్కళాంగమగుచు
నభిమతార్థదాయి యగుచు శిష్యావళిం
దన్నుఁ జేర్చుకొనును దాత యగుచు." 5 ఆప

ఇందు మూలము, పల్లవములు పరిమళము, నయనోత్సవము, అఖండితస్థితి ఇతోధికవిశేషములు. రూపకము సమగ్రసుందరము అంతేకాదు అది ధాత్రీసుర ప్రార్థ్యము. ఇది శిష్యావళిని తన్ను చేర్చుకొను అభిమతార్థదాయి. దాత. రెండును కల్పతరువులే.

శివభక్తుడు నవరసైకరసికుడని పాల్కురికి సోమనాధుడు ప్రతిపాదించిన పద్యము:

"లింగార్చనక్రియాసంగతి శృంగార
రసమును నద్భుతరసముఁ దోఁప
ననయంబు జంగమార్చన సేయుచో శాంత
రసము భయానకరసముఁ దోఁప
సంసారసంపదల్ చర్చించుచో హాస్య
రసమును బీభత్సరసముఁ దోఁప
దుష్టేంద్రి యంబులఁ దూలించుచో రౌద్ర
రసమును నతివీరరసముఁ దోఁప
నెల్ల జీవరాశియెడలను గారుణ్య
రసముఁ దోఁప భక్తిరమణఁ బరఁగు
నవరసైకరసికుఁ డవివెకదూరుండు
భక్తుఁ డొక్కరుండె ప్రస్తుతింప. 61ప

అనుభవసారమునందు అంతట తెనుగునుడికారము తేజరిల్లినను అరుదుగ సంస్కృతభూయిష్ఠరచనము కలదు.

"దానానేకమహాతపోనిచయసద్ధర్మౌఘతీర్థాఖిల
స్థానస్తోమజపవ్రతప్రణుతజ్ఞవ్రాతమంత్రోక్త ని
త్యానుష్ఠానవితానముల్ సలుపు పుణ్యం బంతయున్ గూడ నా
రాణ్నాథాంఘ్రులఁ బూన్చు పుష్పజసహస్రాంశంబునుం బోలునే? 158ప
చిత్రకవిత్వమును అనుభవసారమునందు చిగురించినది

## చతుర్విధకందము

ప్రథమకందము : "శ్రీరుద్రు నీలగళుఁ ద్రిపు
రారిం గొలువంగ భవభయాదులఁ దెలియున్
దా రుద్రుఁడైన త్రిపురవి
దారిం దలపంగఁ దలఁపు దానై కలియున్ 234.

ద్వితీయకందము : కొలువంగ భవభయాదులఁ
దెలియుం దా రుద్రుఁడైన త్రిపురవిదారిం
దలపంగఁ దలఁపు దానై
కలియున్ శ్రీరుద్రు నీలగళుఁ ద్రిపురారిన్, 235.

తృతీయకందము : తా రుద్రుఁడైన త్రిపురవి
దారిం దలపంగఁ దలఁపు దానై కలియన్
శ్రీరుద్రు నీలగళుఁ ద్రిపు
రారిం గొలువంగ భవభయాదులఁ దెలియన్. 236.

చతుర్థకందము : తలపంగఁ దలఁపు దానై
కలియన్ శ్రీరుద్రు నీలగళుఁ ద్రిపురారిం
గొలువంగ భవభయాదులఁ
దెలియన్ దా రుద్రుఁడైన త్రిపురవిదారిన్. 237ప.

ఇతరకవులకు : ఒరవడులైన పద్యములను ఇందు కలవు
"తనమదిఁ బుట్టిన కోపము
తనుఁ జెఱుపునె యెదిరివారిఁ దాఁ జెఱుపునె పు
ట్టినఁ యిల్లుండఁగ ననలము
మును చెఱుచునె యితరసదనములఁ ద్రిపురారీ!" 125ప.
"కలనాఁడె ధనము, ప్రాయము
గలనాఁడె జవంబు, బలము గలనాఁడె విని
శ్చల మతియు గతియుఁ దనకుం
గలనాఁడె భజింపవలయుఁ గరుణానిలయున్." 139ప.
"కన్నిడునే పరసతులకుఁ
దన్నిడునే భక్తుఁ డన్యదైవంబులకున్
వెన్నిడునే భవములకును
మున్నిడునే మనము విషయములకు మహాత్మా!" 118ప.

"విన్నంజాలుఁ దలంపు దీటుకొన సద్విద్యుక్తులన్ భక్తులం
గన్నంజాలు నమస్కరించుచు సమగ్రప్రీతిమైఁ బక్షయై
యున్నంజాలు మనంబులోఁ గలిసి యుంకొండేమి మీవాఁడనే
నన్నంజాలు గృతార్థుఁడై చను ఖలుండైనన్ సముద్యద్గుణా!" 218ప.

ఇట్లు అనుభవసారము "అసమగురులింగజంగమప్రసాదభక్తిస్థలములఁ బరిపూర్ణంబై యెసఁగు లసత్కావ్యము" (241ప.) లఘుకావ్యము,

## బసవ పురాణము

ఇది ద్విపదకావ్యము ఇందు బసవేశ్వరుని వృత్తాంతము ఆధికారికముగ, భక్తుల వృత్తాంతములు ఆనుషంగికముగ కలవు

తెలుగు దేశమునందు మల్లికార్జునపండితుని పలె, కన్నడ దేశమునందు బసవదండనాయకుడు వీరశైవమును విజృంభింపజేసిన మహోద్యమకారుడు. మల్లికార్జునపండితుడు, బసవదండనాయకుడు సమకాలికులు ఇంచుమించు సమ వయస్కులును కావచ్చును బసవదండనాయకుని ఆంధ్రులకు అక్షరముఖమున ప్రథమతః పరిచయము చేసినది మల్లికార్జునపండితుడే శివతత్త్వసారమునందు మూడు పద్యములు కలవు.

"అసమేక్షణః శివభక్తుం
దసమశ్రేష్ఠుడని పలికె యన్యులతోడన్
బొసపోరై బండారువు
బసవడు విసమెత్తి త్రావి బ్రతుకడె రుద్రా! 431.

వసుధ నుమేశుడె దైవము
ప్రసాదము పవిత్ర మీశు భక్తులె కులజుల్
పొసపోరని బండారువు
బసవన విసమెత్తి త్రావి బ్రదుకడె రుద్రా! 432.

కుసుమశరారిః శివః లిం
గసమేతులు దక్క బొందగాదని నిర్మా
ల్యసుఖంబని బండారువు
బసవన విసమెత్తి త్రావి బ్రతుకడె రుద్రా! 433 ప.

ఇందు బసవన - శివుడే దైవము శివభక్తుడే శ్రేష్ఠుడు, ప్రసాదము పవిత్రము, నిర్మాల్యసుఖము లింగసమేతులు మాత్రమే పొందగలరని ప్రబోధించినట్లు; మహిమను ప్రదర్శించుటకు విషము త్రాగి ఎగతజీవుడు కానట్లు కలదు.

బసవదండనాయకుని గురించి ఒక (కన్నడిగుని) అభిప్రాయమిది: 55

"బసవన్న విప్లవము ద్వివిధము. ఒకటి భావవిప్లవము. మఱొకటి మత విప్లవము. ఈ రెండింటికి నేపథ్యమును కల్పించిన ఘనత బసవయుగమునకు

పూర్వము ఆరాధ్యసంప్రదాయమును అనుసరించిన వారికి చెందును. ఆరాధ్య సంప్రదాయము ప్రధానముగా పండ్రెండుగురు గురువులను ప్రమాణీకరించును. వారు సిద్ధత్రయము, ఆచార్యత్రయము, ఆరాధ్యత్రయము, పండితత్రయము. రేవణసిద్ధుడు, మరులసిద్ధుడు, ఏకోరామసిద్ధుడు సిద్ధత్రయము. శ్వేతాచార్యుడు, లకులీశాచార్యుడు, నీలకంఠశివాచార్యుడు ఆచార్యత్రయము. ఉద్భటారాధ్యుడు, కోటిపల్లి ఆరాధ్యుడు, వేమనారాధ్యుడు ఆరాధ్యత్రయము. శ్రీపతిపండితుడు, మంచనపండితుడు, మల్లికార్జునపండితుడు పండితత్రయము వేదములు, ఆగమములు, ఉపనిషత్తులు ఆధారముగ వీరశైవతత్త్వమును సిద్ధాంతీకరించిన ఘనత వీరిది. ఆరాధ్య సంప్రదాయమునందే అత్యాశ్రమి అను పర్యాయపదము కలదు. వర్ణాశ్రమములను వర్జించినది కాదుగాని, తదతీతమైనది అత్యాశ్రమి గురూపదేశమున శివదీక్షాస్వీకారము చేసిన వాడు వీరశైవుడు. శివదీక్షాస్వీకారమునకు స్త్రీ పుంస భేదము లేదు...

"ముఖే మన్త్రో హృది ధ్యానమ్ మస్తకే విఙ్గధారణమ్
శిఖోపవీతభస్మని ఇతి బ్రహ్మో లక్షణమ్"

అను గౌతమస్మృతి శ్లోకమును వీరశైవులు తమ అభిప్రాయమును సమర్థించుకొనుటకు ఉట్టంకెంతురు ఇట శిఖోపవీతభస్మని అనుటకు బదులు శివారుద్ర భస్మని అని శ్రీకరభాష్యమునందు కలదు ఆరాధ్యసంప్రదాయమునందు గాయత్రీ మంత్రోపదేశ పూర్వకముగ యజ్ఞోపవీతధారణము తండ్రి చేయును లింగధారణము గురువు చేయును.

ఆరాధ్యులు ద్వివిధము 1. సహజారాధ్యులు 2. ఆగంతుకారాధ్యులు. సహజారాధ్యులు శైవగోత్రులు, లింగధారులును. ఆగంతుకారాధ్యులు శైవ, ఋషి గోత్రులు, లింగయజ్ఞోపవీతధారులును

శ్రీపతిపండితుడు మొదలైనవారు సహజారాధ్యులు బసవన్న ఆగంతుకవీర శైవుడు పాలకుఱికి సోమనాథుడు సహజారాధ్యుడు."

ఇందు పండితత్రయము మాత్రమేగాక, ఆరాధ్యత్రయములోని కోటిపల్లి ఆరాధ్యుడు, వెమనారాధ్యుడును ఆంధ్రులు. కోటిపల్లి ఆరాధ్యుడు మల్లికార్జున పండితుని దీక్షాగురువు. వేమనారాధ్యుడు పాలకుఱికి సోమనాథుడు మనుమశిష్యుడైన బెరిదేవ వెమనారాధ్యుడు

మల్లికార్జునపండితుడు, బసవదండనాయకుడు మతోద్యమకారులు మాత్రమే కారు కవులు మల్లికార్జునపండితుని మతోద్యమమునకు కందము బ్రహ్మాస్త్రము. బసవదండనాయకుని మతోద్యమమునకు వచనము వజ్రాయుధము.

మల్లికార్జునపండితుడు పరిచయము చేసిన బసవేశ్వరుని అధికరించి బసవపురాణము రచించుటకు పాలకుఱికి సోమనాథుడు, కరస్థలి సోమనాథయ్య ప్రభృతులను "అసదృశంబై యొప్పు బసవపురాణ మెసకంబుతోఁ జెప్ప నిష్టమయ్యెదును వరకథాసూత్రంబు వెర వెఱిఁగించి చరితార్థుఁ జేయరే" అని కోరినట్లు బసవపురాణమునందు కలదు. (95–98 పం. 1 ఆ) అంతేకాదు. "బసవపురాణంబుఁ బసరించు శక్తి నసలార నొసఁగితి మట్లుగావునను రచియింపు బసవపురాణంబు నీవు" అని కరస్థలి సోమనాథయ్య ప్రభృతులు అన్నట్లును కలదు. (103–105 పం 1 ఆ.) వారు ఒసగిన "శక్తి" ఏమోగాని, పాలకుఱికి సోమనాథుడు కన్నడ కృతులను రచించిన కవి కన్నడమునందు బసవేశ్వరునికి బాలసమకాలికుడగు హరిహరుని బసవరాజదేవరరగళె, అతని మేనల్లుడు రాఘవాంకుని సిద్ధరామచరిత్ర యందు బసవేశ్వరుని కథ కలవు [56] అవి సోమనాథునికి అందిన ఫలములే

హరిహరుని బసవరాజదేవరరగళెయందు బసవేశ్వరుని జన్మస్థలము, జననీ జనకుల గుఱించి ఇట్లు కలదు [57]

"అగ్రహారం బాగెవాడి యొళగె సదిర్ప
అగ్రేశ్వరం కమ్మెకులదిందె మెరదిర్ప
విప్రనిర్ప్పం మాదిరాజ నా సతియు
అప్రతిమ మాదాంబె యందెంబ గుణవతియు"

ఇది బసవపురాణమునందు ఇట్లు కలదు

"సడిసన్న హింగుళేశ్వరభాగవాటి
యను సగ్రహారంబునందు విఖ్యాతి
మనుచుండు మండెఁగ మాదిరా జనఁగ
నతని పరమసాధ్వి యతివ మాదాంబ–" 584–587 పం 1 ఆ.

ఇందు మాదిరాజునకు మండెగ అను ఇంటిపేరు కలదు బాగెవాడియే అయిన భాగవాటికి హింగుళేశ్వరస్థల నిర్దేశము కలదు హింగుళేశ్వరము ప్రసిద్ధ పుణ్య క్షేత్రము. అచటికి బాగెవాడి అనతి దూరమునందే కలదు.[58]

హరిహరుని బసవరాజదేవరరగళెయందు బసవేశ్వరుడు మంగళవాడలోని బిజ్జలుడ దండనాయకుడని కలదు.[59] బసవపురాణమునందు కల్యాణిలోని బిజ్జలుని దండనాయకుడని కలదు. బిజ్జలుడు మంగళవాడలో ఉన్నప్పుడు సామంతుడు. కల్యాణిలో ఉన్నప్పుడు చక్రవర్తి. అప్పుడే బసవేశ్వరుడు దండనాయకుడగుట చరిత్రకు సుసంగతమగును. కల్యాణి రాజధానిగ పరిపాలించిన కళచుర బిజ్జలుని మంత్రి బసవేశ్వరుడు. మంత్రిని దండనాయకుడనుట కన్నడ సంప్రదాయము.

హరిహరుని బసవరాజదేవరరగళెయందు బసవేశ్వరునికి ఉపనయనము జరిగినట్లు, పదునాఱవయేట బసవేశ్వరుడు జందెమును త్రెంచివైచినట్లు కలదు.[60] బసవపురాణమునందు ఉపనయనమును బసవేశ్వరుడు ఉల్లంఘించినట్లు కలదు. (851-1027 పం 1 ఆ.) బసవేశ్వరుని ఒక వచనమునందు ఇట్లు కలదు.[61]

"ఒడయలు రాగ గుడితోరణములు కట్టి
చుట్టములు రాగ ఏడువు వేదనుడో :
నీటికి తాటికి వెలియైన వేళ
సమయాచారమునకు లోనైన వేళ
వీరేదికి రారో- యనుడు"

ఇందు "తాటికి వెలియైన వేళ" అనగా యజ్ఞోపవీతమునకు దూరమైన వేళ అని అర్థము ఉపనయనమునకు దూరమైన వేళ అని తాత్పర్యము. సమయాచారమునకు లోనైన వేళ అనగా వీరమాహేశ్వరసమయాచారమును స్వీకరించిన వేళ అని అర్థము. దీక్షా స్వీకారము చేసిన వేళ అని తాత్పర్యము. ఇది బసవపురాణములోని బసవేశ్వరుని తండ్రితోడి వాదమునందలి,

"కర్మంబు త్రాళ్లు దాఁగట్టుకోఁ దగునె?" 870 పం.
"వీరమాహేశ్వరాచారదీక్షితుని
నిర్మితోభయ కర్మనిర్మూలు నన్నుఁ
గర్మాద్రి ముంచుట ధర్మమే నీకు?" 874-876 పం.
"కర్మమార్గంబగుఁగాక బ్రాహ్మ్యంబు
నిర్మల శివభక్తినిష్ఠితం బగునె?" 1011-1012 ప 1ఆ.

అను బసవేశ్వరుని ప్రశ్నలకు అనుగుణము.

ఇది పాలకుఱికి సోమనాథుని కన్నడ గ్రంథపరిచయమును, కన్నడదేశ పరిచయమును, కన్నడ రాజ్యపరిచయమును సూచించును. అంతేకాదు బసవ పురాణము పాలకుఱికి సోమనాథుని విషయమే కాదు, కన్న విషయము కూడ అని తెలియజేయును

హరిహరుని బసవరాజదేవరరగళె రచనాకాలము స్థూలముగ 1200 ప్రాంతము కావచ్చును పాలకుఱికి సోమనాథుని బసవపురాణము రచనాకాలము స్థూలముగ 1220 ప్రాంతమగును అగుననుటకు ఆంతరంగిక నిదర్శనములును కలవు.

బసవపురాణమునందు పిళ్లనయనారు కథ కలదు అందు పిళ్లనయనారు,

"భాతిగా ధారలు వరమతధూమ
కేతువు నాఁగఁ బ్రఖ్యాతమై మ్రోయ
నుదతరలీలఁ గులోత్తుంగచోడ
ధరణీశు శివభక్తిపరునిఁ గావించి" 293–96 పం 6ఆ.

అని కలదు పిళ్లనయనార్ తిరుజ్ఞానసంబంధర్ అఱువత్తుమున్నూవరులోని శివ భక్తుడు శంకరాచార్యులు పేర్కొన్న ద్రవిడ శిశువు అతడు శైవుని చేసినది పాండ్యరాజును [62] చోళరాజును కాదు అంతేకాదు కులోత్తుంగచోళుడు పిళ్లనయనారునకు అర్వాచీనుడు మొదటి కులోత్తుంగచోళుని రాజ్యకాలము 1070–1118 రెండవ కులోత్తుంగచోళుని రాజ్యకాలము 1135–50 మొదటి కులోత్తుంగచోళుని కుమారుడు వీరచోడుని విషయము శివతత్త్వసారమునందు కలదు వీరచోడుని విషయము తోపాటు అతని సోదరుడు వీరపెర్మాడిచోడుని విషయము పండితారాధ్యచరిత్రమునందు కలదు వీరిద్దఱును అఱువత్తుమున్నూవరులోని శివభక్తులు అందు శివభక్తుడు కాని కులోత్తుంగచోళుడు పాలకుఱికి సోమనాథునికి శ్రుతపూర్వుడగుట అది చాళుక్యచోళుల కాలమునకు సమీపమునందు సంభవము. ఆ కాలము 1070–1178 కాఁబట్టి బసవపురాణము రచనాకాలము స్థూలముగ 1220 ప్రాంతము కావలయును.

బసవపురాణమునందు ముగ్ధసంగయ్య కథ కలదు అందు ముగ్ధసంగయ్యను మఱపించుటకు నిదర్ధవేశ్య,

"తనదు విలాసినీజనుల రావించి
"యక్కమహాదేవి! యల్ల మద్దెలలు
నెక్కొల్పి వేగంబ సంఘించుకొనుము
స్వరమానమున బసవప్రమథవ్వ!
కరమర్థిఁబట్టుము కాహళ లోలి;
సకళవ్వ! నీవును సంగళవ్వయును
నొకరీతి నిలువుఁడు సుకరంబు గాఁగ,
బాలరుద్రమ! యొత్తు పట్టఁగ వాసె
గ్రోలు వాయింపుము! గుడ్డవ్వ! నీవు
సిట్టితాళము పట్టు శివదేవి! నీవు
సట్టిన నృత్యంబు సరసం బెఱింగి,
సంగుదాసమ! మహేశ్వరి! వీరభద్ర
లింగవ్వ! మీరు గేళికలు సేయుండు!
రమణదుకూలాంబరమును గంచుకము
సమరించుకొని చల్లడము బిగియించి
యేతెమ్ము నీవు పురాతమ్మ— "382-397 పం 3 ఆ.

అని లేని అట్టహాసము చేసినట్లు కలదు. ఇందు అక్కమహాదేవి బసవ ప్రమథవ్వ, సకళవ్వ, సంగళవ్వ, గుడ్డవ్వ, సంగుదాసమ, వీరభద్రలింగవ్వ శివభక్తురాంధ్ర వాస్తవ నామములు. శివదేవి, మహేశ్వరి, పురాతమ్మ కల్పితనామములు కావచ్చును వాస్తవ నామములును కావచ్చును బాలరుద్రమ వాస్తవనామము మాత్రమేగాక చారిత్రికనామము కాకతిగణపతిదేవచక్రవర్తి కూతురు రుద్రమదేవి కూడ శివభక్తురాలు. మఱొక రుద్రమ శివభక్తురాలు కనరాదు వినరాదు. రుద్రమదేవియే బాలరుద్రమ కావచ్చును అనగా బసవపురాణము రచనాకాలమున రుద్రమదేవి బాల అని అవగాహనమగును. గణపతిదేవచక్రవర్తి రాజ్యకాలము 1198–1262 అరువదియైదు సంవత్సరములు ఇరువది సంవత్సరముల వయస్సున పట్టాభిషిక్తుడై ఉండవలయును ముప్పది సంవత్సరముల వయస్సున రుద్రమదేవి జన్మించిన బాలరుద్రమదేవి కాలము స్థూలముగ 1208–1220 అగును. ఇది రుద్రమదేవి దౌహిత్రుడు ప్రతాపరుద్రుడు జన్మించినకాలమునకు [1254) రుద్రమ

దేవి పరిపాలించిన కాలమునకు[63] (1262–1289) అనుగుణము కాబట్టి బసవ పురాణము రచనాకాలము స్థూలముగ 1220 ప్రాంతము కావలయును.

బసవపురాణము గొబ్బూరివిభుడు సంగనామాత్యునికి అంకితము

"గురుపరతంత్రుఁడు గొబ్బూరివిభుఁడుఁ
బరమశివాచార్యపథవర్తనుండు
లింగైక్యనిష్ఠావిలీనమానసుఁడు
సంగనామాత్యుండు జగదుపకారి
యని యిట్లు భక్తసభాభ్యంతరాళ
మున నిన్నుఁ జెప్పంగ విని లసత్ప్రీతి
వసరింప జంగమభక్తుండ వనియు
బసవపురాణైకపాత్రుండ వనియు
నచలితప్రీతి మా కనుగులం బనియు
రచియింతు బసవపురాణసత్కృతిత" 133–142పం 1ఆ.

అని బసవపురాణమునందు కలదు గొబ్బూరిసంగనామాత్యుండు బసవపురాణైకపాత్రుడు అనగా గొబ్బూరిసంగన ఒక్కడే బసవపురాణకృతిని వినుటకు యోగ్యుడని అర్థము కాదు గొబ్బూరిసంగన ఒక్క డే బసవపురాణకృతిని గైకొనుటకు యోగ్యుడని అర్థము కారణము గొబ్బూరి సంగన బసవేశ్వరుని శిష్యుడు (127–128పం 1ఆ బ పు) బసవేశ్వరుని భక్తుడు (129–130పం 1ఆ.బ.పు.) బసవేశ్వరుని సన్నిహితసద్భావుడు (1258పం 1ఆ బ పు.) బసవపురాణములోని ఆశ్వాసాద్యంతద్విపదలు గొబ్బూరి సంగన సంబోధనములే

బసవేశ్వరుని (ఆ గురుదేవు) "పాదాబ్జసౌరభ్యభోగలీలావరపుష్పంధయుం" డయిన గొబ్బూరి సంగన ఒక్క డే కృతిస్వీకారమునకు యోగ్యుడైన బసవపురాణము రచనాకాలము 1220ప్రాంతమే కావలయును ఇది పాల్కురికి సోమనాథునికాలము 1190–1270 అను నిర్ణయమునకు స్థితిస్థాపకము

బసవపురాణము అను గ్రంథనామములోని పురాణము అష్టాదశపురాణము లను స్ఫురణకు తెచ్చును. అవి సర్గ, ప్రతిసర్గ, మన్వంతర, వంశ, వంశానుచరితము లనెడి పంచలక్షణములు కలవి. పంచలక్షణలక్షితము కానిచో బహుపురాతన విషయసంభరితమైనను కావలయును.బహుపురాతనవిషయసంభరితములు కాని, పంచ లక్షణలక్షితములు కాని పురాణములు జైనపురాణములు కలవు ఆదిపురాణము,

జినేంద్రపురాణము, నేమిపురాణము మొదలైనవి అవి జైనతీర్థంకరుల వృత్తాంతములు. కొంత పురాతనవిషయ పురస్కృతములు కావున పురాణములు. అంత పురాతనవిషయపురస్కృతము కాకపోయినను శైవమతమహోద్యమకర్త అగుటవలన బసవేశ్వరుని వృత్తాంతము బసవపురాణము.

బసవపురాణమునందు బసవేశ్వరుని వృత్తాంతము ఆధికారికవృత్తాంతము భక్తులవృత్తాంతములు అనుషంగికవృత్తాంతములు ఆధికారికవృత్తాంతముకంటె అనుషంగికవృత్తాంతములు ఎక్కువ. బసవేశ్వరుని జన్మవృత్తాంతము, వీరమాహేశ్వరాచారదీక్షాస్వీకారము, వివాహము, బిజ్జలుని కొలువున మంత్రిపదవీనిర్వహణము, జంగమారాధనము, వీరశైవమతవ్యాపనము, మహిమల ప్రదర్శనము, శివద్రోహియైన బిజ్జలుని హత్య, బసవేశ్వరుని కల్యాణకటకనాశనశాపము, సంగమేశ్వరైక్యము ప్రధానవిషయము. సుమారు తొంబదిమంది భక్తుల వృత్తాంతములు ఔపచారికవిషయము. అందు అఱువత్తమువ్వురులోని భక్తులు, శివతత్త్వసారములోని భక్తులు, అన్యభక్తులును కలరు. పూర్వభక్తుల తోపాటు బసవేశ్వరుని సమకాలికభక్తులును కలరు అందఱును మహిమాన్వితులే. శివతత్త్వసారములోని, అనుభవసారములోని భక్తిలక్షణములకు, బసవపురాణములోని భక్తులవృత్తాంతములు లక్ష్యప్రాయముగ కలవు.

బసవేశ్వరుని తత్త్వము బ్రాహ్మణమతము సమ్మతము కాని వీరశైవము. అది బసవపురాణమునందు తండ్రి వడుగు చేయదలచినపుడు బసవేశ్వరుడు చేసిన వాదమునందు స్పష్టముగ కలదు

"నిర్మలగురుకృపాన్వితజన్మనకుఁ
గర్మజన్మంబు దుష్కర్మంబు గాదె?
యస్గురుపాదంబు లర్పించు నతని
కగ్గిలో హవి వెల్చుటది దప్పు గాదె?
మలహరాత్మకమగు మంత్రంబుఁ గఱచి
పలుమంత్రంబులు గొనఁ బాపంబు గాదె? 861-866పం.

"ఆదికి నాది నిత్యానందమూర్తి
శ్రీదివ్యలింగమూర్తియ సుదైవంబు
నట్టి యీశ్వరు నాత్మఁ బట్టించి చేతఁ
బెట్టంగఁ జాలిన పృదుదయామూర్తి

ప్రకటింప "నగురోరధిక" మనఁబరగు
సకలస్వరూపమానమయసద్గుఁడు
మంత్రంబులకు రాజమంత్రమై వెలయు
మంత్రంబు దానికి మఱి షడక్షరియు
భవదూరమగు జటాభసితరుద్రాక్ష
సవిశేషమోక్షానుసారివేషంబు
భువిజన్మపాపౌఘభూజకుఠార
మవిరళసత్క్రియాష్టాంగసద్భక్త
సందర్శనంబుల సకలపాపములు
డిందు మోక్షాంగన పొందుఁ గావునను
నిది ఫలప్రాప్తి యింకిట మీఁద లింగ
పదసేవనోత్కృష్టభవ్యసౌఖ్యంబు
ఫలమిట్టిదని చెప్ప భావింప శ్రుతుల
తలమె జీవన్ముక్తి తత్త్వాత్మకంబు" 953—970పం.

"ధర నన్యదేవతాస్మరణమాత్రమున
నిరువదెన్మిది గోట్ల నరకంబు రొందు" 981—982పం.

"సహజలింగైక్యనిష్ఠాయుక్తి భక్తి
బహుదేవతా సేవ బ్రాహ్మణపథము;
కులసతి యట్లు నిశ్చయుక్తి భక్తి
వెలయాలి యట్టు లన్యప్రహర్గంబు" 993—996పం

ఇదే తత్త్వము బసవేశ్వరుని వచనములందును కలదు.[64]

"శివభక్తి నేగతి నుపమింతునయ్యా
శివాచార మేగతి నాకు వేద్యమగునయ్యా" 47వచ

"గురుపదమే మూలము శివపథము తెలియ" 70వచ

"విభూతియే అందము సంగని శరణుల నొసలికి" 74వచ.

"ఓం నమశ్శివాయ అన్నదే మంత్రము" 77వచ.

"గేయము పాడిన నేమి? శాస్త్రపురాణములు విన్ననేమి?
వేదవేదాంతములు చదివిన ఫలమేమి?

మనసార లింగజంగముల పూజింపతెలియని వారు
అన్నిట ననుభవులైన నేమి? భక్తిలేని
వారినొల్లడు కూడల సంగమదేవుడు"                                   19వచ.

కర్మ, జ్ఞానములకంటె భక్తియే ముఖ్యము అది మూఢభక్తి అయినను సరే. భక్తుల వృత్తాంతములు బహువిధము. అందు ముగ్ధసంగయ్య, బెజ్జమహాదేవి, గొడగూచి మొదలైన భక్తుల వృత్తాంతములు మూఢభక్తికి మూలకందములు ముగ్ధ సంగయ్య సాని మేని హరిద్రాలేపము విభూతిగ, మెడలోని ముత్యాలహారము రుద్రాక్షమాలగ, వెన్నున వ్రేలాడు సన్నజడలు జటాజూటముగ, కట్టిన సమకట్టు సర్వాంగకచ్ఛడముగ, పర్యంకము సింహాసనముగ విశ్వసించి శివలింగార్చనము సేయును బెజ్జమహాదేవి శివుని తల జడలు కట్టుటకు, శివుడు తోళ్ళు కట్టుకొనుటకు, బూడిద పూసికొనుటకు, వల్లకాటిలో వసియించుటకు తల్లి లేక పోవుటయే కారణముగ తలంచి, తానే తల్లియై, లింగమూర్తిని అభ్యంగనము సేయించి, పాలిచ్చి, వెన్న పెట్టి, ఉగ్గు పట్టించి, బుజ్జగించి, ముద్దాడి, నవ్వించి, ఆడించి పెంచుటయే గాక, ఒకసారి పాలు త్రాగనపుడు పలవరించి, తల్లడమంది, కడు శోక జలధిని తేలి ప్రాణము విడుచుటకు సిద్ధపడును గొడగూచి తల్లిదండ్రులు పొరుగూరికి పోవుచు, నిత్యము శివునికి కుంచెడు పాలు ఆరగించబెట్టుమనిన, శివాలయమునకు కొనిపోయి శివుని ఆరగించుమని అనేక విధముల వాపోయి, ఏడ్చి, ఎలుగెత్తి పిలిచి ప్రయోజనము లేక చనిపోవుటకు తలను శివలింగమునకు తాకెంచును బెజ్జ మహాదేవికి, గొడగూచికి శివుడు ప్రత్యక్షమై మోక్షము నిచ్చును నవవిధభక్తులలో ఒకటి కాకపోయినను మూఢభక్తి కూడ మోక్షదాయకమని వీరశైవ మత విశ్వాసము

"అల్పాక్షరముల నవల్పార్థ రచన
కల్పించుటయె కాదె కవి వివేకంబు"          173–174పం.1ఆ.

అని బసవపురాణమునందు పాలకుఱికి సోమనాధుని కవితా నిర్వచనము. ఇది అలంకార శాస్త్రములందు కనిపించని కవితాలక్షణము. వ్యాస వాల్మీకి భాస కాళిదాసుల కావ్యములందు కనిపించు కవితాలక్షణము. ఆంగ్లకవితాలక్షణమైన సంక్షిప్తతకు (బ్రివిటీ) సంపాదించు కవితా లక్షణము అయినను పాలకుఱికి సోమనాధుడు అసిధారావ్రతముగ పాటించిన లక్షణము కాదు. సూత్రప్రాయమైన

రచనము తోపాటు స్తోత్రపారాయణ సదృశమైన రచనమును కలదు. కారణము కవితావేశమును సమాధిబద్ధము కావింపని మతావేశము. భక్త్యావేశము.

"బసవని శరణన్నఁ బాపక్షయంబు
బసవని శరణన్నఁ బరమపావనము
బసవని శరణన్నఁ బ్రత్యక్ష సుఖము
బసవని శరణన్న భవరోగహరము
బసవని శరణన్న భక్తి సేకూరు
బసవని శరణన్న బంధము ల్వాయు
బసవని శరణన్న భాగ్యము ల్వొందు
బసవని శరణన్నఁ బరఁగు శీలంబు
బసవని శరణన్నఁ బాయు నాపదలు
బసవని శరణన్నఁ బ్రబలు సంపదలు
బసవని శరణన్న సనలారుఁ గీర్తి
బసవని శరణన్న ఫలియించుఁ గోర్కి
బసవని శరణన్న నెసఁగు వాక్సిద్ధి
బసవని శరణన్న భ్రాజిల్లు బుద్ధి" 189–202పం. 1ఆ.

ఇది వీరావేశమునకు మచ్చుతునక. బసవేశ్వరు డనిన సోమనాథుడు ఒడలు మఱచి పోవును "నల్లవో! బసవన్న, నందీశమూర్తి! నల్లవో! బసవయ్య! ముల్లోక వంద్య!" అని శివమెత్తి పోవును. అల్పాక్షరములు అనల్పాక్షరము లగును అనల్పార్థము అత్యుక్తి అగును

"బసవని భక్తి ప్రభాపటలంబు
దెసల వసుంధర దివి దీటుకొనఁగ
దినకరుఁ డాత్మీయ తేజంబు దఱుఁగు
డును మది లజ్జించి చని యపరాద్రిఁ
బడియెనో యన్నట్లు భానుండు గ్రుంకె" 181–185పం. 3ఆ.

సూర్యుడు అపరాంబుధిలోఁ గ్రుంకుటకు బసవని భక్తి ప్రభాపటలము దశదిశా వ్యాప్తమగుట అను హేతుకల్పనమునందు అత్యుక్తి కలదు. అంతేకాదు,

"మలసంహరుఁడు జటామకుటంబు మీఁద
నిలిపియు నా కందు నెఱేఁబుచ్చలేఁడు
భక్తుల పాదసంస్పర్శనంబునను
వ్యక్తిగా నిర్మలత్వంబుఁ బొందుదును'
అని యాత్మఁ దలపోసి యరుదెంచు మాడ్కి"

367-371పం. ౧ఆ.

చంద్రుడు ఉదయించెననట, "బసవని సితకీర్తి పర్వెనా" వెన్నెల వెల్లిదిరిసె ననుట కూడ (372పం) అంతే అయినను ప్రకృతి వర్ణనములు గ్రంథమునకు తగినట్లు కలవు.

సహజత్వ ముట్టిపడునట్లు వర్ణించుట పాలకుఱికి సోమనాథుని ప్రత్యేకత

"తొంగిళ్ళపై నిడి లింగమూర్తికిని
సంగన గావించు సభ్యంజనంబు
పుక్కొత్తుఁ జెక్కొత్తుఁ ముక్కన్నుఁ బులుము
నక్కొత్తుఁ గడుపొత్తు నట వీఁపు నివురుఁ
బెరుగంగ వలె నని తరుణి వీఁద్వడఁగఁ
జరణము ల్కరములుఁ జాగంగఁ దిగుచు
నలుఁగులు నలుచు నర్మిలి గట్టిపెట్టి
జలములు వీఁపునఁ జఱచు నంతంత
వెగచి బెగడకుండ వెన్న వ్రేయుచును
నొగి మస్తకమున నీరొత్తు దోయిటను
వదనంబు సొచ్చునో యుదకంబు లనుచు
నదుముఁ బొట్టను నోరి కడ్డంబు వట్టుఁ
జెన్నుగాఁ బసుపార్చి చేయు మజ్జనము
గన్నులుఁ జెవులును గాడంగ నూఁదు
సంగిటి ముల్లొత్తు నందంద వ్రేల
దొంగిళ్ళఁ గార్నీరు దోనెత్తి మిడుచు-"

661-676పం. ౨ఆ.

ఇది తెలుగు దేశము నాలుగు చెఱగుల ఇప్పటికిని బహుశః ఎప్పటికిని ఇంటి పట్టున చంటి పిల్లలకు నీళ్ళుపోయు విధానము. చలనచిత్రము వలె అక్షర బద్ధము.

ప్రసిద్ధమైన "మందారమకరంద మాధుర్యమునఁ దేలు మధుపంబు వోవునే మదనములకు" అను పద్యమునకు మార్గదర్శకమైన రచన బసవపురాణము నందు కలదు.

"క్షీరాబ్ధిలోపలఁ గ్రీడించు హంస
గోరునే పడియల నీరు ద్రావంగఁ ?
జాతఫలంబులు సుంబించు చిలుక
భ్రాంతి బూరుగుమ్రాని పండ్లు గన్గొనునె ?
రాకామల జ్యోత్స్నఁ ద్రావు చకోర
మాకాంక్ష సేయునే చీఁకటిఁ ద్రావ
విరిదమ్మి వాసన విహరించు తేఁటి
పరిగొని సుడియునే బబ్బిలి విరుల?" 35-44పం 3ఆ.

ఇది సుప్రసిద్ధమైన పోతన "మందార మకరందమాధుర్యమునఁదేలు" అను పద్యమునకు ఆద్యప్రకృతి.

తెనుగుదనము తేజరిల్లినను, ఉత్తమ కవిత ఉట్టిపడినను, బసవపురాణము నందు బ్రాహ్మణనింద, వైష్ణవనింద, బౌద్ధనింద, జైననింద, చార్వాకనింద అతి వేలముగ కలదు.

"కాన విప్రులు భక్తగణముల యిండ్ల
శ్వానంబులకు నెట్లు సరి యనవచ్చు" 263-4పం.7ఆ.

"కాన విప్రులు భక్తగుణముల చెప్పు
తోనైన నెనగారు పాన లేమిటికి" 279-80పం. 7ఆ.

"బ్రహ్మమయాకార పశుపాశపతికి
బ్రహ్మేంద్రహరిముఖ్యపశువులు సరియె" 1671-72పం.6ఆ.

"శుద్ధప్రసిద్ధానిరుద్ధదేహుస క
సిద్ధబౌద్ధాశుద్ధజీవులు సరియె" 1669-70 పం. 6ఆ.

"...... ...... .. ... వీరి రాక
యధమ జైనుల పెంపు లడఁపనె కాదె" 613-4 పం. 6ఆ.

"సిద్ధంబు వేదవిరుద్ధంబు జైన
బౌద్ధచార్వాక దుష్పథసమయములు" 521-2 పం. 6ఆ.

"భవికిటకంబుతో శివభక్తి పరుని
భువి సరి సేయుట యవినీతి-" 1437-9పం. 6ఆ.

ఇట్టి బసవపురాణము శైవేతరులకు శిరోభారము కలిగించును. శైవులకు శిరోధార్యమగును. ఇందలి చిఱుతొండనంబి కథ, ఉడుమూరి కన్నప్ప కథ, ఉద్భటుని కథ మొదలైనవి శ్రీనాథ, ధూర్జటి, తెనాలిరామలింగప్రభృతులకు మూడి పదార్థము లైనవి బసవపురాణము మొత్తము పద్యగద్యప్రబంధమైనది.

## వృషాధిపశతకము

ఇది శతకము ఉపలబ్ధశతకములందు మొట్టమొదటిది. అంతేకాదు. శతక లక్షణములు మూడును ఖచితముగ కలది 1 సంఖ్యానియమము శతపద్యములు కలది శతకము శతమన వంద వంద దాటి కూడ పద్యము లుండవచ్చును. రెండు వందలు కారాదు అయిన శతకము కాదు ద్విశతి అగును. వృషాధిపశతకమునందు సరిగా నూటయెనిమిది పద్యములు కలవు అష్టోత్తరశత సంప్రదాయమునకు అనుగుణము శతకాంతపద్యమొకడు కలదు ఆది శతకపద్యము కాదు గ్రంథవిషయక పద్యము నూటయెనిమిది పద్యములు శతక సంఖ్యానియమునకు సరిపడును. 2. మకుటనియమము పద్యాంతసంబోధనము మకుటము అది శతకమునందు అన్ని పద్యములకు సమానము వృషాధిపశతకమునందు నూట యెనిమిది పద్యాంత సంబోధనములును ఒకటే మార్పులేదు "బసవా! బసవా! బసవా! వృషాధిపా!" అను మకుటము నియతముగ కలదు ఆది మకుటనియమము 3. కవి ఆత్మనివేదనము ఇది భక్తిశతకములందు ప్రధానము వృషాధిపశతకము భక్తిశతకమే. ప్రతిపద్యము పాలకుఱికి సోమనాథుని ఆత్మనివేదనమే భక్తినివేదనము కాబట్టి లక్షణత్రయలక్షితమైనది వృషాధిపశతకము

శతకానంతరపద్యమునందు శతకము పాలకుఱికి సోమనాథుని కృతమనియే గాక, బసవేశ్వరునికి అంకితమని కూడ కలదు.

"అకుటిల లింగజంగమసమగ్రదయా కలితప్రసాది పా
లకుఱికి సోమనాథుం డతిలౌల్యమునన్ బసవన్న దండనా
యకునకు నొప్ప నీ శతక మర్పణ చేసె ధరన్ బఠించువా
రికి వినువారికిన్ గలుగు శ్రీయును నాయువు భుక్తి ముక్తియున్"

శతక మర్పణ చేసెననగా శతక మంకిత మిచ్చెనని అర్థము శతకములను అంకితమిచ్చిన సందర్భములు అరుదు. ఉపలబ్ధశతకములందు మొట్టమొదటి శతకము అంకితమగుట, అర్పణచేసెననుట విశేషము.

"బసవఁడు ప్రీతిఁ గైకొనియె భక్తిమెయిన్ రచియింప నాఁడు మున్
బసవపురాణమంచు సపుఁ బ్రస్తుతి సేయుదు రట్లు గాన నీ
యసమదయాధురీణతకు నంకిలిపాటు ఘటిల్లకుండ నన్
వసిఁ గొని బ్రోవుమయ్య బసవా! బసవా! బసవా! వృషాధిపా!" 106 ప.

అని వృషాధిపశతకమునందు కలదు. "బసవఁడు ప్రీతిఁగైకొనియె...... బసవపురాణము" అనగా బసవపురాణము బసవేశ్వరునికి అంకితమని అర్థము వచ్చును అట్లు బసవపురాణమునందు లేదు అంతేకాదు అంకితము "ప్రీతిఁగైకొను టకు బసవపురాణరచనాకాలమునందు బసవేశ్వరుడు లేడు "బసవపాదాంభోజ పరిమళభృంగ"మైన (1253 ప 1 ఆ.)

గొబ్బూరి సంగనకు అంకితమైన బసవపురాణమును, బసవేశ్వరుడు "ప్రీతిఁగై కొనెను." అనగా సంగమేశ్వరైక్యము చెందిన బసవేశ్వరుని ఆత్మ సమ్మతించెనని అర్థము చెప్పుకొనవలయును

బసవపురాణము ప్రవక్తమైన వృషాధిపశతకము, బసవపురాణము తర్వాతి కృతి అగుట తథ్యము

వృషాధిపశతకములోని ముప్పదిమూడు పద్యములందు (1–33) మూడు పాదములకు సమానమైన అంత్యానుప్రాసము కలదు. అయిదు పద్యములందు (39–43) పాదపాదమునకు విభిన్నమైన అంత్యానుప్రాసము కలదు

"కామితభక్తిధామ గతకామ మహాగణ సార్వభౌమ ని
స్సీమయశోభిరామ సవిశేషవిముక్తిలలామ సద్గుణ
స్తోమ శివైక్యధామ సుఖదుఃఖవిరామ ప్రమోదసీమ దే
వా మముఁ గావుమయ్య బసవా! బసవా! బసవా! వృషాధిపా! 18 ప

"హరసమసౌఖ్య యాదివృషభాఖ్య పురాతనముఖ్య తత్త్వవి
త్పరిషదుపాస్య వీతగుణదాస్య త్రిలోకనమస్య తార్కికో
త్కరజయశౌండ దీర్ఘభుజదండ మహాగుణమండ మన్మనో
వరద శరణ్యమయ్య బసవా. బసవా! బసవా! వృషాధిపా! 40ప.

ఇది అనంతరకవుల అంత్యానుప్రాసపద్యరచనమునకు ఆద్యప్రకృతి. నన్నయ భారతమునందు అంత్యానుప్రాసపద్యములు లేవు. అత్యంతవిరళముగ ఆమ్రేడితప్రాయమైన అంత్యానుప్రాసపంక్తులు కలవు. "మునిపూజితు భూరియశో విరాజితున్"(22ప 1ఆ ఆ ప)"-కోమలకుంతల సోకకుంతల" (25ప. 4 ఆ ఆ.ప)" "హితభాషణు భూసురవంశభూషణున్" (157ప 7. ఆ. ఆ. ప) వంటివి మాత్రమే అట్టిది పద్యమెల్ల అంత్యానుప్రాసము పర్యాప్తమగుట కాలక్రమ సంక్రాంతము. అందుకు పాలకుఱికె సోమనాథుడు ఆద్యుడు.

వృషాధిపశతకమునందు పెక్కు భాషలును కలవు. సంస్కృతము (50-55) తమిళము (56) కన్నడము (57) ఆరెభాష (58) మణిప్రవాళము (59-61,63, 64) మణిప్రవాళభాషయందు మఱల వైవిధ్యము కలదు సంస్కృతాంధ్రసమ్మిశ్రణము (59) తమిళాంధ్రసంస్కృతసమ్మిశ్రణము (60) కర్ణాటాంధ్రసంస్కృత సమ్మిశ్రణము (61) సంస్కృతకర్ణాటసమ్మిశ్రణము(64ప) సంస్కృతకర్ణాటాంధ్ర తమిళమహారాష్ట్రసమ్మిశ్రణము (65) జానుతెనుగు (62)

"తిరుమడి నా మనంబునను దే హృదయేశ్వర కెం విధీయతాం
పరతరత్వం బురాణ నను పాహివిభో అమవాపితా అహా
వరద నెఫల్లె యంచు నినుఁ బ్రస్తుతి సేయుదుఁ బెక్కుభాషలన్
వరద వివేకశీల బసవా! బసవా! బసవా! వృషాధిపా!" 63ప

ఇది బహుభాషాకవిత్వము. పాలకుఱికె సోమనాథుని బహుభాషాపరిజ్ఞానము నకు నిదర్శనము

బసవేశ్వరుని భక్తరక్షణమును భక్తపరిచయమును స్మరించి వేడుకొనుట ముప్పదియాఱు పద్యములందు కలదు. (67-102) బసవపురాణములోని భక్తుల వృత్తాంతములు మఱల ఆవృత్తములైనవి అవి గాక మల్లికార్జునపండితుని ప్రస్తుతియును కలదు.

"దండితవాదియై శివుఁడె దైవముగాకని కన్నులిచ్చి తా
నిండుమనంబుతో నిలువు నిద్దపుఁగన్నులు దాల్చి పాల్చు మా
పండిత మల్లికార్జునుఁడు ప్రస్తుతిసేయఁగ నేర్చు నిన్ను నె
వ్వండు నుతింప నేర్చు బసవా! బసవా! బసవా! వృషాధిపా!" 101ప.

మల్లికార్జునపండితుడు "నిలువునిద్దపుఁగన్నులు దాల్చి పోల్చు"ట ఒక శాసనము

నందును కలదు అది పూర్వోదాహృతము అంతేకాదు పాలకుఱికె సోమనాదుని పండితారాధ్యచరిత్రములోని ఊర్ధ్వనేత్రలాభకథనమిదియే (పు 96–100 మ ప్ర)

శతకాని అంత్యానుప్రాసము వలె శతకాంతమున ముక్తపదగ్రస్తపద్యములు రెండు కలవు. ముక్తపదగ్రస్తాలంకారమునకు ముచ్చటపడినవారిలోను పాలకుఱికె సోమనాథుడు మొదటివాడు

"సురవరపూజ్య! పూజ్యగుణశోభిత! శోభితరూప! రూపవి
స్ఫురతరశీల! శీలమణిపుంగవ! పుంగవ! సత్త్వ! సత్త్వసం
హరపరవాద! వాదభయవర్జితపాపవిచార! చార! యీ
శ్వరసమ! నీవె దిక్కు బసవా! బసవా! బసవా! వృషాధిపా!" 108ప.

బసవేశ్వరుని "నోరికి వచ్చినట్లు (నిను) నూరు విధంబులఁ బ్రస్తుతింతు"నని పాలకుఱికె సోమనాథుని ప్రతిజ్ఞ బహువిధములకు నెలవు వృషాధిపశతకము. అంతే కాదు వృషాధిపశతకము ప్రాధాన్యావిషను సంస్కృతభూయిష్ఠరచన

## బసవోదాహరణము

ఇది ఉదాహరణము ఒక అపూర్వమైన ప్రక్రియ అతిప్రాచీనకాలమునుండి ఉదాహరణప్రక్రియ కలదని ఒక అభిప్రాయము కలదు [65] కారణము కాళిదాసు ప్రయోగములు

1 "శరై రుత్సవసంకేతాన్ స కృత్వా విరతోత్సవాన్
జయోదాహరణం బాహ్వో ర్గాపయామాస కిన్నరాన్" 78శ్లో 4స.

అని రఘువంశమునందు కలదు 'బాహ్వోః స్వభుజయోః జయోదాహరణం జయఖ్యాపకం క్షుద్రప్రబంధవిశేషం" అని మల్లినాథసూరి వ్యాఖ్యానమునందు కలదు రఘుమహారాజు తన బాహువుల జయోదాహరణమను క్షుద్రప్రబంధవిశేషమును పాడించెనని అర్థము వచ్చును అస్పష్టము క్లిష్టము

2 "తుల్యానురాగపిశునం లలితార్థబద్ధం
పత్రే నివేశిత ముదాహరణం ప్రియాయాః–" 88శ్లో.2అం.

అని విక్రమోర్వశీయమునందు కలదు 'పత్రే భూర్జపత్రే నివేశితం విన్యస్తం ప్రియాయాః ఊర్వశ్యా ఉదాహరణం వృత్తాన్తః' అని మృత్యుంజయనిశ్శంకభూపాలుని వ్యాఖ్యానమునందు కలదు భూర్జపత్రమునందు ప్రియురాలి వృత్తాంతము లిఖితమైనదని అర్థము సుస్పష్టము అక్లిష్టము అంతేకాదు ఆ సందర్భమునందు

ఊర్వశి ఘూర్జపత్రము మీద కొనగోట లిఖించినది, లిఖింపఁగలిగినది తన సంగతియే గాని ఉదాహరణప్రబంధవిశేషము కాదు. ఉదాహరణశబ్దమునకు వృత్తాంతమను అర్థము నిఘంటుసంఘటితము రఘుమహారాజు బాహువుల జయోదాహరణము కూడ జయవృత్తాంతమే. జయనామకక్షుద్రప్రబంధవిశేషము కాదు కాళిదాసు ఉదాహరణ శబ్దప్రయోగములు రెండింటికి ప్రబంధవిశేషమను అర్థము ప్రకరణోచితము కాదు. వృత్తాంతమను అర్థమే ప్రకరణోచితము. కాఁబట్టి కాళిదాసు ప్రయోగములనుబట్టి ఉదాహరణప్రక్రియ అతిప్రాచీనకాలమునుండి కలదనుట అవిచారమూలకము.

ఉదాహరణకావ్యము పాలకుఱికి సోమనాథునికి పూర్వము సంస్కృతము నందు లేదు. పాలకుఱికి సోమనాథుని సంస్కృతబసవోదాహరణమే సంస్కృత ప్రథమోదాహరణము. అంతేకాదు ప్రతాపరుద్రీయముకంటెప్రాచీనమైన సంస్కృతాలంకారశాస్త్రగ్రంథములందు ఉదాహరణకావ్యలక్షణము లేదు. ఆంధ్రుడైన విద్యానాథుని అలంకార శాస్త్రమునందే ప్రథమతః ఉదాహరణకావ్యలక్షణము కలదు. పాలకుఱికి సోమనాథుని సంస్కృత బసవోదాహరణమును అనుసరించినదే. ఆ లక్షణమిది:

> "యేన కేనాపి తాళేన గద్యపద్య సమన్వితమ్
> జయత్యుపక్రమమ్ మాలిన్యాది ప్రాసవిచిత్రితమ్
> తదుహరణం నామ విభక్త్యష్టక సంయుతమ్."

సంస్కృతబసవపురాణమునందు "జయతు" అను ఉపక్రమణము కలదు. "జయతు బసవరాజః "అదిని మాలినీవృత్తము కలదు "జయతు బసవ రాజః ప్రాణలింగాత్మక పూజః కళికోత్కళికలందు ప్రాస కలదు "అపిచ- షపిత-" "కావుళ- శ్రీ విశ్రుత-" ప్రాస సంస్కృతమునందు లేదు సంస్కృత బసవోదాహరణమునందు కలదు విచిత్రమే కళికోత్కళికలు రగడలు. పాలకుఱికి సోమనాథుని సంస్కృత గద్యలందు రగడ ధంపవృ్వ కలదు అది సంస్కృతము నందు లేదు. సంస్కృత బసవోదాహరణమునందు రగడలు కలవు సంస్కృత గద్యలకు సదృశము అవిగాక శ్లోకములు కలవు అవి శార్దూలములు అందువలన సంస్కృత బసవోదాహరణము గద్య పద్య సమన్వితము పాలకుఱికి సోమనాథుని సంస్కృత గద్యలకు, సంస్కృత బసవోదాహరణమునకు సంపదించునట్లు విద్యానాథుని సంస్కృతోదాహరణ లక్షణము కలదు. లక్ష్యమును బట్టి లక్షణము సహజము విద్యానాథుని ప్రతాపరుద్రీయము రచనాకాలమునకు పాలకుఱికి సోమ

నాథుని సంస్కృతగద్యలు, సంస్కృత బసవోదాహరణము సుప్రసిద్ధము. కానిచో లక్షణ నిర్దేశము సంభవము కాదు అంతేకాదు సమకాలిక రచనములకు లక్షణ నిర్దేశము సంభవము కాదు. పూర్వకాలిక రచనములే పూజ్యములు విద్యానాథుడు ప్రతాపరుద్రుని ఆస్థానపండితుడు పాలకురికి సోమనాథుడు తత్పూర్వకాలికుడు. ఇది కూడ పాలకురికి సోమనాథుని కాలము ప్రతాపరుద్రుని కాలము కాదనుటకు ప్రమాణము.

విన్నకోట పెద్దన కావ్యాలంకార చూడామణియందు సద్దళి, పద్దళి, విద్దళి, కళ్యాణి, ఉత్ఫుల్లకను అను కావ్యభేదములు కలవు. (21-23ప 4ఉ) సంబుద్ధి లేని సప్తవిభక్తుల రచన సద్దళి సరి విభక్తులందు సంబుద్ధి కల రచన పద్దళి. బేసి విభక్తులందు సంబుద్ధి కల రచన విద్దళి కళికలు కలది కళ్యాణి ఉత్కళికలు కలది ఉత్ఫుల్లకము వీని పరిణామ వికాసమే ఉదాహరణ కావ్యవిశేషము కావచ్చును. సంబుద్ధులు, సర్వ విభక్తులు, కళికలు, ఉత్కళికలు ఉదాహరణకావ్యమునందు కలవు. ఉదాహరణ కావ్యములందు భేదములును కలవని విన్నకోట పెద్దన సూచనము. (24ప. 4ఉ.)

తెలుగు బసవోదాహరణము సంస్కృతబసవోదాహరణమునకు అను వాదము కాదు ప్రత్యేకరచనము జయతు అను ఉపక్రమణము లేదు శ్రీకారము కలదు. ఆదిని మాలినీ వృత్తము లేదు ఉత్పలమాలావృత్తము కలదు అష్టవిభక్తు లందును పద్యములు, కళికలు, ఉత్కళికలు కలవు. కళిక రగడ ఉత్కళిక రగడలో నిలువుసగము కళిక పాదముల సంఖ్య, ఉత్కళిక పాదముల సంఖ్య సమానము. కళిక పాదములోని సగము ఉత్కళిక పాదము సంస్కృతోదాహరణమునందు సార్వవిభక్తిక శ్లోకమువలె తెలుగు ఉదాహరణమునందు సార్వవిభక్తిక పద్యము కలదు తెలుగు బసవోదాహరణమునందు ప్రథమా,తృతీయా, షష్ఠీ విభక్తులలో ఉత్పలమాల పద్యములు, ద్వితీయా, చతుర్థీ, సప్తమి, సంబోధన ప్రథమా విభక్తు లలో చంపకమాల పద్యములు కలవు ప్రథమావిభక్తిలో కళిక మధురగతిరగడ, ఉత్కళిక అందులో నిలువు సగము, ద్వితీయా, తృతీయా, చతుర్థీ, పంచమీ విభక్తు లలో కళికలు ద్విరదగతి రగడలు, ఉత్కళికలు అందులో నిలువు సగములు, షష్ఠీ సంబోధన ప్రథమా విభక్తులలో కళికలు తురగవల్గనగతి రగడలు, ఉత్కళికలు అందులో నిలువు సగములు, సప్తమీ విభక్తిలో కళిక హయప్రచారరగడ, ఉత్కళిక అందులో నిలువు సగము.

: కళిక పాదము :

"వెండియుఁ ద్రిభువనవినుతి సమేతుఁడు"

: ఉత్కళిక పాదము :

"భువనోపకార—"

కళికయందు ప్రతిపాదాంతమునందు విభక్తి ప్రత్యయము కలదు. ఉత్కళిక యందు చివరి రెండు పాదాంతములందును విభక్తి ప్రత్యయము కలదు.

: సార్వవిభక్తిక పద్యము :

"నీవు దయాపయోనిధివి, నిన్ను నుతించినఁ గల్గు భక్తి; నీ
చే వరవీరశైవరతి చేకురు; నీకయి యిత్తుఁ గబ్బముల్;
నీ వలనం గృతార్థత జనించును, నీకు నమస్కరింతు; నీ
భావమునందునుండి ననుఁ బాపకుమీ బసవయ్య! వేఁడెదన్."

తెలుగు బసవోదాహరణము చివఱ కర్తృనిర్దేశము లేదు. సంస్కృత బసవో దాహరణము చివఱ కలదు. "సోమనకవినా రచితం." ఉదాహరణ ప్రక్రియస్తోత్ర భేదము

## బసవరగడ, శ్రీబసవాఢ్యరగడ. గంగోత్పత్తిరగడ

రగడ కావ్యభేదముగ చిన్నకోట పెద్దన కావ్యాలంకారచూడామణియందు కలదు.

"సరియౌ పదిజేకులచేఁ
బరువడి నుత్సాహవృత్తపదయుగళముచే
నిరవుగ వడి ప్రాసంబుల
నరుదుగ రచియింప రగడ యగుఁ దగ వృత్తిన్" 40 ప 4 ఉ.

ఇంతకు మిక్కిలి రగడభేదములును లేవు. ఉదాహరణప్రక్రియలోని కళిక కళిక అనిగాని, రగడ అనిగాని లేదు "చతురశ్రత్ర్యశ్రాదివితతియతితాళములు గలుగు దళములనెల్లన్ గృతగుర్వాస్యప్రాసంబు" అనియే కలదు (12ప.4ఉ.) రగడ ఛందోభేదముగ శ్రీనాథుని కాశీఖండమునందు కలదు (125 ప. 6 ఆ.) కావ్యభేదముగ పాలకుఱికె సోమనాథుడు రగడలు రచించినట్లు పిడుపర్తి సోమన పద్యబసవపురాణమునందు కలదు.

"బసవపురాణంబు పండితారాధ్యుల
చరితంబు ననుభవసారమును చ
తుర్వేదసారసూక్తులు సోమనాథభా
ష్యంబు శ్రీరుద్రభాష్యంబు బసవ

రగడ గంగోత్పత్తిరగడ శ్రీబసవాఢ్య
రగడయు సద్గురురగడ చెన్న
మల్లుసీసములు నమస్కారగద్య వృ
షాధిపశతకంబు నక్షరాంక

గద్యపద్యము ల్పంచప్రకారగద్య
యష్టకము పంచకము నుదాహరణయుగ్మ
మాది యగు కృతుల్ భక్తిహితార్థబుద్ధిఁ
జెప్పె నవి భక్తికసభలలోఁ జెల్లుచుండు"

ఇందు తెలుగుకృతులు, కన్నడకృతులు, సంస్కృతకృతులు కలవు. సద్గురురగడ కన్నడకృతి. కన్నడకృతులందు శరణబసవరగడ, చెన్నబసవరగడ కలవు చెన్నబసవ రగడ బసవరగడ, శరణబసవరగడ, శ్రీబసవాఢ్యరగడ కావచ్చును అయిన కన్నడకృతులే అగును తెలుగు శరణబసవరగడ తెలుగు కృతి అని ఒక అభిప్రాయము కలదు.[66] కాని, శరణబసవరగడ తుదిని కన్నడపద్యము కలదు.

"శరణస్తవకల్పకుజాం
కురపదశాఖాభిజాతనవకుసుమాష్టో
త్తరశతనామంగళ బస
వర నంగర్పిసిద పాల్కురికె సోమాంకమ్"

చెన్నబసవరగడ ఆద్యంతములందును కన్నడపద్యములు కలవు.

"శ్రీమంతన బసవగురు
శ్రీమంతన నాం పొగళ్వె జంగమలింగ
శ్రీమంతన సుజ్ఞాన
శ్రీమంతన మహితభక్తియిం బసవేశా!"

"చెన్నబసవణ బల్లల
బణ్ణిసలా బసవమహిమెయం బల్లనవం
చెన్నబసవణభక్తియ
నిన్నొప్పిరి............బసవేశా!"

శరణుబసవరగడయందు బసవేశ్వరుని అష్టోత్తరశతనామములు సంబోధనాంతములుగ కలవు. చెన్నబసవరగడయందును చెన్నబసవని విశేషణములు సంబోధనాంతములుగ కలవు. సంబోధనాంతములు తెలుగు కన్నడములకు సమానము అంతమాత్రమున తెలుగుకృతి అనుట సాహసము ఆద్యంతపద్యములను బట్టి అవి కన్నడకృతులు ఇవి బసవరగడ, శ్రీబసవాఢ్యరగడ కానిచో అవి తెలుగు కృతులు కావచ్చును తెలుగు కృతులైన బసవరగడ. శ్రీబసవాఢ్యరగడ, గంగోత్పత్తి రగడ అనుపలబ్ధములు.

## సహస్రగణమాలిక

ఇది లఘుద్విపదగ్రంథము. ఇందు రెండువందలయేనిమిది ద్విపదలు కలవు. నంది మొదలు ఊర్ధ్వబాహుడు వఱకు ప్రమథగణముల, భువనేశ్వరుడు మొదలు మహాకాయుడు వఱకు రుద్రగణముల, ధర్మాచార్యులు మొదలు ఎఱుమూర్తివఱకు, (ఇందు అఱువత్తు మువ్వురు భక్తులు కలరు), హొన్నయ్య మొదలు బాచలదేవివఱకు షోడశుల, వీరఘంటయ మొదలు బసవరాజయ్యవఱకు ప్రభాతగణముల, సింగిదేవుడు మొదలు నిమ్మవ్వవఱకు భక్తగణముల నామపట్టిక సహస్రగణమాలిక. కావ్యము కాదు సహస్రగణనామములు ద్విపదగణబద్ధములు.

## చెన్నమల్లుసీసములు

ఇవి ముప్పదిరెండు సీసపద్యములు "సోమనాథుఁడు శివైక్యసమయమున జీవసమాధియగుచు సమాధిలోనికి 32 సోపానములు కట్టించుకొని వానిని దిగునప్పుడు మెట్టున కొక పద్యము చొప్పున వీనినిఁ జెప్పెనని యైతిహ్యము" కలదు.[67] కాని యథార్థము కాదు చెన్నమల్లుని – శ్రీశైలమల్లికార్జునస్వామిని– ఉద్దేశించి షట్స్థలములను వివరించిన పద్యము లివి. ఇట్లు ముప్పది రెండవపద్యము కలదు.

"భక్తస్థలంబునఁ బదుమూఁడు మాహేశ
పదమున నైదు నేర్పడఁ బ్రసాది

పదమున మూఁడుఁ దత్ప్రాణిలింగికి [మూఁడు]
శరణస్థలంబున సరయ నైదు
నైక్యస్థలంబున కలవడ రెండును
షట్స్థలవిజ్ఞానసరణి నొప్పి
క్షితిని ముప్పదిరెండు సీసపద్యంబులు
సరసోక్తిగాఁ బాలకురికి సోమ

నాథుఁ డన నొప్పు నారాధ్యసవ్యమూర్తి
యఖిల వేదపురాణశాస్త్రార్థవిదుఁడు
వీరశైవసభాయోగ్యవిదితముగను
చెన్నమల్లేశు ప్రీతిగాఁ జెప్పె నిట్లు" 32 ప

చెన్నమల్లేశునికి ప్రీతిగా, సరసోక్తిగా చెప్పిన పద్యములు సమాధిప్రవేశ సందర్భమునకు సముచితములు కావు. భక్తస్థలమున 13, మాహేశ్వరస్థలమున 5, ప్రసాదిస్థలమున 3, ప్రాణలింగిస్థలమున 4, శరణస్థలమున 5, ఐక్యస్థలమున 2 మొత్తము ముప్పదియొకటి పద్యములును షట్స్థలవిజ్ఞానమే

స్థలమన పరశివబ్రహ్మము అది భక్త, మాహేశ, ప్రసాది, ప్రాణలింగి, శరణ, ఐక్యభేదమున షడ్విధము. నిజమైన శివభక్తి కలవాడు భక్తుడు. శివ తత్పరుడు మాహేశుడు శివప్రసాదమును స్వీకరించువాడు ప్రసాది జ్ఞానస్వరూప లింగమే బ్రహ్మము, బ్రహ్మశక్తియే ప్రాణము, రెండును ఒకటే అను ప్రసాది ప్రాణలింగి అన్యదేవతావిముఖుడు శరణుడు శివజీవుల ఏకత్వము (సామరస్యము) ఐక్యము. ఇది షట్స్థలస్వరూపము [68]

"ఆనంద మలర లింగార్చన చేయక
గుడుచుట పాపంబు గుడుచునట్లు
అర్చకుండయ్యు లింగానర్పితము గోరి
ముట్టుట యవ్యంబు ముట్టినట్లు
లింగప్రసాదంబు జంగమవిముఖుఁడై
కొనుట యేమేనియుఁ గొనినయట్లు
జంగమహితుఁడయ్యు సరిపాకభేదంబు
సేయుట ద్రోహంబు సేసినట్లు

అను పురాతనోక్తి కావంతయును దొట్టు
పడని శుద్ధభక్తిపదము ప్రాణ
పదముగాఁ జరించు భక్తలింగంబులఁ
జేర్వవయ్య నన్నుఁ జెన్నమల్లు" 3 ప.

ఇది భక్తస్థలమునకు ఉదాహరణము ఇక ఐక్యస్థలము—

"కచుగన బోసిన కరణి సమస్తాంగ
ములు నిండి నీలోన మూర్తి గొనఁగ
గండరించిన భాతిఁ గలయు ప్రాణంబున
నెలకొని నీ రూపు నిగ్గు దేఱ
నచ్చునొత్తిన యట్టు లంతరంగంబున
నెలకొని శృంగార మెలమి మిగులఁ
జిత్తరించిన భాతి చేష్టలు దవిలిన
నాకారరేఖ సమంచితముగ
ప్రాను చేవ బలియు మాడ్కి సందడిఁ దన్ను
నెఱుఁగ దెలివి వీఁక కఱకు పడక
నీవయై చరించు నీ మహాభక్తులఁ
జేర్వవయ్య నన్నుఁ జెన్నమల్లు" 31 ప

ఎంత సరసోక్తిని రచించినను షట్స్థలవిజ్ఞానము రసవంతము కాదు. చెన్నమల్లుసీసములు కావ్యగ్రంథము కాదు శాస్త్రగ్రంథమే.

## చతుర్వేదసారము

ఇదొక త్రిశతి శివతత్త్వసారము వలె శైవశాస్త్రగ్రంథము. శివతత్త్వసారము కందపద్యసాహస్రి. చతుర్వేదసారము సీసపద్యత్రిశతి. అందు శివ పర్యాయపదము మకుటము ఇందు బసవలింగనామము మకుటము. మూడువందల సీసపద్యములందును బసవలింగ అను సంబుద్ధియే కలదు. బసవలింగమకుటమును బట్టి చతుర్వేదసారము బసవలింగశతకమని ముద్రింపఁబడినది. కాని చతుర్వేద సారము శతకము కాదు. త్రిశతి. రెండు గ్రంథములును ఒకే సంవత్సరమునందు ముద్రింపఁబడినవి. అంతేకాదు బసవలింగశతకము స్తుతిగ్రంథమని సమాచారము. కలదు. [69] కతిపయస్తుతి పద్యములున్నను చతుర్వేదసారము స్తుతిగ్రంథము కాదు. శాస్త్రగ్రంథము. రెండును భిన్నగ్రంథములు.

"నిర్వికల్పరతిఁ జతుర్వేదసారమన్
పద్యముల్ రచింతు బసవలింగ"

అను ప్రతిజ్ఞ ఎనిమిది పద్యములందు కలదు. "రచియింతు నీ కృతి" వంటి ప్రతిజ్ఞ మరొక పది పద్యములందు కలదు పదునెనిమిది పద్యములందు "రచింతు" ననుట చతుర్వేదసారమునెడ పాలకురికి సోమనాథుని ప్రత్యేకదృష్టిని ప్రకటించును.

చతుర్వేదసారమునందు శివపారమ్యము, శివభక్తిహీనుల నిరసనము, అన్యదైవభక్తుల నిరసనము, అన్యమతనిరసనము, విభూతి రుద్రాక్షలింగధారణ లింగార్చనాదికముల మాహాత్మ్యము, ప్రకృతి పురుషవివేకము, విష్ణుభక్తులు శివభక్తు లగుటకు కారణము, శివప్రసాదము, శివుడే పరబ్రహ్మమను సిద్ధాంతము, భక్తిమార్గప్రశంస. శీలలక్షణము, షట్స్థలస్వరూపము శివానుభవసూత్రము, భవిజననిరాదరణము మొదలైన బహువిషయములు కలవు.

"వైదికు లిది శుద్ధవైదికంబని యెన్న
శాస్త్రజ్ఞు లిది ధర్మశాస్త్రమనఁగ
దార్కికు లిది మహాతర్క బనంగఁ బౌ
రాణికు లిదియే పురాణమనఁగ
నాగమవిదులు దివ్యాగమం బదియనఁ
దంత్రజ్ఞు లిది పీరతంత్రమనఁగ
భక్తవారం బిది భక్తి మార్గంబన
ముక్త్యర్థు లిది మహాముక్తిదమనఁ
గవులు భువిని నిదియె కావ్యంబనంగను
సజ్జనులకు మిగుల సంతసముగ
నిర్వికల్పరతిఁ జతుర్వేదసారమన్
పద్యముల్ రచింతు బసవలింగ!" 22 ప,

అను పద్యము, "ధర్మశాస్త్రజ్ఞులు ధర్మశాస్త్రంబని" అను నన్నయ పద్యమునకు అనుసరణము చతుర్వేదసారమునందు ఋగ్యజుస్సామాథర్వణ వేదములనుండి, బోధాయన, గౌతమ, యమాదిస్మృతులనుండి, శ్వేతాశ్వతర, నారాయణ, రుద్ర, కైవల్య, లైంగ్య, బ్రహ్మాద్యుపనిషత్తులనుండి పెక్కు ఉట్టంకనములు

కలవు. అవి వైదికులు శుద్ధవైదికమని ఎన్నుటకు సమర్థములు. భృగుసంహిత, సూతసంహిత, శివధర్మశాస్త్రము మొదలైన ధర్మశాస్త్రములనుండి ఉదాహరణములు కలవు అవి శాస్త్రజ్ఞులు ధర్మశాస్త్రమనుటకు అనుకూలమైనవి. చతుర్వేదసారము నందలి తర్కము తార్కికులు మహాతర్కమనుటకు తగినది. ఆదిత్య, లింగ, స్కాంద, కూర్మ, భాగవతాదిపురాణములనుండి బహునిదర్శనములు కలవు. అవి పౌరాణికులు పురాణమనుటకు పొసగునవి విమలాగమము, కారణాగమము, వాతూలాగమము మొదలైన శైవాగమములనుండి ప్రమాణములు కలవు. అవి ఆగమవిదులు దివ్యాగమమనుటకు సహకరించునవి. వీరశైవసిద్ధాంతము వీరతంత్ర మనుటకు, భక్తి ప్రాధాన్యము భక్తిమార్గమనుటకు, ముక్తిప్రబోధము ముక్తిప్రద మనుటకును సరిపడును. ఖండనమండనాత్మకమైన మతసిద్ధాంత ప్రతిపాదనమేగాక, తన్మయీభావనయోగ్యమైన రససిద్ధాంత ప్రతిఫలనము పూజ్యము. కవులు చతుర్వేద సారమును కావ్యమనుట కష్టము. కవితా స్పర్శ కల పద్యములు క్వాచిత్కముగ కలవు.

"తాలవృంతములలో గాలియున్నదె కొంత
విసరంగ విసరంగ నెసఁగుఁగాక
చెలఁదిరోపలఁ దంతువులు గొన్నియున్నవే
యల్లంగ నల్లంగ నలరుఁగాక
శిలలలోఁ బ్రతిశబ్దములు గల్గియున్నవే
పలుకంగఁ బలుకంగఁ బలుకుఁగాక
చెలమలోపల నొక్క జలనిధి యున్నదే
ముంపంగ ముంపంగ నింపుఁగాక
యట్లు నిర్వంచకుఁడు గాని హరుని భక్తి
పరుని ముందట నున్నదే పసిఁడి ప్రోఁక
కడఁగి సేయంగఁ జేయంగఁ గలుగుఁగాక
భక్తి మాహాత్మ్యమున మఱి బసవలింగ! 151ప

"రాకామలజ్యోత్స్న ద్రావ నిచ్చలు గన్న
నా చకోరంబుల కరుచి యగునె
సహకారపల్లవ చయములు దొరకిన
జగతి కోవెలలకుఁ జప్పనగునె

క్షీరాబ్ధిలోపలఁ గ్రీడింపఁ గలిగిన
  భువి రాజహంసకుఁ బుల్లనగునె
విరిదమ్మి వాసన వెల్లి మునిచినఁ గ్రోలు
  షట్పదముల కనాస్వాదమగునె
బహుళతర దయార్ద్రభావ ప్రభావన
మహిమఁ దనరు జంగమంబు రాక
యతుల భక్తిపరుల కావశ్యకంబగుఁ
బరిహృతాభిషంగ బసవలింగ!" 154.

ఇట్టి పద్యములు కొన్ని మాత్రమే శాస్త్రిటవిలోని కావ్యసరణులు.

అనుభవసారములోని ఇరువది మూడు సీసపద్యములందును ఒక్క తేట గీతి పద్యము లేదు. చెన్నమల్లు సీసపద్యములు ముప్పది రెండులోను పాతిక ఆట వెలది పద్యములు, ఏడు తేటగీతి పద్యములు కలవు. చతుర్వేదసారములోని మూడు వందల సీసపద్యములలోను ఆటవెలదులు వందపైగా కలవు. తేటగీతులు సుమారు రెండువందలు కలవు అనుభవసారములోని సీసపద్యములందు మచ్చుకైనలేని తేటగీతి, చెన్నమల్లు సీసములందు దర్శనమొసగి, చతుర్వేదసారమునందు ఆటవెలదు లపై ఆధిపత్యము వహించినది ఇది ఈ మూడు గ్రంథముల రచనా కాలక్రమమును తెలుపును అంతేకాదు అనుభవసారము మొదలు చెన్నమల్లు సీసముల వఱకు పరి మిత ప్రాయమైన పాలకుఱికి సోమనాథుని పాండిత్యము చతుర్వేదసారమునందు అతిశయించినది. అది పరాకాష్ఠ దశనందినది పండితారాధ్య చరిత్ర.

## పండితారాధ్య చరిత్ర

ఇది ద్విపద కావ్యము. కవిత్వము, పాండిత్యము జోడు గుఱ్ఱములవలె కదనుత్రొక్కిన కావ్యరథము. ప్రధానేతివృత్తము మల్లికార్జునపండితుని జీవిత చరిత్ర సంగ్రహము మహాభక్తుల వృత్తాంతములు ప్రాసంగికేతి వృత్తములు మహా భక్తుల వృత్తాంతములు మణిపూసలుగ, మల్లికార్జున పండితుని జీవిత చరిత్రసంగ్ర హము నాయకమణిగ, శ్రీశైలక్షేత్రచరిత్రము రత్నపదకముగ, వీరశైవమతము సువర్ణసూత్రముగ సంఘటించిన అనర్ఘమణిహారము పండితారాధ్యచరిత్ర. బసవే శ్వరునికి అంకితము.

పండితారాధ్య చరిత్రయందు అయిదు ప్రకరణములు కలవు. 1. దీక్షా ప్రకరణము 2. పురాతనప్రకరణము 3 వాదప్రకరణము. 4. మహిమ ప్రకరణము 5 పర్వత ప్రకరణము ప్రకరణవిభాగము కల ప్రథమాంధ్ర గ్రంథము.

మల్లికార్జునపండితుడు ఋగ్యజుస్సామాథర్వణ వేదముల నుండి; మను, యమ, నిగమ, గౌతమ, జాబాలి, పరాశర, యాజ్ఞవల్క్య, లౌగాక్షిక, శాతాతప, బోధాయనాది స్మృతుల నుండి, కేన, ఈశ, రుద్ర, గర్భ, జాబాల, జైగీష, మానవ, మారుత, నారాయణ, బృహదారణ్యక, శ్వేతాశ్వతరాద్యుప నిషత్తులనుండి; సూత, వాయవ్య, సావర్ణి, ఈశానాది సంహితలనుండి, భీమ, సర్వ, దివ్య, కారణ, ఈశ్వర,వాతూలాది శైవాగమముల నుండి,శివధర్మ, శివరహస్య, విజ్ఞానేశ్వరాది ధర్మ శాస్త్రముల నుండి; శివ, లింగ, స్కాంద, పద్మ, కూర్మ, మత్స్య, గరుడ, బ్రహ్మాండ, మానవ, భవిష్యత్, పరాశరాది పురాణముల నుండి; శంభురాఘవ, వ్యాసజైమిని ప్రభృతి సంవాదములనుండి; భారత, భాగవత, హరివంశాద్యనేక గ్రంథముల నుండి, ఉట్టంకన ధనుష్టంకారముల ప్రమాణబాణములు పుంఖాను పుంఖముగ ప్రయోగించి, విభూతి రుద్రాక్ష లింగధారణ లింగార్చన విశిష్టమైన వీరశైవదీక్ష సవైదికమని నిరూపించినది, సముజ్జ్వలముగ ఆచరించినది దీక్షాప్రకరణము. ఇందు అస్పృశ్యతను ప్రతిఘటించిన పోరంణ్ల సూరసానమ్మ చరిత్రకలదు.

మల్లికార్జునపండితుని మహిమను సమర్థించు కళియంబ, పిళ్ళనయనారు, వెలమడు, వాగీశనైనారు, దసరయ్య, గురుభక్తయ్య, శ్వేతుడు, మలహణుడు, కుమారపాల ఘూర్జరుడు, ఓహిళుడు, బెరిదేవ వేమానారాధ్యుడు, సకలేశ్వర మాది రాజయ్య, కదిరె వేమయ్య, చేటల వేమయ్య అను పురాతన భక్తుల చరిత్రలను తెలుపునది పురాతనప్రకరణము. వెల్లగొండ మహాదేవయ్య అను మహాభక్తుని ఖండిత పాదములను, శివలింగసన్నిధి ప్రమిదలోని తైలమును మర్దించి అదుకుకొను నట్లు చేయుట మల్లికార్జున పండితుని మహిమ.

వెలనాటి చోడుని బౌద్ధగురువు చేయించిన సభలో మల్లికార్జునపండితుడు వేద, కర్మ, కాల, వేదాంత, సాంఖ్య, యోగ, చార్వాక, పాంచరాత్ర, బౌద్ధ, జైన వాదములను శ్రుతిస్మృతి పురాణేతిహాసాదిప్రమాణములతో ఖండించి; శివుని చంద్ర, కపాల, అస్థిమాల, గంగ, గరళ, చర్మధారణములు, ఉమాపతిత్వము, బ్రహ్మముఖావిర్భావము త్రివిక్రమఖండనము, దక్షాధ్వర ధ్వంసములు నిమిత్త

ములుగ హరిహరాభేదమును పరాస్తము చేసి, శివుని సర్వాధిక్యమును స్థాపించి, బౌద్ధగురువును సభానిష్క్రమణము చేయించినది వాదప్రకరణము.

సభలోని రేమయ, దేవయ అను వారు బౌద్ధగురువును సంహరింప, మల్లికార్జునపండితుడు తానే చంపితినని, తనకు తానే శిక్షను కల్పించుకొని, వెలనాటి చోడుని వలన అంధుడై, వెలనాటి చోడుని రాజ్యవంశములు నాశనమగునని శపించి, వెలనాటి చోడుడు సర్వనాశనము కాగా రాజధాని చందవోలునుండి అమరావతి వెళ్ళి అమరేశ్వరునివలన కన్నులు పడసి, బసవేశ్వరుని చూడ కల్యాణకటకమునకు బయలుదేరి, నిడుగుడుమల గ్రామమునందు బసవేశ్వరుడు పంపిన విభూతివలన కన్నడ కవిత్వము చెప్పి, పానగల్లు చేరి బండరువు గోవింద ప్రెగ్గడ పూజ లందుకొని, తన్నిమిత్తమున ధవళేశు నామయ్య ఆత్మహత్యకు కారకుడైన పానగల్లు పాలకుడు ఉదయావనీశుని శపించి, ఉదయావనీశుడును సర్వనాశనము కాగా, వనిపురము పోయి శంకరయ్య పూజ లందుకొని బసవేశ్వరుని నిర్యాణవార్తను విని రోదించినది మహిమ ప్రకరణము. ఇందు మల్లికార్జునపండితుని ఊర్ధ్వనేత్రలాభకథనమునకు ఉపబలకముగ విష్ణ్వాదుల, బాణమయూర కాళిదాసుల, ఇరిత్తాండార్యసుందరనంబెన్నల నేత్రలాభకథనములు కలవు.

మల్లికార్జునపండితుడు వనిపురమును వదిలి, శ్రీశైలమునకు వచ్చి, శ్రీశైలము శివలింగాకారముగా తోచి కాలిడుటకు సంకోచించి, శిష్యుడైన దోనయ్యను మల్లికార్జున స్వామి దర్శనము చేసి తన శివభక్తిని నివేదించుటకు పంపి, పల్లెటూరులో ఉండి, దోనయ్యకు మల్లికార్జునస్వామి వృద్ధమునివేషమున కనిపించి దీపవృక్షము మీద నుండి శ్రీశైలక్షేత్ర సమస్తప్రదేశములను చూపించుట విని, జన్మ ధన్యమైనదని భావించి, శివైక్యము చెందుట పర్వత ప్రకరణము. ఇందు శ్రీపర్వతోత్పత్తికథనము, శ్రీనగమహత్త్వవివరణము మొదలైనవి శ్రీశైలక్షేత్ర పౌరాణికప్రతిపత్తికి మణిదర్పణములు. పర్వతవర్ణనము, పాతాళగంగా వర్ణనము, నక్షత్ర పర్వతారోహణ వర్ణనము మొదలైనవి శ్రీశైలక్షేత్రస్థానికప్రకృతికి కంచుటద్దములు. పరుస నడలు, జంగమకోట్ల నడలు, వృద్ధమునుల నడకలు, మిండజంగముల నడకలు, శీలవంతుల నడలు, విరక్తుల నడకలు, శివయోగుల నడకలు, అభ్యాసయోగుల నడకలు, పుణ్యాంగనల నడకలు, జోగుల నడకలు, పిచ్చుకుంటుల నడకలు, చెంచుల నడకలు, ఆంధ్రదేశము పరుస, కన్నడపరుస నడక, అరె పరుస నడక, అఖిలదేశము పరుస, అఖిలదేశముల పరుస, ఆటపాటలు మొదలైనవి ఆనాటి

శ్రీశైలక్షేత్ర తీర్థయాత్రా వైభవమునకు నిలువుటద్దములు ఈ ప్రకరణమునందు మృగవ్యాధునికథ, కరవీరునికథ కలవు.

పాలకుఱికె సోమనాథుని ఆంధ్ర, కర్ణాట, తమిళ, మహారాష్ట్ర, సంస్కృత భాషాపరిజ్ఞానమునకు, శ్రుతిస్మృతి పురాణేతిహాసతర్క వ్యాకరణచ్ఛందోలంకార వైద్యవైశేషిక సాంఖ్యయోగ రసవాద జ్యోతిష కొక్కోక భరతసంగీత శాస్త్ర పాండిత్యమునకు, హరలీల, మలహణ, అనాపయ, హలాయుధ, భృంగిస్తవ, మహిమ్న స్తవ, మయూర స్తవ, నీలకంఠ స్తవ, వ్యాసాష్టక, గణాడంబర, గద్య, శతక, దండక, ముక్తక, ఉదాహరణ, దీపకళిక, మహానాటక శివతత్త్వసారాది బహుగ్రంథపారాయణమునకు పండితారాధ్యచరిత్ర నిలయము అంతేకాదు కవిత్వ మునకును కాణాచి.

"సత్కృతియన నూత్నసంగతి చనరఁ
దొమ్మిదిరసములు దులుకాడు దాని
యిమ్మడి వర్ణన లెసగంగ ద్విగుణ
మగు నలంకారంబు లసలారు దాని
ద్విగుణార్థభావముల్ దీటుకొనంగ" పు 17.

పండితారాధ్యచరిత్రను రచింతునని పాలకుఱికి సోమనాథుని ప్రతిజ్ఞ. రసములు 9. వర్ణనలు 18. అలంకారములు దండిమతమున 36 అర్థభావములు 72 అర్థములు పురుషార్థములు, భావములు అనుభావాదులు కావచ్చును. పురుషార్థములు 4, అనుభావములు 18, సాత్త్వికభావములు 8, సంచారీభావములు 33, స్థాయి భావములు 9 మొత్తము 72 పండితారాధ్యచరిత్ర నవరసభరితమే.

శృంగారరసమునకు గురుభక్తాందారి కథ శృంగగ్రాహిక అందు మలహణుని విరహము సహజసుందరము.

"అంత నిక్కడ మలహణుఁడు గామాగ్నిఁ
గాంతావియోగదుఃఖం బిన్మడింపఁ
దనుధర్మములు దక్కి తన్స్వభావంబు
మనమున నెక్కొన మును బద్మనేత్రి
దవులంబుతోఁ జూచు తలఁపుఁ దలంచుఁ
బవడంపుఁ గెమ్మోవి భావంబుఁ దలఁచు

దాసిన హర్షించు తాళంబు దలఁచుఁ
జేసిన హర్షించు తాళంబు దలఁచుఁ
జెలఁగుచు నవ్వెడు చెన్నుఁ దలంచు
నలరుచుఁ బులకెంచు నలువుఁ దలంచు
మాటమాటకుఁ జూచు మక్కువఁ దలఁచు
మాటలఁ బిచ్చిళ్ల మధురంబుఁ దలఁచు
సరసంబు లాడెడి జాను దలంచుఁ
గరమొప్ప నెమ్మోము కాంతిఁ దలంచు
నంగదీధితుల యొయ్యారంబుఁ దలఁచుఁ
బొంగారు జాఱుఁగొప్పు సొగసుఁ దలఁచుఁ
గరిసె క్రాల్గన్నుల పొలుపుఁ దలంచుఁ
దెలుపారి మెఱుఁగెక్కు పలువర్సఁ దలఁచుఁ
గుటిలకుంతలముల కొమరుఁ దలంచు
బటువగు నెఱివేణి భారంబుఁ దలఁచుఁ
జెన్నుగా నసియాడు నెన్నడుముఁ దలఁచు
సన్నుతి కెక్కిన జఘనంబుఁ దలఁచు
నెఱసిన పాలిండ్ల నిగ్గుఁ దలంచు
లింగార్చనము సేయు లీలఁ దలంచు
జంగమారాధనాసక్తిఁ దలంచు
మేలంబు లాడెడి మెలపుఁ దలంచు
నాలింగనాదుల కీలుఁ దలంచు
మఱి పోఁది రతికళామదనసౌఖ్యంబుఁ
దఱుఁ దఱి వెండియుఁ దలఁచి తలంచి
యుండఁజాలక యవ్వియోగదుఃఖాగ్ని
మండంగ... ... ..." పు 362–364 ప్ర. సం.

శివుడు అంత్యజునిరూపమున బ్రాహ్మణుల ఆశయమునకు భంగము కలిగించుట హాస్యరసమునకు (పు 122–129 ప్ర సం.) బసవేశ్వరుని నిర్యాణమునకు మల్లికార్జునపండితుడు విలపించుట కరుణరసమునకు (పు 199–221 ద్వి. సం.) మల్లికార్జునపండితుడు వెలనాటి చోడుని శపించుట రౌద్రరసమునకు (పు57ద్వి.సం.)

మల్లికార్జునపండితుడు శివ లింగార్చనము సేయుట వీరరసమునకు (పు 161-187 ప్ర.సం) సుందరనంబెన్న అగ్నిహోత్రము మీద పడుట భయానకరసమునకు (పు 126-127 ద్వి.సం.) బెలిదేవ వేమనారాధ్యుడు బ్రదికించునెడ రాజశవమును వర్ణించుట బీభత్సరసమునకు (పు 443-444 ప్ర. సం) మల్లికార్జునపండితుని ఉత్పాదిత నేత్రలాభ కథనము (పు 28-పు49 పు. ద్వి. సం.) ఊర్ధ్వనేత్రలాభ కథనమును (పు 96-100ద్వి సం.) అద్భుతరసమునకు; మల్లికార్జునపండితుడు శివైక్యము చెందుట శాంతరసమునకు (పు 543-549) ద్వి.సం. ఉదాహరణములు.

దండి కావ్యాదర్శమునందు అష్టాదశవర్ణనల పేరులు కలవు. (16,17శ్లో1పరి) అవి యథాతథముగ పండితారాధ్యచరిత్రమునందు లేవుగాని అనేక వర్ణనలు కలవు.

## ప్రభాతవర్ణన

"సుప్రభాతమున నుత్సుకత మేల్కాంచి
మసలి చుక్కలు కాంతి మాయక మున్న
యసమశంఖధ్వను లలరక మున్న
యభవాలయంబుల నలరు దీపములు
ప్రభసెడి వెలువెల్లఁ బాఱక మున్న
పరగు వెన్నెల వరపర గాక మున్న
సరసిజంబులు మొగి విరియక మున్న
జిగిసెడి కలువలు మొగుడక మున్న
మొగిఁ జకోరములు నోర్మూయక మున్న
చొక్కి యొక్కొక్కయెడ సుఖియింపఁ దలఁచి
జక్కవలే గవగూడఁ జనకటమున్న
దినమణి దన పూర్వదిక్సతి మీఁద
మనసెత్తి పదపాఱి మఱవకమున్న" పు261-262ప్ర.సం.

ఇందు వాస్తవికత ప్రధానముగా, కాల్పనికత గౌణముగ కలదు. ఇంతకంటె పరమ వాస్తవికత కోడికూత వర్ణనమునందు కలదు.

"తోలుకోడి గనువిచ్చి నిలిచి మైవెంచి
జలజల ఱెక్కలు సడలించి నీల్గి

గ్రక్కునఁ గాలాఁచి కంఠంబు విచ్చి
ముక్కున నీఁకలు సక్కొల్పి కడుపు
వెక్కించి మెడసాఁచి నిక్కి మిన్ సూచి
కుక్కుఱో కోయని కూయక మున్న” పు 262. ప్ర సం.

ఇందు కూయునపుడు కోడిపుంజు చేష్టలు కన్నులకు కట్టినట్లు వర్ణింపఁబడినవి. వాస్తవదృశ్యమేగాని కల్పనాచమత్కారము లేదు కోడికూతను మించి నీర్కోడి కూత కూడ వర్ణింపఁబడినది.

“ప్రబ్బతనాథ ప్రబ్బతనాథ యనుచు
నుబ్బి నీర్కోళ్లు గూయుడుగక మున్న” పు 262 ప్ర సం.

నీర్కోడి కూత “ప్రబ్బతనాథ ప్రబ్బతనాథ” అన్నట్లు కలదట; పర్వత నాథ అనుటకు నోరు తిరుగని మాట ప్రబ్బతనాథ.

## పుష్పాపచయవర్ణనము

“–క్రొవ్విరుల్ గోయుదురో కూడ ననుచు
దాఁటులు గొని లతాంతంబుల మీఁద
దేఁటుల పఱగాళ్లః ద్రెవ్వునో యనుచు
మలయానిలము వెంట నవి వచ్చి పచ్చి
యవపిండు ముసరి ముట్టాడునో యనుచుఁ
దుమ్మెదల్ నెమ్మి వాతులు దొల్చి తొల్చి
కమ్మని లేఁగంపు గవియునో యనుచు
విచ్చి షట్పదములు వెసఁ గ్రోలి క్రోలి
యచ్చవాసన వెలిపుచ్చునో యనుచు
దనిసిన భ్రమరములే దఱిఁ పీల్చి పీల్చి
ననుజిగి సూరగొనునొ మున్న యనుచుఁ
చొదరి భృంగములు పుప్పొడి రాల్ప రాల్ప
గడివోయి తేకులు గందునో యనుచు
జని పుష్పములు గోసికొనివచ్చునంత” పు 266–267 ప్ర సం.

ఇది పూజాపుష్పముల అపచయము – అభ్యుచితము

## వేశ్యావర్ణనము

"ఉవిద దృగ్గోచలో యొడ్డిన యురులొ
ధవళాక్షి చూడ్కులో దావాంకురములొ
మెలఁత కన్మెఱుఁగులో మెఱుఁగుల గనులొ
పొలఁతి దృగంచలో పొలయు దీపములొ
ముదిత వీక్షణములొ మోహపాశములొ
మదిరాక్షి చూపులొ మదనిబాణములొ
లోలాక్షి దృగ్గుచులో కట్టుబంట్లొ
బాలవీక్షణములో పన్నిన వలలొ" పు. 332–333 ప్ర. సం.

ఇందు భావమునకే ప్రాధాన్యము కలదు రూపమునకు ప్రాముఖ్యము లేదు

## వేశ్యమాత వర్ణనము

"నెట్టణ నేలకు నాగిటె సూత్ర
పట్ట, మోకాళ్లును బట్టతలలును
ముడివెట్టె తననీడఁ గడవంగఁ బాఱ,
వడి నెండమావుల కడగాళ్ల గట్టఁ
బాయక రెండుగాఁ బాతెడు నీరు,
వేయంగఁ, బులిజున్ను గోయని యమ్మ,
రానార యొలువఁ, జట్రాతిపైఁ గ్రుంక,
నేనుంగు పురుడోమ, నిసుక త్రాడ్వేన,
లలిగొన దిశలు దాలములు వాయింపఁ
జెలఁగుచు రోఁకటఁ జిగురులు గోయఁ
గలి వెన్నఁ బుచ్చ, గొండలు దొంతి వేర్ప,
నిల మంచుఁ గుంచాసఁ గొలువ, రేవగలు
సేయ, నాకసమునఁ జిత్రరూపములు
వ్రాయ, వాయువుఁబట్టి, వడగంట్ల గుండ్లు
గట్టి, వెన్నెలఁ బ్రోవుగాఁ జేయఁ జచ్చి
పుట్టి, నప్పుడ నేర్చు బుద్ధుల ప్రోక
గోలాసకత్తియ గొరబన ప్రోడ" పు.358–359. ప్ర.సం.

ఇందు వెశ్యమాత విపరీతభీభత్సవిలాసమేగాని జుగుప్సావహమైన విషయము లేదు.

## పర్వతవర్ణనము

"శ్రీశైల మిది సదాశివు మీఁది శిరము
నా శిరోమణి మల్లికార్జునస్వామి
దెసిగా నప్పురి దివ్యలింగములు
నా సదాశివుని నేత్రాదీంద్రియములు,
నెనసి దర్శనము శ్రీశిఖర మద్దేవు
ఘనజటాజూటసంగతశిఖరంబు,
మల్లికాకుండ యామ్యజకుండ సలిల
మల్లరి శిరమున మల్లికామాల,
పరివృతపురవరప్రాకార మీశు
వరమధ్యమేఖలావలయభూషణము
భవ్యచతుర్ద్వారఘటితహర్మ్యములు
సవ్యవిభూషణనాయకమణులు,
భావింపఁ దత్పురభ్రాజితనదులు
దేవదేవేశ్వరు దివ్యాంబరములు,
వరుసఁ బురోద్యానవనము వీశాను
చరణార్పితలతాంతచారుమంజరులు,
వరగు నప్పురి వీరభక్తపుంగవులు
హరు వరకరచరణాద్యంగకములు,
ధంగిగా నప్పురి జంగమావళులు
సంగజహరుని పరావతారములు
నలుగడఁ బరుసయు నా పౌరజనులుఁ
బటురతిఁ శివుమ్రోలఁ బచరించు ప్రజలు,
పురి బహురత్నభాసురతోరణములు
గరమొప్పు పురనాథు గ్రైవేయకములు,
సమితతత్పురవరోచ్ఛ్రితకేతనములుఁ
బ్రమథేంద్రు లిడు చామరప్రతానములు
గా నిట్లు పురము సాక్షాద్రుద్రరూప
మై పేర్వెలిఁ దదీయమహత్త్వమునకు" పు 393-395 ద్వి.సం.

చరాచరాత్మకమైన శ్రీశైలక్షేత్రము సాక్షాత్తు శివరూప మనెడు సంభావనమిది సరసభావనము. శివరాత్రి నాడు "ప్రాసాదమండపగోపురానేకదీపప్రభలు, ప్రాసాదగోపుర బహుహేమకలశభాసురద్యుతులు, శుంభద్వ్యజదండఖచితభాస్వద్రత్నకలితదీధితులు రాత్రిని పగలు చేయునట: (పు 422 ద్వి సం)

దండి కావ్యాదర్శమునందు 35 అర్థాలంకారములు, 1 శబ్దాలంకారము మొత్తము 36 అలంకారములు మాత్రమే చెప్పెను. అవి పాలకురికి సోమనాథుడు ఉద్దేశించినవి ఉపమాలంకారమును ఒక్క ఉపమానముతో సరిపెట్టక, వాల్మీకి రామాయణమునందు వలె పెక్కు ఉపమానములను సోమనాథుడు గుదిగ్రుచ్చెను.

"శివుడు సౌరాష్ట్రమున శ్రీసోమనాథుఁ
డవికల నిత్యదయామతిఁ దాన
చెంచు భావంబున శివభక్తచిహ్న
సంచితంబై యుంచుకెంచుక దోఁప
ఘన మసికప్పడమునఁ గప్పఁబడియు
నినిడి వెలుంగు మాణిక్యంబు నట్ల
మెక్కుటంపు నివురు మీఁద గప్పియును
నక్కజంబై మించు ననలంబు నట్ల
పౌనరంగ శుక్తిచేఁ బాదవంగఁబడియుఁ
దనరు ననర్ఘ్యముక్తాఫలం బట్లు
గమియ మీఁదటఁ బ్రాచి గప్పియుండియును
నమలినంబైన గంగాంబువు లట్ల
దుర్మేఘపటలంబు దూర గప్పియును
నిర్మలరవి దివి నిలచినయట్ల
యసలార శబరచర్మావృతుఁడయ్యు
ననదృశైశ్వర్యసమగ్రత దనర పు391–392 ప్ర.సం

ఉత్ప్రేక్షాలంకారమును గూడ ఇట్లే ఉయ్యాలలూగించును

"అలరె నక్షణమ స్వయంభులింగంబు
దలఁప నాయమ్మ నాభ్యస్తమూలమంత్ర

ఓల మూర్తిమంతమయ్యెనో కాక యనఁగ
నా వామ పరమశివాచారవల్లి
సేవ దానంకురించెనో కాక యనఁగఁ
బొసర భామిని సేయుఁ బుణ్యంబు ప్రోక
దనరారి కరడుగట్టెనో కాక యనఁగ
జలజాయతాక్షి విశ్వాసంబు నివ్వ
టిలి గండరింపఁబడెనో కాక యనఁగ
నలరార సతిచేత కమరద్రుమంబు
ఫలము దా మహిఁ దేజరిలెఁ గాక యనఁగ
బసగొన నాతి సౌభాగ్యాతిశయత
యెనయుచుఁ గరిగొనియెనో కాక యనఁగ.

xxx xxx xxx

హరుఁడు నిరాకారుఁడయ్యు సూరాంబ
వరమనోభక్తిభావనఁ గానఁబడియే." పు.153-154 ప్ర.సం.

రూపకాలంకారమును సాంగోపాంగముగ సమగ్రము సేయును.

"నివుడు ప్రహర్షితనీలకంఠములఁ,
దవులు ముముక్షుచాతకవితానములఁ,
హితమనోధరసమాహితఫలేచ్ఛాను
గతపరిషత్కర్షకప్రతానముల,
సురచిరసత్పథసోపానకలిత
పరిచితాభ్రంకషస్ఫురితవర్తనుల,
స్థిరవృషకాననటితృణజ్యోతి
పరుతరస్ఫురితవిద్యుల్లతాలతులఁ,
ప్రఖ్యాదిచూచానిపతితానవరత
పృథుతరకరకరపీవరపుణ్య
పూరిత నిర్ఝరధారాసమూహ
సారఝంకార నివారితధ్వాన
ఘనతరతద్గుహాగహ్వరోద్భూత
విస్మయకారుణ్యరసపూరములను,

ననుపమ స్వర్గమోక్షాద్యభీష్టార్థ
ఘనుతఫలాహారవృష్టిఁ బెంపారి
యసలారు శ్రీనగంబను నీలమేఘ
మనమానసమై యొప్పె; ............ పు. 230–231 ద్వి సం.

ఇట్టివి అర్థాలంకారములు. ఇక శబ్దాలంకారములయమకము స్వరవ్యంజనసముదాయము అవ్యవధానముగను, సవ్యవధానముగను ఆవృత్తమగునది యమకమని పండి అభిప్రాయము వృత్త్యనుప్రాసము, ఛేకానుప్రాసము, లాటానుప్రాసము, అంత్యానుప్రాసమును అందు గతార్థములు.

"తారమందారకర్పూరేశహార
హారబృందారకాహారనీహార
గౌరీకటాక్షేంద్రవారణక్షీర
సారహారావారచంద్రికాచంద్ర
శారదనీరదచందనకుంద
తారధరాధరధవలాబ్జకుముద
డిండీరమల్లికాపండమరాల
పాండురపిండితస్ఫారదేహంబు" పు. 672 ప్ర సం.

ఇందు యమకము తోపాటు గమకమును కలదు "యమకంబు గమకంబు యతిగతి ............ వరకవుల్ గొనియాడ వర్ణన కెక్క ధరఁజెప్పఁ గృతియు సుదృత్కృతి" అని సోమనాథుని అభిప్రాయము. (పు18–20 ప్ర సం.)

పండితారాధ్య చరిత్రలోని పర్వత ప్రకరణము క్షేత్రమాహాత్మ్యప్రతిపాదక గ్రంథప్రాయము పౌరాణిక ప్రతిపత్తి తోపాటు స్థానిక ప్రకృతి చిత్రణమును కలదు.

" ...... శ్రీశైల మంతయు దివ్య
లింగస్వరూపమై లీల వెలుంగె
నికృతాత్ములకు శిలానికరమై తోచు
సుకృతాత్ములకు లింగనికరమైతోచు" పు 244.

శ్రీశైల క్షేత్రమునకు చిత్రమైన పరికల్పనము కలదు.

"నాల్గు దిక్కులయందు నాల్గు వాకిళ్ళు
నాల్గు గోణముల నిర్మాలును ద్రిద్దు
సుకరమై యినుమడి సొరసగండ్లు
మకరతోరణము లిమ్మడి వాని కనంగ
నగములు వెలములు నదులు ఓర్ధంబు
లగు కుండములును మహాస్థానములును
దివ్యలింగములు జ్యోతిర్లింగములు
భవ్యమై పరగు ... ... ..." పు 251–252.

నాలుగు వాకిళ్ళకు చతుర్ద్వారములని నామాంతరము. ప్రాచ్యద్వారము త్రిపురాంతక క్షేత్రము. పశ్చిమద్వారము బ్రహ్మేశ్వర క్షేత్రము. ఉత్తర ద్వారము మహేశ్వరక్షేత్రము. దక్షిణద్వారము సిద్ధవటక్షేత్రము (పు.283) శిలాదుని పుత్రుడైన శ్రీపర్వతుడు,

"పర్వతాకార మగుర్వ్యాగాఁ దాల్చి
యుండెద నీవు నా యుత్తమాంగమున
నుండవె ... ... ..." పు 262.

అని ప్రార్థింప శివుడు అంగీకరించెను. శ్రీపర్వతుడు శ్రీపర్వతమగును. అదే శ్రీశైలము. అచట "శిఖరదర్శనమాత్ర సిద్ధించు ముక్తి." (పు 279) శ్రీశైలము మల్లికార్జునదేవుని క్షేత్రము. మల్లికార్జున శివలింగము స్వయంభూలింగము. చంద్రగుప్తుని తనయ చంద్రవతి గానమునకు మెచ్చి, శివుడు వరము కోరుమనిన,

"నీ మౌళియందు సమేళనంబుగను
ప్రేమం బెలర్ప నర్పించినయట్టి
యీ మల్లికాదామ మెల్లగాలంబు
నీ మౌళియందు సమ్మిళితమై యుండ
వయసేయుఁ డనుచుఁ జంద్రవతి వేడుటయు" పు 285.

శివుడు చంద్రవతి అర్పించిన మల్లికాదామమును జాహ్నవీచంద్రమధ్యమున అలంకరించుకొనెను. ఆ మల్లికాదామము" అర్జునకాంతిఁ జెల్వగుట శ్రీమల్లికార్జునుం డను నామమయ్యె"ను. (పు 286)

శ్రీశైలక్షేత్రములోని హాటకేశ్వరము, పాపవినాశనము, వరాహేశ్వరము, పన్నగేశ్వరము, సారంగేశ్వరము, సిద్ధేశ్వరము (పు 292) వృషభపురము, కన్యా

సిద్ధనాథభవనము (పు 301) నక్షత్ర పర్వతము (పు 399) పాతాళగంగ (పు410) బిల్వవనము, దీపవృక్షము (పు 170) మల్లికార్జునాలయము, మంటపము, శిఖరేశ్వరము, ఇష్టకామేశ్వరము, కర్మహరేశ్వరము, బల్లహుమరము, (పు 473) చతుర్ద్వార బిలము, వృషభబిలము, ఖేచరబిలము పాపబిలము (పు 487) మొదలైన స్థానిక విశేషముల తోపాటు, చతుర్ద్వారక్షేత్రములలోని స్థానిక విశేషములును పండితారాధ్య చరిత్రయందు గ్రంథస్థములైనవి

ఇన్ని విశేషములు గ్రంథస్థములైనను, భ్రమరాంబ పేరు గాని, గుడి గాని, పండితారాధ్య చరిత్రయందు గ్రంథస్థము కాలేదు. మత్స్యపురాణమునందును భ్రమరాంబ పేరు వాఢిక కలదు. (13శ్లో. 31అ.) శ్రీశైలఖండమునందు, శివానందలహరియందును భ్రమరాంబ ప్రసక్తి కలదు. శివానందలహరి శంకరాచార్య కృతమని విశ్వాసము అది నిజమైనచో తత్పూర్వగ్రంథమైన మత్స్యపురాణమునందు, తదర్వాచీనగ్రంథమైన పండితారాధ్యచరిత్రయందును భ్రమరాంబ పేరు లేకపోవుట సంగతము కాదు శివానందలహరి, శ్రీశైలఖండము పండితారాధ్యచరిత్ర తర్వాతి గ్రంథములు కావచ్చును. శ్రీనాథుని కాశీఖండమునందు భ్రమరాంబ ప్రసక్తి కలదు కాశీఖండరచనాకాలమైన పదునైదవ శతాబ్ది పూర్వము, బహుశః పదునాల్గవ శతాబ్దిని వాఢిక స్థానమున భ్రమరాంబ వెలయుట సంభవము ఇది పండితారాధ్య చరిత్ర రచనాకాలము పదమూడవశతాబ్ది అనుటకు సాధకము.

ఆంధ్ర తమిళ కర్ణాట మహారాష్ట్రదేశముల వారు యాత్రమేగాక, మాళవ, కాశ్మీర, మాగధ, సింధు, గౌళ, తురుష్క, కొంకణ, శూరసేన, బంగాళ, కాంభోజ, ఘూర్జర, కళింగ, బర్బర, సింహళ, కరహాటసౌ రాష్ట్రలాటదేశముల వారును ఆనాడు శ్రీశైల యాత్రికులే (పు. 391)

శివరాత్రి నాడు శ్రీశైలక్షేత్రమునందు నూతనవస్త్రమండపము కట్టి, అరటి బోదెల ప్రోక ప్రాకుల ద్వారములు నిర్మించి, కంబుకట్లు మేలుకట్లు అలంకరించి, గంటలు పతాకలు తగిలించి, ఫలపుష్పములు పక్వాన్నములు సమర్పించెడి వారు. (పు 419–421) అకులు, మొగ్గలు, ముర్యాలు మొదలైన వానితో ముగ్గులు పెట్టెడి వారు. భక్తులకు మంచిగంధము, పన్నీరు, కస్తూరి, చాందు సమ్మార్జనము చేసెడి వారు మల్లికార్జునదేవునికై సంతతధారాసహస్ర కలశాభిషేకములు, ఆగమోక్త ప్రకారమైన అష్టవిధార్చనములు చేసెడివారు.(పు429) శ్రీశత రుద్రాదికళశాధికగ్రంథములు పారాయణము చేసెడివారు. (పు 431–433) ఉప్పాట, లెడయాట, చిందు,

కోడంగియాట, భ్రమరములు, సాళెములు, జయకములు, పంచాంసి మొదలైన ఆటలాడెడివారు. (పు 434–435) నాటకములు, బహురూపములు, వెడ్డంగములు, దొమ్మరాటలు, బొమ్మలాటలు, ప్రచ్ఛన్నవేషములు ప్రదర్శించెడివారు. (పు 436–439.) నలుబదిరెండు రకముల వీణలు వాయించెడువారు (పు 442–444) నూటయెనిమిది రాగములు పాడెడివారు (పు 452–455) భరతనాట్యములు ప్రదర్శించెడివారు (పు 437–442) ఆ యీ వివరములెల్ల అచ్చుగ్రుద్దినట్లు అభివర్ణించిన పర్వతప్రకరణము పండితారాధ్యచరిత్రకు మకుటాయమానము

భట్టబాణుడు రెండు చేతులు ఖండించుకొని, శివుని అర్చించి మఱల చేతులు పడసినట్లు (396 ప) బాణమయూరకాళిదాసాదిమహాపురుషులు శివుని గొలిచి దృష్ట ప్రత్యయవరములు పొందిరని (445 ప) మల్లికార్జునపండితుని శివతత్త్వసారమునందు కలదు. అట్టిది మయూరుడు సూర్యశతకము చెప్పగా సూర్యుడు ప్రత్యక్షమై, వెలికుష్ఠు పోగొట్టి లోనికుష్ఠు పోవుటకు శివుని నుతింపుమనగా మయూరుడు మయూరస్తవము చేయ లోనికుష్ఠు హరించెనని, అది చోద్యమని భట్టబాణుడు రెండుచేతులు ఖండించుకొని శివునిపై గద్య చెప్పగా రెండు చేతులు వచ్చెనని; అది మహాచోద్యమని కాళిదాసు వెంటనే రెండు కన్నులు పెకలించుకొని శివునిపై గద్య చెప్పగా రెండు కన్నులు వచ్చెనని అట్లు బహుపర్యాయములు చేసెనని మహిమప్రకరణమునందు కలదు (పు 105–107) ఇది నిమిత్తముగ బాణగద్య, మయూరగద్య, కాళిదాసగద్య యథార్థములని అనుపలబ్ధములని ఒక అభిప్రాయము కలదు.[70] మయూరుడు సూర్యశతకము చెప్పుటవలననే అతని కుష్ఠవ్యాధి నిర్మూలమయ్యెనని ప్రసిద్ధమైన ఐతిహ్యము అంతేకాదు. బాణమయూరకాళిదాసులు సమకాలికులుకారు. ఒకరిని చూచి ఒకరు చేతులు ఖండించుకొనుట, కన్నులుపెకలించుకొనుట అసంభవము బాణమయూరకాళిదాసుల గద్యరచనమునకు ప్రమాణాంతరము కానరాదు. కాబట్టి యథార్థముకాదు; కథార్థమే

## పండితారాధ్యోదాహరణము

ఇది నూతనముగ లభించినది. ప్రకటింపబడినది[71] ఉదాహరణము చివఱ పాల్కురికి సోమనాథుని కృతిగ పద్యము కలదు.

"ఆరూఢాంచితలింగజంగమకృపాయత్తప్రసాదోదయా
పారోక్తిఁ జను నీ యుదాహరణమున్ బాల్కుర్కి సోముండు లో
కారాధ్యుండగు మల్లికార్జునున కిట్లర్పించె సద్భక్తి నిం
పారంగాఁ బఠియించినన్ వినినఁ గామ్యార్థం బిలన్ జేకుఱున్." 30

ఇందు "మల్లికార్జునున కిట్లర్పించె" అని ఉండుటవలన పండితారాధ్యోదాహరణము మల్లికార్జునపండితునికి అంకితము కూడ అగును.

ఉదాహరణమునకు ముందు రెండు శ్లోకములు, రెండు పద్యములును కలవు. అవి పండితారాధ్యుని ప్రశంసించునవి పద్యములందు మొదటిది మాలిని. తర్వాతిది శార్దూలము. మల్లికార్జునపండితుని "తవిలి ... భజింతున్ ... తద్దయుం బ్రస్తుతింతున్," "కామింతున్ నుతియింతుఁ గొల్తుఁ దలఁతున్" అని ఉపక్రమణము. ప్రథమావిభక్తిపద్యముతో ప్రారంభమగునది ఉదాహరణము. అది శార్దూలము. శ్రీకారముతో ప్రారంభమైనది. అన్ని విభక్తులందును, సార్వవిభక్తికపద్యము నందును పద్యములు శార్దూలములే. ప్రథమాద్వితీయావిభక్తుల కళికలు మధురగతిరగడలు తృతీయాచతుర్థీపంచమీవిభక్తుల కళికలు ద్విరదగతిరగడలు. షష్ఠీవిభక్తి కళిక తురగవల్గనరగడ సప్తమీవిభక్తి కళిక మజల మధురగతిరగడ సంబోధన ప్రథమావిభక్తి కళిక మజల తురగవల్గనరగడ కళికలందు ప్రతిపాదాంతమునందు విభక్తిప్రత్యయము కలదు. ఉత్కళికలందు చివటి రెండు పాదములందును విభక్తిప్రత్యయములు కలవు.

మల్లికార్జునపండితుని వీరమాహేశ్వరాచారము [8], మహిమాన్విత పాండిత్యము [9], భక్తిసమ్యక్-జ్ఞానాశ్రయణము [11], శివతత్త్వసారాదిగద్య పద్యనవ్యకావ్యరచనము (12, 21), మొదలైనవాని తోపాటు, పండితారాధ్య చరిత్రలో ప్రపంచితమైన మల్లికార్జునపండితావతరణము [7], మహాదేవయ్య పాద సంధానము [10], శైవదీక్షాసమర్థనము [13], జంగమారాధనము [19], ఊర్ధ్వ నేత్రలాభకథనము [19], వెలనాటిచోడనాశనము [20], ఉదయావనీశనాశనము [23], శివాధిక్యనిరూపణము [22] మొదలైన బహువిశేషములు పండితారాధ్యోదాహరణమునందు ప్రసక్తమైనవి.

## కన్నడకృతులు

చెన్నబసవరగడ, శరణబసవరగడ, సద్గురురగడ కన్నడకృతులని పూర్వోక్తము. అక్షరాంకపద్యములును కన్నడపద్యములే. అకారాద్యనుక్రమణికను పద

ములు ప్రయోగించిన పద్యములివి ముప్పదియారు కలవు. ముప్పదియారు పద్యము లందును ముప్పది నాలుగు పద్యములు చంపకమాలలు. రెండు పద్యములు మాత్రము ఉత్పలమాలలు అన్ని పద్యములందును ప్రాసము కలదు. ఒక్క పద్య ములోను నాలుగుపాదములందును అక్షరమైత్రియతి లేదు. ఎనిమిది పద్యము లందు ఒక్కొక్క పాదమున, ఏడ పద్యములందు రెండేసి పాదముల మాత్రమే కలిసివచ్చును. అది యాదృచ్ఛికము కాని, బుద్ధిపూర్వకము కాదు అంతేకాదు. అక్షరాంకపద్యములకు ఆద్యంతము లందు కన్నడపద్యములు కలవు.

అది : "శ్రీయుతనమశ్శివాయే
త్యాయతపంచాక్షరీప్రణవసంభూత
స్వాయత్తభావ అక్షర
కాయస్థనె నింపొగక్వెనాన్ బసవెశా!"

అంతము : "ఇతి భావన్నక్షరసం
స్తుతి సంకలితాక్షరాంకితస్తోత్ర వుమా
పతి నిమ గర్పిసిదెం స
త్కృతియిం పాల్కురికి సోమకృతి బసవేశా!"

ఆద్యంతముల కన్నడపద్యములనుబట్టి, అక్షరమైత్రియతి లేని పద్యములను బట్టి అక్షరాంకపద్యములు కన్నడపద్యములే.

బసవలింగనామావళి ఆద్యంతములందు కన్నడపద్యగద్యములుండుట మాత్రమేగాక, నామావళి అంతట కన్నడభాషయే కలదు. కన్నడకృతియే.

శీలసంపాదన లభించినది అయిదు మాటలు. అయిదు మాటలును కన్నడభాషయే.

"అన్యదైవభజనెయం బిడువుదు;
జాతిసూతక, జననసూతక, రజస్సూతక,
ప్రేతసూతక గళం కళెవుదు."

కన్నడభాష కల శీలసంపాదన కన్నడకృతియే. శివసహస్రగణనామ ప్రకటించిన జాడ కానరాదు.

## సంస్కృతకృతులు

పంచప్రకారగద్య, నమస్కారగద్య, అక్షరాంకగద్య ఆంధ్రకృతులని ఒక అభిప్రాయము కలదు[72] సంస్కృతభాషానిబద్ధమైన తెనుగు కృతులని మఱొక అభిప్రాయము కలదు.[73] తెనుగు కృతులు సంస్కృతభాషానిబద్ధమనుట చింత్యము. పంచప్రకారగద్యయందు అయిదు విధములైన రచనము కలదు. మొదటి విధమునందు ఉత్కళికలక్షణము, రెండు మూడు విధములందు మధురగతిరగడలక్షణము, నాల్గవ విధమునందు ద్విరదగతిరగడ లక్షణము, అయిదవ విధమునందు మధురగతిరగడ లక్షణము, అయిదువిధములందును వాక్యాంతములు హ్రస్వాంతసంబోధనములును; నమస్కారగద్యయందు ప్రాసము కలవుగావున, తెనుగు కృతులని పై అభిప్రాయములు వెలువడినవి కాని, పంచప్రకారగద్యలోని మొదటి విధమునందు ఉదాహరణకావ్యము లోని ఉత్కళిక లక్షణము లేదు ఉత్కళికాప్రాయమనెడు సంస్కృతగద్యభేదలక్షణము కలదు. మిగిలిన విధములందు రగడ లక్షణములు సరిపడినను, రగడ కేవలము తెలుగు ఛందస్సు కాదు కన్నడఛందస్సు కూడ హ్రస్వాంతసంబోధనములు, ప్లుతాంతసంబోధనములును సంస్కృత కర్ణాటాంధ్రభాషలకు సమానము. ప్రాసము తెలుగు ఛందోలక్షణమే కాదు, కన్నడఛందోలక్షణమును. తెలుగు, కన్నడకవుల సంస్కృతరచనములందు ప్రాసము అభ్యాసవశమున యాదృచ్ఛికము కావచ్చును కాబట్టి పంచప్రకారగద్య, నమస్కారగద్య, అక్షరాంకగద్య తెనుగు కృతులు కావలసిన అవశ్యకము లేదు మూడు గద్యల అద్యంతములందును సంస్కృతశ్లోకములు కలవు. నమస్కారగద్యలోని ప్రతివాక్యము సంస్కృతచతుర్థీవిభక్త్యంతము కాబట్టి సంస్కృతకృతులే.

పంచప్రకారగద్యలోని పంచప్రకారములు ·

౧

" –నిరాకుల నిరర్గళ నిరతిశయనిజభక్తితాత్పర్య
శరణగణచరణారవిందమకరందధారాభిషేకసంగతమంగళా
లంకారవిరచితోత్తమాంగ– "

౨

"అపి చ మహామహిమోన్నతవిభవా–
భవపాశోత్కరశాతలవిత్రా–
విత్రాసితబిజ్జలధరణీశా–

౩

"జయజయ నిరవధి నిర్మలగాత్రా—
జయజయ దురితలతాచయదాత్రా—"

౪

"జయ దురితపరిహరణ—జయ సుకృతపరిచరణ
జయ నికృతరనిరిరణ—జయ సుకవినుతికలిత

౫

"జయ శివరంజన—జయ భవభంజన
జయ కరుణాకర—జయ పరధికర"

**నమస్కారగద్య:**

"అపి చ శ్రీ ప్రమథేంద్రాయనమో,
వృపగతహృద్గతతాంద్రాయనమః"

**అక్షరాంకగద్య :**

"అపి చ శివశృంగార ఓం ఆదిపదవిస్తార ఓం
ఇహపరసుఖాధార ఓం ఈక్షణత్రయదూర ఓం"

అక్షరాంకగద్య అకారాదిక్షకారాంతమైన అక్షమాలిక అని, బసవాక్షరగద్య అని గద్యాంత శ్లోకమునందు కలదు

బసవోదాహరణము, బసవపంచరత్నములు, వృషభాష్టకము త్రివిధలింగాష్టకము సమగ్రముగ లభించిన కృతులు. బసవాష్టకము, అష్టోత్తరశతనామగద్యము అసమగ్రముగ కతిపయభాగములు మాత్రమే లభించిన సంస్కృతకృతులు. రుద్రభాష్యము అనుపలబ్ధమైన సంస్కృతగ్రంథము సోమనాథభాష్యమున ముపలబ్ధమైన సంస్కృతగ్రంథము. అందు—ప్రమథమాహాత్మ్యము, విభూతిరుద్రాక్ష, లింగధారణ మహాత్మ్యములు, లింగార్చనావిధి, లింగార్చన, పాదోదక, ప్రసాద, వీరశైవ, వీరమాహేశ్వరాచార, ఇతరదేవతాత్యాగ, నమస్కారాదిపత్యమాహాత్మ్యములు,నారాయణోపనిషదర్థ నిర్ణయము, ఊర్ధ్వశంఖ పుండ్రనిరసనము, సర్వదేవతా చనకత్వము, ఏకాత్మవాదనిరసనము ద్విమూర్తివాదనిరసనము, అష్టమూర్తివాదనిరసనము కర్మవాద నిరసనము, భగవచ్ఛబ్దనిరసనము మొదలైనవి శ్రుతిస్మృతిపురాణేతిహాసప్ర

మాణపూర్వకముగ పంచవింశతిప్రకరణముల ప్రతిపాదితము సోమనాథభాష్యము పాలకుఱికె సోమనాథవైదగ్ధ్యమునకు వైజయంతి

## ద్విపదకావ్యము

పాలకుఱికి సోమనాథుడు మూడు భాషలందు ముప్పదిగ్రంథములు రచించినను, తెలుగు భాషలోని బసవపురాణము, పండితారాధ్యచరిత్ర, వృషాధిపశతకము మాత్రమే కావ్యములు అందు బసవపురాణము, పండితారాధ్యచరిత్ర ద్విపద కావ్యములు ద్విపదచ్ఛందస్సులో మాత్రమే రచించినవి ద్విపదకావ్యములు. ద్విపద చ్ఛందస్సు ప్రాథమికమైన దేశీయచ్ఛందస్సు. అది కూడ గేయములందు మాత్రమే అనాడు కలదు అట్టిచో కేవలము ద్విపదచ్ఛందస్సున మాత్రమే రచించిన కావ్యమును, అందున నన్నయ భారతము సంస్కృతాంధ్రచ్ఛందస్సుల, పద్యగద్యముల సమాహారకల్పనమైన చంపూకావ్యముగ అవతరించిన తదుపరి ఆదరించుట సుకరము కాదు. అది పాలకుఱికె సోమనాథునికె అవగతమే. అందుకు,

> కూర్చెద ద్విపదలు గోర్కి దైవాఱ
> దెలుఁగు మాట లనంగవలదు; వేదముల
> కొలఁదియ కాఁజూడుఁ దీల నెట్టులనినఁ
> బాఱు తూమునకును బాటి యౌనేని
> బాటింప సోలయుఁ బాఱియ కాదె" 168 – 172ప. 1ఆ.

అని బసవపురాణమునందు పాలకుఱికె సోమనాథుని విన్నపము. అంతేకాదు.

> "ఇప్పుడు ద్విపద కావ్యోక్తి నా వలవ(దు)" పు. 18 ప్ర. సం.

> " .. ... ...కావ్యప్రౌఢి పేర్మి
> నెట్టణ రచియింప నేర్చినఁ జాలు
> నుపమింప గద్యపద్యోదాత్తకృతులు
> ద్విపదయు సమము ... ... ... " పు. 18 ప్ర. సం.

> "పటుగద్యపద్యప్రబంధసామ్యముగఁ
> గావ్యకళాప్రౌఢిఁ గల్పింతు, ద్విపద
> కావ్యంబు భావ్యంబుగాన ... ... " పు. 20 ప్ర. సం.

"తిక్కన సూక్తుల ద్విపద రచింతు
నదియును గా కైహికాముష్మికద్వి
పదహేతువగుట ద్విపద నాఁగ బరగు"

అని పండితారాధ్యచరిత్రయందు పాలకుఱికె సోమనాథుని పునఃపునరుద్ఘాటనము.

ఇందు ద్విపద వెదము కొలది అనుట, ఐహికాముష్మికద్విపద హేతువనుట నాటి ద్విపదకావ్యానాదరణమును వ్యక్తము సేయును. అయినను పాలకుఱికె సోమనాథుడు రెండు ద్విపదకావ్యములు రచించుట మాత్రమేగాక, శతాధిక ద్విపదకావ్యముల రచనకు మార్గదర్శి అయ్యెను

"జాతులు మాత్రాసు సంధానగణవి
నీతులు గాన 'యనియతిగణై' ర
నియమున, 'ప్రాసోవా' యనియు 'యతిర్వా' య
నియుఁ జెప్పు ఛందోవినిహితోక్తి గాన
ప్రాసమైనను యతిపై వడియైన
వేసిగా నిలిపి యాదిప్రాసనియతి
దప్పకుండఁగ ద్విపదలు రచియింతు" పు 18. ప్ర. సం.

అని పూర్వలక్షణమును పునరుద్ధరించెను. అది ద్విపదకావ్యకర్తలకు ఆదర్శము. ద్విపద ద్వివిధము ప్రాస కలది ప్రాసద్విపద లేనిది మంజరీద్విపద. పాలకుఱికె సోమనాథుని బసవ పురాణము, పండితారాధ్య చరిత్ర రెండును ప్రాస ద్విపదకావ్యములే

ద్విపదకావ్యములైనను బసవపురాణము, పండితారాధ్యచరిత్ర సంస్కృత భాషలోనికి అనువదింపఁబడినది సంస్కృతబసవపురాణము బాదరాయణ మహర్షి కృతముగ కలదు [74] సంస్కృతపండితారాధ్యచరిత్ర గురురాజ కవికృతము.[75] బసపపురాణము కన్నడ భాషలోనికి అనువదింపఁబడినది అది భీమకవి కృతము.[76] పండితారాధ్యచరిత్రను శ్రీనాథుడు పద్యగద్యోభయకావ్యముగ పరివర్తనము చేసెను. కాని ఉపలబ్ధము కాలేదు. బసవపురాణమును పిడుపర్తి సోమనాథుడు పద్యగద్యోభయకావ్యముగ పరివర్తనము చేసెను. ఉపలబ్ధమైనది అందు,

"సరవి శ్రీనాథుఁ డా చరిత పద్యప్రబం
ధము చేసె ద్విపదలు తఱుచు నిలిపి"

అని కలదు. పిడుపర్తి సోమనాథుడును బసవపురాణమునందు పాలకుఱికి సోమనాథుని ద్విపదలు తఱుచుగ నిలిపెను. ఇది పాలకుఱికి సోమనాథుని ద్విపదల విశిష్టతకు నిదర్శనము. ద్విపద కావ్యములు పద్యకావ్యములగుటకు హేతువు ప్రామఖ్యము పద్యకావ్యములు ద్విపద కావ్యములగుటకు కారణము ప్రాచుర్యము. పద్యకావ్యములన పద్యగద్యోభయ కావ్యములే చంపూకావ్యములు. ద్విపదకావ్యము నిర్వచనకావ్యము

## జానుతెనుగు

తేటతెనుగు అను మాట ప్రసిద్ధము. జానుతెనుగు అను మాట అంత ప్రసిద్ధము కాదు అంతేకాదు తేటతెనుగులోని 'తేట' స్పష్టము. జాను తెనుగులోని 'జాను' క్లిష్టము జానుశబ్దము జాణశబ్దమునకు రూపాంతరమని ఒక అభిప్రాయము.[77] జానుతెనుగుశబ్దము కన్నడభాషలోని జాణ్ణుడి శబ్దమునకు సమానాంతరమని మఱొక అభిప్రాయము[78] అవి జానుశబ్దప్రయోగములకు అనుకూలములు కావు

"ఏ నతిపాపభావమును నెగ్గుఁ దలంపక యుండునట్లుగా
నానతవైరి నీ యడుగు లంటఁగ నోపుదు నట్టిదైన న
న్నీ నలినాప్తుఁ డీ యనలు డీ మృగలాంఛనుఁ డీ సురోత్తముల్
జాను సెడంగ నీ క్షణమ చంపరె కోపపరీతచిత్తులై."

21పద్య 2ఆ. ఆర.ప.

అని నన్నయ ప్రయోగము నలుడు "అన్యాపేక్షం బునస్స్వయంవరంబు రచియించుట యిది కులస్త్రీ ధర్మంబు కాదు" అన్నప్పుడు దమయంతి ఇచ్చిన సమాధానము. ఇందు తనకు అన్యాపేక్ష లేదని, కలదేని సూర్యచంద్రాగ్నులు సురోత్తములు జాను చెడగా కోపపరీత చిత్తులై వెంటనే చంపియుందురని కలదు. చంపియుండుటకు హేతువు జానుచెడుట= ఒప్పుచెడుట= తప్పగుట. జాను శబ్దమునకు ఒప్పని అర్థము ఈ అర్థమున పాలకుఱికి సోమనాథుని ప్రయోగములే బహుళముగ కలవు.

"ప్రాణదానము సేయఁ బరుల వశంబె ?
యేణాంకధరునకు నిల నరుదన్న
జానొందఁగ మునిఁడి చౌడయ్య ప్రాణ
దానంబు సేసెఁ "జిత్రము స్చిత్ర" మనుచు."

1067-70 పం. 5ఆ. బ.పు.

"... ... బసవనదండనాయకుని
జానొంద సత్కృతిస్వామిఁ గాంచి" పు 4. ప్ర సం పం చ
"కాన లింగార్చనకంటె నుత్తమము
జానొందఁ గావించు జంగమార్చనయు" పు 20 ప్ర సం. పం చ.
జ్ఞానమే నాభులను జలకుంభములను
జానొందఁ బ్రవృద్ధమౌ శశి దోచుఁగాక
కలఁగిన జలములఁ గలదె శశియు ?' పు 570 ప్ర. సం పం చ.
—"కాన, శ్రేయోభరాకాంక్షఁ బొదిచి
జానొందఁ గ్రియలమైఁ జరియింపఁదేని
సవిరళ నిరతిశయంబగు పరమ
శివయోగసంపదసిద్ధింతు నెట్లు? పు 572 ప్ర.సం పం.చ.
"జానొంప నవలి పంచప్రాణములు—
లో నవలక్ష తెలుంగు, వీసెనె" పు 415 ద్వి సం.పం చ.

ఇందు జానొంప అనగా ఒప్పగు పొంప అని అర్థము. నన్నయ ప్రయోగమునందు, పాలకుఱికి సోమనాథుని ప్రయోగములందును జానుశబ్దమునకు ఒప్పనియే అర్థము కాఁబట్టి జానుతెనుఁగు అనగా ఒప్పునట్టి తెనుఁగు అని శబ్దతః అర్థము వచ్చును

జానుతెనుగు అను మాటను పాలకుఱికి సోమనాథుడు మొదట బసవపురాణమునందు, పిదప వృషాధిపశతకమునందు, తుదను పండితారాధ్యచరిత్రయందును ప్రయోగించెను బసవపురాణ, పండితారాధ్యచరిత్రలందు సవివరణము. వృషాధిప శతకమునందు సోదాహరణము. ఆ సందర్భములివి:

"ఉరుతరగద్యపద్యోక్తులకంటె
సరసమై పరఁగిన జానుఁదెనుంగు
చర్చింపఁగా సర్వసామాన్యమగుటఁ
గూర్చెద ద్విపదలు గోర్కెదైవాఱ. 165-168పం.1ఆ.బ.పు.
"పలుపొడ తోలుచీరయును బాపసరుల్ గిలుపాఱు కన్ను వె
న్నెల తల చేఁదుకుత్తుకయు నిండిన వేలుపుటేఱు పల్లుపూ
సలు గల జేని వెంకవని జానుఁదెనుంగున విన్నవించెదన్
వలపు మదిన్ దలిర్ప బసవా బసవా బసవా వృషాధిపా!" 63ప.వృ.శ.

"ఒప్పదు ద్విపద కావ్యోక్తి నా వలవ
దారూఢగద్యపద్యాదిప్రబంధ
పూరితసంస్కృతభూయిష్ఠరచన
మానుగా సర్వసామాన్యంబు గామి
జానుతెనుఁగు విశేషము ప్రసన్నతకు" పు.18.ప్ర సం పం.చ.

ఇందు బసవపురాణ, పండితారాధ్యచరిత్రలందు జానుతెనుఁగునకు ద్విపద రచనకు పరస్పరసంబంధము కలదు వృషాధిపశతకమునందు జానుతెనుగునకు శతకరచనకు పరస్పరసంబంధము లేదు భాషాభేదప్రదర్శనమే

వృషాధిపశతకములోని పద్యమునందు "పలుపొడ" మొదలు "లెంకనని" పదకుమాత్రమేగాక, "దిస్నిరించెదరో వలపు మదిం దలిర్ప" అనునది కూడ జాను తెనుగు మకుటములోని వృషాధిపశబ్దము గాక పద్యమునందు మఱొక సంస్కృత సమము లేదు. సంస్కృతసమేతరమైన భాష అచ్చతెనుఁగు కాఁబట్టి జానుతెనుగు అనగా అచ్చతెనుఁగని వృషాధిపశతకమునుబట్టి అర్థము వచ్చును. అది ఒప్పునట్టి తెనుగు కాదు. అంతేకాదు బసవపురాణములోని ద్విపదలందు, జానుతెనుగు ఉరు తరమైన గద్యపద్యోక్తులకంటె సరసమని, సర్వసామాన్యమని, కావునద్విపదలు రచింతునని కలదు ఉరుతరమన ప్రౌఢతరము సరసమన సరళము సర్వసామా న్యమన సర్వసుబోధకము. కాఁబట్టి జానుతెనుగు అనగా ప్రౌఢతరము కాని, సరళమైన, సర్వసుబోధకమైన భాష అని, అది ద్విపదరచనకు అనుగుణమని బసవపురాణమునుబట్టి అర్థము వచ్చును. పండితారాధ్యచరిత్రలోని ద్విపదలందు జానుతెనుగు ప్రసన్నతకు విశేషమని, సంస్కృతభూయిష్ఠరచన సర్వసుబోధకము కాదని, జానుతెనుగు కాఁబట్టి ద్విపదకావ్యమును నిరసింపవలదని కలదు. కాఁబట్టి జానుతెనుగు అనగా ప్రసాదగుణపరాయణమైన, సంస్కృతభూయిష్ఠరచన కాని, సర్వసుబోధకమైన భాష అని పండితారాధ్యచరిత్రనుబట్టి అర్థము వచ్చును. వృషా ధిపశతకపద్యములోని భాష అచ్చతెనుగే కాని; బసవపురాణ, పండితారాధ్యచరిత్ర లలోని భాష అచ్చతెనుగు కాదు ప్రాధాన్యవివక్షను సంస్కృతభూయిష్ఠరచన కాదు సంస్కృతోట్టంకనస్థలములందును తెలుగు భాష సర్వసుబోధకము. అంతే కాదు. ఒప్పునట్టి తెనుగు భాష.

వృషాధిపశతకపద్యములోని, బసవపురాణములోని, పండితారాధ్యచరిత్రలోని భాష జాను తెనుగనిపాలకుఱికె సోమనాథుని ప్రతిపాదనము జానుతెనుగు అనగా

అచ్చతెను గనుటకు బసవపురాణ, పండితారాధ్యచరిత్రలు బాధకములు జాను తెనుగు అనగా ప్రౌఢతరము కాని, సంస్కృతభూయిష్ఠరచన కాని, సరళమైన ప్రసన్నమైన తెనుగనిన వృషాధిపశతకమును సాధకము.

"తేటతెనుంగున ద్విపద రచింతు" పు 15 ప్రసం.

అని కూడ పాలకురికి సోమనాథుని స్పష్టప్రతిపాదనము. కాబట్టి జాను తెనుగు అనగా తేటతెనుగు అని స్పష్టము. వృషాధిపశతకపద్యములోని, బసవపురాణములోని, పండితారాధ్యచరిత్రలోని తెలుగుభాష తేటతెనుగే.

## చక్రపాణి రంగనాథుడు

చక్రపాణి రంగనాథుడు తెలుగు కవి. అయినను చక్రపాణి రంగనాథుని గురించి తెలుగు కవులు తెలిపినది తక్కువ. కన్నడకవులు తెలిపినది ఎక్కువ. తోంటదార్యుడు, సిద్ధనంజేశుడు అను కన్నడకవులు తెలిపిన చక్రపాణిరంగనాథుని కృతులివి.[77]

"వీరభద్రవిజయము, శరభలీల, శ్రీగిరినాథవిక్రమము అను పేర శ్రీశైల మల్లికార్జునునిపై నైదువందల సీసపద్యములును, ఎనిమిదివేల పద్యములు గల మఱొక గ్రంథమును, వెయి పాదములు గల దండకమును, నొక తారావళి, నాలుగు లయగ్రాహులును, నొక వృత్తశతకమును, వెయి దోధకవృత్తములును, నూఱు తోటకవృత్తములును, నేడు రగడలును, మూడువేల మత్తకోకిలలును, నాలుగువందల గీతపద్యములును, నెనిమిది పంచపదులును, నైనూఱు కందములును, ముప్పదియాఱు గద్యములును, ముప్పదియాఱు ఉభయశతకములును."

ఇది పాలకురికి సోమనాథుని కృతులకంటె అధికము. కాని చక్రపాణి రంగనాథుడు నష్టజాతకుడు. రెండు రగడలు మాత్రమే లభించినవి. మూడు పద్యములు సంకలనగ్రంథములందు, కతిపయతోటకవృత్తములు ఒక కందపాదము లక్షణగ్రంథములందు ఉదాహరింపబడినవి.

అనంతామాత్యుని భోజరాజీయమునందు (9 ప. 1 ఆ.) కొలని గోపరాజు సింహాసనద్వాత్రింశికయందు (12 ప 1 ఆ) పేర్కొనిన రంగనాథుడు చక్రపాణి రంగనాథుడే. కొలని గణపతిదేవుడు శివయోగసారమునందు పాలకురికి సోమనాథుని, చక్రపాణిరంగనాథుని కలిపి ఇట్లు స్తుతించెను.

"అసమశివభక్తిరసమున
వసునిం బాల్కురికి సోమనాథునిం గవితా
ఘనసమున్నతయశు సర్వజ్ఞ
ప్రసాదియును చక్రపాణిరంగను గొలుతున్"

ఇందు పాల్కురికి సోమనాథుడు అసమశివభక్తిరస వాసనుడు మాత్రమే. చక్రపాణి రంగనాథుడు కవితాఘనసమున్నతయశుడు సర్వజ్ఞప్రసాది కావున శివకవి రంగనాథరామాయణమునకు సంబంధించిన రంగనాథుడు చక్రపాణిరంగనాథుడు కాడు అచ్చపల్లి రంగనాథుడు. అర్వాచీనుడు [78]

చక్రపాణి రంగనాథుడు పాల్కురికి సోమనాథుని సమకాలికుడని ప్రతాపచరిత్ర ప్రభృతి తెలుగు గ్రంథములందు మాత్రమేగాక, రాంచెపాట్యుని సోమనాథపురాణము, సిద్ధనందేశుని గురురాజచరిత్రము అను కన్నడగ్రంథములందును కలదు [79]

చక్రపాణి రంగనాథుని ఉపలబ్ధకృతులు రెండు. 1 శివభక్తిదీపికరగడ, 2 శివమంత్రపర్ణసరగడ ఇందు శివభక్తిదీపికరగడకు నయనరగడ అని నామాంతరము అది నయనగతిరగడ అనుట ప్రామాదికము మధురగతిరగడ మొదలైన వాని వలె నయనగతిరగడ అను రగడభేదము లేదు. శివభక్తిదీపికరగడ నయన సంబంధి కావున నయనరగడ అయెన్,

"శ్రీపర్వతేశుఁ జూడక
పాపాత్ముఁడ నగుచుఁ బోవఁ బథమునఁ జిషన్
దీపించు వృష్టి తొలఁగెను
శ్రీపతి నను గాంచెఁ జెప్పె శివుఁ గర్తనుగాన్"

అను పద్యము కలదు. అంతేకాదు రగడలోని ప్రతిపాదాంతమునందు "కంటి" ననియో, "పొడగంటి" ననియో కలదు

చక్రపాణి రంగనాథుడు వైష్ణవుడు, పాల్కురికి సోమనాథునితోడి మత వివాదమున ఓడిపోయి, గ్రామాంతర నిర్జితుడై, వారలే శ్రీశైలమునందలి మల్లికార్జునదేవుని సందర్శింపచేయగా, అందువలన రంగనాథుడు శైవుడాయెనని, అహోబలమునకు వెళ్ళి నృసింహస్వామిని ప్రార్థింప, ఆ స్వామి శివాధిక్యమును బోధించెనని, అప్పుడు

జ్ఞానోదయమై శ్రీశైలము వెళ్ళి మల్లికార్జునదేవుని అర్చింప ఒక కన్ను వచ్చెననీ, పాలకురికి సోమనాథుని పాదముల మీద పడగా రెండవ కన్ను వచ్చెనని తొంటె దాసుని సోమనాథపురాణమునందు కలదు. చక్రపాణి రంగనాథుడు పాలకురికి సోమనాథునితోడి మతవివాదమునందు ఓడిపోయెనని సిద్ధనంజేశుని గురురాజ చరిత్రమునందును కలదు. ప్రతాపచరిత్రమునందు పాలకురికి సోమనాథునితోడి మతవివాదము లేదు గాని, త్రిపురాంతకదేవుని సందర్శింపనందున అంధత్వము వచ్చెనని, శ్రీరంగములోని రంగనాథదేవుని ఆదేశమున త్రిపురాంతకదేవుని వేడుకొన కన్నులు వచ్చెననీ, అప్పుడే శివభక్తిదీపికరగడ చెప్పెనని కలదు

పయి పద్యములోని శ్రీపతి, అహోబలక్షేత్రదైవమైన నృసింహస్వామిగను, శ్రీరంగక్షేత్రదైవమైన రంగనాథస్వామిగాను, "దీపించు దృష్టి తొలఁగుట" అనగా దృష్టిమాంద్యము పూర్తిఅంధత్వముగాను కథలు రచ్చకెక్కినవి. "కంటి"ని, "పొడ గంటి"ని అను ప్రతిపాదాంతపదములు పదములు పాడినవి.

అసలు చక్రపాణి రంగనాథుడు వైష్ణవుడే అగును. అతని పేరు, ఇంటి పేరును అందుకు నిదర్శనములే. అంతేగాక శివభక్తిదీపిక వ్రాతప్రతిలో చివర "వైష్ణవచక్రపాణిరంగనాథుడు శైవదీక్షాధారణమైన తర్వాతను చేసిన నయనరగళ" అని కలదు.[80] పాలకురికి సోమనాథునితోడి మతవివాదమున ఓడిపోయి వీర శైవుడైయుండును. నయనరగడయందు

"శ్రీశైలవల్లభుని శిఖరంబునఁ బొడగంటి"
అన్న వెంటనే
"కాశీపురాధీశు గౌరీశుఁ బొడగంటి"
అని మాత్రమేగాక అనంతరము,
"ధృతిఁ దూర్పు మొగసాల త్రిపురాంతకముఁ గంటి
బలు పశ్చిమద్వారబ్రహ్మేశ్వరముఁ గంటిఁ
జెలువొందు నుత్తరశ్రీమహేశ్వరుఁ గంటి
క్షితి లక్షకోట్లకును శివతీర్థములు గంటి
చతురొప్పఁ బదికోట్ల శక్తిరూపులఁ గంటి"

అని కూడ అనెను. పదికోట్లు, లక్షకోట్లు అతిశయోక్తులైనను అనేకశైవ క్షేత్రములు, శక్తిపీఠములు సందర్శించుట సంభవము. శివభక్తిదీపికయందు ఛంగ ంతరముగ విభూతి, రుద్రాక్ష, ప్రసాద, పాదోదక, శివభక్తమాహాత్మ్యములు ప్రసక్తమైనవి. అంతేకాదు.

"ఇకను నా మెత్తు కృతులిత్తునని పొడగంటి
నీకుఁ గృతుల్ చెప్ప నా కేమి భయమని కంటి
వడిఁ గృతుల్ నా మెత్తు వచ్చునని పొడగంటి
మృడుఁ డింక నా కృతుల్ మెచ్చునని పొడగంటి"

అని కూడ కలదు. త్రిగిరినాథవిక్రమాదికమైన వంచలాదిపద్యములేగాక, వెలాదిపద్యములు, ఇతరకృతులు దులాభారమున రంగనాథునివె సరిపోవుచున్నవియే.

శివమంత్రవర్ణసరగడకు సమశ్శివాయరగడ అను నామాంతరము కలదు. ప్రతిపాదముతుదను "సమశ్శివాయ" అని యుండుట తన్నిమిత్తము. రగడ అంతమున ఫలశ్రుతిపద్యమునందు శివమంత్రవర్ణసరగడ అష్టోత్తరశతమని కలదు.

"ఈ యష్టోత్తరశతము
బాయక పఠియించునతఁడు పరమానంద
శ్రీయుక్తుఁడు నై యుక్తుఁడు
ధీయుక్తుఁడునై తనర్చు దివ్యమహత్తన్."

అష్టోత్తరశతమన నూటయెనిమిది అష్టోత్తరమనఁబడిన శివమంత్రవర్ణసరగడ యందు నూటయెనిమిదిపాదము లుండవలయును కాని నూటరెండు పాదములె కలవు. ఆఱుపాదముల అభావము లేఖకప్రమాదము కావచ్చును

ఉదాహరణపద్యములందు రంగనాథుని పద్యముగ ఒక సీసపద్యము కలదు.

"ఓజుచే మెట్టక యొగ్గానఁ బట్టక
చక్కఁగా దివిఁ బాఱు చక్రములును
లాయానఁ గట్టక లవి మేఁత వెట్టక
వర్ణహీనంబైన వారువములు
తవనవెట్టక జీవితము కాసు ముట్టక
సత్త్వసంపద చూపు సారథియును
కడచీల దట్టక ఘనముగా మెట్టక
గంభీరసంపద గలుగు నిరుసు

గలిగి తనరారు నరదంబు గడఁక నెక్కి
త్రిపురవిజయంబుఁ జేకొన్న దేవదేవుఁ
డిందుశేఖరుఁ డానందమందిరుండు
మనలఁ గురుణావిధేయుఁడై మనుచుఁగాత."

గణపవరపు వేంకటకవి ప్రయోగరత్నాకరమునందు రంగనాథుని చిత్ర బిందాపరిణయము నుండి ఒక సీస పాదము ఉదాహరింపబడినది కాని, పరిణయ నామక ప్రబంధములు తెలుగునందు ప్రాచీనతరములు కావు. చిత్రబిందాపరిణయ కర్త వెలిచేటి రంగనాథుడు కావచ్చును.[82]

"ఇతడొక అలంకారగ్రంథమును వ్రాసినట్లున్నది" అని[83] ఉట్టంకించిన "రంగ నాథయపదంబు—"

"మంచెన కూడిలే శివప యాహితచిత్తులు పద్మవాసనా
కుంచన చంచమన్మిళితకోమలమూలసరోజకర్ణికా
ప్రాంచితకుండనాదసభవ్యనిరంతరశబ్దవల్లి శ్రీ
రించు తెలుంగు శ్రీగిరిజ రింపని మర్త్యనిలింపు లింపునన్"

ఇంపలి మంచెన పండితారాధ్యులలోని శివలెంక మంచెన పేరిటివాడు కావచ్చును. ఉపలబ్ధములైన శివభక్తదీపికలోని, శివమంత్రవర్ణనరగడ చక్రపాణి రంగనాథుడు. శివకవి లందరికు సమర్థులు.

# యథావాక్కుల అన్నమయ్య

యథావాక్కుల అన్నమయ్య కృతి సర్వేశ్వరశతకము. కృతిరచనాకాలము ను ప్రథమతః తెలిపిన కవి యథావాక్కుల అన్నమయ్యయే ఇంటిపేరు సార్థక మైనది.

"శాకాబ్దంబులు వార్ధిషట్కపురజిత్సంఖ్యం బ్రవర్తింప సు
శ్లోకానందకరంబుగా మహిమతో శోభిల్ల సర్వేశ్వర
ప్రాకామ్యస్తవ మొప్పఁజెప్పె శుభకృత్పుణ్యవ్యక్తవర్షంబునన్
శ్రీ కంఠార్పితమై వసుంధరపయిం జెన్నొంద సర్వేశ్వరా!" 130ప.

శుభకృత్—సంవత్సరము రచనాకాలమునకు శుభకృతము వార్ధి=4, షట్క=6, పురజిత్=11 "అంకానాం వామతో గతిః" అను సంప్రదాయమున 1164. శాలివాహనశకము. 78 కలిపిన క్రీస్తు శకము 1164+78=1242 కాబట్టి సర్వేశ్వరశతకరచనాకాలము యథావాక్కుగ 1242 వ సంవత్సరము.

సర్వేశ్వరశతకము ప్రతులందు పద్యసంఖ్య సమముగ లేదు పూర్వ ముద్రితప్రతులను రెండు వ్రాతప్రతులను సంప్రదించి 1919 వ సంవత్సరము

నందు ఆంధ్రసాహిత్య పరిషత్తువారు ప్రచురించిన ముద్రణమునందు 128 పద్యములు కలవు. పూర్వముద్రణములందు, తర్వాతి ముద్రణములందును 142 పద్యములు కలవు.[84] శతకపద్యసంఖ్య నూఱు లేక నూటయెనిమిది అగుట సాధారణము. నూటయేబది కాలేదని సంఖ్యానియమమును సరిపెట్టుకొనవలయును. అథవా, పాతిక, ముప్పది పద్యములు కాలాంతర సంక్రాంతములు కావలయును. 142 పద్యములందును "సర్వేశ్వరా" అను మకుటము కలదు. మకుటనియమము సుజిస్ధగితము. భక్తి శతకములకు అపరిహార్యమైన కవి ఆత్మానుభూతి శతకమునందు కలదు. మొట్టమొదటి పద్యమునందే "శ్రీకంఠం – బ్రణుతింతు నిన్ను మది నాహ్లాదింతు సర్వేశ్వరా" అని కలదు. శివుని ఆధిక్యము, "ఆజ్ఞాశక్తి, భక్త తీర్థ ప్రభావము, సద్భక్తుల మహిమ, శివపూజామహాత్మ్యము, శివయోగానందము, సద్భక్తి ప్రభావము, భక్తియోగము, చిత్తవశీకరణము, పంచాక్షరీ మహిమ" అను శీర్షికలకు[85] అనుగుణమైన పద్యములందును అన్నమయ్య స్వీయానుభూతి అంతర్లీనముగ కలదు అది బాహాటముగ ప్రకటించిన పద్యములును కలవు. అందు ఒక పద్యము :

"ఏ నిన్నే శరణందు బాంధవులు గానీ యెల్లవారుం బగే
కానీ మృత్యువు తల్లడించ పడనీ కాలుండు గీవెట్టనీ
నానాకర్మచయంబు గింజుకొననీ, నాకేమి నే రాజ నిం
తే నీ చాటున దాఁగియున్నపుడు భీతే యింక సర్వేశ్వరా!" 132 ప.

ఇది అన్నమయ్య స్వీయానుభూతి సంఖ్యానియమము సడలినను సర్వేశ్వర శతకము శతకలక్షణలక్షితమే.

సర్వేశ్వరశతకమునందు వీరశైవులకు పారాయణగ్రంథములైన మహిమ్న స్తవము, మల్హణము, అనామయము, హలాయుధములలోని శ్లోకముల అనుసరణములు కలవు.[86]

పుష్పదంతుడు రచించిన మహిమ్నస్తవములోని శ్లోకము :
"బహుళరజసే విశ్వోత్పత్తౌ భవాయ నమో నమో
జనసుఖకృతే సత్త్వోత్పత్తౌ మృడాయ నమో నమః
ప్రబలతమసే తత్సంహారే హరాయ నమో నమః
ప్రమహసిపదే నిస్త్రైగుణ్యే శివాయ నమోనమః" 31 శ్లో.

“భువనోత్పత్తి విధించుచో భవుఁడవై పొల్పొందఁగా దాని ను
త్సవలీలం బ్రకటించుచో మృడుఁడవై సర్వంబుఁ గల్పాంత భై
రవ సంబాధ సహించుచో హరుఁడవై త్రైగుణ్యశక్తిం దుదిన్
శివనామాంకముఁ దాల్చు నీ మహిమ దాఁ జిత్రంబు సర్వేశ్వరా!” 105ప

ఇదిగాక ఇంకను 9, 12, 14, 17, 13, 19, 92, 96 పద్యములును మహిమ్నస్తవములోని శ్లోకములకు అనుసరణములే

మల్లికార్జున రచించిన మల్హణములోని శ్లోకములు :

“బాలోఽపి సంస్మరణమాత్ర మచేతన స్తే
లింగం కరోతి హరపాంసుమయం వినోదాత్
లబ్ధ్వాస్తదేశధనధాన్యసమృద్ధిభాజి
రాజ్యం కరోతి హతకణ్టక మున్నతం చ.” 34 శ్లో.

“క్రీడాప్రపఞ్చనిరత శ్శిశవో భృవస్త
మారాధయన్తి ... ... ... ” 17 శ్లో.

“ఆడంబోయిన చోట బాలురు వినోదార్థంబు పాషాణముల్
గూడంబెట్టి శివాలయం బనుచుఁ బేర్కొన్నంతటంజేసి వా
రాడంబోయి సురాంగనాకలితదివ్యారామ చింతామణి
క్రీడాశైలవిహారులై వెలయుటల్ గీర్తింతు సర్వేశ్వరా!” 127ప.

దండి రచించిన అనామయములో శ్లోకము:

“యోగీ భోగీ విషభుగమృత శ్ఛత్రపాణి స్తపస్వీ
శాన్తః క్రూర శ్శమితవిషయ శ్శైలకన్యాసహాయః
భిక్షావృత్తిః భువనపతిః శుద్ధిమా నస్థిమాలీ
శక్యో జ్ఞాతుం కథమివ శివ త్వం విరుద్ధస్వభావః” 32శ్లో.

“సకలాధీశ్వరపట్టభద్రుఁడవు భిక్షాగామి వత్యంతశాం
తకశాత్ముండవు రౌద్రమూర్తి వతిసౌందర్యాంబికాసంగమా
ధికలోలుండవు దివ్యయోగివి మదిం దెల్లంబుగా నెట్టి వా
రికిఁ దా శక్యమె నీ నిజం బరసి చర్చింపంగ సర్వేశ్వరా!” 106ప.

ఇది గాక ఇంకను 87, 88, 134 పద్యములును ఇంచుమించు అనామయములోని శ్లోకములకు అనుసరణములే

హలాయుధుడు రచించిన హలాయుధములోని శ్లోకము:

"యత్రత్యాత్యం సకలభువనాశ్చర్యభూతం విభాతి
జ్యోతిర్లింగం కనక కపిశం శ్రీగిరౌ వ్యాప్ను దివ్యం
తత్పశ్యన్తః శివసుకృతినః స్త్యక్తసంసారబద్ధా
స్త్వత్కారుణ్యా చ్ఛ్రీరగణపదప్రాప్తి భాజో భవన్తి" 40శ్లో

"ధరణిం బ్రాక్తనభక్తసంస్తుతమహాస్థానంబులై యొప్పు శ్రీ
గిరిముఖ్యంబగు దివ్యతీర్థములు భక్తిం జూచిరే వారి దు
స్తరదోషంబులు వాయునన్న మది సాక్షాద్భక్తులం జూచినం
బరమార్థంబుగ బాయవే నరుల పాపంబెల్ల సర్వేశ్వరా!"

పయి శివస్తోత్రములలోని శ్లోకములకు మాత్రమేగాక మల్లికార్జునపండితుని శివతత్త్వసారములోని పాలకురికి సోమనాథుని కృతులలోని పద్యములకును యథా వాక్యముల అన్నమయ్య సర్వేశ్వరశతకమునందు అనుకరణములు కలవు.[87]

"ఏ దేశంబున నే పురి
నే దెస వసియించియుండు నిల శివభక్తుం
డా దేశంబున నా పురి
నా దెస వసియించియుండు-హరతీర్థంబుల్" 207 శి.త.సా.

"ఏ దేశంబున నే దిశాముఖమునం దే యూర నే వాడ మీ
పాదాభ్యర్చన నేయు నిర్మలుడు సద్భక్తుం డొకండుండె నా
యా దేశంబును నా దిశాముఖమును న్నా యూరు నా వాడ గం
గాదిస్నానసదీ ప్రవాహఫలదంబై యొప్పు సర్వేశ్వరా!" 119ప.స.శ.

"కులజకులహీను లిద్దఱు
నెలకొని భవదచలభక్తినిష్ఠావృత్తిన్
వెలసిన మీద సమానుల
కులజులు గులహీనులనగ గూడదు వారిన్ 124ప శి. త.సా.

"బలవంతుండును దుర్బలుండును మహాప్రౌఢుండు మూఢుండునుం
గులజుండుం గులహీనజాతుడు ఘనసాహ్రుండు శాంతాతిని
శ్చలచిత్తుండను నొక్క రూప మది నీ సద్భక్తి చిత్తంబులన్
పల వర్తిల్లిన మీద నే విధమునన్ భావింప సర్వేశ్వరా!" 61ప.స.శ.

ఇది గాక ఇంకను శివతత్త్వసారములోని 159, 162, 273 పద్యములకు వరుసగ సర్వేశ్వర శతకములోని 21, 101, 53 పద్యములును అనుసరణములు

"జంగమభక్తిలింగపరిచర్యల మిక్కిలి యుత్తమంబు త
జ్జంగమలింగపూజలవి సామ్యము సల్పుట మధ్యమంబు మున్
జంగమలింగపూజ యెడ సల్పక లింగముఁ గొల్చుచున్కి యె
ట్లంగఁ గనిష్ఠమౌట శరణప్రతిపత్తియె ముఖ్య మెమ్మెయిన్"
217 ప అ సా

"తమలింగార్చనకంటె జంగమము సౌందర్యంబుగాఁ గొల్చు టు
త్తమభక్తిస్థితి, లింగజంగములసత్సామ్యంబుగాఁ జేత మ
ధ్యమభక్తిస్థితి లింగపూజనధికుండై జంగమోపాసనా
సముఁడై యుండుట భక్తి యందది కనిష్ఠత్వంబు సర్వేశ్వరా!
129 ప స శ.

ఇది గాక అనుభవసారములోని 219 వ పద్యమునకు సర్వేశ్వరశతకము లోని 64వ పద్యమును అనుసరణము

"తలఁప "వేదాశ్చ శాస్త్రాణి" యనంగ
నిల "సుపమంత్రైరనేకధా" యనఁగ
తఱితఱి శ్రుతులు శాస్త్రములు మంత్రములు
నెఱి "పురస్తత్రైవనిర్గతా" యనఁగఁ
బరఁగుచు సకలశబ్దప్రపంచంబు
వరుస నట్లె "యథాశివస్తా" యనఁగ
నడఁగు జనించుఁ బంచాక్షరియందు" పు 147 ద్వి సం పం. చ.

"అమితోద్యద్భవదీయతత్త్వము మహీయస్స్తోత్రవాణీవిలా
సములై యొప్పు సమస్తవేదములు శాస్త్రశ్రేణియున్ దివ్యవి
భ్రమనాదంబులు నెన్ని చూడ నివి నీ పంచాక్షరీమంత్రభా
వములై యుండు సమస్తలక్షణములన్ వర్ణింప సర్వేశ్వరా!" 139 ప.

ఇందు వేదములకు "మహీయస్స్తోత్రవాణీవిలాసములై యొప్పు" అను విశేషణము వేదములకు కంటె మత్తేభపాదములకు ఆవశ్యకము. అంతేకాదు. "దివ్యవిభ్రమనాదంబులు" మంత్రములకు స్ఫోరకములైనను మత్తేభవృత్తమునకు కారక

ములు. ఇవి పాలకురికి సోమనాథుని ద్విపదలు అన్నమయ్యే మత్తేభవిక్రీడితమైనట్లు చాటును. కావున పాలకురికి సోమనాథుని పండితారాధ్యచరిత్ర 1242వ సంవత్సరము కంటె పూర్వగ్రంథము కావలయును. పండితారాధ్యచరిత్ర రచనాకాలము స్థూలముగ 1240 ప్రాంతమగును.

"అటుగాక యీ పుష్పమంతయు నొకఁడు
పటుభక్తి నీ పదాబ్జములపైఁ బూన్ప
మఱి పూర్వజన్మసహాధులు లేని
నెఱి ముక్తి గలిగించు నిజ మట్లుగాక" పు 490. ద్వి. సం. పం చ.

"ఒక పుష్పంబు భవత్పదద్వయముపై నొప్పంగ సద్భక్తిరం
జకుఁడై పెట్టిన పుణ్యమూర్తికిఁ బునర్జన్మంబు లేదన్నఁ బా
యక కాలత్రితయోపచారముల నిన్నర్చించుచున్ బెద్ద నై
ష్ఠికుఁడై యుండెడు వాఁడు నీ వగుట దాఁ జిత్రంబె సర్వేశ్వరా!"
88 ప. స. శ.

ఇది తాను పద్యము వ్రాసి వదలిన తాటాకు కృష్ణనీటిలో ఎదురురాక కొట్టుకొనిపోయిన, శిరస్సు ఖండించుకొందునని మెడలో గండకత్తెర పైచికొన్న అన్నమయ్యకు, "తరులంబువ్వుల" అను పద్యము వ్రాసిన తాటాకు కొట్టుకొనిపోగా, పసుల కాపరి తెచ్చియిచ్చిన తాటాకులోని పద్యమని ఒక ఐతిహ్యము కలదు. అగునో కాదోగాని, పాలకురికి సోమనాథుని పై ద్విపదలకు అనుకృతియే.

అన్నమయ్య ప్రభావమును అన్యకవులపై కలదు.

"ఏ యే వేళల నే వయస్సున నరుం డే భూమి నే యూరిలో
నే యే కర్మము నాచరించు నశుభం బేనిన్ శుభంబేనిఁ దా
నా యా వేళల నా వయస్సున నరుం డా భూమి నా యూరిలో
నా యా కర్మఫలంబు లెల్ల నగుఁ దథ్యం బింత సర్వేశ్వరా!"
126 ప. స. శ.

"ఏ యే వేళల నే సరోజముఖి యే యే లీలలం గోరుఁ దా
నా యా వేళల నా సరోజముఖి నా యా లీలలం దేల్చి యే
చాయం జూచినఁ దానయై మెలఁగుచున్ సౌఖ్యాబ్ధి నోలాడు భో
గాయత్తుండయి పెక్కురూపముల మాయాకల్పనాచాతురిన్."
40 ప. 1 ఆ. పారి.

ఇది నంది తిమ్మన పద్యము అది భక్తివిషయము. ఇది రక్తివిషయము అయినను ప్రతిబింబప్రాయము.

అన్నమయ్య కవితాగురువు దూదికొండ (దూదికంది) సోమేశ్వరారాధ్యుడు. అతడు పాలకుఱికె సోమనాథుడని, కాదని అభిప్రాయభేదములు కలవు[89] లీలా సంపన్నేశ్వరశతక మొకడు. అన్నమయ్యకృతమని, కాదని అభిప్రాయభేదములు కలవు.[90] ప్రత్యభిప్రాయములే సత్యసన్నిహితములు

# ఇతర కవులు

**శివదేవయ్య :** ఇతడు కాకతి గణపతిదేవచక్రవర్తికి, రుద్రమదేవికి మంత్రి అని ఒక అభిప్రాయము[91] ప్రతాపరుద్రుని రాజగురువు అని మఱొక అభిప్రాయము[92] వారి రాజ్యకాలము సుమారు నూటపాతిక సంవత్సరములు. (1198-1323) గణపతిదేవచక్రవర్తికి మంత్రి అయిన, ప్రతాపరుద్రుని మంత్రి అగుట నిరవకాశము. ప్రతాపరుద్రుని మంత్రి అయిన గణపతిదేవచక్రవర్తి మంత్రి అగుట నిరవకాశము ఎవరి మంత్రి అనుటకును చారిత్రికాధారము లేదు. ప్రతాప చరిత్ర మొదలైన అర్వాచీనగ్రంథములందు గణపతిదేవచక్రవర్తి మంత్రిగ కలదు. గణపతిదేవచక్రవర్తి మతగురువు, గోళకీమఠాపతి విశ్వేశ్వరదేశికులే శివదేవయ్య అని ఒక అభిప్రాయము కలదు[93] కాదని మఱొక అభిప్రాయము కలదు[94] కాదను అభిప్రాయమే సత్యసన్నిహితము.

మడికి సింగన సకలనీతిసమ్మతమునందు గ్రంథపట్టికను పురుషార్థసారము కలదు. [7వచ 1ఆ.] గ్రంథమునందు (1970) నలుబదియొక్క పద్యముల కడ— "పురుషార్థసారము" అని కలదు బాలబోధచ్ఛందస్సులోను, లక్షణశిరోమణి లోను పురుషార్థసారములోని పద్యములు కలవు 'శివదేవయ్య పురుషార్థసారములో' నను నుదాహరణము కల"దని ఒక అభిప్రాయము కలదు.[95] సకలనీతిసమ్మతములో గాని, ఛందము లేక బాలబోధచ్ఛందస్సు లేక సర్వలక్షణసారములో గాని, లక్షణ శిరోమణిలో గాని "శివదేవయ్య పురుషార్థసారములో" అని లేదు. అన్యత్ర మృగ్యము అది శివదేవయ్యకృతమైనను కావ్యగ్రంథము కాదు. రాజనీతిశాస్త్ర గ్రంథము

ఛందము, లేక బాలబోధచ్ఛందస్సు లేక సర్వలక్షణసారమునందు శివ దేవయ్య పద్యములని ఉదాహరింపబడినపద్యములు రెండుకలవు రెండు పద్యము

లందును "శివదేవధీమణీ" అను మకుటము కలదు. శతకము కావచ్చును. ఆ పద్యములివి.

"అరయఁగఁ జిన్నినాఁటి సిరియాళుఁడనై యెలప్రాయమందు సుం
దరుఁడను నంబినై పసను దప్పిన గుండయగారి చందమై
ధరఁ జరియింపఁ గొల్చెఁ దనువస్తు వృషాపతిపాకరూపదు
ష్పురజనసం దేమిటికిఁ గాలుపనే శివదేవధీమణీ"
"ప్రాణము నహో గఁహర్చి పల పావుఁ గదల్చి తదూర్ధ్వకీలితో
ద్రాణము నొత్తి మేను దృఢమై నిగుడం బిగియించి దృష్టులం
ఘోణము చేర్చి యా ప్రణవఘోషణమున్ విని యందు మానస
క్షీణము సేసినం బనసిద్ధుఁడనా శివదేవధీమణీ!"

ఇందు మొదటి పద్యములోని సిరియాళుడు, సుందరనంబి, గుండయ మహాశివభక్తులు వీరి వృత్తాంతములు శివతత్త్వసార, బసవపురాణ, పండితారాధ్య చరిత్రలందు కలవు రెండవ పద్యములోని యోగము శివయోగము శివయోగుల విషయమును శివతత్త్వసార, బసవపురాణ, పండితారాధ్యచరిత్ర, సర్వేశ్వరశతకము లందు కలదు పద్యములు రెండును శివకవియుగలక్షణలక్షితములే. శివదేవయ్యకు ధీమణివిశేషణము శతకకర్త యెన్నడనిపించును. ఇంతకు శతకము మొత్తము లభింపలేదు కర్తృనిర్ణయము కష్టము

**ప్రతాపరుద్రుడు :** మడికి సింగన సకలనీతిసమ్మతము నందు గ్రంథపట్టికను నీతిసారము కలదు [శివచ] గ్రంథమునందు నెబదియొక్క పద్యముల కడ "నీతిసారము" అని కలదు కర్తృనిర్దేశము లేదు. అయినను, నీతి సారమును మొదట కాకతీయరుద్రదేవుడు రచించినట్లు ప్రాచీనపద్యోదాహరణములు కలవు. ...... వీరమిత్రోదయాదిగ్రంథములలోని బృహస్పతిమతనీతియె మన నీతి సారపద్యములఁ గానవచ్చుచున్నందున రుద్రదేవుడు బార్హస్పత్యనీతిసారమునె తెనిఁగించెనని సందేహము గలుగుచున్నది" అని ఒక అభిప్రాయము కలదు.[96] కాని, నీతిశాస్త్రముక్తావళి వ్రాతప్రతిలోని పద్యమిది.[97]

"పరువడి నాంధ్రభాషఁ గల బద్దెననీతియు సంస్కృతంబుగాఁ
బరఁగఁ బ్రతాపరుద్రనరపాలునిచే రచియింపఁబడ్డ యా
నరవర నీతిసారము వినం జదువం గడు మంచిదంచుఁ జె
ప్పరఁగని నీతిపద్ధతుల చేసె వినోదము బాలబోధకున్."

ఇది ప్రశస్తమైనను ఇందలి విషయము సంక్షిప్తము. ఇందు ఎద్దెసనీతి ఆంధ్ర భాషలోను ప్రతాపరుద్రవసరపాలునిచే రచియింపబడ్డ నీతిసారము సంస్కృత భాషలోను కలవని ఇదమిత్థముగ కలదు. అనగా ప్రతాపరుద్రుని నీతిసారము సంస్కృత గ్రంథమని అవగాహనమగును. అయిన, సకలనీతిసమ్మతములోని నీతిసారపద్యములు ప్రతాపరుద్రుని నీతిసారశ్లోకములకు తెనుగుసేత లగును. తెనుగు చేసిన కవి ఎవరో తెలియదు. ప్రతాపరుద్రుడన మొదటి రుద్రదేవుడు కాడు రెండవ రుద్రదేవుడే తెనుగు నీతిసారము తదనంతరకృతి కావలయును.

## యుగ వైలక్షణ్యము

కవిత్వమునకు భాష, ఛందస్సు, ప్రక్రియ, వస్తువు, తత్త్వము రసవర్గులు. నన్నయ భాష సలక్షణము. సంస్కృతభూయిష్ఠము. శివకవుల భాష విలక్షణము; సంస్కృతభూయిష్ఠరచన కాదాచిత్కము జానుతెనుగురచన అనగా లేటతెనుగు రచన సార్వత్రికము అందు వ్యాకరణవిరుద్ధప్రయోగములు బహుళము నన్నయ ఛందస్సు వైవిధ్యసహితము శివకవుల ఛందస్సు గ్రంథపరముగ వైవిధ్యరహితము. నన్నయ ప్రక్రియ చంపూకావ్యము శివకవుల ప్రక్రియ నిర్వచనకావ్యము. నన్నయ వస్తువు భారతదేశసుప్రసిద్ధము శివకవుల వస్తువు ఆంధ్రతమిళకర్ణాటదేశ ప్రసిద్ధము. నన్నయ తత్త్వము బ్రాహ్మణమతము. శివకవుల తత్త్వము వీరశైవ మతము నన్నయ బ్రాహ్మణమతప్రబోధము రుచిరమైనది శివకవుల వీరశైవమత ప్రచారము ప్రచురమైనది. నన్నయ ప్రబోధమునందు స్వమతస్థాపనము గూఢముగ కలదు శివకవుల ప్రచారమునందు స్వమతస్థాపనము బాహాటముగ కలదు. పరమత నిరసనము పరమదుర్భరముగ కలదు నన్నయకు కవిత్వము ప్రధానము. మతము గౌణము. శివకవులకు మతము ముఖ్యము కవిత్వము ఔపచారికము "శివకవులు మతమునకు కవిత్వముచేత ఊడిగము చేయించిరి" అను మాట అక్షరసత్యము.[98]

### భాష

శివకవుల భాష వ్యాకరణవిరుద్ధమైనను, వ్యాకరణవిరుద్ధప్రయోగములు బహు విధము 1 అకారసంధి: తల్పుల+అంత=తల్పులంత. (బ[illegible] పం. 4 ఆ. ప. ప్ర) 2 ఇకారసంధి. [illegible]ంచి+ఉరగించె=[illegible]ంచురగించె (బ[illegible] పం 8 ఆ. ప. ప్ర.) 3 ఉకారసంధి పొందును+అనాథనాథ=పొందునినాథ (147ప శ.

త. సా) కొల్చును+ఉరగసంఘములు=కొల్చురగసంఘములు (2117 పం. 3 ఆ. బ పు) 4 సంబోధ నాంతసంధి. పతితి:+అర్ఘ్యపణ్యాయుష్ వట్టు=పతితర్ఘ్య పణ్యాయుష్ వట్టు (352 పం 5 ఆ. బ పు.) 5. అనుకరణసంధి తస్మాద్ద్రా హ్యామ్+అని=తస్మాద్ద్రాహ్యంబని (105 ప శి త సా) 6 ఋకారసంధి: కర్తృ+అనుసారి=కర్త్రానుసారి (పు 542, ప్ర. సం పం. చ) 7 ద్విత్వరాహి త్యము చిత్తము=చితము (206 ప శి. త సా) జొమ్మయ=జొమయ (361ప శి. త. సా.) నిక్కము=నికము (6౦, 134 ప అ సా) 8 ద్విత్వకల్పనము: తదీయము=తదియ్యము (1585-6 పం 4 ఆ బ పు) 9. పదమధ్యైత్వలోపము నడిమిరే=నడ్మిరె (101 ప అ సా.) కురియ=కుర్య (౩ 2 ప బ ఉ. 10 ప్రత్యయలోపము. మలహాయుడు=మలహాయు (415 ప శి త సా) తనువు= తను (474 ప. శి. త సా) 11 అపశబ్దములు: జాగరూకతనె=జాగరతనె (237 ప అ సా) అంబుజనేత్రి=అంబుజనేత్రి (321 పం 1 ఆ బ పు.) 12 అపసమాసము. మద్వ్యాక్షరికాసమూహి (83 ప వృ శ.) సద్భక్త సమూహి (1511పం 4ఆ బ. పు) మర్త్యసమూహి (12ప స.శ) భవన్మహదాజ్ఞ (పు644ద్వి సం పం. చ) భక్తమహాదాక్షాపం ౦(110 ప. స. శ.) 13 వైరిసమాస ములు: పిండకూడు (197 ప శి త సా) చర్మపుత్రాళ్ళు (302 ప. శి. త. సా.) దీపకంభంబులు (246 పం. 1 ఆ బ పు; పు 199. ప్ర సం పం. చ.) చౌద శాబ్దం ... (681 పం 1 ఆ బ పు) శివమునులు (1069 పం. 1 ఆ బ పు) ముల్లోకవంద్య (1204 పం 1ఆ బ. పు,) నిత్యనేమంబు (865 పం 2 ఆ బ పు.) పుడమిశ: (47 పం 3 ఆ బ. పు) సర్వాంగకచ్చడము [301 పం 3 ఆ బ. పు] భక్తకూటువలు [1231 పం 4 ఆ. బ పు] ధర్మకవిరె [2045 పం 4 ఆ. బ పు] అధమవాజులు [పు 131 ప్ర. సం పం. చ.] బిల్వపత్తిరి [పు 376. ప్ర సం పం చ] రుద్రాక్షపక్కెరల్ [పు 410 ప్ర సం. పం. చ.] పంచ వన్నియ ... [పు 156 ప్ర సం; పు 420 ద్వి. సం. పం చ] ఇత్యాదులు బహుశః ...

## ఛందస్సు

శివతత్త్వసారము కందపద్యమయము బసవపురాణము దీర్ఘ ద్విపదకావ్యము. వృషాధిపశతకము ఉత్పల మాల, చంపక మాలల సమాహారము. రెండింటికిని భేదము స్వల్పము— ఉత్పలమాలలోని ఆదిగురువును రెండు లఘువులు చేసిన చంపక మాల

అగును. చెన్నమల్లు సీసములు, చతుర్వేదసారము కేవలము సీసపద్యముల మూస కట్టులు. సహస్రగణమాలిక లఘుద్విపదగ్రంథము. పండితారాధ్యచరిత్ర సుదీర్ఘ ద్విపదకావ్యము గద్యలు గద్యలే రగడలు రగడలే సర్వేశ్వరశతకము శార్దూల మత్తేభముల సమూహము. ఈ రెండింటికిని భేదము స్వల్పము శార్దూలములోని ఆదిగురువును రెండు లఘువులు చేసిన మత్తేభమగును ఇట్లు శివకవులు భిన్నభిన్న చ్ఛందస్సులలో గ్రంథములు రచించినను, ఏ గ్రంథములోను ఛందోవైవిధ్యము లేదు. అనుభవసారము, బసవోదాహరణము, పండితారాధ్యోదాహరణమును ఎంతకు అప వాదములు ఒక గ్రంథము ఒకే ఛందస్సున రచించుట దోషము కాదుగాని, ఏక చ్ఛందోగానము విసుగు కలిగించును అందును దీర్ఘమైన, సుదీర్ఘమైన ద్విపద కావ్యముల పఠనము, శ్రవణము శ్రమాపాదకము.

అయినను ద్విపద, రగడ దేశీయచ్ఛందస్సులు. రగడ కన్నడ ఛందస్సు. అది కళిక పేర బసవోదాహరణ, పండితారాధ్యోదాహరణములందు ఛందోభేదముగ కలదు. తెలుగు కృతులైనచో బసవరగడ, శ్రీ బసవాద్యరగడ, గంగోత్పత్తిరగడ; తెలుగు కృతులైన శివభక్తిదీపికరగడ, సమశ్శివాయరగడ లఘుకావ్యములు. విన్న కోట పెద్దన కావ్యాలంకారచూడామణియందు రగడ కావ్యభేదముగ కలదు (40ప. 4 ఉ.) కారణము శివకవుల రగడలే కావచ్చును. కాని లక్షణభేదము కలదు ఇతర కావ్యములందు రగడ ఛందోభేదముగ ప్రథమతః శ్రీనాథుని కాశీఖండమునందే కలదు. (125 ప 6 ఆ). ద్విపద కేవలము తెలుగు ఛందస్సు. సంస్కృత ద్విపదీఛందస్సుకంటె భిన్నమైనది అది కావ్యభేదముగానే కలదుగాని, ఇతర కావ్య ములందు ఛందోభేదముగ మృగ్యము కారణము ద్విపద పరిణత రూపమైన తరు వోజ పద్యము కావలయును. ద్విపదకు యతిమైత్రి గాని, ప్రాసయతి గాని ఉండ వచ్చునను పూర్వ లక్షణము "ప్రాసోవా", "యతిర్వా" అని పండితారాధ్యచరిత్ర యందు కలదు బసవపురాణ, పండితారాధ్యచరిత్ర, సహస్రగణమాలికలందు యతిమైత్రి తోపాటు ప్రాసయతి కలదు ప్రాసము (ద్వితీయాక్షరము) కల ద్విపద ప్రాసద్విపద ప్రాసము లేని ద్విపద మంజరీద్విపది బసవపురాణ, పండితారాధ్య చరిత్ర, సహస్రగణమాలికలు ప్రాసద్విపదకావ్యములే. శివకవుల ప్రాసములును విలక్షణములే.

వ్యాఖ్యానము. కావున కావ్యనాటకాదులు సాహిత్యప్రక్రియలు. అనగా కావ్యభేదములు. అవి శ్రవ్యకావ్యములు, దృశ్యకావ్యములు అని, పద్యకావ్యములు గద్యకావ్యములు, పద్యగద్యోభయకావ్యములు అని;నిబద్ధకావ్యములు, అనిబద్ధకావ్యములు అని; మహాకావ్యములు క్షుద్రకావ్యములు అని అలంకారశాస్త్రములందు కలవు. అందు మహాకావ్యము అనగా గొప్ప కావ్యములని అర్థము కాదు. పెద్ద కావ్యములని మాత్రమే అర్థము క్షుద్రకావ్యము లనగా నీచకావ్యములని అర్థము కాదు చిన్న కావ్యములని మాత్రమే అర్థము. లఘుకావ్యములు అనె ఖండకావ్యములును. శతకములు, ఉదాహరణములు, గద్యలు, రగడలు, అనుభవసారము, సహస్రగణమాలిక, చెన్నమల్లు సీసములు, చతుర్వేదసారము లఘుకావ్యములు. శివతత్త్వసారము, బసవపురాణము, పండితారాధ్యచరిత్ర మహాకావ్యములు అవి, ఇవి పద్య కావ్యములు నిర్వచనకావ్యములు. శివతత్త్వసారము కందపద్యకావ్యము బసవ పురాణ, పండితారాధ్యచరిత్రలు ద్విపదకావ్యములు. అనంతరకాలములోని నిర్వచన కావ్యములకు శివకవుల నిర్వచనకావ్యములే, ఆద్యప్రకృతి ద్విపద కావ్యములకు, ఉదాహరణ కావ్యములకు పాలకురికి సోమనాథుని ద్విపదకావ్యములు, ఉదాహరణ కావ్యములును ఒజ్జబంతులు. ద్విపదకావ్యములు నిర్వచనకావ్యములు, మహాకావ్యములు, లఘుకావ్యములు అందును శతకములు, ఉదాహరణములు, రగడలు, శివ కవుల తెలుగు కృతులలోని ప్రక్రియాభేదములు గద్యలు, అష్టకములు, అష్టోత్తరశతములు శివకవుల సంస్కృతకృతులలోని ప్రక్రియాభేదములు.భాష్యము కావ్యభేద మైన ప్రక్రియ కాదు అక్షరాంకపద్యములు, నామావళి, రగడయు శివకవుల కన్నడ కృతులలోని ప్రక్రియాభేదములు. ఏవంవిధమైన ప్రక్రియావైవిధ్యమును శివకవియుగ వైలక్షణ్యమును ప్రకటించును.

## వస్తువు

వస్తువన ఇతివృత్తము. శివకవులు స్వీకరించు ఇతివృత్తము శివపరమే. శివేతరమైన ఇతివృత్తము శివకవులకు నిషిద్ధము. శివపరమైన ఇతివృత్తమును వీర శైవమతానుసారి వీరశైవమతానుసారమైన శివతత్త్వము, శివభక్తి, శివస్తుతి, వీరశైవ మతోద్ధారకుల, తన్మార్గదర్శకుల తదనుయాయుల మహిమాన్వితచరిత్రలు, స్తోత్రములు మాత్రమె శివకవుల వస్తుసంపద శివతత్త్వసారము వీరశైవమతానుసార మైన శివతత్త్వసారము అనుభవసార వీరశైవమతానుసారమైన శివభక్త్యనుభవ

సారము బసవపురాణము కన్నడదేశమునందు వీరశైవమతోద్ధారకుడైన బసవేశ్వరుని మహాశివభక్తుల మహిమాన్వితగాథాలహరి. వృషాధిపశతకము బసవేశ్వరస్తోత్రము. బసవోదాహరణము బసవేశ్వరస్తోత్రమే పండితారాధ్యచరిత్ర ఆంధ్రదేశమునందు వీరశైవమతోద్ధారకుడైన మల్లికార్జునపండితుని, మహాశివభక్తుల మహిమాన్వితగాథాలహరి పండితారాధ్యోదాహరణము మల్లికార్జునపండితస్తోత్రము శివభక్తిదీపికరగడ శివభక్తిదీపికయే శ్రీగిరిమల్లికార్జునశతకము శ్రీశైలమల్లికార్జునస్తోత్రము సమ్మక్కాయరగడ శివస్తోత్రము సర్వేశ్వరశతకము శివస్తోత్రము శివకవుల వస్తువు శివమయము.

బసవేశ్వరుడు కర్ణాటదేశీయుడు. మల్లికార్జునపండితుడు ఆంధ్రదేశీయుడు. మహాశివభక్తులు తమిళాంధ్రకర్ణాటదేశీయులు. అందఱును దక్షిణభారతదేశీయులు. యథార్థవ్యక్తులు. దక్షిణభారతదేశీయులైన– అందును మన ఆంధ్రదేశీయులైన యథార్థవ్యక్తుల–యథార్థజీవితచరిత్రలు కాకపోయినను, కథార్థజీవితచరిత్రలు శివకవుల వస్తుసంపద లగుట విశేషము. అంతేకాదు. శివకవుల కృతులు అనువాదములు కావు స్వతంత్రరచనలు. భాష, చందస్సు, ప్రక్రియ, వస్తువు దేశీయములైన శివకవుల కవిత దేశికవిత.

## తత్త్వము

శివకవుల తత్త్వము వీరశైవమతము స్వమతస్థాపనము తోపాటు పరమత నిరసనము సమధికము శివభక్తులు కానివారు భవిజనులని గర్హింతురు బ్రహ్మ, విష్ణువు శివభక్తులని, శివుడే పరమదైవమని గర్జింతురు ఇతరమతములు హీనమతములని వీరశైవమతమే ఉత్తమమతమని గర్వింతురు.

> "భవి జన్మాంతరసంస్కా
> రవశంబున సహజభక్తిరతి పుట్టి శివున్
> ధ్రువముగఁ బూజించు మహో
> త్సవునకు నీశ్వరుఁడు గురువు శాంభవదీక్షన్." 227ప శి.త.సా.

ఇందు శివుని పూజింపనివాడు భవి అను అర్థము ఇమిడియున్నది. భవము కలవాడు భవి. భవమన పుట్టుక. పుట్టుక లేని స్థితి ముక్తి అది శివభక్తునికే

సిద్ధించునని వీరశైవమతవిశ్వాసము. శాంభవదీక్షాస్వీకారము వీరశైవ లక్షణము వీరశైవుడు కానివాడు భవి అని ఫలితార్థము. అట్టి "భవియెడ రోతయును వలయు భక్తుల కెందున్" అని అనుభవసారమునందు కలదు. (58వ) "భవిజనసంభాషణ సంభావణాదిసంసర్గదూరగుడ" నని పాలకురికి సోమనాథుని ఆత్మప్రత్యయము (161–2పం 1ఆ.బ పు) అంతేకాదు "భవికృతారంభసంభవధాన్యవయ భవిని రీక్షణరసపాకవిశాన, భవిహస్తగతఫలపత్రశాకాది, భవిగృహక్షేత్రాంగ్రిమపథన వర్జితుడ, భవిజనదర్శనస్పర్శనాలాపవివిధదానాదానవిషయదూరగుడ" ని కూడ పాలకురికి సోమనాథుని ఆత్మప్రత్యయము. (15పు.ప్ర సం పం చ.) శివభక్తులు "భవిజనసమాదరణ సంభాషణాది సంసర్గవర్జితులు". (301–2పం.2ఆ.బ పు)

కమలాక్షకమలగర్భ
ప్రముఖాఖిలసురలు మునులుఁ బాశుపతులు –భ
స్మమయాంగజహరుద్రా
క్షమాలికాధరులు – " 56ప.శి త.సా.

ఇందు విష్ణువు, బ్రహ్మ పాశుపతులని, విభూతిరుద్రాక్షధారులని ఇదమిత్థముగ కలదు. శివుడు పశుపతి. శివభక్తులు పాశుపతులు శాంభవదీక్షావ్రతులు. బ్రహ్మ, విష్ణువు పరమాత్మ కారని జీవాత్ములని మల్లికార్జునపండితుని సిద్ధాంతము

"పరమాత్మ పరబ్రహ్మము
పరమేశ్వరుఁ డనఁగ హరియుఁ బ్రహ్మయును బరా
పరవిభులు గారు శాస్త్రము
లరయఁగ జీవాత్ములగుట నందఱు రుద్రా!" 89ప శి త.సా

హరునికే కాదు, "హరభక్తులకు ను న్నజాచ్యుతాదులు సరిగారు" [297–8వ 1ఆ బ.పు.] బ్రహ్మ, విష్ణువు శివుని "దక్షిణవామభాగాంగములను దొరఁగెడు ఘర్మబిందువులను బుట్టి" రట (పు311 ప్ర.సం.పం చ) "వికృతభాగవ తాదు లాది గావు విముక్తిమార్గంబులు గావు [పు330 ప్ర.సంపం.చ]

బ్రాహ్మణులు "బ్రాతిమాలలు" [537–8పం.1ఆ.బ పు.] "శ్రుతుల్ మోపరిగాడ్దలై మోవఁబడిన గార్దభవములు" [పు325. ప్ర.సం పం చ] వేదమతము

సిద్ధాంతమతము కాదు. [పు523–537 ప్ర సం.పం చ.] కర్మమార్గము శ్రీకంఠానుసారి [పు547–5ప్ర సం పం చ] అద్వైతులు "స్వేచ్ఛాచారులు మిథ్యావిచ్ఛేదన వేదశాస్త్రవిప్లవవాదుల్ ప్రచ్ఛన్నదోష లజ్జానాచ్ఛాదితదుష్టచిత్తులు" [505ప.శి.త.సా అద్వైతము ప్రచ్ఛన్నబౌద్ధము పరమనాస్తికము మాయావాదమతము విద్వద్విరుద్ధము [పు 553–560.ప్ర.సం పం.చ.] బౌద్ధులు పుణ్యహీనులు బౌద్ధము భువినిషిద్ధము" [పు585–590 ప్ర సం పం.చ] జైనులు పాశులు [624పం.6ఆ.బ.పు.] పసులు [1022 పం.6ఆ.బ వు.] జైనవాదము దుస్సమయము (పు590–603ప్ర.సం.ప.చ.) నిరీశ్వరసాంఖ్యము పరతత్త్వబోధానుపాదితము కాదు. (పు560–567–573ప్ర సం పం.చ.) యోగవాదము దురుక్తము– (పు 567–573ప్ర.సం పం.చ.)చార్వాకవాదము పాపమూలము [పు.573–575 ప్ర సం.పం చ )

"ఒక వైష్ణవుఁ డొక మీమాం
సకుఁ డొక బౌద్ధుండు నొక్క జైనుఁడుఁ ద్రిపురాం
తకు భక్తు నట్ల నిజసా
క్షిక దృష్టాంతప్రసిద్ధిఁ గీర్తనఁ గనిరే" 242ప.శి.త.సా.

ఇది శివుని ఆధిక్యము తోపాటు శివభక్తుని ఆధిక్యమునకు గేబురాయి.

"జినసమయస్థుల శిరములు దునిమి
మొనసి విష్ణుసమయుల ముక్కులు గోసి
యద్వైతులను హతాహతముగాఁ దోలి
విద్వేషవాదుల వీటితాటి మార్చి
చార్వాకవాదుల గర్వం బడంచి
సర్వేశు భక్తియే యుర్వి నిక్షించి" 1199–1204పం.6ఆ.బ.పు.

వీరశైవమతమునకు పట్టము కట్టుటయే శివకవుల తత్త్వము. శివకవియుగ వైలక్షణ్యము. శివపారమ్యము, శివభక్తి, మోక్షము పరమునకు సంబంధించినవి. ఇహమునకు సంబంధించి వీరశైవమతవిశేషము కులభేదరాహిత్యము.

"చెన్నఁడు మాలఁడు కాఁడే
యన్న మహాదేవుఁ గొలిచి ముక్తుం దయ్యెన్
జన్నమునఁ శివుని దక్షుఁడు
మన్నింపమిఁ జేసి పచ్చిమాలం డయ్యెన్" 427.ప. శి త సా.

" రా మొంపరఁ జని సూచిన
యా మాంసము నీకుఁ బెట్టె యతిశయభక్తిన్
వ్యామోహంబున నీ దయ
గా ముక్తికిఁ జనఁడె యెఱుక గన్నప్పఁడజా!" 424ప.శి.త.సా

" ఈ కుల మా కుల మనక ని
రాకులమతి వారి కొఱఁత లరయక భక్తా
నీకము శివుఁడని కొలిచినఁ
జేకొనఁడే వాంఛితార్థసిద్ధి మహాత్మా!" 180ప అ.సా.

"ఈ యగ్రగజన్ముల కెల్లను గురువు
బోయెతకును గాదె పుట్టె వ్యాసుండు
పూర్వద్విజాచార్యుఁడుర్వి వసిష్ఠుఁ
డూర్వశి యను లంజె కుదయించెఁ గాదె!
మాతంగుఁడనఁగ బ్రహ్మర్షి యొకండు
మాతంగికిని గాదె మహిఁ బ్రభవించె" 889–94పం.7ఆ బ పు.

"అంత్యజుఁ డంత్యజుఁ డనుచుఁ గుయ్యిడెద
రంత్యజునకుఁ జొర నది యెట్లు వచ్చు

××× ××× ×××

లింగసన్నిహితుల యంగణంబులను
లింగులు గాక మాదింగు లున్నారె?" పు126–7.ప్ర సం పం చ.

చాళుక్యచోళుల ద్వారమున తీరాంధ్రదేశమునందు తీర్థయాత్ర చేసిన వీర **శైవము, తెలింగాణమునందు** దండయాత్ర చేసినది. కాని రాజాదరము నందలేదు. **రాజాదరణ** నందిన శైవము పాశుపతశైవము కాఁగా ప్రజాదరమునందిన శైవము **వీరశైవము.**

# తిక్కన యుగము

## చారిత్రిక నైపథ్యము

చాళుక్యచోళుల కాలమున వెలనాటి చోడులు వెలసిరి తెలుగు చోడులు తేజరిల్లిరి. వెలనాటి చోడుల రాజధాని చందవోలు. తెలుగు చోడుల రాజధాని నెల్లూరు. నాడది విక్రమసింహపురము వెలనాటి చోడలు, తెలుగు చోళులు తమిళ చోళుల సామంతులు తమిళచోళరాజు రెండవ రాజరాజచోళుని కాలమున ముందు వెలనాటి చోడులు, తర్వాత తెలుగు చోళులు స్వతంత్రులయిరి[1]. కాని రెండవ రాజరాజచోళుని అనంతరము, తమిళచోళరాజైన కులోత్తుంగచోడుని కాలమున మరల సామంతులయిరి.[2] మూడవ కులోత్తుంగచోడుడు 1178 జూలైలో తమిళ చోళరాజయ్యెను.[3] అతని 31వ రాజ్యసంవత్సరమున అనగా 1178+31= 1209 వ సంవత్సరమున రామతీర్థదేవాలయములోని ఒక తమిళశాసనమునందు తిరుక్కాళత్తిదేవుడు నెల్లూరులో ఒక పేటయైన మనుమకేశ్వరపురములోని ఆలయదైవము మనుమకేశ్వర పెరుమాళ్లకు మండనాడిలోని ఈడప్పూరు దానము చేసినట్లు కలదు.[4] మూడవకులోత్తుంగచోడుని 31 వ రాజ్యసంవత్సరమున అనగా 1178+37 = 1215 వ సంవత్సరమున ఊటుకూరుశాసనమునందు తిరుక్కాళత్తిదేవుడు పరిపాలించుచున్నట్లు కలదు.[5] అతని శాసనములు చెంగల్పట్టు, నెల్లూరు జిల్లాలలోను; రాపూరు, కందుకూరు తాలూకాలలోను పెక్కులు కలవు.[6] అతని పేర శాసనములందు చోడతిక్కనృపతి, తిరుక్కాళత్తిదేవచోడమహారాజు, భుజబలవీరతిరుక్కాళత్తిదేవచోడమహారాజు అని కలదు [7] కాంచీపురములోని అరుళాళప్పెరుమాళ్ల ఆలయమునందును తిక్కనృపతి పేర దానశాసనము కలదు [8]

తిక్క నృపతి "శైశవలీలనాడు ... పృథ్వీశనరేంద్రు మస్తకము... కందుకకేళి సల్పి"నట్లు (32 ప.1అ) "కర్ణాటసోమేశు దుర్గమదోర్గర్వము రూపుమాపి ... చోళుని భూమిపై నిలిపి చోళస్థాపనాచార్యనామము" నందినట్లును (33ప.1అ.) తిక్కన ఉత్తరరామాయణమునందు కలదు. పృథ్వీశనరేంద్రుడన వెలనాటి చోడ రాజైన పృథ్వీశ్వరుడు. రాజ్యకాలము స్థూలముగ[9] 1160–1200 కర్ణాటసోమేశు

దన హొయసలరాజైన వీరసోమేశ్వరుడు. రాజ్యకాలము[10] 1233-1267. చోళదన మూడవకులోత్తుంగచోడని అనంతరము తమిళచోళరాజైన మూడవ రాజరాజ చోళుడు రాజ్యకాలము[11] 1246-1279 అతనికి పాండ్యరాజైన సుందరపాండ్యుని వలన, హొయసలరాజైన కర్ణాటవీరసోమేశ్వరునివలన, పల్లవరాజైన కుప్పంజింగ దేవునివలన ఉపద్రవము కలిగెను.[12] మూడవ కులోత్తుంగచోడుని అనంతరము స్వతంత్రుడైన తిక్కనృపతి అవి నివారించి చోళస్థాపనాచార్యుడయ్యెను.

తిక్కనృపతి "సేవణకటకసామంతుల గర్వమణఁచినట్లు, "ద్రవిడ మండలికు లందఱఁ దక్కనే"లినట్ల. "కర్ణాటవిభునహంకారంబు మాన్పం"చినట్లు, "పాండ్యునిచేతఁగప్పంబు గొని"నట్లు, సేఁవ మన్నీలను .. ఏలినట్లు, "వైరి పీఁచల నామలూర" నోడించినట్లు కేతన దశకుమారచరిత్రమునందును కలదు. (16ప. 1ఆ)

తిక్కభూపతి అరుళాళప్పెరుమాళ్ల దేవాలయములోని ఒక శాసనమున "ఎవ్వఁడు శ్రీవరదరాజస్వామి చరణసరోరుహములను బూజించుచున్నాఁడో అతఁడే నాకు తల్లియు, తండ్రియు, గురువును, ధనమును, పుత్త్రుఁడును, మిత్త్రుఁడును అగుచున్నాడు." అని ప్రకటించెను.[13] అనగా తిక్కభూపతి వైష్ణవమతావలంబి అని అవగాహనమగను " ఇతని కాలమున, ఇతని సంతతివారి కాలమునను వైష్ణవ మతము పాకనాడు, కమ్మనాడులలో విశేషముగా వ్యాపించినది అనేక విష్ణ్వాలయ ములు నెలకొల్పఁబడినవి. వానికి వసతు లేర్పఱుపఁబడినవి "[14]

తమిళచోళరాజైన మూడవరాజేంద్రచోళుని పదమూడవ సంవత్సరమున 1244-45+13 = 1257-58 వ సంవత్సరమున తిక్కనృపతి తనయుఁడు మనుమసిద్ధి తిరుకాళదేవమహారాజు పుణ్యముకొఱకు కోడూరు గ్రామమును దానము చేసినట్లు కడపమండలములోని నందలూరి తమిళశాసనమునందు కలదు.[15] తిక్కనృపతి రాజ్యకాలము[16] 1209-10-1249-50.

తిక్కనృపతి తండ్రి పేరు మనుమసిద్ధి. తనయుని పేరును మనుమసిద్ధి. తాత పేరు మనుమసి పేరైనది తిక్కనృపతి అనంతరము తనయుడైన మనుమసిద్ధి నెల్లూరు చోడరాజు ఇతని శాసనములు కాంచీపురము, నెల్లూరు జిల్లాలోని నెల్లూరు, గూడూరు, సూళూరుపేట తాలూకాలందు కలవు.[17] మనుమసిద్ధి మొదట మూడవ రాజేంద్రచోళుని సామంతుడు. తర్వాత స్వతంత్రుడు కడపట కాకతిగణపతిదేవ చక్రవర్తి సామంతుడు.[18]

మనుమసిద్ధి "ద్రవిడోర్వీపతి గర్వముం దునిమి"న "కర్ణాదర్పవిఘాతంబు నొనర్చి"న "విజయత్కాధీశ్వరుం గాసిగా నేపి"చినట్లు, (39ప.), "రక్కెసగం గనఁ బెండలంగ మై ధంగ మొనర్చి .. . నాఁచికొన్న రాజ్యాంగములెల్ల నిచ్చి ... గంగయసాహిణిం బదముఁ గైకొనఁ బం"చినట్లు (41 ప) "మహారాష్ట్రిసామంతు సారంగుం దోలి"నట్లు (43 ప. 1ఆ) తిక్కన ఉత్తరరామాయణమునందు కలదు. "వీరావర్గవిదారణక్రీడ సద్వ్రతనజగత్ర్పాణసుతుఁడనఁగ ...... వెలసె"నని కేతన దశకుమారచరిత్రమునందు కలదు విజయత్కాధీశ్వరుడు త్రిభువనమల్లచక్రవర్తిబిరుదాంకితుడైన విజయగండగోపాలదేవుడు కావచ్చును[19] అతని రాజ్యకాలము[20] 1250–1266 రక్కెసగంగన వైదుంబరాజైన తిక్కరసగంగ ఉరవు రక్కెసగంగ[21] గంగయ సాహిణి మొదట మనుమసిద్ధి సేనాధిపతి.[22] పిదప కాకతిగణపతిదేవచక్రవర్తి బాహత్తరనియోగాధిపతి[23] మహారాష్ట్రిసామంతుడైన సారంగుడు మహారాష్ట్రములోని కౌణనేశమునుండి వచ్చి, కాకతిగణపతిదేవచక్రవర్తి సామంతుడు, అద్దంకిసీమపాలకుడును అయిన సారంగపాణిదేవరాజే అగును.[24]

మనుమసిద్ధి మంత్రి తిక్కన అని కేతన దశకుమారచరిత్రమునందు కలదు. (20 వ చ) తిక్కనసోమయాజి కాకతిగణపతిదేవచక్రవర్తిని సందర్శించి, వేదాంతము రాజనీతి భారతయుద్ధపంచకము వివరించి, బౌద్ధజైనులను శాస్త్రార్థమున ఓడించి, జైనవసతులను త్రోయించి జైనులను చీల్చి చెండాడినట్లు, గణపతిదేవచక్రవర్తి మెచ్చి తిక్కన సోమయాజిని సత్కరించినట్లు, తిక్కన మనుమసిద్ధిని పదభ్రష్టుని చేసిన అక్కన, బయ్యనలను దండింపుమని కోరినట్లు, గణపతిదేవచక్రవర్తి అక్కన, బయ్యనలను సాధించి మనుమసిద్ధికి పట్టము కట్టినట్లు కాసె సర్వప్ప సిద్ధేశ్వరచరిత్రమునందు కలదు. (పుటలు 114–118) ఇందు తిక్కన సోమయాజులు జైనులను చీల్చి చెండాడుట, జైనవసతులను కూలగొట్టించుట చరిత్రకు సంవదించునది కాదు కాకతీయులు బౌద్ధజైనమతములను ఆదరించినట్లు శాసనప్రమాణములు కలవు–[25] కాని, నందలూరి తమిళశాసనమునందు" మనుమసిద్ధిరాజు కాకతీయగణపతిదేవునితో స్నేహము సంపాదింపవలయునని, కోరిక గలిగియున్నట్లు దెలుపఁబడియున్నది "[26] కావున మంత్రియైనతిక్కన వేదాంతము, రాజనీతి, సంస్కృతభారతయుద్ధపంచకము వివరించి, మనుమసిద్ధికి కాకతిగణపతిదేవచక్రవర్తికి సంధి చేయుట, మనుమసిద్ధి గణపతిదేవచక్రవర్తి సామంతుడగుట మాత్రమే చారిత్రక సత్యము నందలూరి తమిళశాసనము కాలము 1257 వ సంవత్సరము.[27] మనుమ

సిద్ధి గణపతిదేవచక్రవర్తి సామంతుడైన కాలము స్థూలముగ 1258 ప్రాంతము కావచ్చును. మనుమసిద్ధి రాజ్యకాలము[28] 1249–50–1263.

తిరుకాలప్పిభుడు అనగా తిరుకాళత్తిదేవచోడుడు అనగా తిక్కనృపతి కవి సార్వభౌముడని తిక్కన ఉత్తరరామాయణమునందు కలదు.

"సకలవిద్యాపవిత్రమముఁ దెల్పఁగ నేల
కవిసార్వభౌమాంక మవనిఁ జెల్ల" 35ప. 1ఆ.

సకలవిద్యాపవిత్రముడు, కవిసార్వభౌముడును అయిన తిక్కనృపతి ఆస్థానమున, పెద్దయామాత్యసుకవి ఉన్నట్లు జక్కన విక్రమార్కచరిత్రమునందు కలదు.

"సంస్కృతప్రాకృతశౌరసేన్యాదుల
ఘటికలో నొక శతకంబుఁ జెప్పఁ
బ్రహసనప్రకరణభాణాదిబహువిధ
రూపకంబులయందు రూఢి మెఱయఁ
జక్రచతుర్భద్రచతురుత్తరాధిక
క్షుద్రకావ్యములు పెక్కులు రచింప
నాంధ్రకవిత్వంబునందుఁ బ్రబంధంబు
మేలుగాఁ దద్‌జ్ఞులు మెచ్చఁ జెప్ప
నిమ్ముల నే రీతి నే ధాతువుల నేమి
రసమునకైన వర్ణనము సేయ
సరి యేకసంధా ద్విసంధా త్రిసంధలఁ
దొడరినఁ బొరిబోరిఁ గడవఁ జదువ
నెవ్వఁ డే యవధాన మెఱుఁగు నయ్యవధాన
మున వాని కెంచుక మిల్లుసూప
వృత్తకందముఁ గందవృత్తంబునుం జతు
ష్కందంబు మొదలుగాఁ గలుగు గర్భ
కావ్యవర్గముఁ జెప్పఁగా బ్రబంధంబులుఁ
గ్రొత్తలు పుట్టించుకొని లిఖింపఁ
గా; నక్షరచ్యుతకంబు మాత్రాచ్యుత
కంబు బంధచ్యుతకంబు నామ

గోప్యంబులుం గ్రియాగోప్యంబులును భావ
గోప్యంబులును జెప్ప, గోష్ఠియందుఁ
బద్యంబు గీతికార్ధబటి నాగిఁ జదువంగ
నెల్ల విద్యల సంచు తెఱుఁగ నేర్తు

ననుచు నెల్లూరు తిరుకాళమనుజవిభుని
సమ్ముఖమ్మున సాహిత్యసరణి మెఱసి
మహిమఁ గాంచిన పెద్దయామాత్యసుకవి
మనుమఁడవు నీవు నీ వంశమహిమ యొప్పు." 20 ప. 1 ఆ.

ఇందలి నెల్లూరు తిరుకాళమనుజవిభుడు నెల్లూరు తెలుగు చోడరాజు తిరుక్కాళత్తిదేవచోడమహారాజైన తిక్కనృపతియే, అతని సమ్ముఖమున పెద్దయామాత్యసుకవి సాహిత్యసరణి అంతగా మెఱసినది. అది జక్కన కాలమువఱకును నిలిచినది. సంస్కృతములోను, మహారాష్ట్రిప్రాకృతములోను, శౌరసేనీప్రాకృతములోను, ఇతరప్రాకృతములలోను; బహుశః తెలుగులోను ఘడియ కొక శతకము చెప్పిన; సంస్కృతమునందు వివిధరూపకములు రచించిన; క్షుద్రకావ్యములు పెక్కులు రచించిన; తెలుగులో ప్రబంధము- కావ్యము- వచించిన; ఏ రసమునసైన వర్ణనను చేసిన; ఏకసంథాగ్రాహి, ద్విసంథాగ్రాహి, త్రిసంథాగ్రాహి అయిన, అవధాన విద్యను అసహనుడైన; చిత్ర, బంధ, గర్భకవిత్వముల గండపగండడైన, సకల విద్యల లోతు లెఱిగిన పెద్దయామాత్యసుకవి సాహిత్యసరణిని సకలవిద్యాపరిశ్రముడు, కవిసార్వభౌముడును అయిన తిక్కనృపతి తన సమ్ముఖమునందు మెఱయఁజేయుట అతని కవితారసలోలుపతకు చిహ్నపతాక.

ఇట్టి తిక్కనృపతి తనయుడైన మనుమసిద్ధి వివిధవిద్యాపరిశ్రమవేది [4 ప. 1 ఆ] సూరిస్తోమారామవసంతుఁడు [1 ప 2 ఆ] పాండిత్యసుభగుఁడు [102 ప. 2 ఆ] కవిలోకవసంతుడు [120 ప 3 ఆ.] కవీంద్రమందారము [150 ప. 6 ఆ.] అని మాత్రమేగాక,

"ధరణిధరణదృప్యత్పార్థివార్థప్రకాండా
హరణపరిణతుం డుద్యద్గుణాత్యక్షితీంద్రా
భరణకరణగాథాపండితోద్యత్పదావి
స్ఫురణవరవరణనిత్యస్తుత్యలక్ష్మీకుఁ డుర్విన్." 163 ప 9 ఆ.

అని కూడ తిక్కన ఉత్తరరామాయణమునందు కలదు. ఇందు గుణాఢ్య, గాథాపండిత శబ్దములు హాలుని గుర్తునకు తెచ్చును. హాలుని వలె మనుమసిద్ధి కవి, కవిపండితపోషకుడు కావలయును. అందుకు మనుమసిద్ధి నిత్యస్తుత్యలక్ష్మీశుడు. తండ్రి చోడతిక్కనృపతి వలె తనయుడు మనుమసిద్ధి విష్ణుభక్తుడు. వైష్ణవ మతావలంబి.

> "అభినుతుఁడు మనుమభూవిభు
> సభఁ దెనుఁగున సంస్కృతమునఁ జతురుండై తా
> నుభయకవిమిత్రనామము
> త్రిభువనముల నెగడ మంత్రితిక్కఁడు దాల్చెన్" 92 ప 1 ఆ.

అని కేతన దశకుమారచరిత్రమునందు కలదు. మంత్రి తిక్కన కవి తిక్కన అగుట మఱింత విశేషము.

# తిక్కన

తిక్కన ఉభయకవిమిత్రుడు మాత్రమే కాదు, యుగకర్త. యుగకర్త యుగాదికవి కావలసిన అవశ్యకము లేదు. నూతనయుగస్థాపకుడు కావలయును. తిక్కన నూతనయుగస్థాపకుడైన యుగకర్త.

తిక్కన తాత మంత్రి భాస్కరుడు. అతడు సారకవితాభిరాముడు. గుంటూరివిభుడు. [12 ప 1 ఆ. ఉ. రా] గుంటూరివిభుడన గుంటూరి దండనాథుడగును. సారకవితాభిరాముడన "సాహిత్యవిద్యాపారీణుఁడు" [32 ప. 1 ఆ ద. కు చ.] మంత్రి భాస్కరుని తృతీయపుత్త్రుడు సిద్ధనామాత్యుడు. ఇతడు "స్థాపిత సూర్యవంశవసుధాపతి, సేనాపతి, చోడతిక్కజననాథశిఖామణి కాప్తమంత్రి" [62 ప 1 ఆ ద కు చ] చోడతిక్కనృపతి సూర్యవంశవసుధాపతియే. మంత్రి భాస్కరుని కనిష్ఠపుత్త్రుడు కొమ్మనమంత్రి. ఈతడు "గుంటూరివిభుఁడు ... దండనాథుండు" [11 వచ 1 ఆ ఏ ప మ. భా] గుంటూరి దండనాథుడైన కొమ్మన మంత్రి పుత్త్రుడైన తిక్కన, నెల్లూరి "మనుమసిద్ధిమహీవల్లభునకుఁ గరుణారస పాత్రంబై ... నిజకులక్రమాగతంబగు మంత్రిపదవియందు వర్తిల్లుచు ... ... రాచపదవులెల్లఁ బడసె"ను, [20 వచ. 21 ప 1 ఆ ద. కు చ.]

"ఏ నిన్ను మామ యనియెడు
దీనికిఁ దగ నిమ్ము భారతీకన్యక నీ
డైనను నను సద్గుణయుతు
భూనాయకు పల్కు చిత్తమున కింపగుడున్." ౭ప 1ఆ. ఉ. రా.

"సముత్సుకుఁడనైతి"నని తిక్కన, మనుమసిద్ధికి అంకితముగ ఉత్తరరామాయణమును రచించెను అందు వర్ణింపఁబడిన మనుమసిద్ధి యుద్ధ విజయములెల్ల 1251—1257 సంవత్సరముల మధ్య జరిగినవి మనుమసిద్ధి చరమకాలము 1263వ సంవత్సరము. కావున తిక్కన ఉత్తరరామాయణ రచనాకాలము స్థూలముగ 1260 ప్రాంతము కావలయును ఆ కాలమునందు,

"అమలోదాత్తమనీష నే నుభయకావ్యప్రౌఢిఁ బాటించు శి
ల్పమునం బారగుఁడం గళావిదుఁడ నాపస్తంభ సూత్రుండ గౌ
తమగోత్రుండ మహేశ్వరాంఘ్రికమల ధ్యానైక శీలుండ న
న్నమకుం గొమ్మన మంత్రికిన్ సుతుఁడ దిక్కాంకుండ సన్మాన్యుఁడన్."
13ప. 1ఆ.

అని తిక్కన అహంప్రత్యయము ఉభయ కావ్య ప్రౌఢి అనగా సంస్కృతాంధ్ర కావ్య ప్రౌఢి—పద్యగద్య కావ్యప్రౌఢి, దృశ్య శ్రవ్య కావ్య ప్రౌఢి కాదు. నన్నయ ఉభయభాషాకావ్యరచనాశోభితుడు. అనగా సంస్కృతాంధ్రకావ్యరచనాశోభితుడు తిక్కన ఉభయకవిమిత్రుడు. అనగా సంస్కృతాంధ్రకవిమిత్రుడు. అంతేకాదు తిక్కన "లలితనానాకావ్యములు చెప్పు నుభయభాషలయందు" (93ప 1ఆ.) నానాకావ్యములు కావ్యభేదములు. ఉభయకావ్యములు సంస్కృతాంధ్రభాషాకావ్యములే

## అవతారికా విశేషములు

తిక్కన ఉత్తరరామాయణము అవతారికయందు సాహిత్యవిమర్శ కలదు. అది దోషనిర్దేశమే కాదు; గుణోపదేశము కూడ. నన్నయ, శివకవియుగముల కవితాసువర్ణమునకు పరీక్షానికషము. ప్రతిపద్యము పరిశీలనార్హము.

"భూరివివేకచిత్తులకుఁ బోలునునం దలఁపన్ దళంబులన్
సౌరభమిచ్చు గంధవహు చందమునం బ్రకటంబు చేసి యిం
పారెడు పల్కులం బడయ నప్పలుకుల్ సరి గ్రుచ్చునట్లుగాఁ
జేరుప నేరఁగా వలయుఁ జేసెద నేఁ గృతి యున్నవారికిన్." ౮ప. 1ఆ.

మహావివేకులకు మాత్రమే సాధ్యమని భావించునట్లు, సుమదళముల సురభిళ మును గంధవహుడువలె విరజిమ్మవలయును ముత్యాలసరము గ్రుచ్చినట్లుగా పలుకులను కూర్చవలయును. ఇందు శబ్దసంయోజనసరణి, భావప్రకటన విధానము కలవు.

"పలుకుల పొందు లేక రసభంగము సేయుచుఁ బ్రాఁతవడ్డ మా
టలఁ దమ నేర్పు చూపి మొకటప్ హృదయం బలరింపలేక యే
పొలమును గాని యట్టి క్రమముం దమ మెచ్చుగ లోకమెల్ల న
వ్వులఁ బొరయం జరించు కుకవుల్ ధర దుర్విటులట్ల చూడఁగాన్"
6ప.

పలుకుల పొందు అనగా శబ్దసౌష్ఠవము లేనిచో రసభంగమగును. ప్రాతవడ్డ మాటలు ఎంత నేర్పుగా ప్రయోగించినను హృదయమును అలరింపలేవు. కారణము వాడుకనుండి వైదొలగిన మాటలు అరిగిపోయిన నాణెములు అర్థము కావు. నిఘంటు సంఘటితములైనను సద్యస్స్ఫూర్తి కలుగదు. హృదయము స్పందింపదు. ఏ పొలమునుగాని అనగా అవధులు లేని అనుక్రమము హాసజనకము హాసజనక మైనను లోకమును లెక్కసేయని కవులు కుకవులు ఇందు ప్రాతవడ్డమాటలు, అవధులులేని అనుక్రమములు పాలకుఱికె సోమనాథుని ద్విపదకావ్యములను జ్ఞప్తికి తెచ్చును. ఇది పాలకుఱికె సోమనాథునిపై తిక్కన పరోక్షవిమర్శ.

"తెలుఁగు కవిత్వము చెప్పం
దలఁచిన కవి యర్థమునకుఁ దగియుండెడు మా
టలు గొని వళులుం బ్రాసం
బులు నిలుపక యొగిని బలిమిపుచ్చుట చదురే."
7ప.

కవిత్వము చెప్పదలచిన కవి ఎవ్వరైనను అర్థమునకు తగిన శబ్దమును ఎన్నుకొని ప్రయోగింపవలయును. తెలుగు కవిత్వము చెప్పదలచిన కవి అర్థము నకు తగిన శబ్దమును ఎన్నుకొని ప్రయోగించుట మాత్రమేగాక యతిప్రాసలు పాటింపవలయును. సంస్కృతకవిత్వమునందు యతిస్థానమునకు ముందు పదాంత మగుటయే యతి కన్నడకవిత్వమునందును అది కూడ లేదు[29] సంస్కృతకవిత్వము నందు ప్రాసము లేదు. కన్నడ కవిత్వమునందు ప్రాసము కలదు. తమిళకవిత్వము నందు ప్రాసము లేదుగాని అక్షరమైత్రియతి కలదు[30] తమిళకవిత్వమునందు వలె అక్షరమైత్రియతి, కన్నడ కవిత్వమునందు వలె ప్రాసము తెలుగు కవిత్వమునందు కలవు. అట్టి యతిప్రాసలు తెలుగు కవులు పాటింపవలయును. తమిళప్రభావమున

ప్రాసము లేకుండ, కన్నడప్రభావమున అక్షరమైత్రియతి లేకుండ, అర్థమునకు తగిన శబ్దమును ఎన్నుకొనకుండ తెలుగు కవిత్వము చెప్పుట పులిమిపుచ్చుట అగును. ఇది సామాన్య విమర్శ.

"అలవడ సంస్కృతశబ్దము
తెలుఁగుబడి విశేషణంబు తెలుపడంగాఁ
బలుకునెడ లింగవచనం
బులు భేదింపమికి మెచ్చు బుధజనము కృతిన్" 8ప.

విశేష్యవిశేషణములు రెండును ఒకే లింగమునందు, ఒకే వచనమునందును ఉండుట సంస్కృతభాషాలక్షణము. భిన్నలింగములందు, భిన్నవచనములందును ఉండుట తెలుగుభాష లక్షణము. అయినను సంస్కృతశబ్దము, తెలుగు శబ్దము విశేష్యవిశేషణములైనచో సంస్కృతభాషాలక్షణానుసారముగ ఒకే లింగమున ఒకే వచనమున ఉండినచో పండితులు మెచ్చుకొందురని తిక్కన ఆశయము. అది నన్నయ భాషలో కనిపించదు శివకవుల భాషలో వెదుకవలయును. ఇ ప్రాధాన్య వివక్షను నన్నయ భాషకు తిక్కన మెచ్చికోలు.

"అని సత్కవీంద్రమార్గము
మనమున నెలకొల్పి సరసమధురవచోగుం
భనప్రసాదసంబో
ధనగోచరబహువిధార్థతాత్పర్యముగాన్—" 10ప.

ఇది తిక్కన మనస్సులోని సత్కవీంద్రమార్గము. అది సరసమధురవచోగుంభనము, ప్రసాదగుణము, సంబోధనగోచర బహువిధార్థతాత్పర్యము కలది. సంబోధనగోచరమన సంబోధనల గోచరించునది అనుట సామాన్యార్థము. సమ్యగ్బోధనమున గోచరించునది అనుట విశేషార్థము సరియైన బోధనము. లేనిచో కవిత్వములోని బహువిధార్థతాత్పర్యము గోచరించునది కాదని ఫలితార్థము. ఇది నన్నయ అక్షర రమ్యతను ప్రసన్నకథాకలితార్థయుక్తిని మూదలించునది. నన్నయ మార్గము సత్కవీంద్రమార్గమని తిక్కన సిద్ధాంతము

"జాత్యము గాని నొప్పయిన సంస్కృత మెయ్యెడఁ జొన్ప వాక్యసాం
గత్యము సేయుచో నయిన గద్యము తోడుగఁ జెప్పివెట్టి దౌ
ర్గత్యము దోఁప ప్రాసము ప్రకారము వేఱగు నక్షరంబులన్
శ్రుత్యనురూపమంచు నిడ నూపల పెర్విధ మింపుఁ జెంపదే." 14ప.

జాత్యము కాకపోవుటవలని సాధురూపమైనను సంస్కృతశబ్దమును ఎక్కడను చూర్చని అని తిక్కన మొదటి ప్రతిపాదనము సాధురూపమైనను సంస్కృత శబ్దము జాత్యము కావలయునని తిక్కన అభిప్రాయము. జాత్యమన జాతియందు పుట్టినది ఆంధ్రజాతి వ్యవహారమునందు ప్రసిద్ధమైనదని అర్థము వ్యవహారమన కేవలము నిత్యవ్యవహారము కాదు. సాహిత్యవ్యవహారము కూడ అప్రసిద్ధమైన సంస్కృతశబ్దమును ప్రయోగింపనని తిక్కన మొదటి ప్రతిపాదనమునకు సారాంశము కారణము "సంస్కృతభూయిష్ఠరచన సర్వసామాన్యంబు గామి" అను పాలకుఱికి సోమనాథుని బసవపురాణ, పండితారాధ్యచరిత్రలలోని ప్రత్యాఖ్యానమే కావలయును. సరసమై పరగిన, ప్రసన్నతకు విశేషమైన పాలకుఱికి సోమనాథుని జానుతెనుగు తిక్కనకు ఆమోదయోగ్యము.

రెండు వాక్యములు కలుపునప్పుడైనను, పద్యములకు తోడుగ గద్యను చెప్పి పద్యముల మధ్య పెట్టనని తిక్కన రెండవ ప్రతిపాదనము పూర్వ పద్యములలోని పూర్తి వాక్యమును, ఉత్తరపద్యములోని పూర్తివాక్యమును కలుపుటకు అంత, అయ్యవసరంబున వంటిఅందాపువచనములును రచింపనని తిక్కన రెండవ ప్రతిపాదనమునకు స్పష్టారము కారణము శివకవుల నిర్వచనకావ్యములే కావలయును.

"దౌర్గత్యము దోపం బ్రాసము ప్రకారము వెఱగు నక్షరంబులన్ శ్రుత్యను రూపమంచు నిడ"నని తిక్కన మూడవ ప్రతిపాదనము ఇది శాంతప్రాసవిషయ మనుట పరంపరాగతమైన అభిప్రాయము. "ఇవ్వసుమతి, సర్వజ్ఞ" అను ప్రాచీనలేఖనములోనివకారద్విత్వమునకు ప్రాసము ఘటించుటవలన శిగిలకప్రాసము. అదే శాంతప్రాసము ఇవ్వసుమతి, సర్వజ్ఞ అను లేఖనమున వకారద్విత్వములు "వెఱగు నక్షరములు" కావు ఇవ్వసుమతి, సర్వజ్ఞ అను లేఖనమున వకారద్విత్వము, రేఫసంయుక్తవకారము" వెఱగు నక్షరము లగునుగాని, అవి శ్రుత్యను రూపము కావు. సర్వజ్ఞ అను లేఖనమున వకారద్విత్వమున్నను, ఉచ్చారణమున వకారద్విత్వము లేదు లిప్యనురూపమేగాని శ్రుత్యనురూపము కాదు. శ్రుత్యను రూపమైన "వెఱగు నక్షరములు" తెలుగు వర్ణన మామ్నాయమునందు రేఫశకటరేఫ ములు మాత్రమే కలవు. రేఫశకటరేఫప్రాసము నన్నయ భారతమునందు లేదు. తిక్కన ఉత్తరరామాయణమునందును లేదు పాలకుఱికి సోమనాథుని బసవపురాణ, పండితారాధ్యచరిత్రలందు కలదు శ్రుత్యనురూపమైన భిన్నాక్షరముల ప్రాసము రేఫశకటరేఫప్రాసమే రేఫశకటరేఫప్రాసము దౌర్గత్యస్ఫోరకమని తిక్కన అభి

ప్రాయము ఇది పాలకుఱికి సోమనాథునిపై తిక్కన పరోక్షవిమర్శ అది పాలకుఱికి సోమనాథుడు తిక్కనకంటె పూర్వుడగుటకు అంతస్సాక్ష్యము

"వచనము లేక యు వర్ణన
రచియింపఁగ గొంత వచ్చుఁ బ్రౌఢులకుఁగథా
ప్రచయముఁ బద్యములన యిం
దుచితంబుగఁ జెప్పుఁ బాడి యొప్పిన మనికే" 15ప

వచనము లేకుండ వర్ణనలు కొంత రచియింపవచ్చును ప్రౌఢులైన కవులకు కథాకథనము పద్యములందే కుదురును ఉచితముగ చెప్పుట అనగా యత్తదుచితముగ రచించుటకు పెద్దలు ఒప్పిన మందుచు అని తిక్కన అభిప్రాయము నన్నయ వర్ణనలు పెక్కులు వచనములందే కలవు. నన్నయ కథాకథనము వచనములందును కలదు అందుకు తిక్కన అభిప్రాయమిది నిర్వచన కావ్య రచనమునకు సమర్థనము. నిర్వచన కావ్యమైనను చంపూ కావ్యమైనను ఔచిత్యము కావ్యజీవితము ఇది క్షేమంకరమైన క్షేమేంద్రుని సిద్ధాంతము.

తిక్కన ఉత్తరరామాయణమునందు నిర్వచనకావ్యమని లేదు కాని నిర్వచన కావ్యమే నిర్వచన కావ్యమనియే ప్రసిద్ధము "వసుసం దిక్కనయజ్వ నిర్వచన కావ్యంబై తగం జేసె నుత్తరరామాయణము" అని కంకంటిపాపరాజు ఉత్తర రామాయణమునందు కలదు. (1½ప పీ)

"లలితపదహృద్యపద్యం
బులన కథార్థంబు ఘటితపూర్వాపరమై
యలఁతి యలఁతి తునియలఁగా
హల సంధించిన విధంబు నమరఁగఁ జేతున్" 16ప.

లలితపదములన పూర్వోక్తమైన సరసమధురవచస్సులు వానిచేత హృద్యమైనది పద్యము. పద్యములందే కథార్థము పూర్వాపరములు- అలతి అలతి తునియలకాహాల సంధించిన విధమున ఘటింపబడి అమరును కాహాల అనగా బాకా. బాకా ఊదునపుడు నాదము, కంచుగోసిన నాదమువలె అఖండముగ ఉండదు ఖండ ఖండములుగ ఉండును. అవి కూడ అల్పఖండములు అందు నాదమునకు అనుసంధానమును ఉండును కావున అలతి అలతి పదముల కథార్థము పూర్వాపరముల అనుసంధానము తిక్కన ఆశయము కావలయును ఇది మఱల

సంస్కృత భూయిష్ఠరచన కాని పాల్కురికి సోమనాథుని జానుతెనుంగునకు జయ పతాక.

ఇందు నన్నయ శబ్దసంయోజనసరణి, భావప్రకటనవిధానము, సంస్కృతభాషాలక్షణము, సరసమధురవచోగుంభనసుప్రసాదసంబోధన గోపురబహువిధార్థ తాత్పర్యము, లాక్షణికత, శివకవుల నిర్వచనరచన, జానుతెనుగు తిక్కనకు సమ్మతములైనవి శివకవుల ప్రాతవడ్డమాటలు, ఆవేశపూరితామ్రేడనములు, అలాక్షణికత తిక్కనకు అసమ్మతములైనవి అసమ్మతములైన శివకవియుగ విలక్షణముల పరిహారము సమ్మతములైన నన్నయయుగ, శివకవియుగ సలక్షణముల స్వీకారము తిక్కన సాహిత్యవిమర్శకు పరమార్థము అది తిక్కన సాహిత్య సమన్వయసిద్ధాంతము.

## ఉత్తరరామాయణ రచనాకారణము

అసలు తిక్కన శివభక్తుడు. "చిత్తనిత్యస్థితశివుఁ డెవ్వాఁడనిన వాఁడను శబ్దమున కర్థమైనవాడు" అని కేతన కతపత్రము (59ప 1ఆ ద కు చ) "మహేశ్వరాంఘ్రికమలధ్యానైకశీలుండ"నని తిక్కన స్వవచనము (13ప 1ఆ ఉ. రా) తిక్కన చిత్తనిత్యస్థిత శివుడని మహాశివభక్తుడని అర్థము మహేశ్వరాంఘ్రికమల ధ్యానైకశీలుడన శివేతర దైవధ్యానశీలుడు కాడని అర్థము అయినను వీరశైవుడు కాడు మహాశైవుడే. అట్టి తిక్కన ఉత్తరరామాయణమును రచించుట నిర్నిమిత్తము కాఁజాలదు. తిక్కనను కృతి కన్యక నిమ్మని కోరినది మనుమసిద్ధి. మనుమసిద్ధి విష్ణుభక్తుడు. మనుమసిద్ధి తండ్రి తిక్కనృపతి మహావిష్ణుభక్తుడు ఉభయులును వైష్ణవమతావలంబులు మనుమసిద్ధిరాజు. తిక్కన మంత్రి. "మనుమసిద్ధిమహీవల్లభునకుఁ గరుణారసపాత్రంబైన కొట్టరువు తిక్కనామాత్యుండు నిజకుల క్రమాగతంబగు మంత్రిపదవియందు వర్తిల్లుచు" అని కేతనదశకుమారచరిత్రము నందు స్పష్టముగ కలదు (20వప 1ఆ) రాజునకు రచింపవలసిన కృతి రాజాభిమతము కావలయును. అందును మంత్రి అయిన కవికి రాజాభిమతము ఆస్థానకవి కంటె అధికముగ సాపేక్ష్యము. అందుకు తిక్కనకు విష్ణుసంబంధమైన కృతినే రచించుట ఆవశ్యకము రామాయణము విష్ణుసంబంధి. అది పూర్వరామాయణమైనను, ఉత్తరరామాయణమైనను విష్ణుసంబంధియే. ఇది చిత్తనిత్యస్థితశివుడు,

మహేశ్వరాంధ్రికమలధ్యానైకశీలుడును అయిన తిక్కన ఉత్తరరామాయణము రచించుటకు కారణము

అయిన పూర్వరామాయణమును వదలి, ఉత్తరరామాయణమును ఎల వ్రాయవలయును? అని ప్రశ్నకు అవకాశము కలదు అందుకు తిక్కనయే చెప్పిన సమాధానము కలదు అది కాదని ఆధునికులు చెప్పిన సమాధానములు రెండు కలవు 1 తిక్కన తాత మంత్రిభాస్కరుడు పూర్వరామాయణమును రచించుట 2 తిక్కనకు పూర్వము గోనబుద్ధారెడ్డి పూర్వరామాయణమును రచించుట. ఈ రెండును హేత్వాభాసములే.

మంత్రి భాస్కరుడు పూర్వరామాయణము రచించెననుటకు మూడు ఉపపత్తులు కలవు 1 జనశ్రుతి 2 మంత్రిభాస్కరుడు సారకవితాభిరాముడు. 3. భాస్కరరామాయణములోని అరణ్యకాండమునందు ఇద్దఱి రచనము కలదు [31] ఒకడు హుళక్కిభాస్కరుడు. మఱొకడు మంత్రిభాస్కరుడు

జనశ్రుతి స్వతఃప్రమాణము కాదు హుళక్కిభాస్కరుడు మంత్రిభాస్కరుడను భ్రమను జనశ్రుతి పుట్టవచ్చును మంత్రిభాస్కరుడు సారకవితాభిరాముడనగా సుకవిపుంజకంజాకరభాస్కరుడు మాత్రమే. కవి కాడు కవిపోషకుడు. భాస్కరరామాయణములోని అరణ్యకాండమునందు మాత్రమే కాదు, అయోధ్యాకాండమునందును ఇద్దఱి రచన ఉన్నట్లు కలదు [32] ఒకడు కుమారరుద్రుడు, మఱొకడు మంత్రిభాస్కరుడు అనుటకు నిర్ధారకసాధనము లేదు. అట్లే అరణ్యకాండమునందు ఒకడు హుళక్కిభాస్కరుడు, మఱొకడు మంత్రిభాస్కరుడు అనుటకును నిర్ధారకసాధనము లేదు అంతేకాదు. నిజముగా మంత్రిభాస్కరుడు పూర్వ రామాయణమును రచించియున్నచో, తిక్కన మత్పితామహుడు పూర్వరామాయణము రచించెనుగావున, నేను ఉత్తరరామాయణమును రచింతుననియే చెప్పును తిక్కన అట్లు చెప్పలేదు సరికదా తాను ఉత్తరరామాయణము రచించుటకు కారణము మఱొకటి చెప్పెను కాబట్టి మంత్రిభాస్కరుడు పూర్వరామాయణము రచింపలేదని గ్రాహ్యము

తిక్కన ఉత్తరరామాయణముకంటె పూర్వము గోనబుద్ధారెడ్డి పూర్వరామాయణము రచించెననుటకు రెండు ఉపపత్తులు కలవు.[33] 1 "తిక్కన పూర్వరామాయణమును కాదని ఉత్తరరామాయణమును రచించెనుగావున, తిక్కనకు పూర్వమే బుద్ధారెడ్డి పూర్వరామాయణము రచించియుండవలయును "2 "రంగనాథరామా

యణమును భాస్కరునివంటి ప్రాచీనకవి అనుకరించెను కావున, రంగనాథరామాయ ణము భాస్కరరామాయణమునకు బహుపూర్వగ్రంథము కావలయును ” ఇవి ఊహలు మాత్రమే. నిజముగ తిక్కన బుద్ధారెడ్డి పూర్వరామాయణ మునుబట్టి చెనిగసన రామాయణమును పూర్తి చేయదలచిన, బుద్ధారెడ్డి పూర్వరామాయణము ద్విపద కావ్యము కావున, తిక్కన ఉత్తరరామాయణమును ద్విపదకావ్యము కావలెను. కాని ద్విపదకావ్యము కాదు. ద్విపదేతరపద్యకావ్యము కాబట్టి బుద్ధారెడ్డి పూర్వరామాయ ణము, తిక్కన ఉత్తరరామాయణముకంటె పూర్వగ్రంథము కావలసిన ఆవశ్యకము లేదు. అంతేకాదు శాసనప్రమాణములనుబట్టి బుద్ధారెడ్డి పూర్వరామాయణము తిక్కన ఉత్తరరామాయణముకంటె మాత్రమేగాక, తిక్కన మహాభారతముకంటెను అనంతరగ్రంథము [34] అది ముందు వివరింతును ఇక రంగనాథరామాయణమునకు, భాస్కరరామాయణమునకు భావప్రాయమైన సంవాదము ప్రధానముగ అవాల్మీ కీయవృత్తాంతములందు కలదు. అవి వాల్మీకిరామాయణము ప్రత్యంతరములందు కలవు.[35] అన్యరామాయణములందు కలవు చెనిని జనశ్రుతులు అని ఉపయకుశల ములు అంతేకాదు ఉభయరామాయణములందును ప్రక్షిప్తములు కలవు అవి కాలాంతరసంక్రాంతము లగును ఉపరి, అనుకరించుటకు శతాబ్దిపూర్వగ్రంథము కాదు, దశాబ్దిపూర్వగ్రంథమును ఉపాదేయమే కాబట్టి రంగనాథరామాయణము భాస్కరరామాయణము కంటెను బహుపూర్వగ్రంథము కావలసిన ఆవశ్యకము లేదు. కించిత్పూర్వగ్రంథ మైన చాలును.

ఉత్తరరామాయణము సంస్కృతరామాయణములోని ఉత్తరకాండము బాల కాండము మొదలు యుద్ధకాండమువఱకు ఆఱు కాండలు పూర్వరామాయణము. ఉత్తరకాండ ఒక్కటే ఉత్తరరామాయణము. గోన బుద్ధారెడ్డి పూర్వరామాయణము ద్విపదకావ్యము గోనబుద్ధారెడ్డి కుమారుడు కాచ,విట్ఠలరెడ్లు ఉత్తరకాండమును ద్విపద కావ్యము అందు బుద్ధారెడ్డి పైనుండి పిలుపు వచ్చి కుమారులకు తాను పూనిన కథను పూర్తిచేయుడని చెప్పినట్లు కలదు (పు.3) కాచ విట్ఠలరెడ్లు రచించిన ఉత్తరకాండమునందు “శ్రీరామచంద్రుండు సీతచెట్టు లలర, ఘోరాజి రాక్షసకోటి నిర్జించి, మఱల నయోధ్యకు మహిమలో వచ్చి, చిరలీల రాజ్యంబు సేయుచు న్నడు” అని కథాప్రారంభము కలదు (పు.1)కారణము బుద్ధారెడ్డి పూర్వరామాయ ణమునకు కాచ,విట్ఠలరెడ్ల ఉత్తరరామాయణమునకు పూరాణగ్రంథము తిక్కన ఉత్తరరా మాయణము ద్విపదకావ్యముకాదు. పద్యకావ్యము. అందు మంత్రిభాస్కరుడు పూర్వ

రామాయణము రచించినట్లు లేదు పూర్వరామాయణకథాసంగ్రహము కలదు (16–85ప 1ఆ) కారణము తిక్కనకు పూర్వము పూర్వరామాయణము లేకపోవుటయే కావలయును. కంకంటి పాపరాజు ఉత్తరరామాయణము పూర్ణగ్రంథము కాదు అతనికి బహుపూర్వమునుండి బహుపూర్వరామాయణములు కలవు అయినను పూర్వరామాయణకథాసంగ్రహముకలదు (1–85ప 1ఆ) అది తిక్కన ప్రభావమే అగును.

భవభూతి ఉత్తరరామచరితనాటకమునకు పూర్వము పూర్వరామనాటక చరితము లేదు. భట్టమురారి అనర్ఘరాఘవ నాటకము మొదలైనవి అంతరనాటకములు. భవభూతి మహావీరచరితము అనంతరనాటకమే అందు భవభూతి రచనము పూర్తిగా లేదు సుబ్రహ్మణ్యకవి పూరణము కలదు[60] కారణము భవభూతి చరమదశను రచించిన గ్రంథమగుటయే కావలయును కాబట్టి తిక్కన ఉత్తర రామాయణమునకు పూర్వము పూర్వరామాయణమొకటి ఉండవలసిన అవశ్యకము లేదు ఉన్నట్లు నిర్ధారకసాధనము లేదు అందువలన తిక్కన పూర్వరామాయణమును వదలి, ఉత్తరరామాయణమును ఏల వ్రాయవలయును? అను ప్రశ్నకు ఆధునికులు చెప్పిన సమాధానములు సమర్థములైనవి కావు తిక్కనయే చెప్పిన సమాధానమిది .

"ఎత్తఁగనైనను ధీరో
దాత్తనృపోత్తముఁడు రామధరణీపతి స
ద్వృత్తము సంభావ్యమగుట
నుత్తర రామాయణోక్తియుక్తుఁడనైతిన్."                11ప. 1ఆ ఉ రా.

ఇది "తెలుఁగున కవిత్వము చెప్పందలఁచిన కవి యర్థమునకుఁ దగియుండెడు మాటలు గొని" చెప్పవలయునన్న పద్యమునకు తర్వాతి నాల్గవ పద్యము ఇందలి మాటలు "అర్థమునకుఁ దగియుండెడు"నవియే అగును. ఆ తగియుండిన అర్థమే తిక్కన ఉత్తరరామాయణరచనకారణమగును.

సద్వృత్తమన సచ్చరితము రాముని సద్వృత్తమని పద్యమునందు లేదు. రామధరణీపతి సద్వృత్తమని కలదు అంతేకాదు. రామధరణీపతి ధీరోదాత్తనృపో త్తముడని కలదు ధీరోదాత్తుడను మాట నాటకములలోని నాయకభేదములందు మాత్రమే ప్రసిద్ధము అవికత్థనుడు, సహనశీలి, అతిగంభీరుడు, మహాసత్త్వుడు, స్థిరాభిమానుడు, దృఢవ్రతుడు అయిన నాయకుడు ధీరోదాత్తుడు అట్టి నృపుడు ధీరోదాత్తనృపుడు. ధీరోదాత్తనృపులలో ఉత్తముడు రామధరణీపతి. అతని

సచ్చరితము రామాయణమునందు ఆద్యంతమును కలదు అది ఎత్తటినైనను సంభావింపదగినది ఏ తటినైనను అనకుండ ఎత్తటినైనను అని ఒత్తిపలుకుటలో సునిశ్చయము కలదు కుసంశయము కలదుగావున సునిశ్చయము.

"ఆలిఁ గోల్పడి రాముఁ డపు బ్రహ్మహత్య
పెలయి ధర చుట్టు భ్రమరించెఁ గాదె" 1756-57 పం ౦ఆ.

అని పాలకురికి సోమనాథుని బసవపురాణమునందు కలదు రాముడు సీతను పరిత్యజించి బ్రహ్మహత్యాపాతకము పెలయినట్లు, పాపపరిహారార్థము భూప్రదక్షిణము చేసినట్లు సంస్కృత రామాయణమునందు లేదు లోకాభి రామాయణమునందు కలదన్నమాట భార్యాపరిత్యాగము ప్రజాధర్మము కాదు. ప్రజాహితప్రయోజనము కలదేని రాజధర్మము కాకపోదు ప్రజాధర్మము, రాజ ధర్మము సర్వసమానము కాదు. అందుకు రామధరణీపతి అనుట. ప్రజాహిత పరాయణుడైన రాజు నృపోత్తముడు రామధరణీపతి ప్రజాహిత ప్రరాయణులైన రాజులలో ఉత్తముడు "ప్రజానాం హితేచ రతః" అని వాల్మీకి రామాయణము నందు ముందే కలదు (12శ్లో 1స బా కాం) అందుకు నృపోత్తముడనుట. నృపోత్తముడైన అనగా ప్రజాహితపరాయణులైన రాజులలో ఉత్తముడైన రామధరణీపతికి ప్రజాహితార్థము-ప్రజాశ్రేయఃపరిరక్షణార్థము సీతాపరిత్యాగము అవశ్యాచరణీయమైన పరమధర్మము. అదెంత అవశ్యాచరణీయమైన పరమధర్మ మైనను అంత తేలిక కాదు. ఎంతో సహనశీలము, మహాసత్త్వము, దృఢవ్రతము లేనిచో సాధ్యము కాదు అందుకు ధీరోదాత్తనృపోత్తముడనుట. సీతాపరిత్యాగము శీలశంకామూలకము కాదు ప్రజాశ్రేయః పరిరక్షణకీలకము ఇట్లు సంస్కృత రామాయణమునందు కలదు లోకాభిరామాయణమునందు లేదు. సామాన్యప్రజా ధర్మమునుబట్టి విశేషరాజధర్మము లోకమున విపరీతపరిణామములందినది. అది పరిహార్యము అందుకు తెలుగులో ఉత్తరరామాయణరచనము ఆవశ్యకము. అందును వీరశైవకవి గ్రంథస్థము చేసిన విపరీతము వీరశైవేతరకవులకు అత్యంతా వశ్యకము అది విష్ణుభక్తుడైన మనుమసిద్ధికి అభిమతమగును. ఇది తిక్కన ఉత్తర రామాయణరచనకారణము. ఇందుకు తిక్కన ఉత్తరరామాయణమునందు సీతా పరిత్యాగఘట్టము వాల్మీకిరామాయణమునందు వలె ప్రజాహితప్రయోజనపరము ఉండుట, రామధరణీపతి పాత్రచిత్రణము వాల్మీకి రామాయణమునందుకంటె భిన్నముగ ధీరోదాత్తనృపోత్తముని వృత్తాంతముగ ఉండుట నిదర్శనము.

## ఉత్తరరామాయణకృతిసమీక్ష

తిక్కన ఉత్తరరామాయణమునందు ప్రథమతః అయోధ్యావర్ణనము కలదు. తదుపరి పూర్వరామాయణకథ కలదు. (64-65ప.1ఆ) ఇవి మూలమున లేవు రాక్షసవధానంతరము రాజ్యమును పొందిన రాముని అభినందించుటకు సర్వ మునులు వచ్చిరని ఉత్తరకాండ ప్రారంభమైనది. తిక్కన అయోధ్యావర్ణనము పూర్వ రామాయణకథారంగముగానే కలదు ఉండ, కోట, పరిఖా, హర్మ్య, హస్తి, అశ్వ, వేశ్యా, వైశ్య, బ్రాహ్మణ, దేవాలయ, వాయుప్రసార, ఉద్యానవనవర్ణనములు కలవు వాల్మీకి రామాయణములోని అయోధ్యావర్ణనమునందు "కామీ వా న ... ద్రష్టుం శక్యమే" (8శ్లో 6స బా కాం.) అని కలదు. అయోధ్యలో కాముకులు కనిపించరని వాల్మీకి వర్ణన. వారవనిత లొప్పుదురని తిక్కన వర్ణన (55ప.1ఆ) ఆ వారవనితలు నెల్లూరి రాజాజాణలు కావచ్చును అథవా, మనుమసిద్ధి రాయవేశ్యా భుజంగబిరుదము (44ప.1ఆ 103ప 2ఆ.) తిక్కన వేశ్యావర్ణనమునకు కారణము కావచ్చును. విహారవనములు, ఉపవనములు, వనము, ఉపవనభూములు అని నాలుగు పద్యములందు ఉద్యానవనవర్ణనము కలదు. ఉత్తరరామాయణకథలోని సీతారాముల ఉద్యానవనవిహారము ప్రేరణము కావచ్చును తిక్కన పురవర్ణనము తోడి కావ్యారంభము, తర్వాతి పురవర్ణనములతోడి కావ్యారంభములకు మార్గ దర్శకము.

సంస్కృత–ఉత్తరకాండమునందు అసలు పాఠములు IIIసర్గలు, అధిక పాఠములు 13 సర్గలు కలవు [36] అధికపాఠముల సర్గలు తిక్కన ఉత్తరరామాయణమునందు లేవు అసలు పాఠముల సర్గలును అన్నియును లేవు. ముఖ్యముగ కాండాంతమునందలి కుశలవరాజ్యాభిషేకము, రామాదుల సరయూప్రవేశము లేవు. కుశలవులకు రాజవిద్యలు నేర్పుచు, "ధర్మరతి సర్వజనంబు నుత్తమమార్గవర్తన శీలతం బొరయ ధారుణి యేలె రాఘవపుంగవుండు మహోన్నతిన్" అని తిక్కన ముగింపు. (160ప 10ఆ.) బహుశః మంగళాదీని, మంగళమధ్యాని, మంగళాంతాని" అను సంప్రదాయమునుబట్టి రామనిర్యాణఘట్టమును తిక్కన రచింపలేదు. అది తిక్కన అనంతరము జయంతి రామయ్యభట్టు ఏకాశ్వాసప్రబంధముగ రచించెను [37]

అగస్త్యుడు రాముని రావణాదుల పుట్టుపూర్వోత్తరములు తెలుపుట ఉత్తర రామాయణమునందు యథామూలకముగ అధికభాగమును ఆక్రమించినది. అందు వేదవతీవృత్తాంతము, రంభారావణవృత్తాంతము, రావణుడు చెఱపట్టిన స్త్రీల విలాపము

ప్రధానరామకథాప్రమేయము కలవి వేదవతీవృత్తాంతము మూలవిధేయము రంభా రావణవృత్తాంతము మూలాతిశాయి. రావణుడు చెఱపట్టిన స్త్రీల వృత్తాంతమును మూలాతిశాయియే.

వేదవతీరావణుల సంవాదము యథామూలకము. అందు,

"తస్మా మే భవ భార్యా త్వం భుఙ్క్ష్వ భోగాన్ యథాసుఖమ్।"

24శ్లో.17స.

అను పంక్తికి తిక్కన ఆంధ్రీకరణమిది:

"ఎఱుఁగవుగాక భోగములకెల్లను నెచ్చెలి జవ్వనంబ యి
త్తఱి నుడివోవకుండ నుచితంబుగ జక్కవదోయివోని క్రి
క్కిఱిసిన చన్నుఁ జన్నుఁగవ యింపెసలారఁగ నాదు వక్షమనే
వలుల సరోవరంబున నవారణఁ గేలి యొనర్చు కోమలీ!" 14ప.5ఆ.

విష్ణువే భర్త కావలయునని తపస్సు చేయుచున్న వేదవతితో ఇట్లు రావణుడు పలుకుట అనుచితము అది రావణుని నీచస్వభావమును అభివ్యక్తము సేయును.

రంభారావణుల సంభాషణమును యథామూలకము రావణబలాత్కారము మూలాతిశాయి "కామమోహాభిసంరబ్ధో మైథునాయోపచక్రమే" అను పంక్తికి (42శ్లో 27స.) తిక్కన ఆంధ్రీకరణమిది:

"అంగనఁ బాదివి సగాఢా
లింగనముగఁ ద్రామచూడలీలాచతురా
నంగక్రీడాసంగతి
నెంగిలి గావించె మదము నేడ్తెఱ మిగులన్." 74 ప. 6ఆ

ఇది మూలమునందు వరె వాచ్యముగ లేదు సూచ్యముగ కలదు అంతేకాదు "ఎంగిలి గావించె" అను నుడికారము రావణుని దుష్టస్వభావమును పగటున అప్పటి రంభ అవస్థ

"గజేన్ద్రాక్రీడమథితా నదీవాకులతాం గతా
లులితాలకకేశాన్తా కరవేపితపల్లవా
పవనేనావధూతేవ లతా కుసుమశాలినీ" 43, 44శ్లో 27స

అని మూలమునందు కలదు. అది నిమిత్తముగ తిక్కన రచించిన పద్యమిది:

పగరాజు పైవచ్చి బలువిడిఁ బరిభవిం
చినఁ దలంకిన పురశ్రీవిధమున
సమదద్విపము కేళి సలిపినఁ జాల న
లంగిన యుద్యానలక్ష్మి కరణి
మనలులాయము సొచ్చి తన యిచ్ఛ నాడినఁ
గలఁగిన నెత్తమ్మికొలని భంగిఁ
గడు వెట్టిదపుగాలి సుడిసిన నడివచ్చి
తిరిగిన మవ్వంపుఁదీఁగె మాడ్కి
మున్న గైసేసి యలవడ్డ మెన్ను దప్పి
మెలమిఁ బ్రియుపాలి కేఁగెడు లలి యడంగి
వేఱ చందమై యెంతయు విన్ననయ్యె
నసుర గారించి విడిచిన యమ్మృగాక్షి" 7౨ప. 6ఆ.

గజేంద్రునిచేత మదక్రీడామథితమైన నదిని, మత్తేభము కేళి సల్పిన ఉద్యాన లక్ష్మి స్వతంత్రానుసరణము ఇతరసాదృశ్యములు తిక్కన స్వతంత్రకల్పనములు. అందు పెద్ద దున్నపోతు కలఁగఁద్రొక్కిన నెత్తమ్మికొలను, సుడిగాలికి మెలితిరిగిన లేతతీఁగ కంటె "పగరాజు పైవచ్చి బలువిడిఁ బరిభవించినఁ దలంకిన పురశ్రీ"తోడి సాదృశ్యకల్పన అపూర్వము. ఆ పురశ్రీ బహుశః తిక్కన కనులారఁగాంచిన దండువిడిసిన సింహవిక్రమపురమే కావచ్చును

రావణుడు చెఱపట్టిన స్త్రీల విలాపము మూలమునందు విస్తరముగ కలదు. (1-21శ్లో 24స) తెనుగుసేతను సంగ్రహముగ కలదు. (103-112ప 5ఆ) అందు తిక్కన అమూలకముగ రచించిన పద్యమిది:

"ఉడుగక కాల్చుచునుండెడు శోకంబ
యతితీవ్రహవ్యవాహనుఁడు గాఁగ
నిట్టూర్పు గాడ్పులు నిగుడించుటయ విల
సిల్లఁ బ్రజ్వలితంబు సేఁత గాఁగఁ
బాయక యొనరించు బహువిలాపంబుల
రాజితమంత్రాక్షరములు గాఁగఁ
గన్నీరు బోరనఁ గ్రమ్మించుటల పోఁ
బోరి నాజ్యధారల పోఁత గాఁగఁ

గొలఁది కగ్గలమై మెదఁ గలుగు వగల
యొసరు సమిధలుగా నిట్టు లువిదపిండు
రావణాభిచారంబుగ భావమందు
సమ్యగముగ వేల్చు తెఱఁగున నుండెఁ జూడ" 112ప.5 ఆ.

చెఱపట్టఁబడిన స్త్రీల శోకమే అగ్ని. వారి నిట్టూర్పుగాడ్పులే ప్రజ్వలన సాధనములు వారి విలాపములే మంత్రాక్షరములు. వారి కన్నీటిధారలే ఆజ్యధారలు. వారి హృదయవేదనలే సమిధలు. వారి భావము రావణాభిచారహోమము. అమూలకమైన రావణాభిచారమిది సమగ్రసుందరమైన రూపకము.

ఇక సీతాపరిత్యాగఘట్టము ఇది ఉత్తరకాండములోని ప్రధానరామకథయందు ప్రముఖఘట్టము. అందుకు ప్రాతిపదిక సీతారాముల ఉద్యానవనవిహారము. అది మూలమునందు అతిసంగ్రహముగ కలదు (19–25శ్లో 22స) అందు సీతారాములకు అరుంధతీ వసిష్ఠులతోడి సాదృశ్యము (23శ్లో) సీతారాముల అన్యోన్య దాంపత్యమునకు చిహ్నపతాక అది తిక్కన ఉత్తరరామాయణమునందు లేదుగాని, సీతారాముల ఉద్యానవనవిహారము, జలవిహారము, లీలావినోదము సవిస్తరముగ కలదు. (18–31ప 8.ఆ) అదియెల్ల సీతారాముల అన్యోన్యదాంపత్యమును అభివర్ణించును. అన్యోన్యదాంపత్యమది ఆదర్శదాంపత్యమే కాని, భద్రుని వార్తాప్రకటనమున ఇట్లు కలదు.

"హత్వా చ రావణం యుద్ధే సీతా మాహృత్య రాఘవః
అమర్షం పృష్ఠతః కృత్వా స్వవేశ్మ పునరానయత్.
కీదృశం హృదయే తస్య సీతాసంభోగజం సుఖమ్
అఙ్కమారోప్య హి పురా రావణేన బలాద్ధృతా
లఙ్కామపి పురానీతా మశోకవనికాం గతామ్
రక్షసాం వశమాపన్నాం కథం రామో న కుత్సతే
అస్మాకమపి దారేషు సహనీయం భవిష్యతి
యథా హి కురుతే రాజా ప్రజా తమనువర్తతే
ఏవం బహువిధా వాచో వదన్తి పురవాసినః
నగరేషు చ సర్వేషు రాజన్ జనపదేషు చ." 16–20శ్లో.43స.

యుద్ధమునందు రావణుని సంహరించి, రాముడు సీతను గ్రహించి వెంటఁ బెట్టుకొని తన ఇంటికి తిరిగి చేసికొనివచ్చెను. తొడపై నిడుకొని రావణుడు బలాత్కారముగ అపహరించిన సీతతో కాపురము చేయుట రామునికెట్లు మనస్కరించెను? లంకలో అశోకవనమందు రాక్షసుని వశమైనను ఏ విధముగ రాముడు ఏవగించుకొనలేదు? రాజు చేసిన పని ప్రజలకు అనువర్తించునుగావున, ఇక మనము గూడ భార్యలయెడ సహింపవలయును. అని దారులలోను, నాలుగు దారుల కూడలిలోను, అంగడులలోను తోటలలోను (పూలతోటలలోను చత్వరాపణ రథ్యాసు వనేషూపవనేషు చ 1౯ శ్లో.4౯స) సర్వనగరములందు సర్వజనపదములందును జనులు నానావిధములుగ మాటలాడుచున్నారని అర్థము భద్రుని వార్త. సభాసదులు "ఏతన్న సంశయః అని– ఆ వార్తలో సంశయము లేదని– సమర్థించిరి ఈ లోకాపవాదము నిందామాత్రముకాదు ఆనాటి సమాజమునకు అత్యవస్థాపాదకము. ప్రజాశ్రేయస్సునకు ప్రమాదకరము ప్రజాశ్రేయఃపరిరక్షణార్థము సీతా పరిత్యాగము రాజైన రామునికి అవశ్యాచరణీయమైన పరమధర్మము ఇది తిక్కన ఉత్తరరామాయణమునందు ఇట్లు కలదు

"ఎల్లలోకంబులు నెఱుఁగ సత్యంతదు
రాచారుఁడైన దశాననుండు
చెఱఁబట్టికొని పోయి యఖిముఖిఁ బెద్ద కా
లందేనిఁ గేలివనంబులోన
ననిచిన నున్న యా జనకరాజాత్మజ
నెడనించు కేనియు నెగ్గుగొనక
ధైర్యంబు వాటించు తలఁపు వో విడిచి మ
న్మథ గోచరుండయి మగుడఁ దెచ్చి

యనుగలంబు సేసికొనియున్న వాఁడని
యజ్ఞులయిన జనములాడుచుండ
నెల్ల చోట విందు నింత నిక్కువమని
పల్కుటయును రఘునృపాలకుండు" 105ప 8ఆ

ఇందు ప్రజాశ్రేయస్సునకు ప్రమాదకరమైన అంశము లేదుగాని, ముందు పద్యమునందు "జనుల పనుల మఱవక యుచితస్థితి నడపుదు" నను రఘునృపాలకుని మనోనిశ్చయము కలదు. (104ప.) నిందామాత్రమైన లోకాపవాదమునైల తొలగించుట జనుల పనియే. భద్రుని వార్తాప్రకటనము వినగానే రాముడు,

"సుఱసుఱ డెందము సూఁడిన
తెఱఁగున నొక్కింత స్రుక్కి ధీరుం డగుటం
గొఱఁత వడకుండ వినుటకుఁ
బెఱవారల పెట్టులనియెఁ బ్రియవదనుఁ డై." 106ప. 8ఆ

హృదయము దహించుకొనిపోయినను ముఖమున కనఁబడకుండ చేయుట ధీర లక్షణము. ముందు పద్యమునందు "రఘునృపాలకుండు", తర్వాతి పద్యమునందు "ధీరుండు." అను ప్రయోగములు తిక్కన ఉపక్రమణికలోని "ధీరోదాత్తనృపో త్తముఁ డగు రామధరణీపతి" అను ప్రతిపాదనమునకు సంవదించునవి

రాముడు సోదరులతో సీత పవిత్రురాలని చెప్పుచు "అంతరాత్మాచ మే వేత్తి సీతాం శుద్ధాం యశస్వినీమ్" అని మూలమునందు కలదు. (11శ్లో. 45స.) ఇది తిక్కన ఉత్తరరామాయణమునందు ఇట్లు కలదు.

"దేవరునేల నేను బృథివీసుత చిత్తము పెంపెఱుంగనే
భూవలయంబు సంచలతఁ బొందిన వారిధి మేర దప్పినన్
దేవనగంబు పాఁతగిలి త్రెళ్ళిన నందొక కీడు గల్గునే
యా వనజాక్షి నిట్లు సెడనాడిన నక్కట నోరు ప్రువ్వదే."
117ప. 8ఆ.

ఇది మూలమునందు కంటె ఇతోధికముగ, సీతాపరిత్యాగము శీలశంకా మూలకము కాదని చాటును

"జనను పీకు నొక్క తెఱఁ గస్ఖలితంబుగ నేను జెప్పెదన్
దానిరిఁ గాదు నాకభువనంబులకున్ నను శుద్ధఁ జేయుఁ డ
జ్ఞానకె నెల్లభంగుల నిజంబుగ నిప్డు పరిత్యజించినం
గాని యకీర్తి వాయ దటు గాదని నోళ్లలు మూయవచ్చునే." 118ప

జడమతులయిన జనంబుల
పెడమాటలు మాన్ప నిదియ పెర వెట్బంగిప్
సడి కంటెఁ జావు మేలని
యెడి పలుకు దలంపవలదె యిలఁ బురుషులకున్. 119ప.

పూని జీవితంబునైన పిమ్మెనను
వలయు చోట విడువవచ్చుఁ గాని
వర్తనంబు గౌరవం బొక యించుక
యైన విడువ దుస్సహంబు నాకు"

అని రామధరణీపతి తుది నిర్ణయము. సీతాపరిత్యాగమువలనఁగాని అపకీర్తి తొలగదు జడమతులైన జనముల వెడమాటలు మాన్పుటకు ఏ విధముగ చూచినను సీతాపరిత్యాగమే ఉపాయము. ప్రవర్తనము, గౌరవము కాసంతయైన విడుచుట రామధరణీపతికి కష్టము కారణము నాటి ధరణీపతికి గౌరవము, సత్ప్రవర్తనము, లోకాపవాదనిర్మూలనము ముఖ్యము. గౌరవహీనుడు, సత్ప్రవర్తన రహితుడు, లోకాపవాదసహితుడు ధరణీపతి అయిన ప్రజలకు అహితము. ప్రజాహిత ప్రయోజనార్థమే సీతాపరిత్యాగము

రాముడు సీతను సుమంత్రాధిష్ఠితమైన రథము నెక్కించి తీసికొనిపోయి గంగాతీరమున విడిచిపెట్టి రమ్మని లక్ష్మణుని ఆజ్ఞాపించును అనిష్టమైనను లక్ష్మణుడు అట్లు చేయును రాముడు మఱి సీతకు కనిపించినట్లుగాని, సీతతో మాటాడినట్లుగాని మూలమునందు లేదు అట్టిది రాముడు ప్రయాణవేళ సీతకు కనిపించినట్లు, సీతతో మాటాడినట్లు మాత్రమేగాక, సీతను మభ్యపెట్టినట్లును తిక్కన ఉత్తరరామాయణమునందు కలదు (130—136ప. 8ఆ. 5ప. 8ఆ.) అది "ప్రియవాదీ చ భూతానాం సత్యవాదీ చ రాఘవః" (32శ్లో. 2అ. అయో కాం.) అనఁబడిన రాముని శీలమునకు భంగకరమైనను సీత వ్యక్తిత్వమునకు ప్రాణబలము నిచ్చినదని ఒక అభిప్రాయము కలదు [38] సీత వ్యక్తిత్వమునకు ప్రాణబలము వచ్చుటకంటె రామ ధరణీపతి ధీరోదాత్తనృపోత్తమ లక్షణము ముఖ్యము. అది సత్యవ్రతమునకు బాధకమైనను దృఢవ్రతమునకు సాధకము.

అసలు భద్రుడు లోకవార్త ప్రకటించుటకు హేతువు, పౌరజానపదుల శుభాశుభవాక్యములు శుభాచరణమునకు, అశుభపరిహారణమునకు యథాతథముగ నిర్భయముగ సర్వము చెప్పమని రాముడు అడుగుటగా మూలమునందు కలదు. (11శ్లో. 43ప.) ఇది తిక్కన ఉత్తరరామాయణమునందు ఇట్లు కలదు.

"తొలుత రాజ్యంబు సేయంగఁ గడఁగి మనము
వివిధ వర్ణాశ్రమంబుల వృత్తి మరసి
యలవరించుచోఁ గొందఱ కహిత మగుటఁ
గొన్ని మాటలు పుట్టకయున్నె యనియె" 97ప 8ఆ.

ఇట్లు మూలమునందు లేదు కేవలము తిక్కన సృష్టి. రాముని కాలమునందు వర్ణాశ్రమధర్మరక్షణమన్నది ఎవ్వరికెని అహితము కాదు. తిక్కన కాలమునందు వీరశైవులకు అహితము. అది రాముని కాలమునకు ఆపాదించుట తిక్కన ఉత్తరరామాయణరచనకారణమునకు ఉపబలకసాధనము

రాముని కాలమునందలి వర్ణాశ్రమధర్మరక్షణమునకు ఉత్తరకాండములోని శంబూకవధోపాఖ్యానము ప్రథమోదాహరణము. (73స) అది తిక్కన ఉత్తర రామాయణమునందును కలదు (52-83ప 10ఆ) వర్ణాశ్రమ ధర్మములు నేడు మారినవి. ఏ యుగధర్మము ఆ యుగ ధర్మమును బట్టియే చర్చనీయము. పూర్వ యుగధర్మము నవ్యయుగధర్మము కానిచో వర్జనీయము

## మహాభారతము-చారిత్రికనైపథ్యము

తిక్కన మహాకావ్యము మహాభారతము అది విరాటాదిస్వర్గారోహణపర్వాంతము పదియేను పర్వముల సమూహము అనేక యెత్తు. అవతారికాశ్వాసాద్యంతములలోని హరిహరనాథతత్త్వము మఱొక యెత్తు తిక్కన మహాభారతమహాతులాభారము- పదకొండవశతాబ్దిని ఉత్తరభారతదేశము తురుష్కాక్రాంతమగుట, పండ్రెండవశతాబ్దిని ఆంధ్రదేశమునందలి పలనాటియుద్ధము మతసంబంధమగుట, పదమూడవశతాబ్దిని దక్షిణభారతదేశమును ఆక్రమించుకొనుటకు తురుష్కదండయాత్రల జాడలు కనిపించుటవలని ఆంధ్రోద్యమఫలమని ఒక అభిప్రాయము కలదు.[39] ఇది కేవలము కల్పనాగౌరవమునకు తావలము.

దక్షిణ భారతదేశమును ఆక్రమించుకొనుటకు తురుష్కదండయాత్రల జాడలు పదమూడవశతాబ్దిని లేవు పదునాల్గవశతాబ్దిని కలవు పదమూడవశతాబ్ది తుదిని 1296 వ సంవత్సరమునందు దేవగిరి యాదవరాజ్యముపై ఒక దండయాత్ర జరిగెనను, అది దక్షిణభారతదేశదురాక్రమణ ప్రయత్నము కాదు[40] అంతేకాదు. తిక్కన మహాభారతము తత్పూర్వగ్రంథము పండ్రెండవశతాబ్దిని ఆంధ్రదేశమునందలి పలనాటియుద్ధము మతయుద్ధము కాదు. మతసంబంధమును కాదు.మంత్రిపదవీ

సంబంధము. నారికేళ్వపమూలకము అంతేకాదు శతాబ్దిపూర్వము జరిగిన పలనాటి యుద్ధము శతాబ్ద్యనంతరము మహాభారతరచనమునకు నిమిత్తము కాదు. పదొకండవ శతాబ్దిని ఉత్తరభారతదేశము తురుష్కాక్రాంతమగుట చారిత్రికసత్యము. పండ్రెండవశతాబ్దిని లేక ఆంధ్రోద్యమము పదమూడవశతాబ్దిని హఠాత్సంభూతమగుట హాస్యాస్పదము పదమూడవశతాబ్దిని ఆంధ్రోద్యమమను భావనమే అభూత కల్పనము

తిక్కన ఉత్తరరామాయణమునందు కృతినాయకవంశావతారవర్ణనమేగాని, కృతినాయకవంశవికాసవర్ణనము లేదు అది మనుమగండగోపాలభూపతిశాసనమునందు కలదు.[41] మనుమసిద్ధి జ్యేష్ఠపుత్త్రుడు తిక్కనృపనాయకుడు. ఇమ్మడి తిరుకాళత్తి దేవుడు లేక రెండవ చోడతిక్కనృపతి ఇతని శాసనము 1279 వ సంవత్సరము నందు కలదు.[42] మనుమసిద్ధి ద్వితీయపుత్త్రుడు నల్లసిద్ధినృపుడు. ఇతడు కాటమ రాజు కథకు సంబంధించిన నల్లసిద్ధిరాజు కావచ్చును. నల్లసిద్ధినృపునికి అయిదు గురు పుత్త్రులు. జ్యేష్ఠపుత్త్రుడు మనుమగండగోపాలభూపతి. ఇతడు ప్రతాపరుద్ర భూప్రసాదార్జితవైభవుడు 1297 వ సంవత్సరమునందు "తల్లిదండ్రుల కనంత భోగ్యార్థముగాను" భూదానము చేసెను. కాబట్టి రెండవ చోడతిక్కనృపతి కాలము 1263–1282, నల్లసిద్ధినృపుని కాలము 1282–1297, మనుమగండగోపాల భూపతి కాలము 1297–1323 కావచ్చును. అయినను వారి ఆస్థానములందు కవులు కలరనుటకు నిర్ధారకసాధనము లేదు. అంతేకాదు మనుమసిద్ధి అనంతరము తిక్కన మంత్రిగా కాని, కవిగా కాని వారి ఆస్థానములందున్నట్లు నిదర్శనము లేదు అది నిర్నిమిత్తము కాదు కారణము మనుమసిద్ధి మరణము సహజము కాదు 1263 వ సంవత్సరమునందు జటావర్మసుందరపాండ్యుడు, భువనైకవీర విక్రమపాండ్యుడు, జటావర్మవీరపాండ్యుడు నెల్లూరును ముట్టడించి, ముట్టుకూరు దగ్గర జరిగిన మహాయుద్ధమునందు వీరగండగోపాలుని సంహరించి, వీరాభిషేకము చేసి కొన్నట్లు పాండ్యరాజుల శాసనములందు కలదు [43] వీరగండగోపాలు డన మనుమసిద్ధి "మామ యనియెడు" మనుమసిద్ధి యుద్ధమరణము భారతికన్యక నిచ్చిన తిక్కనకు మనోవేదన కలిగించును. ఐహికభోగవైముఖ్యమునకు కారణ మగును ఆముష్మికలాభసౌముఖ్యమునకు ప్రేరణమగును.

మనుమసిద్ధి నిత్యస్తుత్యలక్ష్మీశుడు తిక్కన చిత్తనిత్యస్థితశివుడు అయినను, "శ్రీకాంతచరణయుగళీకోకనదమధువ్రతకు" ద. (1వ. ఆ) "నాచరణకమలోపాస్తి

కృతస్వస్తి" (1ప. 10 ఆ) "ఉదాత్తశ్రౌతస్మార్తకర్మతత్పరమతి." (1ప. 2ఆ) "నానావేదవేదాంగతత్త్వజ్ఞ"డు (136ప 5 ఆ.) అని కేతన దశకుమారచరిత్రము నందు కలదు. మనుమసిద్ధి మహావైష్ణవుడు కాడు. తిక్కన వీరశైవుడు కాడు ఉభయుల మమకారమునకు ఉత్తరరామాయణము తార్కాణము వీరశైవుడైన పాలకురికి సోమనాథుని బసవపురాణములో "ఉమా మాతా పితా రుద్ర" అని (14ప. 1ఆ.) పండితారాధ్యచరిత్రలో "బసవగోత్రుండను .. .. బసవన్న మాతనే బసవన్న బంటు బసవని యిలుపుట్టు దాసినకొడుక బసవన్న వెంక బసవన్న పన్నుల పన్ను" అని (పు 14. ప్ర సం) శివమయులు పుకులు విప్పిన, మనుమసిద్ధి తండ్రియైన చోడ తిక్కనృపతి అరుకాళ్ల పెరుమాళ్ల దేవాలయశాసనములో వరదరాజస్వామి భక్తుడే తల్లి, తండ్రి, గురువు, ధనము, పుత్త్రుడు, మిత్రుడు అని విష్ణుసేవలు ప్రోవలు తప్పిన కాలము తిక్కనకు అవ్యవహితపూర్వము దేశము అతిసన్నిహితప్రాయము. వీరశైవ, వీరవైష్ణవమతముల విజృంభణమువలన సమాజము నందు మారణహోమము సాగుట అది ఉదాత్తశ్రౌతస్మార్తకర్మతత్పరునకు ఉపేక్షణీయము కాదు నానావేదవేదాంగతత్త్వజ్ఞునకు విస్మరణీయము కాదు మతభేదకారణరహితమైన పరతత్త్వప్రబోధమే అవశ్యకర్తవ్యము

మతము దైవసంబంధి. మతభేదకారణము బహుదైవభావన ఎవరి దైవము వారికి ఎక్కువ ఇతరదైవము తక్కువ శివుడే పరమదైవమని వీరశైవమత సిద్ధాంతము. విష్ణువె పరమదైవమని వీరవైష్ణవమతసిద్ధాంతము విష్ణువు శివభక్తుడని వీరశైవమతరాద్ధాంతము శివుడు విష్ణుభక్తుడని వీరవైష్ణవమతరాద్ధాంతము. శైవేతరులు దర్శనస్పర్శనాలాపసంసర్గదూరులని వీరశైవమతవిరావేశము వైష్ణవేతరులు తత్తుల్యులని వీరవైష్ణవమతాభినివేశము. వీరశైవశబ్దము వలె వీరవైష్ణవశబ్దము ప్రాచీనవ్యవహారప్రసిద్ధము కామగాని ఆధునిక వ్యవహారప్రసిద్ధము ఉభయత్ర వీరశబ్దము తీవ్రవాదబోధకము విష్ణునింద సేయు వీరశైవమతము తీవ్రవాదము. శివనింద సేయు వీరవైష్ణవమతమును తీవ్రవాదమే తీవ్రవాదముల సంఘర్షణమే సంఘమారణహోమసంఘటనములకు కారణము "ఏకం సత్ విప్రా బాహుధా వదన్తి" అని ఉపనిషద్వాణి ఉద్ఘోష అది వెదఘోష త్రికాలాబాధితమైనది సత్తు. అది ఒక్కటే అదే దైవము ఏకదైవభావనమే సనాతనము. బహుదైవభావనము కాలక్రమసంక్రాంతము అది మనుష్యుల విపరీతాపు మనకు దోహదము చేసెనది కాన

పరిత్యాజ్యము అందుకు తిక్కన అంతర్మథనమునుండి ఆవిర్భవించినది. హరిహర నాథతత్త్వము

హరిహరనాథతత్త్వము హరిహరాభేదభావమాత్రము కాదు. హరికి, హరునికి భేదము పాటింపకపోవుటయే హరిహరాభేదభావము. ఈ దృష్టి తిక్కనకు, కేతన దశకుమారచరిత్రరచనాకాలము నాటికే — అనగా తిక్కన ఉత్తరరామాయణ రచనాకాలమునకు పూర్వమే — కలదు. తిక్కన చిత్తనిత్యస్థితశివుడు అనియేగాక, శ్రీకాంతచరణయుగళకోకనదమధువ్రతుడని కేతన దశకుమారచరిత్రమునందు కలదు. నిత్యస్తుత్యలక్ష్మీశుడైన మనుమసిద్ధి, చిత్తనిత్యస్థితశివుడైన తిక్కన ఆత్మీయులు. మనుమసిద్ధిరాజు, తిక్కన కవి అయినను మనుమసిద్ధి తిక్కనను మామ అని పిలుచుట, దానికి తగినట్లు తిక్కన ఉత్తరరామాయణమును రచించి మనుమసిద్ధికి అంకితమిచ్చుట వారి అన్యోన్యతకు నిదర్శనము. అది తిక్కన హరిహరాభేదభావమునకు ఫలము. హరిహరనాథతత్త్వము తావన్మాత్రము కాదు. హరి, హరుడు అని ఇద్దఱు వేఱు ఇద్దఱు ఉండి ఒకడును కాడు. ఒక్క హరిహర నాథుడే కలడు. దైవమొకడే. ఆ దైవము రూపము హరిహరము. సగము హరి; సగము హరుడు అర్ధనారీశ్వరరూపము వలె హరిహరనాథరూపము. అది సాకారము. సగుణము. హరిహరనాథతత్త్వము రూపము కాదు. తత్త్వమే. పర తత్త్వము. అది సాకారము కాదు, నిరాకారము సగుణము కాదు నిర్గుణము. సగుణోపాసనము సామాన్యులకు ఉద్దిష్టము నిర్గుణోపాసనము ధీమాన్యులకు నిర్దిష్టము. సగుణోపాసనము కర్మమార్గము నిర్గుణోపాసనము జ్ఞానమార్గము. కర్మమార్గము పూర్వమీమాంసామార్గము జ్ఞానమార్గము ఉత్తరమీమాంసామార్గము. పూర్వోత్తర మీమాంసాదర్శనముల ప్రతిపాదనము వేదార్థము "అథాతో ధర్మజిజ్ఞాసా" అని ఆరంభమగునది పూర్వమీమాంస. "అథాతో బ్రహ్మజిజ్ఞాసా" అని ప్రారంభమగు నది ఉత్తరమీమాంస ధర్మమున కర్మము. బ్రహ్మమున అద్వైతము. ధర్మాద్వైత స్థితి కలది పంచమవేదమైన మహాభారతము.

"విద్వత్సంస్తవనీయభవ్యకవితావేశుండు విజ్ఞానసం
పద్విఖ్యాతుఁడు సంయమిప్రకరసంభావ్యానుభావుండు గృ
ష్ణద్వైపాయనుఁ డర్థి లోకహితనిష్ఠం బూని కావించె ధ
ర్మాద్వైతస్థితి భారతాఖ్యమును వేఖ్యంబైన యామ్నాయమున్."

3 ప. 1 ఆ. వి. ప.

అమ్నాయమన వేదము. "లేఖ్యంబైన యామ్నాయ" మన లిఖింపఁదగిన వేదము. వేదములు అలేఖ్యములు. పంచమవేదమైన మహాభారతము లేఖ్యము. ధర్మాద్వైతస్థితి కల మహాభారతము వ్యాసుచు "లోకహితనిష్ఠంబుగాని" రచించినది. ధర్మాద్వైతస్థితి అనగా ధర్మాద్వైతముల ఉనికి. అది పరతత్త్వమునకు మనికి. అంతే కాదు. సంఘర్షణకు పాల్పడి సంఘటారణహోమసంఘటనములకు కారణమైన వీర శైవమతము, వీరవైష్ణవమతము వేదప్రామాణ్యమును కాంక్షించునవియే వేదములను ప్రమాణీకరించునవియే. అందువలన పంచమవేదమైన మహాభారతము సమకాల సమస్యాపరిష్కారసాధనమైన మతసమన్వయసిద్ధాంతమునకు మూలసూత్రము.

ఇది తిక్కన మహాభారతాంధ్రీకరణమునకు సహేతుకమైన, సమీపకాలిక మైన చారిత్రికనైపథ్యము.

## భారతరచనాకాలము

తిక్కన భారతము హరిహరనాథునికి అంకితము. స్వప్నమునందు సాక్షాత్కరించిన హరిహరనాథుడు,

"పారాశర్యుని కృతి యయి
భారతమను పేరఁ బరఁగు పంచమవేదం
బారాధ్యము జనులకుఁ ద
ద్గౌరవ మూహించి నీ వఖండితభక్తిన్. 17 ప.
తెనుఁగుబాస వినిర్మింపఁ దివురుటరయ
భవ్యపురుషార్థతరుపక్వఫలము గాదె
దీని నెడ నియ్యకొని వేడ్క నూని కృతిప
తిత్వ మర్థించి వచ్చితిఁ దిక్కశర్మ" 18 ప. 1 అ. వి. ప.

అనగా తిక్కన బ్రహ్మసంపద్భరితుడై, స్వప్నములోనే తండ్రి కొమ్మనామాత్యుని అనుమతి వడసి, భారతము "దేవసన్నిధిం బ్రశంసింపుటయు నొక్క యారాధనవిశేషం బగుటం జేసి" (31 వచ. 1 అ వి. ప.) హరిహరనాథునికి అంకితము చేసెను. ఆరాధనవిశేషమని భావించుటవలన, ఉత్తరరామాయణము

నందు రచించని దృష్టాంతపద్యములు అయిదు రచించెను అంతేకాదు. అంతేత చిహ్నమైన ఆశ్వాసాదిపద్యము వంటి పద్యములు మూడు ఆశ్వాసమధ్యమునందే కథాప్రారంభమునందు రచించెను (38–40 ప. 1 ఆ. ఏ ప

నారాయణుని పట్టము గట్టిన (27 ప 1 ఆ. ఏ. ప) భారతములోని అవతారికాశ్వాసాద్యంతపద్యములందు చరిత్రాంశములకు తావు లేదు అవి లేనిది రచనాకాలము సునిశ్చితముకాదు ఇతరాధారముల సంభావ్యమైన సమన్వయమే శరణ్యము తిక్కన చరమకాలమును తెలుపు చాటుపద్యమొకటి కలదు [44]

"అంబరరవిశశిశాకా
బ్దంబులు చనఁ గాళయుక్తి భాద్రపదపు మా
సంబున సంబరమలరఁగ
ఒంపనఁ దగు తిక్కయజ్వ బ్రహ్మైక్యసంక్షేత్రమే "

అంబరరవిశశిశాకాబ్దములన 1120+78= 1198 వ సంవత్సరము అది కాళయుక్తి సంవత్సరమే. కాని, ఆ సంవత్సరము తిక్కన జననకాలమగునేమో గాని, చరమకాలము కాజాలదు అంబరశశిరవిశాకాబ్దములైనచో, 1210+78= 1288 వ సంవత్సరమగును కాని ఆ సంవత్సరము కాళయుక్తి కాదు సర్వధారి. పద్యమునందు కాళయుక్తి స్థానమున సర్వధారి సంగతమగును కాని సంవత్సర సంఖ్యకు, సంవత్సరసంజ్ఞకు పాఠాంతరములు గత్యంతరమైన పద్యము ప్రామాణికము కాదుగాని, మనుమసిద్ధికాలము (1250–1268) లోని తిక్కన చరమ కాలము 1268 వ సంవత్సరము కావచ్చును.

అనంతామాత్యుని భోజరాజీయమునందు ఒక విశేషము కలదు. అనంతామాత్యుని ముత్తాత బయ్యన. అతడు "భాసురకవితాచతురుఁడు." (19 ప 1 ఆ.) అంతేకాదు.

"ఇతఁ డగతుకర్తృతామహిమ చేకొని పంచమవేదమైన భా
రతముఁ దెనుంగుబాస నభిరామముగా రచియించినట్టి యు
న్నతచరితుండు తిక్కకవినాయకుఁ డాదట మెచ్చ భవ్యభా
రతి యనఁ బేరుగన్న కవిరత్నము బయ్యనమంత్రి యల్పుఁడే "
24 ప. 1 ఆ.

తిక్కన "క్రమకర్తృతాపహిమ చేకొని" భారతము రచించిన మాట యథార్థము "ఉభారాధనవిధేయతిక్కనసనామధేయప్రణీతంబయిన" అని ఉత్తర రామాయణాశ్వాసాంతగద్యములందును, "ఉభారాధనవిరాజి తిక్కనసోమయాజి ప్రణీతంబయిన" అని మహాభారతాశ్వాసాంతగద్యములందును ఉండుటయే తన్ని దర్శనము సోమయాగము చేసినవాడు సోమయాజి తిక్కనసోమయాజి ఒయ్యన మంత్రి భాసురకవితాచతురతను మెచ్చి భవ్యభారతి అని ప్రశంసించుట కూడ యథార్థమగును. అనంతామాత్యుని కాలము స్థూలముగ 1275–1350 అతని ముత్తాత ఒయ్యనకాలము, శతాద్ది మూడుతరములు లెక్కను స్థూలముగ 1275–1350 అగును. అయిన తిక్కన బయ్యనను భవ్యభారతి అని ప్రశంసించుట అను కూలము కాదు తరమునకు మరొక అయిదు సంవత్సరములు కలిపిన ఒయ్యన కాలము సూక్ష్మముగ 1260–1335 అగును అయిన బయ్యన పాతికేండ్ల ప్రాయమున తిక్కన భవ్యభారతి అని ప్రశంసించుట సానుకూలమగును. ఆ కాలము 1285 ప్రాంతము. కాబట్టి తిక్కన భారతరచనాకాలము స్థూలముగ 1270–1280 కావలయును

హరిహరనాథతత్త్వప్రతిపాదనము తోపాటు విరాటాదిస్వర్గారోహణపర్వాంతము పదియేను పర్వముల సమూహమైన మహాభారతమును తెనుగు సేయుటకు పది, పదియేనుసంవత్సరములు పట్టుట సహజము

# భారతాంధ్రీకరణము

"–ఆంధ్రకవిత్వవిశారదుండు విద్యాదయితుం డొనర్చె మహితాత్ముడు నన్నయభట్టు దక్షతన్" అని నన్నయను అభినందించిన తిక్కన భారతాంధ్రీకరణము నన్నయ భారతాంధ్రీకరణము వలె స్వతంత్రము అందు ప్రపంచీకరణము, క్లుప్తీకరణము, అస్పష్టాభాకరణము, అనంధ్రకరణము, అన్యాంధ్రీకరణము, హరిహరనాథతత్త్వ ప్రబోధము కలవు.

i **ప్రపంచీకరణము :** అజ్ఞాతవాసమునకు బయలుదేరి, విరాట నగరమునకు దారమున ద్రౌపది శ్రమను ప్రకటించును.

"వ్యక్తం దూరే విరాటస్య రాజధానీ భవిష్యతి
వసామేహాపరాం రాత్రిం బలవాన్ పరిశ్రమః." 6 శ్లో. ౭ అ. వి. ప.

"విరాటుని రాజధాని దూరమునందు కలదని వ్యక్తమైనది అపరాత్రిని ఇక్కడే వసింతము. నా మార్గాయాసము మిక్కుటమైనది"

ఇది తిక్కన భారతమునందు ఇట్లు కలదు

"డప్పి జనించె వ్రేళుల పుటంబులు పొక్కె(బొడంగె గోళ్లలోఁ
జిప్పిల(జొచ్చె నెత్తురులు చిత్తము నాకుఁ గడున్ వశంబు గా
దప్పుర మిచ్చటచ్చటను నాసల వచ్చితి నెంత దవ్వొకో
యిప్పటి భంగి నొక్క డుగు నేఁగెడుఁ దానికి నోర్వ నెమ్మెయిన్."
148 ప. 1 ఆ. వి. ప.

ఇందు ద్రౌపది మార్గాయాసము ప్రపంచీకరింపబడినది. "దాహము పుట్టినది. వ్రేళుల అంచులు బొబ్బ లెక్కసాగినవి గోళ్ళలో నెత్తురులు చిప్పిలసాగినవి. చిత్తము స్వాధీనముకాని స్థితి ఏర్పడినది విరాటనగరము ఇక్కడే, అక్కడే అను ఆశతో ఇంత దూరము వచ్చితిని ఇంకను ఎంతదూరమో! ఇప్పటి స్థితిలో ఒక్కడుగు కూడ ముందుకు వేయుటకు ఏవిధముగాను ఓర్చుకోలేను" అను ప్రపంచీకరణము ద్రౌపది దయనీయస్థితికి దర్పణము కరుణరసనిర్భరము.

ii **క్లుప్తీకరణము :** కీచకుడు ద్రౌపది ఉన్నచోటునకు వెళ్ళి, ఆమె సౌందర్యమును వర్ణించి, నీచమైన తన ఆంతర్యమును తెలిపినపుడు ద్రౌపది సుదీర్ఘమైన ధర్మోపన్యాసము చేసి తుదిని తన గంధర్వపతులు కుపితులై సంహరింతురని హెచ్చరించినట్లు మూలమునందు కలదు. నీచుడైన కీచకునికి ధర్మోపన్యాసము నిష్ప్రయోజనమని (54 ప 2 ఆ వి. ప) తిక్కన ధర్మప్రసంగశ్లోకములను పరిహరించి, ద్రౌపది తుది మాటను మాత్రమే కత్తి దూసినట్లు పలికినదని రచించెను. అది మూలాతిశాయికమైన పద్యము.

"దుర్వారోద్యమబాహువిక్రమరసాస్తోకప్రతాపస్ఫుర
ద్గర్వాంధప్రతివీరనిర్మథనవిద్యాపారగుల్ మత్పతుల్
గీర్వాణాకృతు లేవు రిప్పు నిను దోర్లీలన్ వెసంగిట్టి గం
ధర్వుల్ మానముఁ బ్రాణముం గొనుట తథ్యం బెమ్మెయిన్."
55 ప. 2 ఆ. వి. ప.

ఇందు "దుర్వారోద్యమ......విద్యాపారగుల్" అను సుదీర్ఘసమాసము ద్రౌపది ఆవేశమును, పాండవుల ప్రతాపమును ప్రకటించును. అందు "గర్వాంధ ప్రతివీర" శబ్దసంపుటి కీచకుడు గర్వాంధుడైన ప్రతివీరుడని సూచించును. "కీచకా" అను ఏకవచన ప్రయోగము కీచకునియెడ ద్రౌపది ఏవగింపును వెల్లడించును. "మానముం బ్రాణముం గొనుట" అను మాట భావ్యర్థమును ధ్వనించును. మూలమునందలి ధర్మోపన్యాసముకంటె తెనుగుసేతలోని రోషోద్ఘాటనము శక్తిమంతము.

iii అన్యథాకరణము : భీష్ముడు అంగనాపూర్వుడైన శిఖండితో యుద్ధము చేయనని చెప్పిన అనంతరము, దుర్యోధనుడు శిఖండిని ఎందుకు చంపరని అడిగినట్లు మూలమునందు కలదు.

"[సహి స్త్రీపూర్వకో రాజన్ శిఖండి యది తే శ్రుతః
కన్యాభూత్వా పుమాన్ జాతే న యోత్స్యే తవ భారత॥]
కిమర్థం భరతశ్రేష్ఠ నైవ హన్యాస్త్వం శిఖండినమ్—"

1 శ్లో. 170 అ. ఉ. ప.

భీష్ముడు కారణము చెప్పిన తర్వాత దుర్యోధనుడు మఱల కారణమడుగుటకు కారణము అంబోపాఖ్యానకథనము. అది ప్రకరణోచితము కాదు. అందుకు తిక్కన కావించిన అన్యథాకరణమిది:

"పాండవుల దిక్కు వీరుల
ఖండితబలులైన నా మొగంబునఁబడి యు
ద్దండత చూపఁగలేరు శి
ఖండిని నొక్కరునిఁ జంపఁగాని కుమారా!
అనవుడు దుర్యోధనుఁ డా
తని మీఁద వధింపమికిఁ గతంబేమియొకో
వినఁదగు నేనిం జెపుడా
యనుటయు నిట్లనియె భీష్ముఁ డతనికి నెమ్మిన్."

270, 271 ప. 4 ఆ. ఉ. ప.

ఇందు భీష్ముడు ముందు శిఖండిని చంపననియెనే గాని కారణము చెప్పలేదు. దుర్యోధనుడు కారణమడిగెను. భీష్ముడు చెప్పిన కారణము అంబోపాఖ్యానకథనమే. ఇది ప్రకరణోచితము కార్యకారణసంబంధము సుస్థగితము.

iii అనాంధ్రీకరణము : 1 సనత్సుజాతీయము- విదురుడు ధర్మ పథము నీతితత్త్వము వివరించిన తదుపరి, ధృతరాష్ట్రుడు పరమార్థదృష్టి కలుగు వాక్యములు చెప్పుమని అడుగును. విదురుడు భక్తిస్మరణమున సనత్సుజాతుడను మునిశ్రేష్ఠని రప్పించును. సనత్సుజాతుడు పరమార్థదృష్టి కలుగు వాక్యములు చెప్పను సనత్సుజాతుడు బోధించిన పరమార్థతత్త్వము సనత్సుజాతీయము. అది తిక్కన తెనిగింపలేదు.

"సనత్సుజాతుం డధ్యాత్మవిషయంబులగు వివిధవాక్యంబుల
సోపానప్రకారంబున నంతకంతకు సూక్ష్మంబులగు నర్థంబులు సమ
ర్థించుచు నందుఁ బ్రజ్ఞాచక్షుం డెయ్యది యేర్పడ నడిగె నదియెల్ల
వివరించుచు హృదయపుష్కరకలితంబగు పరతత్త్వంబు ప్రసా
దించునట్లి గూఢోక్తు లనుగ్రహించుచుండ –"

106 వచ. 2ఆ ఉ. ప.

అని మాత్రము సనత్సుజాతీయమును అధ్యాహార్యము చేసెను.

"ఈ తత్త్వోపదేశమువలన నంధరాజు ధర్మమార్గానువర్తి కాలేదు. ఈ యుపదేశము చెవిటివాని ముందు శంఖస్వనమాయెను. ఈ తత్త్వోపదేశము వమ్ము గుటకన్న తొలగుటయే మేలు" అని ఒక అభిప్రాయము కలదు[45] సనత్సు జాతీయము ధృతరాష్ట్రుని పరముగ వమ్మయినది కాని వేదాంతుల పరముగ సొమ్మయినది. శాంకరభాష్యము వెలువడినది వేదాంతవిషయములను సంగ్రహిం చుట తిక్కన ఆంధ్రీకరణపద్ధతి అందువలన శాంకరభాష్యము వెలువడిన సనత్సు జాతీయమును సంగ్రహముగనైన తెనిగించక పోవుట సహజము.

2. భగవద్గీత- ధర్మక్షేత్రమైన కురుక్షేత్రమునందు పాండవులు, కౌరవులు యుద్ధసన్నద్ధులై, యుద్ధము చేయుటకు ఉపక్రమించునెడ, బంధుమిత్రపరిచితులను యుద్ధము చేసి సంహరించుటకు విముఖుడైన అర్జునుని శోకసంవిగ్నమానసస్థితిని మరలించి యుద్ధోన్ముఖుని చేయుటకు కృష్ణుడు చేసిన ఉపదేశముతో కూడినది

భగవద్గీత. భగవద్గీతకును శాంకరభాష్యము కలదు. నాటికి భగవద్గీత 700 శ్లోకముల గ్రంథము తిక్కన ఆ శ్లోకములను తెనిగింపలేదు. "వలయు వాక్యంబులు చెప్పి యుపదేశించి," "వినయుం డవగిన వానికెల్ల సదుత్తరంబు లిచ్చి సందేహంబువాపుచు" అని (2.. వచ 22 ప 1 ఆ. భీ. ప) వేదాంతవిషయములెల్ల విడిచిపెట్టి అద్భుతములు గా పద్యగద్యములందు అతిసంగ్రహముగ తెనిగించెను. వేదాంతవిషయములను సంగ్రహించుట, విడిచిపెట్టుట తిక్కన ఆంధ్రీకరణపద్ధతి. శాంతిపర్వములోని వేదాంతవిషయములను సంగ్రహముగానే తెనిగించెను.

**V అన్యాంధ్రీకరణము :** విదురనీతి మూలమునందు విపులముగ కలదు. తిక్కన తెనుగునీతిని సంగ్రహముగ కలదు. నీతి అన రాజనీతి: స రాజనీతి కూడ రాజనీతులెల్లను సహజములైనను ప్రభుసమ్మితములు. కాంతాసమ్మితములు క్వాచిత్కములు. కాంతాసమ్మితమైనదే కవిత్వము కవిత్వమైన రాజనీతి చాటు శ్లోకముల తిక్కన తెనిగించెను.

"పుష్పమాత్రం విచినుయాత్
మూలచ్ఛేదం నకారయేత్
మాలాకార ఇవారామే
న యథాఙ్గారకారకః."
"మాలకరి పుష్పములు గోయు మాడ్కిఁ దేఁటి
పువ్వుఁదేనియఁ గొనియెడు పోల్కి నెదుర
గంపకుండఁగఁ గొనునది కార్యఫలము
బొగ్గలకుఁ బోలె మొదలంటఁ బొడువఁజనదు" 57 ప 2 ఆ ఉ ప.

ఇందు మాలాకారుడే మాలకరి తేటి పువ్వుఁదేనియ సామ్యము శ్లోకమునందు లేదు. అది కూడ అమూలకమైనను మనోజ్ఞము అయినను తేటి సామ్యమువలన మాలాకారునికి భిన్నముగ అంగారకారకునికి స్థానము లేదు. అతడు తేటికి భిన్నుడు కాడు. అందువలన పుష్పములు కోయుటకు, తేనె గ్రహించుటకు భిన్నముగ బొగ్గులకు మొదలంట పొడుచుట ప్రసక్తమైనది.

**vi హరిహరనాథతత్త్వము :** ఇది ప్రత్యేకశీర్షికను ప్రతిపాదితము,

# హరిహరనాథతత్త్వము

భారతరచనకు ముందే తిక్కన హరిహరనాథతత్త్వమునకు ప్రాతిపదిక కలదు. అది తిక్కన స్వప్నవృత్తాంతమునందు కలదు. పదియేను పర్వములు రచించుటకు ఉద్యుక్తుడై "ఈ ప్రబంధమండలి కథనాధునిగా నే పురుషుని బేర్కొనువాడనో యను తలంపు గూడిన మదితోనే– ఇంచుక నిద్రించు సమయమున" తిక్కనకు స్వప్నము వచ్చెను. (7,8ప 9వచ 1ఆ.వి.ప.) కావ్యరచనావిషయమైగాని, కృతికర్తృపరముగాకాని, తిక్కనకు పూర్వము స్వప్నము వచ్చిన కవి సంస్కృతాంధ్రకర్ణాటతమిళవాఙ్మయములందు కానరాడు కావున తిక్కనకుస్వప్నము వచ్చుట యథార్థము కావలయును. తర్వాతి కవుల స్వప్నవృత్తాంతములు కథార్థములు కావచ్చును.

తిక్కనకు స్వప్నమునందు ముందు తండ్రి కొమ్మనదండనాథుడు కనిపించి,
"కి మస్థిమాలాం కిము కౌస్తుభం వా
పరిష్క్రియాయాం బహుమన్యసే త్వమ్
కిం కాలకూటః కిమువా యశోదా
స్తన్యం తవ స్వాదు వద ప్రభో మే
యని నీవు దొల్లి రచియించిన పద్యంబు గాఢాదరంబున
నవధరించి భక్తవత్సలుండగు హరిహరనాథుండు నీ దెస
దయాళుండై ......... విజయం చేయుచున్నవాఁడు —"
11వచ.1ఆ.వి.ప.

అని చెప్పెను. పద్యమన శ్లోకము తిక్కన తొల్లి రచించినది. అనగా భారతరచనకు పూర్వమే రచించినది అలంకరణమునందు నీకు అభిమతమైనది. అస్థిమాలయా? లేక కౌస్తుభమా? నీకు మధురమైనది కాలకూటమా? లేక యశోదా మాతృక్షీరమా? అది నాకు చెప్పు ప్రభూ!" అని తిక్కన ప్రశ్న. ఆ ప్రభువు అస్థిమాల అభిమతమైన, కాలకూటము మధురమైన హరుడు కాడు. కౌస్తుభము అభిమతమైన, యశోదామాతృక్షీరము మధురమైన హరి కాడు. అస్థిమాల, కౌస్తుభమును అభిమతమైన; కాలకూటము, యశోదామాతృక్షీరమును మధురమైన

హరిహరనాథుడు. తిక్కనయెడ దయాళువైన భక్తవత్సలుడు హరిహరనాథుడని కొమ్మన చెప్పినవిషయమునందు కలదు

స్వప్నమునందు సాక్షాత్కరించిన హరిహరనాథుని వర్ణనమిది:
"కరుణారసము వొంగి తొరఁగెడు చాడ్పున
శశిరేఖ నమృతంబు జాలువాఱ
హరినీలహార్తిక సురభిచందనమున గతి
నాభి ధవళపంకజము మెఱయ
గఱియైన చెలువున నెఱసిన లోకర
క్షణమనంగ గళంబు చాయ దోఁపఁ
బ్రథమాద్రిఁ దోతెంచు భానుబింబమునా సు
రమ్మునఁ గౌస్తుభరత్న మొప్ప
సురనదియును గాళిందియు బెరసినట్టి
కాంతిపూరంబు శోభిల్లు శాంతమూర్తి
నా మనంబు నానందమగ్నముగఁ జేయ
నెలమి సన్నిధి సేసె సర్వేశ్వరుండు. 12ప.1ఆ.వి.ప.

ఇందు సర్వేశ్వరుడైన హరిహరనాథుని రూపము, లక్షణమును కలదు. శిరసు పైన శశిరేఖ. నాభియందు పద్మము. కంఠమునందు కాలకూటచ్ఛాయ. వక్షస్థ్సలమునందు కౌస్తుభము. గంగాయమునల సంగమము వలె సితాసితకాంతిపూర మైన శరీరము. ఇట్టి హరిహరనాథుడు "తన దక్షిణనేత్రమును సుధారోచియ కా" తిక్కనను చూచెను. (14ప.) ఇందలి సముచ్చయము, అవధారణార్థకము గమనింపఁ దగినవి. దక్షిణనేత్రము కూడ సుధారోచియే అయినదనగా, వామనేత్రము స్వతస్సిద్ధముగ సుధారోచియే అని వ్యంగ్యార్థము అది హరిది పైది హరునిది. అనగా హరిహరనాథుని రూపములోని వామభాగము. హరిది. దక్షిణభాగము హరునిది అని అవగాహనమగును. అర్ధనారీశ్వరుని వలె సర్వేశ్వరుని రూపము హరిహరము. ఎడమవైపు హరిరూపము. కుడివైపు హరరూపము. హరిహరనాథుని రూపము సాకారము. కరుణారసము వొంగి పొరలుట హరలక్షణము. సృష్టికర్త పీఠము పద్మము. హరిలక్షణము. లోకరక్షణము హరలక్షణము. లోకప్రకాశము హరిలక్షణము. తదుభయకుశలమైన హరిహరనాథుని ఆకారము శాంతమూర్తి.

హరిహరనాథుడు దరహాసరసము తళుకొత్త తిక్కనతో ఇట్లనెను.

"వైదికమార్గనిష్ఠమగు వర్తనముం దగ నిర్వహించుచున్
ఖేదము లేని భక్తి మతి నిర్మలవృత్తిగఁ జేయుచుండు మ
త్పాదనిరంతరస్మరణతత్పరభావము కల్మి నాత్మ స
మ్మోదముఁ బొందఁగా గావ్యరసముం గొనియాడుచు నుండు దెప్పుడున్
15ప.1ఆ.వి ప.

ఇందు తిక్కన "వైదికమార్గనిష్ఠమగు వర్తనము" కలవాడు, హరిహరనాథ (మత్) పాదనిరంతరస్మరణతత్పరభావము" కలవాడను అని ఇదమిత్థముగ కలదు. పాదస్మరణము సాకారవిషయము. అది వైదికమార్గనిష్ఠయే అంలేకాదు హరిహర నాథభక్తి అభేదభక్తి. మతికి నిర్మలత్వము కలిగించునది శివుడు పరమదైవమా? విష్ణువు పరమదైవమా? అను చింతకు, పరస్పరద్వేషమునకు అవకాశము లేనిది. ఇది హరిహరనాథతత్త్వప్రయోజనము

"కృతిపతిత్వ మర్థించి వచ్చితి"ననిన (18ప 1ఆ వి ప) హరిహరనాథుని "జన్మాంతరదుఃఖముల్ బొలియునట్లుగఁజేసి సుఖార్యుఁ జేయవే" అని కోరి (21ప. 1ఆ.వి ప) తిక్కన జగన్నాథునికి "బ్రహ్మానందస్థితిం గోరి సర్వాంగాలింగితమహీ తలంబగు నమస్కారంబు సే"సెను. (22వచ 1ఆ వి ప) తిక్కన ధ్యేయము పునర్జన్మరాహిత్యము. అనగా మోక్షము. అది బ్రహ్మానందస్థితి. తన్మూలము. బ్రహ్మము. అది ద్విపదము సగుణబ్రహ్మము నిర్గుణబ్రహ్మము సగుణబ్రహ్మము సాకారము నిర్గుణబ్రహ్మము నిరాకారము తిక్కన స్వప్నవృత్తాంతములోని సగుణ బ్రహ్మము సందర్భోచితము తిక్కన మహాభారతరచనమునకు శ్రీకారము చుట్టిన ఇష్టదేవతాస్తుతి నిర్గుణబ్రహ్మము

"శ్రీయన గౌరినాఁ బరఁగు చెల్వకుఁ జిత్తము పల్లవింప భ
ద్రాయితమూర్తియై హరిహరంబగు రూపము దాల్చి విష్ణురూ
పాయ నమశ్శివాయ యని పల్కెడు భక్తజనంబు వైదిక
ధ్యాయిత కిచ్చమెచ్చు పరతత్త్వముఁ గొల్చెద నిష్టసిద్ధికిన్.
అని సకలబ్రహ్మప్రార్థనంబు సేసి—" 1ప.2వచ. 1ఆ.వి.ప

ఇందు పరతత్త్వము "శ్రీయన గౌరినాఁ బరఁగు చెల్వకుఁ జిత్తము పల్లవింప భద్రాయితమూర్తియై హరిహరంబగు రూపము దాల్చి"నది "విష్ణురూపాయ నమశ్శివాయ యని పల్కెడు భక్తజనంబు వైదికధ్యాయిత కిచ్చమెచ్చు"నది.

పరతత్త్వమన పర్రబహ్మము. అది నిరాకారము. నిర్గుణము. అయినను "హరిహరంబగు రూపము దాల్చి"నది ఇది సాకారము. నిరాకారమైన పరబ్రహ్మము "శ్రీయన గౌరినా బరఁగు చెల్వకుఁ జిత్తము పల్లవింప భద్రాయితమూర్తియై" సాకారమైన హరిహరరూపమును దాల్చినది లక్ష్మి అనినను, పార్వతి అనినను ఒప్పునట్టి స్త్రీ ఒక్కతె ఇద్దఱు కాదు ఒక్కతె చిత్తము పల్లవించునట్లు అనగా చిగురించునట్లు పరబ్రహ్మము భద్రాయితమూర్తి అయ్యెను భద్రాయితమూర్తి అనగా "భద్రవదాచరితామూర్తి ర్యస్యతత్ భద్రాయితమూర్తి. శోభనమూర్తిమదితి యావత్" అని అప్పకవి వ్యుత్పత్త్యర్థము శోభనమూర్తిమంతమని అర్థము శోభనమన కల్యాణము. ఇచట జగత్కల్యాణము పరతత్త్వము జగత్కల్యాణమూర్తిమంతమై హరిహర రూపమును దాల్చెనని తాత్పర్యము. నిర్గుణమైన పరబ్రహ్మము జగత్కల్యాణ మూర్తిమంతము కాదు జగత్కల్యాణమూర్తిమంతమును కాదు. అది నిష్క్రియము. ఇది కవిత్వము

హరిహరరూపము ధరించిన పరతత్త్వము "విష్ణురూపాయ నమశ్శివాయ యని పల్కెడు భక్తజనంబు వైదికధ్యాయిత నిచ్చమెచ్చు"నని పద్యమునందు కలదు "ఇచ్చమెచ్చు" అను చోట "నిష్ఠఁబొల్చు" అని అప్పకవి పాఠము. (188 ప.శిఆ.) అన్యత్రమృగ్యము "ఇచ్చమెచ్చు" అను పాఠము గ్రాహ్యము. పరతత్త్వము ఇచ్చమెచ్చునది వైదికధ్యాయిత ధ్యాయి అనగా ధ్యానముచేయువాడు. ధ్యాయిత అనగా ధ్యానము చేయువాని భావము వైదికధ్యాయిత అనగా వైదికమైన ధ్యానము చేయువాని భావము "విష్ణురూపాయ నమశ్శివాయ యని పల్కెడు భక్త జనంబు"భావము "విష్ణురూపాయ నమశ్శివాయ" అనునది వైదికమంత్రము. పలుకుట పారాయణము. వైదికమంత్రపారాయణము చేయు "భక్తజనంబు వైదికధ్యాయిత" వైదికమైన హరిహరాభేదభావము దానిని ఇచ్చమెచ్చునది. పరతత్త్వము పరతత్త్వమన పరబ్రహ్మము అది నిష్క్రియము. ఇది కవిత్వము. హరిహరాభేదభావ ప్రతిపాదకమైన హరిహరరూపము సగుణబ్రహ్మము. కావున తిక్కన "కొల్చెద నిష్టసిద్ధికిన్" అన్న పరతత్త్వము నిర్గుణబ్రహ్మము కావలయును.

"పరతత్త్వముఁ గొల్చెద నిష్టసిద్ధికిన్" అని తిక్కన "సకలబ్రహ్మ ప్రార్థనంబు సేసి"నట్లు ముద్రితగ్రంథములందు కలదు.(2వచ.) అనిచెప్పి పద్యము లోనిపరతత్త్వము సగుణబ్రహ్మము కాఁజాలదు." "సకలబ్రహ్మప్రార్థనంబు సేసి"

అనుచోట 28-10-1770 వ తేదీనాటి తాళపత్రగ్రంథమునందు, ప్రత్యంతరము లందు, 1851 వ సంవత్సరమునందు ముద్రితమైన గ్రంథమునందు "ఇష్టదేవతా ప్రార్థనంబు సేసి" అను పాఠము కలదు [46] అది ప్రకరణోచితము. తిక్కన ఇష్టదేవత పరతత్త్వమే నిర్గుణపరబహ్మమే

పరతత్త్వము దాల్చిన హరిహరరూపము కలవాడు హరిహరనాథుడు. అట్టి హరిహరనాథుడు తిక్కనకు స్వప్నమునందు సాక్షాత్కరించి కృతిపతిత్వ మర్థించెను హరిహరనాథుడైన "పరమేశ్వరునిం గృతినాథుం జేసి" (27ప.1ఆ.వి.ప.) తిక్కన మహాభారతమును రచించెను అందువలన తిక్కన పదియేను పర్వముల లోని నలుబదియారు ఆశ్వాసాద్యాంతపద్యములు (46×4=184) విరాటపర్వము ప్రథమాశ్వాసములోని షష్ఠ్యంతపద్యములు (5) కథాప్రారంభమునందు అదనమైన ఆశ్వాసాదిసదృశపద్యములు (2) మొత్తము (184+5+2191) నూటతొంబది యొకటిపద్యములును హరిహరనాథుని ప్రసంగములే. అవి కేవలము హరిహరనాథ రూపవర్ణనములు కావు. ప్రధానముగ హరిహరనాథతత్త్వ ప్రతిపాదనములు ప్రతి పాదించిన తత్త్వము పరతత్త్వమే. నిర్గుణపరబ్రహ్మమే.

"జననుతబాదరాయణ
మునీంద్రవాగమృతనిధిసముద్భూతాహ్లా
దనకీర్తిసుధాకిరణా
వినతాఖిలభద్రకరణవిశ్రుతచరణా" 432ప 5ఆ.ద్రో.ప.

బాదరాయణమునీంద్రుడు వ్యాసుడే. కాని భారతభాగవతములు వ్యాసకృత ములుగకలవు. బ్రహ్మసూత్రములు మాత్రమే బాదరాయణకృతముగ కలవు కావున బాదరాయణమునీంద్రుని వాగమృతనిధి బ్రహ్మసూత్రములే. బ్రహ్మసూత్రముల పరమార్థము నిర్గుణబ్రహ్మము. బ్రహ్మసూత్రవాగమృతనిధినుండి పుట్టిన ఆహ్లాదము కలిగించు కీర్తిసుధలు కిరణములుగా కలవాడు హరిహరనాథుడు. అమృతశబ్దమునకు జలమని కూడ అర్థము. సముద్రమునుండి పుట్టిన చంద్రునితోడి సాదృశ్యమునకు కీర్తిసుధాకిరణముల రూపకము హరిహరనాథుడు బ్రహ్మసూత్రములనుండి పుట్టిన వాడని తాత్పర్యము. నిర్గుణబ్రహ్మమునుండి సముద్భూతమైన సగుణబ్రహ్మమని సారాంశము. సగుణమైన హరిహరనాథుని తత్త్వము నిర్గుణబ్రహ్మము. ఇష్టదేవతా స్తుతిలోని "భద్రాయితమూర్తియై" అను విశేషమునకు, ఈ పద్యములోని "భద్ర

కరణ"విశేషణము అనుగుణమైనది. నిర్గుణబ్రహ్మమునకు నిధానము అద్వైత సిద్ధాంతము. అది హరిహరనాథతత్త్వము

హరిహరాభేదముకంటె భిన్నమైనది హరిహరరూపము. హరిహరరూపము కంటె మిన్నయైనది హరిహరనాథతత్త్వము. హరియే హరుడు, హరుడే హరి, ఇద్దఱును అభిన్నులనుట హరిహరాభేదము. తిక్కనకు పూర్వమే మల్లికార్జునపండి తుడు వెలనాటి చోడుని సభలో హరిహరాభేదమును ఖండించి, హరిహరతారతమ్య మును స్థాపించుట—పాల్కురికి సోమనాథుని పండితారాధ్యచరిత్రయందు విపులముగ, తీవ్రముగ కలదు. ఆద్యంతములివి.

"విను 'శివరూపాయ విష్ణవే' యనఁగఁ
జెనసి వెండియు యథాశివమయోవిష్ణు'
రన నొక్క చందమే యయ్యిరువురును
జన శివవిష్ణులు సమమేని జగతిఁ
బొనరఁ గంఠంబు కప్పు, రొమ్ము మచ్చ
యును దక్క తనుకాంతు లొక్క చందములె?

××× ××× ×××

హరిహరు లొక్కడే యని పల్కుచుంట
వెరవరి శివరూపు విష్ణురూపనుట
సిద్ధ మన్యోన్యవిరుద్ధంబు విన న
బద్ధంబు నరకసమృద్ధంబు, నతిని
షిద్ధంబుఁ గావునఁ జెన్నటి ప్రశ్న
నిద్దర వినఁగూడునే?........" ప్ర.సం.పుటలు668-676.

ఇందు హరిరూపము హరిరూపమే హరరూపము హరరూపమే హరిహర రూపము లేదు. వామభాగమున పార్వతి, దక్షిణభాగమున పరమేశ్వరుడు కలిసి అర్ధనారీశ్వరరూపము వలె, వామభాగమున హరి, దక్షిణభాగమున హరుడు కలిసినది హరిహరరూపము. అది తిక్కన కనిపెట్టినది కాదు. అట్టి హరిహరనాథవిగ్రహములు, హరిహరనాథదేవాలయములు తిక్కనకు పూర్వమే కలవు. బాదామిగుహాలయము లందు ఆరవశతాబ్దిని పశ్చిమచాళుక్యరాజు పృథ్వీవల్లభుడు చెక్కించిన హరిహర మూర్తి కలదు.[47] నెల్లూరు-ఉదయగిరి ప్రాంతమునందు భైరవుని కోనలో ఎనిమిదవ

శతాబ్దిని పల్లవరాజు రెండవ నరసింహవర్మ చెక్కించిన హరిహరమూర్తి కలదు[48]
హరిహరరూపము సగుణబ్రహ్మమైన నిర్గుణబ్రహ్మము తిక్కన హరిహరనాథ
తత్త్వము

# ప్రబంధమండలి

విరాటాదిస్వర్గారోహణపర్యంతము పదియేను పర్వముల భారతము
"ప్రబంధమండలి" అని తిక్కన ప్రతిపాదనము (7, 8 ప 1 ఆ. వి. ప)

"కావున భారతరూపమున నతఁడు రచింపఁదలఁచికొనినది ప్రబంధమండలి
గాని యొక్క కృతి మాత్రము కాదనుట స్పష్టమగుచున్నది ... ... అందలి యే
ఘట్టమున కా ఘట్టము నొక ప్రబంధముగాఁ జేయఁదలంచినట్లు కనపడుచున్నది.
విరాటపర్వమొక ప్రత్యేకప్రబంధమే యనియు నిందలి లక్షణములే తరువాతి
ప్రబంధకవులకు మార్గదర్శకములైనవనియు మన మించుక పరిశీలనాదృష్టితోఁ
జూచినగోచరమగును. అని ఒక అభిప్రాయము కలదు.[49] ఇంచుక పరిశీలనాదృష్టితో
గాక ఇతోధికపరిశీలనాదృష్టితో చూచిన ఈ అభిప్రాయము సరియైనది కాదని
స్పష్టమగును.

"కావున భారతామృతముఁ గర్ణపుటంబుల నారఁ గ్రోలి యాం
ధ్రావలి మోదముం బొరయునట్లుగ సాత్యవతేయసంస్మృతి
శ్రీవిభవాస్పదంబయిన చిత్తముతోడ మహాకవిత్వదీ
క్షావిధినొంది పద్యముల గద్యములన్ రచియించెదం గృతుల్."

30 ప. 1 ఆ. వి. ప.

అను తిక్కన పద్యములోని కృతులు పర్వములు. తన భారతములోని
పర్వములే కాదు, నన్నయ భారతములోని పర్వములును కృతు లనియే తిక్కన
స్పష్టప్రతిపాదనము-

"ఆదరణీయసారవివిధార్థగతిస్ఫురణంబు గల్గి య
ష్టాదశపర్వనిర్వహణసంభృతమై పెనుపొందియుండ నం

వాదిఁ బొదంగి మూఁడు కృతు లాంధ్రకవిత్వవిశారదుండు వి
ద్యాదయితుం డొనర్చె మహితాత్ముఁడు నన్నయభట్టు దక్షతన్ "
6 ప. 1 ఆ. వి. ప

నన్నయభట్టు దక్షతతో మూఁడు కృతు లొనర్చెను. ఆ మూడుకృతులు ఆది సభారణ్యపర్వములు అ మూడుపర్వములు కృతులు. తన పదియేను పర్వములు కృతులు మొత్తము మహాభారతములోని అష్టాదశపర్వములును కృతులే. కృతి అన కావ్యము కావ్యమే ప్రబంధము పదునెన్మిదిపర్వముల మహాభారతమును ప్రబంధ మండలియే. నన్నయ మూడుపర్వముల భారతమును ప్రబంధమండలియే. తిక్కన పదియేను పర్వముల భారతమును ప్రబంధమండలియే మండలి అన సమూహము. ప్రబంధమండలి అనగా కృతుల సమూహము. కావ్యముల సమూహము.

ప్రబంధశబ్దమునకు బహ్వర్థములు కలవు గ్రంథము, కావ్యము, గేయము, పర్వము, ఆశ్వాసము కూడ ప్రబంధశబ్దార్థములే ప్రబంధశబ్దమును ప్రథమతః తిక్కన ప్రయోగించెననీ, నన్నయ ప్రయోగింపలేదని ప్రచురప్రచారమునందు కలదు కాని ప్రబంధశబ్దమును ప్రథమతః నన్నయ ప్రయోగించెను. తదుపరి పాలకుఱికి సోమనాథుడు ప్రయోగించెను తిక్కన కూడ మహాభారతమునందు మాత్రమేగాక తత్పూర్వరచనమైన ఉత్తరరామాయణమునందును ప్రబంధశబ్దమును ప్రయోగించెను

"—సత్యవాక్ప్రబంధశతసహస్రశ్లోక
సంఖ్యమయిన దాని సర్వలోక
పూజ్యమయిన దాని బుధనుతవ్యాసమ
హామునిప్రణీతమయిన దాని—" 9 ప 3 ఆ. ఆ ప.

ఇది నన్నయ పద్యము ఇందు ప్రబంధశబ్దము ప్రయుక్తము. వ్యాసమహా ముని ప్రణీతమయినది మహాభారతము అది సర్వలోకపూజ్యమయినది. అంతేకాదు. సత్యవాక్ప్రబంధశతసహస్రశ్లోకసంఖ్యమయినది మహాభారతము సత్యవాక్ప్రబంధములతో శతసహస్రశ్లోకములు కలది శతసహస్రశ్లోకములు కల అష్టాదశ పర్వములును సత్యవాక్ప్రబంధములే. ప్రబంధశబ్దార్థమిట పర్వము.

"బసవపురాణప్రబంధంబునందు" పం. చ ప్ర. సం. పుట 11
"బసవపురాణప్రబంధమన్ పేరి" " " " 14.
"ఆరూఢపద్యగద్యప్రబంధ
పూరితసంస్కృతభూయిష్ఠరచన" " " " 18
"పండితారాధ్యప్రబంధనిస్తార
పండితారాధ్యప్రబంధవిస్తార
పండితారాధ్యప్రబంధశృంగార
పండితారాధ్యప్రబంధప్రపూర
పండితారాధ్యప్రబంధానుసార
పండితారాధ్యప్రబంధఘోరహార
పండితారాధ్యప్రబంధవిత్సార
పండితారాధ్యప్రబంధసత్కార
పండితారాధ్యప్రబంధావతార"– ప్రకరణాంతద్విపదలు. పుట 257.

ఇవి పాలకురికి సోమనాథుని ప్రయోగములు. ఇందు ప్రబంధశబ్దము బహుధా ప్రయుక్తము. బసవపురాణము ప్రబంధము. పండితారాధ్యచరిత్ర ప్రబంధము. ఆరూఢపద్యగద్యములు ప్రబంధములు. ప్రబంధశబ్దార్థమిట కావ్యము

"అనవిని గారవంబు హృదయంబునఁ బుట్టఁగ వారిఁ జూచి య
య్యినకులముఖ్యుఁ డుత్సుకత నెవ్వరి వారల రీ ప్రబంధ మే
మునికృత మన్న నాదికవి మోము గనుంగొని యక్కుమారులం
దనుమతి గాంచి యిట్లనిరి యా నృపచంద్రునకుం బ్రియంబుగన్"
123 ప. 10 ఆ.

"సకలవిద్యలయందుఁ బ్రశస్తి కెక్కి
యక్కుమారులు రామాయణాఖ్యమైన
మత్ప్రణీతప్రబంధంబు మధురగేయ
సహితముగ నభ్యసించిరి సచ్చరిత్ర" 136 ప. 10 ఆ.

ఇది తిక్కన ఉత్తరరామాయణములోని ప్రయోగములు. కుశలవులు పాడిన రామాయణమును ఉద్దేశించి "ఈ ప్రబంధ మే మునికృతము?" అను రాముని

ప్రశ్న మొదటి పద్యమునందు కలదు. రామాయణము ప్రబంధమని తిక్కన ప్రయోగము. అంతేకాదు. కుశలవులు రామయణాఖ్యమైన మత్కృతప్రబంధమును మధురగేయసహితముగ అభ్యసించిరని వాల్మీకి ప్రకటన. వాల్మీకి ప్రణీతమైన సంస్కృతరామాయణము ప్రబంధమని తిక్కన ప్రయోగము ప్రబంధశబ్దార్థమిట సంస్కృతకావ్యము సంస్కృతాంధ్రభాషాభేదరహితముగ ప్రబంధశబ్దమును కావ్య సామాన్యవాచిగ ప్రయోగించిన తిక్కన "ప్రబంధమండలి"లోని ప్రబంధశబ్దమును కావ్యసామాన్యవాచియే.

[గ్రంథార్థకమైన గేయార్థకమైన, ఆశ్వాసార్థకమైన ప్రబంధశబ్ద ప్రయోగములు రాయలయుగమునందు, ప్రబంధ మొక ప్రత్యేకభేదమా ? అను శీర్షికను ఉదాహరింతును. ఇట పర్వార్థకమైన, కావ్యార్థకమైన, సంస్కృతకావ్యార్థకమైన ప్రబంధశబ్దప్రయోగములు చాలును.]

తిక్కన భారతమునందు ప్రతిపర్వములోని ప్రతిఘట్టమును ప్రత్యేకభేద మనెడు ప్రబంధముగా లేదు విరాటపర్వములోని ప్రతిఘట్టము కూడ అట్లు లేదు. కీచకవధఘట్టము మాత్రమే తదాభాసముగ అట్లు కలదు. విరాటరాజు సేనానియైన కీచకుడు ద్రౌపదిని చూచి, కామబాణప్రపీడితుడై ద్రౌపదిని కామించినట్లు కలదు. "కీచకః కామయామాస కామబాణప్రపీడితః". (6 శ్లో. 14 అ) అది తిక్కన భారతమునందు ఏడు పద్యములందు కలదు. (23–31ప. 2 ఆ) కీచకుడు కామ ప్రకటనము చేయుట సంస్కృతభారతమునందు ఇరువదిరెండు శ్లోకములందు సంగ్రహముగ కలదు. (13-35శ్లో. 14 అ.) అది తిక్కన భారతమునందు ఇరువదిపద్యములందు సవివరముగ కలదు. (52,67,83–86, 117,118,121–124 245,250, 252–257) సంస్కృతభారతమునందు లేని కీచకుని విరహావస్థ అయిదు పద్యములందు (292 – 298), కీచకుడు ఉద్యానవనమునందు విహరించుట, విరహించుట పది పద్యములందు (303–313) తిక్కన భారతమునందు కలదు. అంతేకాదు సంస్కృతభారతమునందు లేని ప్రభాత వర్ణన ఆరు పద్యగద్యములందు (236–241) సూర్యాస్తమయవర్ణన రెండు పద్యములందు (318, 319) చంద్రాస్త మయవర్ణన ఒక పద్యమునందు (321) నాట్యశాలవర్ణన ఒక గద్యమునందు (325) తిక్కన భారతమునందు కలవు. అమూలకమైన, అతివేలయైన తిక్కన ప్రతినాయక

విరాటపర్వమునందు అనుచితమైన, అసభ్యమైన సంభోగవర్ణన కలదు (310) అది కీచకుడు ద్రౌపదితోడి సంభోగమును ఊహించుట.

ఎఱ్ఱాప్రెగ్గడ తిక్కన భారతములోని కీచకవధఘట్టమును ప్రత్యేక కావ్యముగ పరిగణించినచో నీచుడు నాయకుడగును. పీనుగతో "నీ యుత్తమనాయకత్వ మెఱిగి నిన్నుఁ గొనియాడ నే నెంతదాన" అని ద్రౌపది అన్నట్లు తిక్కన రచనమే (36 ప) అనగా కీచకుని నాయకత్వము అధమనాయకత్వమని అవగాహన మగును. అంతేకాదు "కీచకాధముఁడు" అని తిక్కన స్వవచనమే. (35, 116 ప 2 ఆ) అధమనాయకత్వనిరూపణమునకు లక్ష్యాధారాబలిదానము సమంజసము కాదు సైరంధ్రి ద్రౌపది అని కీచకునికి తెలియకపోయినను, పరదార, పతివ్రత అని తెలియును. (50, 80, 72 ప. 2 ఆ.) అధమనాయకుని పారదారిక శృంగార ప్రవణత్వము రాయలయుగములోని కవులకు మార్గదర్శకము కాలేదు క్షీణ, దక్షిణాంధ్రయుగములలోని కవులకు మాత్రమే మార్గదర్శకమైనది. అది క్షీణ లక్షణమే.

ప్రబంధమండలి అనగా పద్యసమూహము

# మహాకవిత్వ దీక్షావిధి

మహాభారతమును "తెనుఁగుబాస వినిర్మింపఁదివురు టరయ భవ్యపురుషార్థ తరుపక్వఫలము గాదె?" అని హరిహరనాథుని ప్రశంస. (17 ప.) "మహాకవిత్వ దీక్షావిధినొంది పద్యముల గద్యములన్ రచియించెదం గృతుల్" అని తిక్కన ప్రయత్నము. (30 ప 1 ఆ వి. ప.) తెలుగు భాషలో మహాభారతమును మహా కవిత్వదీక్షావిధినొంది వినిర్మించుట తిక్కన భవ్యపురుషార్థతరుపక్వఫలమేగాక, ఆంధ్రావళి భవ్యకోతార్థతరుపక్వఫలము కూడ. "ఆంధ్రావలి మోదముం బొర యునట్లుగ" రచియించెదనని తిక్కన పూనికయే (30 ప. 1 ఆ.) ఎఱ్ఱన అన్నట్లు తిక్కన "తన కావించిన సృష్టి తక్కొరుచలచేతం గాదు నాఁ ...... జను మహాత్మాప్తిం గవిబ్రహ్మ"యే. (9 ప 1 ఆ. పూ. భా. హ. వం) నన్నయ "తెనుంగునన్ మహాభారత సంహితారచనబంధురు"డైనను, నన్నయ సంస్కృత ప్రాయిష్ఠరచన సమధికము. తిక్కన 'తెనుఁగు బాస' మిక్కుటము. శివకవుల జానుతెనుగు కంటె జాణతనము కలది. అది కేవలము "అలఁతి అలఁతి తునియల కాహళ" సంధానము కాదు. అర్థప్రకాశముతైన అణిముత్యముల పోహళవిధానము

కూడ. నన్నయ కవిత శబ్దార్థసమప్రధానము. తిక్కన కవిత అర్థగౌరవప్రధానము. అది ధ్వనిమార్గము కావ్యాత్మయైన ధ్వని కల రచనమే మహాకవిత్వము.

ధర్మరాజు తన అజ్ఞాతవాసవిధానమును తెలిపి, భీమార్జుననకులసహదేవులు తెలిపిన వారి అజ్ఞాతవాసవిధానములను అంగీకరించి, ద్రౌపది అజ్ఞాతవాసవిధానము గురించి ఆలోచనలో పడును. "ఈమె ప్రియురాలు. భార్య ప్రాణాధికురాలు. తల్లి వలె కాపాడవలసినది జ్యేష్ఠసహోదరి వలె పూజింపవలసినది. ఏమి పని చేయుచు సంచరించును? కొంచెము కూడ తెలియుట లేదు సుకుమారి, బాల, రాజపుత్త్రి, యశస్విని, పతివ్రత, మహాభాగ ఎట్లు సంచరించును? "అని ధర్మరాజు అన్నట్లు సంస్కృతభారతమునందు కలదు (12–15 శ్లో 3 అ వి. ప) ఇది తిక్కన భారతమునందు ఇట్లు కలదు

"ఇది గడు ముద్దరాలు పనులేమియుఁ జేయఁగ నేర దెంతయున్
మృదు వొక కీడుపాటునకు మేకొనఁజాల దుదాత్తచిత్త యిం
టి దిరుగు దాని కోర్కి వొకటేం దనుఁడా నవరించు చొప్పెఱుం
గదు తగ నొండులం గొలువఁగా వెర వెమ్మెయిఁ గల్గు నక్కటా!"
103 ప 1 ఆ వి ప.

ఇది ధర్మరాజు "హెంచారి నాలోకించి ఖిన్నాంతఃకరణుండగుచు" పలికినది. (102వచ.) ఇందు మూలములోని బాల కడు ముద్దరాలు; సుకుమారి ఎంతయున్ మృదువు. కడమ విశేషణములు లేవు. ఉదాత్తచిత్త అను విశేషణము మూలము నందు లేదు అంతేకాదు మృదువు, ఉదాత్తచిత్త అను సంస్కృతపదములు వినా మరొక సంస్కృత పదము లేదు. అన్నియును అలతి అలతి తెలుగు పదములే. మూడు విశేషణములకు మూడు విశేషములు కలవు. కడు ముద్దరాలు అనగా మిక్కిలి అమాయకురాలు అందువలన ఏ పని చేయుట కూడ చేత కాదు ఎంతయున్ మృదువు అనగా మహాసుకుమారి. కాబట్టి ఏ పాటి కీడు వాటిల్లినను సహించలేదు ఉదాత్తచిత్త అనగా గొప్ప మనసు కలది. కావున ఒంపరిగ తిరుగుటకు ఒప్పుకొనలేదు ఎప్పుడును అయిదుగురుతోను కలిసియున్నది. ఏమి చిక్కులు వచ్చినను ఒక్కటి కూడ తనంతతాను నవరించుకొనలేదు. అట్టిది ఒరులను కొలుచుటకు ఉపాయమెట్లు కలుగును? అక్కటా! అనుటవలన కలుగదని తాత్పర్యము. ఇది వాచ్యార్థము. అమాయకురాలన అవివెకురాలు తెలివి ఉపయోగించి పనులు చక్కబెట్టుకొనలేదు. మహాసుకుమారి అనగా మహాసౌందర్యవతి. ఎంతైన కీడు

కలుగు అవకాశము కలదు ఏపాటి కీడును సహించలేదు. ఉదాత్తచిత్త కావున అనుదాత్తచిత్తులవలన ఆపదలు ఘటిల్లును. ఒక్కటి కూడ తనంత తాను తప్పించు కొనలేదు తప్పక ఒకరిపై ఆధారపడును. ఆ వ్యక్తి ఆవేశమునకు లోనైన అజ్ఞాత వాసమునకు ప్రమాదము వచ్చును. అనంతరకథలో అదే జరిగినది ద్రౌపది కీచ కుని బారినుండి తప్పించుకొనలేక పోయినది భీమునిపై ఆధారపడినది. భీముడు కీచకుని, ఉపకీచకులను సంహరించెను. అది దుర్యోధనాదులకు సంశయము కలి గించెను అజ్ఞాతవాసమునకు ప్రమాదము తటస్థించెను అజ్ఞాతవాసమునకు ప్రమా దము రాని ఉపాయము లేదని ధర్మరాజు ఖిన్నాంతఃకరణములోని అంతరార్థము. ఇది ధ్వన్యర్థము

కీచకునిచేత పరాభవమునందు ద్రౌపదిని చూచి, మత్తమాతంగము వలె వన స్పతిని చూచుచున్న భీముని వారించి ధర్మరాజు "ఏ వృక్షమును చూచుచున్నావు? కట్టెలు కావలసినచో బయటి వృక్షమును గ్రహింపు" మన్నట్లు సంస్కృతభార తమునందు కలదు.

"అలోకయసి కిం వృక్షం సూద దారుకృతేన వై
యది తే దారుభిః కృత్యం బహి ర్వృక్షా న్నిగృహ్యతామ్"

అధస్సూచిక. 317.

ఇది తిక్కన భారతమునందు ఇట్లు కలదు.

"వలలుం డెక్కడఁ జూచె నొండెడ ససేవ్యక్ష్మాజముల్ పుట్టవే
ఫలితంబై వరశాఖ లొప్పఁగా ననల్పప్రీతి సంధించుచున్
ఏలసచ్ఛాయ నుపాశ్రితప్రతతికెన్ విశ్రాంతి గావింపఁగాఁ
గల యీ భూజము వంట కట్టియలకై ఖండింపఁగా నేటికెన్."

136ప.2ఆ.వి.ప.

ఇది విరాటరాజు కొలువుకూటము వైపు ద్రౌపదిని తఱుముకొనివచ్చుచున్న కీచకుని చూచి, భీముడు ఆగ్రహోదగ్రుడై, విరాటరాజును కూడ తుదముట్టించుటకు దగ్గఱిలోని ఉన్నతవృక్షమును సాభిప్రాయముగా చూడ, ధర్మరాజు కంటితో వారించి పలికినది. అజ్ఞాతవాసమునందు భీముడు విరాటరాజు వంటమనిషి. పేరు వలలుడు. వంటమనిషికి వంటకట్టెలు అవసరము అందుకు చెట్టు నరుకవలెను. అది ఫలవృక్షము కారాదు. పనికిరాని చెట్టు కావలెను అట్టి చెట్టులు ఎక్కడైన ఉం

డును. ఇక్కడి ఉన్నతవృక్షము ఫలభరితమై వరశాఖలతో అత్యధికప్రీతి కలిగించుచు, చల్లని నీడతో ఆశ్రయించిన ప్రాణులకు విశ్రాంతి నొసగునది అది వంట కట్టెల కొరకు ఖండింపరాదు ఇది వాచ్యార్థము. ఉన్నతవృక్షము విరాటరాజునకు ప్రతీక. అతడు సేవింపదగినవాడు అజ్ఞాతవాసము సత్ఫలితమొసగు వరముల వంటి పదవులిచ్చి అత్యధికప్రీతి కలిగించుచున్నవాడు ఆశ్రయించిన తమ అజ్ఞాతవాసమును నిర్విఘ్నముగ పూర్తి కావింపగలవాడు. అట్టి విరాటరాజు తుదముట్టింపదగినవాడు కాడు అట్టి ప్రయత్నము చేసిన తమ అజ్ఞాతవాసము నిర్విఘ్నముగ పూర్తి కాదు. అన్యులు సేవింపదగినవారు కారు వారిని తుదముట్టించవచ్చును గాని, సేవింపదగిన, సేవింపబడుచున్న విరాటరాజును తుదముట్టించిన తమకే నష్టము. ఇది ధ్వన్యర్థము. ప్రతీక ద్వారా ప్రతీయమానము

యుధిష్ఠిరుని యుద్ధాభిలాష గురించి దుర్యోధనుడు ప్రశ్నించినపుడు సంజయుడు "యుధిష్ఠిరుడు అత్యంతముదితుడు భీమార్జుననకులసహదేవులును భీతిల్లుట లేదు." అని సమాధాన మిచ్చినట్లు సంస్కృతభారతమునందు కలదు.

—"కింస్విద్ దిచ్ఛసి కౌంతేయో యుద్ధప్రేప్సు ర్యుధిష్ఠిరః" 1శ్లో.

"అతీవ ముదితో రాజన్ యుద్ధప్రేప్సు ర్యుధిష్ఠిరః

భీమసేనార్జునౌ చేమౌ యమావపి న బిభ్యతః ॥." 2శ్లో. ౫౭అ ఉ.ప.

ఇది "సమత్సరబుద్ధిం దా నేమనియెడు నయ్యమసూనుం డాతని తెఱంగు సూతము చెపుమా" అని దుర్యోధనుడు అడిగినట్లు (223ప 2ఆ.ఉ ప) తిక్కన భారతమునందు కలదు. ఇందు దుర్యోధనుడు "యమసూనుడు" అనుటలో దురర్థము కలదు అది గ్రహించి, దానికి తగినట్లు సంజయు డొసగిన సమాధానమిది.

"అతఁడు ఘంతనం బనిన నార్చిన మూఁడెడు వేర్పు నెంతయుం
బ్రీతి వహించి తమ్ము లొక పెండ్లికిఁ బోయెడునట్ల యున్నావా
రా తెలివెందునుం గలదె యందలి నాయకు లెప్పుడొక్కొ మా
చేతుల తీట పుత్తుమను చిత్తమ కాని చలింపరేమియున్"

225 ప. 2 ఆ. ఉ ప.

ఇందు ధర్మరాజు "ఎంతయుం బ్రీతి వహించి" యుండెననియేగాక, "ఆర్చిన మూఁడెడు వెర్పు"నని కలదు. భీమార్జుననకులసహదేవులు ఒక పెండ్లికి బోయెడు నట్ల యున్నవారు" అని కలదు. వారి తెలివి మతెవ్వరికిని లేదని కలదు. పాండవపక్షములోని సేనానాయకులు ఎప్పుడు తమ చేతుల తీట పుత్తుమను చిత్త

ముతో ఉన్నారుగాని, ఏమియు చలించుటలేదు. అని కలదు. ధర్మరాజు యుద్ధమనిన వారించుకొలది విజృంభించుననీ, భీమార్జుననకులసహదేవులు యుద్ధమునకొఱకు మహోత్సాహముతో ఉన్నారని, వారి తెలివి అనన్యసామాన్యమైనదని, వారి సేనానాయకులును వెంటనే యుద్ధము చేయుటకు దృఢచిత్తముతో ఉన్నారని వాచ్యార్థము. "అతఁడు" అనగా "యమసూనుఁడు" యుద్ధమునందు విజృంభించి కౌరవనాశనము చేయుననీ, భీమార్జుననకులసహదేవులు యుద్ధమునందు విజయలక్ష్మిని వివాహమాడుదురని, వారి తెలివి కౌరవులకు లేదని, పాండవపక్షములోని సేనానాయకుల రణకండూతి కౌరవపక్షములోని సేనానాయకుల రక్తాలేపమున తీరునని ధ్వన్యర్థము

తిక్కన మహాకవిత్వదీక్షావిధికి మకుటాయమానమైన ఘట్టము- ద్రౌపది రాయబారమునకు వెడలు కృష్ణునికి చేసిన నివేదనము అది సంస్కృతభారతము నందు శాంతుడైన భీమసేనుని చూచి, అశ్రుపూర్ణేక్షణ అయిన ద్రౌపది పలికినట్లు కలదు. (3 శ్లో. 80 అ. ఉ. ప.) ధర్మనందను పలుకులు హృదయతాపమొనరింప ద్రౌపది కనలి గద్గదకంఠియై పలికినట్లు తిక్కన భారతమునందు కలదు. (81 ప. 3 ఆ. ఉ ప) అంతేకాదు. ద్రౌపది నివేదనము మూలమునందు సుమారు ముప్పది శ్లోకములందు కలదు కాని వ్యంగ్యవైభవము క్వాచిత్కము తిక్కన భారతము నందు పదునాలుగు పద్యములందు కలదు ప్రతిపద్యము ధ్వనిప్రధానము. అది "తక్కొరులచేతం గాదు నాఁ జను" తిక్కన కావించిన సృష్టి. నాన్యత్రదర్శనీయము.

ఇది కృష్ణునికి ద్రౌపది తొలి నివేదనము కాదు. మఱి నివేదనము అరణ్యవాసము ప్రారంభములో ద్రౌపది తొలి నివేదనము సంస్కృతభారతమునందు సుమారు డెబ్బదియైదు శ్లోకములందు కలదు. (43-117 శ్లో. 13 అ. అర. ప) అదియెల్ల నన్నయ భారతమునందు అయిదు పద్యగద్యములందు కలదు. (136-140 ప 1ఆ అర. ప.) అప్పటికి ద్రౌపది పరాభవములు కేశగ్రహణము, వస్త్రాపహరణము మాత్రమే ఇప్పటికి సైంధవుని బలాత్కారము, కీచకుని బలాత్కారము మాత్రమేగాక, ఉపకీచకులు కీచకుని శవమునకు ద్రౌపదిని కట్టివైచి శ్మశానమునకు మోసికొనిపోవుట కూడ తోడైనవి. అయినను పాండవులు సంధిసంధానమునకు ఆయత్తపడిరి. అందుకు ద్రౌపది కోపము; దుఃఖము. ఎంత కోపము వచ్చినను, మఱెంత దుఃఖము కల్గినను భర్తృధిక్కారము సాధ్వియైన భార్య

లక్షణము కాదు. వికారాకారము వాచ్యము కాని, ధీకౌశలము వ్యంగ్యమైన ద్రౌపది మానినివేదనము తిక్కన తీర్చిదిద్దిన ధ్వనితిలకము.

"అంతలు సేసి పో నడచి యక్కట సంజయుచేతఁ జెప్పి పు
త్తెంచునె యిట్టి మాటలు మదిం బ్రియమంది యధిష్ఠిరుండు దా
సంతస మూఱి యేవురకు నైదు సుయోధనుఁ డిచ్చు నొక్కొ యీ
కంత కృపావిహీనమతి నాతఁడు నొంచెనె యన్నదమ్ములన్."

101 ప 3 ఆ ఉ ప.

అంతలు సేసి అనగా మాయాద్యూతమున ఓడించి, నిండుసభకు ఏకవస్త్ర యైన పాండవపత్నిని రప్పించి, జుట్టు పట్టుకొని ఈడ్పించి, బంధకి అని పిల్పించి, వస్త్రాపహరణప్రయత్నము కావించి, పండ్రెండు సంవత్సరములు అరణ్యవాస ఖేదము, ఒక సంవత్సరము అజ్ఞాతవాసక్లేశము కల్పించి, అరణ్యవాసమునందు సైంధవుని పరాభవమునకు, అజ్ఞాతవాసమునందు కీచకోపకీచకుల పరాభవములకు పాల్పేసి అని. పో నడచి అనగా పోవునట్లు= వదలిపోవునట్లు= చనిపోవునట్లు ప్రవర్తించి అని ధ్వన్యర్థకములు అక్కట ఆశ్చర్యార్థకమే కాదు సిగ్గు లేక అని ధ్వన్యర్థకము కూడ. సంజయుని రాయబారము సంజయుని స్వబుద్ధివిశేషము కాదు. ధృతరాష్ట్రుని దుర్బుద్ధివిలాసము "నన్నిట ప్రియంబునఁ బంచెడు నప్డు నాకుఁ దేరెంతయు పెద్కఁ దాన వెరవేర్పడఁ జెప్పుచుఁ బన్నఁ బంచె"నని సంజయుని స్వవచనమే. (293 ప. 1ఆ. ఉ. ప.) సంజయునిచేతఁ జెప్పి పుత్తెంచిన సారాంశమిది:

"పాలీక కౌరవులు దు
శ్శీలతఁ జెడఁదలఁచిరేనిఁ జెప్పెద రుధిరా
భీలాన్నంబున కంటెను
మేలగు భిక్షాన్నమైన మీ నడవడికిన్."

329ప.1ఆ.ఉ.ప.

అని ధర్మరాజునకు ధర్మోపదేశము ధృతరాష్ట్రుడు సిగ్గులేక ఇట్టి ధర్మోపదేశము చేయించిన, ధర్మరాజు అంతకంటె సిగ్గు లేక అయిదూళ్లడుగుట భిక్షాన్నమే అని ధ్వన్యర్థము. తమ నడవడికి రుధిరాభీలాన్నము కంటె భిక్షాన్నమే మేలని ధర్మరాజు ఊఱట చెంది ఇష్టపడినను, దుర్యోధనుడు అయిదూళ్లిచ్చునా? అను సందేహము వాచ్యార్థము. ఈయడని వ్యంగ్యార్థము. ఈయక దుర్యోధనుడు కృపావిహీనమతితో అన్నదమ్ములను బాధించునా? అను సందేహము వాచ్యార్థము.

కృపావిహీనమతితోనే అంతలు సేసిన దుర్యోధనుడు అంతకంటె కృపావిహీనమతి తోనే అయిదూళ్లయినను ఈయక అన్నదమ్ములను అంతకంటె బాధించునని ధ్వన్యర్థము అన్ని బాధలు పెట్టినను సిగ్గు లేక ధర్మరాజు భిక్షాన్నమునకు సిద్ధమయ్యెనను ద్రౌపది కోపము, దుఃఖము గర్భితము.

×××     ×××     ×××

"ఇవి దుస్ససేను వ్రేళ్లం
దవిలి సగము ద్రెవ్విపోయి దక్కినయవి కౌ
రవులకడఁ దీఱుమాటల
యవసరమునఁ దలఁపవలయు నచ్యుత వినుమీ 116ప 8ఆ.ఉ.ప.

ఇది "క్రొమ్ముడి గ్రమ్మన విడ్చి పెంద్రుకల్ దా వలచేతఁ బూని" విషాద రోషములు పొంగ, బాష్పములు గ్రమ్మ ద్రౌపది ఆర్తయై పలికినది ఇట సంస్కృత భారతమునందు దుశ్శాసనకరోద్ధృతములని కలదు. (36శ్లో.80అ) దుస్ససేనుని వ్రేళ్లకు తగిలి సగము తెగిపోయి మిగిలినవి అని తిక్కన భారతమునందు కలదు. దుశ్శాసనకరోద్ధృతములైన శిరోజములకంటె దుస్ససేనుని వ్రేళ్లకు తగిలి సగము తెగిపోయి మిగిలిన పెంద్రుకలు మిక్కిలి సానుభూతి కలిగించునవి. అవి కౌరవుల కడ సంధివచనములు పలుకు సమయమునందు తలంపునకు వచ్చిన, సంధి పొసగించుటకు సంకటస్థితి కలుగును. అవి తలచియైన సంధి పొసగనీయవలదని ద్రౌపది ఆంతర్యము. అది ధ్వన్యర్థము.

ఇట్లనుటకు ముందే, "దుర్యోధనుడు ముహూర్తకాలము బ్రదికినను ఛీ పార్థుని కోదండపాండిత్యము, ఛీ భీమసేనుని బలము" అని ద్రౌపది చీదరించు కొనెను. (31శ్లో80అ) ఇట్లనిన తర్వాత "దుశ్శాసనుని భుజము కనఁబడకుండ పోయిన గాని హృదయమునకు శాంతి కలుగదు" అని ద్రౌపది ప్రతిపాదించెను. (39శ్లో 80అ) ఆ పలుకు, ఈ పలుకు మేళవించి తీగ సాగదీసిన తిక్కన పద్య మిది .

"ఈ పెంద్రుకలు వట్టి యీడ్చిన యా చేయి
దొలుతగాఁ బోరిలో దుస్ససేను
తను వింతవింతలు దునియలై చెదరి రూ
పఱియున్నఁ గని యెడుకాఱుఁగాక
యలుపాల పొనుపడునట్టి చిచ్చే యిది
పెనుగద వట్టిన భీమసేను

బహుబలంబున బాడంచి గాండీవ
మను నొక విల్లెప్పుడును వహించు
కఱ విక్రమంబుఁ గాల్పనే యిట్లు బ
న్నములు వడిన ధర్మనందనుండు
నేను రాజరాజు పీనుంగుఁ గన్నారఁ గానఁ
బడయమైతిమేనిఁ గృష్ణ." 117ప. 3ఆ.ఉ.ప.

"ఈ వెంౖడుకలు" అనగా ద్రౌపది "క్రొమ్ముడి గ్రమ్మల విడ్చి వలచేతఁ బూని గోవిందు ముంపటం బెట్టిన" ఆమె వెంౖడుకలని వాచ్యార్థము. "రాజసూయావభృథంబునందు శుచియై పెనుపొందిన" (110ప) పవిత్రములైన ఆమె శిరోజములని వ్యంగార్థము. ఆ చేయి అనగా దుశ్శాసనుని చేయి అని వాచ్యార్థము పవిత్రములైన శిరోజములని పట్టికొని యీడ్చిన దుశ్శాసనుని అపవిత్రమైన చేయి అని వ్యంగ్యార్థము అట్టి దుశ్శాసనుని చేయి ముందు, మిగిలిన శరీరము తర్వాత యుద్ధమునందు చిన్న చిన్న ముక్కలై, చెల్లాచెదరై, ఆకారము లేకుండ పోయిన స్థితిని చూచి తన ఉడుకు చల్లారునని వాచ్యార్థము. "ఇంతవింతలు" అని ద్రౌపది చూపించిన అంత చిన్న చిన్న ముక్కలని వ్యంగ్యార్థము. "ఉడుకాఱఁగాక" అనగా చల్లారును అట్లు కాక అని వాచ్యార్థము ఉడుకు చల్లారి తీరునని వ్యంగ్యార్థము. ఉడుకునకు హేతువు చిచ్చు అగ్ని. ప్రతీకారాగ్ని. అది "అలుపాల" చల్లారునది కాదు.

"అలుపాల" అను శబ్దము లిఖిత గ్రంథములందు, ముద్రిత గ్రంథములందు, నిఘంటు గ్రంథములందు, వివర్శగ్రంథములందు, పరిశోధన గ్రంథములందును కలదు "అలుపము వైవిణ అల్పము. సీ. ఈవెంౖడుకలు వట్టి... (అలుపాలన్=అల్పకార్యముల చేత" అని శబ్దరత్నాకరము. "అలుపము. విణ (సం. అల్పమ్ క అలుప) అల్పము, కొంచెము సీ. ఈ వెంౖడుకలు వట్టి... (అలుపాలన్=అలుపములను అల్పప్రతిక్రియల చేత" అని సూర్యరాయాంధ్ర నిఘంటువు." అలుపము. వై విణ సీ. ఈ వెంౖడుకలు వట్టి... (అలుపాలన్=అలుపములచేత, అల్పకార్యములచేత" అని ఆంధ్రమహాభారత నిఘంటువు. అదే ప్రయోగము. అదే అర్థము. ప్రయోగాంతరము లేదు. అల్పములకు తిక్కన ప్రయోగము కలదు. "ద్రోణభీష్మకృపకర్ణాటోపమున్ మాన్చు టల్పములం దీఱునె." (5ప. 4ఆ ఉ. ప.) అల్పములన అల్పకార్యములే. అల్పశబ్దమునకు అలుప అను కన్నడ వికృతి కలదుగాని, అలుపము అను తెలుగు వికృతి మృగ్యము. వ్యావ

హారికభాషలోని వైరిసమాసములందు అలప అను తెలుగు వికృతి కలదు అలప సిరితనము. అల్పశబ్దము వంటి కల్ప, తల్ప, శిల్పశబ్దములకును కలుపము, తలుపము, శిలుపము అను తెలుగు వికృతులు కనరావు అలపము, కలపము, తలపము, శిలపము అను తెలుగు వికృతులును కనరావుగాని వినవచ్చును. కాని తిక్కన ప్రయోగము కాఁజాలదు "అల్పములం దీఱునె" అను ప్రయోగమునందు సాధుత్వము, సారళ్యము కలదు "అలు(ల)పాలఁ బొన్పడః" అను ప్రయోగము నందు సాధుత్వమును లేదు సారళ్యమును లేదు. సందర్భోచితమును కాదు. సందర్భము సంధి ప్రయత్నము అది ఒక్కటే అంతేకాదు అది అల్పప్రతి క్రియ, అల్పకార్యము, స్వల్పకార్యము కాదు. ధర్మరాజు ప్రయత్నము సంధి. ద్రౌపది ప్రబోధము యుద్ధము పద్యమునందు "పోరిలో" అని కలదు పోరు అనగా యుద్ధము యుద్ధమునకు విరుద్ధమైనది సంధి యుద్ధమువలన ద్రౌపది ప్రతీకారాగ్ని చల్లారును. సంధివలన చల్లారదు. సంధివిషయమే సందర్భోచితము. కృష్ణుని రాయబారమునకు సంబంధించిన పాండవుల సంధివిషయము తమ పాలైన అర్ధరాజ్యము. (7, 50, 78, 90, 94–97ప 3ఆ. ఉ ప) కాఁబట్టి "అఱపాలఁ బొన్వడు నట్టి వచ్చే యిది" అని తిక్కన పాఠము కావలయును శకటరేఫము లేఖకదోషమువలన ఉవర్ణము కాఁగలదు. అది తదనంతరగ్రంథములకు ఆధార మగును "అఱపాలఁ బొన్పడునట్టి వచ్చేయిది" అను పాఠము సంస్కృత భారతమునకు సన్నిహితము అందు భీమార్జునులు సంధికాముకులైనచో, తవతండ్రి, సోదరులు, తనయులు యుద్ధము చేయుదురని ద్రౌపది తెలుపును (37, 38శ్లో.) దుశ్శాసనుడు నుగ్గు నుగ్గు, దుర్యోధనుడు పీనుగు అగు యుద్ధమే ద్రౌపదికి ధ్యేయము. అర్ధరాజ్యమునకైన సంధి హేయము "అఱపాల" అను పాఠమే అర్థవంతము.

భీమార్జునులు సంధికాముకులైనచో అని కల సంస్కృతభారతమునందు సంధికాముకులగుటకు సావకాశము కలదు తిక్కన భారతమునందు భీమార్జునులు యుద్ధకాముకులగుటకు బద్ధవ్యూహము కలదు. అనేక పరాభవములను అనుభవించిన ధర్మరాజు, తాను, రాజరాజు పీనుగును కన్నారఁ గాంచు స్థితిని పొందనిచో. పెనుగద పట్టిన భీముని బాహుబలమును పాటించి, గాండీవమను ఒక విల్లును ఎప్పుడును వహించు కట్టి విక్రమము కాల్పనా? అని ద్రౌపది ప్రశ్నించినది, పెనుగద అనగా పెద్దగద అని వాచ్యార్థము. దుర్యోధనుడు నిండుసభలో ద్రౌపదిని

తన ఊరుతలమును అధిష్ఠింపుమని సైగ చేసినపుడు, ఆ ఊరుతలమును ఉగ్గిర జాంతరమున భగ్నము చేయుటకు (247వ 2ఆ. స ప), ధృతరాష్ట్రుని సభనుండి అరణ్యవాసమునకు బయలుదేరినపుడు, పరిహారాదు లడ్డమైనను అత్యుగ్రాహవమున దుర్యోధనాదులగు రిపులను చంపుటకు (295వ. 2ఆ. స. ప.) ప్రతిజ్ఞ చేసిన ప్రత్యేకగద అని వ్యంగ్యార్థము పట్టిన అనగా భుజముపై వెసికొని చేతితో పట్టు కొనిన అని వాచ్యార్థము. చేసిన ప్రతిజ్ఞలను చెల్లించుకొనుటకు దీక్ష వహించి పట్టు కొనిన అని వ్యంగ్యార్థము. భీముని బాహుబలమును పాటించి అనగా పరిగణించి అని వాచ్యార్థము భీముని బాహుబలప్రకటనమును అనుసరించి అని వ్యంగ్యార్థము (295వ 2ఆ స ప) గాండీవమను నొక విల్లు అనగా గాండీవమను పేరుగల ఒక విల్లు అని వాచ్యార్థము. ఖాండవవనదహనము నకు అగ్నిదేవుడు, వరుణదేవునిచేత ఇప్పించిన అజేయము, అప్రధృష్యము, అభేద్యము, అన్యసాధనవిదారదక్షము, వజ్రస్థిరము, సర్వలోక మనోజ్ఞమై దివ్యమై వెలుగు గాండీవమను ప్రత్యేకమైన విల్లు అని వ్యంగ్యార్థము. (253వ 8ఆ ఆ ప) అంతేకాదు భీముని బాహుబలప్రకటనమును (295వ. 2ఆ స ప) అనుసరించి, అర్జునుడు పదునాల్గవ సంవత్సరమునందు గాండీవమునుండి వెలువడు బాణములు పానము చేయగా మిగిలిన రక్తమును పక్షుల గుంపులు త్రాగు యుద్ధమునందు తనలో యుద్ధము చేయ కర్ణాది దుర్జనులను సంగ్రామరంగమునందు సంహరింతు నని (296వ. 2ఆ స. ప) ప్రతిజ్ఞ చేసిన ప్రత్యేకమైన విల్లు అని కూడ వ్యంగ్యార్థము ఎప్పుడును వహించు ననగా నిత్యము ధరించునని వాచ్యార్థము. చేసిన ప్రతిజ్ఞను చెల్లించుకొనుటకు దీక్షపూని నిత్యము ధరించునని వ్యంగ్యార్థము రాజ రాజు పీనుంగు అనగా దుర్యోధనుని శవమని వాచ్యార్థము. రాజరాజునను దుర హంకారము కొలది దుర్మార్గుడైన దుర్యోధనుని శవమని వ్యంగ్యార్థము. ఆ శవ మును తాము కన్నులార గాంచుటకు విజృంభింపని కత్తి విక్రమము కాల్పదగిన దని వాచ్యార్థము అర్జునుని విక్రమము దుర్మార్గుడైన దుర్యోధనుని చంపుటకు విజృంభింపవలయునని వ్యంగ్యార్థము ఇది యెల్ల పెనుగద పట్టిన భీముడు, గాండీ వము ధరించిన అర్జునుడు చేసిన ప్రతిజ్ఞలు జ్ఞప్తికి వచ్చి యుద్ధకాముకులగుటకు ఉద్దీపనవిభావము. యుద్ధమే కర్తవ్యమని ద్రౌపది నిశ్చయచిత్తము. అదే తథ్యమని కృష్ణుని అభయహస్తము. (124వ. 'ఆ ఉ ప.)

ధర్మరాజు సూటిగా భీష్ముని వధోపాయము చెప్పుమని అడిగినట్లు సంస్కృత భారతమునందు కలదు. "జయ మెట్లు కలుగును? రాజ్యమెట్లు లభించును? ప్రజా సంక్షయము కారాదు అదెట్లో చెప్పుము నీ వధోపాయమును చెప్పుము ... యుద్ధమునందు దండహస్తుడైన కృతాంతుని వలె క్రుద్ధుడవగు నిన్ను జయించుటకు ఉపాయము చెప్పుము." అని. (68, 69, శ్లో 103 అ.) జయోపాయము, వధోపాయమే. అది వాచ్యముగ కలదు ఇది తిక్కన భారతమునందు ఇట్లు కలదు.

"వరా కెమ్మెయి సామ్రాజ్యము
సేకుఱు నెబ్బంగి బహుళ సేనోత్పాద
వ్యాకులత రాక తక్కుం
జేకొని యత్తెఱఁగు కరుణఁ జెప్పఁగవలయున్ 297 ప.

చిచ్చఱ కన్ను మూసికొని చేతి త్రిశూలము డాఁచి లీలమై
వచ్చిన రుద్రు చందమున వ్రాలుదు నీ వనిలోన నోర్వఁగా
వచ్చునె నిన్ను నెట్టి మగవారికి నీ కృప నాశ్రయింపఁగా
వచ్చితి మెవ్విధిన్ గెలువవచ్చు మహాత్మ యెఱుంగఁజెప్పవే"
299 ప. 3 ఆ. భీ. ప.

ఇందు వధోపాయము చెప్పుమనుట వాచ్యముగ లేదు వ్యంగ్యముగ కలదు. "మాకు ఏవిధముగా సామ్రాజ్యము చేకూరును? ఏవిధముగా అనేక సైనికసంహరణ వ్యాకులత రాకుండ లభించునో ఆ విధమును దయతో చెప్పుము నీ కృప నాశ్రయింపఁగా వచ్చితిమి ఏ విధముగా నిన్ను గెలువవచ్చునో ఎఱుంగఁజెప్పుము" అని వాచ్యముగ కలదు అది చెప్పిన వధోపాయమే అగును భీష్ముని వధోపాయము చెప్పుమనుట వ్యంగ్యమర్యాదను కలదు. "ఓర్వఁగా వచ్చునె నిన్ను నెట్టి మగవారికి?" అనునెడ ఆడవారికి పేడివారికి ఓర్వగా వచ్చునను భావ్యర్థమును ధ్వన్యర్థము మూలములోని దండహస్తుడైన యమునితోడి సాదృశ్యముకంటె, "చిచ్చఱ కన్ను మూసికొని, చేతి త్రిశూలము దాఁచి లీలమై వచ్చిన రుద్రు" తోడి సాదృశ్యము భీష్ముని మహోన్నత్యమును వ్యజ్యమానము చేయును. అది భీష్ముడు నిజవధోపాయము చెప్పుటకు నిమిత్తము. ఇది తిక్కన మహాకవిత్వ దీక్షావిధివిధానము.

# ఉభయకావ్యప్రౌఢిశిల్పము

తిక్కన ఉత్తరరామాయణమునందు "అమలోదాత్తమనీష నే నుభయకావ్య ప్రౌఢిఁ బాటించు శిల్పమునం బారఁగుడం గళావిదుఁడ"నని ప్రకటించెను (13 ప. 1 ఆ) అమలమైన అనగా స్వచ్ఛమైన, ఉదాత్తమైన అనగా ఉత్కృష్టమైన మనీష అనగా బుద్ధితో అని స్పష్టము. ఉభయకావ్యప్రౌఢి అనగా పద్యగద్యోభయకావ్యప్రౌఢి అని ఒక అర్థము చెప్పవచ్చును కాని ఉత్తరరామాయణము పద్యగద్యోభయకావ్యము కాదు. పద్యకావ్యమే అందు పద్యగద్యోభయకావ్యప్రసక్తి అనావశ్యకము కాఁబట్టి ఉభయకావ్యప్రౌఢి అనగా పద్యగద్యోభయప్రౌఢి అను అర్థము వ్యర్థము. దృశ్యశ్రవ్యకావ్యప్రౌఢి అని మఱొక అర్థము చెప్పవచ్చును.[50] దృశ్యకావ్యమునందు కతిపయప్రయోగసూచనములు వినా కవికృతవివరణము లుండవు పాత్రముఖసంభాషణములే ఉండును శ్రవ్యకావ్యమునందు కవికృతవివరణములు, పాత్రముఖసంభాషణములును ఉండును ఉత్తరరామాయణమునందు కవికృతవివరణములు, పాత్రముఖసంభాషణములును కలవు. పాత్రముఖసంభాషణములు కేవలము దృశ్యకావ్యలక్షణము కాదు. శ్రవ్యకావ్యలక్షణము కూడ కాఁబట్టి ఉభయకావ్యప్రౌఢి అనగా దృశ్యశ్రవ్యకావ్యప్రౌఢి అను అర్థము కల్పనాగౌరవమునకు తావలము.

తిక్కనకు ఉభయకవిమిత్రనామము కలదు తత్కారణము కేతన దశకుమారచరిత్రమునందు కలదు.

"అభినుతుఁడు మనుమభూవిభు
సభఁ దెనుఁగున సంస్కృతమునఁ జతురుండై తా
నుభయకవిమిత్రనామము
త్రిభువనముల నెగడ మంత్రితిక్కఁడు దాల్చెన్." 92 ప. 1 ఆ.

మంత్రి తిక్కన మనుమసిద్ధి కొలువుకూటమున తెనుగునందు, సంస్కృతమునందు చతురుడై ఉభయకవిమిత్రనామమును దాల్చెను. తెనుగునందు చతురుడగుటవలన తెనుగుకవులకు మిత్రుడు. సంస్కృతమునందు చతురుడగుటవలన సంస్కృతకవులకు మిత్రుడు. తెనుగు కవులకు సంస్కృతకవులకు మిత్రుడగుటవలన ఉభయ కవిమిత్రుడు ఉభయకవులన సంస్కృతాంధ్రకవులు. కావున ఉభయ కావ్యములు సంస్కృతాంధ్రకావ్యములు కావలయును. ఇది సమకాలికమైన అర్థము.

అంతేకాదు నన్నయ భారతమునందు నన్నపార్యుడు "ఉభయభాషాకావ్యరచనాభిశోభితు"డని కలదు (ప ఆ ఆ ప) సంస్కృతాంధ్రకావ్యరచనాశోభితుడని అర్థము. మంచన కేయూరబాహుచరిత్రమునందు మంచన "ఉభయకావ్యసరణిజ్ఞు"డని కలదు (7ప 1ఆ) సంస్కృతాంధ్రకావ్యసరణిజ్ఞుడనియే అర్థము పోతనభాగవతమునందు పోతన "ఉభయకావ్యకరణదక్షుం"డనికలదు (12వచ. ప్ర.స్కం) సంస్కృతాంధ్రకావ్యకరణదక్షుడనియే అర్థము దృశ్యశ్రవ్యకావ్యకరణదక్షుడని అర్థము కానేకాదు పోతన దృశ్యకావ్యము రచింపనే లేదు తిక్కన "లలితనానా కావ్యములు చెప్పు నుభయభాషలయందు" అని కూడ కేతన దశకుమారచరిత్రము నందు కలదు (ప ఆ) భాషాశబ్దము కలిసి స్పష్టార్థప్రతిపాదకము లేమి క్లిష్టార్థ కల్పకము కాదు కాబట్టి ఉభయకావ్యప్రౌఢిఅనగాసంస్కృతాంధ్రకావ్యప్రౌఢిఅనియే స్పష్టార్థము అంతేకాదు తిక్కనకు పూర్వము నుండి ఆంధ్రకావ్యములు కలవు బహుపూర్వమునుండి సంస్కృతకావ్యములు కలవు సంస్కృతకావ్యములందు దృశ్యశ్రవ్య కావ్యములుకలవు ఆంధ్రకావ్యములందు దృశ్యకావ్యములు లేవు శ్రవ్యకావ్యములే కలవు. కావున ఉభయకావ్యప్రౌఢి సంస్కృతాంధ్రకావ్యప్రౌఢి కావలయును

"ఉభయకావ్యప్రౌఢిం బాటించు శిల్పమునం"దు "ఉభయకావ్యప్రౌఢి" సంస్కృతాంధ్రకావ్యప్రౌఢి అందు పాటించు శిల్పము?- శిల్పశబ్దమునకు తిక్కన ప్రయోగాంతరములు మహాభారతమునందు కలవు

1. "ఆతనితో నొక్కొక్కమఱి
కౌతూహలవృత్తిం దగం దొడఁగి మృదు
ద్యూతంబునఁ గ్రీడింతుం
జేతోమోదమొదవ నతిశిల్పప్రౌఢిన్." 71ప.1ఆ.వి.ప.

ఇది ధర్మరాజు తెలిపినది ఇందు శిల్పశబ్దము, ప్రౌఢిశబ్దము రెండును కలవు అక్షములన పాచికలు పాచికల శిల్పము పాచికలాడు నేర్పు. ఆ నేర్పు అతిశయము ప్రౌఢి శిల్పమన నేర్పు నైపుణి

2. "కలపంబు లభినవగంధంబులుగఁ గూర్చి
తనువున నలఁదుదు ననువుగాఁగ
మృగమదపంకంబు మృదువుగా సారించి
తిలకంబు పెట్టుదుఁ జెలువు మిగులఁ

పువ్వుల బహువిధంబులఁ గట్టి ముడికొక్క
 భంగిగా నెత్తులు వట్టి యిత్తు
హారముల్ మెఱయ నొయ్యారంబుగా గ్రుచ్చి
 యందంబు వింతగా నలవరింతు
వివిధశిల్పములఁ బ్రవీణనై మఱియును
వలయు పనులు వెంట మెలఁగ నేర్తు
మత్స్యరాజమహిషి మనమున మక్కువ
నెలకొనంగ నిట్లు గొలువ నేర్తు" 107ప 1ఆ.వి.ప.

ఇది ద్రౌపది తెలిపినది ఇందు చెపన ద్రవ్యములు సరిక్రొత్త మంచిగంధములుగ కూర్చి అందముగ తనువున అలదుట, కస్తూరిపంకమును సన్నగా సరిదీర్చి చెలువు మిసల తిలకము పెట్టుట, పుష్పాలు బహువిధములుగ దండలు కట్టి ఒక్కొక్క రకమైన ముడికి ఒక్కొక్క విధముగా ఎత్తులు పట్టి ఇచ్చుట, హారములు ప్రకాశించునట్లు గ్రుచ్చి క్రొత్త అందము వచ్చునట్లు అలవరించుట మొదలైనవి వివిధశిల్పములని విశదముగ కలదు ఇవి కూడ నేర్పుచే నైపుణులే.

తిక్కన ప్రయోగాంతరములను బట్టి శిల్పశబ్దార్థము నైపుణి కావ్యపరమైన నైపుణి కావ్యశిల్పము. నిర్మాణమార్మికత "ఉభయకావ్యప్రౌఢిఁ బాటించు శిల్పము" అనగా సంస్కృతాంధ్రప్రౌఢకావ్యనిర్మాణమార్మికత. అది ప్రధానముగా భాషను. వస్తువును ఆశ్రయించియుండును భాషను ఆశ్రయించునది శబ్దసంయోజనము. వస్తువును ఆశ్రయించునది కథాకథనము, పాత్రచిత్రణము, ప్రకృతివర్ణనమును. శబ్దసంయోజననైపుణ్యము శబ్దశిల్పము. కథాకథనకౌశలము, పాత్రచిత్రణపాటవము, వర్ణనావైదగ్ధి కలిసి వస్తుశిల్పము అది, ఇది సంస్కృతాంధ్రకావ్యములకు సమానము "శిల్పమునం బారగుఁడవె" అనియేగాని, "శిల్పములం బారగుఁడవె" అని తిక్కన అనలేదు సంస్కృతాంధ్రములందు అనగా సంస్కృతాంధ్రకావ్యరచనములందు తాను చతురుడు కావున, సంస్కృతకావ్యరచనమునందును, ఆంధ్రకావ్యరచనమునందును శిల్పమున పారగుడని పర్యవసానము

ఇట్టి "శిల్పమునం బారగుఁడవె" అనగా ఇట్టి శిల్పమునందు అవ్వలిగట్టు చేరినవాడనని అర్థము. అంతము చూచినవాడనని తాత్పర్యము ఇది ఉత్తరరామాయణములోని తిక్కన అసాంప్రత్యయము అది మహాభారతమునందు లేదు "నా నేర్చిన భంగిఁ జెప్పి వరణీయుఁడ నయ్యెద భక్తకోటికిన్" అని కలదు.

(28 ప 1 ఆ వి. ప) ఇది వినయపూర్వకనివేదనము తిక్కన "నేర్పెనభంగి"లో శిల్పపారగత్వము గతార్థమే.

## శబ్దశిల్పము
## రసాభ్యుచితబంధము

కావ్యము రసప్రధానము కావున కావ్యశిల్పము రసోపస్కారకము కావలయును. అది శబ్దశిల్పమైననుం వస్తుశిల్పమైనను, ఛందశ్శిల్పమైనను రసోపస్కారకము కానిచో ఆడంబరప్రాయమగును. రసోపస్కారకమైనచో కావ్యము రసవత్తరమగును. రసోపస్కారకమగునది రసోచితము. రసోచితమైన శబ్దసంయోజనమే శబ్దశిల్పము అదే రసాభ్యుచితబంధము.

"వాక్రుత్తు తిక్కయజ్వప్రకారము రసా
భ్యుచితబంధముగ నొక్కొక్క చోట." 13 ప 1 ఆ. కా. ఖం.

అని శ్రీనాథునికి అల్లాడ వేమారెడ్డి కతపత్రము. తిక్కన పద్ధతి రసాభ్యుచిత బంధము బంధమన పదబంధము. పదబంధనము కలది పదబంధము పదబంధనము, శబ్దసంయోజనము పర్యాయపదములు. అభ్యుచితశబ్దములోని అభ్యుపసర్గ ఆధిక్యార్థకము. రసమునకు మిక్కిలి తగిన పదబంధమని అర్థము. రసాభ్యుచిత పదబంధమన రసాభ్యుచితశబ్దసంయోగము

శబ్దసంయోజనము లేక పదబంధనము ప్రాధాన్యవివక్షను త్రివిధము. ప్రసిద్ధ పదముల సంయోజన మొక విధము. అది ప్రసాదగుణము సరసపదముల సంయోజనము మఱొక విధము. అది మాధుర్యగుణము ద్విత్వసంయుక్తపరుషకఠిన వర్ణములతోడి పదముల దీర్ఘసమాసబంధము వేఱొక విధము. అది ఓజోగుణము. ప్రసాదమాధుర్యగుణములు శృంగారహాస్యకరుణాద్భుతశాంతరసములకు, ఓజోగుణము వీరరౌద్రబీభత్సభయానకరసములకు అభ్యుచితములు. ప్రసాదమాధుర్యగుణములు వీరరౌద్రబీభత్సభయానకరసములకు అనుచితములు కావుగాని, ఓజోగుణము శృంగారహాస్యకరుణశాంతరసములకు అనుచితము అనుచితము కాని, అభ్యుచితములైన శబ్దసంయోజనములు నవరసములకు తిక్కన భారతమునందు కలవు

తిక్కన భారతమునందలి విరాటపర్వములోని కీచకుని కాముకత్వవివరణము శృంగారరసవిషయము కాదు. శృంగారాభాసవిశేషమును కాదు. మానభంగము

చేయువాని మనోవికారము శృంగారమా?- ఉద్యోగపర్వములోని ఉత్తరాభిమన్యుల వివాహము శృంగారరసవిషయము. అనుశాసనికపర్వములోని సుదర్శనాగ్నుల వివాహము శృంగారరసవిషయము. ఉత్తరాభిమన్యుల వివాహసందర్భమున పూర్వ రాగము లేదు ఉత్తరరాగము లేదు. సుదర్శనాగ్నుల వివాహసందర్భమున పూర్వ రాగము కలదు రెండు సీసపద్యములందు కలదు. రెండు సీసపద్యములును శృంగారరసాభ్యుచిత ప్రసిద్ధసరసపదబంధములే.

"అర్చించు నప్పు డయ్యంగన కెంగేలి
 జిగిసొంపు చిత్తంబు దిగిచికొనఁగ
నరసి కన్గొను నప్పు డయ్యింతి కనుఁగవ
 పొలపంబు రాగంబు వొదలఁజేయ
నన్నుఁ బని పంచు నప్పు డమ్ముద్దియ
 పలుకుల తీపు గోర్కులఁ గెరల్ప
నల్లన యూఁదెడు నప్పు డక్కొమ్మ వా
 తెఱ తావి ధైర్యంబుఁ ద్రిప్పికొలుప
మరుఁడు దోడ్తోడఁ దేకువ మాలి కదిసి
తూపుగముల గ్రొవ్వాఁడిమి సూప నంత
కంత కగ్గలమగు వలవంతఁ దూలి
పోయెఁ బావకుఁ డేమి సెప్పుదు నరేంద్ర." 48 ప 1 ఆ. అను. ప.

ఇట్లయిన అగ్నిదేవుడు సుదర్శనతో ఇట్లనెను

"చిగురుటాకుల గాసి సేయు నీ యడుగుల
 చెలువంబు సూడ్కులఁ జేర్చికొనియె
మారేడు పండుల గారాము సెఱచు నీ
 యొల చన్నుఁగవ చెడుకలఁ బొసఁగె
నునుఁదీవఁ జెరిచెఁ గొనని మైదీవ
 మురిపంబు డెంచంబు మరులు కొలిపె
నెఱసందురుని నిగ్గ వఱుపంగఁజాలు నీ
 నెమ్మోము దాలిమి వమ్ము సేసె

నాతి నీకునై పెక్కుబన్నములు వడితి
నంగజునిచేత వల్లభవగసము నాకు
నావుడును సిగ్గు గదిరి యాననము వాంచి
యలఁతి యెలుఁగున నిట్లను నా లతాంగి."    ౬౦ ప. 1 ఆ. అను. ప.

శృంగారరసము మహాభారతమునందు సకృన్మాత్రముగాని, సంస్కృత ప్రాకృతాంధ్రకావ్యములందు సమృద్ధిప్రాయము హాస్యరసము స్వల్పతరము. అందు మహాభారతములోని ఉత్తరకుమారుని ప్రగల్భములు ఉజ్జ్వలోదాహరణములు.

"ఎత్తునఁ గొందుఁ గౌరవుల నెల్లను మూర్కొనిరేని గోవులం
దెత్తు మహార్తమాత్రమునఁ జేరికి సారథి లేమిఁజేసి నా
చిత్తమునన్ విచారదశ పెండెడు నెవ్వఁడు గల్గునొక్కొ నా
కిత్తఱి నేఁ గదా కడప నెంతయు నేర్తు రథం బనం బురిన్"    9 ప.

తగు సారథి దొరకొనినం
బగతుర భంజించు టెంతపని కదుపుల ద
వ్వుఁగఁ గొని పోదురొకో యు
ట్లగునె కలండేని సూతు నరయుం డెందున్    10 ప.

కురుపతిభీష్మకర్ణకృపకుంభజముఖ్యులు మత్సముద్యమ
స్ఫురణము సూచి పార్థుఁడను బుద్ధిఁ గలంగఁగ బెట్టు గిట్టి సం
గరమున నోర్చి యేఁ బసులఁ గ్రమ్మఱఁ దేరకయున్న నన్ను భూ
వరుఁడు సుహృజ్జనంబుఁ బరివారముఁ జిత్తములందు మెత్తురే."
11 ప. 4 ఆ వి. ప.

ఇవి ఉత్తరకుమారుని వీరాలాపములు. బృహన్నల తగిన సారథి అని చెప్పగా,

"అకట సైరంధ్రి నన్ను నిట్లాలిగొనఁగ
నేల చక్కఁగఁ గనువిచ్చి యేను బేడిఁ
జూడ రోయుదు రణమున సూతకృత్య
ఫరము దాల్చుట కెమ్మెయిఁ బనుచువాఁడ"    18 ప. 4 ఆ. వి. ప.

అని ఉత్తర కుమారుని స్వాతిశయాలాపము. అయినను గతిలేక బృహన్న లయే సారథిగా బయలుదేరి, కౌరవసైన్యమును చూచి– మేను గగుపాటి, మనస్సు తలకి, చూపు జివ్వవడి తొట్రుపడుచు బృహన్నలతో ఇట్లనెను.

"భీష్మద్రోణకృపాదిధన్వినికరాభీలంబు దుర్యోధన
గ్రీష్మాదిత్యపటుప్రతాపవిసరాకీర్ణంబు శస్త్రాస్త్రజా
లోష్మస్ఫారచతుర్విధోజ్జ్వలబలాత్యుగ్రం బుదగ్రధ్వజా
గ్రిష్మత్స్వాకలితంబు సైన్యమిది యే జేరంగ శక్తుండనే. 52ప.

అకృతాస్త్రుండ బాలుడ గా
ర్ముకవిద్యాప్రౌఢిమై నిరూఢులయిన యా
శకునిజయద్రథదుర్ముఖ
వికర్ణకర్ణాదియోధవీరుల కెదురే. 53ప.

ఇట్టగు టెఱుగక వచ్చితి
మెట్టొకొ మన భంగి వీరలింద ఱును గకుస్
బెట్టిదులు మనకు మూర్ఖాను
నట్టి కొలది గాదు భీతి యడరెడు దోడ్తోన్ 54ప.

కౌరవసేనం జూచి వడకం బొడగెన్ మదితోన మేను నీ
వూరక పోవుచున్కి యిది యొప్పనె యిప్పటి భంగి జూచిన
న్వీరల నేను మూర్ఖానమి నిశ్చయ మట్లగుటన్ రయంబునన్
దేరు మరల్పు ప్రాణములు దీపన మున్ వినవే బృహన్నలా"
55ప 4ఆ.వి.ప.

అయినను బృహన్నల అంతఃపురాంగనల నడుమ ఆడిన వీరాలాపములు గుర్తుకు తెచ్చి వారించును. "పసుల దయ్యం మెఱుగుం బడతుల సంతోష మేల నాకు ననిరెం జాల నేన" అని (70ప.) బృహన్నల ఎంత వారించినను ఉత్తరుడు "శరములు శరాసనము నయ్యరదముపై డిగ్గ విడిచి యతిరభసమునన్ ధరణికి లంఘించె"ను (72ప) ఇది యెల్ల హాస్యరసఘట్టము. హాస్యరసోచితమైన ప్రసిద్ధ సరసపదబంధమే కలదు,ఒక్క "భీష్మద్రోణకృపాది"పద్యమునందు లేదు.దీర్ఘసమాసబంధము కలదు. అది భయానక, వీర, రౌద్రరసవిషయమైన సైన్యవర్ణనమునకు. అనుగుణము. అట్టి సైన్యమును "నే జేరంగ శక్యుండనే" అనుట హాసజనకము

శృంగారము రసరాజమని ఆలంకారికమతము. కరుణము రససార్వభౌమమని సర్వలోకసమ్మతము. కాళిదాసు శ్లోకచతుష్టయము తన్నిదర్శనము. "ఏకో రసః కరుణ ఏవ" అను భవభూతి భంగ్యంతరప్రకటనము తదుపబలకము. అట్టి కరుణ రసమునకు కాణాచి మహాభారతములోని యుద్ధపంచకము శోకస్థాయికము కరుణ రసము. అభిమన్యుని అకాలమరణమునకు ధర్మరాజు శోకము (138–145ప.2ఆ.) అర్జునుని శోకము (233–242ప.2ఆ) సుభద్రశోకము (332–338ప.2ఆ.ద్రో. ప.) పుటపాకప్రతీకాశమైన కరుణరసమునకు కసవులు

**ధర్మరాజు శోకము :**

"కొడుకుఁ బొడగాన కర్జునుఁ డడిగెనేని
వానితో నింక నేమనువాఁడ హరిక
నతని గారాబు చెలియలి కధికదుఃఖ
మేన సేసితి వగవంగ నేమి గలదు 140ప.

కుడువను గట్టను బూయను
దొడువను బోఁ బనిచి కాక తొలుత మొనసౌరం
గొడుకుం బనుచుచు కెవ్వఁడుఁ
గడఁగునె నా యట్టి పాపకర్ముఁడు దక్కన్ 142ప.

వాని తోడిద లోకమై యేను బోవ
నైతిఁ బోఁగన్నఁ బుత్త్రశోకాతురత్వ
మున నితాంతవివర్ణతఁ బొందుచుండఁ
జూడకుండెడివాఁడ నర్జును మొగంబు" 143ప.

**అర్జునుని శోకము :**

"హంసతూలిక పాన్పునందుఁ బొండెబు మేను
కఠినంపు నేలలోఁ గదిసె నేఁడు
గొడుగుల నీడ పై నడరఁ జెన్నగు మోము
పొరిఁ బర్వ పెండూళి గ్రుంగె నేఁడు
లలనలు లీలమై గొలువనుండెడు భోగి
వఋకులలో నున్నవాఁడు నేఁడు
నానాజనములకు నాథుఁడై శోభిల్లు
దొర యనాథత్వంబుఁ దొరసె నేఁడు

వినయరతుఁడ హృదయవిదుఁడు సుభద్ర గా
రాబు పట్టి మగలరాజు మాన
ధనుఁడ దివిజరాజు మనుమఁడు నా చెలి
కాఁడు యుద్ధరాఁడు లేఁడు నేఁడు 239ప.

అక్కట మందభాగ్యునకు నట్టి తనూభవరత్న మెవ్విధిన్
దక్కు విధాతనిర్దయుఁ డొడంబడునే కడు మేలివస్తువుల్
పెక్కు దినంబు లున్కి యరిబృందము పిల్చినఁ బోలుబంటనై
యక్కడ కేల పోయితి మహాగుణమానధనుఁ గోలుపోయితిన్ 240ప.

హా యను ధర్మరాజతనయా యను నన్నెడఁబాయ నీకుఁజ
న్నే యనుఁ బల్లి నేఁ బఁ జనునే యనుఁ గృష్ణుఁడు వీఁడెచ్చెరా
వే యను నొంపవోవఁ దగవే యను నే గతిఁబోవువాఁ డనే
నో యభిమన్యుఁడా యనుఁ బ్రియోక్తుల నుత్తరఁ దేర్పవే యనున్." 242ప.

## సుభద్ర శోకము:

"అక్కట పుత్త్ర నిన్నుఁ గని నంతియ పుణ్యము కాని నాకు నీ
వెక్కుడు భక్తి సేసి నను నెప్పుడు నారయ నీ కుమారకు
ల్మక్కువ నాకడం దిరుగ లాలన సేయుచునుండు నట్టి యా
మిక్కిలి నోము లేద యిట మీఁదికి నెవ్వరు దిక్కు సెప్పుమా 332ప.

మేను మృదుశయ్య సగము నా మేని మీఁద
సగముగాఁ జేర్చుకొని ముద్దు మిగుల నిద్ర
సేయునట్టి నీ విప్పుడు చెనఁటినేలఁ
దనువు వొందుట కోర్చితే తండ్రి చెపుమ. 334ప.

ఈ లోకమెల్లఁ బాడిల్లను బోరెనై
యున్నది నీవు లేకునికిఁ జేసి
నీవు వేగమ గంతు నెఱసె బంధులఁ బ్రీతిఁ
బొందఁ జేయుట గలవోలె నయ్యొ
జిష్ణుని కొడుకవు కృష్ణు నల్లుండ వీ
వరులచేఁ బడుట చోద్యంబు గాదె
చెలువంపు మేనును జెన్ను మొగంబునై
యెప్పుడు పొడసూపె దింకఁ గుజ్జ

యకట యుత్తర యొప్పెడునది మనంబు
దీని కెంతయు మెత్తన యేను నిన్ను
వేఁడి కొనియెద వచ్చి యవ్వేలఁది వంత
డీపి దళుకొత్తు పలుకులఁ దేర్పవన్న" 337వ 2ఆ.ద్రో.ప.

ఇవి మూడును కరుణరసనిర్భరములైన ఘట్టములు కరుణరసోచితమైన ప్రసిద్ధసరసపదసంయోజనములే కలవు.

మహాభారతములోని మహాద్భుతము కృష్ణుని విశ్వరూపప్రదర్శనము. అర్జునుడు స్తుతించిన కృష్ణుని విశ్వరూపము విస్మయస్థాయికము.

"దేవ నీదగు దివ్యదేహంబునందు సు
రాసురగంధర్వు లాదిగాఁగఁ
గల దేవయోనులఁ గమలాసనుండును
సచరాచరంబైన జగము నాకు
దోఁచె మొగంబులు దోర్దండములును బా
దములఁ గన్నులు ననేకములు గంటి
మకుటాదిభూషణనికరంబుఁ జక్రగ
దాద్యాయుధములు హాల్యాంబరములుఁ
బెక్కు గానవచ్చె నక్కజమై యిది
నడుమ మొదలు దుది యనంగ రాదు
తేజ మప్రమేయదేదీప్యమానని
ర్వికృతిమహిమ దుర్నిరీక్ష్యమయ్యె." 211ప.1ఆ.భీ.ప

ఇందు ప్రసిద్ధపదములు కల అల్పసమాసములు కలవు. ఒక్క తేజోగుణము మాత్రమే ఓజోగుణము అది కూడ దీర్ఘసమాసబంధము కాదు. తదభ్యుచితము కూడ అద్భుతరసోచితమైన శబ్దసంయోజనమే.

శృంగారహాస్యకరుణాద్భుతరసములివి మహాభారతములోని అంగరసములు. మహాభారతములోని వీరరౌద్రబీభత్సభయానకరసములును అంగరసములే. శాంతరసము మహాభారతములోని అంగిరసము శాంతరసమునకు స్థాయిభావము శమము. అది తత్త్వజ్ఞానజన్యము. శాంత్యనుశాసనికాశ్వమేధాశ్రమవాసపర్వములందు ధర్మరాజు తత్త్వజ్ఞాత. కర్మనేత. మౌసలపర్వమువలన మహాప్రస్థానము.

"అచ్యుతరామాదియాదవజనుల వృత్తాంతములును దనదు తెఱంగు సత్యవతీతనూభవు హితభాషణంబులు" అర్జునుడు చెప్పగా ధర్మరాజు మది ప్రస్థానమునకు ఒలసినది "మదీయబుద్ధి కర్మసంత్యాగకలనంబు కార్యమిప్పుడను వినిశ్చయమొందె" నని ధర్మరాజు స్పష్టప్రతిపాదనము. (4ప. మ. ప.) మహాప్రస్థానమునందు ద్రౌపతి "యోగబల మెడలి మేదినిఁ బడు"టకు హేతువు ఆమె "పక్షపాతిని"

"అని పలికె సమాధానము
దన బుద్ధిం దిరము సేసి ధైర్యస్థైర్యం
బున వికృతి లేని గతి నా
వనిత శవము విడిచి కౌరవవిభుం డేఁగెన్." 35ప. మ. ప.

కౌరవవిభుడు ధర్మరాజు సమాధానమును తన బుద్ధియందు స్థిరము చేసి ధైర్యస్థైర్యమున వికృతిలేని స్థితితో ద్రౌపతిశవమును విడిచిపెట్టి వెడలెను. (35 ప. మ ప.) సహదేవుడు పడిన "ఉపేక్షానిరూఢబుద్ధి" నరిగెను. (36ప. మ. ప.) నకులుడు పడిన "ధృతిసారం బూని యతని తనువు నుపేక్షఁగూర్చి" చనెను, (40ప. మ. ప.) అర్జునుడు పడిన "అమ్మానితదేహమున్ విడిచి ... దాల్మిఁ జేసి బద్ధానిరతాత్ముఁడై యరిగె"ను (42ప మ ప.) భీముడు పడిన "నిరీక్షింపక" చనెను. (45ప మ. ప.)కారణము ధర్మరాజు హృదయము కఠినము కాదు. శమాన్వితము. ఈ ఘట్టమెల్ల శాంతరసోచితముగ ప్రసిద్ధపదబంధమే.

వీరరసము బహువిధము. యుద్ధవీరము, ధర్మవీరము, దానవీరము, దయావీరము ప్రసిద్ధములు అందు యుద్ధవీరము మహాభారతమునందు నిబద్ధము.

"శక్తిస్ఫారధనంజయాయత భుజాసంరంభగాండీవని
ర్ముక్తక్రూరశరావలీదళితశత్రువ్రాతముల్ శోణితా
సిక్తాకారతఁ బొంది సాంద్రకుసుమశ్రేణీవికాసోల్లస
ద్రక్తాశోకతరువ్రజంబుల క్రియన్ రంజిల్లి యొప్పెం గడున్."
38ప. 5ఆ. వి. ప.

ఇందు పరుషసంయుక్తవర్ణములు కల పదముల దీర్ఘసమాసబంధము దృఢముగ కలదు. అది వీరరసాభ్యుచితమైన బంధము.

ఇట్టి వీరరసమునకు సహోదరమైనది రౌద్రరసము. క్రోధస్థాయికము.

> "కనుఁగొని కోపవేగమునఁ గన్నుల నిప్పులు రాల నంగము
> ల్లనలఁగ సాంద్రఘర్మసలిలంబులు గ్రమ్మ నితాంతదంతపీ
> డనరటదాస్యరంగవికటభ్రుకుటీచటులప్రవృత్తన
> ర్తనఘటనాప్రకారభయదస్ఫురణాపరిణద్ధమూర్తియై."
>
> 133ప 2ఆ. వి. ప.

ఇందు ద్విత్వసంయుక్తపరుషకఠినవర్ణములు కల పదముల దీర్ఘసమాస బంధము కలదు. అది రౌద్రరసోచితము

> "కరిగాత్రంబుల ఘోటకాంగములం గప్పెన్ సమిద్భూమి య
> చ్చెరువై యుండఁగ రథ్యసూతరథికశ్రేణీవపుఃఖండముల్
> దొరఁగెం దుత్తుమురయ్యెఁ గాల్బలము లస్తోకప్రవాహంబులై
> పరఁగెన్ రక్తనదుల్ పిశాచకుల మంథఃకేళిలోలంబుగన్.
>
> 195ప. 1ఆ. ద్రో ప.

రణరంగమును ఏనుగుల కళేబరములు, గుఱ్ఱముల అవయవములు కప్పెను. రథికుల, సారథుల, రథ్యముల శరీరఖండములు నిండెను కాల్బలములు తునాతున కలయ్యెను. రక్తనదులు పిశాచములు జలక్రీడ లాడు మహాప్రవాహమయ్యెను. అచ్చెరుపైన రణరంగము కడకు జుగుప్స కలిగించునదైనది. జుగుప్స బీభత్స రసమునకు స్థాయిభావము. బీభత్సరసోచితముగ ద్విత్వసంయుక్తపరుష కఠిన వర్ణములు గల పదముల సమాసబంధము కలదు.

> "ఘోరానేకశరాకృతిం బరఁగి సంక్షోభంబు గావించుచుం
> బేరుల్ దుంగఁగ వారంబులు ధరం ద్రెళ్లంగ నశ్వాలి ను
> గ్గై రక్తంబునఁ దేలఁగా భటచయం బత్యంతచూర్ణీకృతా
> కారత్వంబు భజింపఁ గేళి సలిపెం గౌంతేయసైన్యంబునన్."
>
> 14ప. 2ఆ. క ప.

ఇది కర్ణుని భార్గవాస్త్రప్రభావము. అర్జునుని "మనరథంబిఁక మాధవా మఱలనిమ్ము" అని భయపెట్టినది భయము స్థాయిభావమైనది భయానకరసము. భయానకరసోచితముగ శబ్దసంయోజనము కలదు.

ఇది తిక్కన శబ్దశిల్పము. రసాభ్యుచితబంధము,

## వస్తుశిల్పము

కథ-కథనకౌశలము, పాత్రచిత్రణపాటవము, వర్ణనావైదగ్ధి వస్తుశిల్పవిస్తరములు. కథాకథనము, పాత్రచిత్రణము స్వతంత్రకావ్యములందు తత్కర్తల స్వోపజ్ఞములు ఆంధ్రీకృతకావ్యములందు ఆంధ్రీకర్తల సంస్కరణములు. అవి కూడ అమూలకస్థలములందు, అన్యథాకరించిన స్థలములందు మాత్రమే కనిపించును. వర్ణనలు ఆంధ్రీకర్తల స్వోపజ్ఞములే స్వతంత్ర కల్పనములగుట తన్నిమిత్తము

## కథాకథనకౌశలము

మహాభారతములోని కథాప్రపంచము వ్యాసభగవానుని సృష్టి కవిత్రయము వారిది అనుసృష్టి.

"హృదయాహ్లాది చతుర్థ మూర్జితకథోపేతంబు నానారసా
భ్యుదయోల్లాసి విరాటపర్వ మట యుద్యోగాదులుం గూడఁగా
బదియేనిండెఁ దెనుంగు బాస జనసంప్రార్థ్యంబులై పెంపునం
దుది ముట్టన్ రచియించు జొప్పు బుధసంతోషంబు నిండారఁగన్."

7ప 1ఆ.వి.ప.

తిక్కన తెనుగు భాషలో రచియించు జొప్పునఁనిన పదియేను పర్వములు సంస్కృతభారతములోనివి అందు విరాటపర్వము హృదయాహ్లాది. అష్టాదశపర్వములలోను చతుర్థము. ఊర్జితకథోపేతము. నానారసాభ్యుదయోల్లాసి "సభారంజనమై సర్వమనోజ్ఞము" అని నన్నయ. (41ప 1ఆ ఆ ప) సంస్కృతవిరాటపర్వమును అనుసరించి తిక్కన విరాటపర్వమును ఊర్జితకథోపేతము. అనుసరణమునందు సంగ్రహణము కలదు. అది తిక్కన కౌశలము. అంతేకాదు. సంస్కృత విరాటపర్వములోని కథను మార్చిన స్థలములందు, చేర్చిన స్థలములందును తిక్కన కథాకథనకౌశలము కలదు. ఇది పదియేను పర్వములకును ఉపలక్షణము.

సంస్కృతవిరాటపర్వమునందు బృహన్నల "నృత్యగీతకుశలుడను. ఉత్తరకు నాట్యము నేర్పుదును." అనగా విరాటరాజు "నీకు కోరికను, నా కూతురిని కూడ ఇచ్చుచున్నాను." (దదామి తే హంత వరం బృహన్నలే సుతాంచమే 10–శ్లో. 10అ:) అని నృత్యవాద్యకళలందు తన మంత్రులచేత పరీక్షింపఁజేసి, బృహన్నల

నపుంసకుడని తేల్చుకొని అంతఃపురమునకు పంపించినట్లు కలదు (8–12శ్లో. 10అ.)"నా కూతురిని కూడ" అనుటలోని అంతర్యమును గ్రహించి తిక్కన ఇట్లు మార్చి తీర్చిదిద్దెను.

"నిన్నుఁ గొలువంగ వచ్చితిఁ
గన్నియలకు నాట గఱపఁగా నోపుదు వి
ద్వన్నుత మన్నామంబు బృ
హన్నల యేఁ బేడి ననుచు నతఁ డిట్లనియెన్ 233ప.

ఆయతబాహులున్ వెడఁదయైన సమున్నతవక్షమున్ సరో
జాయితలోచనంబులుఁ బ్రసన్నముఖంబు నుదాత్తరేఖయుం
గాయజుఁ బ్రేగి సేయు ననఁ గొఱకు మీఱు ననంగ విభ్రమ
శ్రీయును బెంపునుం గలుగఁజేసి విధాత్రుఁడు పేడిఁ జేసెనే"
234ప.1ఆ.వి.ప.

"నేను పేడిని" అని బృహన్నల అనగా విరాటరాజు అతని బాహువక్షోలోచనముఖశరీరపైభవములు చూచి, వాని ఆయత, సమున్నత, సరోజాయిత, ఉదాత్తరేఖాయుత, సౌందర్యాతిశయితస్థితిగతులను గమనించి "విధాత్రుఁడు పేడిఁజేసెనే" అని సందేహించెను. అతనిని మత్స్యరాజ్యశ్రీమహిమకునెల్ల నియుక్తునిఁ జేయదలచిన తన మనోరథమునకు అతని మాట విరుద్ధమయ్యెనని విచారించెను
(236ప ) బృహన్నల

"ఆఁడుదనంబు నిక్కమున కారసి చూచిన లేదు పుంస్త్వముం
బోఁడిమి దప్పియున్నది నపుంసకజన్మ మవశ్యభోగ్యమై
వాఁడిమి గల్గు శాపమున వచ్చెఁ బురాకృతకర్మభావ్యమె
వ్వాఁడును నేర్చునే తొలఁగఁద్రైవఁగ నోర్వక పోవవచ్చునే"
238ప.1ఆ.వి.ప.

అని కావున నాట్య మభ్యసించితినని (239–241ప ) ఇట్లనెను

"ఇన్ని తెఱఁగుల శ్రమము సేయింతుఁ జతుర
తావిహీనములైన పాత్రములనైన
నట్టువొజ్జనై మెలఁగుదు నగుళులందు
నిపుణనైపథ్యవిధులకు నేర్తు నధిప." 245ప.

"అనుడు విపణ్ణమైన హృదయంబున గారవమొంద నైపుణం
బున నుచితంబుపై నరసి పొచ్చెము లేమిఁ దదీయసేవ గై
కొనుటకు నిశ్చయించి తన కూఁతు విరాటుఁడు పిల్వఁబుచ్చె న
ర్తనమునకై బృహన్నలకుఁ దత్పరతం దగ నప్పగింపఁగన్"
243ప.1ఆ.వి.ప.

విరాటరాజు విపణ్ణమైన హృదయమునందు గౌరవము కలిగి, బృహన్నలను నిపుణముగా, మర్యాదగా పరీక్షించి, కపటము లేకపోవుట కనిపెట్టి, అతని సేవ గైకొనుటకు నిశ్చయించెను. విద్యాపరీక్ష లేదు వైద్యపరీక్ష లేదు. అంతేకాదు. బృహన్నలను అంతఃపురమునకు పంపలేదు, నర్తనమునకై బృహన్నలకు తత్పరతో అప్పగించుటకు అంతఃపురమునందలి కూతురు ఉత్తరను కొలువుకూటమునకు పిలువఁబంచెను.

"అల్లదనంబున యనువు మైకొనఁజూచు
నడపు కాంతికె వింత తొడవు గాఁగ
వెడవెడ నూగారి వింతయై యేర్పడు
దేరని వళులలో నాడు నిగుడ
నిట్టలు ద్రోచుచు నెలవుల కల మేర
వెల్లను ఓగియెక్కి యేర్పడంగఁ
దెలుపును గప్పును వెలయంగ మెఱుఁగెక్కి
తారకంబులఁ గల్కితనము వొదరఁ
జరణములును నడుముఁ జన్నులుఁ గన్నులు
జవ్వనంబు చెప్పి నివ్వటిల్లు
చునికిఁ దెలుపుచుండ నుత్తర సనుదెంచె
నలరు విలుతు పువ్వుటమ్ము వోలె 245 ప.
వచ్చి కొలువు సొచ్చి నెచ్చెలిపిండు నం
తంత నిలువఁబనిచి యల్ల నల్లఁ
గదిసి ప్రౌఢవనిత కైవడి ముద్దియ
ముద్దుపుట్టఁ దనకు మ్రొక్కుటయును" 246 ప. 1 ఆ. వి. ప.

విరాటరాజు "తన గాదిలి కూతు నుపలాలించి ... ఇమ్మగువ నీకు నాట గఱపందగు పాత్రంబగునే యని యడిగి ... మధురసల్లాపంబు సేసి కర్పూర

సహితంబగు తాంబూలంబు వెట్టి చిత్రంబులగు చీనాంబరంబు లిచ్చి మణిమయం బగు నాభరణంబు లొసంగి" బృహన్నలను సంభావించెను. ఇదియెల్ల అమూల కము. భావికథాకీలకము అలరుఁబలుతు పువ్వుటమ్మ వోలె వచ్చిన ఉత్తర అర్జునుని కోడలగును. కర్పూరతాంబూలముపెట్టుట, చిత్రచీనాంబరము లిచ్చుట, మణిమయా భరణము లొసగుట గురుసంభావనమునకు దీపిక. ఉత్తరాభిమన్యుల వివాహనిశ్చి తార్థమునకు జ్ఞాపిక.

ఇట్లు బృహన్నలను సంభావించి విరాటరాజు ఇట్లనెను.

"నీవు చతురమతివి నీకు నిక్కన్నియ
నప్పగింపనేల యైన నాదు
హృదయమతులు దీనియెడఁ గడు నార్ద్రమై
యుండుఁగానఁ జెప్పకుండరాదు 249 ప.

నెచ్చెలులతోడ నెంతయు
మచ్చికఁ దన యిచ్చ నాడ మరగినదియై
విచ్చలవిడి నింతకు ము
న్నిచ్చేడియ మెలఁగు శిక్ష యెఱుఁగదు సుమ్మీ 250 ప.

బాల గేళి మీఁది భరము క్రమంబున
విడవఁ గళలయందు వేడ్క సొనిపి
నయముతోడ నర్తనంబుల శిక్షింపు
నెలఁత కేడుగడయు నీవ కాదె" 251 ప. 1 ఆ. వి. ప.

ఇందు విరాటరాజు బృహన్నలను మొదట "చతురమతివి" అనెను. చివఱ ఉత్తరకు "ఏడుగడయు" అనెను. "ఇమ్మగువ నీకు నాట గఱపందగు పాత్రం బగునే" అని ప్రశ్నించినపుడు బృహన్నల ప్రతివచనములు గ్రంథస్థము కాలేదు గాని, "తత్ప్రతివచనంబులయందలి నాగరకత్వంబునకు" విరాటరాజు "చిత్తంబు రంజి"ల్లినట్లు కలదు (248 వచ.) చిత్తరంజకమైన నాగరకత్వము చతురమతి లక్షణమే. చతురమతియైన బృహన్నలకు ఉత్తరను అప్పగింపవలసిన ఆవశ్యకము లేదు. అయినను విరాటరాజు అప్పగింతలు పెట్టెను. కారణము తన హృదయ మతులు ఉత్తరయెడ ఆర్ద్రమై ఉండుట అందువలన ఉత్తర నెచ్చెలులతో ఇచ్చ వచ్చినటు ఆటలందు మరగి విచ్చలవిడిగ మెలగునది కొలువునకు నెచ్చెలుల పిండు

తోనే వచ్చినది. ఆమె విచ్చలవిడితనమును అరికట్టవలయును ఆటలందు ఆసక్తి తొలగింపవలయును. కళలయందు కుతూహలము కలిగింపవలయును. నయము తోడ నర్తనము నేర్పవలయును. అందుకు చతురమతివి అనెను "నెలఁత కేడు గడయు నీవ కాదె" అనెను. ఎడుగడ అనగా రక్షకుడు. గురువు, తల్లి, తండ్రి, భర్త, దైవము, దాత శ్రీరె రక్షకులు గురువైన బృహన్నల రక్షకుడే. భావికథలో మాయమైన అర్జునుడు కూడ రక్షకుడే మామ పితృసమానుడు.

"అని యుచితంబుగాఁ బలికి యంగన హస్తముఁ బట్టి తత్కరం
బునఁ గదియించి నీ గురువుఁ బొర్తి తగం గొనియాడు మెట్లు నె
మ్మనముల భక్తిమై నడపు మెంపెసలారఁగఁ గూడు గూర చం
దనకుసుమాదులున్ నడపి తప్పక యారసి గారవింపుమీ. 252 ప.

ఎల్ల చుట్టములును దల్లియుఁ దోడును
జెలియుఁ బరిజనంబుఁ జెలువ నీకు
గురవ యింక నొక్క కొఱఁతయు లేదింకఁ
జేరి బ్రదుకు బుద్ధిగౌరవమున," 253 ప 1 ఆ. వి. ప.

విరాటరాజు కూతురు ఉత్తర హస్తము పట్టుకొని బృహన్నల హస్తమునందు పెట్టి అప్పగించి, ఆమెకును అప్పగింతలు పెట్టెను " గురువును తగినట్లు కొనియాడుము ఎట్లు చెప్పిన అట్లు భక్తితో నడుచుకొనుము భోజనము, పూజాద్రవ్యములను సమకూర్చి కనిపెట్టుకొని గౌరవింపుము తల్లి, తోఁబుట్టువు, నెచ్చెలి, ఎల్ల చుట్టములు, పరిజనము– సర్వజనము గురువే. ఇక నీకు ఒక కొఱతయు లేదు. శిక్షణమునందు చేరి బుద్ధిగా గౌరవముతో బ్రదుకుము " ఇదియెల్ల అమూలకము. ఒక అయ్య చేతిలో పెట్టి, అప్పగింతలు పెట్టినట్లు కలదు. అభిమన్యుని చేతిలో పెట్టి అప్పగింతలు పెట్టుటకు అభివ్యంజకము తిక్కన కథాకథనకౌశలమునకు నిదర్శనము.

## పాత్ర చిత్రణపాటవము

మహాభారతములోని పాత్రలు వ్యాసునికి కన్న సంతానము కవిత్రయము వారిని పెంచుకొన్న సంతానము. కథాకథనకౌశలము వలె పాత్రచిత్రణపాటవమును తెనుగు భారతమునందు అమూలకస్థలములందును అన్యథాకరించిన స్థలములందును తేజరిల్లును మహాభారతములోని అన్ని పాత్రలును ఒక యెత్తు. ద్రౌపది పాత్ర

మఱొక యెత్తు ఒక్క మహాభారతములోని పాత్రలతోనే కాదు; ప్రపంచవాఙ్మయము లోని పాత్రలతోను తులతూగి నులుసూపు పాత్ర ద్రౌపది. ఆమె అయోనిజ అయినను ద్రుపదుని ఇంట పెరిగినది పాండవుల భార్య అయినది పుట్టినింట ఉగ్గుపాలతో రంగరించినది క్షాత్త్రము మెట్టినింట అఱపాలలో పొంగలించినది క్షాత్త్రము. నిండు సభలోను, కాఱడవిలోను కరడు గట్టినది క్షాత్త్రము. నివురు గప్పినది క్షాత్త్రము క్షాత్త్రము మూర్తిమంతమైనది, స్ఫూర్తిమంతమైనది ద్రౌపది.

"వరమునఁ బుట్టితిన్ భరతవంశముఁ జొచ్చితి నందుఁ బాండుభూ
వరునకుఁ గోడలైతి జనవంద్యులఁ బొందితి నీతివిక్రమ
స్థిరులఁగ పుత్త్రులం బడసితిన్ సహజన్ముల ప్రాపు గాంచితిన్
సరసిజనాభ యిన్నిటఁ బ్రశస్తికె నెక్కినదాన నెంతయున్"

168 ప 3 ఆ ఉ. ప.

అని ఉద్యోగపర్వమునందే ద్రౌపది ఉద్రేకము కాదు. ఆరణ్యపర్వములోనే

"పార్థివప్రభుఁడైన పాండుమహీపతి
కోడలనయి యుద్ధకుశలులైన
పాండుతనూజుల భార్యనై పూజ్యుఁడ
వైన నీ యనుజనై యధికశక్తిఁ
బరఁగు ధృష్టద్యుమ్ను భగినినై-" 136 ప 1 ఆ అర. ప,

అని ద్రౌపది అలమటించినది కారణము క్షాత్త్రగుణమైన రాజసము. ఆభిజాత్యము, పాండవాధిపత్యము ద్రౌపది రాజసగుణమునకు పాణింధమములు అట్టి ద్రౌపది పండ్రెండు సంవత్సరములు అరణ్యావాసమును అనుభవించి, ఏడాది అజ్ఞాతవాసక్లేశము ఇక అంతమగునెడ కీచకుని ఆగమనము: సంస్కృతభారతమునందు కీచకుడు నీచకాంక్ష ప్రకటించగా ద్రౌపది అయుక్తమని మందలించును (అయినను కీచకుడు పృథివిలో తనకు సమానుడైన పురుషుడు లేడని స్వాతిశయమును ప్రకటించును అప్పుడు ద్రౌపది) తన్నెప్పుడును అయిదుగురు గంధర్వపతులును అభిరక్షింతురని, కీచకుని చంపగలరని వారిని అభివర్ణించును (13-21 శ్లో 13 అ) ఇది తిక్కన భారతమునందు ఇట్లు కలదు.

"వీఁడు దురభిమానియై యున్నవాఁడు వెగిరపాటు వలను గాదు వెరవు తోడన తప్పించుకొనవలయునని తలంచి యతని కిట్లనియె 48 వచ.

"నా యున్నఁ బాము దలఁపవ
యీ యెడ నీ చీర యిట్టి యేవపుఁజందం
బో యన్న మదనవికృతిం
జేయుసనుట యెంతయును నిషిద్ధము గాదే 49. ప.

చనునె యిమ్మాటలాడ సజ్జనుల కాఁడు
బుట్టువులతోడ నీవును బుట్టినాఁడ
వట్లు గాకయు హీనవంశాభిజాత
నై పతివ్రతనగు నన్ను నడుగఁదగునె 50. ప.

అని పీడఁగఁ బల్కి న—" 51 వచ. 2 ఆ వి ప.

ఇందు అప్రార్థనీయమను అంశము కలదుగాని మందలింపు లేదు. ఏవగింపు కలిగించు ప్రయత్నము కలదు అది వ్యర్థప్రయత్నము. ద్రౌపది అందము, ఒప్పు, కొమరు, నవకము, రుచిరమూర్తి కీచకుడు వర్ణించును.(52 ప) అంతేకాదు. "పరసతీసంగమునకు వచ్చు పాపమునకు నోరుతునుగాని సైరింపనోపఁ బచ్చవిలుకుతూపుల తాకున కలరుబోఁడి" అని కీచకుడు పలికెను ఆ పలుకులకు ద్రౌపదికి కోపము వచ్చినది. (53—54 ప.) నీచు గావున జంకించినఁగాని మెత్తఁబడిపోఁడని" ఇట్లన్నది.

"దుర్వారోద్యమబాహువిక్రమరసాస్తోకప్రతాపస్ఫుర
ద్గర్వాంధప్రతివీరనిర్మథనవిద్యాపారగుల్ మత్పతుల్
గీర్వాణాకృతు లేవు రిప్డు నిను దోర్లీలన్ వెసంగిట్టి గం
ధర్వుల్ మానముఁ బ్రాణముం గొనుట తథ్యం బెమ్మెయిం గీచకా "
55 ప. 2 ఆ వి ప.

ఇది ద్రౌపది క్షాత్రగుణమునకు తగినది ఇందలి సమాసధ్వని, ఏకవచన ప్రయోగము, నిశ్చయము మూలాతిశాయికము మూలములోని వివరణము కంటె తిక్కన తెనుగుసేతలోని తీవ్రత ద్రౌపది రాజసప్రవృత్తికి నీరాజనము పట్టునది. ఇదే పద్యమును ద్రౌపది భీమునికి తన పరాభవమును చెప్పునపుడు పునరుద్ఘాటించును (172 ప. 2 ఆ వి ప) ఎంత ఉద్ఘాటించినను కీచకుడు తన్నెదుర్కొనఁ గలవాడు మూడు లోకములందును లేడని మూర్ఖత వహించును. అప్పుడు ద్రౌపది అన్న మాటలివి .

"చనుఁ జనదని చూడక యం
దని ప్రాఁకులపండ్లు గోయఁదలఁచుట హితమే
మును చెడిన రావణాదుల
విని యెఱుఁగవె యెన్నఁడును వివేకవిహీనా" 58 ప. 2 ఆ వి. ప.

ఇది మూలమునందు లేదు ఇందు కీచకుని మూర్ఖతకు తగిన సమాధానము రావణసాదృశ్యము మాత్రమేగాక, "వివేకవిహీనా" అను సంబోధనము కలదు. అది మఱల ద్రౌపది రాజసమునకు నిదర్శనము బుద్ధిలేనివాడవని తిట్టినది. ఆ తిట్టునకు మొగము చిన్నబోయి అంత సింహబలుడును అప్ప కడకు పోయెను (59 ప. 2 ఆ) ద్రౌపది లౌక్యము (49 ప.) కంటె రాజసమే తత్కాల ప్రమాదమును తప్పించినది రాజసప్రవృత్తికే పట్టము గట్టుట తిక్కన పాత్రచిత్రణ పాటవము.

సుధేష్ణ పానపాత్రను సపిధానముగ ఇచ్చి కీచకుని ఇంటెంకి పంపించినపుడు, ద్రౌపది సూర్యుని ధ్యానించి, తన అవస్థను తానే నిందించుకొని బెదరిన లేడి వలె వెడలినట్లు సంస్కృతభారతమునందు కలదు (16–21 శ్లో 14 అ.) ఇది తిక్కన భారతమునందు ఇట్లు కలదు

"అలమటఁ బొందు మాయవిధియా యని దైవము దూఱు నిత్తఱిం
గలరొకొ నాకు దిక్కను మొగంబున నశ్రులు వెల్లిగొల్పుఁ దొ
ట్రిలఁబడుఁ జల్లనం బెదరు డెందము గూడఁగఁ దెచ్చి నన్నుఁ గే
వలమున ముట్ట నెవ్వరికి వచ్చుననుం గలఁగున్ వెనుంబడున్ 104 ప.

దైన్యంబు తలపోఁత దలకొన్నఁ జెలువ కా
ననమున వెల్లఁదనంబు గదిరె
భయరసవేగంబు పైకొని మ్రుట్టినఁ
గాంతకుఁ దనులతఁ గంప మడరె
వెగ డంతకంతకు మిగిలిన నింతికిఁ
బదముల నటఁ దొట్రుపాటు వెరసెఁ
దల్లడం బొందినఁ దన్వికి నవయవం
బుల నెల్ల ఘర్మాంబుకళిక లెసఁగెఁ

దలఁకు పుట్టెఁ గొంకు గొలఁదికి మీఱె వెం
బాటు దోఁచె ముట్టుపాటు దొడరె
వెఱఁగుపాటు దనికె నెఱినాడె నొవ్వు నె
వ్వగలు వగల నీనె దిగులు వొదివె. 106 ప.

ఇవ్విధంబున ద్రుపదపుత్త్రి దురవస్థం బొందుచు మహాపదలకుం బరిహరణంబు హరిస్మరణంబ యని తన హృదయపుండరీకంబునం బుండరీకాక్షు నిక్షేపించుకొని సుదేష్ణమందిరంబు వెలువడి దినకరుం గనుంగొని వినయవినమితోత్తమాంగయై నిజాంతర్గతంబున 107 వచ

పాండుపుత్త్రుల కేను దప్పని మనంబు
గలుగుదానన యేని యో కమలమిత్ర
కీచకునిదెస నన్నొక కీడు తెరువు
వొరయకుండఁగ రక్షింపు కరుణతోడ" 108 ప 2 ఆ. వి. ప.

అని సూర్యుని ప్రార్థించినది. ఇదియెల్ల "ఉపాతిష్ఠత సా సూర్యం ముహూర్త మబలా—" (19 శ్లో.), "తత్ర సర్వావస్థా స్వనిందితామ్" (20 శ్లో 14 అ) అను రెండు పంక్తులను ఉపలక్షించి తిక్కన కావించిన సృష్టి. ఇందు ద్రౌపది దురవస్థ రెండుపద్యములందు కలదు ఒకదె వృత్తము మఱొకటి సీసము. ఇది రెండు మూడు వృత్తములకు సమానము. అలమట చెందుట, దైవమును నిందించుట, దిక్కు లేదని తలంచుట, కన్నీరు మున్నీరగుట, తొట్రుపడుట, గుండె ఝల్లుమన కూడఁగట్టుకొనుట, ధైర్యము వహించుట, అధైర్యపడుట, దుఃఖించుట, దైన్యమున మొగము పాలిపోవుట, భయోద్రేకమున ఒడలు కంపించుట, అడుగులు తడబడుట, తల్లడమున ఒడలెల్ల చెమటలు పట్టుట, బెదరు పుట్టుట, గొంకు మించుట, జంకు తోచుట భయసంకటములు కలుగుట, వెదన అతిశయించుట, దుఃఖము తపింపఁజేయుట, దిగులు పొడముట, ద్రౌపది దురవస్థల దొంతర. అవస్థాచిత్రణ మిది అమూలకము ఇది పీఠపత్ని మాత్రమేగాక, వీరమాతయైన ద్రౌపది మహాపద. ఇదివఱకు వస్త్రాపహరణమహాపదకు పరిహరణముగ ద్రౌపది హరిస్మరణము చేసినది (111 ప 3 ఆ. ఉ ప) ఇప్పుడును మానాపహరణమహాపదకు పరిహరణ

ముగ ద్రౌపది హరిస్మరణము చేయుట స్వాభావము కాని ద్రౌపది హరిస్మరణము చేసినట్లు సంస్కృతభారతమునందు లేదు తిక్కన భారతమునందు కలదు సూర్యుని ధ్యానించినట్లు మాత్రమే సంస్కృతభారతమునందు కలదు సూర్యుని ధ్యానించుటకు కారణము సంస్కృతభారతమునందు లేదు తిక్కన భారతమునందు కలదు ద్రౌపది సూర్యుని రక్షింపుమనుటకు "పాండుపుత్త్రుల కేను దప్పని మనంబు గలుగుదాననయేని" అని ఒక నిబంధన పెట్టినది అగునో కాదో కర్మసాక్షికె తెలియును. సూర్యుడు కర్మసాక్షి సర్వాంతర్యామియైన హరి కాడని కాదు. సూర్యుడు కర్మసాక్షిగ సుప్రసిద్ధుడు అంతేకాదు మూలమునందు సూర్యధ్యానము కలదు. తెలుగుసేతను హేతుకల్పనము కలదు ఇదియెల్ల తిక్కన పాత్రచిత్రణ పాటవమునకు ఫలము.

కీచకుడు తఱుముకొని రాగా ద్రౌపది విరాటరాజు కొలువు కూటమునకు వచ్చి మొఱపెట్టుకొనెను. అది విని ధర్మరాజు లలాటమున చెమట పట్టెను. ద్రౌపదిని మందలించి పొమ్మనెను అందుకు "నర్తకి వలె గంతులు వేయుచున్నావు." అని కూడ అనెను "శైలూషీవ విధావసి" (34శ్లో 15అ.) ఆ మాటకు ద్రౌపది జ్యేష్ఠుడు జూదగాడైన నా భర్తలు ప్రతివారికిని వధ్యులు" అని సుధేష్ణ ఇంటికి వెళ్ళిపోయెను. "తస్య తస్యేహ తే వధ్యా యేషాం జ్యేష్ఠోఽక్షదేవితా" (35 శ్లో.15అ.వి.ప.) ఇట్లు సంస్కృతభారతమునందు కలదు. ఇది తిక్కన భారతమునందు ఇట్లు కలదు

"ధర్మతనయుని పలుకులు విని వెండియు సైరంధ్రి
యచ్చోట గదలక నిలిచి యెద్దియేనియుం బలుకం
దలంచినం జూచి యతండు మఱియు నిట్లనియె. 149వచ.

పలువోకలఁ బోవుచు వి
చ్చలవిడి నాట్యంబు సూపు చాడ్పున నిచటం
గులసతుల గఱువచందము
వొలఁగఁగ నిట్లునికె దగునె తోయజవదనా. 150ప.

అనిన విని పాంచాలి సాభిప్రాయంబుగా నతని కిట్లనియె 151వచ.

నాదు వల్లభుండు నడుఁ డింత నిక్కంబు
పెద్దవారి యట్ల పిన్నవారుఁ
గానఁ బతుల విధమ కాక యే శైలూపిఁ
గా ననంగ రాదు కంకభట్ట 152ప.

అట్లగుటంజేసి నాకు నాట్యంబును బరిచితంబ మత్పతి
శైలూషుండ కాఁడు కితవుఁడునుం గావున జూదరి యాలికి
గఱువతనం బెక్కడిది యనుచు నచ్చోటు వాసి తన చిత్తంబున 153వచ.

సన్నిటు లా దురాత్ము సదనంబునకుం జనుమన్న జంత కీ
బన్నము లన్నియుం దెలిపి ప్రయ్యఁడనే యని పోయె నార్తయై
కన్నుల బాష్పపూరములు గ్రమ్మఁగ మోమున దైన్య మొందఁగా
నన్నలినాక్షి తొట్రిలుచు నంగము దూల సుధేష్ణ పాలికిన్"
151వ.2ఆ వి.ప

మూలములోని రెండు మాటలు తెనుగుసేతను ఆరు పద్యగద్యములయినవి.

సమయభంగము సరకుగొనని మహాకోపముతో వచ్చినది ద్రౌపది కారణము తఱుముకొనివచ్చునపుడు కీచకుడు తన్నుట కూడ (128ప.) అది ద్రౌపది రాజసాగ్నిలో ఆజ్యము పోయుట. విరాటరాజునే దూషింపవచ్చునని, "ఇచ్చో ననుఁ దన్నఁ గీచకునిఁ జూచియు నూరకయున్కి పాడియే" అని ప్రశ్నించినది (143 ప.) సభాసదులు ద్రౌపదికి సానుభూతిపరులయిరి. (146ప.) అందువలన ధర్మరాజునకు లలాటభాగమున చెమట పట్టినది (147ప.) "సతికిఁ దానెంత వడియును సభలలోన ధిక్కరింపఁజనునె" అని ప్రశ్నవైచెను (148ప) దానికి సమాధానము చెప్పదలచినది ద్రౌపది అందుకు "పలువోకలఁ బోవుచు" అను పద్యమును అనుబంధప్రశ్న చేసెను. "శైలూషీవ" అను మూలమునకు "పలువోకలఁ బోవుచు విచ్చలవిడి నాట్యంబు సూపు చాడ్పున" అను వ్యాఖ్యానము, ఆజ్యము పోసిన ద్రౌపది రాజసాగ్నిని రగుల్కొల్పినది "ఇచటం గులసతుల గఱువచందము దొలఁగంగ నిట్లనిరిఁ దగునె తొయజవదనా" అను తిక్కన స్వతంత్రకల్పనము కులసతియైన ద్రౌపది రగుల్కొన్న రాజసాగ్నిని జ్వలనజ్వాలలు రేపినది "తోయజవదనా" అను సంబుద్ధి గుండెలో నిప్పులు పోసి, గుండెపై వెన్న పూయుట వం

టిది అందుచలన "నా భర్త నటుడు. పరమసత్యము కావున నేను నటిని కాదన రాదు" అని ద్రౌపది త్రిప్పికొట్టినది అంతేకాదు "కంకభట్టః" అని సంబోధించినది అది ధర్మరాజు అజ్ఞాతవాసనామమే కాని కంకభట్టు అను ద్రౌపది సంబోధన మున అవజ్ఞ కలదు. "ఇచటం గులసతుల గఱువచందమున బోలగంగ నిట్లునిక దగునె" అన్న ధర్మరాజునకు, అచట కులసతిని "పయింబడి పట్టుకొనిన" (125 వచ) "కాలదాచి"న అధర్మము పట్టలేదు ధర్మరాజత్వము దగ్ధమయినది కంకభట్టత్వము మిగిలినది అది సన్న్యాసివేషము (69ప 'అ వి ప) సన్న్యాసిలక్షణము ధ్వన్యమానము అందుకే "మత్పతి శైలూషుండ రాదు వెతవు(డును" అన్నది. జూదగాని భార్యకు గఱువతన మెక్కడిదని ఎదురుప్రశ్న పైచి వెళ్ళిపోయినది. ఇందు రాజసాగ్నిజ్వాలాప్రసరణము కలదు అందు రాజసాగ్నిజ్వాలావిజృంభణము కలదు. సమయభంగము ధర్మరాజు భయము. మానభంగము ద్రౌపది భయము. ధర్మరాజు మెత్తని పులి (14ప 2ఆ వి వా) ద్రౌపది తోక(ద్రొక్కిన త్రాచుపాము.

పగబట్టిన ద్రౌపది "ఇంత కీ ఖిన్నుము లన్నియుం దెలిపి ప్రయ్యెడనే" అని సుధేష్ణ పాలికి పోయి ప్రయ్యెడి, సుధేష్ణ కప రానున్నదియనరు (160ప) ఇట్లన్నది.

> "నీ వింత యలుగ నేటికి
> నా వంతయు( బౌరజనమనఃభేదము నొ
> క్కావంత ద్రిక్కకుండ( గ
> లావంతులు మత్పతులు గలరు పగ తీర్పన్" 161ప. 2.ఆ.వి ప.

ఇట్లని తన శయనమందిరమునకు వెడలి నెవ్వగలు నివ్వటిల్ల తలపోసి,

> "ప్రబలుం దారయ నా సిం
> హబలుం డాతని జయింప ననిలతనయు బా
> హుబలంబ గూడ(దగు దై
> వబలంబును నాతనికి సవశ్యంబు గల్గున్" 164 ప.2ఆ వి.వ

అని యూహించి రాత్రివేళ మహానసగృహమునకు వెడలినది. ఇట సంస్కృత భారతమునందు ఇట్లు కలదు వనదుర్గమునందు నిద్రవోవు సింహమును సివంగి వలె, ద్రౌపది భీముని బాహువులతో కౌగలించి మేల్కొల్పి, "లెమ్ము. లెమ్ము. మృతుని

వలె పడియుండనేల? మృతుడు కాని వాని భార్యను ముట్టుకొని పాపాత్ముడు బ్రదుకఁజాలడు. సేనావాహినిలోని పాపిష్ఠుడు నన్ను పట్టుకొని, తాను బ్రదికి యుండిన నీవు నిద్రింపవచ్చునా?" అని స్వరమును మేళవించిన, మధురభాషిణి అయిన వీణ వలె పలికెను (7-10 శ్లో 16 అ.) ఇది తిక్కన భారతమునందు ఇట్లు కలదు.

"నన్నుఁ బరాభవించి సదసంబునకుం జని కీచకుండుమ
న్నన్న తెఱంగు దప్పక సుఖోచితశయ్యను నిద్రసేయ నీ
కన్ను మొగుడ్చునాఱుటకుఁ గారణమెయ్యది భీమసేన మీ
యన్న పరాక్రమంబు వల దన్ననొకో దయమాలి తక్కటా"

166ప 2.ఆ.వి ప.

ఇందు "ెం శేషే భీమసేన యథా మృతః" అను మూలములోని అంశము [7 శ్లో. 16అ] లేదు అది తిక్కన ఔచిత్యసంపాదనమనుట పరిపాటి యైనది మూలమునందు ద్రౌపది భీముని మృతుడ వనలేదు "మృతుని వలె" అని మృదువుగ నన్నది. మృతసాదృశ్యము తోపాటు మూలమునందు వీణాసాదృశ్య మును కలదు ఒడి, ఇది సంస్కృతభారతమునందు అనౌచిత్యము కాదు రాజస ప్రవృత్తి రాశీభూతమైన ద్రౌపది పాత్రకు ఉచితమే. తిక్కన పాత్రచిత్రణపాటవ మును ప్రశంసాపాత్రమే.

## వర్ణనావైదగ్ధి

సంస్కృతాంధ్రకావ్యములందు వర్ణనలు సర్వసాధారణము. అష్టాదశవర్ణన లనుట అతిప్రసిద్ధము అష్టాదశవర్ణనలు కలకావ్యము మహాకావ్యమని అలంకారశాస్త్ర ములందు కలదు అందు మహా కావ్యమన పెద్ద కావ్యము. గొప్ప కావ్యము కాదు పెద్ద కావ్యము గొప్ప కావ్యము కావచ్చును కాకపోవచ్చును. చిన్న కావ్యమును గొప్పకావ్యము కావచ్చును మహచ్ఛబ్దమునకు పెద్ద, గొప్ప అను రెండు అర్థములును కలవు అదికావ్యమైన వాల్మీకి రామాయణమునందు వర్ణనలు కలవు మహాకావ్యమైన వ్యాసుని మహాభారతమునందును వర్ణనలు కలవు సంస్కృతభారతములోని వర్ణనలు చాలవఱకు పట్టికాప్రాయములు తెనుగు భారతములోని వర్ణనలు కవిలో ప్రాయములు అష్టాదశవర్ణనలు కాలక్రమమున అష్టాదశాధిక వర్ణనలయినవి. అందు ముఖ్యమైనవి నాయికానాయక వర్ణనములు. మహాభారతములోని నాయిక

ద్రౌపది. సైరంధ్రీవేషములోని ద్రౌపది సౌందర్యమును సుధేష్ణ వర్ణించును. [10-12శ్లో.8అ.] సుకేశి. సుస్తని పీనశ్రోణి పీనపయోధర— అరాళపక్ష్మనయన. బింబోష్ఠి.తన మధ్యమ. కంబుగ్రీవ గూఢశిరస్క పూర్ణచంద్రనిభానన. శారదోత్పల పత్రాక్షి. శారదోత్పలగంధి లక్ష్మీసదృశ అని. ఇది పట్టికాప్రాయము. అంతేకాదు. ప్రత్యంగ వర్ణనము. ద్రౌపది సుధేష్ణను సమీపించునపుడు తిక్కన వర్ణనమిది·

" పదతలంబుల కెంపు పరఁగిన తలము కుం
కుమలిప్తమైన చందము వహింప
సంగంబు నునుగాంతి యడరిన గోడలు
వేదులు మణిమయవిధము నొందఁ
గనుఁగవ మెఱుఁగులు గదిరిన ముందర
పుష్పోపహారంబు పొలుపు దాల్ప
వేనలి కప్పు పర్విన మీఁదు నీలదు
కూలంబు మేల్కట్టు కొమరు వడయఁ
దాను జొచ్చిన కతన మత్స్యక్షితీశు
నింట నిమ్మెయిఁ గ్రొత్త యొ ప్పెసకమెసఁగ
నమ్మహాదేవి యున్నెడ కల్ల నల్లఁ
బాండురాజతనూభవపత్ని యరిగె " 308ప.1ఆ.వి ప

ఇది పట్టికాప్రాయము కాదు ప్రత్యంగవర్ణనము కాదు. సౌందర్యప్రకాశవర్ణనము. ద్రౌపది అతుగుపెట్టిన చోట కుంకుమ పూసినట్లయినది. ఆమె శరీర కాంతి ప్రసరించిన గోడలు, వేదులు మణులు తాపించినట్లయినవి కనుగవ మెఱుగులు అలమిన లావున పువ్వులు పఱిచినట్లయినది కొప్పు నలుపు వ్యాపించిన పైభాగము నల్లని దుకూలము మేల్కట్టు కట్టినట్లయినది. ద్రౌపది ప్రవేశించుటవలననే విరాటరాజువాట క్రొత్తవికాసము కలిగినట్లయినది ఇందు విద్యుల్లత విసిరినట్లు ద్రౌపది సౌందర్యము ప్రకాశించినట్లు వర్ణింపఁబడినది ఇంత మాత్రమున తిక్కన ఇతరత్ర ప్రత్యంగవర్ణన చేయలేదని పర్యవసానము కాదు. ఉత్తర సౌందర్యవర్ణనము (245 ప 1 ఆ వి. ప.) ప్రత్యంగ వర్ణనమే ద్రౌపది సౌందర్యవర్ణనము ప్రత్యంగ వర్ణనము కాదు. ప్రకాశవర్ణనము. ఇది తిక్కన వర్ణనావైదగ్ధి.

మహాభారతములోని నాయకుడు ధర్మరాజు ధర్మరాజు వైభవమును ద్రౌపది భీమునికె వర్ణించి చెప్పుట కలదు. అది సంస్కృత భారతమునందు అమితతేజస్కు

లైన రాజులు లక్షమందిచేత ఉపాసింపబడుననీ, లక్షమంది దాసీజనముచేత దివారాత్రములు ఆతిథ్యమిచ్చుననీ, సర్వసంపన్నుఁడనీ, సూతమాగధులు ఉభయ సంధ్యల కైవారము సేయుదురనీ, వేయిమంది ఋషులు సభాసదులని సాహూస్యముగ కలదు. ఇదితిక్కన భారతమునందు ఇట్లు కలదు.

"ఎవ్వని వాకిట నిభమదపంకంబు
 రాజభూషణరజోరాజి నడఁగు
నెవ్వని చారిత్ర మెల్ల లోకములకు
 నొజ్జయై వినయంబు నొఱపు గఱపు
నెవ్వని కడకంటి నివ్వటిల్లెడు చూడ్కి
 మానితసంపద లీనుచుండు
నెవ్వని గుణలత లేడు వారాసుల
 కడపటి కొండపైఁ గలయఁ బ్రాఁకు
నతఁడు భూరిప్రతాప మహాప్రదీప
దూరవిఘటిత గర్వాంధ కారవైరి
వీరకోటీరమణిఘృణి వేష్టితాంఘ్రి
తలఁపఁడు గేవల మర్త్యుఁడె ధర్మసుతుఁడు"

191 ప. 2 ఆ. వి. ప.

రాజప్రాసాదము ముందు ఏనుగులు సంచరించును. ఏనుగుల గండస్థలముల నుండి మదజలము స్రవించును. పెక్కు ఏనుగుల మదజలము స్రవించిన నేల బురద అగును. అది రాజదర్శనము కొఱకు వచ్చిన సామంతరాజుల ఆభరణముల నుండి రాపిడికి రాలిన సువర్ణరత్నముల ధూళిపాళికలకు పూడును. అసంఖ్యాకులైన సామంతరాజులు అతి సమ్మర్దముగా కలరని, ధర్మరాజు అంత మహారాజని ధ్వన్యర్థము అంతేకాదు ధర్మరాజు ప్రవర్తనము సమస్తలోకములకు గురుస్థానీయమై వినయమును, విధానమును నేర్పును. ధర్మరాజు కటాక్షవీక్షణము సగౌరవ సంపదలను కగిగించును ధర్మరాజు సద్గుణలత సప్తసముద్రముల కడపటి కొండమీద కలయఁబ్రాకును. ధర్మరాజు భూరిప్రతాప మనెడు మహా ప్రదీపము చేత దూరము చేసిన గర్వాంధకారము కల వైరివీరుల కిరీటరత్నకాంతి చుట్టుముట్టిన పాదములు కలవాడు గర్వాంధకారులైన శత్రురాజులు ధర్మరాజునకు

పాదాక్రాంతులని తాత్పర్యము. ఇది ధర్మరాజు వైభవము. ధ్వని గర్భితమైన పద గుంభనము, అలంకార విజృంభణము; సీసపాదములు యదర్థకవాక్యములుగ, ఎత్తుగీతము తదర్థక నిర్దేశముగ యత్త దర్థకసమన్వయము, పాదాంతవిరతిని పాటించిన సీస పద్యరచనము తిక్కన వర్ణనా వైదగ్ధి.

—— భీమకీచకుల మల్లయుద్ధము సంస్కృతభారతమునందు అతివిస్తరముగ కలదు అంతట బాహాటముగ కలదు (47-శ్లో. 21 అ) తిక్కన భారతమునందు అతిసంగ్రహముగ కలదు ఒక పద్యమునందు గూఢముగ కలదు.

"తన యగపా టొరు లెఱుఁగుదు
రని సూతుఁడు సమయభంగమగుటకు భీముం
డును గొంకుచుఁ జప్పుడు సే
యని గూఢవిమర్దనప్రహారములఁ దగన్" 245 ప. 2 ఆ.

"మల్లయుద్ధ నైపుణ్యంబు మెఱయం గడంగి ... పెనఁగిరి"
(346 వచ. 347 ప 2 ఆ. వి. ప)

భీమకీచకుల మల్లయుద్ధము నర్తనశాలలో జరిగినది. అది కూడ అర్ధరాత్రి మల్లయుద్ధము బాహాటముగ చేసిన, మర్దలధ్వనులకు బదులు మర్దనధ్వనులు వినఁబడి రక్షకభటులైన రాఁగలరు. తన లొంగుబాటు ఇతరులకు తెలియునని కీచకునికి గొంకు సమయభంగమగునని భీమునికి గొంకు అందువలన ఇద్దఱును చప్పుడు కాని గూఢవిమర్దనప్రహారముల మల్లయుద్ధనైపుణ్యము మెఱయ మల్లయుద్ధము చేసిరట. అది వారి మల్లయుద్ధనైపుణ్యము కాదుగాని, తిక్కన వర్ణనావైదగ్ధి :

ఉత్తరుడు చూచిన గోగణమును తరలించు కౌరవసైన్యము సముద్రఘోష వలె కలదని, వాని వలన రేగిన ధూళిరేణువులు పైకెగయుట బహుపాదపవనము ఆకాశమునందు సంచరించుచున్నట్లు కలదని సంస్కృతభారతమునందు కలదు. (5,6శ్లో 6అ వి.ప). ఇది తిక్కన భారతమునందు ఇట్లు కలదు

"అభినవజలధరశ్యామంబులగువెద
లాకుజొంపంబుల ననుకరింప
సాంధ్యరాగోపమచ్ఛాయంబులగు పట్లు
కిసలయోత్కరములఁ గ్రేణిసేయ

రాజమరాళగౌరములగు చోటులు
దఱచుఁబూఁబొదల చందంబునొంద
హరిద్రరుచిసమానాకృతులగు రావు
లడరెడు పుప్పొడులట్లు మెఱయఁ
గలయ నెగసి ధరాధూళి లలితవనము
దివిరె నఁగాపు వోయెడు తెఱఁగుఁదాల్ప
గోగణము సుంగలిగ నేల గోడివడఁగ
నడుచు కౌరవరాజసైన్యంబు గనియె" 50ప.4ఆ.వి ప.

ఇందు బహుపాదపవనము లలితవనమైనది లలితవనమన ఉద్యానవనము. ధూళి పైకెగయ నపుడు సరిక్రొత్తమబ్బులచేత నల్లనైన తావుల ముదురాకుజొంప ముల వలె, సాంధ్యరాగములకు సాటిగ ఎఱ్ఱనైన తావుల చిగురాకుజొంపముల వలె, రాజహంసలవలన తెల్లనైన తావుల పూఁబొదల వలె, పసుపుకాంతికి సమానమైన తావుల పుప్పొడుల వలె కనిపించుట తిక్కన స్వతంత్రకల్పనము.

భీముడు కీచకవధకు నిశ్చయించుకొన్న వేకువను నిద్రపట్టక అవస్థపడు నెడ తిక్కన కావించిన ప్రభాతకాలవర్ణనములోని తొలి పద్యమిది:

"ద్రుపదనందన పరిభవదుఃఖమునకు
నుల్లమున దురపిల్లుచునున్న సరసి
వేఁడినిట్టూర్పులో యన వెడలెఁ
గ్రొత్తావి మూతలు విచ్చు నెత్తమ్మివిరుల" 236ప.2ఆ వి.ప.

ప్రభాతకాలమునందు పద్మములు వికసించుట కవిసమయప్రసిద్ధము పద్మ ములు సరస్సునందుండను సరస్సు కూడ ద్రౌపది పరిభవదుఃఖమునకు దుర పిల్లుచు విడుచు వెడినిట్టూర్పులో అనునట్లు విచ్చుకొను నెత్తమ్మివిరుల క్రొత్తతావులు వెడలెనని సంభావనము.

సనత్సుజాతుడు ధృతరాష్ట్రునకు అధ్యాత్మతత్వము తెలిపి, ప్రభాతమగుట వలన అంతర్ధానము నొందినపుడు తిక్కన కావించిన ప్రాతఃకాలవర్ణనములోని తొలి పద్యమిది:

"తన కులంబునఁ బుట్టిన ధార్తరాష్ట్రు
లన్నదమ్ములతో విగ్రహంబు గొనుట
కుమ్మలించి వివర్ణత నొందినట్లు
గంది యెంతయుఁ జెలువేదెఁ జందురుండు." 107ప 2ఆ.ఉ.ప.

కౌరవులు, పాండవులు చంద్రవంశీయులు. కౌరవులు పాండవులతో యుద్ధము చేయుటకు రంగము సిద్ధమైనది అది వంశమూలపురుషుడైన చంద్రునికి ఆవేదన కలిగించును అందువలన ప్రభాతప్రాయవిభావరిలోని చంద్రుడు కంది వికాసము గాజువాఱిన స్థితి నందెనని సంభావనము

తిక్కన యుద్ధవర్ణనములందు శృంగారమును జోడించునని ఒక అభిప్రాయము కలదు [51] అది కేవలము తిక్కన స్వోపజ్ఞము కాదు. వ్యాసుని యుద్ధ వర్ణనములందును శృంగారమును జోడించుట కలదు అది తిక్కన యుద్ధవర్ణనము లందు అమూలకముగను సమూలకముగను కలదు భీష్ముని అష్టమదివసయుద్ధావ హారమున "కాంతేయవ్యూహంబులు సభినవోత్సాహంబునం బోక పెనంగిన" (161వచ)

"ధరణి నెత్తుటఁ దోఁగి యాభరణకాయ
శస్త్రఖండజాలంబుల ( జాల నొప్పెఁ
బలుచ గాకుండఁ గుంకుమ మలఁది పెక్కు
దెఱఁగు తొడవులు దొడిగిన తెఱవ వోలె" 162ప.2ఆ.భీ.ప.

కౌరవుల ఆభరణములు, ఆయుధములు, శరీరములు, ఖండఖండములై పడుట సంస్కృతభారతమునందు సముజ్జ్వలముగ సుదీర్ఘముగ కలదు. దట్టముగా కుంకుమ హత్తిన పెక్కునగలు ధరించిన స్త్రీతోడి సాదృశ్యము లేదు శృంగార రసస్ఫోరకమైన తిక్కన సాదృశ్యకల్పనమిది అమూలకము.

ధర్మరాజు ప్రయోగించిన శక్తివలన, మద్రరాజు శల్యుడు మరణించి నేల మీద పడుట కాంతుడు ప్రియురాలైన కాంత ఉరమునందు పడినట్లు కలదని సంస్కృతభారతమునందు కలదు. "ప్రియయా కాంతయా కాంతః పతమాన ఇవోరసి" (వా. ము.౨౭శ్లో.17అ శ.ప) ఇది తిక్కన భారతమునందు ఇట్లు కలదు.

"భూమి మీఁద నిట్లు బోరగిలంబడి
మద్రనాథుఁ డొప్పె మానవేంద్ర
లేమ యురమునందు లీలమై వ్రాలిన
ప్రాణనాథుఁ బోల్పఁ బట్టు గాఁగ" 286 ప 1ఆ.శ.ప.

సంస్కృతభారతములోని సాదృశ్యమునందు శృంగారరసస్ఫూర్తి కలదు. తిక్కన భారతములోని సాదృశ్యమునందు "బోరగిలంబడి," "లీలమై వ్రాలిన" అను వివరణముల వలన శృంగారరసపూర్తి కలదు అయినను సమూలకమే.

సమూలకములైన వర్ణనములందును, అమూలకములైన వర్ణనములందును వర్ణనావైదగ్ధి తిక్కన కావ్యశిల్పప్రౌఢియే.

## శైలి

తిక్కన శైలి తెనుగుదనము తేనెపెఱ సంస్కృతప్రౌఢి పుంఁడ్రేక్షుఘటి. పూర్వోదాహృతములైన "దప్పి జనించె", "ఇది గడుముద్దరాలు", "అంతలు సేసి", "ఇవి దుస్ససేను", "ఈ వెంట్రుకలు వట్టి", "చిచ్చఱకన్ను", "చిగురుటాకుల", "ఎత్తునఁగొందు", "కొడుకుఁజూడ", "హంసతూలిక", "ఈ లోకమెల్ల", "అల్ల దనంబున", "అలమటఁబొందు", "దైన్యంబు తలపోత" మొదలైన పద్యములెల్ల తెనుగుదనము తేజరిల్లునవి. "దుర్వారోద్యమ", "శక్తిస్ఫార", "కనుఁగొని కోపవేగమున", "భీష్మద్రోణ" "కఁగాత్రంబుల" "ఘోరానేక" మొదలైన పద్యములు సంస్కృత ప్రౌఢి పరిఢవించునవి.

తెనుగుదనమునకు మఱొక తేనెచినుకు :

"దక్కెను రాజ్యమంచు సకటా యిటు రమ్మని భాగ మీక నీ
వెక్కుడి మ్రింగఁజూచె దది యెట్లరుగున్ విను మీను లోలతన్
గ్రక్కున నామిషంబు చవి గాలము మ్రింగిన చాడ్పు నూవె యి
ట్లుక్కివుఁడైన నీ కొడుకు నల్లడు నున్నటు లాడఁగూడునే"
52.ప 2 ఆ ఉ.ప.

సంస్కృతప్రౌఢికి మఱొక పుంఁడ్రేక్షుఖండము

"పుష్టోదంచితసాంపరాయరససంపూర్ణాంగమున్ సరగరా
వష్టంభోజ్జ్వల వీరరేఖయును భాస్వద్వ్యూహసంవల్గనో
త్కృష్టస్యందనమున్ గనద్ధనువు నుద్దీప్తధ్వజంబున్ దగన్
ధృష్టద్యుమ్నుఁడు వొల్చె నైజవిలసత్తేజోవిరాజద్గతిన్" 117ప.1.ఆభీ.ప

ఇట్టి సంస్కృతప్రౌఢి కంటె, అట్టి తెలుగుదనము తిక్కన శైలికి ప్రధాన లక్షణము. అది శివకవుల జానుతెనుగు కంటె సరసమై పరగునది అంతేకాదు. శివకవిశిఖామణి పాలకురికి సోమనాథుడు "అల్పాక్షరముల ననల్పార్థరచన కవి వివేకము గాదె" అన్న కవితాలక్షణము తిక్కన శైలికి జీవలక్షణము అది మహా కవిత్వలక్షణము. మహాకవిత్వదీక్షా నిధి అను శీర్షికను వివరించినదెల్ల తిక్కన అల్పాక్షరముల అనల్పార్థరచనమే

తిక్కన శైలిలో ఎంత తెనుగుదనము తేజరిల్లినను, మఱెంత సంస్కృత ప్రౌఢి సముజ్జ్వలించినను, అది శ్రీనాథుడు సూత్రీకరించిన రసాభ్యుచితబంధము. శబ్ద శిల్పము రసాభ్యుచితబంధము అను శీర్షికను విశదీకరించినదెల్ల తిక్కన శైలీ విశేషమే.

"ఆంధ్రవాఙ్మయమునందు మొదటినుండియు రెండు భిన్నశైలులు కలవు. i. సంస్కృతజటిలము, సమాసఘటితము, అక్షరరమ్యమునగు శైలి. ii దేశ్యపద మయము, నాతిసమాసభూయిష్ఠము, అర్థరమ్యమగు శైలి ఇందు మొదటిదానికి నన్నయ, రెండవ దానికి తిక్కనయు గురువులు" అని ఒక అభిప్రాయము కలదు.[52] కాని నన్నయ శైలి సంస్కృతజటిలము కాదు సంస్కృతమృదులము. అంతేకాదు నన్నయ శైలి అక్షరరమ్యము మాత్రమే కాదు; అర్థరమ్యము కూడ. నన్నయ శైలి శబ్దార్థసమప్రాధాన్యము కలది. తిక్కన శైలి అర్థప్రాధాన్యము కలది. కాలక్రమమున శబ్దార్థసమప్రాధాన్యము సన్నగిల్లి శబ్దప్రాధాన్యము హెచ్చినది. అర్థప్రాధాన్యమును తగ్గినది శబ్దార్థసమప్రాధాన్యము కల శైలికి నన్నయ, అర్థప్రాధాన్యము కల శైలికి తిక్కన గురువులే కాని, కేవలశబ్ద ప్రాధాన్యము కల శైలికి వారు గురువులు కారు.

తిక్కనది నాటకీయశైలి అని మఱొక అభిప్రాయము కలదు[53] తిక్కన మహాభారతములోని పాత్రల సంభాషణములు నాటకములలోని పద్యముల వలె ప్రత్యేక పద్యములుగ ఉండుట తన్నిమిత్తము. అట్టి పద్యములు విరాటోద్యోగ పర్వములందు బహుళము స్త్రీపర్వమునందును బహుళము. యుద్ధపంచకమునందు, శాంతిసప్తకమునందు విరళము విరాటోద్యోగపర్వములందును అపవాదములు కలవు.

"అనిన విరటుఁ డిట్టు లనియె నెత్తెఱఁగున
నడప నిష్ట మట్ల నడచి మీకు
మనసు వచ్చి నన్ని దినములు సలుపుఁ డి
చ్చోట నదియ మాకు శోభనంబు." 206 ప.

"నిన్నుఁ గొలువంగ వచ్చితిఁ
గన్నియలకు నాట గఱపఁగా నొపుదు వి
ద్వన్నుత మన్నామంబు బృ
హన్నల యేఁ బేడి ననుడు తనఁ డిట్లనియెన్" 233 ప.

"నీ వెవ్వ రేమి పనికై
యే వలనికిఁ బోవుచునికి యిది నావుడు స
ద్దేవియు సౌముఖ్యము సం
భావనముం దోఁప నుచితభంగిం జెప్పెన్." 297 ప.

ఇవి విరాటపర్వము ప్రథమాశ్వాసములోని పద్యములు. ఇతరాశ్వాసము లందును, ఇతరపర్వములందును ఇట్టి పద్యములు కలవు ఇది నాటకములలోని పద్యములవంటివి కావు అంతేకాదు నాటకములలోని పద్యముల వలె ఉండుట నాటకీయశైలి కాదు. నాటకీయపద్ధతి ఇది నన్నయయుగమునందు శైలి అను శీర్షికను వివరించినది

అసలు నాటకీయత అనగా సజీవపాత్రసాక్షాత్కరణము, మనోభావవ్యక్తీకరణము, సంభాషణనైపుణ్యమును అని ఒక అభిప్రాయము కలదు.[54] సజీవపాత్రసాక్షాత్కరణమునకు ఒసగిన ఉదాహరణములలో మచ్చునకు ఒకటి:

"అనిన విని కెన్కఁ బూనిన యలంతి నగవు
చెలువు మొగమున కొక క్రొత్త పొలుపు పొనర్పఁ
బుండరీకాక్షుఁ డగుటెల్లఁ బోయి యప్పు
డరుణకమలాక్షుఁడగుచు మురాంతకుండు"

ఇది సజీవపాత్రసాక్షాత్కరణము కాదు శ్రీకృష్ణరూపసాక్షాత్కరణము. అందును "పుండరీకాక్షుఁడగు టెల్లఁబోయి యప్పు డరుణకమలాక్షుఁ డగుచు" అనుటవలన శ్రీకృష్ణుని రూపము కంటె తిక్కన కల్పనము సాక్షాత్కరించును. ఇంతకునిది ఆంగికవర్ణనము. సజీవపాత్రసాక్షాత్కరణమునకు ఒసగిన ఉదాహరణములు ఇట్టివే

మనోభావవ్యక్తీకరణమునకు ఒసగిన ఉదాహరణములలో మచ్చునకు ఒకటి:

"అనిలజునకుఁ జాలఁడె నా
తనయుఁడు మోసంబు గాక ధర్మజుఁ డట్ల
ట్పినఁ బోనిచ్చుట రాధా
తనయునకుం బుద్ధి యగునె తప్పెం దప్పెన్"

ఇందు " 'తప్పెం దప్పెన్' అను నా చివరిమాటలో నా ముసలిరాజు హృదయావేదనమంతయు మనకు సమగ్రముగా సాక్షాత్కరింపఁ జేసినాడు కవి బ్రహ్మ." అని వివరణము ఇంతకు నిది వాచికవ్యాఖ్యానము మనోభావవ్యక్తీకరణమునకు ఒసగిన ఉదాహరణములు ఇట్టివే సంభాషణనై పుణ్యమునకు ఉదాహరించిన పద్యములు కూడ వాచికములే అంగికము, వాచికము నాటకీయత కాదు. సంఘటనాత్మకమైన సంఘర్షణాత్మకమైన, ఉత్కంఠాపాదకమైన, ఆశ్చర్యజనకమైన దృశ్యరూపచిత్రణము నాటకీయత

"ద్రోవది బంధురం బయిన క్రొమ్ముడి గ్రమ్మనవిడ్చి వెంట్రుకల్
దా వలచేతఁ బూని యసితచ్ఛవిఁ బొల్పు మహాభుజంగమో
నా విలసిల్లి వ్రేలఁగ మనంబునఁ బొంగు విషాదరోషముల్
గావఁగ లేక బాష్పములు గ్రమ్మఁగ దిగ్గన లేచి యార్తయై— 114 ప.
గోవింద ముందటంబెట్టి" 115 వచ 3 ఆ. ఉ. ప.

సంధిప్రయత్నము సంఘటనము సంధికి, ప్రతీకారమునకు సంఘర్షణము. వెంట్రుకలు "గోవింద ముందటం బెట్టి" ఏమి చేయునో, ఏమి పలుకునో అని ఉత్కంఠ కలుగును పలికెన "ఇవి దుస్ససేను", "ఈ వెంట్రుకలు వట్టి" అను పద్యములు ఆశ్చర్యము గొలుపును. "బంధురంబయిన క్రొమ్ముడి గ్రమ్మన విడ్చి వెంట్రుకల్ దా వలచేతఁ బూని యసితచ్ఛవిఁ బొల్పు మహాభుజంగమో నా విలసిల్లి వ్రేలఁగ" దృశ్యరూపచిత్రణము– ఇది నాటకీయత

వస్తువునందు సంఘటనాత్మకమైన, సంఘర్షణాత్మకమైన సన్నివేశము కలదేని, కవి ఉత్కంఠాపాదకముగ, ఆశ్చర్యజనకముగ దృశ్యరూపచిత్రణము చేసిన నాటకీయత సిద్ధించును. అది యూత కవి ప్రత్యక్షకథనమైనచో అధికము పాత్రముఖమున పరోక్షకథనమైనచో స్వల్పము కర్ణజపసవృత్తాంతము కలదు. అది వస్తుతః సంఘటనాత్మకమైన, సంఘర్షణాత్మకమైన సన్నివేశము సన్నయ ధార

తమునందు ప్రత్యక్షకథనము (17ప-33వ 7ఆ ఆ ప.) ఎఱ్ఱన భారతమునందును ప్రత్యక్షకథనమే (318వ-349వ 7ఆ ఆర.ప.) తిక్కన భారతమునందు పరోక్ష కథనము కుంతి ముఖస్థము. (94ప-105ప 2ఆ ఆశ్ర స) నన్నయ, ఎఱ్ఱనల కర్ణజననవృత్తాంతములలోని నాటకీయత, తిక్కన కర్ణజననవృత్తాంతమునందు లేదు. పద్యములు నాటకములలోని పద్యముల వలెనే కలవు. ఆంగికసాత్త్వికాభిన యాంశములును కలవు. అయినను నాటకీయత అంతంతమాత్రమే కారణము నాట కీయత కవిపరము కాదు వస్తుగతము.

నాటకములందు కతిపయప్రయోగసూచనము లుండును అట్టివి తిక్కన భారతమునందు అత్యధికముగ గలవు ఉత్తరరామాయణమునందును కలవు. అందు నవ్వులు అపూర్వవిశేషము అవి ముప్పదిరెండు విధములుగ కలవు[55] ముప్పది రెండు విధములును మఱల మూడువిధములు. చిన్న నవ్వులు పెద్ద నవ్వులు. గొప్ప నవ్వులును. 1 పిన్ననవ్వు 2 చిఱునవ్వు 3 అల్లనవ్వు 4. అలతినవ్వు. 5. మందస్మితము 6 హర్షమందస్మితము 7 అంతస్స్మితము. 8 జనితమంద స్మితము 9 ఉద్గతమందస్మితము 10. అనాదరమందస్మితము 11. సాదరదర హాసము. 12. తిన్ననినవ్వు 13 లేతనవ్వు 14 కొండొక నవ్వు. ఇవి చిన్న నవ్వులు. 15. పెలుచనవ్వు 16. ఉబ్బు మిగిలిన నవ్వు 17. గేలిగొను నవ్వు. 18. ఒత్తిలి నవ్వు: 19. అపహాసము 20. రోషకరినహాసము 21.ఉద్భటహాసము. 25. కలకలనవ్వు. ఇవి పెద్ద నవ్వులు. 23 ఎలనవ్వు 24. ప్రౌఢస్మితము. 25. బెట్టు నవ్వు. 26. కన్నుల నవ్వు 27 కన్నుల నిప్పులు రాల నవ్వు 28 కినుకు మానిన నవ్వు 29. కినుకు మునుంగు నవ్వు 30. కటిక నవ్వు 31 నవ్వు గాని నవ్వు 32 ఎఱ్ఱనవ్వు ఇవి గొప్ప నవ్వులు

**కతిపయోదాహరణములు :**

"అనుడుఁ జిన్న నవ్వొలయంగ నశ్వసేనుఁడు
నపునిపైఁ జూడ్కి నాటించి నన్ను గెలువ
కెట్లు సైంధవుఁ జేరెదం చేసె రథ్య
ములును హరియును నతఁడు నమ్ముల ముసుంగ" 26ప.3ఆ ద్రో.ప

"అని మునిపతి యివ్విధమున
దనుజపతిం జెప్ప రామధరణీపతి తి
న్నని నవ్వు మెఱయ నాతని
వినతిమి యిటె నొకటి వినఁగ వెఱుకయనుచున్." 95ప 7ఆ.ఉ రా.

"అట్లు దాఁకుటయు బకాంతకుఁ డంత్యకా
లాంతకుండు వోలె నరిగి బొమలు
ముడివడంగ నొక్క వెడఁదయస్మునఁదల
నఱిచె పైచి పెలుచ నవ్వె నధిప." 72ప.3.ఆ.భీ.ప.

"అందఱి వారలెల్లను జయంబునఁ బొంగుచుఁ బేరెలుంగు లం
దంద చెలంగఁగాఁ బలుక నార్వఁగ నొత్తిలి నవ్వ నాకసం
బందిన యట్టి మ్రోఁత విని యక్కడ నోవఁగ నుల్కి రప్డు ద
మ్ముం దడవన్ వడిన్ మూకలు మ్రోయుటగాఁ దలంచుచున్." 5.ప.1.
ఆ.సౌప.

"కనుఁగొని యెల నవ్వోలయు వ
దనమున గరువంపుఁ జెన్ను దలకొనఁగా స
ర్జునుఁడు విరాటసుతున కె
ట్లనుఁ గేవలవీరరసమయాత్ముఁ డగుచున్" 3ప.5ఆ.వి.ప.

"అనిన వెలుకఁబాఱె యతిదీనమగు నాన
నమున నవ్వు గాని నవ్వు నెఱయ
సౌమదత్తికర్ణశల్యాదులగు యోధ
జనులతోడ నిట్టులనియె విభుఁడు." 14ప 2ఆ.ద్రో.ప.

ఇట్లు తిక్కన ఉత్తరరామాయణమునందు, మహాభారతమునందు నవ్వులు ముప్పదిరెండు విధములుగ ఉండుట అపూర్వవిశేషము. నవ్వుల వైవిధ్యమిది నాన్యతోదర్శనీయము-

## ఆత్రేయత

తిక్కన మొదట సేనాపతి "తిక్కచమూప" అని కేతన సంబుద్ధి (1ప.8ఆ.ద.కు చ.) చమూపుడన చమూపతి. అనగా సేనాధిపతి. సేనాధిపతికి యుద్ధరంగము భయ దర్శనము కాదు. ప్రియదర్శనము అది తిక్కన

కృతులందు ప్రతిఫలించినది యక్షరాక్షస యుద్ధరంగములోని "కెంజాలజలముపైఁ దేలుచు నవ్వి నట్లున్న శిరంబులు ... కమలషండము"గ, "సప్తుల కొలఁదిఁ గృత్తంబులై పడియున్న పాదంబులు ... తలిరుఁబాన్పు"గ, తిక్కనకు కనిపించెను. (6. ప 4 ఆ ఉ రా) దక్షిణోత్తరగోగ్రహణ యుద్ధరంగములు అంతే. (237 వచ 3 ఆ; 60 వచ 5 ఆ వి ప.) కురుక్షేత్రయుద్ధరంగము కేయూరహార శరీరశకలములు "రాలిన వివిధపుష్పపుంజమునఁ బొల్చు నుద్యానభూమి" వలె కనిపించెను (88 ప 3 ఆ భీ ప) అంతేకాదు తిక్కనకు భీష్మభార్గవుల" సంగ్రామం బభిరామం బయ్యును ఘోరప్రకారం బయ్యె"ను. (60 వచ 5 ఆ. వి ప.) కౌరవసైన్యము "పరమాభీల సుందర సమ్మర్దంబయ్యె"ను. (95 వచ. 1 ఆ. భీః ప) పాండవసైన్యము "చారుభీషణంబై ... యొప్పె"ను. (130 వచ. 1 ఆ భీ ప) కురుక్షేత్రము "ఘోరంబును నభిరామంబునై యుండె"ను (311 వచ. 1 ఆ. ద్రో ప)" దారుణప్రియ దర్శనంబయ్యె"ను. (78 వచ 2 ఆ ద్రో ప) ఘోర పరమాభీల భీషణదారుణమైన యుద్ధరంగమునందు అభిరామసుందరచారు ప్రియదర్శనములు చమూపతియైన తిక్కన ఆత్మీయతకు నిదర్శనములు.

మొదట సేనాధిపతి అయిన తిక్కన తర్వాత మంత్రి "మనుమసిద్ధిమహీ వల్లభునకుఁ గరుణారసపాత్రంబైన కొట్టరువు తిక్కనామాత్యుండు నిజకులక్రమా గతంబగు మంత్రిపదవియందు వర్తిల్లుచు" (20 వచ 1 ఆ.)" మనుమసిద్ధిమహీశ సమస్తరాజ్య భారధౌరేయుఁ"డని (89 ప. 1 ఆ. ద కు చ) కేతన అందిచ్చిన సమాచారము మనుమసిద్ధికి, కాకతిగణపతిదేవ చక్రవర్తికి మైత్రి చూర్చుటకు తిక్కన కాకతీయుల రాజధాని ఓరుగల్లు వెళ్ళి గణపతిదేవుని మెప్పించినట్లు ఐతిహ్యము కలదు మనుమసిద్ధి కాకతిగణపతిదేవ చక్రవర్తి మైత్రిని కోరినట్లు చరిత్ర కలదు కావున తిక్కన రాయబారము చారిత్రికసత్యము కావలయును మహాభారత నందు మూడు రాయబారములు కలవు. మూడు రాయబారములును మూడు విధ ములుగ కలవు మూడు విధములైన మూడు రాయబారములందును తిక్కన ఆత్మీయత కలదు

**ద్రుపదపురోహితుని రాయభారము :** ద్రుపదపురోహితుడు పాండవుల రాయబారి. పురోహితులకు వాక్యము పూజ్యము రాయబారమునకు వాక్యము రాజ్యము ద్రుపదపురోహితుడు గతము సభాసదులకు విదితమని,

పాండవులు ద్యూతసభలో మహాక్లేశములు, అరణ్యవాసములో వివిధక్లేశములు, అజ్ఞాతవాసములో పరమక్లేశములు పడసిరని చెప్పినట్లు సంస్కృత భారతమునందు కలదు. (10–12 శ్లో. 20 అ ఉ ప.) ఇందు లౌక్యము లేదు. అదే భీష్ముడు అతితీక్ష్ణమనెను. ఇది తిక్కన భారతమునందు ఇట్లు కలదు

"—ఎఱుఁగుదుర కాదె దీనికి నెల్ల నియ్యె
కొనియె నీ పెద్దరాజు నే మనఁగ నేర్తు 231 ప.

నారీరత్నము నట్లు దెచ్చి సభలోన న్వారలుం జూడఁగాఁ
జీరల్ ప్రోవులు గాఁగఁ జేయుటకు లచ్చిం బుచ్చికోలున్ మహో
గ్రారణ్యస్థలి నిల్వఁబంపుటయు దైన్యవ్యాప్తమై పల్కులున్
సైరింపంజను పాండవేయులకు నీ సంధిక్రమం బొప్పదే"
232 ప. 1 ఆ. ఉ. ప.

ఇందు ధృతరాష్ట్రుని నిండుసభలో నిందార్హుని చేయుట, ధార్తరాష్ట్రుల ధార్ష్ట్యములు ధాటిగా ప్రకటించి సూటిగా ప్రశ్నించుట ద్రుపదపురోహితుని లౌక్య రాహిత్యమునకు ధ్రువపత్రముగ కలదు. అది శ్రుతికి పరుషమని, సభకు అనిష్ట మని భీష్ముడనెను. (243 ప) రాయబారికి తగదని భీష్ముని తాత్పర్యము తిక్కన ఆంతర్యము. శ్రుతిమధురమైన, సభారంజకమైన తిక్కన అనుభవము, అనుభావము వ్యతిరేకముఖమున ప్రతిఫలించినది.

ii **సంజయుని రాయబారము :** సంజయుడు కౌరవుల రాయబారి. పరమలౌక్యుడు. కుశల ప్రశ్నలలోనే ధర్మరాజు కోపమును గ్రహించి, ప్రకోపశమ ముగ పలికి, ఇంద్రప్రస్థమో మఱొకపట్టణమో అడుగునట్లు చేసి, కౌరవులు పాలీక చెడదలంచిన పాండవులకు రుధిరాభీలాన్నముకంటె భిక్షాన్నమైన మేలని, ధర్మరాజు అహింసాధర్మమును, అతనిదగు చరిత్రమును ప్రశంసించి, శాంతి, దాంతి కల ధర్మ రాజు చరిత్ర హింసాకళంకితము కాఁగూడదని ఇట్లనెను

'అల్పులకు మ్రింగఁ జేదైన హాలహలము
భంగిఁ బొంగెడుఁ గోపంబు మ్రింగికొనఁగ
నీలుగకు నెన్ని నిన్నెన్నఁ బోలు నట్టి
నీవు సారిసఁ గాకేల నెగడుఁ బేరు" 333ప.1ఆ.ఉ.ప.

ఇది సంజయుని పరమలౌక్యమునకు పతాకస్థాయి అపాలాటము ఇందు అల్పులైన అన్యులకు మ్రింగుటకు సాధ్యము కాని మహావిషమైన హాలాహలమును కంఠనిక్షిప్తము కావించిన కాలకంఠుని తర్వాత, హాలాహలము వంటి కోపమును అంతర్గర్భితము చేసికొనగలవాడు ధర్మరాజే అని స్తోత్రపారాయణము కలదు. ఇచట సంస్కృతభారతములోని ధర్మోపన్యాసము కంటె, తిక్కన భారతములోని స్తోత్రపారాయణము శక్తివంతమైనది ఎంతవాడును స్తోత్రమునకు పడిపోవుట లోకసహజము. అంతటి ధర్మరాజును "కోపంబు నివారింపఁదగు సహింసయ యుత్తమధర్మంబగు" నని వాసుదేవునిపై రాయబారము భారము వైచెను (33వ వచ) సంస్కృతభారతమునందు కంటె తిక్కన భారతమునందు సంజయునికి పరమలౌక్యము కలదు అది కార్యసాధకము. ఇది రాయబారము నిర్వహించిన తిక్కన ఆత్మీయతకు నిదర్శనము

**III శ్రీ కృష్ణుని రాయబారము :** శ్రీకృష్ణుడు పాండవుల రాయబారి. సర్వజ్ఞుడు సంధి పొసగదని తెలిసి సంధిప్రయత్నము నిర్వంచనముగ చేసిన నీతి విశారదుడు శ్రీకృష్ణుడు ధృతరాష్ట్రునికి చేసిన హితబోధ సంస్కృతభారతము నందు అఱువది శ్లోకములందు కలదు. ( 93అ.ఉ.ప. ) తిక్కన భారతమునందు ఇరువది తొమ్మిది పద్యగద్యములందు కలదు. (256ప-284ప.3ఆ ఉ ప ) సంఖ్యా బలము తగ్గినను స్థాయిబలము పెరిగినది. పాండవుల ఏకగ్రీవాభిప్రాయమును వివరించి చివఱకు శ్రీకృష్ణుడు చెప్పిన విషయమిది .

"సారపు ధర్మమున్ విమలసత్యముఁ బాపముచేత బొంకుచేఁ
బారముఁ బొందలేక చెడఁబాఱినదైన యవస్థ దక్షు లె
వ్వార లుపేక్ష సేసి రది వారల చేటగుఁగాని ధర్మని
స్తారక మయ్యు సత్యశుభదాయకమయ్యును దైవ ముండెడున్ "

273ప.3ఆ.ఉ.ప.

ఇది అమూలకము. తిక్కన స్వతంత్రకల్పనమే కాదు, శ్రీకృష్ణుని స్వతంత్ర కల్పనము కూడ శ్రీకృష్ణుడు ముందు వివరించి - పాండవుల ఏకగ్రీవాభిప్రాయములను ధృతరాష్ట్రుడు చలింపనేదు చలించునట్లు చెప్పిన విషయమిది. సారమైన ధర్మమును పాపముచేత, స్వచ్ఛమైన సత్యమును అబద్ధముచేత చెడఁగొట్టకొన్న అవస్థను- వ్యవస్థను- దక్షు లుపేక్ష చేసిన అది వారల చేటగును. అయినను,

ధర్మమును విస్తరించునది, సత్యమునకు శుభము కలిగించునదియునైన దైవముండును అనుట సామాన్యనీతి. దుర్యోధనాదుల అవస్థ సారమైన ధర్మమును పాపకృత్యములచేత స్వచ్ఛమైన సత్యమును అబద్ధములచేత చెడగొట్టుచున్నది అది ధృతరాష్ట్రిడే కాదు, సభాసదులు ఉపేక్షచేసినను వారల చేటగును. ధర్మమును విస్తరించు సత్యమునకు శుభము కలిగించు దైవముండుట తన్నిమిత్తము. తాను దైవము. పాండవపక్షము. ధర్మసంస్థాపనము, సత్యప్రతిష్ఠాపనము తన కర్తవ్యము. ధృతరాష్ట్రిడు, సభాసదులు అధర్మస్థితిని అసత్యగతిని ఉపేక్ష చేసిన నాశనమగుదురు అన్ని విశేషార్థము సామాన్యార్థము వాచ్యార్థము. నయభరితము. విశేషార్థము వ్యంగ్యార్థము భయజనకము నయభయముల రాచకార్యమును సాధించుట రాయబారి కర్తవ్యము అది తిక్కనకు అభ్యస్తవిద్య. ఇట ప్రతిఫలించినది.

నయభయముల శ్రీకృష్ణుడు సంధివచనములు పలికినను, ధృతరాష్ట్రిడు చలింపలేదు. సభాసదులు సంచలింపలేదు అయినను శ్రీకృష్ణుడు హితోపదేశమును ఆపలేదు. చిట్టచివరి మాటగ శ్రీకృష్ణుడు చెప్పిన విషయమిది:

"వారలు శాంతశూరులు భవచ్చరణంబులు గొల్వఁబూని యు
న్నారటుగాక పెకది మనంబున కప్రియమేని నింతకుం
బోరికి వచ్చుచుండుదురు భూవర రెండు దెఱంగులందు నీ
కారయఁ బథ్యమేది యగు నవ్విధ మేర్పడ నిశ్చయింపుమా."

284ప 3ఆ ఉ ప.

ఇది కూడ అమూలకము ఇందు నిర్బంధనిర్దేశము లేదు. నిర్ణయావకాశము కలదు. శ్రీకృష్ణుని రాయబారమునకు ఫలితము సాగిన సంధి వీగిన యుద్ధము. పాండవులు శాంతశూరులు. శాంతులే కారు; శూరులు కూడ అయినను ధృతరాష్ట్రిని పాదక్రాంతులగుటకు సిద్ధము అది కూడ అప్రియమైనచో యుద్ధము. రెండే మార్గములు ఒకటి సంధి మరొకటి యుద్ధము ఏది పథ్యమో అది నిశ్చయింపుమని శ్రీకృష్ణుని విధిలుపు పథ్యమన ఇష్టము కాదు కష్టమే కాని ఆరోగ్యకరము శ్రేయస్కరము రాయబారి నిర్ణయాధికారము లేదు ధృతరాష్ట్రినికే వదిలెను. అది సర్వజ్ఞుని ఉచితజ్ఞల ఇది తిక్కన అనుభవజ్ఞత.

తిక్కని మొదట హరిభక్తుడైన హరభక్తుడు. తర్వాత హరిహరభక్తుడు. "చిత్తజుని ద్వేషిని వృష" [20ప 1ఆ.] అభవచరణాంభోజాతస్య స్థచిత్తుడు

[10iప 1ఆ] సేవా తత్పరశశాంకశేఖరుడు [10ప 1ఆ] "లలితహరపదపద్మకా వాసచిత్త మధుకరుడు." [-ప 8ఆ.] అని మాత్రమేగాక, "శ్రీకాంతచరణపు శ్రీ కోకనద మధువ్రతుడు [1ప 6ఆ.] "హరిచరణకమలోపాస్తికృతస్వస్తి", అని పద [1ప.10ఆ.] కేతన దశకుమారచరిత్రము నందు కలదు "మహేశ్వరాంఘ్రికమ లధ్యానైకశీలుండ' నని [1ప 1ఆ] తిక్కన ఉత్తరరామాయణమునందు చెప్పు కొనుటయేగాక ఉత్తరరామాయణమును రచించెను రామకథ హరికథయే అంతే కాదు మహేశ్వరాంఘ్రికమలధ్యానైకశీలుడు అనగా శైవుడు కాడు శైవము చేయు నది శివలింగార్చనము మహేశ్వరాంఘ్రికమలధ్యానమాత్రము కాదు ఉత్తర రామాయణమునందు తిక్కనకు భావాంబరవీధిలో హరి కనిపించును. హరుడు కని పించును. విష్ణువు గరుడవాహనుడయి గగనమార్గమున రాక్షసులపై దండయాత్రకు వెడలునపుడు

> "గరుడునిపై శార్ఙధను
> ర్ధరుడగు విష్ణుఁడు మేలుతఱిఁ బొల్చు తటి
> త్పరివృతజలదముఁ బోలుట
> విరియ దనుజరాజహంసవితతి యితనిరిక్" 5ప.3 ఆ ఉ.రా

అని దేవతలు కీర్తనము సేయుదురట. సువర్ణకాంతు లీను బాణమును ధరించి, సువర్ణకాంతులీను సుపర్ణుడు వాహనముగ గగనమార్గమున బయలుదేరిన విష్ణువు, మెఱుపులతో కూడిన మేఘమును పోలుటవలన, రాక్షసులనెడు రాజహంసల గుంపు తొలగి పోయినట్లు దేవతల ప్రశంస. మెఱుపులతో కూడిన మేఘము వర్షాకాలమును సూచించును వర్షాకాలము రాగానే హంసలు మానససరోవరమునకు పోవునని కవిసమయము.

> "వివిధవర్ణమై యసురేంద్రు వీడు విడిసి
> యుండఁ జంద్రిక పర్వ నక్కొండ యొప్పె
> మెఱయు పులితోలు గట్టి మైఁదఱచు గాఁగ
> భూతి యలఁదిన భూతేశు పొలుపు దాల్చి" 56ప.6ఆ.ఉ.రా.

రావణుని సేనలు విడిసిన కైలాసపర్వతము పలురంగులు కలిగినను, పట్ట వాడిచిన నిండాయు వెన్నెలకు, పులితోలు కట్టుకొని ఒడలెల్ల విభూతి పూసికొన్న శివుని వలె కలదని తిక్కన కల్పనము. ఇవి తిక్కన ఆత్మీయతాప్రతిఫలనములే.

ఉత్తరరామాయణరచనాకాలమున మహేశ్వరాంఘ్రికమలధ్యానైకశీలుడైన తిక్కన మహాభారతరచనాకాలమున ఇష్టసిద్ధికి అనగా మోక్షసిద్ధికి పరతత్త్వమును గొలుచు పరిణతచిత్తుడు [1ప.1ఆ. విప.] పరతత్త్వము ధరించునది హరిహర రూపము హరిహరనాథ"పాదనిరంతరస్మరణతత్పరభావము"నతిక్కన కలిమియే. [15ప ఆ ఏ ప.] ఇది సగుణము అది నిర్గుణము సగుణమైన హరిహరనాథతత్త్వమునకు పరమార్థము నిర్గుణమైన పరతత్త్వము అది ఏకము హరిహరైక్యము తిక్కన ఆంతర్యము అది మహాభారతమునందు ప్రతిఫలించినది

"రేపు సూర్యాస్తమయము లోపున సైంధవుని వధింతు"నని నిద్రించిన అర్జునుడు స్వప్నమునందు వృషభధ్వజుని సందర్శించి, త్ర్యంబకుని సన్నిధిని తాను నిత్యవిధిగ వాసుదేవునికి నివేదించిన ఉపహారమును చూచినట్లు సంస్కృత భారతమునందు కలదు [వా ము 1-శ్లో 5 అ ద్రో ప] ఇది తిక్కన భారతమునందు ఇట్లు కలదు

> అర్జునుడు "విశ్వేశ్వరుం దప్పక చూచి తాను మున్ను ముకుందునందు సమర్పించిన నిశాసమయపూజాద్రవ్యంబులగు మాల్యానులేపనంబు లద్దేవుని దేహంబునం గాంచి యచ్చెరువంది యమ్మురహరపురహరుల యేకత్వంబు మనంబునం గొనియాడి -" 368వచ.2ఆ ద్రో.ప.

ఇందు హరిహరుల ఏకత్వము ఇదమిత్థముగ కలదు ఇచట హరి, అచట హరుడు పరతత్త్వము ధరించిన రూపములు హరిహరైకము పరతత్త్వము. సంస్కృతభారతములోని సాన్నిధ్యమును పరిహరించి, ఏకత్వమును ప్రతిపాదించుట తిక్కన ఆత్మీయతానిధానము

తిక్కన ఉత్తరరామాయణమునందు "అమలోదాత్తమనీష నే నుభయకావ్య ప్రౌఢిఁ బాటించు శిల్పమునం బారగుడన్" అని ప్రకటించుకొన్న అహంప్రత్యయాంచితుడు. మహాభారతమునందు "నా నేర్చిన భంగిఁ జెప్పి వరణీయుఁడ నయ్యెద భక్తకోటికిన్" అని విన్నవించుకొన్న నిరహంకారగుణాన్వితుడు అంతేకాదు "నా పుట్టు కృతార్థతం బొరసెఁ బుణ్యచరిత్రుఁడ"నని [27ప] మహాభారతరచనకు ఉపక్రమించిన బుధవిరాజి తిక్కనసోమయాజి,

> "పరమపదాప్తిహేతువగు భారతసంహిత శౌనకాదిభూ
> సురవరు లింపునం గరఁగు చొప్పునఁ జెప్పిన వారు మోదసం

భరితతఁ బొంది యక్కథకు బ్రాతిగ సర్చితుఁ జేసి రక్మిలిన్
హరిహరనాథ సర్వభువనార్చిత నన్ దయఁజూడు మెప్పుడున్."

అని ముగించెను ఇందు మొదటి మూఁడు పాదములందును మహాభారత విషయము ముగిసినది నాల్గవ పాదము మహాభారతవిషయము కాదు పరాకాష్ఠ దశనందిన తిక్కన పరిణతచిత్తపరమనివేదనము. అది తిక్కన మహాభారత కావ్య హారమునకు కొరికెపూస తిక్కన ఆత్మీయతాకిరీటమునకు కలికితురాయి.

# ఇతరకృతులు

కవివాగ్బంధము తిక్కనసోమయాజికృతముగ కలదు[56] అందు ఇరువది యేడు యతులు కలవు భీమన పది యతులు, అనంతామాత్యుడు ఇరువది యతులు, తర్వాత కొందఱు ఇరువదియేడు యతులు చెప్పినట్లు అప్పకవీయమునందు కలదు. (7 ప. 2 ఆ.) అందువలన కవివాగ్బంధము అనంతామాత్యుని తర్వాతి గ్రంథ మగును. కొట్టపవు తిక్కనసోమయాజికృతము కాదు. అది ఛందశ్శాస్త్రము.

కృష్ణశతకము తిక్కనకృతమనుట కలదు[57] కాని తిక్కనకృతమైన కృష్ణ శతకము ఉపలబ్ధము కాలేదు. అసలు తిక్కన కృష్ణశతకము రచించెననుటకు ఆధారములేదు. తిక్కనకృతము కాకపోవచ్చును.

విజయసేనము తిక్కనసోమయాజికృతముగ పెదపాటి జగన్నాథకవి ప్రబంధరత్నాకరమునందు కలదు. అందు "తిక్కనసోమయాజి విజయసేనము" అను ఆకరములు కల పద్యములు నాలుగు కలవు "కొనియెదనన్న"(200ప 1ఆ) "అరిమాననసుమ్మలు" (17 ప 2 ఆ) "మదనవశీకార" (69ప. 2ఆ.) "ఉత్సాహ ప్రథు" (5 ప. 3 ఆ.) ఇందు చివఱి పద్యము నీతిభూషణములోనిదని మడికె సింగన సకలనీతిసమ్మతమునందు కలదు. (150 ప 1 ఆ.) అజ్ఞాతకర్తృకమైన "ఉదాహరణపద్యములు" అను సంకలనగ్రంథమునందు "విజయసేనము" అను ఆకరము కల పద్య మొకటి కలదు. "అల్లనఁ జొండమెత్తి" అను పద్యము. ప్రబంధరత్నావళియందు ఉట్టంకించిన "గీర్వాణాచల" అను పద్యము నిరాకరము రెండును వినాయకస్తుతులే. ఒక గ్రంథమునందు రెండు వినాయకస్తుతులు సాధారణము కాదు నిరాకరమైన "గీర్వాణాచల" అను పద్యము విజయసేనములోనిది కాఁజాలదు. ప్రబంధరత్నావళియందు ఉట్టంకించిన "కెసలయ", "పరథన",

"మహిమ చెడదు" అను పద్యములును ప్రబంధరత్నాకరమునందు నిరాకరములు. అవి కూడ విజయసేనములోనివి కాకపోవచ్చును ప్రబంధరత్నావళిలోని "తరుణుల", "పద్మంబులును" అను పద్యములు తంజావూరిప్రతి నకలు కాగితపు ప్రతియందు కానరావు "తరుణుల" అను పద్యము తిక్కన ఉత్తరరామాయణమునందు కలదు (61 ప. 1 ఆ.) ఉత్తరరామాయణములోని పద్యములు తిక్కన మహాభారతమునందు అవృత్తములైనవి విరాటపర్వములోని పద్యము విరాట పర్వమునందే అవృత్తమైనది భీష్మపర్వములోని పద్యము శాంతిపర్వమునందు అవృత్తమైనది. అట్లు ఉత్తరరామాయణములోని పద్యము విజయసేనమునందు— లేదా— విజయసేనములోని పద్యము ఉత్తరరామాయణమునందు అవృత్తము కావచ్చును కాని "తరుణుల" అను పద్యము పరిఖావర్ణనము "పద్మంబులును" అను పద్యమును పరిఖావర్ణనమే కాబట్టి "తరుణుల" అను పద్యము విజయసేనము లోనిది కాకపోవచ్చును. ఉత్తరరామాయణములోనిదే అగును ఇంతకు నికరముగ నాలుగైదు పద్యములు "తిక్కనసోమయాజి విజయసేనము"లోనివి సంకలన గ్రంథములందు కలవు. అవి తిక్కన విజయసేనము రచించెనమటకు ఆధారములే కాని, తిక్కన, సోమయాజి కాకపూర్వము రచించినది కావచ్చును

విజయసేనములోని పద్యములు ఒకటి వినాయకస్తుతి మఱొకటి విజయసేనుని వర్ణనము. నాయకవర్ణనము ఇంకొకటి కన్యావర్ణనము. నాయికావర్ణనము. వేఱొకటి పురవర్ణనము. కొండొకటి పరిఖావర్ణనము వీనినిబట్టి విజయసేనములోని ఇతివృత్తము విజయసేనుని కథ అగును. విజయసేనుని కథ సోమదేవభట్టు కథాసరిత్సాగరమునందు కలదు. అది బహుశః తిక్కన విజయసేనమునకు ఆధారము కావచ్చును. కథాసాగరములోని కథలు కల్పితకథలు. కట్టుకథలు చిత్రకథలు అట్టి కథలుఇతివృత్తములైన కావ్యములను కథాకావ్యములని వ్యవహరించుట కలదు. తిక్కన విజయసేనము కథాకావ్యమగును మనుమసిద్ధి కొలువునందు "ఉభయకవిమిత్ర నామము దాల్చి," "లలితనానాకావ్యములు చెప్పి నుభయభాషలందు" అను ప్రశంసను అందుకొన్న తిక్కన, అప్పటికే రచించిన తెలుగు కావ్యము విజయసేనము కావచ్చును అయిన కథాకావ్యరచనమునకు తిక్కన నాందీసూత్రధారి అగును,

# ఇతరకవులు

**కేతన :-** ఇంటిపేరు మూలఘటిక. ఇతని కృతులు మూడు 1 ఆంధ్ర భాషాభూషణము. 2 విజ్ఞానేశ్వరము 3 దశకుమారచరిత్రము ఆంధ్రభాషా భూషణము ప్రథమాంధ్రవ్యాకరణశాస్త్రగ్రంథము. విజ్ఞానేశ్వరము ప్రథమాంధ్ర ధర్మశాస్త్రగ్రంథము దశకుమారచరిత్రము కథాకావ్యము కథాకావ్యరచనమునకు తిక్కన నాందీసూత్రధారి అయిన కేతన నాంద్యంతసూత్రధారి అంతేకాదు కేతన దశకుమారచరిత్రము తిక్కనకు అంకితము

తిక్కనకు అంకితమైన దశకుమారచరిత్రమునందు తిక్కన భారతము ప్రసక్తిలేదు. తిక్కన ఉత్తరరామాయణము ప్రసక్తియును లేదు. తిక్కన విజయ సేనము ప్రసక్తి కూడ లేదు విజయసేనము ప్రసక్తిలేకపోవుట విశేషము కాదు గాని, భారతరామాయణముల ప్రసక్తి లేకపోవుట విశేషమే. భారతప్రసక్తి లేక పోవుటవలన కేతన దశకుమారచరిత్రము తిక్కన భారతము కంటె పూర్వగ్రంథ మని సర్వసమ్మతము మఱి రామాయణప్రసక్తి లేకపోవుటవలన కేతన దశకుమార చరిత్రము తిక్కన ఉత్తరరామాయణము కంటెను పూర్వగ్రంథము కావలయును. అగుననుటకు ఒక అంతస్సాక్ష్యము కలదు

"సంస్కృతాదిభాషలఁ గావ్యకర్తృత్వమున నుతిఁగన్న కేతనార్యుని"

(23 ప) తిక్కన,

"అత్యాదరంబున రావించి యాసనార్ఘ్యపాద్యతాంబూలాం బరాభరణదానాద్యుపచారమ్ములఁ బరితుష్టహృదయుంజేసి నీవు సంస్కృతాద్యనేకభాషాకావ్యరచనావిశారదుండవగుట జగత్ప్రసిద్ధంబు గావున నొక్క కావ్యంబు రచియించి నన్నుఁ గృతిపతిం జేయవలయు నని సగౌరవంబుగాఁ బ్రార్థించిన–" 24 వచ 1 ఆ. ద కు. చ.

కేతన దశకుమారచరిత్రమును రచించి, తిక్కనకు అంకితమిచ్చినట్లు దశ కుమారచరిత్రమునందు కలదు. మనుమసిద్ధి మంత్రిఅయిన తిక్కన ప్రార్థించుట నిజము కానిచో, అది తిక్కనకు అంకితమైన గ్రంథమునందుండుట అసంభవము. భారత రామాయణములు రచించిన తిక్కన కృతిపతిత్వమును అర్థించి, కేతనను ప్రార్థించుట కూడ అసంభవము కాఁబట్టి కేతన దశకుమారచరిత్రము తిక్కన ఉత్తరరామాయణము కంటెను పూర్వగ్రంథమే అగును,

కేతన తన "కావ్యకన్యకకుం దగు వరుండగుట నతని మనోరథంబు సఫలంబు గావింపదలంచి" నట్లును దశకుమారచరిత్రమునందు కలదు (24 వచ. 1ఆ. ద. కు చ.) కావ్యమును స్త్రీతో పోల్చుట, కవిత్వమును కన్యగా సంభావించుట సంస్కృతవాఙ్మయమునందు సనూహ్నాతపూర్వము. మహాకవుల వాణులందు ప్రతీయమానమగు అర్థము అంగనలయందు లావణ్యము వంటిదని ఆనందవర్ధనుని ధ్వనిసిద్ధాంతము. "లావణ్యమివాఙ్గనాసు" (4 శ్లో 1 అ) మహాకవుల వాణులు కావ్యములు వానిని అంగనలతో సాదృశ్యము "కవితాకన్యా వృణీతే స్వయమ్" అని బిల్హణచరిత్రమునందు కలదు (12 శ్లో.) కవితాకన్య అనగా కావ్యకన్యయే. తిక్కన అర్థించినది కృతిపతిత్వము కృతి కన్య కన్యాదానమునకు ముందు పతి వరుడు. కేతన ప్రతిపాదనము సహజసిద్ధము ఇది ఉత్తరరామాయణమునందు మనుమసిద్ధి "ఏ నిన్ను మాప యసియెడు దీనికిఁ దగ నిమ్ము భారతీకన్యక" నను టకు (3 ప 1 అ) ప్రాతిపదిక కావున కేతన దశకుమారచరిత్రము తిక్కన ఉత్తరరామాయణము కంటెను పూర్వగ్రంథమే కావలయును.

అంకితచిహ్నములైన షష్ఠ్యంతపద్యములు కేతన దశకుమారచరిత్రమునందు పదకొండు కలవని, అందు మూలము వలె శార్దూలము మారినదని ఒక అభిప్రాయము కలదు.[58] అది భ్రమప్రమాదము దశకుమారచరిత్రమునందు షష్ఠ్యంత పద్యములు ఎనిమిది కలవు. (94- 01 ప 1 ఆ) అది ప్రథమాశ్వాసాంతమగుట వలన ఆశ్వాసాంతపద్యములు మూడు కలవు. అవి కూడ షష్ఠీవిభక్త్యంతపద్యములు. అందువలన షష్ఠ్యంతపద్యములను భ్రాంతి కలుగుట సహజము దశకుమారచరిత్రములోని పండ్రెండు ఆశ్వాసములందును ఆశ్వాసాంతపద్యములు వృత్తము, కందము, మాలినిగ కలవు వివిధవిభక్త్యంతములుగ కలవు. తిక్కన ఉత్తరరామాయణములోని పది ఆశ్వాసములందలి ఆశ్వాసాంతపద్యములును ఇట్లు కలవు వివిధ విభక్త్యంతపద్యరచనము ఉదాహరణకావ్యప్రభావమగును. తిక్కన ఉత్తరరామాయణమునందు షష్ఠ్యంతపద్యములు కలవు (14,15 ప 1ఆ) షష్ఠ్యంతపద్యములు లేవు. భారతమునందు షష్ఠ్యంతపద్యములు కలవు. అది నరాంకితము. ఇది దైవాంకితము. పదియేను పర్వముల భారతమును హరిహరనాథుని సన్నిధిని ప్రశంసించుట అనగా అంకితమిచ్చుట ఆరాధనవిశేషమని తిక్కన అభిప్రాయము (31 వచ, 1 ఆ. వి. ప.)

తిక్కన ఉత్తరరామాయణము రచనాకాలము 1260 ప్రాంతము కావున, కేతన దశకుమారచరిత్రము రచనాకాలము 1255 ప్రాంతమగును.

కేతన తిక్కన శిష్యుడని ఒక అభిప్రాయము కలదు కాని యథార్థము కాదు కేతన శిష్యుడైనచో తిక్కన కృతిపతిత్వమును కోరి ప్రార్థించుట అసంగత మగును కేతన తాను తిక్కన శిష్యుడనని దశకుమారచరిత్రమునందు గాని, ఇతర కృతులందు గాని చెప్పకపోవుట అసమంజసమగును దశకుమారచరిత్రము గుర్వంకితము కాదు కవ్యంకితము ఒక కవికి మఱొక కవి అంకితమిచ్చుట మంచి సంప్రదాయమే అందుకు మార్గదర్శి కేతన అతడు తిక్కనకు అంకిత మిచ్చుటవలన తిక్కన చరిత్ర అధికముగ తెలిసినది తిక్కన అవతారికాశ్వాసాద్యంత పద్యగద్యములలోని తిక్కన చరిత్రాంశములు స్వీయచరిత్రాంశములు. కేతన అవతారి కాశ్వాసాద్యంతపద్యగద్యములలోని తిక్కన చరిత్రాంశములు జీవితచరిత్రాంశములు. స్వీయచరిత్రాంశముల కంటె జీవిత చరిత్రాంశములు ప్రమాణము. కారణము స్వయంకృతములైన స్వీయచరిత్రలందు స్వీయాతిశయము నకు సావకాశము కలదు అన్యకృతములైన జీవితచరిత్రలందు అది నిరవకాశము. కేతన దశకుమారచరిత్రములోని తిక్కన వంశవర్ణనాదికము వాస్తవమైనను వాస్తవము

కేతన దశకుమారచరిత్రము దండి దశకుమారచరితమునకు తెనుగుసేత. సంస్కృతకావ్యమైన దండి దశకుమారచరితము గద్యకావ్యము తెనుగు కావ్యమైన కేతన దశకుమారచరిత్రము చంపూకావ్యము. గద్యకావ్యమును గద్యకావ్యముగ, పద్యకావ్యమును పద్యకావ్యముగ, దృశ్యకావ్యమును దృశ్యకావ్యముగ తెనుగు సేయుట ప్రాచీన పద్ధతి కాదు. దండి గద్యకావ్యము కేతన గద్యకావ్యము కాలేదు. అంతేకాదు. దశకుమారచరితమువలన దండికి వచ్చిన ప్రతిష్ఠ కేతన దశకుమార చరిత్రమునందు ప్రతిష్ఠితము కాలేదు

"ఉపమా కాళిదాసస్య, భారవే రర్థగౌరవమ్
దండినః పదలాలిత్యమ్, మాఘే సన్తి త్రయోగుణాః"

అను శ్లోకము ప్రసిద్ధమైన ఆభాణకము దండి దశకుమారచరితమునందు ఆద్యంతము కల పదలాలిత్యము అనుప్రాసభూయిష్ఠము. అది కేతన దశకుమార చరిత్రమునకు అందని ఫలము.

రాజవాహనుడు, అపహారవర్మ, ఉపహారవర్మ, మంత్రగుప్తుడు రాజకుమారులు. అర్థపాలుడు, సోమదత్తుడు, ప్రమతి, మిత్రగుప్తుడు, పుష్పోద్భవుడు, విశ్రుతి మంత్రికుమారులు వీరు దశకుమారులు. వీరి చరిత్రములు చిత్రవిచిత్రములు. కాల్పనికములు. కనుక దశకుమారచరిత్రము కథాకావ్యము.

దండి దశకుమారచరిత్రమును కేతన స్వతంత్రపద్ధతిని తెనుగు జేసెను. కథాగతికి భంగము కలిగించు మూలములోని సుదీర్ఘవర్ణనలు సూక్ష్మీకరించెను. లేని వర్ణనలు విపులీకరించెను. దశకుమారులలోను ప్రధానకుమారుడు రాజవాహనుడు. అతనిని ప్రేమించి అవంతీసుందరి విరహావస్థకు లోనయ్యెను. ఆమె చెలికత్తెలు శీతలోపచారమును చేసినట్లు మాత్రమే మూలమునందు కలదు ఆ శీతలోపచారములను కేతన వర్ణించెను (124-131 ప. 1ఆ.) అవి తర్వాతి కవులకు మార్గదర్శకములైనవి. అందొక పద్యము.

"చెఱకటె విల్లు పువ్వులటె చక్కని చిక్కని యమ్ము లేయుచో
గుణియటె చిత్తముల్ హరుఁడు కోపమునం గనుఁగొన్న నంగముం
బఱిపఱి యయ్యెనట్టె తల ప్రాణము తోఁకకు వచ్చె నెవ్వరిం
గఱచు ననంగుఁ డేమిటికిఁ గంపము చెందెద వంబుజాననా!"

128 ప. 1ఆ.

ఆభరణములను వర్ణించిన పద్యము :

"మట్టియ లుజ్జ్వలమణినూపురంబులు
మొలనూలు వస్త్రముల్ ముత్తియములు
కట్టువడంబులు గట్టినూళ్లను సుద్ద
సరతీఁగె మినుకులు సంది దండ
లంగుళీయకములు హారకంకణములు
చేకట్టు పాలెలు చెన్ను మెఱుఁగు
టాకులు సరిపెణ లాలక్తకము పూఁత
కాటుక తిలకంబు కమ్మపువ్వు(లు) 77ప. 3ఆ

ఇందు మట్టియలు, కట్టువడములు, గట్టినూళ్లు, సుద్ద సరతీగె మినుకులు, సందిదండలు, చేకట్టు పాలెలు, చెన్ను మెఱుగు టాకులు, సరిపెణలు తెల్గుగు పదములే కాదు; తెలుగు నగలు కూడ,

జూదరుల మోసములు వర్ణింపబడినవి.

"బలియుఁడోడిన ధనములు గొసఁజాలక
పుడిసెన (దానితోఁ) బోవువారు
సనదలు గెలిచి వారడిగిన నేమియు
విడువక ధనములు వడయువారు
నోడిన ధనమింక నాడినంగాని యేఁ
బెట్టఁజా పొమ్మని పెనఁచువారు
గెలిచిన ధనమెల్లఁ బలక ప్పెనప్పడ
పెట్టక పోనీక కట్టువారు
బొత్తిగా నాడి యోటమి పొత్తువారి
మీఁద లెక్కించి వంచన మెఱయువారు
లంచములుగొని యెడఁబొరలంగఁ బరిసె
పెద్దవెలయాసఁ దెగఁ గెలిపించువారు." 6ప.5ఆ.

కోడిపోరు సహజముగ వర్ణింపఁబడినది

"ఎదిరినకోడి మున్నెనసి యారెలు మెడ
వెసగాఁడ నురవడి వ్రేసివ్రేసి
యదివ్రేయ మదికెక్కనదరి బల్వునఁబట్టి
కబళించి యందంద కదిమికదిమి
విశిఖముఖంబులు వెనువెంటఁ దగులుచు
నంతంతఁ బోనీక యాఁగియాఁగి
వాగాటులకువచ్చి వసుమతి నిలువక
యొంటి తన్నునఁ గొసరుడిపియుడిపి
గెలిచె నాటాటఁ దగ నారికేళజాతి—" 33ప.9ఆ.

గెలిచినకోడి నారికేళజాతి ఓడినకోడి ఒకజాతి ఒకజాతికోడిలక్షణములు, నారికేళ జాతికోడిలక్షణములు కూడ కేతన వివరించెను (30,31ప.9ఆ.) ఇట్టి వర్ణనలు కేతన లోకావేక్షణమునకు నిదర్శనములు

కేతనశైలి తిక్కనశైలికి పూర్వరంగము

**బద్దెన :** ఇతడు 1261 వ సంవత్సరము నాటి బ్రహ్మేశ్వరాలయ శాసనములోని చోడబద్దిక్షితీశుడగును [59] ఇతని కృతి నీతిశాస్త్రముక్తావళి. **బద్దినీతులు,**

బద్దెననీతి అని నామాంతరములు రచనాకాలము 1265 ప్రాంతము కావచ్చును. నీతిశాస్త్రముక్తావళి రాజనీతిశాస్త్రగ్రంథము సుమతిశతకము బద్దెనకృతము కాదు.[60]

**మంచన :** ఇతని కృతి కేయూరబాహుచరిత్రము అది నండూరి గుండయ మంత్రికి అంకితము అతడు వెలనాటి చోళరాజు పృథ్వీశ్వరుని మంత్రి కేతన మనుమడు. మూడవ కుమారుని మూడవ కుమారుడు (31,33,37ప 1ఆ.కే బా.చ) పృథ్వీశ్వరుని రాజ్యకాలము[61] 1160–1206 అదే కేతన ప్రాభవకాలము అతని మనుమడు గుండయ ప్రాభవకాలము స్థూలముగా 1250–1280 అగును తదంకితమైన కేయూరబాహుచరిత్రము రచనాకాలము 1275 ప్రాంతము కావచ్చును

కృతిసమర్పణము గురించి మంచనకు ఒక ప్రత్యేకమైన అభిప్రాయము కలదు

"బాలరసాలపుష్పనవపల్లవకోమలకావ్యకన్యకన్
గూళల కిచ్చి యప్పడుపుఁగూడు భుజించుటకంటె సత్కవుల్
హాలికులైన నేమి మఱి యంతకు నాయతి నేని నాఁడు గౌ
ద్దాలికులైన నేమి నిజదారసుతోదరపోషణార్థమై 13ప.

అని తగని వానికిని నా
మన మెప్పుడు రోయుఁగాన మతిమజ్జనవ
ర్ణనలకు మిగిలిన సుగుణుని
నినుఁబొంది మదీయకవిత నెగడుం బుడమిన్. 14ప.
కావున నీకుం గృతి యిచ్చెదను" 15వచ.1ఆ.

ఇందలి తొలిపద్యము ఇంచుక మార్పున పోతన పద్యముగ ప్రసిద్ధము. "పుష్ప" అను చోట "సాల" అని, "మఱి యంతకు నాయతి లేని నాఁడు" అను చోట "గహనాంతరసీమలఁ గందమూల" అని మాత్రమే భేదము అది పోతన కృతులందు లేదు జనశ్రుతులందు మాత్రమే కలదు ఇది మంచెన కృతియందు కలదు నండూరి గుండయమంత్రి కృతి రచింపుమని ఇచ్చిన తాంబూలము పుచ్చుకొని, అతనికి కృతి ఇచ్చెదననుటకు మంచన చెప్పినట్లు కలదు. ప్రకరణబద్ధము ప్రక్షిప్తము కాదు. మంచన పద్యమే అలతిమార్పున పోతనపద్యముగ ప్రసిద్ధమగుట అసంభవము కాదు.

మంచనకు అవ్యవహితపూర్వమునందు కేతన దశకుమార చరిత్రము తిక్కనకు అంకితమీయఁబడెను. తిక్కన ఉత్తరరామాయణము మనుమసిద్ధికి అంకితమీయఁబడెను అది మంచనకు అవగతము మనుమసిద్ది రాజు తిక్కన మంత్రి కవిపోషకుడు కవి గుండయమంత్రి తిక్కన వంటివాడు భోగపరాయణుడైనను వెదపారాయణుడు (41 ప) దానధర్మములకు, కర్ణుడు ధర్మరాజు తొల్లిటి తప్పు పోఁగొట్టుకొనుటకు కలిసి పుట్టినటువంటివాడు (44 ప) సత్కవిజనులచేత కొనియాడఁబడినవాడు సత్కవులను ప్రోచువాడు. (42, 44 ప) ధీగుణచింతామణి శాస్త్రపురాణాగమజ్ఞాననిధి (47 ప 1 ఆ.) మృదుమధురకావ్య పరిణతుడు. (34ప ౭ ఆ) రాజునకు అంకితమిచ్చుట కంటె, తిక్కన వంటి గుండయమంత్రికి అంకితమిచ్చుట మంచన అభిమతమై పైవిధముగ పలుకుట సంభవము.

మంచన కేయూరబాహుచరిత్రమునకు మూలము రాజశేఖరుని విద్ధసాలభంజిక. అది ప్రాకృతనాటిక కాదు సంస్కృతనాటిక. శృంగారరసప్రధానము శృంగారమునకు నీతికథలు జోడించి కావ్యమును రచింపుమని కృతిభర్త ఆదేశము

"స్థాయిరసము శృంగారం
బై యలవడఁ గథలు నీతులై యెడనెడ రాఁ
గేయూరబాహుచరితము
సేయుము నీ వాంధ్రభాష శిల్పము మెఱయన్" 11 ప 1 ఆ.

విద్ధసాలభంజికలోని కథకు మంచన కొన్ని మార్పులు కావించెను. విద్ధసాలభంజికలోని రాజు పేరు విద్యాధరమల్లుడు కేయూరబాహుచరిత్రములోని రాజు పేరు కేయూరబాహువు ఆచటరాణి పేరు మదనవతి ఇచట రత్నసుందరి మదనవతి మగవెషము ధరించిన మృగాంకావళికి కువలయమాల నిచ్చి వివాహము చేయ దలంచును. విదూషకుని పరిహసించుటకు తన చేటినకు స్త్రీవెషము ధరింపఁజేసి విదూషకునితో వివాహము జరిపించును ఇది విదూషకుడు ఒక దాసికి పురుషవెషము ధరింపఁజేసి, మఱొక దాసికి పెండ్లి చేయించినట్లు కేయూరబాహుచరిత్రమునందు కలదు దానికి ప్రతీకారముగా మంత్రి భాగురాయణుని ప్రేరణమున రత్నసుందరి మగవేషము ధరించి మృగాంకవర్మ పేరనున్న మృగాంకావళికి స్త్రీవేషము ధరింపఁజేసి, కేయూరబాహువును మోసగించు తలంపుతో వివాహము చేసి, తానే మోసపోవును విద్ధసాలభంజికలోని విదూషకుని ద్వితీయవివాహము, మేఖలను కాళ్ల క్రింద

చూరునట్లు చేయు ఘట్టము కుంతలరాజపుత్రిక కువలయమాల వృత్తాంతము, వివాహము కేయూరబాహుచరిత్రమునందు లేవు.

ఇట్లు సిద్ధసాలవంజికలోని కథను ఇంచుక మార్పులు చేసి ఇరువదిరెండు నీతికథలను పంచెన కోడించెను. ఆ కథలు, అందలి నీతులు,

1 వైశ్యబాలిక కథ — తెలివిగలవారికి అసాధ్యము లేదు.
2. వసుని కథ — సమయస్ఫూర్తి లేనిచో ప్రమాదము.
3. గార్గ్యుని కథ — విద్యావంతుడైనను తెలివిలేనిచో ఆపద వాటిల్లును
4. చటుకీక కథ — నీతి మంతులు స్వార్థమును పరార్థమందురు కలుగును
5 శశికపింజలముల కథ — క్షుద్రకలహము ప్రజలకు నష్టము కలిగించును.
6 తొండలపోరు కథ — అల్పుల కలహము అన్యులకు చేటు.
7 మధుబిందువు కథ — అల్పకారణకలహము అనర్థకారణము.
8 అహిభేకముల కథ — బలవంతునితో మైత్రి చేయరాదు
9. కాకహంసముల కథ — దుర్జనమైత్రి ప్రమాదకరము
10. గరుడకచ్ఛపముల కథ — ఐకమత్యమువలన ఆపదలు తొలగును.
11. నీటికాకుల కథ — దుర్జనులు కృతఘ్నులు
12. పులికి మేలు చేసిన పిట్ట కథ — క్రూరులకు మేలు చేయరాదు.
13. నక్క కథ — పేరాస ప్రాణమునకు చేటు.
14 నారికేళబకము కథ — అతివ్యయము అనర్థకము
15. ధనగుప్తుని కథ — దురాశ దుఃఖమునకు మూలము.
16. కపటపతివ్రత కథ — అతివినయము ధూర్తలక్షణము
17 గిజిగాని కథ — అవివేకులకు హితము చెప్పరాదు
18. కోతి కథ — మతిహీనుని నమ్ముట మంచిది కాదు.
19. దొంగ కథ — మతిమంతుని పగయు మేలు సేయును
20. శుకి కథ — ఉపాయముచే అపాయము తప్పును.
21 యక్షుని కథ — మొగమోట ముప్పు కలిగించును
22. అహిమూషక కథ — శత్రువును మోసగించుట తప్పు కాదు

ఇందు 13, 17 కథలు హితోపదేశములోనివి ఇతర కథలు కొన్ని జన వ్యవహారములోనివి కావచ్చును కొన్ని కథాసరిత్సాగరమునందు కలవు.

కథాప్రారంభము మొదలు కథాంతమువఱకు, ఆశ్వాసాద్యంతపద్యములు వినా, కేయూరబాహుచరిత్రమునందు ఏడువందల మూడు పద్యగద్యములు కలవు. అందు మూడవవంతు కంటె తక్కువ రెండువందల పదియేడు పద్యగద్యములందే కేయూరబాహువు కథ కలదు మూడువంతులు పైగా నీతికథలే అవి నీతి చంద్రికలే గాని, ప్రధానకథకు పరివేషము కట్టినవి. ఒక నీతి కథలోనే పెక్కు నీతికథలు కలవు. గొలుసుకట్టు కథలు అందు వర్ణనలు అరుదు, అలతి అసట సుగుణము. ప్రధానకథలోను వర్ణనలు పరిమితము.

మంచన కేయూరబాహుచరిత్రమునందు ప్రథమతః మంత్రియుగంధరుని పరిచయము కలదు

"చతురప్రజ్ఞుఁడు చంద్రగుప్తున కెలం జాణక్యు భంగిన్, దివ
స్పతికిం దైవతమంత్రి యోజ, సుమనశ్శ్లాఘ్యుండు వత్సావనీ
పతికిం దొంటి యుగంధరాఖ్యగతి శుంభత్పుణ్యుఁ డమ్మేదినీ
పతికిం బ్రెగ్గడ భాగురాయణుఁ డనం బ్రఖ్యాతుఁ డిద్ధస్థితిన్".

64 ప 1 ఆ.

ఇందు చంద్రగుప్తునికి చాణక్యుడు, వత్సరాజునకు యుగంధరుడు మంత్రు లని ఇదమిత్థముగ కలదు ప్రతాపరుద్రునికి యుగంధరుడు మంత్రి అను ప్రవాదము సత్యదూరమనుటకు ఇది సాక్ష్యము.

కేయూరబాహువు మృగాంకావళిని చూచి,

"ఎవ్వరి దాన వీవు హరిణేక్షణ! యెయ్యది నీకుఁ బేరుఁ ని
న్నెవ్వతె దెచ్చెఁ జెప్పుమిట నేర్పడ బంటుగ నన్ను నేలు(ము)"

21 ప. 4 ఆ.

అసట "ఎవ్వతె వీవు భీతహరిణేక్షణ" అను పెద్దన పద్యమునకు ఒరవడి.

కేయూరబాహువు విరహమునకు మందిరారామమే మన్మథప్రతాపదహనమో అను సంభావనము మనోజ్ఞముగ కలదు.

"కలయం బూచి వెలుంగు కింశుకము లంగార ప్రతానంబు కో
మలసాంద్రాంకురభాసిచూతలతికల్ మంటల్ నభోవీధి న
గ్గలమై క్రాలుచుఁ దూలుచుం దిరుగు భృంగశ్రేణి ధూమంబుగాఁ
బొరిచెం బుష్పశరప్రతాపదహనంబో నాఁగ నిత్తోట దాన్"

53 ప, 4 ఆ.

మోదుగు పువ్వులు నిప్పులు మామిడి చిగురాకులు మంటలు తుమ్మెదల బారు పొగలు.

కళావతి వర్ణించిన మృగాంకావళి రూపము.

"ఆ మదిరాక్షి రూపమహిమాతిశయంబుల దృష్టి సోఁకినన్
సోముని నైన వేఱొక సోముఁడు నామనినైన వేఱ యొ
క్కామని కమ్మదెమ్మెరలనైనను వేఱొక కమ్మదెమ్మెరల్
కాముని నైన వేఱొక కాముని నేచుదు రేమి సెప్పుదున్"

132 ప. 4 ఆ.

మృగాంకావళి రూపమహిమాతిశయములు కంటపడిన, చంద్రుని వేఱొక చంద్రుడు, ఆమనిని వెఱొక ఆమని, కమ్మతెమ్మెరలను వెఱొక కమ్మతెమ్మెరలు, మన్మథుని వెఱొక మన్మథుడు బాధింతురను కల్పనము అపూర్వము

"తొడవులకుఁ దొడవు తనులత
తొడవులకుం దనులతకును దొడవులు నడుముల్
తొడవులకును దనులతకును
నడుములకుం దొడవు లరయ నాతుక నుడువుల్." 136 ప. 4 ఆ.

మృగాంకావళి శరీరము అలంకారములకు అలంకారము. అలంకారములకు, అలంకారములకు అలంకారమైన ఆమె శరీరమునకు కదలికలు అలంకారములు. అలంకారములకు, అలంకారములకు అలంకారమైన శరీరమునకు, అట్టి శరీరమునకు అలంకారములైన కదలికలకు ఆమె పలుకులు అలంకారములు ఆవృత్త శిల్పము.

మంచన ఆవృత్తశిల్పము నీతులందును కలదు

"చెలిమి శిలాక్షర మెప్పుడు
నలుక జలాక్షరము సుజనులగు వారలకున్

జెలిమి జలాక్షర మెప్పుడు
నలుక శిలాక్షరము కుజనులగు వారలకున్ 21 ప 3 ఆ.

కేయూరబాహుచరిత్రము కూడ కథాకావ్యము కేయూరబాహుప కథ చిత్ర కథ. నీతికథలు కట్టుకథలు. ఉపలబ్ధకథాకావ్యములలో కేయూరబాహుచరిత్రము ద్వితీయకథాకావ్యమైనను అద్వితీయకథాకావ్యము.

విద్ధసాలభంజిక నాటిక. ఉపరూపకభేదము. నాటకమే సంస్కృతనాటకముల తెనుగుసేతను కేయూరబాహుచరిత్రము ప్రథమగణ్యము కాని సంస్కృత నాటకము తెనుగు నాటకము కారేదు దృశ్యకావ్యము శ్రవ్యకావ్యమైనది.

# గోన బుద్ధారెడ్డి

గోన బుద్ధారెడ్డి కృతి పూర్వరామాయణము ద్విపదకావ్యము. ఉత్తర రామాయణము గోన బుద్ధారెడ్డి కుమారులు కాచరెడ్డి, విట్ఠలరెడ్డి అను జంటకవుల కృతి అది కూడ ద్విపదకావ్యము వీరు రచించినట్లు గ్రంథస్థనిదర్శనములు కల ద్విపద రామాయణమునకు రంగనాథరామాయణమను గ్రంథనామము కలదు అందువలన రంగనాథరామాయణకర్తృత్వము మహావివాదగ్రస్తవిషయమైనది 62

## కర్తృత్వము

రంగనాథరామాయణము రంగనాథకృతమనుటకు ఆరు సాధనములు కలవు 1 గ్రంథనామము 2 లాక్షణికనిర్దేశము. 3 రంగనాథస్తుతి 4 భాస్కర, రంగనాథులకు సంబంధించిన కథ 5 చేకుమళ్ళ రంగశాయి కథనము 6. శైలీ సామ్యము

**1. గ్రంథనామము :** కవులు పెట్టిన గ్రంథనామము కాదుగాని, కాలక్రమమునందు "రంగనాథరామాయణము" అను గ్రంథనామము కలిగినది. వాల్మీకి రామాయణము, భాస్కరరామాయణము మొదలైన గ్రంథనామములను కవులు పెట్టిన గ్రంథనామములు కావు కాలక్రమమునందు కలిగినవియే మొల్ల రామాయణమునందు మాత్రము "మొల్ల రామాయణము" అను గ్రంథనామము కలదు. (వావిళ్ల పీ) రంగనాథరామాయణమునందు "రంగనాథరామాయణము" అను గ్రంథనామము" లేదు అయినను వాల్మీకిరామాయణము వాల్మీకి కృతము,

భాస్కరరామాయణము భాస్కరకృతము వలె రంగనాథరామాయణము రంగనాథ కృతమని అనవచ్చును. కాని వాల్మీకి రామాయణమునందు వాల్మీకి రచించినట్లు, భాస్కరరామాయణమునందు భాస్కరుడు రచించినట్లు కలదు అట్లు రంగనాథ రామాయణమునందు రంగనాథుడు రచించినట్లు లేదు సరికదా, బుద్ధభూవిభుడు, కాచవిట్ఠలభూపతులు రచించినట్లు కలదు కాఁబట్టి రంగనాథరామాయణము రంగనాథ కృతమనుటకు కాలక్రమసంక్రాంతమైన గ్రంథనామము నిర్ధారకసాధనము కాదు

కాలక్రమసంక్రాంతమైన గ్రంథనామమునకు స్వారస్యకల్పనము వ్యర్థము. బుద్ధభూవిభుని తండ్రి విట్ఠలక్ష్మాపాలుడు రామాయణమును తన పేరఁ జెప్పుమన్నట్లు అవతారికలోను, అట్లు బుద్ధభూవిభుడు చెప్పినట్లు కాండాంతద్విపదల లోను కలదు. కాఁబట్టి "విట్ఠలక్ష్మాపాలుని పూర్తి పేరు పాండురంగవిట్ఠలనాథుడు, రంగనాథుడు నామైకదేశగ్రహణము" అనుట స్వారస్యకల్పనము పాండురంగ విఠ్ఠలనాథుడు పుండరీకక్షేత్రదైవము. రంగనాథుడు శ్రీరంగక్షేత్రదైవము ఒక క్షేత్రదైవమునకు నామైకదేశగ్రహణము మఱొక క్షేత్రదైవమునకు నామమగునట్లు కాదు అంతేకాదు పేరఁజెప్పుట అనగా గ్రంథమునకు పేరు పెట్టుట కాదు. అంకిత మిచ్చుట. కందనామాత్యునికి అంకితమైన మడికి సింగన భాగవతదశమస్కంధము లోని కాండాంతద్విపదలు కందనామాత్యుని పేర, శ్రీశైలమల్లికార్జునదేవునకు అంకితమైన గౌరన నవనాథచరిత్రములోని ఆశ్వాసాంతద్విపదులు శ్రీశైలమల్లికార్జున దేవుని పేర కలవు కాఁబట్టి విట్ఠలధరణీశు పేర కాండాంతద్విపదులు కల రంగనాథరామాయణము బుద్ధభూవిభుని తండ్రి విట్ఠలక్ష్మాపాలునికి అంకితము

**2. లాక్షణికనిర్దేశము :** పదునారవ శతాబ్ది ఉత్తరార్థములోని లింగమగుంట తిమ్మకవి సులక్షణసారమునందు "రంగనాథరామాయణము" అని కలదు. (౨౦ప) పదునేడవ శతాబ్ది పూర్వార్ధములోని ముద్దరాజు రామన కవిసంజీవని యందు "రామాయణము ద్విపద, రంగనాథుఁడు" అని కలదు (108ప 1త) అదే శతాబ్ది మధ్యకాలములోని కాకునూరి అప్పకవి ఆంధ్రశబ్దచింతామణియందు (అప్పకవీయము) రంగనాథుని రామాయణమునందు" అని కలదు. (161; 248ప.3ఆ) అదే శతాబ్ది ఉత్తరార్ధము తొలిభాగములోని గణపవరపు వెంకటకవి ఆంధ్రప్రయోగ రత్నాకరమునందు "రంగనాథుని ద్విపద" అని కలదు తుది భాగములోని పొత్తపి వెంకటరమణకవి లక్షణశిరోమణియందు "అచ్చవెల్లి రంగన్నగారు రామా

యణము ద్విపద, అచ్చవెల్లి రంగనాథుఁడు రామాయణము ద్విపద" అని కలదు. (39, 221 ప 4 ఆ) ఆ ద్విపదపంక్తులు రంగనాథరామాయణమునందు కలవు. కాఁబట్టి రంగనాథరామాయణము రంగనాథకృతమనుటకు లాక్షణికనిర్దేశము సాధనము.

కాని, లాక్షణికనిర్దేశములు పరమప్రమాణములు కావు అని చెప్పి కేవలము అప్రమాణములు కావు తత్యమిథ్యావివేచనము తప్పనిసరి. ఒక రంగనాథుని ఒకానొక సంబంధము లేకుండ, లాక్షణికనిర్దేశము హఠాత్సంభూతము కాదు భ్రమప్రమాదఫలితము కావచ్చును కాఁబట్టి రంగనాథరామాయణము రంగనాథకృతమనుటకు లాక్షణికనిర్దేశము నిర్ధారకసాధనము కాదుగాని, నిర్హేతుకసాధనమును కాదు.

**3. రంగనాథస్తుతి :** అనంతమాత్యుని భోజరాజీయము, కొఱవి గోపరాజు సింహాసనద్వాత్రింశక, మొల్ల రామాయణము మొదలైన పదునైదవ శతాబ్ది గ్రంథములలోని పూర్వకవిస్తుతులందు రంగనాథుని స్తుతి కలదు అంతేకాదు అదే శతాబ్ది కొలని గణపతిదేవుని శివయోగసారమునందు "చక్రపాణి రంగన" అని కలదు కావున పదునైదవశతాబ్ది గ్రంథములలోని పూర్వకవిస్తుతులందు స్తుతింపఁబడిన రంగనాథుడు చక్రపాణి రంగనాథుడు కావలయును. అతడు మొదట వైష్ణవుడు. పిదప శైవుడు. కాఁబట్టి వైష్ణవుడుగ నున్న కాలమున చక్రపాణి రంగనాథుడు గోన బుద్ధ, కాచ, విట్ఠల భూపతుల పేర రామాయణమును రచింపవచ్చును అనంతమాత్యుని భోజరాజీయములోని పూర్వకవిస్తుతియందు "భాస్కరు రంగనాథు" అని కలదు భాస్కరుడు రామాయణకర్త రంగనాథుడును రామాయణకర్తఅగును కాఁబట్టి రంగనాథరామాయణము రంగనాథ కృతమనుటకు రంగనాథస్తుతి సాధనము

కాని, చక్రపాణి రంగనాథుడు రామాయణము రచించినట్లు ప్రమాణము కానరాదు అంతేకాదు చక్రపాణి రంగనాథుని అనేకగ్రంథములను తెలిపిన కన్నడ గ్రంథములందు రామాయణము ప్రసక్తి లేదు అందుకు హేతువు రామాయణము వైష్ణవము, కన్నడకవులు శైవులు అనవచ్చును. కాని చక్రపాణి రంగనాథుడు అను వైష్ణవనామమును (రంగన కూడ వైష్ణవనామమే) జపించిన కన్నడ కవులు రామాయణమును స్మరింపరనుట సంగతము కాదు అంతేకాదు. చక్రపాణి రంగనాథుడు వైష్ణవుడుగ ఉన్నకాలమునందు వైష్ణవగ్రంథములు రచించినట్లు

తెలుగు గ్రంథములందు లేదు ఉపరి, "చక్రపాణి రంగనాథుని రామాయణము" అని లక్షణగ్రంథములందును లేదు అచ్చవెల్లి రంగనాథుడు అని కలదు. అనంతామాత్యుని భోజరాజీయమునందలిపూర్వకవిస్తుతిలోని రంగనాథుడు చక్రపాణి రంగనాథుడే "భాస్కరు రంగనాథు" అని కలదుగావున భాస్కరుని వలె రంగ నాథుడు అనిన, మొల్ల రామాయణములోని పూర్వకవిస్తుతియందు "శ్రీనాథు రంగ నాథు" అని కలదుగావున, రంగనాథుని వలె శ్రీనాథుడును రామాయణకర్త అని అనవలసివచ్చును శ్రీనాథుడు రామాయణకర్త కాడు రంగనాథుడు నైషధకర్త కాడు అయినను మొల్ల పూర్వకవిస్తుతియందు "శ్రీనాథు రంగనాథు" అని కలదు అట్లు రంగనాథుడు రామాయణకర్త కాకపోయినను, అనంతామాత్యుని పూర్వకవి స్తుతియందు "భాస్కరు రంగనాథు" అని ఉండవచ్చును కాబట్టి రంగనాథ రామా యణము రంగనాథ కృతమనుటకు రంగనాథస్తుతి నిశ్చాయక సాధనము **కాదు.**

**4. భాస్కర, రంగనాథులకు సంబంధించిన కథ :** ఇది 1914వ సంవత్సరమునకు పూర్వము ప్రకటింపబడిన పురాణనామచంద్రికయందు ఇట్లు కలదు [63]

"(భాస్కరునికి) ఆశ్రయుండై యుండిన రాజునొద్ద నతని బంధువైన రంగనాథుడను నాతడు రాజుయొక్క యాజ్ఞను బొంది ద్విపదరామాయణము రచియింపబూనుకొనగా నతనియందు దనకుగల సహజమత్సరముచేత రాజుతో" నీ ఘనతకు ద్విపదకావ్యము తగినది కాదు. నేను బద్యకావ్యమును జేసికొని వచ్చెదను దానిని బరిగ్రహింపుము" అనగా నతడు చెప్పిన మాట తప్పుట యుక్తముగాదు గనుక రంగనాదుని గ్రంథమునే గైకొను తలంపున"నెవరు ముందు దెత్తురో వారి కృతిని గ్రహించెదను" అని చెప్పిపంపెను. అప్పటికి రంగనాథుని రామాయణము మూడు పాళ్లు తీరియుండెను. కనుక నితడది ముగియుటకు ముందే తన రామాయణమును ముగించికొనిపోవనెంచి ... ముగ్గురి సహాయము చేతను త్వరితముగా ముగించుకొనిపోయెను.అప్పటికి రంగనాథుడు తన రామాయణమును ముగించి యాస్థానమునకు దెచ్చియుండెను. **అది చూచి రంగనాథుని తట్టుకుడి**

చేతిని భాస్కరుని తట్టెడమ చేతినిఁ జాఁచెను అందులకు భాస్కరుడు కోపగించు క్లొని "పక్షపాతముగ నీ వంటి రాజునకు నిచ్చుట కంటె నా కృతి నొక గుజ్జుపు వానికిచ్చుట మేలు" అని పలుకుచు నాస్థానమునుండి వెడలిపోవుచుండఁగా నా రాజుయొక్క గుజ్జుపువాఁడు (దళవాయి ?)" కవిసార్వభౌమా ! ఆడిన మాట తప్పవలదు" అని దారికి నడ్డముగా వచ్చి మ్రొక్కెను అంత నతఁడు వానికిఁ ధన కృతిని సంకితముం జేసెను "

ఇది కట్టుకథ. ఇట్లు రాజాస్థానములందు జరుగదు. రాజును నిరసించిన కవిని, ఆ రాజు గుజ్జుపువాడు కాని, గుజ్జుపు దళవాయి కాని అక్కడే తనకు అంకిత మిమ్మను తాత్పర్యముతో అడిగిన తల ఎగిరిపోవును ఆ రాజు విట్ఠలక్ష్మాపాలుడు గాని, ప్రతాపరుద్రచక్రవర్తి గాని అగును. ఇద్దఱును చతుర్థకులజులు. తద్బంధువైన రంగనాథుడు చతుర్థకులజుడే అగును. చతుర్థకులజుడైన రంగనాథుడు రామాయణము రచింపఁగలిగినపుడు, చతుర్థకులజులైన గోన బుద్ధ కాచ విట్ఠల భూపతులును రచింపఁగలరు. భాస్కరరామాయణమునకు కృతిభర్త సాహిణి మారయ అశ్వదళాధిపతి అతడు గుజ్జుపువాడు అనగా గుజ్జాలకాపరి అని ఉన్న కథ అభూతకల్పన. ఇట్టి పుక్కిటి పురాణము రంగనాథరామాయణము రంగనాథ కృతమనుటకు చారిత్రిక సాధనము కాదు.

**5. టేకుమళ్ల రంగశాయి కథనము:** టేకుమళ్ల రంగశాయి ద్విపదభాగవతమునందు:

"రామాయణంబు భారతమును ద్విపద
లై మీర చేసిన యా రంగనాథు
ధీరు బట్టేపాటి తిరుమలభట్టు
గారి ప్రౌఢోక్తులుగ స్మరించి ..."

అని కలదు ద్విపదభారతకర్తలలో బట్టేపాటి తిరుమలభట్టు కలడు. తిమ్మయ్య. కాఁబట్టి ద్విపదరామాయణకర్త రంగనాథుడు అగును. ఇది రంగనాథ రామాయణము రంగనాథకృతమనుటకు సాధనము.

కాని ద్విపదభారతమును రచించిన తిరుమలబట్టు ఉరవు తిమ్మయ్య చేకుమళ్ల రంగశాయికి సమీపపూర్వుడు ద్విపదరామాయణమును రచించిన బుద్ధ, కాచ, విట్ఠలభూపతులు బహుపూర్వులు అంతేకాదు. చేకుమళ్ల రంగశాయి కాలమునకు— పదునారవ శతాబ్ది తుది- రంగనాథవ్యవహారము లక్షణగ్రంథములందు కలదు. అది చేకుమళ్ల రంగశాయికి ఆధారము కావచ్చును కాబట్టి రంగనాథ రామాయణము రంగనాథకృతమనుటకు చేకుమళ్ల రంగశాయి కథనము ప్రత్యేక సాధనము కాదు.

**6. శైలీసామ్యము:** బుద్ధభూవిభుడు రచించినట్లు కల పూర్వరామాయణమునకు, కాచ, విట్ఠల భూపతులు రచించినట్లు కల ఉత్తరరామాయణమునకు శైలీ సామ్యము కలదు ఇది రంగనాథరామాయణము మొత్తము రంగనాథకృతమనుటకు సాధనము.

కాని శైలీసామ్యము కర్తృత్వనిర్ణయమునకు నిర్ధారకసాధనము కాదు. శైలి అనుకరణసాధ్యము. భట్టబాణుడు రచించిన పూర్వకాదంబరికి, అతని పుత్త్రుడు భూషణభట్టు రచించిన ఉత్తరకాదంబరికి శైలీసామ్యము కావలసినంత కలదు సంస్కృతమునందు తండ్రి భట్టబాణుని శైలిని, తనయుడు భూషణభట్టు అనుకరించినట్లు, తెలుగునందు తండ్రి బుద్ధభూవిభుని శైలిని, తనయులు కాచ, విట్ఠలభూపతులు అనుకరింపవచ్చును కృతకృత్యులు కావచ్చును కాకపోవచ్చును. శైలీభేదము కలదను భావమును కలదు. కాబట్టి రంగనాథరామాయణము రంగనాథకృతమనుటకు శైలీసామ్యము నిష్కృష్టసాధనము కాదు.

ఒక సాధనమును నిర్ధారకసాధనము కాదు ఒక్క సాధనము మాత్రము నిర్హేతుకసాధనమును కాదు అది లాక్షణికనిర్దేశము. కాబట్టి బుద్ధ, కాచ, విట్ఠల భూపతుల రామాయణరచనమునందు రంగనాథుని తోడ్పాటు కలదనవచ్చును. కాని," నారాయణభట్టు ...తోడయి ... నిర్వహింపగన్ ... నన్నయభట్టు దెనుంగునన్ మహాభారతసంహితారచన బంధురుడయ్యె" నని గ్రంథస్థనిదర్శనమున్నను, నన్నయభట్ట భారతము నారాయణభట్టు భారతము కాలేదు. గ్రంథస్థనిదర్శనము లేకపోయినను, బుద్ధ,కాచ,విట్ఠలభూపతుల రామాయణము రంగనాథరామాయణమైనది. కారణము సహనిర్వహణము కాజాలదు,

రంగనాథరామాయణము కేవలము పఠనపాఠనపరమైన కావ్యము కాదు. ప్రదర్శనపరమైన కావ్యము కూడ తోలుబొమ్మలాటలందు తెరవెనుక ప్రదర్శకులు పాడు రామయణము రంగనాథరామాయణమే. బొమ్మలాట ప్రదర్శనములు పదు నారవ శతాబ్దిపూర్వార్ధమునందును కలవు ప్రదర్శనపరమైన గ్రంథములకు ప్రద ర్శకుల పరముగ పేరు వచ్చుట నేడును ప్రసిద్ధము. పీసాపాటి ఉద్యోగవిజయ ములు, ఘంటసాల పుష్పవిలాపము మొదలైనవి సజీవసాక్ష్యములు బుద్ధ,కాచవిట్ఠల భూపతుల ద్విపదరామాయణమును ప్రచురప్రచారమునకు తెచ్చిన ప్రదర్శకుడు అచ్చవెల్లి రంగనాథుడు అయినచో, రంగనాథరామాయణము, అచ్చవెల్లి రంగనాథ రామాయణము అను వ్యవహారము ప్రసిద్ధమగును- అది గ్రహింపని అనంతర కాలికులైన లాక్షణికులు, అట్లు గ్రంథస్థము చేయుట అవకాశము. అచ్చవెల్లి రంగ నాథుడు కవియే అనుటకు ప్రమాణాంతరము కానరాదు. అంతేకాదు బుద్ధ,కాచ విట్ఠలభూపతుల ఆస్థానకవి అనుటకును ప్రమాణము కానరాదు. కాలము కలిసిరాదు. కావున ప్రదర్శకుడే కావలయును ఇంతకంటె, పదునైదవశతాబ్దికంటె నిస్సందేహ ముగ పూర్వకాలికమైన బుద్ధ, కాచవిట్ఠలభూపతుల రామాయణమునకు, పదునారవ శతాబ్దికంటె పూర్వము కానరాని అచ్చవెల్లి రంగనాథునకు అవినాభావసంబంధము కలుగుట సంభవము కాదు కాఁబట్టి రంగనాథరామాయణమను గ్రంథనామము కాలాంతరసంక్రాంతమగుటకు కారణము ప్రదర్శకుడగుట సంభావ్యమైన సమన్వ యము.

రంగనాథరామాయణముతోడి ప్రమేయము కల రంగనాథుడు వెలిచేటి రంగనాథుడు అను ప్రతీతి కలదుగాని, కనీసము లాక్షణికనిర్దేశము కానరాదు. అంతేకాదు గణపవరపు వేంకటకవి ఆంధ్రప్రయోగ రత్నాకరమునందు "రంగ నాథుని మిత్రవిందాపరిణయము" నుండి ఒక సీసపాదము కలదు పరిణయనామక ప్రబంధములు తెలుగునందు ప్రాచీన తరములు కావు. పదునాఱవశతాబ్ది పూర్వా ర్ధము వఱకును లేవు. ఉత్తరార్ధమునందును విరళము. పదునేడవ శతాబ్ది నుండి బహుళము. కాఁబట్టి మిత్రవిందాపరిణయమును రచించిన రంగనాథుడు, పదునైదవ శతాబ్దిని ప్రస్తుతింపఁబడిన చక్రపాణి రంగనాదుడు కాడు పదునారవశతాబ్ది ఉత్త రార్థమునందు "రంగనాథరామాయణము" అను గ్రంథనామమునకు కారకుడైన,

అతఃపూర్వకాలికుడైన అచ్చవెల్లి రంగనాధుడును కాఁజాలడు. వెలిచేటి రంగనాధుడు కావచ్చును.

బుద్ధభూవిభుడు రచించినట్లు కల పూర్వరామాయణము కృత్యవతరణికను బుద్ధభూవిభుడు కవికల్పతరువు, కవిలోకభోజుడు అని మాత్రమేగాక, కవిసార్వభౌముడు, కవిపురందరుడు అని కలదు కాండాంతద్విపదలందు బుద్ధభూవిభుడు రచించినట్లు కలదు. ఉత్తరకాండమున కృత్యవతారికను కాచ, విట్ఠలభూపతులు కవిరాజభోజులు అని మాత్రమేగాక, కవిత చెప్పఁగలవారని కూడ కలదు కాండాంతద్విపదలందు కాచ, విట్ఠలభూపతులు రచించినట్లు కలదు. కాఁబట్టి రంగనాధరామాయణ గ్రంధనామము కాలాంతర సంక్రాంతమైన ద్విపదరామాయణములోని పూర్వరామాయణము గోనబుద్ధభూవిభుకృతమే ఉత్తరరామాయణము కాచ, విట్ఠలభూపతిద్వయకృతమే.

## కాలము

రంగనాధరామాయణము రచనాకాలము తిక్కన ఉత్తరరామాయణము రచనాకాలము కంటె పూర్వము కాదని పూర్వోక్తము "రంగనాధరామాయణమును భాస్కరుని వంటి ప్రౌఢకవి అనుకరించెను కావున "రంగనాధరామాయణము భాస్కరరామాయణము కంటె బహుపూర్వగ్రంధము కావలెను" ఆవశ్యకమును లేదు కారణము, రంగనాధరామాయణమునకు, భాస్కరరామాయణమునకు ఛాయాప్రాయమైన సంవాదము ప్రధానముగ అవాల్మీకీయ వృత్తాంతములందు కలదు. అవి వాల్మీకి రామాయణము ప్రత్యంతరములందు కలవు. అన్యరామాయణములందును కలవు లేనిచో జనశ్రుతులు ఇవి ఉభయ కుశలములు. అంతేకాదు ఉభయరామాయణములందును ప్రక్షిప్తములు కలవు. అవి కాలాంతర సంక్రాంతములు ఉపరి, అనుకరించుటకుగాను శతాబ్ది పూర్వగ్రంధమే కాదు, దశాబ్ది పూర్వగ్రంధమును ఉపాదేయమే.

రంగనాధరామాయణమునందు పదునాల్గవశతాబ్ది పూర్వము కానరాని పలుకుబడులు ప్రయోగములు, యుద్ధసంబంధన్యదేశ్యములు కలవు అయినను రంగనాధరామాయణము పదునాల్గవ శతాబ్దిగ్రంధము కావలసిన అవశ్యకము లేదు. కారణము, పఠనపాఠనమాత్ర గ్రంధమునకు వలె, ప్రదర్శనపరమైన ప్రక్షిప్తమయమైన గ్రంథమునకు కవిభాష నియతముకాదు పరభాష ప్రదర్శనపరమైన గ్రంథమునందు

అవశ్యము ప్రవేశించును. ప్రక్షిప్తమయమైన గ్రంథమునందును అంతే. ప్రసిద్ధమైన పోతనభాగవత పద్యములోని పవనగుంభిత చర్మభస్త్రి, ధమధమధ్వనితోడి ధక్క, తను కుడ్యరంధ్రములు, (తరసాస్థి) నిర్మితదర్వి రంగనాథరామాయణమునందు ప్రవేశించినవి.

ఇంతకు నివి అంతరంగిక సాక్ష్యములు ఆంతరమైన కవితాసాధనములు బాహిరమైన చారిత్రికసాధనముల కంటె బలీయములు కావు. రంగనాథరామాయణము రచనాకాలము నిర్ణయించుటకు శాసనప్రమాణము కలదు.

గోన బుద్ధభూవిభుని అవతారికను, బుద్ధభూవిభుని తండ్రి పేరు విట్ఠలక్ష్మాపాలుడు అని కలదు. మఱి కాచ, విట్ఠల భూపతుల అవతారికను బుద్ధభూవిభుని తండ్రి పేరు గోనగన్నక్షితీశ్వరుడు అని కలదు. "సంపన్నరెడ్డి వంశములలో సాధారణముగాఁ బ్రతిపురుషునకు రెండేసి పేరులుండుట "సహజమైనను, తండ్రి ఒక పేరు తనయులు మఱొక పేరు ఒకే గ్రంథమునందు వ్రాయుట సహజము కాదు. బుద్ధభూవిభుని అవతారికను "రమణమైఁ దెనుఁగున రామాయణంబు క్రమ మొప్పఁ జెప్పెడు ఘనకావ్యశక్తి గల కవు లెవ్వరు గలరన్న ?" అను విట్ఠలక్ష్మాపాలుని ప్రశ్నకు "నీ తనూజన్ముండు" అను విబుధపుంగవుల సమాధానము కలదు. "మా తండ్రి విట్ఠలక్ష్మాపాలుని పేర" అని బుద్ధ భూవిభుని ప్రతిపాదనము కలదు. కాఁబట్టి విట్ఠలక్ష్మాపాలునికి బుద్ధభూవిభుడు తనూజన్ముడు అనగా కన్న కొడుకు కావలయును మఱి బుద్ధభూవిభుని కుమారులైన కాచ, విట్ఠలభూపతుల అవతారికను "గోన గన్నక్షితీంద్రునకు ననుకూలయై యున్న యన్నమాంబికకుఁ దనయుండు .. బుద్ధభూవిభుఁడు" అని కలదు కాఁబట్టి గన్నక్షితీంద్రునికి బుద్ధభూవిభుడు తనయుడు అనగా కన్నకొడకు గాక పెంపుడుకొడుకు కావచ్చును అనగా దత్తుడు. దత్తుడు కన్నతండ్రిని కూడ "మా తండ్రి" అనుట లోకసహజము—దత్తుని పుత్త్రులు తమ తండ్రి తండ్రిగ (తాతగ) తమ తండ్రి కన్న తండ్రిని గాక, పెంపుడు తండ్రిని పేర్కొనుట కూడ అంతకంటె లోకసహజము. అంతేకాదు విధాయకము కూడ కావున బుద్ధభూవిభుని కన్నతండ్రి విట్ఠలక్ష్మాపాలుడు, పెంపుడు తండ్రి లేక దత్తత తండ్రి గోనగన్నక్షితీంద్రుడు కావలయును

దత్తతవ్యవహారములందు దాత కంటె గ్రహీత అధికుడగును కావున విట్ఠలక్ష్మాపాలుని కంటె గోనగన్నక్షితీంద్రుడు అధికుడు కావలయును. బుద్ధభూవిభుని

అవతారికను "పని పూని యరిగండభైరవు పేర, ఘను పేర, మీసరగండని పేర... మా తండ్రి విట్ఠలక్ష్మాపాలు పేర" అని కలదు. కాండాంతద్విపదలందును "అరిగండభైరవు పేర, ఘను పేర, మీసరగండని పేర .... గోనబుద్ధభూవిభుఁడు తమ తండ్రి విట్ఠలధరణీశు పేర" అని కలదు కాచ, విట్ఠలభూపతుల అవతారికను 'మా తండ్రి బుద్ధక్ష్మానాథు పేర .. మీసరగండ కాచభూవరుఁడు ... పిన విట్ఠలభూపతియు" అని కలదు కాఁబట్టి అరిగండభైవ, మీసరగండ బిరుదప్రాప్తి కల విట్ఠలక్ష్మాపాలుడు, మీసరగండబిరుదము, విట్ఠలక్ష్మానాథుని కంటె అధికుడును అయిన గోనగన్నక్షితీంద్రుడు కనిపించునట్టి శాసనము కలదేని, అది రంగనాథ రామాయణములోని గోన విట్ఠలక్ష్మాపాలునికి, గోనగన్నక్షితీంద్రుని సంబంధించు గట్టి శాసనము కాఁగలదు. అట్టి శాసనము కలదు. అది రాచూరి శాసనము. ఆ శాసనము సంగ్రహముగ ఇట్లు కలదు [64]

> "స్వస్తి సమస్తగుణగణాలంకార సత్యరత్నాకర సౌజన్యగౌర [వ]
> **అరిగండభైరవ** సాహసోత్తుంగ కాకతీయకటకసంనాహ ... ....
> కదనప్రచండ మీసరగండ ఉభయబలగండ ..... సంతతార్చితశశి
> మౌళి ...... రుద్రదేవదక్షిణభుజాదండ నిజకీర్తిపూరితబ్రహ్మాండకరండ
> పరమబరోద్దండ శ్రీసోమనాథదేవదివ్యశ్రీపాదపద్మారాధక పరబల
> సాధకనామాదిసమస్తప్రశస్తిసహితం శ్రీమతు **మీసియరగండ గోన**
> **గండ్నయరడ్డివారు** వర్ధమానపురమునందు సుఖసంకథావినోదంబు [న]
> ప్రిథువి రాజ్యము సేయుచుండగాను తద్రాజ్యరక్షామణి అయిన శ్రీనారాయణ
> దేవదివ్యశ్రీపాదపద్మారాధక పరబలసాధక సకలధర్మసాధక పుణ్యగుణ
> సహిత **విఠాలనాథభూనాథుడు** ఆదవని తుంబుళము మాళువ హలువ
> దుర్గాలు సాధించి తదనంతరంబు రాచూరిపట్టణప్రవేశాభిముఖుండై
> సుఖసంకథావినోదంబున ప్రిథువి రాజ్యము సేయుచుండి నుండి శక
> వర్షంబులు ౧౨౧౬ అగు జయసంవత్సరమార్గశిర ౭ రు నందు సర్వ
> రాష్ట్రసమస్తప్రజారక్షణార్థంబై దుర్గము రచియించెను మంగళం
> మహాశ్రీ శ్రీ శ్రీ."

ఇందు "అరిగండభైరవ, మీసరగండ" అను బిరుదములు కలవు. అవి గోన గన్నయరెడ్డివి. "రడ్డి" అన రెడ్డియే. గన్నయరెడ్డి ప్రశస్తియందు మాత్రమే

గాక, పేరునకు ముందును "మీసియరగండ" అని కలదు అనగా మీసరగండయే. గోన గన్నయరెడ్డి "వర్ధమానపురమునందు .... రాజ్యము సేయుచుండగాను" అని కలదుగావున అతడు వర్ధమానపురరాజ్యాధిపతి వర్ధమానపురము రాజధాని. వర్ధమానపురరాజ్యము కాకతీయుల సామంతరాజ్యము. రాజ్యరక్షామణి అనగామంత్రి లేక సేనాధిపతి. "ఆదవని, తంబుళము, మాకువ, హలువ దుర్గాలు సాధించి" అని కలదుగావున సేనాధిపతి విట్ఠలనాథభూనాథుడు మొదట వర్ధమానపురరాజ్యాధిపతి అయిన గోన గన్నయరెడ్డికి సేనాధిపతి "తదనంతరంబు రాచూరిపట్టణప్రవేశాభిముఖుండై రాజ్యము సేయుచుంనుండి" అని కలదుగావున తర్వాత రాచూరి రాజ్యాధిపతి అది కూడ కాకతీయుల సామంతరాజ్యము శాసనమునందు గోన గన్నయరెడ్డికి విట్ఠలనాథభూనాధునికి అవినాభావసంబంధము కలదు "దుర్గము రచియించెను" అనగా దుర్గమును కట్టించెనని అర్ధము. "రాచూరుదుర్గనిర్మాణము రెడ్డిరాజులు కావించి"నట్లు "గోనకాటారెడ్డిగారికథ" అను గేయమునందు కలదు. రాచూరు ప్రవేశించి, రాజ్యము సేయుచు, రాచూరు దుర్గము కట్టించిన విట్ఠలనాథభూనాథుడు గోనవిట్ఠలరెడ్డి అగును విట్ఠలనాథభూనాధుని దుర్గనిర్మాణము "సర్వరాష్ట్రసమస్త ప్రజారక్షణార్థము." ఇది రంగనాథరామాయణకర్తృకాలాదిబహుసమస్యా పరిష్కార సాధనము

రాజుల బిరుదావళి మంత్రిసామంతసేనాపతిప్రభృతులకు సంక్రమించుట చరిత్రప్రసిద్ధము గోన గన్నయరెడ్డి అరిగండభైరవ, మీసరగండబిరుదములు అతని సేనాధిపతి అయిన విట్ఠలనాథభూనాధునికి సంక్రమించును కాఁబట్టి రాచూరిశాసనములోని విట్ఠలనాథభూనాథుడు రంగనాథరామాయణములోని విట్ఠలక్ష్మాపాలుడు కాఁగలడు అంతేకాదు రంగనాథరామాయణములోని "మీసరగండ కాచభూవరుని" తాత గోన గన్నక్షితీంద్రుడు రాచూరుశాసనములోని "మీసరగండ గోన గన్నయరెడ్డి"యే అగును. సేనాధిపతి కంటె రాజ్యాధిపతి అధికుడు. రాచూరుశాసనములోని గోన గన్నయరెడ్డి విట్ఠలనాథభూనాథుని కంటె అధికుడే రంగనాథరామాయణములోని గోన గన్నక్షితీంద్రుడు దత్తతస్వీకారమునుబట్టి విట్ఠలక్ష్మాపాలుని కంటె అధికుడు కావలయును రాచూరిశాసనములోని గోన గన్నయ రెడ్డి విట్ఠలనాథభూనాథుని కంటె అధికుడే కాఁబట్టి రంగనాథరామాయణములోని గోన గన్నక్షితీంద్రుడు, విట్ఠలక్ష్మాపాలుడు ఒక్క రాచూరిశాసనములోని గన్నయ రెడ్డి, విట్ఠలనాథభూనాథుడు మాత్రమే కాఁగలరు రంగనాథరామాయణమునందు

విట్ఠలక్ష్మాపాలుడు రాజసింహుడు, రాజశిరోమణి అని కలదు రాచూరుశాసనము నందు రాజ్యాధిపతి అనియును కలదు బహుమర్గములు సాధించినందున రాజసింహమే. రాజశిరోమణియే రంగనాథరామాయణమునందు రెడ్డిశబ్దము లేదు. కాని వారు రెడ్డిశబ్దవాచ్యులని 1850, 1856 సంవత్సరముల మధ్య అయిదు పర్యాయములు ముద్రింపబడిన పాకనాటి గణపతిరెడ్డి రచించిన గోపాలవిలాసము అను యక్షగానమునందు కలదు

"గోన బుద్ధారెడ్డి కులపవిత్రుండు
దానరాధేయుండు ధర్మవిహారి
కామితార్థంబులు కవులకు నొసగి
రామాయణములోని రసికుడై నిలిచె"

రామాయణరసికుడైన గోనబుద్ధారెడ్డి పూర్వరామాయణద్విపదకావ్యకర్త గోనబుద్ధభూవిభుడే కావున రంగనాథరామాయణము రచనాకాలము రాచూరి శాసన కాలమునకు సమకాలము గాని, సమీపకాలము గాని కావలయును రాచూరి శాసన కాలము 1294 వ సంవత్సరము కాబట్టి గోన బుద్ధారెడ్డి పూర్వరామాయణము రచనాకాలము 1295 ప్రాంతము కావచ్చును.

## ఆంధ్రీకరణము

కవితాశాఖను అధిరోహించి వాల్మీకికోకిల మధురాతిమధురాక్షరముల కలకూజితము చేసిన రామచరితము వాల్మీకి రామాయణము— అది "పాఠ్యే గేయే చ **మధురమ్**" అని వాల్మీకిరామాయణమునందే కలదు. (8 శ్లో 4 స. బా. కాం) పఠనమునందు గానమునందును మధురమైనదని అర్థము అట్టి వాల్మీకి రామాయణమును మొత్తము వాచోవిధేయము చేసికొని, కుశలవులు మొట్టమొదట ఋషుల సమక్షమునందు, క్రమముగ రథ్యలందు, రాజమార్గములందు, రామాశ్వమేధ యాగశాలయందు కావ్యగానము చేసినట్లును వాల్మీకి రామాయణమునందు కలదు. (12, 14, 23, 31 శ్లో 4 స బా కాం) ఆదిలోనే ఋషులు "అహో గీతస్య మాధుర్యం శ్లోకానాంతు విశేషతః" అని ప్రశంసించినట్లును అందు కలదు (17శ్లో. 4 స బా. కాం.) అంత గీతమాధుర్యమునకు హేతువు కుశలవుల గాత్రసౌష్ఠవమే గాక, వాల్మీకి శ్లోకముల శబ్దసౌష్ఠవము కూడ వాల్మీకి రామాయణములోని శ్లోక

ములు అనుష్టుప్పులు అవి మాత్రాచందస్సులు. గానయోగ్యములు— సంస్కృతము లోని అనుష్టుప్పుల వంటివి తెలుగులోని ద్విపదలు. అట్టి ద్విపదలందు గోన బుద్ధారెడ్డి రచించిన రామాయణము పఠనమునందు గానమునందును మధుర మైనది. నాలుగు శతాబ్దుల కాలము బొమ్మలాట ప్రదర్శకుల నాలుకలపై నాట్య మాడినది.

"భూమిఁ గవీంద్రులు బుధులును మెచ్చ
రామాయణము పురాణమార్గమునఁ
దప్పక నా పేరఁదగ నంధ్రభాషఁ
జెప్పి ప్రఖ్యాతంబు సేయింపు ముర్వి"

అను తండ్రి ఆనతిని బుద్ధారెడ్డి తలఁదాల్చి,

"ఆదికవీశ్వరుఁడైన వాల్మీకి
యాదరంబునఁ బుణ్యు లందఱు మెచ్చఁ
జెప్పిన తెఱఁగున శ్రీరామచరిత
మొప్పఁజెప్పెద(ను)"

అని చెప్పినను బుద్ధారెడ్డి పూర్వరామాయణము వాల్మీకి రామాయణమునకు మూలవిధేయమైన ఆంధ్రీకరణము కాదు పరమస్వతంత్రమైన ఆంధ్రీకరణము— ప్రపంచీకరణము, క్లుప్తీకరణము మొదలైనవి మాత్రమేగాక, వాల్మీకి రామాయణము నందు లేని వృత్తాంతములును కలవు వానికే అవాల్మీకవృత్తాంతములని వ్యవ హారము. అధ్యాత్మరామాయణము, ఆనందరామాయణము మొదలైన ఇతర సంస్కృతరామాయణములందు, జనశ్రుతులందును అవి కలవు

ప్రపంచీకరణములందు ఋష్యశృంగునికథ, శివధనుర్భంగసంఘటన, సీతా రామకల్యాణఘట్టము, సీతాప్రతిసందేశము ప్రధానములైనవి[65] ఋష్యశృంగుని కథ వాల్మీకి రామాయణమునందు హాసజనకము ఔచితీవిలసితము— బుద్ధారెడ్డి రామాయణమునందు హాస్యాస్పదము అనౌచిత్యకలుషితము. శివధనుర్భంగమును వాల్మీకి "తద్బభఞ్జ ధనుర్మధ్యే నరశ్రేష్ఠో మహాయశాః" అని (16శ్లో 67స.బా.కాం) మాట మాత్రముగ ప్రతిపాదించెను బుద్ధారెడ్డి సుమారు పాతిక ద్విపదలందు ప్రపంచీ కరించెను. క్షణకాలమున జరిగిన సంఘటనకు వాల్మీకి వచనము సముచితము బుద్ధారెడ్డి వచనము అతివేలము. అందు,

"పెళపెళధ్వనులును పెటపెటధ్వనులుఁ
గలయ దిక్కులఁ బర్వఁగా విల్లు విఱిగె.
విఱిగె రాజన్యుల విపుల యాసనములు;
పఱియలు వాఱె భూభాగమంతయును;
చిదిసె దిగ్గజములు, శేషాహి మ్రొగ్గె;
చెదరె భూతములు, గంపించె లోకములు"

అను పంక్తులు అర్వాచీనాంధ్రరామాయణములకు ఆద్యప్రకృతులైనవి.

సీతారామకల్యాణఘట్టము వాల్మీకి రామాయణమునందు నిరాడంబరము. వైదికధర్మప్రధానము. బుద్ధారెడ్డి రామాయణమునందు మహాడంబరము లౌకికాచార నిధానము వాల్మీకి రామాయణములోని మంత్రోదకప్రధానము, అగ్నిహోత్రప్రదక్షిణము బుద్ధారెడ్డి రామాయణమునందు లేవు. పురాంతఃపురశోభాలంకరణము, వధూవరుల శృంగారనైపథ్యము సుదీర్ఘముగ కలదు. తెరపట్టుట, తలంబ్రాలు పోయుట, పెండ్లిపాటలు వంటి తెలుగు ఆచారములును కలవు.

సీత" హనుమంతునిచే రామునికి ప్రతిసందేశమును పంపుట, మూలమునకు మెఱుగుపెట్టినట్లు బుద్ధారెడ్డి రామాయణమునందు కలదు.

"మా తండ్రి జనకుండు మహిపాలుఁడఁ దన్ను
నే తెఱంగున వొంకఁ డితఁడని నమ్మి
తనకు నిచ్చినఁ దెచ్చెఁ దగదు నన్విడువ
నని యేను బల్కితినని పల్కు మీవు
విలసిల్లు కల్యాణవేదిపై నుండి
వలనొప్ప నగ్నిదేవర సాక్షి గాఁగఁ
గరమొప్ప నన్నెల్లకాలంబు విడువ
కరసి రక్షించెదనని తెచ్చి నన్ను
నరయ కుపేక్షించి యసదగాఁ జేసెఁ
బఱికెంపుమని విన్నపము సేయు మనఘ
తన యింతి నొకనిచేఁ దాఁ గోలుపోయి
మన నిచ్చసేయుట మగపాడి గాదు;
అటుగాన తనకది యపకీర్తి యనుచు

నిటు విన్నవించితి, నింతియే కాని
కలఁగక నా మనోగతులు ప్రాణంబు
లొలసి తన్నెడఁ బాయకున్నవి యనుము"

ఇందు ధీరత, విధేయత రెండును కలవు. జనకుని విశ్వాసము, అగ్నిసాక్షివివాహము జ్ఞప్తికి తెచ్చుట, మగపాడి కాదనుట ధీరలక్షణము. అపకీర్తి అని విన్నవించితిననుట, మనస్సు ప్రాణము తన్నెడఁబాయకున్నవనుట విధేయస్వభావము ఇట మూలమునందు క్షేమసమాచారము, హనుమంతునిపై కార్యభారము మోపుట మాత్రమే కలవు. (2-12శ్లో.39స సుం.కాం ) ధీరుని భార్యకు ధీరతభావ్యమే

## అవాల్మీకవృత్తాంతములు

వాల్మీకి రామాయణమునందు లేని వృత్తాంతములు అవాల్మీకవృత్తాంతములు. అవి రంగనాథరామాయణమునందు అనేకములు కలవు.[66] కొన్ని లఘువృత్తాంతములు. కొన్ని దీర్ఘవృత్తాంతములు. లఘువృత్తాంతములలో అహల్యాశాపవృత్తాంతము, మంథరాకోపవృత్తాంతము, లక్ష్మణరేఖావృత్తాంతమును; దీర్ఘవృత్తాంతములలో జంబుకుమారవృత్తాంతము, సులోచనావృత్తాంతము, కాలనేమివృత్తాంతమును ముఖ్యములైనవి.

**అహల్యాశాపవృత్తాంతము:** గౌతముడు అహల్యను శిలగా శపించినట్లు వాల్మీకి రామాయణమునందు లేదు రంగనాథరామాయణమునందు కలదు. వాల్మీకి రామాయణమునందు ఆహారము లేకుండ, వాయుభక్షణము సేయుచు, తపస్సుకావించుచు, బూడిదలో పరుండి, ఎవ్వరికి కన్పింపకుండ పెక్కువేల సంవత్సరములు నివసింపుమని మాత్రమే శపించినట్లు కలదు.

"ఇహ వర్షసహస్రాణి బహూని త్వం నివత్స్యసి.
వాయుభక్షా నిరాహారా తప్యంతీ భస్మశాయినీ
అదృశ్యా సర్వభూతానా మాశ్రమేఽస్మి న్నివత్స్యసి
30శ్లో. 48స. బా. కాం.

ఇది రంగనాథరామాయణమునందు ఇట్లు కలదు.

"పడఁలి పాషాణరూపముఁ దాల్చి యిచట
కర ముగ్రమగు నెండఁ గాలి పెంధూళిఁ
బొరలు చుండుము నీవు పొడగానఁబడక"

ఇందు పాషాణరూపము ధరింపుమని శపించుటవలన, "ఆహారము లేకుండ, వాయుభక్షణము సేయుచు, తపస్సు కావించుచు" అని వాల్మీకి రామాయణమునందు వలె శపించుటకు అవకాశము లేదు అవి పాషాణరూపమునకు అనుకూలముగా పరిహృతములు అయినను భాస్కరరామాయణమునందు పురస్కృతములు

"—ఈ వనంబున ననేకదివ్యసహస్రవర్షంబులు వాయు
భక్షణవు నిరాహారవు భస్మశాయినివియునై యెవ్వరికిం గానరాక
పాషాణంబవై యుండుము" 510 వచ. బా. కాం.

ఇటి పాషాణమన పాషాణసదృశ (510వ బా. కాం.) రంగనాథరామాయణములోని పాషాణరూపము పాషాణరూపమే. "మునిపత్ని దారూపమున నుండె", "శ్రీరామపాదరాజీవపరాగమాలీకృతాఘసందోహయై యపుడు వెలఁది యంతట శిలావేషంబు మాని తన తొంటి దేహంబుఁ బూని" అని తర్వాత కలదు. వాల్మీకి రామాయణమునందు లేని పాషాణరూపశాపము అధ్యాత్మరామాయణమునందు, ఆనందరామాయణమునందును కలదు పద్మపురాణమునందు కూడ కలదు.

"దుష్టే త్వం తిష్ఠ దుర్వృత్తే శిలాయా మాశ్రమే మమ"

అను అధ్యాత్మరామాయణములోని శాపవృత్తాంతమే రంగనాథరామాయణములోని అహల్యాశాపవృత్తాంతమునకు ఆధారమగును.

మంథరవృత్తాంతము : శ్రీరామపట్టాభిషేకమునకు విఘ్నము కలిగించినది మంథర ఆమె వృశ్చికస్వభావమే తన్నిమిత్తము అందుకు వాల్మీకిరామాయణమునందు ప్రత్యేక హేతుకల్పనము లేదు రంగనాథరామాయణమునందు కలదు.

"పసివడి" రాముఁడు బాల్యంబునందుఁ
దన కాలు విఱిచిన తప్పు సాధింప
నిది నాకుఁ దఱి యని యిచ్చఁ జింతించి
యది హెచ్చి కైకతో నంతయుఁ జెప్ప"

రాముడు బాల్యమునందు మంథర కాలు విఱిచినట్టు వాల్మీకి రామాయణము నందు లేదు. ఇతర సంస్కృతరామాయణములందును లేదు కాని అగ్నిపురాణము నందు మాత్రము రాముడు బాల్యమునందు మంథర కాళ్లు పట్టుకొని లాగి పడవేసి నట్లు, అందువలన ఆమె రాముని వనవాసమును అభిలషించినట్లును కలదు. [67]

"పాదౌ గృహీత్వా రామేణ కర్షితా సాపరాధతః
తేన వైరేణ సా రామం వనవాసం చ కాంక్షతి." (VI, 67)

బాల్యమునందు కాళ్లు పట్టుకొని లాగి పడవేసినంతమాత్రమున వనవాసమును కాంక్షించుట సహజము కాదు. బాల్యమునందైనను రాముడు మంథర కాలు విఱుచుట సంభవము కాదు అయినను రంగనాథరామాయణము ప్రత్యంతరములందు కాలు విఱిచిన ఘట్టమును కలదు.

"ఆయెడ రఘురాముఁ డాప్తులుఁ దాను
నిండారు ప్రేమతో నెట్టెలు గట్టి
చెండును దండంబు చెలువొప్పఁ బట్టి
తరమిడి యాడెడు తఱిని గైకేయి
వరవుడా మంథర వడి నేగుదెంచి
చిట్టంబు చేతలఁ జెండు దట్టుటయుఁ
గట్టల్క రాముఁ డా కాష్ఠంబుచేత
నడచిన నొక్క కాలప్పుడే విఱిగెఁ
దడయక యందందఁ దమకించి రాము
నడరెడు వేడ్కతో నాడంగఁ జూచి
తడయక రాముపైఁ దగఁ గ్రూరముంచి
విఱిగిన కాలితో వెసఁ గైకనగరి
కరిగి తద్వృత్తాంతమంతయుఁ దెలుప"

ఇందు చెండాడుకట్టతో దాలుడు కొట్టిన మంథర కాలు విఱుగుట, విఱిగిన కాలితో మంథర కైక అంతఃపురమునకు పెడలి అంతవృత్తాంతమును చెప్పుట కాలు విఱుచుట కంటె అసంభవము ఇందలి చెండాట పలనాటివీరచరిత్ర ద్విపద కావ్య ములోని బొంగరములాట ప్రభావము కావచ్చును కాలు విఱిచినట్లు కాక కాలితో తన్నినట్లు భాస్కరరామాయణమునందు కలదు.

"-బొల్లి కౌసల్యాతనయుచేతం దనకునైన చరణతాడన
భంగంబు వైరకారణంబుగాఁ గొని-" 10వచ అ కాం

ఇందలి చరణతాడనము సహజమేగాని, అది వైరకారణమగుట అసంభవము. ఇంతకు మంథర దాసి దాసీజనకమునకు బాలబాలికల పాదతాడనము నిత్యకల్యాణములు. అవి వైరకారణములు కావు. అగ్నిపురాణములోని, రంగనాథ రామాయణములోని, భాస్కరరామాయణములోని హేతుకల్పనములు దుర్బలములు. వాల్మీకిరామాయణములోని మంథర వృశ్చికస్వభావము ప్రబలము

**లక్ష్మణరేఖావృత్తాంతము :** సీత బెట్టిదపు మాటలకు లక్ష్మణుడు చాల వేదనచెంది, రాముని కడకు బయలుదేరుచు—

"పర్ణశాలకుఁ జుట్టు బరు లేఁడు వ్రాసి
వర్ణించి "ఊ బరుల్ వడి దాఁటకమ్మ!
ఎవ్వఁడే నీ బరుల్ వెస దాఁటి వచ్చు
న వ్వీరవరు తల లవియు నా క్షణమె"

అని పలికినట్లు రంగనాథరామాయణము ప్రత్యంతరములందు కలదు ఇట్లు వాల్మీకి రామాయణమునందు లేదు. ఇతర సంస్కృతరామాయణములందును లేదు. పయి ద్విపదపాదములలోని మూడవ పాదమునందు యతిమైత్రిభంగము కలదు. "ఈబరు వెస" అనిన యతిమైత్రి సుసంగతమగునుగాని, అర్థము మఱి అసంగతమగును నాల్గవపాదమునందు నాటకీయధ్వని కలదు వీరవరుని తలలు అను బహువచనము రావణుని పదితలలు స్ఫురింపచేయును కాని అనంతరకథలో రావణుని పదితలలు కాదు సరికదా ఒక్క తల కూడ తత్క్షణమే అనియ లేదు. అంతేకాదు. లక్ష్మణుడు వ్రాసిన పిదుబరులు దాటివచ్చిన సీతను రావణుడు అపహరించినట్లును లేమ ఎల్లబరుల ప్రమేయము, ప్రసక్తి లేకుండ, సీతాపహరణము జరిగిపోయినది పిదుబరుల విషయము జనశ్రుతి కావచ్చును అది ప్రత్యంతరములందు చుపయోగని మైనది. కాబట్టి లక్ష్మణరేఖావృత్తాంతము కాలాంతరసంక్రాంతము కావచ్చును.

**జంబుకుమారవృత్తాంతము :** ఇది జంబుమాలివృత్తాంతమని కలదు 68 కాని జంబుమాలివృత్తాంతము కాదు. జంబుకుమార వృత్తాంతము వేరా జంబు వృత్తాంతము. జంబుకుమారుడు, జంబుమాలి భిన్నులు జంబుకుమారుడు అరణ్య

కాండమునందు మరణించును. జంబుమాలి -ప్రహస్తుని కుమారుడు- యుద్ధకాండ మునందు మరణించును జంబుకుమారవృత్తాంతమిది:

ఒకనాడు లక్ష్మణుడు కందమూలఫలాదులకు ఒక పర్వతము దగ్గఱ తిరుగును. దేదీప్యమానమైన ఖడ్గమొకటి "అందుకొనుము దైత్యాధీశతనయ! నీ తపస్సునకు మెచ్చి పగ తీర్చుకొనుటకు సూర్యుడు పంపించెను తీసికొనుము." అని పలుకును. "తాను వచ్చి నాకే లేద నేను తీసికోను పొమ్ము" అని సమాధానము వచ్చును అది విని లక్ష్మణుడు విస్మయమంది, ఖడ్గమును ఒడిసి పట్టుకొని ఒక వెదురుజొంపమును ఖండించును. అందున్న మౌని ఖండితుడగును బ్రహ్మహత్యా దోషము ప్రాప్తించినదని లక్ష్మణుడు పరితపించి, అన్నను చేరి జరిగినది చెప్పును. రాముడు ఆశ్చర్యమంది ఆలోచనలో పడును అక్కడి మునులు చేరి ఇట్లు చెప్పుదురు. రావణుడు తోబుట్టువు శూర్పణఖ మగడు విద్యుజ్జిహ్వునికి లంకాపురమును అప్పగించి దిగ్విజయయాత్రకు పోవును. విద్యుజ్జిహ్వుడు రావణుని రానీకుండ లంకాపురమును గైకొనుటకు పాతాళమునకు పోయి మంత్రతంత్రములు నేర్చి మదించి యుండును. రావణుడు దిక్పతుల గెలిచి లంకకు వచ్చి సంగతి తెలిసికొని విద్యుజ్జిహ్వుని శిరస్సు ఖండించును శూర్పణఖకు స్వేచ్ఛావిహారమును అనుగ్రహించును. అప్పటికే గర్భవతియైన శూర్పణఖకు జంబుకుమారుడు జన్మించును. వాడు పెరిగి పెద్దవాడయి తండ్రి చావువిని తండ్రి పగ తీర్చుటకు సూర్యుని గుఱించి తపస్సు చేయును. వాని తపస్సునకు మెచ్చిసూర్యుడు వరఖడ్గమును ప్రసాదించెను. అది లక్ష్మణునికి లభించి విద్యుజ్జిహ్వుడు చనిపోవును బ్రహ్మహత్యాదోషము లేదు ఇట్లు మునులు చెప్పినది విని రామలక్ష్మణులు సంతసింతురు. అనంతరము శూర్పణఖ అక్కడికి వచ్చి కొడుకు చావునకు దుఃఖించును అనతి దూరములోని మునులను తన కుమారుని చంపిన విధము తెలుపకున్న మ్రింగివేయుదు నని బెదిరించును భీతిల్లిన మునులు జంబుకుమారుని సంహరించిన మునివేషుడు అల్లంతదూరాన పర్ణశాలలో ఉన్నాడని అచటికి పొమ్మని చెప్పుదురు అడుగుల జాడనుబట్టి శూర్పణక పర్ణశాలకు వచ్చును.

ఇది జంబుకుమారవృత్తాంతము. వాల్మీకి రామాయణమునందు లేదు ఆనంద రామాయణమునందుకలదు. కాని సాదృశ్యము కానరాదు శూర్పణఖ కుమారుడు సాంబుడు. ఖడ్గప్రదాత బ్రహ్మ. రంగనాథరామాయణములోని జంబుకుమార వృత్తాంతము స్వతంత్రరచనము.

జంబుకుమారవృత్తాంతమునకు ఒక ప్రయోజనము కలదు. అది పర్ణశాలకు శూర్పణఖ సంఘటనాత్మకాగమనము. శూర్పణఖ పర్ణశాలకు వచ్చుట వాల్మీకి రామాయణమునందు కలదుగాని, అది కేవలము యాదృచ్ఛికము "తం దేశం రాక్షసీ కాచి దాజగామ యదృచ్ఛయా" అని మాత్రమే కలదు. [శ్లో. 17స. అర కాం] యాదృచ్ఛికాగమనము కంటె సంఘటనాత్మకాగమనము కథా సంవిధానములోని కళాకౌశలము.

**సులోచనావృత్తాంతము :** ఇది ఒక ముద్రితగ్రంథమునందు గ్రంథ భాగము నందు లేదు అనుబంధమునందు కలదు కారణము వ్రాతప్రతులందు కానరాకపోవుట, వ్రాతప్రతులందు కానవచ్చినవి రచనాంతరమ-లగుట మాత్రమే.[69] కాని పూర్వాపరముద్రితగ్రంథములందు గ్రంథభాగములందే కలదు ఏ వ్రాత ప్రతిలోను లేకుండ, అది ప్రథమముద్రితగ్రంథమునందు ప్రత్యక్షము కాదు. ప్రథమ ముద్రిత గ్రంథములోని సులోచనావృత్తాంతము తర్వాతి ముద్రితగ్రంథములకు ఆధారము కావచ్చును కాని అర్వాచీనముద్రితగ్రంథములోని సులోచనావృత్తాంతము నందు యతిమైత్రిభంగములు కలవు అవి

"ఆననంబదరఁ బ్రలాపింపఁదొడఁగె"

ఇది కల ద్విపద లేకపోయిన క్రమభంగము కలుగదు ప్రక్షిప్తము కాఁవచ్చును

"అరిగిన నజహరాదుల కజేయుఁడవు"

ఇది కల ద్విపద లేకపోయిన క్రమభంగము కలుగును ప్రక్షిప్తము కాఁజాలదు.

"అరుగ హరిహరబ్రహ్మల కజేయుఁడవు" అని కవిపాఠము కావచ్చును.

"ఇంపుగాఁ జెప్పిన నీ మామ మాట"

ఇది కల ద్విపద లేకపోయిన క్రమభంగము కలుగును ప్రక్షిప్తముకాఁజాలదు. "ఇంపుగాఁ జెప్పిన యీ మామ మాట" అని కవిపాఠము కావచ్చును.

"సంగరస్థలి నున్న తరుచరాధిపులు"

ఇది కల ద్విపద లేకపోయిన క్రమభంగము కలుగదు ప్రక్షిప్తము కావచ్చును.

"అని విన్నవించుచు నరనాథునెదుట"

ఇది కల ద్విపద లేకపోయిన క్రమభంగము కలుగును. ప్రక్షిప్తము కాజాలదు "అని విన్నవించుచు నా రాము నెదుట" అని కవిపాఠము కావచ్చును. కాబట్టి సులోచనావృత్తాంతము కాలాంతరసంక్రాంతమనుట సంగతము కాదు. అది బుద్ధారెడ్డి కృతమే అగును. అంత మాత్రమున బుద్ధారెడ్డికి ద్రావిడదృష్టి కలద నుట, సీత ఆర్యపతివ్రత, సులోచన ద్రావిడపతివ్రత అనుట కూడ [71] సంగతము కాదు ఆర్యద్రావిడభేదదృష్టి ఆధునికము. అది బుద్ధారెడ్డి కాలమునందు కలద నుటకు ఆధారము లేదు. అంతేకాదు రావణుని భార్య మండోదరి మహాపతివ్రత అని మఱి ఆర్యపరిగణనమే.

సులోచన ఇంద్రజిత్తు భార్య రావణుని కోడలు ఇంద్రజిత్తు మరణము విని రావణుడు కొలువు కూటమునకు వచ్చి, మంత్రిబాంధవతతుల రప్పించి, పుత్త్రి మరణశోకమున కుములుచుండును ఇంద్రజిత్తు మరణము విని సులోచన దుఃఖించి, మూర్ఛిల్లి, తెలివొంది, విలపించి, సహగమనమునకు సంసిద్ధురాలై, రావణుని కొలువుకూటమునకు వచ్చి పతికళేబరము తెప్పింపుమని కోరును తాను పోయి అడిగిన వారివ్వరని, తనచేత గాదని రావణుడు అశక్తతను ప్రకటించును. అయిన తన్ను పంపుమని సులోచన కోరును రావణుడు సమ్మతించును. వినవీథిని వచ్చు సులోచనను చూచి కపివీరులు దేవత లంపిన దివిలక్ష్మియో, రావణుడే పంపిన సీతయో, కాక వేఱొక దేవకాంతయో, వచ్చుటకు కారణమేమిటో అని రామలక్ష్మణులు మొదలుకొని ఆశ్చర్యపడుదురు. ఆమె దేవభామ కాదు; రామపత్ని కాదు; పతి లేని పడతి అని హనుమంతుడు నిదర్శనము చూపును. సులోచన రథము దిగి రాముని సమీపించి, సాగిలి నమస్కారము చేసి, స్తోత్రము చేసి, రామపాదసేవ వలన తన పాపములు తొలగిపోయెనని విన్నవించును రాముడు వచ్చిన పని, వివరములు అడుగును సులోచన వివరములు చెప్పి, ఇంద్రజిత్తునకు ప్రాణమురిచ్చి పురుష భిక్షము పెట్టుమని ప్రార్థించును అందుకు సిద్ధపడు రాముని బ్రహ్మవరము తప్పింప ధర్మము కాదని హనుమంతుడు వారించును రాముడు సులోచనకు జన్మాంతరము నందు బహుకాలదాంపత్యమును అనుగ్రహించును సులోచన సంతోషించి పతి కళేబరమును కోరును. సుగ్రీవుడు సులోచన పాతివ్రత్యమునకు పరీక్ష పెట్టును. సులోచన కదనరంగమున కాలుపెట్టి పతికళేబరముమీద పడి, పరితపించి, తాను పతివ్రతయైన ఇంద్రజిత్తునకు ప్రాణము వచ్చి మాటాడునని ప్రతిజ్ఞ చేయును: ఇంద్రజిత్తు కన్ను తెఱచి తన్ను చంపినవాడు సులోచన తండ్రియే అని

ఓదార్చి కన్నులు మూయును. సులోచన శేషని పుత్రి ఇంద్రజిత్తును చంపిన లక్ష్మణుడు శేషావతారము. రాముడు అంగదునిచేత సులోచనకు ఇంద్రజిత్తు కళేబరమును ఇప్పించును సులోచన పతికళేబరము తెచ్చి, సుతులకు అప్పగింతలు పెట్టి, రావణునికి రాముని దయారసము, లక్ష్మణుని ప్రేమాతిశయము, విభీషణుని కూరిమి, కపివీరుల పరాక్రమము, తన మహిమ విపరీతమని చెప్పి అనుజ్ఞ గైకొని అనుగమనము చేయును.

ఇది సులోచనావృత్తాంతము వాల్మీకి రామాయణమునందు లేదు ఆనంద రామాయణమునందు కలదుగాని అతిసంగ్రహము అన్యవిధము సులోచన తన ముందు నేలమీద పడిన బాణముతోడి కేయూరభూషితమైన ఇంద్రజిత్తు భుజమును చూచి, విలపించి, ఇంద్రజిత్తు పౌరుషమును స్మరించి, బాణముతో కూడియున్న లేఖలోని "విచారింపవలదు. నేను సాక్షాత్తు శేషని శరాఘాతముచేత హతుడను. ముక్తి లభించినది నీవు వెళ్ళి శ్రీరామునికి సమస్కరించి నా శిరస్సు తెచ్చి అగ్నిలో ప్రవేశింపుము" అను రహస్యాక్షరములను చదివి అట్లు చేయును. ఇందు సులోచన వ్యక్తిత్వము లేదు ఇంద్రజిత్తు ఇంద్రజాలమే కలదు. ఆనందరామాయణములోని సులోచనావృత్తాంతమునకు, రంగనాథరామాయణములోని సులోచనా వృత్తాంతమునకు సాదృశ్యము లేదు రంగనాథరామాయణములోని సులోచనా వృత్తాంతము, జంబుకుమారవృత్తాంతము వలె స్వతంత్రరచనమే.

రంగనాథరామాయణములోని సులోచనావృత్తాంతము కరుణరసనిర్భరము. సులోచన పతిమరణమునకు విలపించుటయేగాక, తనయులఁజూచి,

"ఘనమైన శోకసాగరమున మునిఁగి
భీతిలనేల? విభీషణుం డుండ?
నాతఁడు మన్నించు నధికతేజమున;
వర్ధిష్ణులై తనూభవులార! మీరు
వర్ధిల్లుఁ డెప్పుడు వరగుణోన్నతిని"

అని ఊరడించుట సాసుభూతి, రసానుభూతి కలిగించును

సులోచనావృత్తాంతమునకు ముగింపు సహగమనము రామాయణకాలము నందు సహగమనము లేదు. కౌసల్య, సుమిత్ర, కైక- ముగ్గురుగాని ఒక్కరుగాని సహగమనము చేయలేదు భారతకాలమునందు సహగమనము కలదు కుంతి సహ

గమనము చేయకపోయినను మాద్రి చేసినది అది నాడు సదాచారము సమకాలిక మైన సదాచారమునకు స్థానము కల్పించుట సులోచనావృత్తాంతమునకు ఒక ప్రయోజనము పరమప్రయోజనము స్త్రీపాత్రచిత్రణము సులోచన సాహసము, సామర్థ్యము, సమబుద్ధి, కార్యసాధనక్రమశక్తియు త్రై ఆదర్శప్రాయములు

**కాలనేమివృత్తాంతము :** రావణుని శక్తిచే లక్ష్మణుడు మూర్ఛిల్లును. సంజీవనౌషధికొఱకు హనుమంతుడు బహుదూరముగ గల ద్రోణగిరికి బయలు దేరును. సూర్యోదయాత్పూర్వము సంజీవని తీసికొనిరావలయును హనుమంతుడు ఆకాశవీధిని పోవుచు ఒకచో మునివనమును చూచి, దారి తప్పినట్లు తలచి మునివనమునకు వచ్చును దాహము తీర్చుకొనుటకు మునిని జలమడుగును ముని కమండలు జలమిచ్చి, నమ్మకము కలిగించి, అచట రాత్రి నిద్రింపుమని, సూర్యోదయము కాఁగానే దివ్యౌషధములొసగు దివ్యమంత్రము ఉపదేశింతునని, తనవనమునందు సంజీవనీముఖ్యసకలౌషధములు కలవని చెప్పును కమండలుజలము చాలని హనుమంతుని సమీపములోని సరోవరమునకు పంపును హనుమంతుడు సరోవర జలము త్రాగునెడ మొసలి పట్టుకొని మ్రింగబోవును. హనుమంతుడు మొసలి కడుపు లోనికి పోయి దాని ప్రేవులు నరములు పెనచి త్రెంచుచు జీర్ణము కాక తాపము పుట్టించును. విదాహము తీరక మొసలి వదనగహ్వరము తెఱుచును హనుమంతుడు వెలువడి పెనచి త్రెంచిన ప్రేవుల ముద్దను దాని గొంతుకలో కుక్కి మొసలిని చంపును. మొసలి దివ్యసుందరియై "వాడు ముని కాడు. రాక్షసుడు నమ్మకుము. రావణుని నియోగమున నిన్ను చంపవచ్చినవాడు వానిని చంపి ద్రోణగిరికి వెడలుము. ఇదే దారి" అని చెప్పును ఆమె ధాన్యమాలి అను గంధర్వకన్య శాండిల్యుని శాపముచేత మొసలి అయినది శాండిల్యుని శాపానుగ్రహముచేతచే శాపవిమోచనము కలిగి గంధర్వకన్య అయినది. ఆమె చెప్పిన ప్రకారము హనుమంతుడు ఒకధ్యానము చేయు ముని బాహుమధ్యమున పిడికెడ పొడుచును వాడు పక్షియై హనుమంతుని కదియును హనుమంతుడు టెక్కలు రెండును త్రుంచివైచును. వాడు సింహమై దర్పించును. హనుమంతుడు తల పగుల ముష్టితో పొడుచును. వాడు సుగ్రీవుడై "లక్ష్మణునికి ప్రాణములు వచ్చినవి ద్రోణగిరికి వెడలనక్కఱలేదు. సంజీవనౌషధి తేనక్కఱలేదు" అని చెప్పును. వాడు సుగ్రీవుడు కాడని గ్రహించి హనుమంతుడు వాని వక్షమును కొట్టును వాడు మూర్ఛిల్లి వెంటనే తెలివొంది శతశృంగుడై

శరవర్షము కురిపించును. హనుమంతుడు ముష్టిఘాతముల, పాదతాడనముల మర్దించి, మదపుటేనుగు తామరతూడును వలె కపటముని తలను త్రెంచివైచి, ద్రోణగిరికి వెడలును కపటమునియే కాలనేమి.

ఇది వాల్మీకి రామాయణమునందు లేదు కాని "1850లో ఇటలీలోని పరిగి నగరమున నాగరాక్షరములతో ముద్రితమైన ఆదికావ్యము వాల్మీకిరామాయణము ఇటాలియను ప్రతి"యందు కలదు [72] కాని గంధర్వకన్య పేరు గంధకాలి అనికలదు. ఆమెను శపించిన మహర్షి పేరు యక్షుడని కలదు అంతేకాదు కాలనేమి పక్షి, సింహ, సుగ్రీవ, శతశృంగ రూపధారణములు లేవు కానీ విస్వరూపప్రదర్శనము కలదు బాహు యుద్ధముమాత్రమే కలదు. కాబట్టి రంగనాథరామాయణములోని కాలనేమి వృత్తాంతమునకు వాల్మీకిరామాయణము ఇటాలియను ప్రతిలోని కాలనేమివృత్తాంతమునకు సంబంధము లేదు ఆర్యావర్తాదికావ్యపశ్చిమోత్తరశాఖీయప్రతియందును కాలనేమి వృత్తాంతముకలదు [73] అందు గంధర్వకన్య పేరు విద్యున్మాలి అని కలదు ఆమెను శపించిన ఋషి పేరు లేదు. అంతేకాదు కాలనేమి పక్షి, సింహ, సుగ్రీవ, శతశృంగ రూప ధారణములు లేవు కాలనేమి ఘోరరూపము కలదు హనుమంతుని విపులరూపము కలదు హనుమంతుడు ఆకాశమార్గమునుండి కాలనేమి వక్షస్థలమునందు ఆశు వజ్రపాతోపమముగా పడి తల ముక్కలు చేసినట్లు కలదు. కాబట్టి రంగనాథరామాయణములోని కాలనేమివృత్తాంతమునకు, ఆర్యావర్తాదికావ్యపశ్చిమోత్తరశాఖీయప్రతిలోని కాలనేమివృత్తాంతమునకును సంబంధము లేదు ఇతరసంస్కృతరామాయణములైన అధ్యాత్మరామాయణమునందు, ఆనందరామాయణమునందును కాలనేమివృత్తాంతములు కలవు అవి రంగనాథరామాయణములోని కాలనేమివృత్తాంతమునకు సంవదించునవి అధ్యాత్మ, ఆనందరామాయణములందు గంధర్వకన్య పేరు ధ్యానమాలి అని కలదు. ఆమె శాపవృత్తాంతములు నామమాత్రముగ కలవు

కాలనేమివృత్తాంతమునకును ఒక ప్రయోజనము కలదు. కాలనేమి చేయు కాల హరణమువలన పాఠకునికి ఉత్కంఠ కలుగును అది కథకు ఆవశ్యకము.

**కాచరెడ్డి, విఠ్ఠలరెడ్డి :** వీరు బుద్ధారెడ్డి కుమారులు తొలి జంటకవులు. బుద్ధారెడ్డి ఉత్తరకాండమును రచింపదలంచి ఇష్టదేవతాప్రార్థనము చేయగా శ్రీ మహావిష్ణువు ప్రత్యక్షమై వైకుంఠమునకు రమ్మని, ఉత్తరకాండమును కుమారులు రచింతురనిచెప్పెనట బుద్ధారెడ్డి తాను రచింపబూనిన ఉత్తరకాండమును మధురవాక్యముల

రచించుమనగా, కాచరెడ్డి, విట్ఠలరెడ్డి వాల్మీకి జాడను వారి తండ్రి బుద్ధక్షమానాథుని పేర ఉత్తరకాండమును రచించిరి బుద్ధారెడ్డి, పూర్వరామాయణము అతని తండ్రి విట్ఠలరెడ్డికి అంకితము కాచరెడ్డి, విట్ఠలరెడ్డి కలిసి రచించిన ఉత్తరరామాయణము వారి తండ్రి బుద్ధారెడ్డికి అంకితము.

వాల్మీకి జాడను వ్రాసినట్లు చెప్పినను తండ్రి పూర్వ రామాయణమునందు వలె, తనయుల ఉత్తరరామాయణమునందును అవాల్మీకి వృత్తాంతములు కలవు 74 దశకంఠ కారణవృత్తాంతము, అమృతభాండరహస్యవృత్తాంతము, కుశలవజన్మ వృత్తాంతమును అవాల్మీకాంశములే

కైకేసి సంతానవాంఛను విశ్రవసువును ప్రార్థింప సమ్మతించి ఉపేక్షించును కైకేసికి పది ఋతువులు తప్పును. అది ఘోరపాతకమని పక్షిదంపతుల ప్రసంగమున విన్న కైకేసి ప్రవర్తనమును గమనించి, విశ్రవసువు

"తన యాత్మ ఋతువుల దశకంబు నిలిపి
గొనకొని యా యింతిఁగూడెఁ గూడుటయు
నంత నా నెలఁతయు నను రాగమందెఁ
గొంతకాలమునకు గురుగర్భమైన"

పదితలల, ఇరువది చేతుల రావణుడు ప్రభవించెనట।— ఇది రావణుడు దశకంఠుడగుటకు వాల్మీకిరామాయణమునందు లేని కారణము.

రావణుని ఉదరమునందు అమృతభాండము కలదని, దానివలన రావణుని పది తలలు ఖండించినను మొలుచునని విభీషణుడు రామునికి చెప్పినట్లు, రాముడు అమృతభాండమును భేదించిన అనంతరము రావణుడు చచ్చినట్లు జనశ్రుతిలో కలదు. ఇది వాల్మీకిరామాయణమునందు లేదు కాచరెడ్డి, విట్ఠలరెడ్డి కలిసి రచించిన ఉత్తరరామాయణమునందు కలదు రావణుడు "—తెగినచో నా మస్తకములు గడిమి నప్పుడు మొల్వగా నిమ్మ"ని వరమడుగును.

"అనఘాత్మ యీ కుండలాకృతి నిప్పు
డనయంబు దీపించు నమృత మీ నాభి
గనుఁగొన నొరులకుఁ గాన రాకుండ
నొసరించుకుండుమీ యొగి నేమఱకుమ
అమృతంబు నుండిన యంతకాలంబు

నమృతత్త్వమూలమై యాననాబ్జములు
మొలపించు నదివోవ మొలవక యుడుగు"

అని రావణునికి బ్రహ్మ రహస్యముగ వరమిచ్చి, విభీషణునికి తెలుపును.

"అనఘాత్మ యీ దశాననుని నాభి నమృత
మనలాస్త్రమునఁ గ్రుంకునని యెఱింగించి
మఱి నూట తొమ్మిదిమూఁడుల దాఁక
నరయ సుధాస్పర్శనంబునఁ జేసి
మొలచు నతలలు నిమ్ముల నటమీఁదఁ
దలకొని యతఁడొంటి తలతోన నుండు"

ఇట్లు బ్రహ్మ రావణుని కిచ్చిన రహస్యవరమును విభీషణునికి వెల్లడించుట ముందు జాగ్రచ్చర్య ఇది జనశ్రుతికి, ఇంటిగుట్టు లంకకు చేటను సామెతకు కాచ విట్ఠలకవులు కావించిన గ్రంథప్రతిష్ఠ కావచ్చును

తొలి జంటకవుల రామాయణమునందు కవలలైన కుశలవుల జన్మవృత్తాంతము విచిత్రముగ కలదు. ఒక రక్కసి సీతతో, ఆమెకంటె అందగత్తెలైన ఇద్దఱు కామినులు బాణాకృతుల రామభద్రుని యొద్ద భద్రముగ కలరని చెప్పును. సీత రాముని ఏకపత్నీవ్రతమును శంకించి రాముని ప్రశ్నించును. ఆ బాణములు సీతారాములకు పుత్త్రులై జన్మించునని అగస్త్యమహర్షి ఇచ్చినట్లు తెలుపును. వానిని చూపింపుమన రాముడు చూపించును అవి స్త్రీలగు విధము కూడ చూపింపుమని సీతకోరును రాముని సంకల్పమున బాణములు స్త్రీల వలె వచ్చి నమస్కరించి వెళ్లి మఱల బాణములగును. తర్వాత-సీత తాను విన్నది నిజమని తలచి- బాణములను పొడిపొడి చేసి, ఆ పొడిని నీళ్లలో కలిపి త్రావును. అగస్త్యుడు చెప్పినట్లు సీత జఠరములోని బాణములు పిండాకృతిని ధరించును.అవి రెండు బాణము లగుటవలన సీతకు- ఇద్దఱు- కుశలవులు జన్మింతురు ఇట్లు వాల్మీకి రామాయణమునందు లేదు. ఇతర సంస్కృతరామాయణములందు లేదు సంస్కృతనాటకములందులేదు జానపదగేయములందు లేదు. జనశ్రుతులందునులేదు ఉన్న తొలిజంటకవుల ఉత్తరకాండములోని వృత్తాంతమునందు ఉదాత్తత లేదు. శంకాశీలము, కక్షాప్రవృత్తి సీత ఉదాత్తప్రకృతికి పరమవిరుద్ధము- రామాయణములోని ఉత్తమపాత్రలకు అనుదాత్తతాపాదనము బౌద్ధజైనరామాయణములందు బాహాటము. ఈ వృత్తాంతము ఏ బౌద్ధజైనరామాయణములందైన కలదేమో;

రాముడు లోకాపవాదనముకు సీతాపరిత్యాగము సేయుట విని సీత,

"భూమివా రాడిన భూలోకనాథు
డా మాటలకుఁ జేయునది యొండు లేక
యీ తెంపుఁ జేసెఁబో యిది తెఱఁగనుచు
నాతోడ నెఱిఁగించి నన్నుఁ బాయఁ దగదె
భానువంశాధీశుఁ బాయంగ లేక
మానసంబున నేను మఱఁగెదఁగాక
మోమోటయును జిక్కి మొగిఁ జిక్కుపఱుప
నీ మాట లెబ్బంగి నెఱిఁగించు నాకు
నేమని వ్రాకుచ్చు నేను శోకింప
ధీమసంబున నెట్లు దెగి నన్ను విడుచు"

అని తలపోసినట్లు కాచవిభులకవుల స్వతంత్రకల్పనము ఇది సీత ఉదాత్త ప్రకృతికె ఉచితమేగాక వాల్మీకిరామాయణమునకు మెఱుగు.

కాచవిభులరెడ్ల ఉత్తరరామాయణమునందు మధుర వాక్యములు బహుళము. తెలుగునుడికారములు బుద్ధారెడ్డిపూర్వరామాయణమునందు తక్కువ కాచవిభులరెడ్ల ఉత్తరరామాయణమునందు ఎక్కువ. అంతే కాదు ప్రాసయతి, రేఫళకటరేఫ ప్రాససాంకర్యము బుద్ధారెడ్డి పూర్వరామాయణమునందు మృగ్యము కాచవిభుల రెడ్ల ఉత్తరరామాయణమునందు కలదు ఇది పూర్వోత్తరరామాయణముల శైలీసామ్యము కంటె శైలీ భేదమునకు సాధకములు.

**మారన :** ఇతడు తిక్కన శిష్యుడు ఈతని కృతి మార్కండేయ పురాణము. "ఇది శ్రీమదుభయకవిమిత్ర తిక్కనసోమయాజిప్రసాదలబ్ధసరస్వతీపాత్ర తిక్కనామాత్యపుత్ర మారయనామధేయప్రణీతంబైన" అని ఆశ్వాసాంత గద్యలందుకలదు "ప్రసాదలబ్ధసరస్వతీపాత్రు"డన తిక్కనసోమయాజి విద్యాగురువని అర్థము.

మారనకృతి మార్కండేయపురాణము గన్నవిభునికె అంకితము అతడు సైన్యవిభుడు. కాకతిప్రతాపరుద్రచక్రవర్తి కటకపాలుడు. (39, 40వ పే. 1వ. 2ఆ; 1వ. 6ఆ, 286వ. 7ఆ, 288వ 8వ) కటకపాలుడన కటకరక్షపాలకుడు. తలారి భైరవనాయకుడు ప్రతాపరుద్రుని కటకరక్షపాలకుడని ఒక శాసనమునందు

కలదు.[75] కనుక గన్నవిభుడు వీటి పెద్దతలారి కటకమన రాజదాని. ప్రతాపరుద్రుని రాజధాని ఏకశిలానగరము. ఏకశిలానగరము మీద ప్రథమతః 1303 వ సంవత్సరమున, తదుపరి 1309 వ సంవత్సరమున, పిమ్మట 1323 వ సంవత్సరమున మూడుసారులు మహమ్మదీయుల దండయాత్రలు జరిగినవి.[76] అందు 1303 వ సంవత్సరము నాటి దండయాత్ర దక్షిణభారతదేశచరిత్రలోనే అపూర్వమైన సంఘటన. అయినను మహమ్మదీయదండయాత్ర ప్రసక్తి గాని, ప్రమేయము గాని మార్కండేయపురాణమునందు లేదు. కావున మార్కండేయపురాణము తత్పూర్వగ్రంథము కావలయును కాఁబట్టి మార్కండేయపురాణము రచనాకాలము 1300 ప్రాంతము కావచ్చును

షామ్స్ – ఇ – సిరాజ్ ఆరిఫ్ అను ముస్లించరిత్రకారుడు చెప్పిన – ఇస్లాంమతము పుచ్చుకొని, మహమ్మద్ బిన్ తుగ్లక్‌చేత మాలిక్ మఖ్బూల్ తిలింగి అను పేరు వడసిన ప్రతాపరుద్రుని అనుచరుడు "కన్ను" లేక "కట్టు" అను వ్యక్తి గన్నవిభుడని కాకతీయచరిత్రకారులు గుర్తించుట[77] సంగతము కాదు గన్నవిభుని తల్లి మల్లమాంబిక, కాకతిగణపతిదేవచక్రవర్తి తలవరి మేచయ నాయకుని తనయ. (చెపు 1ఆ ఙూ పు) మేచయనాయకుని కాలము గణపతి దేవుని కాలము, మల్లమాంబిక కాలము రుద్రమదేవి కాలము, గన్నవిభుని కాలము ప్రతాపరుద్రుని కాలమును అగును అతడు ప్రతాపరుద్రుని అనంతరము 1373 వఱకు రాచకార్యములు నిర్వహించుచు ఏబది సంవత్సరములు జీవించుట[78] అసంభవము కాఁబట్టి మార్కండేయపురాణము రచనాకాలము 1300 ప్రాంతమును దాటింపవలసిన ఆవశ్యకము లేదు.

మార్కండేయపురాణము పురాణము పురాణములు త్రివిధము 1 జైనమత పురాణములు 2 వీరశైవమతపురాణములు 3. బ్రాహ్మణమతపురాణములు ఆది పురాణము. జినేంద్రపురాణము, నేమిపురాణము మొదలైనవి జైనపురాణములు. బసవపురాణము, చెన్నబసవపురాణము, దేవాంగపురాణము మొదలైనవి వీరశైవ పురాణములు. అష్టాదశపురాణములు – మహాపురాణములు, ఉపపురాణములు – బ్రాహ్మణపురాణములు జైన, వీరశైవపురాణములు పూర్వగాథలు బ్రాహ్మణ పురాణములును పూర్వగాథలే కాని, పంచలక్షణ లక్షితములు.

"సర్గశ్చ ప్రతిసర్గశ్చ వంశో మన్వంతరాణి చ
వంశానుచరితం చేతి లక్షణానాం తు పఞ్చకమ్."

"సర్గమన ప్రథమసృష్టి ప్రతిసర్గమన ప్రళయానంతరపునస్సృష్టి వంశమన దేవతల, ఋషుల వంశక్రమము మన్వంతరమన మనుపరిపాలనకాలము. వంశానుచరితమన సూర్యచంద్రవంశరాజుల చరితము ఇవి వర్ణింపఁబడునది పురాణము పంచలక్షణలక్షితము కాకపోయినను ప్రాచీనకథ అయినచో పురాణమే అని స్కాందపురాణమునందు కలదు అంతేకాదు అష్టాదశపురాణములలోనివి కాకపోయినను భారతరామాయణములు పురాణములని ప్రసిద్ధము. "భారతరామాయణాద్యనేక పురాణప్రవీణులైన పౌరాణికులును" అని నన్నయ భారతమునందు కలదు (8వచ. 1ఆ. ఆ. ప.) అష్టాదశపురాణములను తెలుపు శ్లోకమొకటి సుప్రసిద్ధము.

"మద్వయం భద్వయం చైవ బ్రత్రయం వచతుష్టయమ్
అనాపలింగకూస్కాని పురాణాని పృథక్ పృథక్"

మద్వయమన 1 మత్స్యపురాణము 2 మార్కండేయపురాణము భద్వయమన 3. భవిష్యపురాణము 4. భాగవతపురాణము బ్రత్రయమన 5 బ్రహ్మపురాణము 6. బ్రహ్మాండపురాణము 7 బ్రహ్మవైవర్తపురాణము వచతుష్టయమన 8. వాయుపురాణము 9 వరాహపురాణము 10. వామనపురాణము 11. విష్ణుపురాణము అ = 12 అగ్నిపురాణము. నా = 13 నారదీయపురాణము. ప = 14. పద్మపురాణము. లిం=15 లింగపురాణము గ=16 గరుడపురాణము. కూ= 17. కూర్మపురాణము[17] స్కాందపురాణము ఇందు కొన్ని పురాణముల విషయమున అభిప్రాయభేదములున్నను, మార్కండేయపురాణము నిస్సందేహముగా అష్టాదశమహాపురాణములలో ఒకటి.

పురాణము అర్థప్రవణము. సుహృత్సమ్మితము. కావ్యము సరసము. కాంతాసమ్మితము. అనగా పురాణము కథాప్రధానము కావ్యము రసప్రధానము మార్కండేయపురాణమును "ప్రకాశితసారకథామృతం బొగిం ద్రావి జగజ్జనంబు లలర న్వచియింపు తెనుంగుసస్ వచఃశ్రీవిభవంబు పెంపు విలసిల్లఁగ" అని కృతిభర్త ఆదేశము. "నా నేర్చు గతి పె న్నెమ్మి విరచించెదం బద్యమ్ముల గద్యముల"

అని కృతికర్త ఆచరణము. అయినను ఔరస మార్కండేయ పురాణమునందు హరిశ్చంద్రోపాఖ్యానము, కౌశికపత్ని వృత్తాంతము రసవంతములు

రాజ్యము ధారవోసి, రాజాభరణములు తీసివైచి, తరువల్కలములు ధరియించి హరిశ్చంద్రుడు ధర్మపత్నియైన శైబ్యతోను, తనయుడైన లోహితాస్యునితోను ఇలువెడలు సమయమునందు పురజనులు పురపుర పొక్కిన విధమిది :

"కాంచనాలంకృతిఁ గరమొప్పి నీ మ్రోల
నేతెంచు గజఘట లెందుఁబోయెఁ ?
గనకకింకిణుల చెల్వునఁ గ్రాలు తురగంబు
లేల నీ కెలఁకుల నేఁగుదేవు ?
రత్నోజ్జ్వలములైన రథముల నీ పజ్జ
వడిఁ జనుదేర కెక్కడ నడంగె ?
వివిధాయుధస్ఫూర్తి వెలుఁగు కాల్బలుర మొత్త
మేల నీతో రాక యేమియయ్యె ?

రమ్యభూషణ దివ్యాంబరములు వోఁగి
నారచీరలు గట్టి యనాథవృత్తి
నాలుఁగొడుకులు వెంటరా నడుగునట్టి
యెడరు వాటిల్లె నే మేదినీశ ! నీకు 175 ప. 1 ఆ.

హరిశ్చంద్రుడు విపణివీథిలో భార్యాపుత్రులను విక్రయించునపుడు

"ఓ పురజనులార ! నా పత్ని నమ్మెద
నే దాసిఁగా వెల యెడిఁగి పెట్టి
కొనుఁడు నన్నెవ్వఁడవని యడిగెదరేని
నే స్పృశంసుఁడను దానవుండ
నతిహీనకర్ముఁడ నాలి నమ్ముకొనంగ
నరుగుదెంచిన కఠినాత్మకుండ" 214 ప. 1 అ.

అని ప్రకటించుట హృదయవిదారకము కాటికాపరియైన హరిశ్చంద్రుడు, శ్మశానవాటికయందు మృతుడైన కన్నకుమారుని చూచి,

"అలరుమొగంబుతోడఁ గడు నర్మిలి నాకెదు రేల రావుచే
తులు పచరించుచుం దనువు ధూళిమెయిం బొరయంగనేల న

న్నెలమిని గౌఁగిలించుకొన వెంతయుఁ దీపెసలార మంజులో
క్తుల చవి యేల నా చెవులకుం జవిఁ జూపవు నీవు పుత్త్రికా! 253 ప.
అనుచుఁ దనూజు నెత్తికొని యక్కునఁ జక్కఁగఁ జేర్చి మోము మో
మునఁ గదియించి బాష్పజలము ల్వొరిఁ బెల్లుగ నించి యేడ్చు హా!
యని యకటా! కుమార తెగనమ్మితిఁ బాపము చేసి చీర య
మ్మిన యటు లిట్టి నిన్వెదగి మ్రింగునె దైవము క్రూరసర్పమై."
254 ప. 1 ఆ.

అని దుఃఖించుట పుటపాకప్రతీకాశమైన కరుణరసమునకు కాణాచి.
కౌశికపత్ని వృత్తాంతమునందు (సుమతి కథ) కౌశికుడను విప్రుడు,

"కరచరణాంగుళు ల్మఱిగి గాత్రము తద్దయు వస్ని చీము నె
త్తురు దొరగంగఁ బెన్మఱికి దుస్సహమై సుడియంగ ఘర్ఘర
స్వర మెసగంగ నీఁగ లనిశంబును జుమ్మని మూఁగుచుండ హే
యరసము మూర్తమైన యటు లాతతకుష్ఠరుజాభిభూతుఁడై. 155 ప.
అలఁదురు చుండఁగా నతని యంగన, 156 ప.

ఉడుగక నాథుమేఁ దొరఁగు చుండెడు నెత్తురుఁ జీముఁ బల్మఱుం
గడుగుచు నూనియం దలయుఁ గాళ్లను జేతులుఁ దోమి తోమి యిం
పడరఁగ నీళు లార్చుచుఁ బ్రియంబునఁ జీరలు దాన కట్టుచుం
గుడుపుచుఁ గామభోగములఁ గోమలి యాతనిఁ బ్రీతుఁ జేయుచున్
157 ప,

అతఁ డెంత యలిగి తిట్టిన
మతిఁ గింకెరిపడక యెపుడు మాఱాడక యా
నతయగుచు ... 158 ప. 2 ఆ.

ఆరాధించుట కరుణరసశబలితమైన బీభత్సరసమునకు నెలవు.

మరుత్తచక్రవర్తి చరిత్ర, స్వారోచిషమనుచరిత్రము, కువలయాశ్వుని వృత్తాంతము కవితాస్పర్శ కలది అవి శ్రీనాథుని మరుత్తరాట్చరిత్రకు, పెద్దన మనుచరిత్రకు, సవరము చిన వెంకటనారాయణుని కువలయాశ్వచరిత్రమునకు మార్గ

దర్శకములు హరిశ్చంద్రోపాఖ్యానము గౌరన హరిశ్చంద్రోపాఖ్యానమునకు మూలము కాదు. స్కాందపురాణములోని హరిశ్చంద్రోపాఖ్యానము తన్మూలము

"ఈ సుకుమారు డెవ్వఁడొకొ యిందులనుండి వచ్చెనో
భాసురరూపకాంతిజితభావజచంద్రుఁ డితండు రాగలీ
లాసరసత్వ మొప్పఁ గడు లాలసుఁడై ననుఁ జూచెనేని నేఁ
జేసిన పుణ్య మెవ్వరును జేయరు కాముని దక్క నేలుదున్"

230 ప. 4 ఆ.

అను మారన పద్యము, "ఎక్కడి వాఁడె యక్షతనయేందు—" అను పెద్దన పద్యమునకు (35 ప 2 ఆ) ఒరవడి.

"పరనారీపరధనరతి
పరత్వ మెన్నఁడును నాకుఁ బాటిల్ల ని యా
స్థిరసత్యమహిమ సతిస
త్వరితగమనసిద్ధి గలుగవలయు హుతవహా! 253 ప, 4 ఆ

అను మారన పద్యములోని "హుతవహా." అను సంబుద్ధి, "దాన జపాగ్ని హోమపరతంత్రుఁడనేని" అను పెద్దన పద్యములోని (76 ప. 2 ఆ,) "హవ్యవాహనా!" అను సంబుద్ధికి ఆదర్శము

సంస్కృత మార్కండేయపురాణమునందు "కశ్చి ద్ద్విజాతిప్రవరః" అనియేగాని, "ప్రవరాఖ్యః అని లేదు ప్రవరాఖ్యుడని మారన మార్కండేయపురాణమునందు కలదు "అతిసుకుమారమూర్తి ప్రవరాఖ్యుఁడు" (214 ప. 4 ఆ) పెద్దన మనుచరిత్రమునందును ప్రవరాఖ్యుడని కలదు "ప్రవరాఖ్యుఁ డలేఖ్యతనూవిలాసుఁడై" (51 ప 1 ఆ.)

మారన స్వారోచిషమనుచరిత్రము మహాకావ్యము కాదుగాని, మహాకావ్యమైన పెద్దన స్వారోచిషమనుచరిత్రమునకు కాసంత మార్గదర్శకము

**అప్పనమంత్రి:** ఇతని కృతి చారుచర్య భోజుని చారుచర్యలోని ఒక భాగమునకు అనువాదము కావ్యము కాదు. ఆరోగ్యశాస్త్రగ్రంథము

# యుగ సమన్వయము

నన్నయయుగములోని భాషయందు తెనుగు నుడికారము కంటె సంస్కృత ప్రౌఢి పరిఢవిల్లినది. శివకవియుగమునందు సంస్కృతప్రౌఢి కంటె తెనుగునుడికారము తేజరిల్లినది. కాని సలక్షణమైన భాష విలక్షణమైనది. అది పుష్కలముగ తిక్కన యుగమునందు సలక్షణమైనది. శివకవియుగములోని భాషయందు వ్యాకరణవిరుద్ధ ప్రయోగములు, వ్యవహారప్రసిద్ధపైరిపదములు బహుళము. అవి కొన్ని పూర్వోదాహృతములు అట్టివి తొలగి తిక్కనయుగములోని భాషయందు సంస్కృతప్రౌఢి కంటె తెనుగు నుడికారము తేజరిల్లినది శివకవియుగములోని నాటికి ప్రాతవడ్డ మాటలు పరిహృతములైనను, తిక్కనయుగమునందు నేటికి ప్రాతవడ్డ మాటలు కలవు. మాండలికపదములకు కావ్యగౌరవము లభించినది నన్నయయుగములోని భాషకు, శివకవియుగములోని భాషకు, తిక్కనయుగములోని భాష మేలేర్చి కూర్చిన సమన్వయము.

ద్విపద ద్విగుణితమైన తరువోజ, మధ్యాక్కర, సీసము, మధురాక్కర, ఆటవెలది, తేటగీతి, కందము, లయగ్రాహి అను దేశీయచ్ఛందస్సులు; ఉత్పలమాల, చంపకమాల, శార్దూలము, మత్తేభము, మత్తకోకిలము, తరలము, స్రగ్ధర, మహాస్రగ్ధర, మాలిని, మానిని, మణిభూషణము, వనమయూరము, కవిరాజవిరాజితము, ఉత్సాహము, అంబురుహము, ద్రుతవిలంబితము, వసంతతిలకము, స్వాగతము, తోటకము, పృథ్వి, పద్మకము, రథోద్ధతము, దండకము అను సంస్కృత చ్ఛందస్సులు నన్నయయుగమునందు కావ్యప్రవిష్టములైనవి. కందము, సీసము, ఉత్పలమాల, చంపకమాల, శార్దూలము, మత్తేభము, క్రౌంచపదము, మాలిని, మానిని శివకవియుగమునందు, కావ్యప్రయుక్తములైనవి. నన్నయయుగములోని మధ్యాక్కర, మధురాక్కరలు శివకవియుగమునందు, తిక్కనయుగమునందును మఱుగునపడినవి తోదకము, దోధకము, ఇంద్రవజ్ర, ఉపేంద్రవజ్ర, స్రగ్విణి, శిఖరిణి, మందాక్రాంతము, పంచచామరము, సుముఖము, భాస్కరవిలసితము, ప్రహరణకలితము, మంజుభాషిణి, భుజంగప్రయాతము, మణిమాల, మణిగణనికరము, బంధురము, ప్రణవము, జలధరము, మేదిని, శుద్ధవిరాటి, లయవిభాతి, ఉపజాతి అను ఛందస్సులు తిక్కన ప్రవేశపెట్టెను. వృత్తనామములనుబట్టి వృత్తౌచిత్యము కలదనుట నిష్కృష్టసిద్ధాంతము కాదు. కాని తిక్కన మహాభారతములోని

త్రి పర్వములందు ఛందోవైవిధ్యమును ప్రదర్శించుట, నూతనచ్ఛందస్సులు ప్రయోగించుట విశేషము నన్నయ కంటె తిక్కన సంస్కృతచ్ఛందస్సులు అధికముగ స్వీకరించుట గమనార్హము. ఈ మూడుయుగములందును రగడ గాని, ద్విపద గాని ఛందోభేదముగ లేదు. తరువోజ నన్నయభారతమునందు మాత్రమే గాక, పాలకురికె సోమనాథుని అనుభవసారమునందు, కేతన దశకుమారచరిత్రము నందు, తిక్కన మహాభారతమునందు, మారన మార్కండేయపురాణమునందును కలదు. పూర్వయుగములలోని ఛందోభేదములను గ్రహించి, నూతనచ్ఛందస్సులను ప్రయోగించుట తిక్కనయుగములోని ఛందఃపరమైన సమన్వయము.

నన్నయయుగమునందు పద్యగద్యోభయమైన చంపూకావ్యము కలదు. శివకవియుగమునందు రగడకృతులు, ద్విపదకావ్యములు కలవు ద్విపదకావ్యములు కేవలము పద్యకావ్యములు తిక్కనయుగమునందు పద్యకావ్యము, పద్యగద్యోభయమైన చంపూకావ్యములు, ద్విపదకావ్యములు కలవు రగడకృతులు కానరావు. నన్నయయుగమునందు, శివకవియుగమునందు కానరాని కథాకావ్యములు, పురాణము తిక్కనయుగమునందు కలవు పురాణము కావ్యభేదము కాదు. గ్రంథ భేదము. కథాకావ్యమును కావ్యభేదము కాదు కావ్యమే. కాని కావ్యభేదముగ ఆధునికవ్యవహారము కావ్యభేదములు సాహిత్యప్రక్రియలు ఒక్క రగడ ప్రక్రియ వినా, పూర్వయుగములలోని ఇతరప్రక్రియలను అనుసరించుట, నూతనప్రక్రియ నూల్కొల్పుట, తిక్కనయుగములోని ప్రక్రియాపరమైన సమన్వయము. అంతే కాదు. ఇతరప్రక్రియలు ఇతోధికాభివృద్ధిని సాధించినను పద్యగద్యోభయమైన చంపూకావ్యమునకే ప్రాధాన్యము.

నన్నయయుగములోని స్వతంత్రాంధ్రీకరణపద్ధతి తిక్కనయుగములోని స్వతంత్రాంధ్రీకరణపద్ధతికి అధ్యాపకవాణి శివకవియుగములోని స్వతంత్రకావ్య రచనము తిక్కనయుగములోని స్వతంత్రకల్పనామనకు నేపథ్యసంగీతము. కేతన దశకుమారచరిత్రము, తిక్కన మహాభారతము, మారన మార్కండేయపురాణము స్వతంత్రాంధ్రీకరణములు. మూలవిధేయములు. మంచన కేయూరబాహుచరిత్రము; బుద్ధారెడ్డి, కాచవిట్ఠలరెడ్ల రామాయణము పరమస్వతంత్రాంధ్రీకరణములు. మూలాతి క్రమణములు.

నన్నయయుగములోని మతము బ్రాహ్మణమతము. శివకవియుగములోని మతము వీరశైవమతము. తిక్కనయుగములోని మతము మఱల బ్రాహ్మణమతము. నన్నయయుగమునందు బ్రాహ్మణమతప్రబోధము కలదు. శివకవియుగమునందు వీరశైవమతప్రచారము కలదు. తిక్కనయుగమునందు బ్రాహ్మణమతప్రకాశము కలదు. బ్రాహ్మణమతప్రబోధమునందు, బ్రాహ్మణమతప్రకాశమునందు పరమత నిరసనము లేదు. వీరశైవమతప్రచారమునందు పరమతనిరసనము కలదు. కేతన దశకుమారచరిత్రమునందు, మంచన కేయూరబాహుచరిత్రమునందు జైనమతలాఘవము కలదుగాని జైనమతదూషణము లేదు శివకవుల కృతులందు జైన, బౌద్ధ, బ్రాహ్మణ, వైష్ణవమతదూషణము దుర్భరముగ కలదు. జైనబౌద్ధమతముల జైత్రయాత్ర అగినను, బ్రాహ్మణమతమునకు బ్రహ్మరథము, వైష్ణవమతమునకు క్రాంతిరథము పట్టిన కాలమది హరుడే పరమదైవమని వీరశైవమతపరమార్థము. హరియే పరమదైవమని వీరవైష్ణవమతపరమార్థము. పరమతనిరసనమువలన వీరశైవ, వీరవైష్ణవమతముల పరస్పరసంఘర్షణము సంఘమునందు మారణహోమసంఘటనలకు ఆలవాలము. హరిహరభేదభావము కల తిక్కన హరిహరనాథరూపమును ధరించు పరతత్త్వమును– హరిహరనాథతత్త్వమును ప్రతిపాదించుట తిక్కనయుగములోని మతసమన్వయము. ఇది పూర్వోక్తము.

నన్నయయుగమునందు కవిత ప్రధానము. మతము గౌణము. శివకవియుగమునందు మతము ప్రధానము. కవిత గౌణము. కవిత ప్రధానమైన కృతులు సర్వజనులకు సమాదరణీయములు. మతము ప్రధానమైన కృతులు మతేతరులకు నిరాదరణీయములు. శివకవుల కృతులు శైవసంఘమునందే ప్రసిద్ధి గాంచినవి. శైవేతరసంఘమునందు ప్రసిద్ధి గాంచలేదు. కవుల చరిత్ర, సాహిత్యచరిత్రలవలన సర్వపరిచితములైనవి. ఇతరకవుల కృతులు స్వయముగ సర్వవ్యాప్తములు కారణము కవితాప్రాధాన్యము. నన్నయ ప్రసన్నకథాయుక్తిప్రధానమైన మహాకవితామార్గమునకు, పాలకురికి సోమనాథుని అల్పాక్షరముల అనల్పార్థరచన అను మహాకవితాసూత్రమునకు తిక్కన మహాకవిత్వదీక్షావిధి తిక్కనయుగములోని కవితాసమన్వయము.

# ఎఱ్ఱనయుగము

## చారిత్రికనైపథ్యము

సువిశాలమైన కాకతీయసామ్రాజ్యము 1323 వ సంవత్సరమునందు పతన మయినది తురుష్కాక్రాంతమయినది దేవుని విగ్రహములు భగ్నములైనవి. విద్వాంసుల చిరకాలభుక్తములైన అగ్రహారములు అపహరింపబడినవి బ్రాహ్మణులు త్యాజితకర్మబంధులయిరి. ధనికదరిద్రభేదము లేకుండ కృషీవలకుటుంబములు నాశనమైనవి పంటలు పరాధీనమైనవి ధనకనకవస్తువాహనములయెడనేగాక, దారల యెడ కూడ స్వాయత్తతాభావము లేకుండ పోయినది. మద్యపానము, బ్రాహ్మణ హసనము యవనకృత్యములైనవి. మహాసముద్రమగ్నమైన ధరామండలమును ఉద్ధరించుటకు వరాహావతారమూర్తి వలె యవనోదరస్థమైన ఆంధ్రమండలమును సముద్ధరించుటకు ముసునూరి ప్రోలయనాయకుడు ముందడుగు వైచెను. అతని జ్ఞాతిసోదరుడు కాపయనాయకుడు కుడిభుజమయ్యెను. ప్రోలయవేమారెడ్డి సహకరించెను వీరు బహుశః కాకతీయుల నాటి నాయంకరములకు ప్రతినిధులైన డెబ్బదియైదుమంది నాయకులలోని వారగుదురు. డెబ్బదియైదుమంది నాయకులు ఆంధ్రోద్యమమును నిర్వహించిరి. అది దక్షిణభారతదేశములోని ప్రప్రథమ స్వరాజ్యోద్యమము. సత్ఫలితము లొసగినది విదేశీయతివిరచ్చటలు విచ్ఛిన్న స్వచ్ఛములైనవి. స్వచ్ఛందమైన వేగుజుక్క కృష్ణవేణీసలిలములలో జలక్రీడలాడినది. దివ్యదీధితియైన అరుణరేఖ గోదావరీపావనోదారవాఃపూరములలో అఘమర్షణస్నాన మాచరించినది. గౌరగౌరవమైన గభస్తిబింబము పినాకినీ జలములలో అవబృథస్నానమాచరించినది. చండప్రచండమైన భానుబింబము తుంగభద్రాసముత్తుంగతరంగములలో మంగళస్నానమాచరించినది, జీర్ణబ్రాహ్మణ మతోద్ధారము జీవలక్షణమైనది

1324–25 వ సంవత్సరమునుండి రేకపల్లి రాజధానిగ పరిపాలించిన ముసునూరి ప్రోలయనాయకుడు అపహృతములైన వేదపండితుల అగ్రహారములను పునర్దత్తము చేసెను.[2] నూతనాగ్రహారములు నొసగెను[3]. అదే సంవత్సరమునుండి

అద్దంకి రాజధానిగా పరిపాలించిన ప్రోలయవేమారెడ్డి శ్రీశైలాహోబలక్షేత్రములందు సోపానములు కట్టించెను.[4] అపహృతములైన వేదపండితుల అగ్రహారములను పునర్దత్తము చేసెను[5]. అనేకయజ్ఞయాగాదిక్రతువులు చేయించి "అనవరతకృత పురోహితసోమ పాన" అను బిరుదము నందెను[6] బ్రాహ్మణులకు స్వర్ణభూగోగణా గ్రహారములు అనేకములుదానము చేసెను.[7] అంతేకాదు "ఇష్టాపూర్తరూపంబగు క్రియాకలాపంబు నిజకర్తవ్యానురూపంబుగాఁబొదంగి" 18వచ.

"అగ్రహారములు విద్యాతపోవృద్ధవి
ప్రులపెచ్చి యజ్ఞకర్తలుగఁ బనిచెఁ
గొమరారఁ జెఱువులు గుళ్లు ప్రతిష్ఠించి
లోకసంభావ్యంబులుగ నొనర్చె
నిధులు నల్లిండ్లును నిలిపెఁ దోఁటలు సత్ర
ములు చలిపందిళ్లు వెలయఁబెట్టి
హేమాద్రిపరికీర్తితామితవ్రతదాన
నివహంబు లన్నియు నిర్వహించె" 19ప.1ఆ.పూ.భా.హ.వం.

ప్రోలయవేమారెడ్డి అనగా ప్రోలయరెడ్డి కుమారుడు వేమారెడ్డి. ప్రోలయ వేమునికి అన్నమవేముడు, అన్నవేముడు, కోమటివేముడు అను వ్యవహారములును కలవు. తల్లి అన్నమాంబనుబట్టి అన్నమవేముడు, అనవేముడును. కోమటిశబ్దము గురించి విచిత్రమైన కథ[8] కలదుగాని విశ్వసనీయముగ లేదు అన్నమాంబా ప్రోలయలకు అయిదుగురు కుమారులు[9] 1 మాచారెడ్డి 2. వేమారెడ్డి 3 దొడ్డా రెడ్డి 4. అన్నారెడ్డి 5. మల్లారెడ్డి అందు వేమారెడ్డి రాజ్యస్థాపకుడు మాచారెడ్డి చందవోలు శాఖానగరాధిపతి.[10] మల్లారెడ్డి కందుకూరు శాఖానగరాధిపతి"

# ఎఱ్ఱాప్రెగడ

ఎఱ్ఱాప్రెగడ "శివపదాబ్జసంతతధ్యానసంసక్తచిత్తుఁడు ... పాకనాటిలో నీల కంఠేశ్వరస్థానమై యెసక మెసఁగు గుడ్లూరు నెలవుగ గుణగరిష్ఠత నొప్పు ధన్యుఁడు" అని ఎఱ్ఱాప్రెగడ భారతారణ్యపర్వశేషమునందు కలదు. (469ప 7ఆ.) "శంభుదా సాభిధానుఁ జెదలువాడ యెఱ్ఱయఁ గవిశ్రేష్ఠుఁ గొలుతు" నని శ్రీనాధుని బావమఱది నాసికేతోపాఖ్యానమునందు కలదు (8ప 1.ఆ.)ఎఱ్ఱాప్రెగడ వంశీయుడైన చెదలువాడ

మల్లయ విప్రనారాయణ చరిత్రమునందు "చెదల్వాడనిలయ ... శంభుదాసు నెఱ్ఱాప్రెగడ" అని కలదు (13ప.1ఆ.) కావున ఎఱ్ఱాప్రెగడ మొదట గుడ్లూరు నివాసి, తర్వాత చెదలువాడ నివాసి, ఆమీద అద్దంకినివాసి కావలయును. గుడ్లూరు జన్మస్థలము, చెదలువాడ; అద్దంకివాసస్థలములు కావచ్చును.

"నా తమ్ముండు ఘనుండు మల్లరధినీనాధుండు నిన్నాతత
శ్రీతోడన్ సముపేతుఁజేసి యెలమిం జేపట్టి యొసఁగిచ్చుటన్- 39ప.1ఆ.
పూ.భా.

అని ప్రోలయవేమారెడ్డి ఎఱ్ఱాప్రెగడతో అన్నట్లు ఎఱ్ఱాప్రెగడ హరివంశము నందు కలదు మల్లారెడ్డి చెదలువాడలో రామలక్ష్మణప్రతిష్ఠ చేసి దేవాలయము కట్టించినట్లు చరిత్రలో కలదు.[12] ఆ సందర్భమున చెదలువాడనిలయుఁడైన ఎఱ్ఱా ప్రెగ్గడను "ఎలమింజేపట్టి" అనగా సంతోషముతో చేరదీసి, ఆతతశ్రీతో సముపే తుని చేసి ప్రోలయవేమారెడ్డికి ఇచ్చుట సంభవము సంతోషముతో చేరదీయుటకు, అనేకసంపదలొసగుటకు, ప్రోలయవేమారెడ్డికి ఇచ్చుటకు కారణము, ఎఱ్ఱాప్రెగ్గడ ప్రోలయవేమారెడ్డి ఆస్థానకవి కాదగిన సమర్థుడని మల్లారెడ్డి గుర్తించుటయే కాఁబట్టి ఎఱ్ఱాప్రెగడ ప్రోలయవేమారెడ్డి ఆస్థానకవి కాకపూర్వమే లబ్ధప్రతిష్ఠుడైన, సమర్థుడైన మహాకవి కావలయును.

# కృతులు-పౌర్వాపర్యము

ఎఱ్ఱన కృతులు నీలకంఠేశ్వరశతకము, అరణ్యపర్వశేషము, శ్రీలక్ష్మీ నృసింహావతారము (నృసింహపురాణము), రామాయణము, హరివంశమును. ఇందు నీలకంఠేశ్వరశతకపద్యమొకటి మాత్రమే లభించినది. రామాయణపద్యములు సుమారు నలుబదియైదు లభించినవి అరణ్యపర్వశేషము, నృసింహపురాణము, హరివంశము మాత్రమే సమగ్రముగ ఉపలబ్ధములైన కృతులు. లబ్ధాలబ్ధకృతుల పౌర్వాపర్యము గురించి అభిప్రాయభేదములు కలవు. అందు అరణ్యపర్వశేషము తర్వాత నృసింహపురాణము, రామాయణము తర్వాత హరివంశము అనుటకు గ్రంథస్థనిదర్శనములు కలవు.

నృసింహపురాణమని ప్రసిద్ధమైన శ్రీలక్ష్మీనరసింహావతారమునందు,

"ఉన్నత సంస్కృతాదిచతురోక్తిపదంబులఁ గావ్యకర్తవై
యెన్నికమైఁ బ్రబంధపరమేశుఁడనంగ నరణ్యపర్వశే
షోన్నయ మంత్రభాష సుజనోత్సవమొప్పఁగ నిర్వహించితా
నన్నయభట్టతిక్కకవినాథులకెక్కైన భక్తిపెంపునన్" 17ప.పీ.

అని కలదు. ఇందు అరణ్యపర్వశేషము రచించినట్లు కలదు కాఁబట్టి అరణ్యపర్వశేషము తర్వాత రచించినది నృసింహపురాణము అరణ్యపర్వశేషము, నృసింహపురాణమునుఒక జంట హరివంశమునందు,

"నా తమ్ముండు ఘనుండు మల్లరథినీనాథుండు నిన్నాతత
ప్రీతోడన్ సముపేతుఁజేసి యెలమిం జేపట్టి మాకెచ్చటం
జేతోమోదమెలర్ప రామకథ మున్ జెప్పించి యత్యుత్తమ
ఖ్యాతిం బొందితి నింక నేను దనియన్ గావ్యామృతాస్వాదనన్."
39ప 1ఆ పూ.భా.

అని కలదు ఇందు రామాయణము రచించినట్లు కలదు. కాఁబట్టి రామాయణము తర్వాత రచించినది హరివంశము. రామాయణము, హరివంశమును మఱొక జంట. ఈ రెండు జంటలందును ఈ జంట ముందు, ఆ జంట ముందు అనుటకు మఱి గ్రంథస్థనిదర్శనములు లేవు. రామాయణహరివంశముల జంట ముందు, అరణ్యపర్వనృసింహపురాణముల జంట తర్వాత అనుటకు ఉపపత్తులివి:[13]

1. "రామాయణము, హరివంశము నరాంకితములు. ధనాపేక్షకములు. భారతము నరాంకితమయ్యు నన్నయ యెడ నీ కవికి గల భక్తిప్రేరణము నొనర్చిన నిష్కామకర్మ నృసింహపురాణము భగవదర్పితము మొదట నైహికదృష్టి, తర్వాత ఆధ్యాత్మికదృష్టి మానవ ప్రవృత్తికి నైజము. స్వార్థమును వీడి పరమార్థమున దృష్టి నిలిపి భగవదర్పితముగ రచించిన కవి పిమ్మట స్వార్థము వంక మొగ్గి తన రచనమును నరాంకిత మొనరించుట పతనసూచకము."

నృసింహపురాణము భగవదర్పితమే గాని, ఎఱ్ఱన ఆధ్యాత్మికదృష్టిని స్వార్థమును వీడి పరమార్థమున దృష్టి నిలిపి భగవదర్పితముగ రచించినది కాదు అది ఎఱ్ఱన ఇష్టదైవమైన శివునికి అంకితము కాదు ఎఱ్ఱన తాత ఎఱపోతసూరి ఇష్టదైవమైన "శ్రీమదహోబలేసనరసింహు" నికి అంకితము (21ప పీ.) "అమ్మహాప్రబంధంబునకు నస్మత్పితామహహృదయగుహావిహారమహాసింహంబగు శ్రీమదహోబలనరసింహదేవుండ భీశ్వరుండగుటంజేసి యవ్వాక్యరత్నరచనోపహారంబుల నమ్మహాదైవతంబు నారాధించితి" నని ఎఱ్ఱన స్వవచనము. అంతేకాదు.

"అమ్మహాత్ముఁడు నిత్యదయార్ద్రహృదయుఁ
డతులితానందజలధినోలాడుఁగాత
విష్ణుధర్మప్రశంసాపవిత్రమైన
యస్మదీయప్రబంధసామగ్రి వలన" 25 ప.

"......... మజ్జనకుఁ డుద్యత్కీర్తి శ్రీసూర్యుఁ డీ
విజ్ఞానాత్మక వాఙ్మయంబున ముదావేశోజ్జ్వలుం డయ్యెడున్" 26 ప. పీ.

అని కూడ ఎఱ్ఱన స్పష్టప్రతిపాదనము ఇందు ఎఱ్ఱన దృష్టి పరమార్థము నందు లేదు పరార్థమునందు కలదు. అరణ్యపర్వశేషమును నరాంకితము చేయుట నిష్కామకర్మయేగాని, నృసింహపురాణమును దైవాంకితము చేయుట సకామకర్మ. కాఁబట్టి పతనసూచకము కాదు

2. "రామాయణము మన కుపలభ్యము కాలేదు. హరివంశముతో పోలి చూచిన" అరణ్యపర్వనృసింహపురాణముల" జంట కవనము మేలుతరము. శైలి మెఱుగులు దేరి ప్రౌఢతరమై యున్నది ఈ శైలి క్రమాభివృద్ధి పొందినదగుట భారతమున కంటె నృసింహపురాణమున రమణీయముగా నున్నది కొందఱు భారతమే తొలిరచనమందురు అట్లైన నది ఈతని శైలిలో పతన సూచక మగును."

ఎఱ్ఱన శైలి క్రమాభివృద్ధి కంటె గుణాభివృద్ధి పొందినది

"ఎఱ్ఱనార్యుండు సకలలోకైక విదితుఁ
డయిన నన్నయభట్ట మహాకవీంద్ర
సరసపాఽస్వతాంశప్రశస్తిఁ దన్ను
జెందుటయు సాధుజనహర్షసిద్ధిఁ గోరి 470ప.

ధీరవిచారుఁడు తత్కవి
తారీతియుఁ గొంత దోఁపఁ దద్రచనయకా
నారణ్యపర్వశేషము
పూరించెఁ గవీంద్రకర్ణపుటపేయముగాన్" 471ప 7ఆ.

అని అరణ్యపర్వశేషమునందు కలదు. అంతేకాదు అరణ్యపర్వశేషము లోని ఎఱ్ఱన శైలి నన్నయశైలివలెనే కలదు.

"భారతపరాంశమని యిం
పారఁగఁ జెప్పుదురు బుధులు హరివంశము" 39 ప.

నన్నయభట్ట తిక్కకవినాథులు చూపిన త్రోవ పావనంబు"

42 ప. I ఆ. పూ. భా.

అని హరివంశమునందు కలదు. ఎఱ్ఱన అరణ్యపర్వము నన్నయభారతమునకు శేషమైన, హరివంశము తిక్కన భారతమునకు పరాంశము అరణ్యపర్వమునందు నన్నయ త్రోవను అనుసరించిన ఎఱ్ఱన, హరివంశమునందు తిక్కన త్రోవను అనుసరించుట సహజము నృసింహపురాణము ఎఱ్ఱన స్వతంత్రకావ్యము. అందలి శైలి ఎఱ్ఱన స్వతంత్రశైలి అది నన్నయశైలికి అనుబంధము కాదు; తిక్కన శైలికిని అనుబంధము కాదు. అంతేకాదు. నృసింహపురాణములోని ఎఱ్ఱన శైలి ఎంత రమణీయమైనను నిగ్రహము తక్కువ. హరివంశములోని ఎఱ్ఱన శైలి అంత రమణీయము కాకపోయినను సంయమనము సమధికము. అది పరిణామసూచకము పతనసూచకము కాదు.

3. "ఇంతకు శుభమా యని తొలుదొల్త నశుభదాయకమగు నరణ్యపర్వశేషమును వ్రాయడు."

అరణ్యపర్వము అశుభదాయకమను విశ్వాసము కాలక్రమసంక్రాంతము. అది ఎఱ్ఱన కాలమునందును కలదనుటకు ఆధారము లేదు తిక్కన అరణ్యపర్వశేషమును రచింపకపోవుటకు కారణము అశుభదాయకమను విశ్వాసము కాదు. నన్నయ భారతము రాజరాజనరేంద్రాంకితము తిక్కన భారతము హరిహరనాథాంకితము. నరాంకితమైన అరణ్యపర్వశేషమును రచించి దైవాంకితము చేయుట భుక్తశేషమును నైవేద్యము పెట్టుట అగును. అందువలన తిక్కన అరణ్యపర్వశేషమును రచింపలేదు రచించిన ఎఱ్ఱన రాజరాజనరేంద్రాంకితమే చేసెను. అంతే కాదు. ఎఱ్ఱన శుభమా అని చేసినది అరణ్యవర్ణనము కాదు శరదృతువర్ణనము అది శుభదాయకమే అరణ్యపర్వము వ్యాసునికి అంతరాయము కలిగింపలేదు నన్నయకు అవసానము కలిగించినది. అది యాదృచ్ఛికము. అరణ్యపర్వశేష, నృసింహపురాణముల జంట మొదటిదైనను, ఎఱ్ఱన మొట్టమొదటి రచనము అరణ్యపర్వశేషము కాదు నీలకంఠేశ్వరశతకము,

## మఱికొన్ని ఉపపత్తులు :

4. " ఎఱ్ఱాప్రెగ్గడ తాతయే ఎఱ్ఱాప్రెగ్గడను ... నృసింహపురాణమును రచింపుమను ... సందర్భమున

"గిరిశపదభక్తిరసత
త్పరభావము కలిమి శంభుదాసుం డనఁగాఁ
బరఁగియు గోవిందగుణా
దరసంభృతసౌమనస్యధన్యుఁడ వెందున్" 18ప.పీ.

అని మనుమని హరిహరాభేదమును మెచ్చుకొనినాఁడు ఇచ్చట ఎఱ్ఱన యకుంఠితమైన శివభక్తిచేత శంభుదాసుఁడను బిరుదమును బొందియు విష్ణువుపై గూడ భక్తి గలవాఁడే యని చెప్పినట్లు పైకి కనిపించుచున్నది. కాని సూక్ష్మముగ నాలోచింప నీ మాటలయందు వ్యంగ్యముగ హరివంశము రచింపఁబడినట్లు సూచింపఁబడియున్నది."

శంభుదాసుడనునది ఎఱ్ఱనకు బిరుదము కాదు. లక్షణాభిధేయము ఎఱ్ఱన "శివపదాబ్జసంతతధ్యానసంసక్తచిత్తుఁడే." అనగా మహాశివభక్తుడే. అయినను రామాయణహరివంశములు రచించిన తర్వాత అతని తాత ఎఱపోతసూరి నృసింహపురాణము రచింపుమనుటకు మనుమని హరిహరాభేదభావమును మెచ్చుకొనవలసిన అవశ్యకము లేదు. రచింపకముందు కలదు. రచించునో రచింపడో అను శంక తన్నిమిత్తము. శంకలేనిది నివృత్తి నిరుపయోగము. రామాయణహరివంశములు రచించిన తర్వాత శంక నిరవకాశము. "గోవిందగుణాదరసంభృతసౌమనస్యధన్యుడు" అనగా విష్ణువు గుణముల యెడ ఆదరము చక్కగా భరింపఁబడిన మంచి మనస్సు చేత ధన్యుడని అర్థము. అప్పటికి ఎఱ్ఱన మనస్సు గోవిందగుణాదరసంభృతమే గాని, గోవిందగుణవర్ణనసంభృతము కాదని తాత్పర్యము. హరిహరాభేదభావము కలదని మాత్రమే వ్యంగ్యార్థము.

5. "తాతయైన యెఱపోతసూరి యెఱ్ఱయను గాంచి
"గురుజనపరాయణుఁడవు
సరసబహుపురాణధర్మశాస్త్రకథావి
స్తరవేదివి వినయోదయ
భరితుఁడ వతులానుభావభవ్యుఁడవు మహిన్" 19ప.పీ.

అని ... ..... నొక్కివక్కాణించినాఁడు. .. .. . నిజమున కింతకుఁ బూర్వమే యెఱ్ఱయ రామాయణహరివంశాదిగ్రంథములు రచింపకున్నచో యువకుఁడైన మనుమని గూర్చి తాతయగు నెఱిపోతసూరి "అతులానుభావభవ్యుఁడవు" అను పదమును ప్రయోగించునా?"

అనుభావమన వ్యక్తిత్వము. గురుభజనపరాయణత్వము, సరసబహుపురాణ ధర్మశాస్త్రకథావిస్తరవేతృత్వము, వినయోదయభరితత్వము వ్యక్తిత్వవిషయములే. అవి ఎఱ్ఱనకు నృసింహపురాణము రచించునాఁటికె కలవు. అందుకు రామాయణహరివంశాదిగ్రంథములు రచింపవలసిన ఆవశ్యకము లేదు. అరణ్యపర్వశేషము చాలును. నృసింహపురాణరచనాకాలము నాటికి ఎఱ్ఱన యువకుడు, అరణ్యపర్వశేషరచనాకాలము నాటికె ఎఱ్ఱన బాలుడు కాడు. అరణ్యపర్వశేషరచనాకాలము నాటికే ఎఱ్ఱన ప్రౌఢుడు. ప్రౌఢుడైన మనుమని తాత "అతుల మహానుభావుఁడవు" అనుట విపరీతము కాదు.

6 "ఎఱ్ఱాప్రెగ్గడ హరివంశము"లోని "కాలనేమియుద్ధవర్ణనమునందు "మెచ్చక యెదురైన" అను పద్యము (154ప.4ఆ.పూ.భా) కలదు. అది నృసింహపురాణమునందు కలదు. (119ప 2ఆ.) హరివంశములోని హిరణ్యకశిపుని చంపు సందర్భములోని "శితనారసింహ" అను పద్యమును (38ప.4ఆ.పూ.భా) నృసింహపురాణమునందు" కలదు. (107ప 2ఆ.) "కావున నృసింహపురాణమే హరివంశమున కన్న తరువాతి రచనమని నిర్ధరికరింపవచ్చును."

ఎఱ్ఱన హరివంశము సంస్కృతహరివంశమునకు స్వతంత్రాంధ్రీకరణము. పయి పద్యములు శ్లోకానువాదములు కావు ఎఱ్ఱన నృసింహపురాణము బ్రహ్మాండాది పురాణోక్తము. (27వచ పీ.) ఆదిశబ్దముచేత హరివంశము, విష్ణుపురాణము, భాగవతపురాణము మొదలైనవి గ్రాహ్యములు. ఎఱ్ఱన హరివంశమును ముందు రచించిన హరివంశపద్యములు నృసింహపురాణమునందు, నృసింహపురాణము ముందు రచించిన నృసింహపురాణపద్యములు హరివంశమునందు ఆవృత్తములగును. కావున నిర్ధరించుట కష్టము ఆవృత్తపద్యములకు ఆద్యుఁడు తిక్కన. ఉత్తరరామాయణము లోని పద్యములు మహాభారతమునందు కలవు. తిక్కన మహాభారతమునకు పరాంశమైన ఎఱ్ఱన హరివంశమునందు నృసింహపురాణ పద్యములు ఆవృత్తములగుటయే అత్యంతసంభవము. కావున హరివంశమే నృసింహపురాణము కంటె తరువాతి రచనము కావచ్చును.

రామాయణ హరివంశముల జంట ముందు అనుటకు గల ఆరు ఉపపత్తు లందును ఒక్కటి కూడ బలవత్తరము కాదు. ఇక అరణ్యపర్వశేషనృసింహపురాణముల జంట ముందు అనుటకు గల ఉపపత్తులు[15]

"నరసింహపురాణమందలి యవతారికలోని గద్యపద్యములను (12–14) పరిశీలనా బుద్ధితోఁ జదివినయెడల, . నదివఱ కారణ్యపర్వశేషమును బూరించి యున్నను ...... దానినొక గ్రంథముగా నెఱ్ఱాప్రెగ్గడ యెంచుకొనక నృసింహ పురాణమునే తన ప్రథమకావ్యముగా నెంచి "కతిపయాక్షరగ్రహజనితంబైన నైసర్గికచాపలంబుకతన ...... రాయంచలు వోయఁ గ్రౌంచమును నావలఁ గూయఁ గడంగు భంగి" అను వాక్యముల వ్రాసెనని . .... తోపకమానదు"

ఎఱ్ఱన నృసింహపురాణమునందు "కతిపయాక్షరపరిగ్రహజనితంబైన నైసర్గి కచాపలంబు కతంబున" కావ్యరచనమును కాంక్షించినట్లు, మడికి సింగన్న జ్ఞానవా సిష్ఠరామాయణమునందు "తొల్లి వారిభ క్తిరసావేశంబునఁ గతిపయాక్షరచాపలంబునం జేసి, విష్ణువిభవాభిరామకథాప్రభూతంబులం బద్మపురాణోత్తరఖండబును భాగవత దశమస్కంధంబును దెనుంగున రచించినట్లు "కలదు (1౦వచ 1ఆ) మడికి సింగన జ్ఞానవాసిష్ఠరామాయణము కంటె పద్మపురాణోత్తరఖండ, భాగవతదశమ స్కంధములు పూర్వకృతుల వలె, ఎఱ్ఱన రామాయణహరివంశముల కంటె అరణ్య పర్వనృసింహపురాణములు పూర్వకృతులగును.

ఇందుకు ఎఱ్ఱన కాలము, అరణ్యపర్వశేషరచనాకాలము, మల్లారెడ్డి ఎఱ్ఱా ప్రెగ్గడను "ఎలమింజేపట్టి ఆతతశ్రీతోడ స్సముపేతుఁజేసి" ప్రోలయవేమారెడ్డి ఆస్థానకవిని చేసిన కాలము, హరివంశరచనాకాలమును ప్రోద్బలకము.

## ఎఱ్ఱనకాలము

ఎఱ్ఱన నృసింహపురాణమునందు ఎఱ్ఱన తాత తాత భీమన "వెలనాటి చోడుని వలన మిగుల మన్నన గన్న"ట్లు కలదు ఎఱ్ఱన తాత ఎఱపోతసూరి. అతని తాత భీమనమంత్రి.

"ప్రజ్ఞాపవిత్రుఁ డాపస్తంబసూత్రుండు
శ్రీవత్సగోత్రుఁ డూర్జితచరిత్రుఁ

దగు బొల్లనకుఁ బోలమాంబకుఁ బుత్రుండు
వెలనాఁటి చోదనివలన మిగుల
మన్నన గన్న భీమనమంత్రి పౌత్రుండు
పేరమాంబామనఃప్రియుఁడు పోత
మాంబికావిభు సూరనార్యు మజ్జనకుని
బొల్లధీనిధికిని బోలసకును

జన్నసకు ననుజన్ముని( గన్నతండ్రి
వేఁగినాఁటఁ గరావ ర్తివృ త్తిమంతుఁ
డనఘుఁ డెఱపోతసూరి కంసారిచరణ
కమలమధుకరపతి సారవిమలయశుఁడు " 1ఆప. పీఠిక.

ఇందలి వెలనాటి చోడుడు "1156 మొదలుకొని 1163 వఱకు" పరి పాలించిన మొదటి వెలనాటి చోడుడని, తరమునకు నలుబది సంవత్సరముల పరిగణనమున ఎఱ్ఱన కాలము 1280–1350 ప్రాంతమని ఒక సమన్వయము కలదు.[16] "1170–1180 నడుమ" రాజ్యము చేసిన రెండవ వెలనాటి చోడుడని, తరమునకు ముప్పదిమూడు సంవత్సరముల పరిగణనమున ఎఱ్ఱన కాలము 1280–1345 ప్రాంతమని మఱొక సమన్వయము కలదు [17] 1163–1180 మధ్య పరి పాలించిన రెండవ వెలనాటి చోడుడని శతాబ్దికి మూడుతరముల పరిగణనమున ఎఱ్ఱన కాలము 1280–1355 లేదా 1285–1355 ప్రాంతమని ఇంకొక సమన్వయము కలదు.[18] మూడు సమన్వయములందును ఎఱ్ఱన జననకాలము 1280 ప్రాంతము కలదు. అవసానకాలము 1350, 1345, 1355 అని కలదు. 1365 అనుటకు మఱొక అవకాశము కలదు కాని నిశ్చాయకము కాదు.

ప్రోలయవేమారెడ్డి అనంతరము రాజ్యాధిపతి అనపోతారెడ్డి రాజ్యకాలము[19] 1353–1364 రాజధాని కొండవీడు. అది మొదలు ప్రోలయవేమారెడ్డి స్థాపించిన అద్దంకిరాజ్యము కొండవీటి సామ్రాజ్యము. అనపోతారెడ్డి అనంతరము రాజ్యాధిపతి అనవేమారెడ్డి. రాజ్యకాలము[20] 1364–1386 అనపోతారెడ్డికాలమున అనవేమారెడ్డి యువరాజు. ఆ కాలమునందలి అనపోతారెడ్డి కొల్లూరిశాసనమునందు ఎఱ్ఱాప్రెగ్గడ ప్రసక్తి కలదు [21] కొల్లూరిశాసనము సంస్కృతశాసనము సంస్కృతభాష నడుమ తెలుగు వాక్యమునందు ఎఱ్ఱాప్రెగ్గడ ప్రసక్తి :

"ఏతే భారద్వాజగోత్రాః యఱ్ఱయప్రగడగారికె తాడినగరపు పొలమున ఇరుపుట్లు ౨౫ వేమూరి పొలాన ౨౦ బెరసి కేసరిపాటి ౨౩ కంౘికె ఏతద్విశేషణాది లిఖితేభ్యో న్యే ఏకైకభాగినః సర్వే శాకాధ్యాపకాః."

ఇది నిజమేని ఎఱ్ఱాప్రెగడ భారద్వాజగోత్రుడగును. కాని శ్రీవత్సగోత్రుడు. (469ప 7 ఆ ఆ ప, 15పపీ. సృ పు, 36 ప. 1 ఆ హ. వం) అంతేకాదు. ఎఱ్ఱాప్రెగ్గడ శూకాధ్యాపకుడగును శూకమన ధాన్యము శూకాధ్యాపకుడన ధాన్యమునకు వేదములను చదివించువాడని అర్థము వచ్చును. ఎఱ్ఱాప్రెగ్గడ శూకాధ్యాపకుడు కాడు. ఈ శాసనమునందు "ఈ" అను తెలుగు నిర్దేశవాచకసర్వనామము సంస్కృతభాష యందు బహుధా కలదు ప్రతిగ్రహీతలంచటిని ఇంటిపేరులు కలవు "యఱ్ఱయ ప్రగడగారికె" మాత్రము లేదు శాసనస్వరూపమును బట్టి "ఏతేభారద్వాజగోత్రాః" అను సంస్కృవాక్యము సమగ్రము కాదు ఆ భారద్వాజగోత్రుని పేరు, భాగసంఖ్య సంస్కృతమునందు ఉండవలయును అది తొలగించి సంస్కృతభాష నడుమ తెలుగు వాక్యమును చేర్చినట్లు అనుమేయము. శాసనతామ్రఫలకము లభింపలేదు. వ్రాతప్రతి లభించినది ఇది ప్రతినిలేఖకుని పని కావచ్చును.

సంస్కృతశాసనములందు ఎల్లలు తెలుగుభాషయందుండును. ఎల్లల తర్వాత శాపోక్తులు మఱల సంస్కృతభాషయందుండును కొల్లూరిశాసనమునందు తెలుగు భాషలోని ఎల్లల తర్వాత, సంస్కృతభాషలోని శాపోక్తుల ముందు ఇట్లు కలదు.

"యీ రాజు తమ్ముడు అనవెమభూపతి మజ్జసాలకె
వేమూరి తూర్పు పొలానను పదిహేనుపుట్ల క్షేత్రమున్ను తాడినగరి పొలంచుట్టూ
నానువాగువెంటముప్పదేనుపుట్ల క్షేత్రమున్ను బెరసి కేసరిపాటి
యీభైపుట్ల చేను ధారవోశి యిచ్చి యీ పూరనే కలిపెను."

సంస్కృతభాష నడిమి తెలుగు వాక్యములోని భూదానము, తెలుగుభాషలోని ఎల్లల సంస్కృతభాషలోని శాపోక్తుల నడిమి తెలుగు వాక్యములోని భూదానమును ఒకటే అది అనవోతారెడ్డికృతము. ఇది అనవేమారెడ్డికృతము అసంగతము. ఇది కూడ ప్రతిలేఖకుని పని అగును శాసనప్రతియందు శాసనకాలమును తెలుపు శ్లోకముండు "నాలుగో పలక పోయినది" అని కలదు కాని అనవోతారెడ్డి కొల్లూరు శాసనము కాలమును తెలుపు శ్లోకము విడిగా లభించినది [22] అందు శకసంవత్సర

సంఖ్య "ఋతుదంతిభాస్కరమితే" అని కలదు. అది 1286+78=1364 వ సంవత్సరము. తెలుగు కాలమానసము శోభకృద్వత్సరమాఘమాసపుణ్యదివసమని కలదు. తిథివారములు లేవు సరిచూచుటకు సాధనము లేదు కొల్లూరిశాసనములోని భూదానము ఎఱ్ఱాప్రెగడకు అనపోతారెడ్డి చేసినను, అనవేమారెడ్డి చేసినను; ఎఱ్ఱన వారి ఆస్థానకవి అగును. కనీసము అనపోతారెడ్డి ఆస్థానకవి కావలయును కాని ఎఱ్ఱన అనపోతారెడ్డి ఆస్థానకవి అనుటకు గాని, అనవేమారెడ్డి ఆస్థానకవి అనుటకు గాని ఆధారము లేదు. కాఁబట్టి కొల్లూరు శాసనమునందు ఎఱ్ఱాప్రెగడ ప్రసక్తి కల తెలుగు వాక్యములు రెండును సంస్కృతభాషయందు ఆగమప్రాయములు, కాలాంతరసంక్రాంతములు కావలయును అయిన ఎఱ్ఱన అవసానకాలము 1365 వ సంవత్సరమనుటకు కొల్లూరు శాసనము నిర్ధారకసాధనము కాదు కావున ఎఱ్ఱన జీవితకాలము స్థూలముగ 1280-1355 అగును.

అనపోతారెడ్డి, అనవేమారెడ్డి సోదరులు అన్నయరెడ్డి కుమారులు అందువలన "అన" విశేషణము. అన్నయపోతారెడ్డి, అన్నయవేమారెడ్డి అనపోతారెడ్డి అనవేమారెడ్డి అగుదురు ఇద్దఱును ప్రోలయవేమారెడ్డి దత్తపుత్త్రులు. "స్వపుత్త్రీకృతవాన్" అని శాసనమునందు కలదు[23] ప్రోలయవేమునికి అన్నయవేముడు, అనవేముడు అను వ్యవహారము కలదు.[24] అనవేమారెడ్డి అను వ్యవహారము కల ప్రోలయవేమారెడ్డి తన ఆస్థానకవియైన ఎఱ్ఱాప్రెగడకు చేసిన భూదానము, అనపోతారెడ్డి తండ్రి అనవేమారెడ్డిపరముగ కాక, తమ్ముడు అనవేమారెడ్డిపరముగ తర్వాత ప్రసిద్ధము కావచ్చును అది అనపోతారెడ్డి కొల్లూరుశాసనమునందు ఆగమప్రాయము కావచ్చును · అయిన గుడ్లూరు జన్మస్థలమైన ఎఱ్ఱనకు చెదలువాడ, అద్దంకి తోపాటు కొల్లూరు కూడ వాసస్థలము అగును అనపోతారెడ్డి రాజ్యాధిపతియైన అనతికాలములోనే రాజధానిని అద్దంకి నుండి కొండవీడునకు మార్చెను. ఆ సమయమునందు ఎఱ్ఱాప్రెగ్గడ అద్దంకి వదలి కొల్లూరు చేరుట సంభవము.

## అరణ్యపర్వశేషకర్తృత్వము

అరణ్యపర్వము చివరి అన్ని ప్రతులందును ఎఱ్ఱనార్యుడు ఆరణ్యపర్వశేషము పూరించెనని తెలుపు పద్యములు కలవు ఒక్క ప్రతిలో మాత్రము చతుర్థాశ్వాసములోని "శారదరాత్రు"ల పద్యము తర్వాత కలవు[25] ఇతరప్రతులందు

"శారదరాత్రు"ల పద్యము తర్వాత "నన్నయభట్టకవిత్వము సంపూర్ణము ఇక్కడ నుండి యెఱ్ఱాప్రెగ్గడకవిత్వము" అను లేఖకరచనములు కలవు. ఒక్క ప్రతిలో మాత్రము "భూసతికిం దివంబునకు" అను పద్యముతో "ఎఱ్ఱాప్రెగడకవిత్వ మారంభము" అని కలదు[26] ప్రతుల ఆధిక్యమునుబట్టి మాత్రమేగాక అప్ప కవీయములోని స్నిగ్ధాదిచక్రకూటమును (అరివర్ణచక్రోద్ధారణమును) బట్టి సహితము, నన్నయ "శారదరాత్రు"ల పద్యము తరువాతి "స్ఫురదరుణాంశురాగరుచి" అను పద్యము (149 ప 4 ఆ) మొదలుకొని చివఱివఱకు అరణ్యపర్వశేషము నన్నయ కృతము కాదు ఎఱ్ఱనకృతము ఎఱ్ఱన "అరణ్యపర్వశేషోన్నయ మంత్రభాష సుజనోత్సవమొప్పఁగ నిర్వహించి"నట్లు నృసింహపురాణమునందును కలదు. అయినను ఎఱ్ఱన నిర్వహించినది అరణ్యపర్వశేషపూరణము కాదు, అరణ్యపర్వ శిథిలపూరణము మాత్రమే అను వాదము కలదు ఆ వాదమునకు గల ఉపపత్తులివి:

1. ఆదిఁ దొడంగి మూఁడు కృతు లాంధ్ర కవిత్వవిశారదుండు విద్యాద దయితుం డొనర్చె మహితాత్ముఁడు నన్నయభట్టు దక్షతన్" అని తిక్కన భారత మునందు కలదు. (6ప.1ఆ వి.ప.) "భారతసంహిత న్మును త్రిపర్వము లెవ్వఁ డొనర్చె నట్టి విద్యారమణీయు నాంధ్రకవితాగురు నన్నయభట్టుఁ గొల్చెదన్" అని తిక్కన శిష్యుడు మారన మార్కండేయపురాణమునందును కలదు. (9ప పీ.) నన్నయ ఆరణ్యపర్వము మొత్తము రచింపకుండ మూడు కృతులు, త్రిపర్వములు కావు.

ఒక్క మూడు సంఖ్యనుబట్టి నన్నయ ఆరణ్యపర్వము మొత్తము రచించెనని నొక్కి వక్కాణించుటకు తిక్కన, మారనలు పర్యవేక్షక, పరిశోధకసదృశులు కారు మహాభారతమార్కండేయపురాణములు గణితశాస్త్రములు కావు. భిన్నములు, దశాంశములు చెప్పుటకు సిద్ధాంతగ్రంథములును కావు. కావ్యపురాణములు స్థూలనిర్దేశ సహములు. అరణ్యపర్వమునందు నన్నయ రచనము నాల్గవ ఆశ్వాసమునందును కలదు అది సభారణ్యపర్వభాగములు మూడు పర్వములే త్రిపర్వములే కాదనుట కేశవిభజనము.

2. ఎఱ్ఱన నృసింహపురాణమునందు అరణ్యపర్వశేషము రచించినట్లు లేదు. అరణ్యపర్వశేషోన్నయము నిర్వహించినట్లు కలదు ఉన్నయమన పైకెత్తుట. అనగా ఉద్ధరించుట. నన్నయ అరణ్యపర్వములోని క్రిమికీటకదష్టములై నష్టములైన భాగ

ములను పూరించి ఎఱ్ఱన ఉద్ధరించెను. ఎఱ్ఱన నిర్వహణము అరణ్యపర్వశేషశిథిల పూరణమే.

నన్నయ ఆదిసభాపర్వములలోని భాగములు క్రిమికీటకదష్టములై నష్టములు కాక ఆరణ్యపర్వములోని భాగములు- అందును "శారదరాత్రు"ల పద్యము తర్వాతి భాగములు మాత్రమే క్రిమికీటకదష్టములై నష్టములగుట నమ్మరాని విష యము అంతేకాదు పదకొండవ శతాబ్ది నన్నయ భారతమునకు పదునాల్గవ శతాబ్ది ఎఱ్ఱన నాటికి ఒక్క ప్రతియే ఉండదు. అనేక ప్రతు లుండును. ఉన్నయ మనగా ఉద్ధరణమే అరణ్యపర్వశేషోన్నయ మనగా అరణ్యపర్వముయొక్క అన్ని ప్రతు లలోని క్రిమికీటకదష్టములై నష్టములైన భాగముల ఉద్ధరణము కాదు. అనగా శిథిల పూరణము కాదు. అటు నన్నయ ఆంధ్రీకరింపలేక, ఇటు తిక్కన ఆంధ్రీకరింపక ఉపేక్షింపబడిన అరణ్యపర్వశేషముయొక్క ఉద్ధరణము. అనగా శేషపూరణము. నృసింహపురాణమునందు "అరణ్యపర్వశేషోన్నయ మంధ్రభాష సుజనోత్సవ మొప్పఁగ నిర్వహించి"నట్లు కలదు అట్లు కల పద్యము పూర్వోదాహృతము అరణ్యపర్వశేషోద్ధరణమును ఆంధ్రభాషలో నిర్వహించెనని అర్థము. అరణ్యపర్వ శేషమును ఆంధ్రీకరించెనని తాత్పర్యము

3. అరణ్యపర్వమెల్ల నన్నయ రచనముగ కలదు నన్నయ పదములు, పదబంధములు, సమాసములు, సంస్కృతభూయిష్ఠరచనములు, సమాసపద్యములు ఎఱ్ఱనకృతమను అరణ్యపర్వశేషమునందు కలవు

ఇది నిజమే. ఇందుకు హేతువు అది నన్నయకృతమగుట కాదు "ఎఱ్ఱ నార్యుఁడు ... నన్నయభట్టమహాకవీంద్రు సరససారస్వతాంశప్రశస్తి తన్నుఁజెందు టయు, తత్కవితారీతి గొంత దోఁప ఆరణ్యపర్వశేషము పూరించుట మాత్రమే. ఇట్లు కల పద్యములు పూర్వోదాహృతములు.

4 అరణ్యపర్వశేషము ఎఱ్ఱన రచించినట్లు అవతారికగాని ఆశ్వాసాంత గద్యముగాని అరణ్యపర్వమునందు లేదు "నన్నయభట్టప్రణీతం"బనియే కలదు.

ఆశ్వాసపద్యమునందు అవతారిక ఉండదు. "తద్రచనయకా నారణ్యపర్వ శేషము పూరించె"నని అరణ్యపర్వము చివరి పద్యములందు కలవు అవి పూర్వోదా హృతములు "తద్రచనయకా" అనగా నన్నయ రచన అగునట్లు అని అర్థము.

నన్నయ రచన అగునట్లు రచించిన ఆరణ్యపర్వమునందు ఎఱ్ఱన రచించినట్లు ఉండుట అసంగతము "నన్నయ భట్టప్రణీతం" అని ఉండుటయే సుసంగతము.

5 "శారదరాత్రు"ల పద్యము తరువాతి లేఖకుల వ్రాతలు కల్పితములు. ఆరణ్యపర్వముచివరి పద్యములు ప్రక్షిప్తములు పద్యములని ఉత్తమపురుష యందు లేవు. ప్రథమపురుషయందు కలవు అన్యకృతములు

నన్నయ అవతారికలోని పద్యములును ఉత్తమపురుషయందు లేవు ప్రథమ పురుషయందే కలవు అన్యకృతమను వాదము కలదు కాని నన్నయ అవతారిక లోని పద్యగద్యములెల్ల నన్నయ పద్యగద్యములుగానే కలవు ఉత్తమపురుషరచనము అహంకారద్యోతకము. ప్రథమపురుషరచనము వినయపూర్వకము ఎఱ్ఱన వినయో దయభరితుడని నృసింహపురాణము నందు కలదు. ఆ పద్యమును పూర్వోదా హృతము ఆరణపర్వము చివరిపద్యములు ఎఱ్ఱన పద్యములుగానే కలవు. అన్య కృతములు కావలసిన ఆవశ్యకము లేదు ప్రక్షిప్తములు కావు నిక్షిప్తములే "శారద రాత్రు"ల పద్యము తర్వాతి లేఖకుల వ్రాతలు అన్ని ప్రతులందును కలవు. అవి కల్పితములు కావలసిన ఆవశ్యకము లేదు

6 శ్రీనాథుడు భీమేశ్వరపురాణమునందు భారతరచనాపరముగ నన్నయ, తిక్కనలను స్తుతించెనేగాని, ఎఱ్ఱనను స్తుతింపలేదు.

శ్రీనాథుని భీమేశ్వరపురాణమునందు నన్నయను స్తుతించిన పద్యము [8ప] తిక్కనను స్తుతించిన పద్యము [9ప] కలవు అట్లు ఎఱ్ఱనను స్తుతించిన పద్యము లేదు తిక్కనను స్తుతించిన పద్యము తరువాత శ్రీనాథుని తాత కమలనాభామాత్యుని స్తుతించిన పద్యము కలదు [10ప 1ఆ.] తన్మధ్యమునందు భారతరచనాపరముగ ఎఱ్ఱనను స్తుతించిన పద్యము లేకపోవుట ప్రాగభావమో ప్రధ్వంసాభావమో నిర్ధరించుట కష్టము. కారణము భీమేశ్వరపురాణమునకు రెండు ప్రతులే లభించినవి. ఒక ప్రతియందు అవతారిక లేదు ప్రతివిలేఖకుల అనవధానమున పద్యములు లుప్తములగుట సర్వసాధారణము. శ్రీనాథుడు భీమేశ్వరపురాణము కంటె ముందు రచించిన శృంగారనైషధమునందు, తర్వాత రచించిన కాశీఖండ, శివరాత్రి మాహాత్మ్యములందు ఎఱ్ఱనస్తుతి కలదు. హరవిలాసమునందు పూర్వకవిస్తుతియే లేదు.

"ధీరమతి నన్నపార్యునిఁ దిక్కయజ్వ
శంభుదాసునిఁ గరమర్థి సన్నుతించి" 7ప.1ఆ శృం నై.

"శబ్దశాసను నన్నపాచార్యుఁ దలఁచి
సత్కవిశ్రేష్ఠుఁ దిక్కయజ్వను భజించి
సత్ప్రబంధమహేశ్వరు శంభుదాసు
నధికసదృక్తిసంయుక్తి నాదరించి" 10ప.1ఆ.కా ఖం

"ఉన్నతమైన యాంధ్రకవితోక్తుల నెంతయుఁ బ్రోడలైన యా
నన్నయభట్టుఁ దిక్కకవినాయకు నెఱ్ఱనశంభుదాసు -" 8ప.1ఆ శి.రా.మ.

ఇందు నన్నయ, తిక్కనలతోపాటు ఎఱ్ఱనను శ్రీనాథుడు కరమర్థి సన్నుతించుట, అధికసదృక్తిసంయుక్తి నాదరించుట మాత్రమేగాక, సత్ప్రబంధమహేశ్వ పడనుట, కలదు. "ఎన్నికమైఁ బ్రబంధపరమేశుఁడనంగ" ఎఱ్ఱన అరణ్యపర్వశేషమును రచించినట్లు నృసింహపురాణమునందు కలదు. ఆ పద్యము పూర్వోదాహృతము. ఇది శ్రీనాథుడు భారతరచనాపరముగ ఎఱ్ఱనను స్తుతించుటయే.

అరణ్యపర్వశిథిలపూరణవాదమునకు గల ఆరు ఉపపత్తులలోను ఒక ఉపపత్తి కూడ బలవత్తరము కాదు. అరణ్యపర్వశేషపూరణనిర్ణయమునకు లేఖకుల వ్రాతలు, ఎఱ్ఱన పద్యములు మాత్రమేగాక, వేఱె బాహిరమైన, ఆంతరమైన సాధనములు కలవు

1. నన్నయ భారతమునందు మధ్యాక్కరలు కలవు. "శారదరాత్రు"లను పద్యమువఱకు గల అన్ని మధ్యాక్కరలందును అయిదవగణము మొదటి అక్షరముతో యతిమైత్రి పాటింపఁబడినది.

"పదివేల గజముల బలము గలవాఁడు పౌలస్త్యుతోడఁ
గదనంబుఁ జేసి యనేక యక్షరాక్షసుల నిర్జించి
యుదితశౌర్యోన్నతుండైన వాఁడు వృకోదరుఁ డేల
పదపడి నిగృహీతుఁడయ్యె దానొక్క పన్నగుచేత" 103ప.4ఆ.అర.ప.

ఇది నన్నయ తుది మధ్యాక్కర. ఇక "శారదరాత్రు"లను పద్యము తర్వాత గల అన్ని మధ్యాక్కరలందును నాల్గవగణము మొదటి అక్షరముతో యతిమైత్రి పాటింపఁబడినది.

"అసదృశతేజుఁడు బ్రాహ్మణానీకసహితుఁడై కడఁగి
వసుమతియందు నధర్మవర్తులై యున్న మ్లేచ్ఛులను
మసలక నిలకొత్తెఁ జేసి మడియించి ధర్మంబు నిలిపి
వసునిభుఁ డొనరించుఁ బేర్మి వాజిమేధము నిష్ఠ యొప్ప" 310ప 4ఆ
అర.ప.

ఇది "శారదరాత్రు"ల పద్యము తరువాతి తొలి మధ్యాక్కర. "శారద రాత్రు"ల పద్యము వఱకు అన్ని మధ్యాక్కరలందును అయిదవగణము మొదటి అక్షరముతో యతిమైత్రి పాటించిన నన్నయ అమాంతము "శారదరాత్రు"ల పద్యము తరువాత అన్ని మధ్యాక్కరలందును నాల్గవగణము మొదటి అక్షరముతో యతిమైత్రి పాటింపవలసిన ఆవశ్యకము లేదు కాఁబట్టి "శారదరాత్రు"ల పద్యము తరువాత అరణ్యపర్వశేషము నన్నయ రచనము కాదు. అది ఎఱ్ఱన రచనమే అగును. ఇది ఆంతరమైన సాధనము.

2 సమీపకాలికమైన జక్కన విక్రమార్కచరిత్రమునందు ఇట్లు కలదు.

"ఈ త్రయిఁ దాఁ ప్రబంధపరమేశ్వరుఁడై విరచించె శబ్దవై
చిత్రి నరణ్యపర్వమున శేషము శ్రీనరసింహరామచా
రిత్రములున్ బుధవ్రతగరిష్ఠత నెఱ్ఱయ శంభుదాసుఁ డా
చిత్రకవిత్వవాగ్విభవజృంభితుఁ గొల్చెద భక్తియుక్తితోన్." 14ప. 1ఆ.

ఇందు ఎఱ్ఱన ప్రబంధపరమేశ్వరుడై అరణ్యపర్వశేషము రచించెనని ఇదమిత్థముగ కలదు ఇది బాహిరమైన సాధనము.

3. సమీపకాలికము కాకపోయినను సుదూరకాలికమును కాని వెల్లంకి తాతంభట్టు కవిలోకచింతామణియందు, నన్నయ "ఆదిపర్వము"లోనిదని "దండితా రాతి" అను పద్యమును (328ప 3ఆ) ఉదాహరించిన అనంతరమే, "ఎఱ్ఱాప్రెగడ అరణ్యపర్వము"లోనిదని "నగవులకేనియున్" అను పద్యమును (397ప. 4ఆ) ఉదాహరించెను లక్షణగ్రంథములలోని లక్ష్యోదాహరణములు పరమప్రమాణములు కాదుగాని అప్రమాణములును కావు. అంతేకాదు అన్యప్రమాణసంవాదమును కలదు. ఇది యును బాహిరమైన సాధనము.

4. కవిలోకచింతామణికి సమకాలికమైన చింతలపూడి ఎల్లనార్యుని తారక బ్రహ్మరాజీయమునందు ఇట్లు కలదు.

"భారతకావ్యహార మెక భాగము నన్నయభట్టు గూర్చెము
క్తారమణీయవాక్యములఁ దక్కిన భాగము సోమయాజి సొం
పార నొనర్చె రెంటి గలియన్ శివదాసుఁడు మధ్యనాయక
శ్రీ రచియించె శారద ధరింపఁ గవిత్రయకీర్తి మించఁగన్"

శివదాసుడన శంభుదాసుడు భారతకావ్యహారములోని నన్నయ కూర్చిన భాగమునకు, తిక్కనసోమయాజి చేర్చిన భాగమునకు మధ్య నాయకమణిని రచించె ననగా ఎఱ్ఱన అరణ్యపర్వశేషము రచించెననియే అర్థము. అరణ్యపర్వశేషము ఎఱ్ఱనార్యకృతము కవిత్రయనామకరణము ఎల్లనార్యకృతము

5 ఎఱ్ఱన వంశీయుడైన వెదలువాడ మల్లన విప్రనారాయణచరిత్రమునందు ఇట్లు కలదు.

"ప్రతిభతో నారణ్యపర్వశేషముఁ జెప్పెఁ
గవులకుఁ జెవుల పండువులు గాఁగ
వల్మీకభవు వచోవైఖరి రామాయ
ణంబు నాంధ్రప్రబంధంబుఁ జేసె
నారసింహుని పురాణమొనర్చె హరిమెచ్చి
నన్నె నెన్నఁడు చూచినాఁడ వనఁగఁ
బ్రౌఢిమై హరివంశభాగముల్ (రెండును)
రచియించె సభలందుఁ బ్రాజ్ఞు లెన్న

దురితహరుఁ బ్రబంధపరమేశ్వరుని జెద
ల్వాడనిలయు నాదు వంశకర్త
ధన్యమూర్తి శంభుదాసు నెఱ్ఱాప్రెగ
డను నుతింప బ్రహ్మకును దరంబె?" 13ప. 1ఆ.

ఇందు ఎఱ్ఱన కృతులు భారతరామాయణములు, నృసింహపురాణ హరి వంశములు ప్రబంధపరమేశ్వరబిరుదము కలవు. వంశకర్త సమాచారము. ఇది కూడ బాహిరమైన సాధనము.

బాహిరమైన, ఆంతరమైన సాధనముల పరస్పరోపబలకతను అరణ్యపర్వ శేషము ఎఱ్ఱనకృతము.

# అరణ్యపర్వ శేషరచనాకాలము

అవతారికలేని, ఎఱ్ఱన ఆశ్వాసాంతగద్యము లేని, ఎఱ్ఱన కాలమునకు చెందిన ఆశ్వాసాద్యంతపద్యములును లేని — అరణ్యపర్వ శేషము రచనాకాలము నిర్ణయించుటకు అణుమాత్రమైన ఆధారము లభించినను, అది ఎడారిలోని జలాశయమే అగును అట్టి చర్త్రాంశమొకటి ఎఱ్ఱన అరణ్యపర్వశేషమునందు కలదు. సంస్కృతభారతమునందు మార్కండేయుడు ధర్మరాజునకు కలియుగ ధర్మములు చెప్పిన ఘట్టమునందు ఇట్లు కలదు

"బహవో మ్లేచ్ఛరాజానః పృథివ్యాం మనుజాధిప
మిథ్యానుశాసినః పాపా మృషావాదపరాయణాః 29శ్లో.
అన్ధ్రాః శకాః పులిన్దాశ్చ యవనాశ్చ నరాధిపాః
కామ్బోజాః ఔర్ణికాః శూద్రా స్తథాబీరా నరోత్తమ.

30శ్లో 186అ. ఆర. ప.

పృథివియందు పాపులు, మృషావాదపరాయణులును అయిన మ్లేచ్ఛరాజులు పెచ్చు పెరిగిపోవుదురు. ఆంధ్ర, శక, పులింద, యవన, కాంభోజ, ఔర్ణిక, శూద్ర, అభీరులును అట్టివారే అని అర్థము ఇది ఎఱ్ఱన అరణ్యపర్వమునందు ఇట్లు కలదు.

"వివిధవ్యాఘ్రమృగోరగాకులములై విస్తీర్ణశూన్యాటవీ
నివహాభీలములై యరాజకములై నిర్మూలధర్మంబులై
ద్రవిళాభీరతురుష్కబర్బరపుళిందవ్యాప్తిదుష్టంబులై
భువిలో నెల్లెడఁ బొడగున్ జనపదంబుల్ దద్యుగాంతంబునన్"

290 ప 4 ఆ.

ఇందు ఆంధ్రులు లేరు అందు తురుష్కులు లేరు. సంస్కృతభారతములోని యవనులు తురుష్కులు కారు. గ్రీకులు యవనశబ్దము తురుష్కులకు కాలాంతర సంక్రాంతము. తురుష్కుల వలన జనపదములు అరాజకములై నిర్మూలధర్మములై పాడగుట కూడ సంస్కృతభారతమునందు లేదు. ఉన్న ఆంధ్రులను విడిచిపెట్టుట ఎఱ్ఱన ఆంధ్రాభిమానమునకు నిదర్శనము. లేని తురుష్కుల అరాజకత్వమును, ధర్మనిర్మూలనమును, జనపదనాశనమును చేర్చుట ఎఱ్ఱన సమకాలికసమాచారమునకు మూదల సమకాలికసమాచార మింకను కలదు.

"వనితాదుర్బలదీనబంధుజనసర్వస్వాపహారుల్ సుహృ
జ్జనమాతాపితృపుత్త్రిహంతలు యదృచ్ఛాశీలుర్ ధరన్
జనసంపూజితులై చరింతురు వినష్టశ్రీకులై విప్రులా
జనులం జేరి ప్రతిగ్రహించెద రవజ్ఞాపూర్వదుర్వి త్తముల్ 299 ప.

దేవతాయతనంబులున్ జగతీసురావసథంబులుం
బావనాశ్రమభూములుం జెడి పాడగున్ శుభవృక్షవ
ల్లీ వనంబులు నాశమొందుఁ గలిప్రచారమునందు దు
స్త్రీవిహారము మద్యపానముఁ జెల్లుఁ బెల్లుగ నెల్లెడన్."
305 ప. 4 ఆ.

ఇందలి వనితాదుర్బలదీనబంధుజనసర్వస్వాపహరణము, యదృచ్ఛాశీలము, విప్రశ్రీవినష్టము, అవజ్ఞాపూర్వదుర్విత్తప్రతిగ్రహము, దేవాలయ బ్రాహ్మణాగ్రహార విధ్వంసనము, మద్యపానమహావిజృంభణము సంస్కృతభారతములోని శ్లోకములను సంవదించునవి కావు. ప్రోలయనాయకుని విలసశాసనములోని శ్లోకములను సంవదించునవి. అది కాకతీయసామ్రాజ్యము తరుష్కాక్రాంతమైన నాటి స్థితి. కాకతీయసామ్రాజ్యపతనవృత్తాంతము కాకతీయసామ్రాజ్యమునందు సత్వరమే దావానలము వలె వ్యాపించునది పతనకాలము 1323 వ సంవత్సరము. పతనస్థితి ప్రతిఫలించిన అరణ్యపర్వశేషము రచనాకాలము 1325 ప్రాంతమగును.

అరణపర్వశేషము రచనాకాలము 1325 ప్రాంతము కావున, అది ప్రసక్తమైన నృసింహపురాణము రచనాకాలము 1330 ప్రాంతమగును.

## ప్రోలయవేమారెడ్డి ఆస్థానకవి అయిన కాలము

అరణ్యపర్వశేషమునందు ఎఱ్ఱనార్యుడు "గుడ్లూరు నెలవుగ గుణగరిష్ఠత నొప్పు ధన్యుఁడు" అని కలదుగావున అరణ్యపర్వశేషరచనాస్థలము గుడ్లూరు. అది నెల్లూరు జిల్లా కందుకూరు తాలూకాలోనిది. ఇప్పుడు ప్రకాశంజిల్లా ఒంగోలు తాలుకాలోనిదగును. నృసింహపురాణమునందు స్థలనిర్దేశము లేదు. కాని ఎఱ్ఱప్రెగడ "చెదల్వాడనిలయు"డని అతని వంశీయుడైన చెదలువాడ మల్లన విప్రనారాయణ చరిత్రమునందు కలదు. అరణ్యపర్వశేషము రచించిన తర్వాత ఎఱ్ఱన చెదలువాడ రావచ్చును. ఇది ప్రకాశంజిల్లా ఒంగోలు తాలూకాలోనిది. కావున

నృసింహపురాణ రచనాస్థలము చెదలువాడ కావచ్చును అద్దంకి రాజధానిగ ప్రోలయవేమారెడ్డి రెడ్డి రాజ్యమును స్థాపించినది 1324–25 వ సంవత్సరమునం దైనను, ప్రోలయవేమారెడ్డి శాసనములు 1330 వ సంవత్సరమునుండి కలవు.[27] రథినీనాథుడైన మల్లారెడ్డి కందుకూరుశాఖానగరాధిపతి అయిన కాలమును అదే కావచ్చును అంతేకాదు మల్లారెడ్డి చెదలువాడయందు రామలక్ష్మణప్రతిష్ఠ చేసి దేవాలయమును కట్టించిన కాలమును అదే కావచ్చును. అప్పటికే అరణ్యపర్వశేష, నృసింహపురాణములు రచించి లబ్ధప్రతిష్ఠుడైన ఎఱ్ఱన గుఱించి విని, అన్నగారి ఆస్థానమునందు ఉండదగిన కవి ఎఱ్ఱన అని గుర్తించి, మల్లారెడ్డి ఎఱ్ఱాప్రెగడను "ఎలమిం జేపట్టి, ఆతత శ్రీతోడన్ సముపేతుఁ జేసి, ప్రోలయవేమారెడ్డి ఆస్థానకవిని చేయుట సంభవము అరణ్యపర్వశేషమునైన రచింపని ఎఱ్ఱాప్రెగడను మల్లారెడ్డి "ఎలమిం జేపట్టి, ఆతత శ్రీతోడన్ సముపేతుఁ చేసి, ప్రోలయవేమారెడ్డి ఆస్థానకవిని చేయుట సంభవము కాదు కాబట్టి ఎఱ్ఱన ప్రోలయవేమారెడ్డి ఆస్థానకవి అయిన కాలమును 1330 ప్రాంతము కావచ్చును.

## హరివంశ రచనాకాలము

ఎఱ్ఱాప్రెగడ ప్రోలయవేమారెడ్డి ఆస్థానకవిగ రచించిన కృతులు రామాయణము, హరివంశము. రామాయణము తర్వాత రచించిన హరివంశము ప్రోలయవేమారెడ్డికి అంకితము ప్రోలయవేమారెడ్డి శ్రీశైలాహోబలక్షేత్రములందు సోపానములు కట్టించుట ప్రముఖసంఘటనము. అది ప్రోలయవేమారెడ్డి శాసనములందు మాత్రమే గాక శ్రీనాథుని హరవిలాసమునందును గ్రంథస్థమయినది.

"శ్రీ పర్వ తసోపాన
స్థాపకుఁడగు రెడ్డివేమజగతీపతికిన్–" 18ప. 1అ.
"శ్రీ పర్వత సోపాన
స్థాపక వేమక్షితీశ సామ్రాజ్యశ్రీ–" 1ప. 3అ.

ఇందు అహోబలక్షేత్ర సోపానవిషయము లేదుగాని శ్రీశైలసోపానవిషయము కలదు. అది కూడ హరివంశమునందు గ్రంథస్థము కాలేదు కావున హరివంశ రచనాకాలము ప్రోలయవేమారెడ్డి శ్రీశైలాహోబలక్షేత్రసోపాననిర్మాణము కంటె పూర్వము కావలయును. చీమకుర్తిశాసనమునందు శ్రీపర్వతాహోబలక్షేత్ర సోపాననిర్మాణవిషయము కలదుగాని, అది కూటశాసనము.[28] నిర్ధారకసాధనము

కాదు. ప్రోలయవేమారెడ్డి ముట్లూరు శాసనమునందు "శ్రీగిరి రహ్యహోబలగిరి స్యోపానమార్గాంకితో" అని కలదు [29] ఇది నిర్ధారకసాధనము. ముట్లూరు శాసన కాలము 1343వ సంవత్సరము. శ్రీశైలాహోబలక్షేత్రసోపాననిర్మాణము తత్సమీప పూర్వకాలికమగును. కాబట్టి హరివంశరచనాకాలము 1340 ప్రాంతమగును.

హరివంశరచనాకాలము 1340 ప్రాంతము కావున, అందు ప్రసక్తమైన రామాయణరచనాకాలము 1325 ప్రాంతము కావచ్చును.

ఎఱ్ఱాప్రెగడ ప్రోలయవేమారెడ్డి ఆస్థానకవిగ అద్దంకి నివాసి ఆస్థానకవిగ రచించిన రామాయణహరివంశముల రచనాస్థలమును అద్దంకియే.

నీలకంఠేశ్వరశతకము నీలకంఠేశ్వరునిపై చెప్పినది. నీలకంఠేశ్వరస్థానము గుడ్లూరు అని అరణ్యపర్వమునందు కలదు. కావున నీలకంఠేశ్వరశతక రచనా స్థలము గుడ్లూరే కావలయును.

గుడ్లూరునుండి చెదలువాడ, చెదలువాడనుండి అద్దంకి వచ్చిన ఎఱ్ఱన మఱల గుడ్లూరు వెళ్ళినట్లు ఆధారము లేదు. కొల్లూరు వెళ్ళినట్లు కొంత ఆధారము కలదు. కాబట్టి రచనాకాలములనుబట్టి మాత్రమేగాక, రచనాస్థలములనుబట్టి సహితము అరణ్య పర్వశేష, నృసింహపురాణముల జంట ముందు, రామాయణనృసింహ పురాణములజంట తర్వాత అగుట తథ్యము. అంతేకాదు. భారతములోని అరణ్య పర్వశేషమును రచింపకుండ, భారత పరాంశమైన హరివంశమును రచించుట కూడ సంగతము కాదు మొత్తము మీద నీలకంఠేశ్వరశతకము, అరణ్యపర్వశేషము, నృసింహపురాణము, రామాయణము, హరివంశము ఎఱ్ఱన కృతుల పౌర్వాపర్యము.

# నీలకంఠేశ్వర శతకము

ఎఱ్ఱన నీలకంఠేశ్వరశతకమును రచించినట్లు ఎఱ్ఱన ఉపలబ్ధకృతులందు లేదు. లక్షణగ్రంథములందు లేదు. సంకలన గ్రంథములందును లేదు. కాని ప్రాచ్య లిఖిత పుస్తకభాండాగారములోని సంకీర్ణపద్యముల తాళపత్రగ్రంథమునందు ఎఱ్ఱన రామాయణములోనివి కాదగు పద్యములందు, నీలకంఠేశ్వరశతకముదోనివగు క్రింది పద్యము కలదు.[31]

"నిను సేవించినఁ గల్గు మానవులకున్ వీటీవధూటీపటీ
ఘనకోటీశకటీకటీతటిపటీగందేభవాటీపటీ
రనటీహాటిపటీ సువర్ణమకుటీప్రచ్ఛోటికాపేటికల్
కనదామ్నాయమహాతురంగ! శివలింగా! నీలకంఠేశ్వరా!"

ఇది రామాయణములోని పద్యము కాదు. పద్యమునందు శతకపద్యసరణి కలదు. చతుర్థపాదము మొత్తముగాని, నీలకంఠేశ్వరా! అను తుదిసంబుద్ధిగాని మకుటము కాఁగలదు ఎఱ్ఱన నెలవైన గుడ్లూరు నీలకంఠేశ్వరస్థానము గుడ్లూరు లోని నీలకంఠేశ్వరుడు శంభుదాసుడైన ఎఱ్ఱనకు ఇష్టదైవమగును. కాఁబట్టి ఎఱ్ఱన రచించిన నీలకంఠేశ్వరశతకములోని పద్యము కావచ్చును పద్యమునందు శబ్ద వైచిత్రి ప్రబలముగా కలదు ప్రౌఢరచనమేగాని పరిణతరచనము కాదు. అరణ్య పర్వశేషముకంటె పూర్వరచనమగును.

# అరణ్యపర్వశేషము

"నన్నయభట్టి మహాకవీంద్రు సరససారస్వతాంశప్రశస్తి తన్నుఁ జెందుటయుఁ దత్కవితారీతియుఁ గొంత దోఁపఁ దద్రచనయ కా" ఎఱ్ఱన రచించిన అరణ్యపర్వశేషమునందు నన్నయ కవితారీతి కొంత తోచును నన్నయ స్వతంత్రాంధ్రీకరణపద్ధతిని అనుసరించియే, ఎఱ్ఱన అరణ్యపర్వశేషమును ఆంధ్రీకరించెను ప్రపంచీకరణములు, క్లుప్తీకరణములు అనాంధ్రీకరణములు కలవు. అంతే కాదు. నన్నయ అక్షరరమ్యత, తెనుగు నడికారము, సంస్కృతప్రౌఢి ఎఱ్ఱన అరణ్యపర్వశేషమునందు కలవు నన్నయ సమాసకుసుమావళి, సమానపద్యములు సహితము ఎఱ్ఱన అరణ్యపర్వశేషమునందు కలవు

1. **ప్రపంచీకరణము :** కర్ణుని అశ్వనదీప్రవాహమునందు విడిచిపెట్టి నపుడు కుంతి పుత్రశోకార్త, పుత్రదర్శనలాలస అయిన రోదించినట్లు మాత్రమే మూలమునందు కలదు

"రుదతీ పుత్రసోకార్తా నిశీథే కమలేక్షణా
ధాత్ర్యాసహపృథారాజన్ పుత్రదర్శనలాలసా" 23 శ్లో. 292 అ.

ఇది నిమిత్తముగ ఎఱ్ఱన కుంతి శోకమును ప్రపంచీకరించి ఏడు పద్యములు రచించెను. అందు,

"కొడుక నిన్నుఁ గాంచు కొఱఁతనోముల కాని
పెంచి గారవించి పేర్మి నీదు
ప్రోపుఁ గుడువఁగాంచు పుణ్యంబు దుదిముట్ట
నేల చేయనైతి నేను గుఱ్ఱ 342 వ.

నెఱయం బున్నమచందురుం జెనయు నీ నెమ్మోముసం దియ్యమై
చిఱున వ్వొప్పఁగఁ జూడనీక పులకల్ సెల్వొంద నిన్ గ్రుచ్చి య
క్కఱ దీఱం బొరి నక్కునం గరము వీఁకం జేర్ప నీ కిమ్మెయిన్
వఱదం ద్రోవఁగఁ జేసెనే యకట దైవం బెందుఁ జొత్తున్ సుతా. 343 వ.

ఎచట నున్ననైన నెల్లప్పుడును నిన్నుఁ
గన్నులారఁ జూడఁ గాంచుఁగాన
తనయ నిన్నుఁ గనిన తపనుండు గడుధన్యుఁ
డయ్యె మందభాగ్యనైతి నేను" 346 ప. 7 ఆ

అను పద్యములు కరుణరసనిర్భరములు. ఏడు పద్యములందును మాతృ హృదయక్షోభ మహాదయనీయముగ కలదు.

**ii క్షిప్తీకరణము :** మార్కండేయుడు ధర్మరాజునకు కలియుగధర్మములు చెప్పు ఘట్టము మూలములందు ప్రత్యేక మొక అధ్యాయము అందు శతాధికశ్లోకములు కలవు. ఆ ఘట్టమును ఎఱ్ఱన పాతిక పద్యగద్యములందు సంగ్రహించెను. శ్లోకానువాదము తక్కువ. సమకాలికసమాచారము సమధికము. అది పూర్వోదాహృతము

**iii అనాంధ్రీకరణము :** మూలమునందు ఇంద్రద్యుమ్నోపాఖ్యానమునకు దుంధుమారోపాఖ్యానమునకు మధ్య అన్నదానఫలము గుఱించి ఒక అధ్యాయము కలదు అందు శతాధికశ్లోకములు కలవు దానమహాత్మ్యమగుటను దానిని ఎఱ్ఱన తెనిగింపలేదు

**అక్షరరమ్యత :** అక్షరరమ్యత అనగా వర్ణవిన్యాసవక్రత అని పూర్వోక్తము.

"లలితగంభీరవిభూతి నేకమణికాఝంకారవిశ్లేషశో
షితపాథోధిపయస్కుఁడైన ముని దోఁచెం బుణ్యతేజోమయా

కృతి సయ్యామ్యధిగంతవీధిఁ బ్రకటక్రీడాకళాగర్వగ
ర్జితమండూకకళంకితాంబుశుచితాసిద్ధి ప్రదాచార్యుడై. 146 ప. 4 ఆ.

ఇందు ఖ,క,శ,ష, ప,క,గ,క, రేఫసంయుక్తముల విన్యాసవక్రత కలదు

"గిర్వాణప్రవిముక్తబాణపటల క్రీడావిలాసంబులై
గర్వోన్నద్ధసురారిశీర్షములు వీఁకన్ డల్లెఁ గల్పచ్ఛిదా
నిర్విద్ధాంబుదమండలోద్గతమహానిర్ఘాతపాతావధూ
తోర్వీభృద్ఘనగండశైలములతో నూహింపఁ దుల్యంబులై"
276 ప 5 ఆ,

ఇందు ప, ల, ర, చ, మ, త, ల వర్ణముల విన్యాసవక్రత కలదు

"ఘోరగదావిదారణవిఘూర్ణితశాత్రవకుంభికుంభకుం
భీరచిరోరుమౌక్తికగభీరతరారుణసాగరాంబుకే
ళీరసలోలుఁడై సమరలీలలకాంతకుఁ డేఁగుదేరఁ గ
న్నారఁగఁ జూచి కాక యిటు లంతకు నీ మది త్రుళ్ళడంగునే."
187 ప. 6 ఆ.

ఇందు ద, త, క, బిందుపూర్వక భ, ర, ల, క వర్ణముల విన్యాసవక్రత కలదు.

కనియెం గోమల నీలమేఘవిలసత్కాలాంజనాకారు ఘో
రనిశాతోత్కటదంష్ట్రి నుజ్జ్వలచలద్రక్తాక్షుఁ బ్రత్యగ్రకాం
చనవర్ణాంబరు నంత్యకాలదహన జ్వాలాప్రచండున్ జగ
జ్జనసంత్రాసను నొక్క దివ్యుఁ బటుపాత్రప్రౌఢహస్తోద్ధతున్.
217 ప. 7 ఆ,

ఇందు ల, క, త, ల, ల, జ, ప, త వర్ణముల విన్యాసవక్రత కలదు.

**తెనుగు నుడికారము :** ఒకటి రెండు సంస్కృత పదములు వినా తెలుగుపదములు, తెలుగు పలుకుబడి కలది తెనుగు నుడికారము నన్నయ భారతములోని "వాఁడిమయూఖముల్, క్రచ్చఱవేఁటవచ్చి" వంటి పద్యములు.

“ఎవ్వఁదాస వంబుజదళేక్షణ యేకత మిట్టులేల నీ
దివ్యనభూమియందుఁ జరయించెదు నావుడుఁ దండ్రి పంపునం
దివ్యనభూమియందుఁ జరయించెద సద్వ్రతఁ గోరి కన్య నే
నెవ్వఁదాసఁగావలయు నేర్పడఁ జెప్పుము రాజనందనా” 324ప. 4ఆ.

“హాలికుం డెంతయు నోజతో దునఁగ సీరాగ్రంబునం గోఁడి ప్రా
ణు లనేకంబులు సచ్చు హింస యది యౌనో కాదొ వేయేల మ
ర్త్యులు నేలం జరియించుచోఁ బదములం ద్రొక్కంబడుం బెక్కు జం
తులు హింసావిధ గా దసంగ వశమే దోషజ్ఞ యూహింపుమా”
57ప 5ఆ.

“పఱచున్ దవ్వుఁగఁ జేయలంతి నిలుచుం బట్టీక యాసాసలం
బెఱువోవుం బొదలందు డిందుఁ బొదయున్ బిట్టుల్కి వేఁ దాఁటు గ్ర
మ్మఱి చూచుం జెవి దాచ్చి నిల్చు మలయున్ మట్టాడుఁ గ్రోడాడు నే
మఱినట్లుండుఁ దృణంబు మేయు నలయున్ మాయామృగం బిమ్ములన్”
327ప. 6ఆ.

“కలిమియు రేమియున్ సతము గావవి సెందినచోఁ జెలంగుచుం
గలఁగుచు నున్కి ధీరుల ప్రకారమె లెస్సగ నింతపట్టు నేఁ
దెలియుదుఁ జెప్పెదన్ వసుమతీవర పిన్నయనంగనేల నే
కొలఁదియుఁగాదు ధీరమతి గూఁతురు పేర్కొనఁజాలఁ బెంపునన్.”
194ప. 7ఆ.

**సంస్కృతప్రౌఢి :** ఒకటి రెండు తెలుగు పదములు వినా సంస్కృత పదములు సమృద్ధమైన, సమాసభూయిష్ఠమైన రచనము సంస్కృతప్రౌఢి. నన్నయ భారతములోని “ఆతత మాచత”, “వివిధోత్తుంగ” పద్యముల వంటివి.

“అంబ నవాంబుజోజ్జ్వలకరాంబుజ శారదచంద్రచంద్రికా
డంబరచారుమూర్తి ప్రకటస్ఫుటభూషణరత్నదీపికా
చుంబితదిగ్విభాగ శ్రుతిసూక్తవివిక్తనిజప్రభావ భా
వాంబరవీథివిశ్రుతవిహారి ననుం గృపఁజూడు భారతీ.” 216ప 4ఆ.

“ఘనశస్త్రాస్త్రమహోజ్జ్వలంబు చతురంగవ్యాప్తభూమండలం
బు నితాంతోద్ధతఘోరఘోషబహుభేరీభూరికాహళాశాముఖం

బసరోధొద్ధతివేగ మృగదనుజేంద్రానీక మేతెంచె నీ
నుప నిశానముఘామరప్రతతిపై శుంభద్భుజారంభమై     269ప 5ఆ.

"శాతనఖాగ్రఖండితలసన్మదకుంజరకుంభము క్తము
క్తాతతశైలకందరగుహాంతరసుప్తమృగేంద్రకేసర
వ్రాతము పేడ్క నూచికొన వారక చేరుట గాదె క్రోధని
ర్ఘాతమహోగ్రభీముః జెనకం చలపోయుట నీకు నెమ్మెయి౯"
176ప. 6ఆ.

"జననాథోత్తమ యేను బూని భవదాజ్ఞాలీల చెల్వొందు మ
జ్జనకుండైన సమీరదేవు కృపయు౯ సత్త్వోన్నతుం జేయఁగా
ఘనవాస్తుంగతరంగసంగతమహాగ్రాహోరగాత్యుగ్రద
ర్శనమై పేర్చు పయోధి దాఁటితి జనాశ్చర్యైకసంపాదినై." 25ప. 7ఆ.

**సమానకుసుమావళి :** నన్నయ పదబంధములను, సమాసములను అలతిమార్పున గాని అట్లేగాని బింబప్రతిబింబాకారసంవాదముగ ప్రయోగించుట.

"ధర్మయుక్తి" (257ప 6ఆ ఆ ప) నన్నయ "సత్యయుక్తి" (155ప. 4ఆ అర. ప.) ఎఱ్ఱన "శరదిందుచంద్రికారాజితసర్వలోకుఁడు" (3ప 1ఆ. ఆ. ప.) "శారదచంద్రచంద్రికాడంబరమూర్తి" (216ప.4ఆ అర ప) ఎఱ్ఱన "పాలిత దుర్గయుండు" (22ప 2ఆ స ప) నన్నయ "పాలితశౌర్యులు (345ప 5ఆ.అర. ప.) ఎఱ్ఱన. "విపరీతప్రతిభాషలు" (90ప. 4ఆ ఆ ప.)- నన్నయ. "విపరీతస్థితి (406ప.5ఆ.)-ఎఱ్ఱన కూడ ఇది పద్యము ఎత్తుగడ "ఉద్ధతమదాంధీభూతవిద్వేషి–" (78ప 1ఆ 1ఆ ఆ ప) నన్నయ" "ఉద్ధతమదాంధీభూతులై" (384ప. 6ఆ. అర ప) ఎఱ్ఱన, "నీలగిరీంద్ర శృంగమున (239ప. 4ఆ ఆ. ప.) . నన్నయ. "విస్ఫారసితాద్రిశృంగమున" (398ప 6ఆ. అర. ప) – ఎఱ్ఱన "లాలితరూప యౌవనవిలాసవిభాసినులు" (214ప. 4ఆ. ఆ. ప.) – నన్నయ "లాలితయౌవనో జ్జ్వలవిలాసములు" (345ప. 7ఆ అర. ప.) ఎఱ్ఱన "తుంగతరంగసంగత"– (232ప 8ఆ ఆ ప)- నన్నయ. "తుంగతరంగానుషంగపశత" (350ప. 7ఆ. అర. ప.) ఎఱ్ఱన

**సమాన పద్యము :** శిశుపాలుని సేనాపతి సునీథుడు యుద్ధసన్నద్ధుడైన సమయమున పాండవ సైన్య సంక్షోభమును నన్నయ వర్ణించిన పద్యమిది .

"రయవిచలత్తురంగమతరంగములన్ మదనాగనక్రసం
చయముల సంచలచ్చటులసైనిక మత్స్యములన్ భయంకరం
బయి యదువృష్ణిభోజకుకురాంధకవాహినియుం గలంగె ని
ర్దయతర రోషమారుతనితాంతసమీరితమై క్షణంబునన్."

హరి. పూ. 2ఆ. స. ప.

దుర్యోధనుడు ప్రాయోపవేశము మాని హస్తినాపురమునకు బయలుచేరి నపుడు, కౌరవసైన్యసంచలనమును ఎఱ్ఱన వర్ణించిన పద్యమిది

"రయవిచలత్తురంగమతరంగములన్ మదనాగనక్రసం
చయములఁ జంచలచ్చటులసైనికమత్స్యములన్ మహోన్నతం
బయి కురురాజచంద్రు నుదయంబునఁ దద్దయుఁ బొంగెఁ బ్రస్ఫుర
ద్భయదమనోహరప్రకటభంగులఁ దద్భటవార్ధి యుద్ధతిన్."

58 ప 6 ఆ.

ఇందు పూర్వార్ధము సమానము. ఉత్తరార్ధము భిన్నము పూర్వార్ధమునందు "భయంకరంబయి" అను మాటకు "మహోన్నతంబయి" అను మార్పు ప్రకరణానుగుణము ఇది ఎఱ్ఱన "తత్కవితారీతియుఁ గొంత దోఁప" మాత్రమేగాక, "తద్రచనయకా నారణ్యపర్వశేషము పూరించె" ననుటకును నిదర్శనము

# నృసింహపురాణము

ఇది స్వతంత్రకావ్యము. ఎఱ్ఱన నామకరణము లక్ష్మీనరసింహావతారము. ఇతరుల నామకరణము నృసింహపురాణము. తాత ఎఱపోతసూరి కనిపించినది ధ్యానమునందని ఎఱ్ఱన స్వవచనము. స్వప్నమునందని ఇతరుల ప్రవచనము ఇది ప్రమాదభరితము అది భ్రమోత్పాదకము పురాణమను అపోహకు పునాది ఎఱ్ఱన అవతారికయందు "శ్రీనరసింహావతారము" అని (27 వచ) ఆశ్వాసాంతగద్యలందు "లక్ష్మీనరసింహావతారము" అని కలదు అంతేకాదు ఎఱ్ఱన ధ్యానసమాధికి హేతువు "మహాప్రబంధకల్పనాకుతూహలము" (14 వచ) ధ్యానసమాధిలో ఎఱ్ఱన క్షణమున్న సమయమున ఎఱ్ఱన భావమునందు ఆవిర్భావమునందిన (14, 6 వచ.) అతని తాత ఎఱపోతసూరి ఆదేశము జగద్ధితమైన కృతిరచనము.

"కావున బ్రబంధరచనా
ప్రావీణ్యము నీకు సహజపరిణతసిద్ధం
బై వెలసినయది యొక కృతి
గావింప జగద్ధితంబుగా నే బనుతున్ " 20 ప పీ

ప్రబంధరచనాప్రవీణుని జగద్ధితమైన కృతి ప్రబంధమే ఎఱ్ఱన నిశ్చయము కూడ ప్రబంధరచనమే. ప్రబంధమన కావ్యము

"ఇది యాశ్వరానుశాసన
ముదయోన్ముఖమయ్యె నాకు నూర్జితశుభసం
పద నొనరంతు బ్రబంధము
సదయనృసింహావతారసంస్తవసరణిన్ " 23 ప. పీ

నృసింహావతారసంస్తవసరణిని ఎఱ్ఱన రచించిన లక్ష్మీనరసింహావతారము ప్రబంధము. నృసింహపురాణమన పురాణోక్తమైన నృసింహావతారకథ మాత్రమే లక్ష్మీనరసింహావతారమన నృసింహావతారకథ మాత్రమే కాదు, లక్ష్మీదేవి కథ కూడ. లక్ష్మీదేవి దేవతగ, నృసింహస్వామి దేవునిగ ఒక క్షేత్రము కలదు. అహో బలక్షేత్రము నృసింహస్వామి హిరణ్యకశిపుని సంహరించినది అహోబలక్షేత్రము నందే అని గ్రంథమునందు కలదు అహోబలక్షేత్రదైవమైన నృసింహస్వామి అవతారమును క్షేత్రమహాత్మ్యమును రచింపుమనియే ఎఱపోతసూరి ఆదేశము

"శ్రీమదహోబలేశనరసింహుడు నా ప్రియదైవతంబు, మ
త్స్వామి, తదీయతీర్థవిభవంబును దన్మహితావతారమున్
నీ మధురోక్తిగుంభన మనీషులు మెచ్చగ బ్రస్తుతింపు నీ
కేమియు సంభవించు సఫలేప్సితపుణ్యఫలోదయోన్నతుల్ "
21 ప పీ.

నృసింహావతారసంస్తవసరణిని అహోబలక్షేత్రమాహాత్మ్యమును ప్రతి పాదించిన లక్ష్మీనరసింహావతారము స్వతంత్రకావ్యము మాత్రమేగాక, క్షేత్ర మాహాత్మ్యప్రతిపాదకకావ్యము కూడ. అంతేకాదు ఆంధ్రసాహిత్యమునందు ఆదిమ క్షేత్ర మాహాత్మ్యకావ్యము.

ఎఱ్ఱన అవతారికయందు "బ్రహ్మాండాదిపురాణోక్తంబయిన శ్రీనరసింహావతారంబను పురాణంబు దెనుంగు బాసఁ బ్రకటింపవలయు"నని కలదు. (27 వచ పీ) అంతేకాదు. కథాప్రారంభమునందు "బ్రహ్మాండపురాణంబునఁ దీర్ఘభాగశ్రవణంబు సేయు సమయంబున" అని కూడ కలదు (1 వచ 1 ఆ.) ఎఱ్ఱన తెలుగు భాషలో ప్రకటింపవలయునన్న శ్రీనరసింహావతారమను పురాణము ప్రత్యేకపురాణము కాదు పురాణకథ మాత్రమే "లక్ష్మీనరసింహావతారంబను పురాణకథకు" అని కూడ కలదు (1 వచ 1 ఆ) బ్రహ్మాండపురాణమునందు నరసింహావతారకథ దిఙ్మాత్రముగ కలదు హరివంశమునందును అంతే విష్ణు భాగవతపురాణములందు వివరముగ కలదు అది నృసింహావతారకథయే గాని, లక్ష్మీదేవికథ, అహోబలక్షేత్రవిషయము కాదు అహోబలక్షేత్రవిషయము స్కాందపురాణములోని శ్రీశైలఖండమునందు కలదు నృసింహస్వామి హిరణ్యాకశిపుని సంహరించినది అహోబలక్షేత్రమునందే అని కలదు అహోబలక్షేత్రనామకరణమును కలదు. అది ఎఱ్ఱన లక్ష్మీనరసింహావతారమునందును అట్లే కలదు లక్ష్మీదేవి కథ లేదు ఆమె క్షేత్రదేవత అగుటవలన ఎఱ్ఱన స్వతంత్రకల్పనము కావచ్చును బ్రహ్మాండాదిపురాణములలోని నరసింహావతారకథకు ఎఱ్ఱన నృసింహావతారసంస్తవము ఆంధ్రీకరణము కాదు అనుసరణము. కాఁబట్టి స్వతంత్రకావ్యము వర్ణనాభూయిష్ఠము,

ప్రథమాశ్వాసమునందు ప్రధానముగా క్షీరాబ్ధివర్ణనము, శ్వేతద్వీపవర్ణనము, వైకుంఠపురవర్ణనము, కావ్యనాయికానాయకులైన లక్ష్మీనారాయణులవర్ణనము కలవు. పురవర్ణనమునందు పునర్జన్మరహితుల, పుణ్యభామినుల, పుష్పవనముల, కమలాకరముల, మందానిలముల వర్ణనము కలదు సనకసనందాదిమునులవలన జయవిజయులు శాపగ్రస్తులగుట సంగ్రహముగ కలదు ద్వితీయాశ్వాసమునందు ప్రతినాయకుడైన హిరణ్యకశిపుడు తపస్సు చేయుట, ఇంద్రుడు తపోభంగము కలిగించుటకు తిలోత్తమాద్యప్సరసలను పంపుట, వారితోపాటు వసంతుడును వచ్చుట, అయినను తపోభంగము కలిగింపలేకపోవుట, బ్రహ్మ ప్రత్యక్షమై హిరణ్యకశిపునికి వరములిచ్చుట, హిరణ్యకశిపుడు లోకేశ్వరుడై దేవతలను బాధించుట కలదు. హిరణ్యకశిపుని తపోవిధానము నందు, వసంతాగమనమునందు, దేవతాపీడనము నందును కాళిదాసు కుమారసంభవము ప్రభావము కలదు.

కాళిదాసు కుమారసంభవమునందు అకాలవసంతోదయవర్ణనము సుప్రసిద్ధము అందు ఆరంభిసిన, అరుణారుణములైన, నెలవంకల పంటి మోదుగమొగ్గలు వసంతసమాగమమువలని వనకుమారి నఖక్షతముల వలె కలదని ఒక శ్లోకము కలదు ఆ శ్లోకమిది.

"బాలేన్దువక్రా ణ్యవికాసభావా ద్బభుః పలాశా న్యతిలోహితాని
సద్యో వసన్తేన సమాగతానాం నఖక్షతానీవ వనస్థలీనామ్" 29శ్లో 3.స.

ఇది కుమారసంభవమునందు శృంగారరసమునకు ఉద్దీపనవిభావము లక్ష్మీ నరసింహావతారమునందు భయానకరసమునకు ఉద్దీపనవిభావముగ ఇట్లుకలదు

"సరసకింశుకకోరకసంచయంబు
చెలువు తిలకించె భావిన్నృసింహదేవు
దీర్ఘనఖపంక్తి ప్రకటదైతేయరుధిర
సేకరుచి నొప్పు తెఱంగు సూచించునట్లు." 63ప.2ఆ

కాళిదాసు కుమారసంభవమునందు సూర్యుడు, చంద్రుడు, వాయువు, వసువుడు, వాసుకి, ఇంద్రుడు తమంత తాము తారకాసురుని సేవించినట్లు కలదు (32–39శ్లో 2స) లక్ష్మీనరసింహావతారమునందు హిరణ్యకశిపుడు సూర్యుని, చంద్రుని, వాయువును, అగ్నిని, వేదములను, ఇతిహాసపురాణములను ఆజ్ఞాపించినట్లు కలదు.

"భానుఁ బిల్వించి నా పంపునఁ బాయని
తెరువరివై మీఁదఁ దిరుగుమనియెఁ
చంద్రునిఁ పిలిచి నా శాసనంబున జగం
బున నెల్లనోషధుల్ ప్రోవుమనియె
అనిలునిఁ పిలిచి నాయాజ్ఞఁ బ్రాణుల కెల్ల
వలయు ప్రాణంబవై మెలఁగు మనియె
అనలునిఁ బిలిచి నా యానతియందుస
పాకాదిక మ్మొాజ పఱుపుమనియెఁ

వన చరిత్రంబె వర్ణింపఁబనిచె బహువి
ధేతిహాసపురాణార్థజాతినెల్లఁ
దన్ను వినుతింపఁ బనిచె వేదములనెల్ల
దైత్యనాయకుఁ డవిల విధాయకుండు." 130.ప 2ఆ

తృతీయాశ్వాసమునందు ఇంద్రాదిదేవతలు దర్శించిన క్షీరాబ్ధివర్ణనము, శేష సభామంటపవర్ణనము, ఇంద్రాదిదేవతల విష్ణుస్తోత్రము, మొఱ, విష్ణువు అభయ హస్తప్రదానము, హిరణ్యకశిపుని రాజ్యపాలనము, గ్రీష్మర్తువర్ణనము, హిరణ్యకశి పుని వనవిహారము చంద్రోదయవర్ణనము మధుపానగోష్ఠీవర్ణనము, చంద్రాస్తమయ వర్ణనము, సూర్యోదయవర్ణనము, ప్రహ్లాదకుమారోదయవర్ణనము కలవు. ఇంద్రాది దేవతల విష్ణుస్తోత్రము ఇరువది యేడు పద్యములందు కలదు (17ప–44ప 3ఆ) అదొక తారావళి నక్షత్రమాల అందు మత్స్య, కూర్మ, వరాహావతారవర్ణనము కలదు ఒక పద్యము పోతనకు ఒరవడి.

"ఎన్నంజాలు భవన్మహత్త్వము భవద్విజ్ఞానసద్గోష్ఠియం
దున్నంజాలు భవద్పదాంబురుహసేవోత్సాహసంపన్నులం
గన్నంజాలు భవత్సమంచితజగత్కల్యాణనామంబుఁ జే
ర్కొన్నఁ జాలు నరుండు శాశ్వతసుఖారూఢుండు లక్ష్మీశ్వరా"
20ప. 3ఆ.

చంద్రోదయ వర్ణనమునందు కళంకవర్ణనము కళాంకము.

"వెన్నెలవెల్లి పాల్కడలి వ్రేకదనంబునఁ బేర్చి దిక్కులున్
మిన్నును ముంప నందు రజనీకరబింబము కుండలీభవ
త్పన్నగతల్పకల్పనము భంగిఁ దనర్చె దతంరంబునన్
వెన్నుని భంగిఁ జూడ్కులకు వేడ్క యొనర్చెఁ గలంక మత్తఱిన్"
87ప 3ఆ.

"వెన్నెల వెల్లపచ్చడము విచ్చిన యంబరశయ్య మీఁదఁ బే
రన్నువనుండి దిగ్వనితలాదటఁ జుట్టను గొల్వ రాత్రియన్
కన్నియఁ గూర్మి చిక్కఁ దన కౌఁగిటఁ జేర్చి సుఖించినాఁడనన్
జెన్ను వహించెఁ జందురుఁడు శ్రీ కమనీయకళంకరేఖతోన్."89ప.7ఆ.

మధుపానగోష్ఠిలోని మధురవర్ణన :

"ఆ రమణుల మదిరారస
పూరితచషకములఁ దోఁచుఁ పూర్ణేందుఁడు పొ
ల్పారెను వాసనకై క
ర్పూరంపుంబల్కు లిడిన పోలిక యమరన్" ౧౬ప. ౩ఆ

అప్సరోంగనాసహితుడై హిరణ్యకశిపుడు మధుపానము చేసినట్లు విష్ణు పురాణమునందు కలదు. అంతఃపురాంగనాసహితుడై హిరణ్యకశిపుడు మధుపాన గోష్ఠి సలిపినట్లు ఎఱ్ఱన వర్ణన.

చతుర్థాశ్వాసమునందు ప్రహ్లాదచరిత్రము కలదు. ఇది విష్ణు భాగవత పురాణములను సంవదించునది. భాగవతానుసరణము కంటె విష్ణుపురాణానుసరణమే అధికము హిరణ్యకశిపుడు తొలిసారి ప్రహ్లాదుని అభ్యస్తవిద్యను పరీక్షించుటకు చదివిన విద్యాసారమును తెలుపు సుభాషితమును చెప్పుమని, మలిసారి పద్యము చదువుమని ప్రశ్నించినట్లు విష్ణుపురాణమునందు కలదు భాగవతమునందు లేదు ఎఱ్ఱన లక్ష్మీనరసింహావతారమునందు మలిసారి పద్యమును చదువుమని ప్రశ్నించి నట్లు లేదుగాని, రెండుసారులును సుభాషితమును చెప్పుమని ప్రశ్నించినట్లు కలదు. తొలిసారి ప్రశ్నమిది :

"పాపఁడ యింతకాలమును బాయక యొజ్జయొద్ద నుండి నీ
వె పగిదిన్ బఠించి తది యేర్పడఁ బ్రస్ఫురితార్థసారమై
లీపులు వీనులం గురియ దివ్యసుభాషితరత్న మొక్కటు
ద్దీపితధీవిజృంభణవిధేయత యొప్ప నుపన్యసింపుమా" ౫ప ౪ఆ.

ఇందు పద్యమని లేదు గాని ప్రస్ఫురితార్థసారమైన, కర్ణరసాయనమైన దివ్య సుభాషితరత్నము పద్యమే అగును ఇది "చోద్యం బయ్యెడి నింతకాల మఁగెఱ" అను పోతన పద్యమునకు పల్లవి.

హిరణ్యకశిపుడు ప్రహ్లాదుని హింసించునపుడు సముద్రములోను పడవైచి నట్లు భాగవతమునందు కలదు సముద్రములో పడవైచుట మాత్రమేగాక పైకి లేచి రాకుండ పైన పర్వతములను పడవైచినట్లును విష్ణుపురాణమునందు కలదు ఇది ఎఱ్ఱన లక్ష్మీనరసింహావతారమునందును కలదు. ఇచట,

"వీపున నబ్ధి నొక్క పృథివీధరమున్ దగఁ దాల్చెనంచు ల
క్ష్మీపతి పేర్మి సాలఁ గడుఁ జిట్టలుగా శ్రుతు లుగ్గడించు నీ
రూపునఁ గోటిసంఖ్యల గిరుల్ ధరియించిన విష్ణుదాసు పెం
పే పగిది న్నుతించునొకొ యింకని పెక్కసమందె లోకముల్"
181ప. 4ఆ.

అను ఎఱ్ఱన పద్యము లీలాశుకుని కృష్ణకర్ణామృతములోని "ఉర్వ్యాంకోఽపి" అను శ్లోకమును స్ఫురింపఁజేయును

పంచమాశ్వాసమునందు ప్రహ్లాదచరిత్రము తరువాతి భాగము, అహోబల క్షేత్రమాహాత్మ్యము కలవు నృసింహస్వామి స్తంభమునందు ఆవిర్భవించుట విష్ణుపురాణమునందు లేదు భాగవతమునందే కలదు. ఎఱ్ఱన లక్ష్మీనరసింహావతారమునందు కలదు అందు స్వతంత్ర రచనయును అధికముగ కలదు

"వాసుదేవుని పాదవనరుహంబుల భక్తి
తగదను తండ్రియుఁ దండ్రి గాఁడు
వేదచోదితమైన విష్ణుధర్మమునకుఁ
గోపించు గురుఁడును గురుఁడు గాఁడు
భవదుఃఖములు మాన్పఁ బ్రభువైన హరిసేవ
నెడలించు హితుఁడును హితుఁడు గాఁడు
పరయోగమతమగు వైష్ణవజ్ఞానంబు
వదలిన చదువును జదువుగాదు

కేశవాకారలీలలు గీలుకొని ము
దంబుఁ బొందని తలఁపును దలఁపు గాదు
మాధవస్తోత్రఘనసుధామధురరుచులఁ
జిలుక కుండెడు జిహ్వయు జిహ్వ గాదు" 22ప 5ఆ.

"ఊషరబీజముల్ భసితయోజ్యఘృతంబులు షండకన్యకా
న్వేషణముల్ పయోధిగతవృష్టితతుల్ మృగతృష్ణికాంబుగం
డూషలు దుర్గకాననకరోరితచంద్రిక లేడ మూకస
ద్భాషలు విష్ణుమంగళకథావిముఖాత్ముల దుష్టజన్మముల్" 24ప. 5ఆ.

అను ఎఱ్ఱన పద్యములు, "కమలాక్షు నర్చించు కరములు కరములు" (168ప 7స్కం.] "అంధేందూదయముల్" [167ప. 7స్కం.] అను పోతన పద్యములకు అద్యప్రకృతులు

ఎఱ్ఱన స్తంభోద్భవచనము [82వచ. 5ఆ], పోతన స్తంభావిర్భావవచనమునకు ఒజ్జయంతి. [285 వచ 7స్కం]

స్తంభమునందు ఉద్భవించిన నృసింహస్వామి హిరణ్యకశిపుని పొదివి పట్టుకొని మహాశైలమునందు అవతరించి [98వచ], "భీషణోజ్జ్వలవికటస్ఫురత్కులిశశాతనఖాంకురతీవ్రపాతనంబుల నసురేంద్రుడు పేరురము బొల్పు జించి కలంచి శోణితంబుల దొరగించె"ను. [100ప.] అప్పుడు దేవతలు, మునులు "అహోబల" అనుచు ప్రశంసించుటవలన ఆ మహాశైలమునకు అహోబలమను పేరు వచ్చెను. [122వచ] అందు నృసింహస్వామి అధివసించెను. [122వచ] "నరసింహపదాంబుజసేవఁగోరి మందాకిని" వచ్చి "భవనాశిని" అను పేరు వడసెను. [123ప 124వచ] అచట ఉద్యానవనము వెలసెను. [124వచ] ఆదిలక్ష్మి అరుగుదెంచెను [125 ప.] మహాలక్ష్మీనివాసమై ఉద్యానవనము లక్ష్మీ వనమను పేరు పొందెను. పరమభాగవతులు వచ్చిరి. [134వచ] అహోబలనృసింహస్వామికి చంద్రుడు తెల్లగొడుగు పట్టెను. [135ప] వరుణవాయుదేవులు ఇరుదెసల వెలసిరి. [136ప] వైనతేయుడు భక్తుడయ్యెను [137ప.] వసంతోత్సవము అహోబలనృసింహస్వామికి అభిమతమయ్యెను. [171వచ.] ఇవి స్థానిక విశేషములు స్థానిక ప్రకృతిచిత్రణము లేదుగాని స్థానికస ంచారము కలదు. నృసింహావతారపురాణకథ అహోబలక్షేత్రమాహాత్మ్యమునకు పురస్కారము. పురాణకథాపురస్కారము క్షేత్రమాహాత్మ్యకావ్యమునకు ముఖ్యము. ఇట్లు నృసింహపురాణమని వ్యవహారప్రసిద్ధమైన లక్ష్మీనరసింహావతారము స్వతంత్రకావ్యము. క్షేత్రమాహాత్మ్యకావ్యమును

## రామాయణము

"చేతోమోద మెలర్ప రామకథ మున్ జెప్పించి యత్యుత్తమఖ్యాతిం జెందితి" నని [39ప 1ఆ. పూ భా] ప్రోలయవేమారెడ్డి అనుటయేగాక, కూచిమంచి తిమ్మకవి సర్వలక్షణసారసంగ్రహమునందు తొమ్మిది పద్యములు, గణపరపు వేంకటకవి ఆంధ్రప్రయోగరత్నాకరమునందు మఱొక మూడు పద్యములు ఎఱ్ఱా ప్రెగడ రామాయణమునుండి ఉదాహరింపబడినవి. ఉభయులును ఎఱ్ఱాప్రెగడ

సంక్షేపరామాయణమనిరి అది నిజమైన అత్యుత్తమ ఖ్యాతింజెందితినని ప్రోలయ వేమారెడ్డి అనుట పొసగదు ఎఱ్ఱన రామాయణములోని పద్యములు భాస్కర రామాయణమునందు చేరినవి. అట్లు చేరిన పద్యములు వదలివైచి, సంగ్రహించిన సంక్షేపరామాయణము లాక్షణికు లిద్దఱి కాలమునకు సిద్ధమయ్యెనేమో. ప్రాచ్య లిఖితపుస్తక భాండాగారములోని సంకీర్ణపద్యముల తాళపత్రగ్రంథమునందు ఎఱ్ఱన రామాయణములోనివి కాదగు పద్యములు ఇరువదియేడు కలవు [32] ఇతరత్ర మూడు పద్యములు లభించినవి తిమ్మకవి ఉదాహరించిన పద్యములు బాలకాండము లోనివి తాళపత్రగ్రంథములోని పద్యములు యుద్ధకాండములోనివి. కాఁబట్టి ఎఱ్ఱన రామాయణము సమగ్రమైన పూర్వరామాయణమగును.

సంకీర్ణపద్యముల తాళపత్రగ్రంథములోని,

"కందక గాజువాజిక మొగంబు వికాసముఁ జెందెఁ జేతు లీ
యందములైన కాళ్ళు నరుణాంబురుహంబుల లీలఁ జూడఁ జె
న్నొందెడు జీవహీను లిటు లుండరు ప్రాణముతోడ నున్న వాఁ
డిందు సహోదరుండు ధరణీశ్వర! నీకు విషాదమేటికెన్"

అను పద్యము శ్రీనాథుని హరవిలాసములోని "కందక గాజువాజిక వికాసము దప్పక" అను పద్యమునకు [1 ఆ. 2ఆ] మార్గదర్శకముగ కలదు. ప్రకరణములు మాత్రము భిన్నములు ఇట్లు శ్రీనాథుని కాలమునందు నిక్షేపమైన; కూచిమంచి తిమ్మకవి, గణపవరపు వేంకటకవి కాలములందు సంక్షేపమైన ఎఱ్ఱాప్రెగడ రామాయణమునకు ఇంద్రద్యుమ్నుని కీర్తిపతాక వలె కతిపయపద్యావళి వినా కావ్యము మొత్తము లభింపకపోవుట ఆంధ్ర సరస్వతి దురదృష్టము

# హరివంశము

హరివంశము ప్రబంధము, పురాణము, మహేతిహాసమును అని ఎఱ్ఱన హరివంశమునందు కలదు

"జగదర్చితంబగు ప్రబంధంబు నిర్మింప నుపక్రమించితి." 44వచ.
"ఇప్పురాణము ప్రశంసింపంగ నిట్లొప్పునే" 46ప.
"ఇమ్మహేతిహాసమున" 47ప 1ఆ.పూ భా.

హరివంశము భారతపరాంశము. (40ప) భారతము మహేతిహాసము కాఁబట్టి హరివంశమును మహేతిహాసమే. హరివంశమునందు ఆదిసృష్టి (1ఆ పూ భా) మన్వంతర విషయము (1ఆ పూ.భా) వైవస్వతమనువంశవివరణము (2ఆ.పూ.భా) సోమాన్వయక్రమము (3 ఆ పూ భా) జనమేజయవంశవృత్తాంతము [9ఆ ఉ.భా] కలవు. అవి సర్గమన్వంతరవంశవంశానుచరితములు. ప్రతిసర్గము లేదు పురాణ పంచలక్షణములందు నాలుగు లక్షణములు కలవు కాఁబట్టి హరివంశము పురాణమే. ప్రోలయవేమారెడ్డి ఎఱ్ఱనను హరివంశమును రచింపుమనుటకు హేతువు తాను కావ్యామృతాస్వాదమునందు తనియకపోవుట [39ప.1ఆ] ఎఱ్ఱన నిర్మించుటకు ఉపక్రమించినది ప్రబంధము— అంతేకాదు హరివంశములోని ప్రధానేతివృత్తము 'వెన్నునివృత్తము' [42ప 'ఆ పూ భా] పూర్వభాగమునందు అయి దాశ్వాసములు, ఉత్తరభాగమునందు పది అశ్వాసములు వెన్నుని వృత్తమే పదియేనాశ్వాసము లందును పదమూడాశ్వాసములు కృష్ణని వృత్తాంతమే అది కావ్యసరణిని కలదు కాఁబట్టి ఎఱ్ఱన హరివంశము ప్రబంధమే కావ్యమే

ఎఱ్ఱన హరివంశమునందు శ్రీకృష్ణని బాలక్రీడాభివర్ణనము అమూలకము. బాలకృష్ణని నవనీతచోరకళలు కర్ణరసాయనము యశోదకు గోపికల నివేదనము కన్నుల పండుగ గోపబాలుర గోపాలన, జలక్రీడలు నిసర్గరమణీయములు. బాల కృష్ణని నవనీతచోరకళలందు ముగ్ధమనోహరములైన పద్యములు:

"ముదముతోఁ గడ్పునకుఁ బెట్టి మూతిజిడ్డు
మోమునను మేనఁ జమరి యమ్ముదిత ముక్కు
గలయ నిమిరి యేనుఁగు దిన్న వెలఁగపండు
నాఁగ నొప్పుఁ గృష్ణుఁడు చాఱునయనుఁ డగుచు" 197ప.

"పసఁడులఁ జట్ల మూతి యిడి పాలును నేయియుఁ బుక్కిలించి యుం
దొనుకుమ దోయిలించి కరతోయరుహంబులఁ జల్లి మంటిలో
నెనయఁగఁ ద్రొక్కి త్రొక్కి ధవళేక్షణరోచు లెలర్ప నాడు నె
వ్వనికిని మాన్పరాక యదువంశకుమారుఁ డుదారచేష్టలన్" 205ప.

"క్షీరాంభోధి మథించి తాను గృపతో గీర్వాణకోటిన్ సుధా
పూరప్రీతగఁ జేసినట్టి చెలువంబుం జూపు నట్టింపుగా

నారంగాఁగిన పాలమీగడలు హస్తాబ్జంబులం దేవి లీ
లారమ్యంబుగఁ దోడి బాలురకు నెల్లంబెట్టి తానుంగొనున్."    207ప.

ఏ.ఆ.పూ.భా.

యశోదకు గోపికలు కృష్ణుని ఆగడములు నివేదనము సేయునెడ ఒక నాతి "అనునెడ నొక్క ప్రేత యన్నాతి ముందరికి వచ్చి "(214వచ.) "పలుక నలుక తోడ గోపికయొత్తు నర్తించు విధంబునఁ జేతులు సాఁచుచుం గృష్ణుఁ ససిం గదిసి" [218వచ] "అనుచుండ మఱియొక్క యతివ యాగ్రహమున నించుకఁ ద్రోచి కొం చరుగుదెంచి" [221ప.] "అనియె నట్టియెడ నొర్తు పెలుచని యెలుంగున (223వ.చ ) "అనఁగ వేఱొక్క గొల్లత" (226ప ) "నావుఁడు నొర్తు" [228ప ] యశోదను అధిక్షేపించు విధము సహజదృశ్యమును సాక్షాత్కరింపఁజేయును. ఓపికలు సడలిన గోపికల అభియోగములును సహజాభిరామములు

"గోతి నీవకా గారాబుకొడుకుఁ గంది
వేము పడుపాటు లరయవ యెట్టి బలియు
రైనఁ దగవు పాడింపరే యకట కృష్ణుఁ
జిన్నవాఁడని నమ్మియ మిన్నకునికి "    212ప.

"అసురయొ కాక నీ తనయుఁ డంగన యేఁబది బానలందుఁ బొ
ల్పెసఁగెడు వెన్న యుట్లపయి నేఁ బదిలంబుగ డించియుండ వె
క్కసముగ మ్రింగె బానలను గ్రమ్మనఁ గూలఁగఁ ద్రోచె నుట్లులు
స్వస నుఱుమాడె నేమిగతి వ్రేఁగుఁదు నెక్కడఁజొత్తుఁ జెప్పుమా."
217ప.

"ఓవరిలోన గొందిదెస నున్నవి యెన్నియొ యెన్నఁ బెద్ద భాం
డావళి దాళముం దలుపు నావలఁ బోఁ బడ పెటె చొచ్చె మా
యావి భవత్సుతుండు వెస నంతన యేనును బాఱుదెంచితం
ద్రావెనొ యేమి సేసెనొ ఘృతం బొక బొట్టును లేదు లోపలన్."
219ప.

"కలయఁగఁ బాలు పిండి పులకండము వెన్నయు బెట్టి యట్టులై
యల్లవడ వండితిం బలియు నాత్మజులుం బ్రియపడ్డ నాలుగే

నలకుల చొంతి డించి యవియన్నియు నుగ్మరి నీ తనూజుఁ డొ
ప్పులవడ మ్రింగెఁ జోద్యమది భూతము లున్నవి గాక కద్వనన్"
224ప.

"అంతటఁ బోవఁడు గూనెఁడు
సంతసమున బాఁకొసియెఁ జయ్యనఁ గల కూ
డంతయును నిష్ట మాయ ప
డంతీ! యిది శిశువనం దడంగెడు పనులే." 227ప.

"పుట్టి యంత వెన్న ప్రోవుగఁ పేర్చిడి
కడిగి కడిగి యొక్క గనప చేర
నంత వట్టు మ్రింగె నటసూచి చూడంగ
నొంటి నిట్టి మనుజు లుర్విఁ గలరె" 229ప 5ఆ పూ. భా.

ఇదియెల్ల పోతనకు మూలధనము గీతిమాధుర్యము వృద్ధి ఇక గోపబాలురు,

"చిఱుతకూఁకట్లు దూఁగాడఁ జేతి చర్ది
చిక్కముల నెలగోలలు చెలువు మిగులఁ
గిబ్బ చెప్పులు దొడి నున్నగత్తితడుపు
లెలమితోఁ గట్టి చేరువ పొలములందు 255ప.

"వృకములఁ దోలి యార్చుచును వేడుకఁ బాడుచుఁ గ్రొత్త వైచుచుం
బ్రకటమహీరుహాగ్రములు ప్రాఁకుచు జున్నులు రేఁచి తేనె గో
పకులకుఁ బోయుచున్ మధురభక్తము సేకళు లారగించుచున్
సకలమనోజ్ఞఖేలనరసంబునఁ దేలిరి బాలయాదవుల్."
256ప 5ఆ. పు. భా

ఇట్టి గోపబాలురతో బాలకృష్ణుడు యమునానదిలో జలక్రీడ లాడిన విధము :

"ఒండొండ యిద్దరినుండి యద్దరి దాఁక
నేపారు పురుడున నీఁది యీఁది
మునిఁగి లోలోనన చని దవ్వుదవ్వుల
నునువున నెగసి పెల్లార్చి యార్చ

కడ గానరాని పెన్మడువులఁ బజితెంచి
యఱికె వే కడుఁ దేలి మెఱసి మెఱసి
యొండొరుఁ బేర్కొని యోల యోలని రేఁచి
యదటున జల్లు పోరాడి యాడి
వాద్యభంగి జలము వాయించి వాయించి
పాడి పాడి కెరలి యాడి యాడి
తనిసి మూఁడు జాలతఁ బ్రొద్దొలెంచక
చల్లవడిన నల్లసల్ల వెడలి" 101ప. 6ఆ పూ భా.

ఇది గోపాలుర ఈత కార్యక్రమమునకు వాద్యసంగీతము, గాత్రసంగీతమును మేళవించిన చలనచిత్రము.

ఇదియెల్ల గ్రామీణకవిత్వము

బలరాముడు కాళిందీభేదనము సేయ నదీదేవత వచ్చిన విధము నాగరకము.

"సంకర్షణలాంగలాకర్షణంబునకు వశగతయై వికీర్ణశైవాల
కేశియు విలోలమీనదృష్టిపాతయు విస్రస్తఫేనదుకూలయు విహ్వాల
విహంగరుతాక్రందయు వికలకమలహంసగమనయు వికంపితకోక
స్తనయుగ్మయు విషణ్ణసరోరుహవదనయు విభిన్నవీచీవళీవిలస
నయు వికలితావర్తనాభియునై విభు కరాకృష్టమానయగు విముగ్ధయుం
బోలె నరుగుదెంచి" 91వచ. 2ఆ. ఉ. భా.

ఇది భట్టుమూర్తి వసుచరిత్రలోని "వెణి చలింప" అను పద్యమునకు (137ప 2ఆ) మార్గదర్శకము. భట్టుమూర్తి పద్యము ఏకదేశము. ఎఱ్ఱన గద్యము సమగ్రము

రుక్మిణీ కల్యాణఘట్టమునందు బ్రాహ్మణుని రాయబారము లేదు. నారదుని కార్యానుసంధానము కలదు ఫలితముగ శ్రీకృష్ణుడు కుండినపురమునకు వచ్చుట విన్న రుక్మిణి మనోభావములివి

"నను దుఃఖాంబుధి నుద్ధరించుటకునై నా నాథుఁ డేతెంచె నెం
కనుబాసం బొకడేల యెప్పుడొకొ యయ్యబ్జాయతాక్షు న్మహా
ఘనవక్షుం దగఁ గాంతు నిట్లిది భాగ్యం బబ్బెనే నాకు నా
జని సాఫల్యము నొందె నవ్వజగదర్చ్యుంబయ్యె నా కోర్కియున్.
55ప.

చూడ్కులు నను(జెంద( జొచ్చి గోవిందు డెం
దములోన నానందధన్యనగుదు(
బలుకులజాడ తీపులు గ్రోలి సోలి గో
వర్ధనునకు( జాల వల(తిన గుదు(
గ్రియలకు( బూను కోర్కెకై నెల్ల దెస(జిక్కి
శ్రీవత్సునకు( బ్రియశిష్యనగుదు
నేర్పులు ప్రసరింప నెఱయు పాకము నొంది
హరియం దభేదభావాత్మనగుదు

నా ప్రియంబును భక్తియు నా తలంపు(
వలపు( గంసారి యెఱి(గెను కొల(ది యెఱి(గి
యఖిల జగములు నేన యత్యంతసుభగ
తానిరూఢితో నేలెడుదాన నగదు" 56 ప 3 ఆ. ఉ. భా

మఱి శ్రీకృష్ణుని మనోభావములివి.

"ఎమ్మెయి( జూతునొక్కొ తరళేక్షణ నక్కట చూచి యెమ్మెయిం
గ్రమ్మన నిర్వహింతునొకొ కైకొని కర్జము వెండి శత్రుసం
ఘమ్ముల నెమ్మెయిం దొడరి గర్వము సొం పడ(గింతునొక్కొ(యే
నెమ్మెయి నిశ్చయింతునొకొ యింతిదెస న్మను విన్న చందముల్.
60 ప.

నన్ను( బొడగన్న చోట నన్నలిననయన
చూపు చూపుల( బ్రేమంబు సొంపు గనిన
యపుడ తఱియంగ సుఖకుదు నమరు లద్ద
పడిన( బట్టుదు నా పాణిపంకజమున 61 ప.

కమలాస్య నెమ్మోము కమ్మని తావికై
చందడి( దమకించు తరళతయును
ముద్దియ మెలపొక్కు ముద్దాడ(బలుకులు
వినగ( గ సుత్తలపడు వేడుకయును
బూ(బోడి నెమ్మేని( బొంది యానందంబు
గడ గాన( బూనెడు కౌతుకం బు(

గామిని కొండొండ కడలొత్తు కోర్కులు
నిండింపఁ గాంక్షించు నెఱగడఁకయు

భామయును నేను నన్యోన్యభావమగ్న
లగుట యెఱిఁగిన యాప్తజనాళి ప్రియము
నిర్వహింపగఁ గలుగుట నిక్కముసకు
సరయ నెకభంగి భాగధేయంబొ నాకు" 63 ప. 1 ఆ. ఉ. భా.

ఉభయుల మనోభావములును ఉచితములు ఉదాత్తములు.

రుక్మిణీకల్యాణ మహోత్సవప్రకారమిది :
"సౌకుమార్యమునకు సౌకుమార్యస్ఫూర్తి
గలిగించు నవయవకల్పనంబు
సౌందర్యమునకును సౌందర్యసంపద
యొదవించు లావణ్యయోగరుచియు
సౌభాగ్యమునకును సౌభాగ్యవిభవంబు
గావించు సరసరేఖాక్రమంబు
సౌశీల్యమునకును సౌశీల్యకలనంబు
నందించు నాభిజాత్యస్థితియును

దనకు నైజంబులుగ నొప్పు ధన్యజన్మ
రుక్మిణీదేవి నానందరుచిరమూర్తిఁ
బాణిపంకజగ్రహణకల్యాణలీలఁ
బ్రీతి గడలొత్తుచుండఁ బరిగ్రహించె," 164 ప.

ఇందు రుక్మిణి సర్వావయవవర్ణనము లేదు సౌకుమార్యమునకు సౌకుమార్యము కలిగించు సౌష్ఠవము, సౌందర్యమునకు సౌందర్యము నొసగు లావణ్యము, సౌభాగ్యమునకు సౌభాగ్యమిచ్చు సరసత్వము, సౌశీల్యమునకు సౌశీల్యమును కూర్చు ఆభిజాత్యము మాత్రమే ప్రసక్తమైనవి ప్రత్యంగవర్ణనము కంటె ప్రత్యగ్రమైన ప్రత్యేకవర్ణనము ఇది తిక్కన స్త్రీవర్ణనమునకు శిష్యప్రాయము. అంతేకాదు. శిఖరాయమాణము.

ఎఱ్ఱన హరివంశము ప్రబంధమైనను స్వతంత్రకావ్యము కాదు స్వతంత్రాం ప్రధికరణము. కవితాకాంతులు మబ్బుదొంతరల మధ్య మెఱుపుఁదీవలు.

# ప్రబంధపరమేశ్వరప్రశంస

ఎఱ్ఱన "ప్రబంధ కల్పనాకుతూహ"లుడైన సందర్భమున, తదేకధ్యానము నందు కనిపించిన, అతని తాత ఎఱపోతసూరి ప్రశంసతో ఇట్లు కలదు.

"ఉన్నతసంస్కృతాంధ్రచతురోక్తిపదంబులఁ గావ్యకర్తవై
యెన్నికమైఁ బ్రబంధపరమేశుఁడనంగ నరణ్యపర్వశే
షోన్నయ మంధ్రభాష నుతనోత్సవమొప్పఁగ నిర్వహించి తా
నన్నయభట్ట తిక్కకవినాథుల కెక్కిన భక్తి పెంపునన్" 17 ప పీ.

నన్నయ, తిక్కనలయెడ లగ్నమైన భక్తి అతిశయముచేత, ఉన్నత సంస్కృతాంధ్రచతురోక్తిపదములు కావ్యకర్తయైన ఎఱ్ఱన, ప్రబంధపరమేశ్వరు డనునట్లు అరణ్యపర్వశేషము రచించెనని పద్యతాత్పర్యము. నన్నయ, తిక్కనల యెడ భక్తిప్రసక్తికి హేతువు, వారు రచించిన భారతమునందు అరణ్యపర్వశేష ముండుట వారియెడ భక్తికొలది ఎఱ్ఱన ప్రబంధపరమేశ్వరు డనునట్లు అరణ్యపర్వ శేషమును రచించెను కావున ఎఱ్ఱనకు ప్రబంధపరమేశ్వరప్రశంస అరణ్యపర్వ శేషవిషయము కావలయును.

కాని నృసింహపురాణము ప్రబంధమని, ప్రబంధమొక ప్రక్రియాభేదమని, అట్టి ప్రబంధరచనకు ఎఱ్ఱన ఆద్యుడని, కాఁబట్టి ఎఱ్ఱన ప్రబంధపరమేశ్వరుడని ఒక అభిప్రాయము కలదు [33] అది ఎఱపోతసూరి ప్రశంసకు ప్రతికూలము. ఎఱ్ఱన ఆశయమునకు వ్యతిరేకము ప్రకరణమునకు పరమవిరుద్ధము ఎఱపోతసూరి ప్రశంస అరణ్యపర్వశేషవిషయము ఎఱ్ఱన ఆశయము కావ్యార్థకమైన ప్రబంధర్థము. ఎఱ్ఱన ప్రబంధశబ్దప్రయోగము నృసింహపురాణమునందు మాత్రమేగాక హరివంశ మునందును కలదు అది పూర్వోదాహృతము ఎఱ్ఱన నృసింహపురాణము రచిం చుటకు ముందే ఎఱపోతసూరి ప్రబంధపరమేశ్వరప్రశంస కలదు. ఎఱ్ఱన "ప్రబంధ పరమేశుఁడనంగ నరణ్యపర్వశేషోన్నయ"ము నిర్వహించినట్లు స్పష్టముగ కలదు .అది ప్రకరణము అంతేకాదు, ప్రబంధ మొక ప్రక్రియాభేదమను ఆధునిక వ్యవ హారమును ప్రాచీనకవిప్రయోగమునకు ఆరోపితము చేయుట అక్రమము.

నన్నయశబ్దము నారాయణశబ్దభవము కావున నన్నయ నారాయణుడని, తిక్కన కవిబ్రహ్మ కావున తిక్కన బ్రహ్మ అని, పరిశేషన్యాయమున ఎఱ్ఱన పరమేశ్వరుడని కావున ప్రబంధపరమేశ్వరుడని మఱొక అభిప్రాయము కలదు.[34] కాని, నన్నయశబ్దము నారాయణశబ్దభావము కాదు నన్నయశబ్దార్థమైన నారాయణ శబ్దార్థము కాదు. నారాయణశబ్దార్థము ఎఱ్ఱన అరణ్యపర్వశేషమునందు (266ప. 4ఆ.) హరివంశమునందును (76ప.6ఆ ఉ.భా.) కలదు

"నారము లండ్రు జలము ఎం
పారఁగ నారములు నాకు నయనం బగుటన్
నారాయణుఁ డను పేర న
పారనిగమఫణితులందుఁ బరఁగుదు పేర్మిన్." అ.ప శే.

నన్నయశబ్దము తద్భవము కాదు. దేశ్యము నన్ని+అయ్య=నన్నయ్య, నన్నియ్య. నన్నిశబ్దమునకు "ప్రియము, సుందరము" అని తెలుగు నిఘంటువు నందు, "సత్యము, నిశ్చయము, ప్రేమ, అనురాగము, అనుబంధము" అని కన్నడ నిఘంటువునందు, "మంచి, మంచితనము, మేలైన గొప్పతనము, పెద్దతనము, గుణము, సుఖము, సంతోషము, చర్య, లాభము, అభివృద్ధి, ఆమోదప్రకటనము" అని తమిళనిఘంటువునందు అర్థములు కలవు. "జలములు" అను అర్థములేదు. శబ్దసంగతి లేదు అర్థసంగతి లేదు కాఁబట్టి నన్నయశబ్దము నారాయణశబ్దభవము కాదు.

నన్నయ "విద్యాదయితుండు" అని తిక్కన ప్రశంస. (6ప 1ఆ వి.ప.) మాధవశబ్దార్థము "మా యన విద్య దత్పతివి మాధవుఁడవు" అని శివుడు, శ్రీకృష్ణ నికి చెప్పినట్లు నాచన సోమనాథుని ఉత్తరహరివంశమునందు కలదు. (207ప 2ఆ) విద్యాధవుడు విష్ణువైన, విద్యాదయితుడును విష్ణువగును కావున నన్నయ విష్ణువు, తిక్కన బ్రహ్మ, ఎఱ్ఱన పరమేశ్వరుడు కావచ్చును అఖిలజగత్తునకు త్రిమూర్తుల వలె, ఆంధ్రసాహిత్యజగత్తునకు నన్నయ, తిక్కన, ఎఱ్ఱనలు త్రిమూర్తుల కవిత్రయము.

ఉత్తరపదవిశేషణములైన బ్రహ్మ, పరమేశ్వరశబ్దములు శ్రేష్ఠవాచులు. కవి బ్రహ్మ కవిశ్రేష్ఠుడు ప్రబంధపరమేశ్వరుడు ప్రబంధరచనమునందు శ్రేష్ఠుడు.

అరణ్యపర్వ శేషములోని ఆంధ్రీకరణపద్ధతి, కవితారీతి, శైలీసరణి ఎఱ్ఱన ప్రబంధ పరమేశ్వరుడను ప్రశంసకు సమర్థములు.

# సూక్తివైచిత్రి

"పరిఢవింతు ప్రబంధపరమేశ్వరుని రేవ
సూక్తివైచిత్రి నొక్కొక్కమాటు"

అని శ్రీనాథుని కాశీఖండమునందు కలదు (13ప.1ఆ.) సూక్తివైచిత్రి అనగా నీతివైచిత్రి కాదు నీతివాక్యమునకు వైచిత్రి సహజము కాదు నన్నయ "నానారుచిరార్థసూక్తినిధి" విశేషణములోని సూక్తిశబ్దము, శ్రీనాథుని "సూక్తి వైచిత్రి" విశేషములోని సూక్తిశబ్దము సమానము సూక్తి అనగా సుమధురవాక్కు. సు+ఉక్తివైచిత్రి=సూక్తివైచిత్రి ఉక్తివైచిత్రివిషయము కుంతకుని వక్రోక్తిజీవితము నందు కలదు. కుంతకుని మతమున కవితామార్గము త్రివిధము 1 సుకుమారము. 2. విచిత్రము 3 మధ్యమము (ఉభయాత్మకము)

"సంప్రతి తత్రయో మార్గాః కవిప్రస్థానహేతవః
సుకుమారో విచిత్రశ్చ మధ్యమ శ్చోభయాత్మకః" 24శ్లో.1ఉన్మే.

సుకుమార, విచిత్ర, మధ్యమ మార్గములు మూడును కవిప్రస్థానహేతువులు. విచిత్రశబ్దభావము వైచిత్ర్యము అదే వైచిత్రి విచిత్రమార్గవివరణమునందు ఉక్తి వైచిత్రి ఒక విధముగ కలదు.

"యద ప్యనూతనోల్లేఖం వస్తు యత్ర తదప్యలమ్
ఉక్తివైచిత్ర్యమాత్రేణ కాష్ఠాం కామపి నీయతే" 38శ్లో.1ఉన్మే.

అని కారిక అనూతనముగానే వర్ణించిన విషయము, ఉక్తివైచిత్ర్యమాత్ర మున అతిలోకోత్తరాతిశయపరాకాష్ఠను పొందునని అర్థము. విషయము ప్రాతదై నను, చెప్పిన విధానమునందు చాతుర్యము కలదేని, అది ఉక్తివైచిత్రి అగును. ఉక్తివైచిత్రి అనగా వాగ్వైచిత్రి వాక్చాతుర్యము "చతురోక్తి" అని ఎఱ్ఱన పద్యమునందు కలదు అది ఉక్తిచాతుర్యము అదే ఉక్తివైచిత్రి. సూక్తివైచిత్రి అనగా సుమధురవాగ్వైచిత్రి అది బహువిధము

ఎఱ్ఱన "ప్రబంధపరమేశ్వరుడై రచించె శబ్దవైచిత్రి నరణ్యపర్వమున శేషము" అని ఆక్కన విక్రమార్కచరిత్రమునందు కలదు ఆ పద్యము పూర్వో

ద్రాఘృతము. శబ్దవైచిత్రి ఉక్తివైచిత్రి కాదు. వర్ణవిన్యాసవక్రత అనగా అక్షర రమ్యత అగును. అరణ్యపర్వశేషములోని అక్షరరమ్యత పూర్వోక్తము. విషయము ప్రాతదైనను చెప్పిన విధానమునందు చాతుర్యము కలది ఉక్తివైచిత్రి. అది ఎఱ్ఱన కృతులన్నిట కలదు

"ధృతి వేదంబులు నాలుగుం జదివి భూదేవుండు నానాధ్వర
వ్రతుఁడై యుండెడు నట్టి పుణ్యుఁ డమరావాసంబునందుండు సు
స్నతవృత్తస్తనభారమంధరమరున్నారీపరీరంభసం
భృతరోమాంచసమంచితాంగుఁ డగుచుం జెక్కిండ్లు సంప్రీతితోన్."

211 ప. 4 ఆ. అర. ప.

యజ్ఞఫలము స్వర్గమనుట ప్రాఁజదువులోని ప్రాతమాట. అది "ఉన్నత వృత్తస్తనభారమంధరమరున్నారీపరీరంభసంభృతరోమాంచసమంచితాంగ" జనక మనుట వలన అతిశయించినది.

"అమరానీకవిసృజ్యమాన బహుశస్త్రాస్త్రాతిన్ భిన్నదే
హములై ఘోరమదేభముల్ బహులరక్తాంగంబులై తూలెఁ దీ
వ్రమహావాతనిపాతజాతరభసవ్యాఘాత సంధ్యారుణా
భ్రములో నా నవశంబులై యొఱగుచుం బ్రత్యర్థిసైన్యంబులన్."

273 ప. 5ఆ. అర ప.

శస్త్రాస్త్రహతిని మదేభములు భిన్నదేహములై రక్తాంగములై తూలుట ప్రాత విషయమే అది మహాప్రభంజనముచేత చెదరఁగొట్టఁబడిన సంధ్యారుణకాంతులతోడి కాలజీమూతములో అను ఉత్ప్రేక్ష వలన ఉజ్జ్వలమైనది.

"చలజిహ్వాగ్రవిలీఢ విస్ఫురితదంష్ట్రాభీషణంబైన బె
ట్టులిఁ గోలం గొని వ్రేసి త్రోసి తొలఁగం బోవచ్చినన్ వచ్చుఁగా
కలసత్ఫూత్కారశరాగ్నిదుస్సహుని సర్పాంచిచి నల్గించె యె
వ్వలనన్ మానధనాఢ్యులై బ్రదికిపోవన్వచ్చునే యేరికిన్."

177 ప. 6 ఆ. అర. ప.

గాండీవమును ధరించిన అర్జునునికి కోపము కలిగించి బ్రదుకుట అసంభవమనుట సర్రిక్రొత్తసంగతి కాదు. ప్రాఁబడిన విషయమే అది నాలుకచాచి కోరలతో

భయంకరమైన పెబ్బులిని కత్తితో కొట్టి, చేతితో త్రోసి తప్పించుకోవచ్చునుగాని, దుస్సహుడైన గాండీవిని తప్పించుకొని ఎవ్వడును బ్రదుకలేడనుటవలన అభినవ రమణీయమైనది.

"సిరి పుట్టినిల్లు రాజీవలోచను సెజ్జ
పట్టు, మహీకాంత కట్టుఁజీర
గిరులు డాఁగెడు గొంది గిరిభేది పగఱకు
బలుకోట బడబాగ్ని బ్రతుకుచోటు
పటుపయోధరముల పాలి ప్రపాసీమ
యమృతాంశు పొడవుప్ప కనుగలంబు
మర్యాదలకు గుఱి మహిమల కందువ
యఖిలరత్నములకు నాకరంబు
సురతభవనంబు వాహినీ సుందరులకుఁ
గూర్మి నిల్కడ గంభీరగుణము నెలవు
తనరు నొప్పిదములకెల్లఁ దానకంబు
వనధిఁ గొనియాడఁ జతురాననునకు వశమె." 37 ప 1 ఆ. నృ పు.

లక్ష్మి సముద్రమునందు పుట్టుట, విష్ణువు క్షీరాబ్ధియందు శయనించుట, భూమి సముద్రమువఱకు ఉండుట, సముద్రమునందు బడబాగ్ని ఉండుట, మేఘములు సముద్రజలమును త్రాగుట, నదులు సముద్రమునందు కలియుట ప్రాతవడ్డ విషయములు సముద్రము లక్ష్మి పుట్టినిల్లు, విష్ణువు శయ్యాగారము, మహీకాంత కట్టుచీర, బడబాగ్ని బ్రదుకుచోటు, పయోధరముల పాలిటి ప్రపాసీమ, వాహినీ సుందరీమణులకు సురతభవనము అను భావప్రకటనము సుందరతరము. ఉక్తివై చిత్రి ప్రధానముగ భావప్రకటనమునకు సంబంధించినదిగా భాసించును.

"వెడవెడ మాఁకులు విచ్చు తామరలపై
సుడిసి నెత్తావులు సూఱలాడి
యనుఁగుఁదోటలు సొచ్చి యలరుతేనియఁ జేసి
యెలదేటి పదుపులఁ జెలఁగి నడచి

రాయంచకవల నిద్రలు దెర్చి కొలఁకులఁ
దరగయుయ్యాల యాట దగులుపఱిచి
సోర్ణగండులు సొచ్చి సురతఖేదమునందుఁ
జెలువలఁ జెలువుర సేద దేర్చి

యదరి గృహపతాకికలకు నాట గఱపి
ప్రోది నెమళుల యెఱకల పొదులు విచ్చి
మందసంచారముగ సుకుమారమగుచు
మెఱసెఁ బ్రత్యూష సమయసమీరణంబు." 111ప. 8ఆ. నృ.పు.

ప్రత్యూషసమయమునందు తామరలు వికసించి తావులు విరజిమ్ముట, ఎలదేటి పదుపులు మకరందమును త్రావుట, రాయంచకవలు మేల్కాని తటాక తరంగములందు సంచరించుట, స్త్రీలు పురుషులు సేదదేరుట, నెమళ్లు పురులు విప్పుట, వాయుప్రసారము వలన గృహపతాకలు అటునిటు ఊగుట ప్రకృతి సహజము. ప్రాతవిషయము అట్టిది ప్రత్యూషపవనమే ఒక వ్యక్తిగ వికసించిన తామరలు విరజిమ్మిన తావులు చూఱగొనినట్లు, మకరందమును త్రాగు మధుపబృంద ముల మధ్య నడచినట్లు, రాయంచకవలను మేల్కొలిపి తటాకతరంగముల ఉయ్యాలయాట కల్పించినట్లు, స్త్రీల పురుషుల సేద దేర్చినట్లు; గృహ పతాకలకు ఆట నేర్పినట్లు, నెమళ్ళకు పురులు విప్పినట్లు చెప్పిన విధానము లోకోత్తరాతిశయ ముగ కలదు. ఇది శ్రీనాథుని భీమేశ్వరపురాణములోని "కామదేటి కల్యాణ" అను పద్యమునకు (82ప 2ఆ) ఆద్యప్రకృతి.

"కలపనగంప యీ తపసి కాలును నోరును బాగు గాన కె
వ్వలనఁ బరిభ్రమించు నపాయపుఁ బేలరి మాటలాడి ధీ
చల మదికైన నూరక విరోధ మొనర్చుచునుండు రాజులం
బెలుచన రేఁచి తెచ్చి తలపెట్టు వినోదపుఁదీఁట వోవఁగాన్."
91ప 5ఆ. పూ.భా. హ. వం.

నారదుడు కలహశీలుడు, త్రిలోకసంచారి అనుట ప్రాతవడ్డమాట. కాలు, నోరు బాగు కానక వినోదపు తీట పోవునట్లు విహారవిరోధములు సేయుననుట విచిత్రసరణి.

"అసితల నిట్టు లగ్గలము లాడిన యట్టు గాదు సేత చొ
ప్పనయము వ్రెంగొకింత వడి యాత్మ దిరంబుగ సైచి నిల్పుమా
సునిశితమామకాస్త్రముల సోన మునింగి పరేతభర్తతో
నొనరఁగ నేఁడ చేసెద ననుత్తమసఖ్యవిశేషభద్రముల్."
117ప. 1ఆ. ఉ. భా హ వం.

శత్రువును యముని సన్నిధిరి పంపుదుననుట అరిగిపోయిన నాణెము. అట్లు గాక యమునితో మహాస్నేహవిశేషమైన భద్రత కలిగింతుననుట సరిక్రొత్త నాణెము.

ఇట్లు విషయము ప్రాతదైనను, చెప్పిన విధానము క్రొత్తదైనచో, కుంతకుని ప్రకారము ఉక్తివైచిత్ర్యమగును. అదే సూక్తివైచిత్రి ఇదే ప్రకారమైన సూక్తి వైచిత్రి శ్రీనాథుని కృతులందును కలదు అది శ్రీనాథయుగమునందు వివరింతును.

## శైలి

ప్రతి కవికి ఒక ప్రత్యేకమైన శైలి ఉండుట సహజము. అయినను శైలి అనునది కేవలము కవినిష్ఠము కాదు వస్తుపరము కూడ అంతేకాదు. అనుకరణ సాధ్యమును ఎఱ్ఱన శైలి అరణ్యపర్వశేషమునందు నన్నయశైలికి అనుగుణము. హరివంశమునందు తిక్కనశైలికి సన్నిహితము నృసింహపురాణమునందు ప్రత్యేకము. అరణ్యపర్వశేషమునందు తెలుగు నుడికారము తక్కువ. సంస్కృతప్రౌఢి సమధికము. నృసింహపురాణమునందు సంస్కృతప్రౌఢి అంతకంటె ఎక్కువ. రామాయణపద్యములందు తెలుగునుడికారము హెచ్చు. హరివంశమునందు సంస్కృతప్రౌఢి తక్కువ తెలుగు పలుకుబడి ఎక్కువ సూక్తివైచిత్రి కూడ శైలీ విశేషమే ఇంత వైవిధ్యము కల శైలి ఇతరకవులందు మృగ్యము. ఎఱ్ఱన తెనుగు **నుడికారమునకు**, సంస్కృతప్రౌఢికి, సూక్తివైచిత్రికి పూర్వోదాహృతపద్యములెల్ల **పురస్కారములే.**

# ఆత్మీయత

ఎఱ్ఱన "శివపదాబ్జసంతతధ్యానసంసక్తచిత్తుఁడు" అని అరణ్యపర్వమునందు కలదు. (469ప. 7ఆ) "గిరిశపదభక్తిరసతత్పరభావము కలిమి శంభుదాసుం డనఁగాఁ బరఁగినట్లు నృసింహపురాణమునందు కలదు. (18ప. పీ) "పూజిత ధూర్జటి చరణాంబుజు"డని హరివంశమునందు కలదు (36ప. 1ఆ.) "శంభుదాస లక్షణాభిధేయయొజ్జయ నామధేయప్రణీతంబైన" అని నృసింహపురాణ, హరివంశ ముల ఆశ్వాసాంతగద్యములందు కలదు కాని ఎఱ్ఱన రచించిన అరణ్యపర్వశేషము శివసంబంధము కాదు రామాయణ, నృసింహపురాణ, హరివంశములు విష్ణు సంబంధములు అయినను ఎఱ్ఱన ఆత్మీయత అరణ్యపర్వశేష, నృసింహపురాణ, హరివంశములందు ప్రతిఫలించినది

కుమారస్వామి సప్తమాతృకలను బాలగ్రహములు చేసిన సందర్భమునందు సంస్కృతభారతమునందిట్లు కలదు

"న స్పృశన్తి గ్రహా భక్తా న్నరాన్ దేవం మహేశ్వరమ్."

58శ్లో. 219అ. ఆర. ప.

దేవుడైన మహేశ్వరుని భక్తులను గ్రహములు తాకవని తాత్పర్యము. ఇది ఎఱ్ఱన తెనుగుసేతను ఇట్లు కలదు.

"ఆదిదేవుఁడగు మహాదేవు మీఁదఁ నె
వ్వాని మనసు భక్తివైభవమున
నుల్లసిల్లు నతని నెల్లకాలముల డ
గ్గఱదు సూవె గ్రహవికారసంతతి." 257ప.5ఆ అర వ.

ఇట మహాదేవుని ఆదిదేవుడనుట ఎఱ్ఱన అభినివేశమే. అంతేకాదు "ఎవ్వాని మనసు భక్తివైభవమున నుల్లసిల్లు" ననుటలో ఎఱ్ఱన మనస్సు శివభక్తివైభవమున విలసిల్లుట ద్యోతకమగును

నృసింహపురాణమునందు ఇట్లు కలదు.

"కడలు చేతు లార్చుచు ఫేనఘనతరాట్ట
హాసరుచితోఁ బ్రవాళజటాలి విద్రిచి.

యౌర్వశిఖి ఫాలలోచనం బనఁగ సింధు
వమరుఁ దాండవ మాడెడు హరునిఁ బోలె." 34ప.1ఆ.

ఇది దుగ్ధాబ్ధివర్ణన. ఎఱ్ఱన స్వీయరచన ఇందు సముద్రము ఎఱ్ఱనకు తాం డవమాడు శివుని వలె తారాడినది కెరటాల కదలికలు కరచాలనములుగ, నురుగు. తెట్ట అట్టహాసరుచిగఁ పగడపుతీగలు జడలుగ, బడబాగ్ని నిటలాగ్నిగ తాండవహ రుని తలపించినది ఇది శంభుదాసుని అనుభావమే అనగా ఆత్మీయతయే.

ఇంద్రాదిదేవతల విష్ణుస్తోత్రమునందు ఎఱ్ఱన శైవుల పక్షము వహించిన ఒక పద్యమును రచించెను ఆ పద్యమిది.

"పరఁగు పదార్థపంచకము పాశములై తనుఁ జుట్టిఁ దూలుచున్
దిరిగెడు జీవుఁడనే బశువు దేశికపుణ్యకటాక్షవీధిఁ ద
త్పరమతిఁ జేరఁగా నపరబాధవిముక్తి శుభంబు నిచ్చు నీ
శ్వరుఁడుగ నిన్నెఱుంగుదురు శైవులు శాశ్వతచిన్మయాత్మకా"
28ప 8ఆ.నృ పు.

ఇది ఎఱ్ఱన విష్ణుస్తోత్రతారావళిలోని ధ్రువతార. ఇందు పశుపాశపశుపతిభావ వివరణము, గురుదీక్షాప్రకరణముశైవాగమవిశేషము. శైవులు విష్ణువును శివునిగ "ఎఱుఁగుదు"రనుట ఎఱ్ఱన హరిహరాభేదభావమునకు నిదర్శనము.

ఎఱ్ఱన మనస్సులోని శైవాగమసిద్ధాంతము హరివంశరచనమునందును విస్మృ తము కాలేదు గోపాలకులు రోగశాంతికై శివపూజావ్రతము సలిపినట్లు ఎఱ్ఱన హరి వంశమునందు కలదు సంస్కృతహరివంశమునందు లేదు.[35] ఎఱ్ఱన హరివంశము లోని ప్రకరణమిది:

"ఇట్లు బలదేవకేశవులు బరిష్ఠులయ్యు నయ్యుపద్రవప్రతికారంబునం దసమర్థులై యుండ నా వ్రేపల్లెయందు విదేహదేశాగతుండై యున్న గోప వృద్ధుం డొక్కరుండు గోపముఖ్యుల నెల్లం గూడం బిలిచి వారి తోడ. 58వచ.

పశుసమాశ్రయమున బ్రతుకుచున్నారము
మనము దత్పశుసంఘమునకుఁ బ్రభుఁడు
వృషకేతనుం డగు విషకంఠుఁ డవ్వయుఁ
బటుగాన సద్భక్తి నమ్మహాత్ము

సర్చింపఁగా శాంతియగు నెల్లవిధముల
    వేదపారగులైన విప్రవరులఁ
విరిపించి శాస్త్రసంభృతయు క్తికల్పిత
    మార్గంబుతో దేవమందిరమునఁ
దొడగుఁ డీ యనుష్ఠానంబు జడతయుడిగి
యనినఁ గులవృద్ధు మాటకు నాత్మలందుఁ
దద్ద విశ్వాస మొలయంగఁ దక్షణంబ
గోపులెల్లను దగు వస్తుకోటి గూర్చి 54ప.

శివభక్తియుఁ దదీయతంత్రజ్ఞానంబును దదాచారధుర్యతయుం
గల యార్యద్విజోత్తములఁ బ్రార్థించి తెచ్చి తత్క్రియానిర్వాహత్వంబు
నకు నియోగించిన—" 55వచ 6ఆ.పూ భా.హ వం.

"జీవుడు పశువు సంసారము పాశము పాశనికృంతనము సేయు పశుపతి శివుడు" అని శైవాగమసిద్ధాంతము. మానవులు, పశువులను జీవులే. కావున పసు సమాశ్రయణమున జీవించు గోపాలకులకు శివపూజ కర్తవ్యమని గోపవృద్ధుని ఉద్దేశము. అది "దేవమందిరమున" జరుపవలయునని కూడ అతవి ఆదేశము. దేవమందిరమనగా దేవాలయము. అది శివాలయమని అనంతరవచనమునందు కలదు. [60వచ 6ఆ] గోపవృద్ధుని కాలమునందు వ్రేపల్లెలో శివాలయము లేదు గాని, ఎఱ్ఱన కాలమునందు గుడ్లూరులోనే శివాలయము కలదు. నీలకంఠేశ్వరాలయము. శివాలయము ఎఱ్ఱన సమకాలికసమాచారము వలె శివపూజ ఎఱ్ఱన ఆత్మీయతా ప్రతిఫలనము అంతేకాదు. ఆ శివపూజావిధానమిది:

"పంచామృతంబులఁ బంచగవ్యంబుల
    విమలోదకంబులఁ గ్రమముతోడ
నభిషేకమొనరించి యఖిలేశ్వరుని సమం
    చితగంధసమితి నర్చితునిఁ జేసి
భూరిసౌరభచారుపుష్పదామంబులఁ
    బూజించి బహువిధస్ఫురితధూప
తతి యిచ్చి కపిలాఘృతప్లుతవర్తికా
    తమ్యదీపముల నారతు లమర్చి

భక్ష్యభోజ్యలేహ్యపానీయబహుళమై
వేద్యములు ఘటించి హృద్యలీలఁ
బగలు రేలు నట్లు పరిచర్య నడుపుచుఁ
గొలిచి రేడు దివసములు క్రమమున." 57ప.

"—శివాలయంబునందు శివసంహితామంత్రంబుల నాజ్యపాయసాపూపప్రముఖంబుల హోమించిరి ... ఎల్లవారును మృత్యుపరిహారకంబులగు మంత్రజపంబులు నుపద్రవశమనకారులగు మహాదేవమంత్రస్తోత్రపఠనంబులు శాంతిప్రదంబులగు కల్యాణధ్యానంబులు ననుష్ఠించుచుండిరి.

పరమేశ్వరు ముందరఁ గొందఱు భ్రూవిక్షేపంబుల నక్షివివర్తనంబులఁ జరణతాళంబుల హస్తవిన్యాసంబుల నతిమనోహరంబును గుతూహలావహంబును నగు భక్త్యావేశవర్తనంబు ప్రవర్తించి ప్రదక్షిణప్రమాణాదు లొనరించిరి." 60వచ 6ఆ.పూ భా.హ వం.

ఇందు ఆగమోక్తప్రకారమైన శివార్చనము, శివసంహితామంత్రస్తోత్రపారాయణము, జపహోమధ్యానాచరణము, శివభక్త్యావేశప్రవర్తనము, శివాలయప్రదక్షిణప్రమాణాదికము ఎల్లను శివపదాబ్జసంతతధ్యానసంసక్తచిత్తానుసారము.

# నాచనసోమనాథుడు

నాచన సోమనాథుని ఉపలబ్ధకృతి ఉత్తరహరివంశము. "నాచనసోమనాథప్రణీతంబైన యుత్తరహరివంశంబునందు" అని ఆశ్వాసాంత గద్యములందు కలదు. హరివంశమునకు పూర్వోత్తరవిభాగము కలదు పూర్వభాగము పూర్వహరివంశము. ఉత్తరభాగము ఉత్తరహరివంశము పూర్వహరివంశమును గూడ సోమనాథుడు రచించెనని రచింపలేదని వాదోపవాదములు కలవు [36] గ్రంథము లేదు. కనీసము "సోముని హరివంశము" అని ఉదాహరించిన లక్షణగ్రంథములందు, ఉత్తరహరివంశమునుండి తప్ప పూర్వహరివంశమునుండి ఒక్క పద్యములేదు. ఒక పాదము కూడ లేదు ప్రబంధసారశిరోమణియందు, తదనుసారి ప్రబంధమణిభూషణమునందు కల "పురుడు పుచ్చిన నాఁడె" అను పద్యము (13ప.) సోముని పూర్వహరివంశములోని దనుట సంగతము కాదు అది ఇష్టదేవతాస్తుతి. "యమునాజలములలో శ్రీకృష్ణునిఁ గాంచిన యక్రూరుని స్తవములోనిది

కాఁజాలదు. పద్యమునందు పెంచాలిమానసంరక్షణ ప్రసంగము కలదు. అది శ్రీ కృష్ణుని బాల్యమునందలి అక్రూర స్తవము నాటికి జరుగలేదు. ఆధునికుడైన ఓగిరాల జగన్నాధకవి సుమనోమనోభిరంజనము కావ్యమునందలి వ్యాఖ్యానమునందు "శత తాళదఘ్నహ్రదమున నుఱికెన్" అను ఉదాహరణము సోముని హరివంశములోని దిగ కలదు. అది పూర్వహరివంశమునందు శ్రీకృష్ణుడు కాళియుని మడుగులో ఉఱికిన సందర్భములోనిదనుటకూడ సంగతము కాదు ఆ మడుగునకు శతతాళదఘ్న మానముగాని, శతతాళదఘ్న నామముగాని సంస్కృతహరివంశమునందు లేదు. ఎఱ్ఱన హరివంశమునందు లేదు. సోముని హరివంశమునందు ఉండవలసిన ఆవశ్యకము లేదు అంతేకాదు. సార్థకముగ శతతాళదఘ్నసంజ్ఞ కల హ్రదము, పింగళి సూరన కళాపూర్ణోదయమునందు కలదు (౯౬ప 4ఆ) అందు కాలీనుడు అమాంతముగ ఉఱుకుట కలదు. "క్రోధావిలమతిఁ జని యతండు హ్రదమున నుఱికెన్" (168ప.4ఆ) సుమనోమనోభిరంజనము సవ్యాఖ్యానముగ ముద్రితమైన కాలము 1879 వ సంవత్సరము [37] కళాపూర్ణోదయము ప్రథమతః ముద్రితమైన కాలము 1838 వ సంవత్సరము.[38] అముద్రితమైన కళాపూర్ణోదయములోని "హ్రదమున నుఱికెన్" అను మాట, అది శతతాళదఘ్నము కావున, "శతతాళదఘ్నహ్రదమున నుఱికెన్" అను పంక్తిగ భ్రమపడి, ప్రమాదవశమున సోముని హరివంశము లోనిదని ఉదాహరించుట సంభవము సోముని ఉత్తరహరివంశములోని "ఒకనాఁ డిందుధరుండు" అను పద్యమును (48ప ౬ఆ.) ఆదిపురాణములోనిదని అప్పకవి ఉదాహరించుట (118ప 4ఆ) ప్రసిద్ధము ఉత్తరహరివంశమునందు అవతారిక లేదు. పూర్వహరివంశకథాస్మరణము కలదు. "-తిక్కనసోమయాజిప్రణీతంబైన శ్రీమహాభారతకథానంతరంబున ..... నాచనసోమనాథప్రణీతంబైన యుత్తరహరివంశంబునందు" అని ఆశ్వాసాంతగద్యములందు కలదు అవతారిక అభావము ప్రధ్వంసాభావము కావచ్చును. పూర్వహరివంశకథాస్మరణము ఉత్తరహరివంశమునకు ఉపక్రమణిక అట్లు కల సంస్కృతహరివంశము ఉత్తరభాగము సోమనాథునికి లభించుట సంభవము ఉత్తరభాగమునైన పూర్తిగా రచింపని సోమన పూర్వభాగమును గూడ రచించుట సంభవము కాదు తిక్కన మహాభారతకథకు అనంతరమనుటకు హేతువు, హరివంశము భారతపరాంశమగుట, సోమన ఉత్తరహరివంశము, ఎఱ్ఱన హరివంశము వలె నరాంకితము గాక తిక్కన మహాభారతము వలె హరిహరనాథాంకితమగుట కావచ్చును.

నాచన సోమనాధుని అనుపలబ్ధకృతులు రెండు కలవు. 1 వసంతవిలాసము. 2. హరి (ర)విలాసము. ఈ రెండు గ్రంధములలోని పద్యములను లక్షణగ్రంథము లందు ఉదాహరింపఁబడినవి.[39] కావున సోమనాధుని కృతులు కావలయును.

## కాలము

1336 వ సంవత్సరమునందు హరిహరరాయ,బుక్కరాయసోదరులు విజయ నగరసామ్రాజ్యమును స్థాపించిరి [40] వీరి ఆశయమును వేదమతోద్ధరణమే రాజ్య స్థాపకులైన సోదరులు మొదటి హరిహరరాయలు, రెండవ హరిహరరాయలు అని చరిత్రపసిద్ధము. కారణము రెండవ హరిహరరాయలు, రెండవ బుక్కరాయలు అను విజయనగర సామ్రాజ్యపాలకులు కలరు మొదటి హరిహరరాయల కాలము నందు, మొదటి బుక్కరాయలు పెంచుకలదిన్నె అను గ్రామమును నాచన సోమ నాధునికి అగ్రహారముగ ఇచ్చినట్లు ఒక శాసనము కలదు అది పెంచుకలదిన్నె శాస నము. ఆశాసనమునకు రెండునాగరలిపి తామ్రశాసనములు, రెండు మూడుకన్నడలిపి కాగితపుప్రతులు కలవట[41] కన్నడలిపిలో ప్రకటించిన శాసనప్రతియందు శాసన కాలము "రసభూనయనేందుభిః" అని కలదు [42] చదివిన పాఠము "రసాభ్రనయ నేందుభి" అనికలదు. [43] రోమనులిపిలో శాసనప్రతియందుప్రకటించిన "రసర్తునయ నేందుభిః"అనికలదు. [44] రసభూనయనేందుసంఖ్య 1216+78=1294రసాభ్రనయ నేందుసంఖ్య 1206+78=1284. రసర్తునయనేందుసంఖ్య 1266+78=1344. ఇది శకసంఖ్య సంవత్సరము తారణ మాసము చైత్రము. తిథి శుద్ధనవమి. వారము. లేదు. 1284,1294 సంవత్సరములందు విజయనగరసామ్రాజ్యము లేదు. 1344 వ సంవత్సరమునందు కలదు. అది తారణసంవత్సరమే. కాని మొదటి హరిహరరాయల రాజ్యకాలములోనిది.మొదటి హరిహరరాయల, మొదటి బుక్కరాయల సంయుక్త రాజ్యకాలములోనిదైనను కాదు మొదటి హరిహరరాయల రాజ్యకాలము[45] 1336–1346 మొదటి హరిహరరాయల మొదటి బుక్కరాయల సంయుక్తరాజ్య కాలము[46] 1346–1357. మొదటి బుక్కరాయల రాజ్యకాలము[47] 1357–1378. బుక్కరాయలకు పెంచుకలదిన్నె శాసనమునందు "రాజాధిరాజ, రాజపరమేశ్వర" అను విశేషణములు మాత్రమేగాక, "భాషాలంఘిత భూపాలభుజంగమ విహంగమ, రాజరాజభుజంగ, పరరాజభయంకర, హిందురాయసురత్రాణ" అను విశేషణము లును కలవు. (14,15శ్లో) ఇందు "హిందూరాయసురత్రాణ"విశేషణము సాధారణ

విశేషము. కాదు. సార్థకవిశేషణము సురత్రాణశబ్దము సంస్కృతీకరణముసుల్తాను శబ్దమునకుహిందురాయసురత్రాణుడన హిందువులైన రాజులలో ఇంద్రుని వంటి వాడని అర్థము కాదు సుల్తాను వంటి వాడని అర్థము. అట్టి విజయనగరసామ్రాజ్యాధిపతి రెండవ ప్రౌఢదేవరాయలు అతడు తన సేనలో మహమ్మదీయులను చేర్చుకొని, మహమదీయమతమునకు పూర్తి స్వేచ్ఛ నిచ్చి, వారి కోసము తన సింహాసనము సమ్ముఖమునందు మహమ్మదీయమతగ్రంథమైన కొరాన్ నిలిపిన వాడు.[48] అతనికి హిందూరాయసురత్రాణబిరుదము సార్థకము అంతేకాదు రెండవ ప్రౌఢదేవరాయల 1424 వ సంవత్సరము నాటి లేపాక్షిశాసనములోని బిరుదావళికి,[49] పెంచుకలదిన్నె శాసనములోని బుక్కరాయల విశేషణములు అనుసరణములు. లేపాక్షిశాసనమునందు "భాసతప్పువరాయరగండ" అను కన్నడబిరుదము "భాషాతిలంఘ్యభూపాల భుజంగబిరుదోన్నతః" అని సంస్కృతభాషను కలదు సరియైన భాషాంతరీకరణము. ఇది పెంచుకలదిన్నె శాసనమునందు "భాషాలంఘితభూపాలభుజంగమవిహంగమః" అని కలదు కవితార్థము కాని, కన్నడబిరుదార్థము కాదు. రెండవప్రౌఢదేవరాయలకు సార్థకమైన "హిందురాయసురత్రాణ" బిరుదము, కన్నడబిరుదార్థకమైన "భాషాతిలంఘ్య భూపాలభుజంగ" బిరుదము, లేపాక్షి శాసనమునుబట్టి పెంచుకలదిన్నె శాసనము నందు బుక్కరాయలపరముగ సంక్రాంతమైనట్లు స్పష్టము.

పెంచుకలదిన్నె శాసనమునందు బుక్కరాయలు విద్యారణ్యుడు నిర్మించిన విద్యానగరములోని రత్నసింహాసనమునందు ఆసీనుడైనట్లు కూడ కలదు. మొదటి హరిహరరాయల రాజ్యకాలమునందు యువరాజైన మొదటి బుక్కరాయలు రత్నసింహాసనమునందు ఆసీనుడగుట అసంగతము అంతేకాదు. మొదటి హరిహరరాయల మొట్టమొదటి 1340 వ సంవత్సరము నాటి కొడుమూరిశాసనమునందు (కర్నూలుజిల్లా) అతడు గుత్తి నుండి పరిపాలించుచున్నట్లు కలదు.[50] 1346 వ సంవత్సరము నాటి ఆతకలపుండుశాసనమునందును అతడు గుత్తినేలె వీడు నుండి పరిపాలించుచున్నట్లు కలదు[51] మొదటి బుక్కరాయల 1355 నుండి 1368 వఱకు గల పెక్కుశాసనములందు అతని రాజధాని హొసపట్టణమని కలదు.[52] 1346-1357 మధ్య మొదటి హరిహరరాయల, మొదటి బుక్కరాయల సంయుక్తరాజ్యపాలనము హొసపట్టణమునుండి జరిగినను, హొసపట్టణమే విజయనగరమైనను, దానికి విద్యానగరనామవ్యవహారము, విద్యారణ్యనిర్మాణవ్యవహారము స్థూలముగ 1380 వ సంవత్సరమునుండి మాత్రమే సంభవము విద్యారణ్యుని

అసలు పేరు మాధవాచార్యులు మాధవాచార్యుల ఆశ్రమనామము విద్యారణ్యనామ ధేయము. పారాశరమాధవీయమ్, జైమిని న్యాయమాల, వైయాసికన్యాయమాల, కాలమాధవమ్ లేక కాలనిర్ణయమ్ మొదలైన ఉద్గ్రంథములు మాధవాచార్యకృత ములుగాను, పంచాదశి, వివరణప్రమేయసంగ్రహమ్ లేక వివరణోపన్యాసమ్, అను భూతిప్రకాశమ్ మొదలైన ఉద్గ్రంథములు విద్యారణ్యకృతములుగాను కలవు[53] అవి, ఇవి ఏకకర్తృకములే. ఏతత్కర్త మాధవాచార్యులుగా మొదటి బుక్కరాయల మంత్రి. విద్యారణ్యులుగా శృంగేరీపీఠాధిపతి "బుక్కభూపాలసామ్రాజ్యధురంధ రస్య మాధవామాత్యస్య కృతౌ" పారాశరమాధవీయమ్"లో కలదు మాధవా చార్యులు మొదటి బుక్కరాయల మంత్రి అయిన కాలము 1368వ సంవత్సరము[54] విద్యారణ్యులుగ శృంగేరీపీఠాధిపతి అయిన కాలము 1380 వ సంవత్సరము.[55] విద్యారణ్యుల అవసానకాలము 1386 వ సంవత్సరము[56] జగద్గురువు అనగా శృంగేరీపీఠాధిపతి అయిన కాలము 1374 వ సంవత్సరమును కావచ్చును.[57] తత్పూర్వము కాదు శృంగేరీపీఠములోని ఒక కడితమునందు విద్యారణ్యనామ ధేయము కలదుగాని, అది కాలాంతరసంక్రాంతము[58] కావున విద్యారణ్యనామ ధేయము కల పెంచుకలదిన్నె శాసనముకూడ కాలాంతరసంక్రాంతమే కావలయును.

విజయనగరనిర్మాణమునకు శంకుస్థాపనము చేయించినది విద్యారణ్యమహర్షి అని, అది 1336 వ సంవత్సరమునందు జరిగినదని ప్రసిద్ధము. కాని 1380 లేదా 1374 వ సంవత్సరమునకు పూర్వము విద్యారణ్యనామధేయమే లేదు విద్యారణ్యు లకు పూర్వము శృంగేరీపీఠాధిపతి భారతీతీర్థులు భారతీతీర్థులకు పూర్వము శృంగేరీ పీఠాధిపతి విద్యాతీర్థులు విద్యాతీర్థుల శిష్యుడు మాధవాచార్యులే విద్యారణ్యులు. విద్యారణ్యుల కంటె విద్యాతీర్థులు మహావ్యక్తి మహర్షి అగును. విద్యాతీర్థులు చేయిం చిన విజయనగరనిర్మాణశంకుస్థాపనమే విద్యారణ్యమహర్షి పేర విఖ్యాతమైనదని ఒక చారిత్రికాభిప్రాయము[59] మాధవాచార్యులు చేయించిన విజయనగరనిర్మాణ శంకుస్థాపనమే, మాధవాచార్యులే విద్యారణ్యులనుటవలన విద్యారణ్యమహర్షి పేర విఖ్యాతమైనదని మరొక చారిత్రికాభిప్రాయము[60] 1386 వ సంవత్సరము చరమ కాలమైన విద్యారణ్యులు మాధవాచార్యులుగా 1336 వ సంవత్సరమునందు సుమారు సలుబది సంవత్సరముల వాడగును. అంతేకాదు మాధవాచార్యుల ప్రమేయము మొదటి బుక్కరాయల రాజ్యకాలమునందేగాని, మొదటి హరిహరరాయల కాలము నందు గాని, తదుభయుల సంయుక్తరాజ్యకాలమునందు గాని కానరాదు. కావున

విజయనగరనిర్మాణశంకుస్థాపనము విద్యాతీర్థకృతము కావలయును. మాధవాచార్య కృతమైనను, అది విద్యారణ్యకృతమని విఖ్యాతమగుట 1380 లేదా 1374 కంటె పూర్వము సంభవము కాదు 1380 వ సంవత్సరమునందు రెండవ హరిహర రాయలు శృంగేరీపీఠమునకు తన పూర్వులు కావించిన దానములెల్ల నిరాఘాటముగా కొనసాగుట విద్యారణ్యులకు తామ్రశాసనము నొసగెను [61] కావున విద్యారణ్యకృత మైన విద్యాభిధాననగరమని ఉన్న పెంచుకలదిన్నెశాసనము కాలాంతరసంక్రాంతమే కావలయును. అది 1374–80 తర్వాతిది మాత్రమేగాక, లేపాక్షిశాసనమునుబట్టి 1424 తర్వాతిదగుట తథ్యము అనగా పెంచుకలదిన్నెశాసనము కూటశాసనమని అవగాహనమగును అందుకే రెండు నాగరలిపితామ్రశాసనములు వెలసినవి కాఁబోలు! ఒకదానమునకు ఒక తామ్రశాసనముండుటయే పద్ధతి

కాఁబట్టి నాచనసోమనాథుని కాలము నిర్ణయించుటకు పెంచుకలదిన్నె శాసనము నిర్ధారకసాధనము కాదు. నిర్ధాధకసాధనమును కాదు మఱొక నిర్ధారక సాధనము లేదు. నిర్బాధకసాధనములు కలవు. అవి కూడ శాసనములే [62] కాని సమకాలికశాసనములు కావు ఒకటి అర్వాచీనకాలికశాసనము. మఱొకటి పరమార్వా చీనకాలికము.

కడపజిల్లాలోని కడపతాలూకాయంచలి తురుమిలదిన్నెయందు కేశవాలయము ప్రధానద్వారము పైన రాతిపలకమీద "నాచన సోముని అగ్రహారం ఏకభోగం తురిమిళ్లదిన్నె ప్రౌఢదేవరాయలు ఇచ్చిన దత్తం" అని కలదు లిపి పదునెన్మిదవ శతాబ్ది నాటిది. కాఁబట్టి పరమార్వాచీనకాలికశాసనము. స్వతఃప్రమాణము కాదన వచ్చును కాని, 1529వ సంవత్సరమునాటి శ్రీకృష్ణదేవరాయల శాసనమునందు "ఘండికోటసీమలోని పుష్పగిరి ప్రాంత్యం పెన్నకు వుత్తరం నాచిరాజు సోముని అగ్రహారం తురమిళదిన" అని కలదు అర్వాచీనకాలికశాసనము. అయినను విజయనగరసామ్రాజ్యాధిపతి శ్రీకృష్ణదేవరాయల శాసనము. అప్రమాణమనుటకు వీలులేదు ఇందు అగ్రహారప్రదాత పేరు లేదు అందు ప్రౌఢదేవరాయలు" అని కలదు. ప్రౌఢదేవరాయనామధేయులలో మొదటివాఁడు మొదటి దేవరాయలు. రాజ్య కాలము 1406–1422 అయిన మొదటి దేవరాయలు 1385వ సంవత్సరమునుండి రాజ్యాంగ వ్యవహారములందు పాల్గొనుచున్నట్లు శాసనప్రమాణము కలదు అది త్రిపురాంతకశాసనము. అందు రెండవహరిహరరాయల కుమారుడైన వీరదేవ

రాయలకు 1388వ సంవత్సరమునందు సుకృతముగా భూదానము చేసినట్లు కలదు.[63] వీరదేవరాయలే మొదటి దేవరాయలు అతడు విజయనగర సామ్రాజ్యాధిపతి కాకపూర్వము ఉదయగిరిదుర్గాధిపతి కూడ [64] కాబట్టి ప్రౌఢదేవ రాయలు నాచన సోమునికి తిరుమలదిన్నె అగ్రహారమిచ్చిన కాలము స్థూలముగ 1390వ సంవత్సరము కావచ్చును. అయిన నాచన సోమనాథుని ఉత్తరహరివంశ రచనాకాలము స్థూలముగ 1380 ప్రాంతమగును

నాచన సోమనాథుని ప్రసక్తి ప్రథమతః పిల్లలమఱ్ఱి పినవీరభద్రుని శృంగార శాకుంతలమునందు "నాచిరాజునిసోముడు వావామహత్త్వంబు" అని కలదు. (19ప. 1ఆ.) "మా నన్నయభట్టుఁ దిక్కకవి నేర్పాపెగ్గడన్ సోమునిన్" అని పినవీర భద్రుని జైమిని భారతములోని పూర్వకవిస్తుతియందు కలదు. (6ప. 1ఆ.) ఎఱ్ఱా ప్రెగ్గడ ప్రసక్తి శ్రీనాథుని శృంగారనైషధములోని పూర్వకవిస్తుతియందే కలదు. శృంగారనైషధము రచనాకాలము 1395 ప్రాంతము.[65] జైమిని భారతము రచనా కాలము 1490 ప్రాంతము [66] శృంగారశాకుంతలము రచనాకాలము తత్పూర్వము. 1480, 85కావచ్చును. సుమారు శతాబ్ది అంతరము కలదు అంతవఱకు పూర్వకవి స్తుతులందు కానరాని నాచన సోమనాథుని కాలము పదునాల్గవశతాబ్ది ఉత్తరార్ధమే అగును.

ఎఱ్ఱన హరివంశము పదునాల్గవ శతాబ్ది పూర్వార్ధములోని గ్రంథము. సోమ నాథుని ఉత్తరహరివంశము పదునాల్గవశతాబ్ది ఉత్తరార్ధములోని గ్రంథము.

## ఉత్తర హరివంశము

ఉత్తరహరివంశమునందు అవతారిక లేదు. అనుపలబ్ధము కావచ్చును. ఆశ్వాసాది పద్యము కలదు అది తిక్కన భారతావతారికలోని పద్యము వంటి పద్యము కావచ్చును లేదా కేతన దశకుమారచరిత్రములోని ద్వితీయాశ్వాసాది పద్యము వంటి పద్యము కావచ్చును గ్రంథాంతమునందు "సుకుంతు శౌనకాది మహామునీంద్రులకుం జెప్పిన" అను వైశంపాయనుని అసమాపకవాక్యము కలదు అది లేఖకప్రమాదము కావచ్చును

సంస్కృతహరివంశము తాళపత్రగ్రంథములందు కొన్నిట ఆదినుండి రుక్మవధవృత్తాంతము గల 124వ అధ్యాయమువఱకు పూర్వభాగముగాను, బల

దేవవృత్తాంతము గల 129వ అధ్యాయమునుండి ఉత్తరభాగముగాను కలదు.[67] ఎఱ్ఱన హరివంశములోని ఉత్తరభాగమునందలి జరాసంధకథ, కాలయవనసంహారము, రుక్మిణీకల్యాణము, ప్రద్యుమ్నాదిజననము, రుక్మివధ సంస్కృత హరివంశమునందు పూర్వభాగమునందే కలవు.[68] సోముని ఉత్తరహరివంశము ఉపక్రమణికను బలదేవుని ప్రశంస కలదు కావున పై విధమైన సంస్కృతహరివంశము సోమన ఉత్తర హరివంశమునకు మూలము కావలయును. అయినను బలదేవుని ప్రశంసయేగాని, బలదేవుని వృత్తాంతము నాచనసోముని ఉత్తరహరివంశమునందు లేక పోవుటకు హేతువు, ఉత్తరభాగము మొత్తముగాక, శ్రీకృష్ణుని కథలు మాత్రమే రచించుట సోమన ఆశయమగును. సోముని హరివంశమునందలి నరకాసురవృత్తాంతము, విప్రకుమారవృత్తాంతము, శ్రీకృష్ణతపోవృత్తాంతము, పౌండ్రకవాసుదేవవృత్తాంతము, బాణాసురవృత్తాంతము ఎఱ్ఱన హరివంశములోని ఉత్తరభాగమునందే కలవు. హంసడిభకవృత్తాంతము ఎఱ్ఱన హరివంశములోని ఏ భాగమునందును లేదు. ఎఱ్ఱన హరివంశములోని ఉత్తరభాగమునందు పారిజాతాపహరణవృత్తాంతము ప్రసక్తి మాత్రముగ కలదు. ప్రభావతీప్రద్యుమ్న వృత్తాంతము లేదు సంస్కృత హరివంశమునందు పారిజాతాపహరణ, ప్రభావతీప్రద్యుమ్న వృత్తాంతములు కలవు అయినను సోముని ఉత్తరహరివంశమునందు లేవు. జనమేజయవృత్తాంతము, వామనావతారవృత్తాంతము మొదలైనవి కూడ లేవు. కాబట్టి ఉత్తరభాగము మొత్తము రచించుట సోముని ఉద్దేశము కాకపోవలయును.

సోమన తన ఉత్తరహరివంశమునకు స్థానము "తిక్కన సోమయాజిప్రణీతంబైన మహాభారతకథానంతరంబున" అని ఆశ్వాసాంతగద్యములందు తెలిపెను. "మహాభారతగ్రంథానంతరంబున" అని తెలుపలేదు తిక్కన మహాభారతకథాంతమునందు ఇట్లు కలదు

"శిక్షితచిత్తులార శుభసిద్ధులు వొందు డనేకజన్మపా
పక్షపణంబునన్ వెలుఁగు భారతసంహితయెల్లఁ బుండరీ
కాక్షుని వాసుదేవుఁ బ్రకటార్థముగాఁ గని విన్న మానవుం
డక్షయపుణ్యలోకములయందు రమించు నిరామయస్థితిన్."

91 ప స్వ. ప.

ఇందు సమస్తభారతసంహిత ప్రయోజనము పుండరీకాక్షుడైన వాసుదేవుని ప్రకటనమని ఇదమిత్థముగ కలదు. మహాభారతకథాపరమార్థము వాసుదేవపరబ్రహ్మతత్త్వము. కాబట్టి హరివంశము భారతపరిశిష్టాంశము పూర్వాంశమైన భారతకథ వ్యంజకము. పరాంశమైన హరివంశకథ స్పష్టము. శ్రీకృష్ణచరిత్ర సర్వస్వము ప్రపంచార్థము. తదేకదేశము పరమార్థము. అంతేకాదు. తిక్కన మహాభారతకథను పరతత్త్వము హరిహరనాథతత్త్వము. అందుకు తిక్కన భారతము హరిహరనాథాంకితము. సోముని హరివంశమును హరిహరనాథాంకితము. కారణము హరిహరనాథతత్త్వము

నరకాసురుడు భూవిష్ణువుల కుమారుడు. బ్రహ్మవలన వరములు పొందినవాడు. నరకాసురవధానంతరము వసుంధర శ్రీకృష్ణునియొద్దకు వచ్చి చేసిన విన్నపమునందు ఇట్లు కలదు.

"అట్టేల జగములన్నియుఁ
బుట్టింపఁ బెంపఁ ద్రుంపఁ బురుషులు మువురై
పుట్టిన వేలుపువట నా
పట్టియెడం దగునె నడిమిపని మానుటకున్" 186 ప. 1 అ.

అఖిలజగములను పుట్టించు పురుషుడు సృష్టికర్త. బ్రహ్మ. పెంచు పురుషుడు స్థితికర్త విష్ణువు. త్రుంచు పురుషుడు లయకారుడు. మహేశ్వరుడు. బ్రహ్మవిష్ణు మహేశ్వరులు త్రిమూర్తులు త్రిమూర్తులై పుట్టిన దైవము శ్రీకృష్ణుడు. కాబట్టి-శ్రీకృష్ణుడు పరమదైవము త్రిమూర్తులు అభిన్నులు త్రిమూర్త్యభేదభావమునందు హరిహరనాథతత్త్వము గతార్థము

విప్రకుమారవృత్తాంతమునందు అర్జునునికి శ్రీకృష్ణుని పరమోపదేశమిది :

"అక్షరత్రయరూపమై యఖిలయోగ
మూలమగు ప్రణవంబు నా మూర్తి సుమ్ము
నీకుఁ జెప్పితి; నత్యంతనియతమతివి
దప్పు నీ మంత్ర మొరులకుఁ దగదు తెలుప" 59 ప. 2 ఆ.

శ్రీకృష్ణతపోవృత్తాంతమునందు సకలదేవతామునిసంఘములకు శివుడు చేసిన ఉపదేశమునందు ఇట్లు కలదు.

"ప్రణవాత్మకు నవ్యయ హరి
నణిమాదివిభూతికారణాంతఃకరణుం
బ్రణుతించు వారు చేసిన
ప్రణామములు నన్నుఁ జేరు పరమార్థముగాన్" 315 ప 2 ఆ.

శ్రీకృష్ణుని ఉపదేశములోని ప్రణవమూర్తియే శివుని ఉపదేశములోని ప్రణవాత్మకుడు హరి హరిహరులు ఒకటే. శ్రీకృష్ణతపోవృత్తాంతము హరిహరనాథ తత్త్వప్రధానము. (163 వ, 173–176 ప, 201-212 ప.) మునులు ఏకత్వము భావించినను (67, 68 ప. 2 ఆ) శ్రీకృష్ణుడు, శివుడు భిన్నములుగ కనిపించుట జనమేజయుని ప్రశ్న మిట్లు కలదు.

"పుండరీకాక్షునకు శూలి పూజ లిచ్చె
సంయములు చూడ బదరికాశ్రమమునందు
నాఁగ విందు మయ్యిరువుర నాటకంబుఁ
జెప్పి చెవులకుఁ బండువు సేయు మనఘ." 70 ప. 2 ఆ.

శ్రీకృష్ణుడు తపస్సు చేయుట (163 . 2 ఆ.) ప్రత్యక్షమైన శివుడు శ్రీకృష్ణుని ప్రస్తుతించుట (201-212 ప) నాటకము. కారణము భిన్నత్వము మిధ్య. ఏకత్వమే తథ్యము. శివుని ప్రస్తుతి ఏకత్వమే మునులకు సమకూరిన హరిహరాధానము (180 ప.) దేవతలకు తెలిసిన హరిహరాత్మకము హరిహరనాథతత్త్వమే. తద్భిన్నమైన భిన్నత్వసరణి "నవవినోదకథాగోష్ఠి" అని కూడ వైశంపాయనుని అభిప్రాయము. (3 ప. 3 ఆ,)

పౌండ్రకవాసుదేవవృత్తాంతమునందు పౌండ్రసహాయుడైన కాశీపతి, హంసడిభకవృత్తాంతమునందు హంసడిభకులు, బాణాసురవృత్తాంతమునందు బాణాసురుడు శివవరప్రసాదులు పౌండ్రకవాసుదేవవృత్తాంతమునందు శివుడు పార్వతితోను, ప్రమథులతోను శతయోజనదూరమైన తాలవనమునకు వెడలుట, హంసడిభకవృత్తాంతమునందు హంసడిభకుల శివవరములు పస్మగుట, బాణాసురవృత్తాంతమునందు శ్రీకృష్ణునిచే ఖండితశతబాహుడైన బాణాసురునికి శివుడు పంచవరప్రదానము చేయుటశివశ్రీకృష్ణుల నాటకమునకు ఉత్తరరంగము. వరుణుడు "కృష్ణని నాది మూలమని జగమెఱుఁగన్" నుతించుట (259ప 3ఆ) భరతవాక్యము. పారిజాతాపహరణవృత్తాంతమునందు శివబ్రహ్మల ప్రమేయము లేదు. ప్రభావతీప్రద్యుమ్న

వృత్తాంతమునందు బ్రహ్మ ప్రమేయము కలదుగాని, అది బాణాసురవృత్తాంతమునకు అనుకరణము.బింబప్రతిబింబసబంధము కలదు. అందువలన అవి పరిత్యజించి,వాసుదేవపరబ్రహ్మస్వరూపమును హరిహరనాథతత్త్వమును ప్రతిపాదించుటకు అనువైన శ్రీకృష్ణుని కథలే పరిగ్రహించి నాచన సోమనాథుడు ఉపలబ్ధమైన ఉత్తరహరివంశమును మాత్రమే రచించినట్లు ఊహింపవచ్చును.

# సోముని విశేషణములు

సోముని ఆశ్వాసాంతగద్యమునందు "సకలభాషాభూషణ సాహిత్యరసపోషణ సంవిధానచక్రవర్తి సంపూర్ణకీర్తి నవీనగుణసనాథ నాచనసోమనాథప్రణీతంబైన" అని కలదు ఇది ఏకసమాసమైనను రెండేసి పదబంధములకు అంత్యానుప్రాసము కలదు కావున ప్రతిపదబంధము ప్రత్యేకవిశేషము కావలయును నాచన సోమనాథుడు సకలభాషాభూషణుడు, సాహిత్యరసపోషణుడు, సంవిధానచక్రవర్తి, సంపూర్ణకీర్తి, నవీనగుణసనాథుడు అని లర్థము సకల భాషాభూషణ విశేషణము భాషావిషయము. సాహిత్యరసపోషణవిశేషణము సాహిత్యవిషయము సంవిధానచక్రవర్తివిశేషణము కథావిషయము సంపూర్ణకీర్తివిశేషణము. వక్తివిషనవీనగుణసనాథ విశేషణము గుణవిషయము

సకలభాషాభూషణు డనగా సర్వభాషాభూషణుడని అర్థము కాదు సంస్కృతము, అష్టవిధప్రాకృతములు, తెలుగు, కన్నడము కావచ్చును. నన్నయభట్టు సహాధ్యాయుడైన నారాయణభట్టు సంస్కృతకర్ణాట ప్రాకృతపైశాచికాంధ్రభాషలందు కవిరాజశేఖరుడని నందమపూడిశాసనమునందు కలదు ఎఱ్ఱన "సకలభాషా కవితావిశారదుడ"ని ఎఱ్ఱన హరివంశమునందు కలదు (38ప.1ఆ.పూ భా. ఎఱ్ఱన వలె సోమన కూడ సంస్కృతాంధ్రాష్టవిధప్రాకృతభాషలందు కవితావిశారదుడు కావచ్చును.

## సాహిత్యరసపోషణము

సాహిత్యమన కావ్యము. రసము కావ్యవిషయము సాహిత్యరసపోషణమన కావ్యరసపోషణము "విభావానుభావవ్యభిచారిసంయోగాద్రసనిష్పత్తిః" అని భరతుని రససూత్రము విభావ, అనుభావ, సంచారీభావముల సంయోగమువలన రసము నిష్పన్నమగునని అర్థము. రసము నిష్పన్నమగుటకు విభావ, అనుభావ,సంచారీ

భావముల సంయోజనము సమ్యక్కృతము చేయుట రసపోషణము. అది ప్రతికవికి అవశ్యక ర్తవ్యము. సోమనాథునికి ప్రత్యేకవిశేషణమగుటకు హేతువు సంస్కృత హరివంశము పురాణమగుట, సోముని హరివంశము కావ్యమగుట మాత్రమే. స్వతంత్రకావ్యము కాదుగాని స్వతంత్రాంధ్రీకరణమైన కావ్యము

నరకాసురవృత్తాంతమునందు ప్రధానరసము వీరము. నాయికానాయకులు సత్యభామాశ్రీకృష్ణులు సత్యభామ యుద్ధము చేయుట సాధారణమైన విషయము కాదు శృంగారరసాలంబనవిభావము వీరరసాలంబనవిభావమైనది. శృంగారరస స్ఫురణము కలిగించు వీరరసవిజృంభణము సోముని రసపోషణముగ సాగినది. అది పదునాలుగు పద్యముల ఘట్టము అందు రెండు పద్యములు.

గనయంబుం గొనయంబు నెన్నడుముతో, గర్ణావతంసంబుతో
జనుదోయిం గనుదోయి సాయకముతో సంధానహస్తంబుతోఁ
బెనకం జేయుచు నేయుచుండె సతి లక్షీభూతదైతేయత
ద్ఘనగర్వారవజర్జరాంగరుధిరాసారంబు దోరంబుగన్." 157ప.

"అరిఁ జూచున్ హరిఁ జూచుఁ జూచుకములం దందందమందారకే
సరమాలామకరందబిందుసలిలస్యందంబులై లందంబులై
తొరుగం బయ్యెద కొంగొకింత దొలఁగం దోడ్తో శరాసారమున్
దరహాసామృతపూరముం గురియుచుం దన్వంగి కేళీగతిన్ " 162ప 1ఆ.

ఇది పురాణపద్ధతి కాదు కావ్యసరణి ఇందు రెండవ పద్యము పోతనకు మార్గదర్శకమైనది.

విప్రకుమారవృత్తాంతమునందు విప్రుని పుత్త్రశోకము కరుణరసనిర్భరము—

"తడి యొత్తు చీరతో దాది కౌఁగిటఁ జేర్చి
చూపంగఁ గన్నారఁ జూడనైతిఁ
దడవి యాడకయున్న తట్టాడుమని పట్టి
వడఁకంగ సెజ్జపై వ్రాల్పనైతి
నల్లంత దవ్వుల నప్పలప్ప లనంగ
నెదురుగాఁ బఱతేర నెత్తనైతి
వియ్యాలచే నిచ్చి వేడుక ననువారు
తిట్టింప వివి దప్పి దేరనైతి

వకట మిథ్యామనోరథుండైతిఁగాని
కొడుకులంగని దమవారుఁ గొండసేయ
నుండలేదయ్యె సంపద లుచ్చెనేని
రేబరమ కాదె బిడ్డలులేని బ్రతుకు." 16ప.2ఆ.

శ్రీకృష్ణని తపోవృత్తాంతమునందు పిశాచద్వయఘట్టమునందు బీభత్సరసము కలదు పిశాచద్వయవర్ణనము (122,124,125ప.2ఆ.) పిశాచద్వయనైవేద్యసమర్పణము జుగుప్స కలిగించును.

"పకపక నవ్వుచు నొక వి
ప్రుక శేబరమాంసమెల్లఁ బుచ్చి పునుకపా
త్రికలోనఁ గడిగి పెట్టుచు
నకుటిలమతిఁ 'గృష్ణ!' నీకు నర్పిత మనుచున్. 148ప.

ఆరగింపవె దేవ! మాయందు విందు
వేలుపన్నఁ బాటింతురు విప్రమాంస
మిచట మత్ప్రీతి సేసి నన్నేలికొనుము
భక్తి గాని నీకేమియుఁ బ్రాఁతి గాదు." 149ప.2ఆ.

విప్రమాంసనైవేద్యము పిశాచద్వయమునకు భక్తిపూర్వకము, శ్రీకృష్ణునికి హాసజనకము కావచ్చును.గాని సహృదయులకు హృదయావర్జకమగు విషయము. బీభత్సరసమే సహృదయానుభవము.

శ్రీకృష్ణుడు తపస్సు చేసిన సందర్భమునందు అద్భుతరసము కలదు.

"పుష్పములుఁ గోయుఁ జక్రంబు భుజగవైరి
నఱకు నిధ్మము లుశములు నందకంబు
తెచ్చుఁ బాంచజన్యము గాచు దెసలు శార్ఙ్గ
మెదుర నిలచుండు గద సేయునెల్ల పనులు." 165ప.2ఆ.

చక్రాయుధము పువ్వులు కోయుట, గరుత్మంతుడు సమిధలు నఱుకుట, నందకము దర్భలు తెచ్చుట, పాంచజన్యము దిక్కులు కాచుట, శార్ఙ్గము కావలియుండుట, కౌమోదకీగద సర్వకార్యములు నిర్వహించుట విస్మయస్థాయికము.

పౌండ్రకవాసుదేవవృత్తాంతమునందు హాస్యరసము కలదు. పౌండ్రభూపతి తానే వాసుదేవుడని, తన చక్రము, నందకము, పాంచజన్యము, శార్ఙ్గము, కౌమోదకి అసలు వాసుదేవుని చక్రమును, నందకమును, పాంచజన్యమును శార్ఙ్గమును కౌమోదకిని తోలునని, కాల్చునని, అణచునని, చెడునని ఇసుము చేయునని విఱ్ఱవీగుట మాత్రమేగాక నారదునితో ఇట్లనును.

"కలరే రాజులలో మదీయకరచక్రక్రీడ సైరింపఁ బె
ద్దల భీష్మాదుల ధిక్కరింపఁ దగ దెత్తంజాల రీ కైదువో
రలు వో నాడకు గోపవీరు నొరుపేరం జీరుమీ విక్రమా
ఢ్యులలో నేనను వాసుదేవుఁడ నతండున్ వాసుదేవుం డటే" 13ప 2ఆ.

ఇదియెల్ల హాసజనకము

బాణాసురవృత్తాంతములోని ఉషానిరుద్ధుల ఘట్టము శృంగారరసప్రధానము. ఉష విరహతాపమును సోమన వర్ణించిన తీరు అపూర్వము. అది పూర్వరాగమునకు సంబంధించిన శృంగారరసపోషణము.

"శూలి విలోకనానలము సోఁకు రతీశుఁ డెఱుంగుఁగాన య
బ్బాల మనంబులో విరహపావకదాహము నొర్చెనన్న న
ట్లేల పొసంగు దేహము దహించినయంతటితో మనోజుఁడై
గాలియ చెక్కెఁగాన చెడఁగాలఁడువో యెటువంటి మంటలన్." 12ప.

"ఎసఁగు సంతాపభరమున నిట్టునట్టుఁ
బొరలు శయ్యాపలంబునఁ బువ్వుఁబోఁడి
తివుచు విరహానలంబున దివ్వె లెత్తఁ
జిత్తజాతుండు వత్తిఁ దాల్చిన విధమున 131ప. 5ఆ

ఉషానిరుద్ధుల మదనకేళి సంభోగశృంగారరసపోషణమునకు శృంగగ్రాహిక

"తెపలించి కురులొయ్య దివియ లే కటమున్న
కదిసిన కెమ్మోవి గమిచి కమిచి
వెడవెడ సోఁకి పైనదరలే కటమున్న
యలవడ్డ కౌఁగిట నదిమి యదిమి

వలువెడ లింపఁ జేవాటులే కటమున్న
  పైకొన్న జఘనంబుఁ బ్రాఁకి ప్రాఁకి
తమకించి కొసరు పంతంబులే కటమున్న
  కదిసిన చిత్తంబు గరఁచి కరఁచి

తుది మొదలి కంటెఁ దుది కంటె మొదలు చాలఁ
జవుల గనులైన రతులకుఁ జసవు లిచ్చి
పూవిలుతు చేతి జంత్రంపుబొమ్మఁజేసె
మానినీతిలకంబుఁ గుమారవరుఁడు." 212ప. 5ఆ.

ఉత్తరహరివంశములోని నరకాసుర, పౌండ్రక, హంసడిభక, బాణాసురుల తోడి శ్రీకృష్ణుని యుద్ధములెల్ల రౌద్రభయానకరసముద్రాముద్రితములు. శివుని శ్రీకృష్ణస్తుతి శాంతరసవిషయము.

"బ్రహ్మయై రాజసమున నుత్పత్తిఁ గూర్చి
విష్ణుఁడై సాత్త్వికమ్మున వృద్ధిఁ గూర్చి
రుద్రుఁడై తామసంబున రూపు మాపి
చూపుదు చరాచరంబుఁ గౌస్తుభవిభూష." 203ప.

"వామనం బణువు తదాఖ్య వామనుఁడవు
వేదములు త్రినామములు దన్విక్రమమున
నీ త్రివిక్రమనామంబు నెగడె వాణి
వెలయు గోసంజ్ఞ నెఱిఁగి గోవిందుఁ డయితి." 210ప. 2ఆ.

ఇది నాచన సోమనాథుని సాహిత్యరసపోషణమునకు దిక్ప్రదర్శనము.

## సంవిధానచక్రవర్తి

సంవిధానశబ్దమునకు నాచన సోమనాథుని ప్రయోగాంతరము కలదు.

"నారదుండు గలహసంపాదనవిశారదుండు గావున నమ్ముదితతో
నిట్లను నిది నీకుం బని గాదు నా చేసిన సంవిధానంబున నీవు
నిశ్చితంబుగా ననిరుద్ధుం గొనిరమ్ము." 186వచ. 5ఆ.

ఇందు "అమ్ముదిత" చిత్రరేఖ. ఆమె నిశ్చింతగా అనిరుద్ధుని కొనివచ్చుటకు నారదుడు చేసినది సంవిధానము. కాని నారదుడు "చేసిన సంవిధానము" వివరణము లేదు. కావున చిత్రరేఖ ఆచరించినది నారదుడు చేసిన సంవిధానము కావలయును. "అనిరుద్ధుం గొనిరమ్ము" అని నారదుడు అనగానే, చిత్రరేఖ పొంగిపోయి శ్రీకృష్ణని నగరిలోపలి ప్రదేశమునందు ప్రవేశించి, అనిరుద్ధుని హర్మ్యమును సమీపించి, కనకప్రాసాదములోపలి అనిరుద్ధుని చూచి, తన మాయాబలముచేత అనిరుద్ధుని పొదివికొని, పువ్వు వలె నలుగకుండ పట్టుకొని, దేవమానవదానవకోటికి తన కదలిక తెలియకుండ, ఆకాశయానమున చని, ఉషాసతిని కాంచి, అనిరుద్ధుని చూపించెను. (187-191ప. ౯ఆ.) ఇది యెల్ల నారదని సంవిధానమగును. ఇందు చిత్రరేఖ చేతలు సంఘటనలు. సంఘటనల సంయోజనము కల ప్రణాళిక నారదుని సంవిధానము. ప్రయోజనము కలహసంపాదనము ఇది కార్యపరమైన సంవిధానము. ఇట్లు కావ్యపరమార్థమును కాంక్షించి కథాప్రణాళికను సంఘటనల సంయోజనము చేయుట కావ్యపరమైన సంవిధానము.

కథాసంవిధానమను మాట ప్రసిద్ధము. కథాప్రణాళికను సంఘటనల సంయోజనము చేయుట సంవిధానమని నిఘంటువులందు కలదు. సంయోజనము చేయుట అనగా కూర్పు. సంవిధానము.

చక్రవర్తి రాజులకు రాజు. సంవిధానచక్రవర్తి కవిరాజులకు రాజు. "కవీనాం కవిః." అన్యకవుల కంటె అధికుడని అర్థము. కావ్యపరమార్థమును కాంక్షించి, కథాప్రణాళికను సంఘటనల సంయోజనమును సర్వసమర్థముగా నిర్వహించుట సంవిధానచక్రవర్తిత్వము.

సోముని హరివంశములోని కథాప్రణాళిక, అందు సంఘటనల సంయోజనము, ప్రయోజనము సంస్కృతహరివంశమునందు కలవు ప్రయోజనమైన వాసుదేవపరబ్రహ్మము సంస్కృతహరివంశమునకే పరమార్థము. కాబట్టి సమూలకమైన కథాప్రణాళిక, అందు సంఘటనల సంయోజనము, ప్రయోజనము నాచన సోమనాథుని సంవిధానచక్రవర్తిత్వమునకు నిదర్శనము కాజాలదు అమూలకమైనదే నాచన సోమనాథుని సంవిధానచక్రవర్తిత్వమునకు నిదర్శనమగును. సోముని ఉత్తరహరివంశమునకు అనుషంగికప్రయోజనము హరిహరనాథతత్త్వము అది సోముని హరివంశములోని కథలకు మూలమైన సంస్కృతహరివంశకథలందు లేదు.

ఉన్న సంఘటనలను ఉపయోగించుకొని, లేని సంఘటనలను కల్పించుకొని, హరిహరనాథతత్త్వప్రతిపాదనమునకు అనుగుణముగ, ఉన్న కథాప్రణాళికను సంయోజనము చేయుట నాచన సోమనాథుని సంవిధానచక్రవర్తిత్వమునకు నిదర్శన మగును.

ఉత్తరహరివంశములోని నరకాసురవృత్తాంతమునందలి ఊర్వశీనరకాసుర సంవాదము మూలమునందు లేదని ఒక అభిప్రాయము కలదు.[69] ముద్రితగ్రంథము నందు లేకపోయినను తాళపత్రగ్రంథములందు కలదు [70] అంతేకాదు ఎఱ్ఱన హరి వంశమునందు కలదు (41వచ - 44వచ 4ఆ ఉ భా.) ఎఱ్ఱన హరివంశమునందు నాలుగు పద్యగద్యములందు కలదు. సోముని హరివంశమునందు ఇరువదితొమ్మిది పద్యగద్యములందు కలదు ఎఱ్ఱన హరివంశమునందు నరకాసురుని అనురాగము, అహంకారము; ఊర్వశి ఉపాయము, ధైర్యము కలవు సోముని హరివంశమునందు నరకాసురుని కాముకత్వము, వికారము; ఊర్వశి ఉపాయము, సానితనము కలవు. అయినను, ఊర్వశీనరకాసురసంవాదమునందు నాచన సోమనాథుని సంవిధాన చక్రవర్తిత్వము కలదని ఒక అభిప్రాయము కలదు [71] అది సంస్కృతమూలము తోడి సమ్యక్పరిశీలనము చేసిన సమన్వయము కాదు. అంతేకాదు అది హరిహర నాథతత్త్వప్రతిపాదనమునకు అనుగుణముగ మలచినది కాదు.

నరకాసురవధానంతరము వసుంధర శ్రీకృష్ణునికి చేసిన విన్నపము సమూలకము అది ఎఱ్ఱన హరివంశమునందును కలదు. (179 వచ - 180 ప. 4 ఆ. ఉ భా.) అందును, ఇందును లేని హరిహరనాథతత్త్వము గతార్థమగు పూర్వోదాహృతపద్యము (185 ప. 1 ఆ) సోముని స్వతంత్రకల్పనము. ఉన్న సంఘటనను ఉపయోగించుకొన్న సందర్భమది.

విప్రకుమారవృత్తాంతము విని జనమేజయుడు, శ్రీకృష్ణుడు కైలాసమునకు ఏగిన విధానమును అడుగుట సమూలకము. అది ఎఱ్ఱన హరివంశమునందు ఇట్లు కలదు.

హరి రజతాద్రికేఁగి త్రిపురాసురమర్దనుఁ గాంచె నచ్చటన్
సురలు మునీంద్రులుం దగిలి చూచిరి శంకరకేశవాత్మక

స్ఫురదురతత్త్వయుగ్మమని పూర్వులు సెప్పఁగ విందు నేను వి
స్తరముగఁ జెప్పఁగా వలయుఁ దద్విధమంతయుఁ బ్రాజ్ఞపూజితా
109 ప. 5 ఆ. ఉ. భా.

ఇందు శంకరకేశవాత్మకస్ఫురదురతత్త్వయుగ్మమని కలదు. శంకరకేశవాత్మకస్ఫురదురతత్త్వైకమని లేదు. ఇది సోముని హరివంశమునందు ఇట్లు కలదు.

"పరివాదాస్పదవాదమోదమదిరాపానంబుచే మత్తులై
హరి మేలంచు హరుండు మేలనుచు నాహా కొంద ఱీ పొందెఱుం
గురు కైలాసనగంబునందు మును లేకత్వంబు భావించి రా
మురవైరిం బురవైరి బాపుట మహామోహంబు ద్రోహంబగున్. 68 ప.

పదునాలుగు లోకంబులుఁ
బొదలింపం ద్రుంప వలసి పొడవులు రెండై
తుదిఁ దారొక్కటి యగుదురు
వదరలఁ జేయుదురు భేదవాదుల నెల్లన్." 69 ప 2 ఆ.

ఇందు భేదవాదనిరసనము, ఏకవాదమైన హరిహరనాథతత్త్వము ఇదమిత్థముగ కలదు. శ్రీకృష్ణునికి శివుడు ప్రత్యక్షమైనపుడు ఎఱ్ఱన హరివంశమునందు ఇట్లు కలదు.

"హరిఁ జూతురు హరుఁ జూతురు
హరిఁ జూతుర గ్రమ్మఱంగ హరుఁ జూతురు ని
ర్జరులును మునులు నిమ్మెయి
హరిహరతత్త్వయుగవిస్మితాలోకనులై." 39 ప 6 ఆ ఉ. భా.

ఇందును హరిహరతత్త్వయుగమే కలదు హరిహరతత్త్వైకము లేదు. ఇది సోముని హరివంశమునందు ఇట్లు కలదు

"ఇత్తెఱఁగున నయ్యిరువుర
చిత్తముగతి నొడలుఁ గలసి సిద్ధాంతపరా
యత్తులగు మునుల యెఱుకకు
నిత్తై చెలువారె జమిగివేల్పని తెలుపన్." 178 ప. 2 ఆ

ఇందు హళహరుల చిత్తము వలె ఒడలు కలిసినదని, అది సిద్ధాంతపరాయత్తులైన మునుల జ్ఞానమునకు జమిలివేల్పని తెలుపు బీజమని కలదు. జమిలివేల్పు హరిహరనాథుడు. ఇది హరిహరనాథతత్త్వమునకు బీజప్రాయము

ఎఱ్ఱన హరివంశములోని మునుల స్తోత్రమునందు రెండు మూర్తులు కలవు. (41, 42 ప 6 ఆ. ఉ. భా) సోముని హరివంశమునందు మునులకు హరిహరారాధనము, సురలకు హరిహరాత్మకమైన ఏకదైవభావము సమకూడినట్లు కలదు.

"అభ్రంకషంబైన యాలపోతు నితండు
    త్రుంచినాఁ డీతండు పెంచినాఁడు
సాధుసమ్మతముగా సామజంబు నితండు
    గాచినాఁ డీతండు ద్రోచినాఁడు
బర్హిర్ముఖార్థమై పర్వతేశు నితండు
    దాల్చినాఁ డీతండు వ్రాల్చినాఁడు
ఫణపరంపరతోడి పన్నగేంద్రు నితండు
    మెట్టినాఁ డీతండు సుట్టినాఁడు

నేఁడు నాఁడును నాఁడును నేఁడు మనకుఁ
జూపఁ జెప్పంగ, జెప్పంగఁ జూపఁ గలిగె
ననుచుఁ గొనియాడు సంయమిజనుల కొదవె
రజతగిరిమీఁద హరిహరారాధనంబు. 180 ప. 2 ఆ.

సారసంబున లేవ నీరసంబునఁ జావఁ
    బద్మాసనుఁడు వీరి పాలఁగనియె
రూపు గంటఁజెలంగఁ జూపు మంటనలంగఁ
    బంచబాణుండు వీరి పాలఁగనియె
వరములు వడయంగ శిరములు గెడయంగఁ
    బంక్తికంఠుఁడు వీరి పాలఁగనియె
గేహరక్ష నటింప దేహశిక్ష ఘటింప
    బాణాసురుఁడు వీరి పాలఁగనియెఁ

గనియెఁ జిత్రతంబులకు వీరు గలసియుండి
మనుపఁ జెఱుపంగఁ జెఱుపంగ మనుప నేర్తు
రెల్ల లోకంబులకు దైవ మేక మగుట
హరిహరాత్మక మెఱఁగితి మనిరి సురలు 181 ప. 2 ఆ.

ఇందు హరిహరారాధనము, హరిహరాత్మకమైన ఏకదైవభావము ఇదమిత్థమ్ముగ కలదు.

ఎఱ్ఱన హరివంశములోని శివుని శ్రీకృష్ణస్తుతియందు "ఓ ముకుంద నాకు న్నీకును రూపింప లేదు భేదంబు" అని ఒక్క మాట కలదు (84 ప. 6 ఆ. ఉ. భా.) సోముని హరివంశములోని శివుని శ్రీకృష్ణస్తుతియందు ఒక సీసపద్యము కలదు. (212 ప. 2 ఆ.) ఎఱ్ఱన హరివంశములోని శివుని హితబోధయందు విష్ణువు పరమదైవమతమని కలదు. (89 ప. 6 ఆ. ఉ భా.)

సోమన హరివంశములోని శివుని పరమోపదేశము హరిహరనాథతత్త్వము.

"ఏ మిరువురు నేకం బది
సామర్గ్యజురాదితత్త్వసారము హరిచేఁ
గామార్థధర్మమోక్ష
శ్రీమహిమలు మీ తపంబు నేర్పు ఫలంబుల్." 214 ప,

ప్రణవాత్మకు నవ్యయు హరి
నణిమాదివిభూతికారణాంతఃకరణుం
బ్రణుతించువారు చేసిన
ప్రణామములు నన్నుఁ జేరు పరమార్థముగాన్" 215 ప, 2 ఆ.

ఇందు ఋగ్యజుస్సామాథర్వవేదముల తత్త్వసారము హరిహరనాథతత్త్వమని ఇదమిత్థముగ కలదు

ఎఱ్ఱన హరివంశములోని తత్త్వము మూలవిధేయము సోముని హరివంశములోని హరిహరనాథతత్త్వము మూలాతిక్రమణము. అది మూలమునందు ఉన్న సంఘటనలను ఉపయోగించుకొని, మూలమునందు లేని సంఘటనలను కల్పించుకొని నాచన సోమనాథుడు తన ఉత్తరహరివంశమునకు ఆనుషంగికప్రయోజనమైన

హరిహరనాథతత్త్వప్రతిపాదనమునకు అనుగుణముగ సంయోజనము చేసిన సంవిధానము.

ఇది సోమనాథుని సంవిధానచక్రవర్తిత్వమునకు సూచిక.

## నవీనగుణసనాథుడు

నవీనగుణసనాథుడు అనగా నవీనమైన గుణముతో —లేదా— గుణములతో కూడినవాడని అర్థము వచ్చును గుణము కవిపరమైన, వ్యక్తిస్వభావమగును. కావ్యపరమైన, కావ్యగుణములగును. వ్యక్తిస్వభావమునకు ప్రాచీననవీనభేదపరిగణనము సముపపన్నము కాదు. కావ్యగుణములకు ప్రాచీననవీనభేదపరిగణనము సముపపన్నమగును కావ్యగుణములు సుప్రసిద్ధము. అలంకారశాస్త్రములందు ప్రత్యేకముగ గుణప్రకరణములు కలవు ప్రథమతః భరతుని నాట్యశాస్త్రమునందే కావ్యగుణములు కలవు అవి పది 1 శ్లేషము 2 ప్రసాదము 3 సమత 4. సమాధి 5. మాధుర్యము 6. ఓజస్సు 7 సౌకుమార్యము 8 అర్థవ్యక్తి 9 ఉదారత 10. కాంతి. ఇవి వైదర్భీరీతికి ప్రాణములని దండి కావ్యాదర్శమునందు కలదు "ఇతి వైదర్భమార్గస్య ప్రాణా దశగుణాః స్మృతాః" (42శ్లో. 1పరి) గుణమునకు ప్రాణము పర్యాయపదము కూడ అయినది. పదవ శతాబ్దివఱకు కావ్యగుణములు పది మాత్రమే ప్రసక్తమైనవి పదునొకండవ శతాబ్దిని భోజుని సరస్వతీకంఠాభరణమునందు ఇరువదినాలుగు గుణములు కలవు "చతుర్వింశతి రాఖ్యాతాః" (62శ్లో. 1పరి.) అవి మఱల త్రివిధము. అందు ఒక విధము మాత్రమే విద్యానాథుని ప్రతాపరుద్రీయమునందు కలదు ప్రతాపరుద్రీయము పదునాల్గవ శతాబ్ది పూర్వార్ధములోని గ్రంథము. సోముని ఉత్తరహరివంశము పదునాల్గవ శతాబ్ది ఉత్తరార్ధములోని గ్రంథము. రెండును ఆంధ్రదేశీయములు. ప్రతాపరుద్రీయము ప్రభావము నిరాఘాటము అందు భరతుడు తెలిపిన పదిగుణములు మాత్రమేగాక, అదనముగ భోజుడు తెలిపిన పదునాలుగు గుణములును కలవు భరతుడు తెలిపిన పదిగుణములు ప్రాచీనగుణములు అదనముగ భోజుడు తెలిపిన పదునాలుగు గుణములు నవీనగుణములు సోముని ఉత్తరహరివంశమునందు ప్రాచీనగుణములతో పాటు నవీనగుణములును కలవు. కావున నవీనగుణసనాథుడు అనగా నవీనమైన గుణములతో కూడినవాడని అర్థము కావలయును ప్రాచీనమైన కావ్యగుణముల తోపాటు నవీనమైన కావ్యగుణములను పాటించినవాడని తాత్పర్యము

గుణములు రీతికి ప్రాణములు. రీతి అన శైలి నన్నయ మొదలు ఎఱ్ఱన వఱకు గల కవుల శైలికి, నాచనసోమనాధుని శైలికి భేదము కలదు. అది పురాణ శైలి, ఇది కావ్యశైలి అనుట కలదు కాని అది ప్రాచీనగుణాశ్రితము. ఇది నవీన గుణాశ్రితము. నవీనగుణములివి : 1. ఉదాత్తత 2. సౌశబ్ద్యము 3. ప్రేయము 4. ఔర్జిత్యము 5 విస్తరము 6. సమ్మితత్త్వము 7 గాంభీర్యము 8. సంక్షేపము 9. సౌక్ష్మ్యము 10. ప్రౌఢి 11 ఉక్తి 12. రీతి 13. భావికము 14. గతి. ఇందు గాంభీర్య, ఔర్జిత్య, విస్తర, సంక్షేప, ప్రౌఢి, రీతిగుణములు ఉత్తరహరివంశము నందు ఉజ్జ్వలముగ కలవు.

"ధ్వని మత్తాతు గాంభీర్యం—" అని గాంభీర్యగుణలక్షణము. ధ్వన్యర్థము కలది గాంభీర్యగుణము

"ధనదాంతఃపురతారహారములు యాదఃపాలబాలాఘన
స్తనకాశ్మీరము ధర్మరాట్కులవధూసంవ్యానకౌశేయమున్
దనుజేంద్రారివరావరోధదయితా ధమ్మిల్లమాల్యంబులున్
గినుకం దెచ్చి ఘటింపఁజూచు జయలక్ష్మీ నిత్యనైపథ్యమున్."
17ప. 1ఆ.

ఇందు జయలక్ష్మికి నిత్యాలంకరణము ఘటింపఁజూచుట వాచ్యార్థము ఇంద్రయమవరుణకుబేరులను జయింపఁజూచుట వ్యంగ్యార్థము. అంతేకాదు. ఇంద్ర యమవరుణకుబేరులకు వాడిన పదములు నరకాసురుని దురహంకారమునకు వ్యంజకములు అంతఃపురస్త్రీల ప్రసక్తి నరకాసురుని నైచ్యమును ప్రతీయమానము సేయును.

"ఔర్జిత్యం గాఢబంధత్వం—" అని ఔర్జిత్యగుణలక్షణము. గాఢబంధత్వమే ఔర్జిత్యము.

"దృష్టారాతినృపప్రతాపకలుషోద్రేకోగ్రమై తాఁకె సం
దష్టాశీతిసహస్రనిష్ఠురనిషాదాధీశసైన్యంబు సం
ఘృష్టాన్యోన్యభుజావిజృంభణరణత్కేయూరధారోన్నత
స్పష్టాసిక్షుర(కాకుదారపరిఘప్రాసక్షురప్రోద్ధతిన్."     70ప 3ఆ.

ఇందు గాఢబంధత్వము స్పష్టము.

"సమర్థనప్రపంచోక్తి రుక్త స్యార్థస్య విస్తరః" అని విస్తరగుణలక్షణము. చెప్పిన విషయమ్మును సమర్థించు విస్తృతవచనము కలది విస్తరగుణము.

"నెయ్యము లేని సంగతియు నిక్కము లేని వచోవిలాసమున్
వియ్యము లేని వైభవము విందుల సందడి లేని ముంగిలిం
దియ్యము లేని చాగమును ధీరత లేని యహోత్యకృత్యముం
గయ్యము లేని శూరతయుఁ గైకొని యూరక మెచ్చవచ్చునే."

31 ప. 5 ఆ.

ఇందు కయ్యము లేని శూరతమెచ్చరాదనుట సందర్భమును బట్టి చెప్పిన విషయము. తదితరము చెప్పిన విషయమును సమర్థించు విస్తృతవచనము

"సంక్షిప్తార్థాభిధానం యత్సంక్షేపః పరికీర్త్యతే" అని సంక్షేపగుణలక్షణము. సంక్షేపించి చెప్పిన అర్థము కలది సంక్షేపగుణము.

"త్వష్టకు నుదాహరకుఁ జతుర్దశి యనంగ
నొక్క కూఁతురు గలిగిన యిక్కువెఱిఁగి
గంధగజరూపమునను నక్కన్యఁ దెచ్చి
కవసి నరకాసురుండు సౌఖ్యములఁ దేలి."

82 ప. 1 ఆ.

నరకాసురవృత్తాంతమునందు ప్రధానరసము వీరము నరకాసురుడు ప్రతినాయకుడు ప్రతినాయకుని శృంగారము ప్రధానరసమైన వీరమునకు విపరీతము. వివరణీయము కాదు సంక్షేపార్థము.

"ప్రౌఢి రుక్తేః పరిపాక ఇతి కావ్యవిదోవిదుః" అని ప్రౌఢిగుణలక్షణము. ఉక్తిలోని పరిపాకము అనగా వైచిత్రి ప్రౌఢిగుణము ఇది ఉక్తివైచిత్రిలోని ఒక విధము

"దైతేయమదవతీధమ్మిల్లములతోడ
విరుల నెత్తావికి వీడుకోలు
దనుజశుద్ధాంత కాంతాకటాక్షములతోఁ
గలికి కాటుకలకుఁ గాని వావి

దానవమానినీ స్తనకుంభములతోడఁ
　　బసుపుఁబయ్యెదలకుఁ బాయు తెరువు
దైత్యావరోధనదయితాధరములతో
　　సొబగు పీడెములకుఁ జుక్కయెదురు
చేసి సురసుందరీకరోశీరతాల
వృంతచలితాంతకుంతలవిలసదింద్ర
కుల వధూటీలలాటికాకుంకుమంబుఁ
బదిలపఱుపఁ జక్రంబ నీ భరమ కాదె"　　147 ప. 3 ఆ.

ఇందు చక్రము విరుల నెత్తావికి పీడుకోలు, కలికి కాటుకలకు కాని వావి, పసుపుఁబయ్యెదలకు పాయు తెరువు, సొబగుపీడెములకు చుక్కెదురు కల్పింపవల యుననుట ఉక్తిపరిపాకము

"యథోపక్రమనిర్వాహో రీతి రిత్యభిధీయతే" అని రీతిగుణలక్షణము. ఉప క్రమణవిధానము ఉపసంహారము వఱకు కలది రీతిగుణము

"హరి తేజము హరి కాంతియు
హరి విభవము హరి భయంకరాకృతి హరి వే
గిరము హరి విక్రమంబును
హరి యను పేరిటికి లక్ష్మి నాపాదింపన్"　　22 ప ర ఆ.

ఇందు హరి అను ఉపక్రమణము, ఉపసంహారపర్యంతము కలదు ఇది శబ్దవైచిత్రిలోని ఒక విధము

ఉక్తివైచిత్రి కంటె శబ్దవైచిత్రి సోమనాథుని ఉత్తరహరివంశమునందు ఉత్కటముగ కలదు పూర్వోదాహృతములైన "గనయంబున్ గొనయంబు" (157 ప 1 ఆ.) "అరిఁ జూచున్ హరిఁజూచు" (162 ప 1 ఆ) "అభ్రంకషంబైన" (180 ప. 2 ఆ.)" సారసంబున లేవ" (181 వ. 2 ఆ.) అను పద్యములందు శబ్దవైచిత్రి కలదు సోమనాథుని శబ్దవైచిత్రి బహువిధభాసమానము. అది భోజుని ఇరువదినాలుగు గుణములందును ఒక గుణముగ లేదుగాని శబ్దగుణమే అతినవీన గుణము.

"పన్నగంబుల రాజుఁ బగవాఁడుఁ గూడి నీ
    శయనంబుఁ బయనంబు సంతరింప
దుగ్ధవారాశి కూఁతురు నాలుఁ గూడి నీ
    శరణంబుఁ జరణంబు సవదరింపఁ
దామర పగవాఁడు దయితుండుఁ గూడి నీ
    బడిచూపుఁ గుడిచూపుఁ బరిఢవింపఁ
జందురు చెలికాఁడు సయిదోడుఁ గూడి నీ
    యుల్లంబు మొల్లంబు నుపచరింపఁ

గంపమానమనోధ్యానగతుల పూన
కేకతంబున్న మునులకు నేకతంబు
లేక పొడగానవచ్చు నీ లీల గాన
నన్యు లేనాఁట ధన్యులే యంబుజాక్ష." 119ప.1ఆ.

"నరకాసురప్రాణనాశోత్తరణకేళి
    రణకేళి వలకేళి రమణఁ జూపెఁ
గంసదానవశిరఃకమలకృత్తన మేలు
    తన మేలు చేయి పెద్దలకు నొసఁగెఁ
జాణూరముష్టికక్షతజకీలాలంబు
    నాలంబులో నెల్ల నలవు నెఱపె
మురహయగ్రీవాంత్రమూలఫేనావలి
    నావలి దలఁగఁ జీకాకుపఱచె

పీరరససారకాసారవిహరణంబు
విష్ణునకు నొప్పు నతనితో విగ్రహింప
వెరకొనిని వచ్చు మనకు మద్దులు మునింగి
పాఱ పెంపక్కు తమకెంత బంటియనుట" 124ప.4ఆ.

"కూడి గిరులుఁ దరులుఁ గొల్లంబుఁ బల్లంబు
సరసి మిట్టఁ బిట్ట నడవిఁ దడవి
యొపి లొలలు నెలలు నోలంబుఁ గూలంబుఁ
జూచి క్రంతఁ గ్రుంతఁ జొచ్చి వచ్చి" 311ప.5ఆ.

"ద్విరదంబులు నరదంబులు
హరులు నరులు నిక్కు నుక్కు నలవు న్నెలవుం
బురుడున గనుడున కలుకలు
బెరయ నెరయ శౌరిసేరిఁ బిలుచున్ బెలుచన్." 51ప.6ఆ.

"మధుసూదనుం డేయు సాయకంబులు గాలువలు గట్టి గట్టిమెయి మఱువులు సించియుఁ గాయంబులు నొంచియు, మర్మంబులు గీఱియు, మహీతలంబులు దూఱియుఁ బ్రేవులు వెఱికియుఁ బెనుమూఁకల కుఱికియు సీసకంబులు వగిలించియు, శిరంబులు నొగిలించియు...... "148వచ.1ఆ.

ఇంత వైవిధ్యవిలసితమైన శబ్దవైచిత్రి ఇతఃపూర్వసరణికాదు. నవీనగుణమే.

## ఎఱ్ఱన, సోమన — తారతమ్యము

ఎఱ్ఱన, సోమనల తారతమ్యమును పరిశీలించుటకు హేతువులు రెండు కలవు. 1.సమకాలికత. 2. సమానేతివృత్తము.

సమకాలికతావాదమునకు కాలదోషము పట్టినది కారణము పెంచుకలదిన్నె శాసనము కూటశాసనము. ఎఱ్ఱన హరివంశము రచనాకాలము 1340 ప్రాంతము. సోముని హరివంశము రచనాకాలము 1380 ప్రాంతము. సమకాలికతస్థానమున సమీపకాలికతను స్థాపించవచ్చును.

సమానేతివృత్తము సార్వత్రికము కాదు. ఎఱ్ఱన హరివంశము సమగ్రము. సంస్కృతహరివంశములోని పూర్వోత్తరభాగములు రెండును పూర్తిగా కలవి. సోముని హరివంశము ఏకదేశము. సంస్కృతహరివంశములోని ఉత్తరభాగము కొంత కలది ఎఱ్ఱన హరివంశములోని ఉత్తరభాగమునందలి చతుర్థ, పంచమ,షష్ఠ, సప్తమ అష్టమాశ్వాసములు, సోముని హరివంశములోని ప్రథమ, ద్వితీయ, తృతీయ, పంచమ, షష్ఠాశ్వాసములు సమానము. చతుర్థాశ్వాసము భిన్నము. ఇతివృత్తము సమానమేగాని, రచనము స్వతంత్రము కాదు ఎఱ్ఱన రచనము స్వతంత్రాంధ్రీకరణము. యథామూలము కాదు మూలవిధేయము. సోమన రచనము పరమస్వతంత్రాంధ్రీకరణము మూలవిరుద్ధము కాదు. మూలాతిశయము. అందును, ఇందును అమూలకాంశముల ఉనికి అవకాశమే. ఇందుకు కవిత్రయమువారి భారతస్వతం

త్రాంధ్రీకరణపద్ధతియే ప్రబలనిదర్శనము అమూలకాంశములనబట్టి తారతమ్యపరిశీలనము సాధ్యమేకాని, అమూలకాంశములను నిర్ధరించుట అసాధ్యము కారణము సంస్కృతహరివంశ లిఖితప్రతులందు ఏకవాక్యత లేకపోవుట, సంశోధితముద్రణగ్రంధమును లేకపోవుట మాత్రమే.

అయినను ఎఱ్ఱన అధికుడనుటకు ప్రదర్శించిన ఉపపత్తులందు ప్రధానమైనవి నాలుగు కలవు. 1 శబ్దాలంకారప్రీతి 2 కల్పనాచమత్కారము 3. అనౌచిత్యసంపాదనము. 4. పూర్వోత్తరవిరోధము. వీని ఖండనమున ఇవి ఎఱ్ఱన యందును కలవని ప్రత్యుత్పత్తుల ప్రదర్శనము కలదుగాని, తారతమ్యపరిశీలనము లేదు [79]

1 సోమన శబ్దాలంకారప్రీతికి-

"అనుచు ననుచారియై విప్రుఁ డరుగుదేరఁ
దేర గాండివ మిడి యస్మదీయమహిమ
మహి మడుంగ మడుంగగు మనసు మాయ
మాయ గన్నులఁ గ్రమ్మఁ గ్రమ్మఱితి నేను" 34 ప. 2 ఆ.

అను పద్యము ఉదాహరణము అది సంవర్చోచితమని శబ్దాలంకారము గల సోమన పద్యములు మరొక మూడు, ఎఱ్ఱన పద్యములు మూడు, తిక్కన పద్యములు రెండు ప్రత్యుదాహరణములు కాని తిక్కన శబ్దాలంకారప్రీతి బీజమాత్రము. ఎఱ్ఱన శబ్దాలంకారప్రీతి శాఖాప్రాయము సోముని శబ్దాలంకారప్రీతి వటవృక్షసదృశము. శబ్దవైచిత్రికి నిదర్శనములుగ పూర్వోదాహృతములైన పద్యములెల్ల శబ్దాలంకారప్రీతిమాత్రముకు అతివేలమైన శబ్దాలంకారప్రీతి ఆధిక్యసూచకము కాదు.

2. ఎఱ్ఱన రసస్నిగ్ధతకు శ్రీకృష్ణుని బాల్యక్రీడావర్ణనములోని పద్యము, సోముని కల్పనాచమత్కారమునకు అనిరుద్ధుని అదృశ్యమునకు అంతఃపురాంగనల రోదనఘట్టములోని పద్యము ఉదాహరణములు ఇరువురు కవులు ఒకే ఘట్టమును వర్ణించిన పద్యములు కావని, కంసుని మృతికి అతని అంతఃపురాంగనల రోదన ఘట్టములోని పద్యము ప్రత్యుదాహరణము రెండును రోదనఘట్టములే కాని ఒకే ఘట్టము కాదు అనిరుద్ధుని అదృశ్యమునకు అంతఃపురాంగనల రోదనము ఎఱ్ఱన హరివంశమునందు ఇట్లు కలదు.

"ఆ చిత్రరేఖ మాయాచిత్రముఖమున
నమ్మహాభుజుఁ బ్రణయమునఁ గొనుచుఁ
బోవ నాతని యంతిపురము భామినులెల్ల
నాత్మేశుఁ బొడగాన కార్తి నొంది
ప్రియులఁ బాసిన పెన్నరీసమూహముఁ బోలె
నాక్రందనము సేయ నఖిలజనుల
యురివు దివంబున నుద్విగ్న కురరీవి
రావం బక్రమమునఁ బ్రబలమగుచుఁ

బరఁగె నయేద్ధపురిలోన నప్పుడంతు లకట
యెవ్వఁడొకొ మా మనోనాథు నినసమానుఁ
గడఁగి మా కన్ను చెల్లను గప్పి మమ్ము
ననవలుగఁ జేసి యెక్కడేఁ గొనుచుఁబోయె." 3 ప. 8 ఆ. ఉ. భా.

ఇట్లు విలపించుటు ఇంకను నాలుగు పద్యములందు కలదు. (4—7ప.) ఇది సోముని హరివంశమునందు ఇట్లు కలదు.

"చెందమ్మి విరులలోఁ జెందు తేనెలు వోలెఁ
గన్నుల బాష్పాంబు కణము లదరఁ
వలుదచీఁకట్లలోఁ బ్రాలు చుక్కలు వోలె
వేణీభరమ్ములోఁ విరులు ప్రేలఁ
దూలు తీగెల వెంటఁ దూగు తేటుల వోలె
ననదునెన్నడుముల నారు లొలయ
రాపుఁజక్కవలఁ జేరని చంద్రికలు వోలెఁ
జన్నుల ముత్యాల సరులు వెనఁగ

ముద్దుమోము లల్లార్చుచో మూఁపులందుఁ
గర్ణభూషణజాలంబు గళవళింప
మార్చి మార్చి చేతుల వ్రేళ్ల మడఁచికొనుచు
నింక నెట్లమ్మ యంచు నయ్యింతు లేడ్వ" 276 ప. 5 ఆ.

ఇంతులు ఏడ్చుట ఇంకను నాలుగు పద్యములందు కలదు. (278, 280, 281, 282 ప.) ఈ పద్యమే తారతమ్యనిరూపణమునకు సాధనమైనది. పై ఎఱ్ఱన

పద్యమునందు ఆక్రందనమునకు, రోదనమునకు ఉపమానములు కలవు. అవి అంతఃపురాంగనల అమిత్రాక్రందనమును, ప్రబలరోదనమును వ్యక్తము సేయును. క్రింది సోమన పద్యమునందు బాష్పకణములకు, విరులకు, నారులకు, ముత్యాల సరులకు ఉపమానములు కలవు. అవి అంతఃపురాంగనల అందచందములును, కవి కల్పనాచమత్కారమును వ్యక్తము సేయును వస్తుసాక్షాత్కారము కంటె కల్పనాచమత్కారము వైభవోపేతము కాదు.

3 ఎఱ్ఱన హరివంశమునందు "ఊర్వశీనరకాసురుల సంభాషణము గంభీరముగ మధురముగ" కలదని, సోముని హరివంశమునందు ఊర్వశీనరకాసురులు" "నీచాతినీచపాత్రములుగా" కలరని, అనౌచిత్యమని ఖండనము. ఊర్వశీనరకాసురులు ఉత్తమపాత్రలు కావని, అనౌచిత్యము లేదని, ఎఱ్ఱన పద్యమునందే అనౌచిత్యము కలదని మండనము ఖండనమండనములకు కారణములైన పద్యములివి:

## ఎఱ్ఱన పద్యగద్యములు :

నరకాసురుడు "వాసవసింహాసనంబెక్కి యూర్వశి రావించి భావం బనురాగ తరళంబుగా న త్తరళనయనతోడ 41 వచ.

"వరుణుం దోలితి నర్థపుం జదిపితిన్ వైవస్వతున్ గెల్చితిన్
హరిఁ బోఁజోపితి నేన యీశ్వరుఁడ సర్వామర్త్యసిద్ధోరగా
సురగంధర్వవియచ్చరాదులకు మెచ్చు ల్మీఱ నీ వింక న
న్నరవిందానన సత్కరింపుము మనోజానీకసంక్రీడలన్. 42 ప.

అనుటయు నమ్మృగాక్షి యిది యట్టిద యంతటి వాఁడవైన నీ
పెను పసదే తలంప రిపుభేదన సంయమికోటి భక్తితో
నిను నఖిలాధ్వరంబులను నిత్యసమర్చితుఁ జేసి రేని నే
నును ముదమొప్పఁ గైకొని వినూత్న విహారరసాబ్ధిఁ దేల్చెదన్. 43ప.
అంతటి మహత్త్వంబు గని నన్నుం గామింపుమనిన నట్లకాక యని—"
44 వచ 4 ఆ. ఉ. భా.

ఇందు "మనోజానీకసంక్రీడలన్" అను ప్రయోగమునందు అనౌచిత్యము కలదట. అదే ఎఱ్ఱన ప్రయోగము కాదు. "మనోజ్ఞానేకసంక్రీడలన్" అను పాఠాంతరము కలదు. ఇది ఎఱ్ఱన ప్రయోగమైన, అనౌచిత్యాపాదనమునకు అవకాశము లేదు.

## సోముని పద్యగద్యములివి :

"పగవాఁడట దేవేంద్రుఁడు
మగవా నీ వతని కొలువు మానిసి వట నిన్
దగవుచెడి పిలువఁబనుచుట
మగతనమే యిట్టి లంజెమాటలు గలవే. 70 ప.

అనుటయు నచ్చెలువ విచారించి 71 వచ.

లంజియ నౌదు నేను విను లావున నీ వమరేంద్రు గెల్చి న
న్నుం జెఱవట్టి తెమ్మని వినోదము చేసితి గాక చిత్త మె
ల్లం జెడియుండ రిత్తయొడలం జవి చేరనె చిక్కువోయినం
బంజర మేమి సేయఁ రసభంగము సంగతి లోన మెత్తురే. 72 ప.

నవ్వులమాటలో నిజమొ నాకములోన ననేకకన్యకల్
మవ్వపుఁదీఁగెలం దెగడు మానిను లుండఁగ సంత నెన్నఁడో
జవ్వన మమ్ముకొన్న గడసాని ననుం గవయం దలంచితే
పువ్వులు వేడుకైనఁ గడివోయిన వాక్ ముడువంగవచ్చునే. 74 ప.
అనుటయు, 75 వచ.

అంజెదవుగాక ననుఁ జెం
తం జేరఁగ నీక యెంత దఱిఁగిన మిరియా
లుం జొన్నల సరిపోవే
లంజెతనములందుఁ గొమిరెలన్ గెలువవటే." 75 ప. 1 ఆ.

ఇందు నరకాసురుడు అన్నట్లు, ఇంతకుముందు ఊర్వశి మాటలు "లంజె మాటలే." "లంజియనౌదు"నని ఊర్వశి ఒప్పుకొన్నది అంతేకాదు. "సంతలో జవ్వన మమ్ముకొన్న గడసానిని" అన్నది. ఊర్వశి సంతవేశ్యకాదు. స్వర్గవేశ్య. స్వర్గమునందైన జవ్వన మమ్ముకొనవలసిన ఆవశ్యకము లేదు. నిత్యయౌవన. తాను తప్పించుకొనుటకు ఊర్వశి ఇందు స్వర్గములోని అనేకకన్యకలను, మవ్వపుఁ దీఁగెలం దెగడు మానినులను మాటువెట్టినది. అయినను ఊర్వశి "లంజెతనము లందు" యువతులను గెలుచునని నరకాసురుని నమ్మకము. నరకాసురుడు ఉత్తమ పాత్ర కాదు. నీచపాత్ర కూడ కాదు. దుష్టపాత్ర. ఊర్వశి కూడ నీచపాత్ర కాదు.

అయినను సోముని హరివంశమునందు "నీచాతినీచపాత్రలుగా"నే కలరు. ఎఱ్ఱన హరివంశమునందు నరకాసురుని పాత్ర "గంభీరముగ"నే కలదు ఊర్వశిపాత్ర "మధురముగ" కాదుగాని ఉదాత్తముగ కలదు ఎఱ్ఱన హరివంశమునందు అనౌచిత్యము లేదు సోముని హరివంశమునందు అనౌచిత్యము లేకపోలేదు.

4. ఎఱ్ఱన హరివంశమునందు రుక్మిణి ప్రద్యుమ్నాదితనయులను కని తనియక కుమారుని కోరినట్లు (115 ప 5 ఆ) శ్రీ కృష్ణని తపస్సునకు ప్రత్యక్షమైన శివుడు, శ్రీకృష్ణనిభవిష్యత్తపస్సునకు ముందే ప్రద్యుమ్నుని ఇచ్చినట్లు కలదు. (59 ప 74 వచ. 6 ఆ.) సోముని హరివంశమునందు రుక్మిణి సంతానము లేక కుమారుని కోరినట్లు (75 ప 2 ఆ) శివుడు ప్రద్యుమ్నుని ఇచ్చినట్లు కలదు. (184 ప. 2 ఆ.) నరకాసురుని వృత్తాంతమునందే ప్రద్యుమ్నప్రసక్తి కలదుగావున పూర్వోత్తరవిరోధమని విమర్శ. సోముని హరివంశమునందలి పద్యములలోని (108, 127 ప. 1 ఆ.) ప్రద్యుమ్నప్రసక్తి వ్రాయసగాండ్ర వ్యవహారమని, వచనము (189) ప్రక్షిప్తమని ప్రతివిమర్శ వచనము ప్రక్షిప్తము కావచ్చును. యతిమైత్రిఘటితమైన ప్రద్యుమ్నప్రసక్తి కల పద్యము (127) వ్రాయసగాండ్ర వ్యవహారము కాఁజాలదు. అంతేకాదు. విప్రకుమారవృత్తాంతమునందును ప్రద్యుమ్నుని ప్రసక్తి యతిమైత్రిఘటితముగ కలదు "ఉ | దురతం దోడ్కొని పొమ్ము రాముఁడును బ్రద్యుమ్నుండు దక్కన్-" (22 ప 2 ఆ.) కాఁబట్టి పూర్వోత్తర విరోధమే ఇంకను సోముని హరివంశమునందు శ్రీకృష్ణని తపోవృత్తాంతమునందే బాణాసురుని వృత్తాంతమునకు సూచనము కలదు. (181 ప. 2 ఆ.) పూర్వోదాహృతము ఇది కూడ పూర్వోత్తరవిరోధమే

ఎఱ్ఱన హరివంశమునందు "అధికతపంబునకు" చిరకాలతపమని అర్థము చెప్పి అది ప్రద్యుమ్నజననకారణమని, "రుక్మిణీవివాహానంతరంబున ... ననతి కాలంబునకు ... ప్రద్యుమ్నునిఁగనియె" అనుదానికి పూర్వోత్తరవిరోధమనుట విపరీతము. పూర్వతపస్సు ప్రద్యుమ్నజననకారణముగ ఎఱ్ఱన హరివంశమునందు లేదు "పూర్వంబునందును నధికతపం బొనర్చితివి" అని మాత్రమే శివుడు అన్నట్లు కలదు. (74 వచ. 6 ఆ) అంతేకాదు. అధికతపము చిరకాలతపము కాదు. అధికపదవిశేషణము కాలనిర్దేశకము కాదు గుణనిర్దేశకము

## మఱొక అభిప్రాయమిది :[73]

"ఈ తారతమ్యనిరూపణము చేయుటలో వారి వారి పద్యములను పోల్చుట చాలదు ఒకయెడ నొకరి పద్యము, ఇంకొకయెడ ఇంకొకరి పద్యము మేల్తరముగా నుండును. కావున ఆ ప్రమాణమే పనికిరాదు. కవితాసృష్టికి మూలభూతమగు కర్తృమనోధర్మము, చిత్తసంస్కారములోనగు ప్రమాణముల పురస్కరించుకొని విమర్శించినచో సారభూతమైన నిర్ణయములేలును ××× ××× ××× ××× అతడు (సోమన) కలిగించు హృదయవిస్తృతిని బట్టి "ఓహో"యని ఆశ్చర్యచేతుల మగుదమేకాని 'ఆహా' అనెడి పరవశభావమును పొందము."

కవితాసృష్టికి మూలభూతమగు కర్తృమనోధర్మము, చిత్తసంస్కారము లోనగు ప్రమాణములు కతిపయపద్యములనుబట్టి గాక, కావ్యసామస్త్యము మీద కానవచ్చును. ఎఱ్ఱన రచనము ఆశ్చర్యము కలిగింపదు. సోమన రచన ఆశ్చర్యము కలిగించును. కారణము శబ్దవైచిత్రి, కల్పనాచమత్కారము మాత్రమే. శబ్దాలంకారప్రీతి ఆధిక్యసూచకము కాదు కల్పనాచమత్కారము వస్తుసాక్షాత్కారము కంటె వైభవోపేతము కాదు. ఎఱ్ఱన రచన తరంగిణి సోమన రచన నిర్ఝరిణి.

# హుళక్కి భాస్కరుడు

హుళక్కి భాస్కరుడు, మల్లికార్జునభట్టు, కుమారరుద్రదేవుడు, శాకల్య అయ్యలార్యుడు రచించినట్లు కల రామాయణము భాస్కరరామాయణము. అది బహుసమస్యాత్మకము.[74] అవతారికలేదు కాండాద్యంతపద్యములు, ఆశ్వాసాద్యంతపద్యములు ఒక విధముగ లేవు బాలకాండాంతపద్యములు శివపరము అయోధ్యాకాండాదిపద్యము సాహిణిమారుని పరము. అయోధ్యాకాండాంతపద్యములు సాహిణిమారుని పరమే అగును. అవి ముద్రితగ్రంథములందు ఒక విధము తాళపత్రగ్రంథములు కొన్నిట మఱొక విధము. అరణ్యకాండప్రథమాశ్వాసాదిపద్యము సాహిణిమారుని పరము అది ముద్రితగ్రంథములందు ఒక విధము. తాళపత్రగ్రంథములు కొన్నిట మఱొక విధము.[75] ప్రథమాశ్వాసాంత పద్యములు సాహిణిమారుని పరమే అగును. ద్వితీయాశ్వాసాదిపద్యము సాహిణిమారుని పరము. ద్వితీయాశ్వాసాంతపద్యములు సాహిణిమారుని పరమే అగును కిష్కింధాకాండాది పద్యము శివపరము. కాండాంతపద్యములు రెండు కలవు. ఒకటి శివపరము,

మఱొకటి సాహిణిమారుని పరము అతని పరమైన పద్యము తాళపత్రగ్రంథము లందు లేదు [76] కాని లక్షణగ్రంథములందు కలదు. సుందరకాండాదిపద్యము సాహిణిమారుని పరము. కాండాంతపద్యములు శివపరము. యుద్ధకాండాదిపద్యము సాహిణిమారుని పరము. కాండాంతపద్యములు శివపరము యుద్ధకాండాంతపద్యములు అయ్యలార్యునివి. ఆ పద్యములకు ముందు ఇట్లు కలదు.

"అమర హుళక్కి భాస్కరమహాకవి చెప్పఁగనున్న యుద్ధకాం
డము తరువాయి చెప్పెఁ బ్రకటప్రతిభాషణుఁ డప్పలార్యస
త్తమసుతుఁ డయ్యలార్యుఁడు గృతస్థితి నార్యులు మెచ్చునట్లుగా
హిమకరతారకారవిమహీవలయస్థిరలక్ష్మి చేకుఱన్" 2687 ప

యుద్ధకాండములోని 1134 వ పద్యము తర్వాతినుండి కడవఱకు "వేదగిరి నాయనింగారి ప్రేరణమున నయ్యలార్యుఁడు రచియించి"నట్లు ముద్రితగ్రంథము లందు, తాళపత్రగ్రంథములందును కలదు

ముద్రితగ్రంథములలోని కాండాంతగద్యములందు బాల, కిష్కింధా, సుందరకాండములు మల్లికార్జునభట్టు, అయోధ్యాకాండము కుమారరుద్రదేవుడు రచించినట్లు కలదు. అట్లు మాత్రమేగాక బాల, అయోధ్య, కిష్కింధ, సుందర కాండములును భాస్కరుడే రచించినట్లు తాళపత్రగ్రంథములందు కాండాంత గద్యములు కలవు [77] కొన్ని తాళపత్రగ్రంథములందు బాలకాండము, అయోధ్యా కాండము హుళక్కిభాస్కరుడు రచించినట్లును కలదు [78] వెల్లంకి తాతంభట్టు కవి లోకచింతామణియందు "హుళక్కిభాస్కరుఁడ – రామాయణము" అని ఉదాహరించిన "నీ కంఠార్పితకాలపాశము" అను పద్యము (27 ప. 3 ఆ.) సుందరకాండమునందు కలదు. (448ప.) కవిలోకచింతామణి తాళపత్రగ్రంథము లందు "హళిక్కి" అని కలదు. అది "హళక్కి" అను కన్నడపదమునకు అతి సన్నిహితము "హళిక్కి" ప్రాచీనరూపము "హుళక్కి" అర్వాచీనరూపము. అర్వాచీనరూపమే భాస్కరరామాయణము తాళపత్రగ్రంథములందు కలదు. ఉపలబ్ధమైన భాస్కరరామాయణము తాళపత్రగ్రంథములు వెల్లంకి తాతంభట్టు కాలము కంటె ప్రాచీనములు కాఁజాలవు అప్పకవీయమునందు "శ్రీమద్రా మాయణమునందు "రాముని శుభచరితములను" అని భాస్కరుండును" శ్రీకారము లేకుండ కృత్యాదిపద్యము రచించినట్లు కలదు. (73 వచ 4 ఆ.) భాస్కరుడు

రచించినట్లు కాండాంతగద్యములు కల బాలకాండము తాళపత్రగ్రంథములందు అది కృత్యాదిపద్యముగ కలదు ముద్రితగ్రంథములలోని అయోధ్యారణ్యకాండము లందు ఆగమప్రాయములైన పద్యములు కలవు.[79] భాస్కరుడు రచించినట్లు కాండాంతగద్యములు కల తాళపత్రగ్రంథములలోని అయోధ్యాకాండము కథా ప్రధానము.[80] అరణ్యకాండమును అంతేగాక, ముద్రితగ్రంథములలోని గ్రంథ భాగములు గాక, అధఃకరించిన పాఠాంతరభాగములు మాత్రమే పెక్కు తాళపత్ర గ్రంథములందు కలవు.[81] కొన్ని తాళపత్రగ్రంథములలోని కాండాంతగద్యము లందు "భాస్కరసత్కవిపుత్ర - హుళక్కిభాస్కరసత్కవిపుత్ర మల్లికార్జునభట్ట ప్రణీతంబైన" అని, "భాస్కరసత్కవిమిత్ర అయ్యలార్య" అని కలదు [82] అరణ్య కాండము తాళపత్రగ్రంథములన్నిట, ముద్రితగ్రంథములందు వలె కాండాంత గద్యములందు "సకలసుకవిజనప్రణుతయశస్కరభాస్కరప్రణీతంబైన" అనియే కలదు [83] అదే వివాదగ్రస్తవిషయమైనది

## అరణ్యకాండకర్తృత్వము

అరణ్యకాండము రచించిన భాస్కరుడు "హుళక్కిభాస్కరుడు కాడు; మంత్రిభాస్కరుడు" అని ఒక వాదము.[84] హుళక్కిభాస్కరుడే అని మఱొక వాదము.[85]

**అరణ్యకాండము మంత్రిభాస్కరకృతమనుటకు ప్రదర్శించిన ఉపపత్తులు :**

1. మంత్రిభాస్కరుడు రామాయణము రచించినట్లు జనశ్రుతి కలదు. తిక్కనతాత మంత్రిభాస్కరుడు "సారకవితాభిరాము"డని తిక్కన ఉత్తర రామాయణమునందు కలదు. (12ప 1ఆ.) తిక్కన ఉత్తరరామాయణమును రచించుటకు హేతువు, అతని తాత పూర్వరామాయణమును రచించుటయే. అంతే కాదు. తిక్కన తాత మంత్రిభాస్కరుడు "శాపానుగ్రహశక్తియుక్తుఁడు, సాహిత్య విద్యాపారీణుఁడు" అని కేతన దశకుమారచరిత్రమునందును కలదు. కావున కవి. రామాయణకర్త అగును.

మంత్రిభాస్కరుడు కవి, రామాయణకర్త అయినచో ఆ మాటలు తిక్కన, కేతన గ్రంథములందుండుట తథ్యము మంత్రిభాస్కరుని అగ్రనందనుడు కేతన మంత్రి.

"కవితకు ముఖ్యుఁ డితఁ డనఁ గామితవస్తువు లిచ్చువాఁడు నా
నవరసభావకుం డితఁ డనన్ బురుషార్థపరాయణుండు-" 36ప 1ఆ.

అని చెప్పిన కేతనకవి మంత్రిభాస్కరుడు కవి అనలేదు రామాయణకర్త అని చెప్పలేదు సాహిత్యవిద్యాపారీణుడన అలంకారశాస్త్రవేత్త అని అర్థము వచ్చును. కవులు అలంకారశాస్త్రవేత్తలేకాని, అలంకారశాస్త్రవేత్తలందఱును కవులు కారు. కొందఱు కవులు శాపానుగ్రహశక్తియుక్తులే కాని, శాపానుగ్రహశక్తియుక్తులందఱును కవులు కారు సారకవితాభిరాముడన సారమైన కవిత్వము చేత ఒప్పుచున్నవాడని మాత్రమేగాక, సారమైన కవిత్వమునందు అభిరమించువాడనియును అర్థము వచ్చును అలంకారశాస్త్రవేత్తలు సారమైన కవిత్వమునందు అభిరమించుట అత్యంతసహజము. మంత్రిభాస్కరుడు కవి అని, పూర్వరామాయణమును రచించెనని తిక్కన చెప్పలేదు తాను ఉత్తర రామాయణము రచించుటకు హేతువు తాత పూర్వరామాయణము రచించుట అని కూడ చెప్పలేదు. తిక్కన ఉత్తర రామాయణరచనకారణము,

"ఎత్తఱినైనను ధీరా
దాత్తనృపోత్తముఁడు రామధరణీపతి స
ద్వృత్తము సంభావ్యమగుట"

ఇది పూర్వోక్తము. జనశ్రుతి స్వతఃప్రమాణము కాదు. ఉపబలకసాధనము లేదు.

2. అయ్యలార్యుని పద్యమునందు హుళక్కిభాస్కరుడు యుద్ధకాండము రచించినట్లు మాత్రమే కలదు అరణ్యకాండము రచించినట్లు లేదు కావున అరణ్య కాండము హుళక్కిభాస్కరుడు రచించినది కాదు

హుళక్కిభాస్కరుడు అంతవఱకు "యుద్ధకాండము" రచించి "తరువాయి" రచింపకపోవుటవలన, "హుళక్కిభాస్కరమహాకవి చెప్పఁగనున్న యుద్ధకాండము తరువాయి" తాను రచించినట్లు అయ్యలార్యుని పద్యమునందు కలదు ఆ పద్యము పూర్వోదాహృతము. యుద్ధకాండమునకు ముందు సుందరకాండము, అంతకుముందు అరణ్యకాండము హుళక్కిభాస్కరుడు రచించెననిగాని, రచింపలేదనిగాని చెప్పవలసిన ఆవశ్యకము యుద్ధకాండశేషము రచించిన అయ్యలార్యునికి లేదు అరణ్య

కాండను రచించెననియే కాదు, రచింపలేదని గూడ అయ్యలార్యుని పద్యమునందు లేదు. అరణ్యకాండము హుళక్కిభాస్కరుడు రచించినదగుట నిరాధారము

3. "సకలసుకవిజనవినుతయశస్కరభాస్కరప్రణీతంబైన" అని అరణ్యకాండములోని ఆశ్వాసాంతగద్యములందు కలదు ఇతర కాండములందు అట్లు లేదు. "సకలజనవినుతయశస్కర" అను భాస్కరుని విశేషణము, "సకలసుకవిజనవినుత" అను నన్నయభట్టు విశేషణమునకు అతిసన్నిహితము కనుక భాస్కరుడు నన్నయకు సమీపకాలికుడగును. నన్నయకు సమీపకాలికుడైన భాస్కరుడు హుళక్కిభాస్కరుడు కాడు మంత్రిభాస్కరుడగును

అరణ్యకాండములోని ఆశ్వాసాంతగద్యములు భాస్కరుడు రచించినవి ఇతర కాండాంతగద్యములు ఇతరులు రచించినవి. బాల, కిష్కింధా, సుందరకాండములందు "అష్టభాషాకవిమిత్రకులపవిత్ర భాస్కరసత్కవిపుత్ర మల్లికార్జునభట్టప్రణీతంబైన" అని కలదు మల్లికార్జునభట్టు అష్టభాషాకవిమిత్రుడు, కులపవిత్రుడు, భాస్కరసత్కవిపుత్రుడు అని అర్థము "భాస్కరసత్కవి" అష్టభాషాకవిమిత్రుడని అర్థము కాదు తిక్కన ఉత్తరరామాయణములోని ఆశ్వాసాంతగద్యములందు "ఉభయకవిమిత్రకొమ్మనామాత్యపుత్ర" అని కలదు. తిక్కన ఉభయకవిమిత్రుడు గాని, కొమ్మనామాత్యుడు ఉభయకవిమిత్రుడు కాడు మల్లికార్జునభట్టు అష్టభాషాకవిమిత్రుడు గాని భాస్కరుడు అష్టభాషాకవిమిత్రుడు కాడు. "సకలసుకవిజనవినుతయశస్కర"విశేషణము "సకలసుకవిజనవినుత" అను నన్నయవిశేషణమునకు అతిసన్నిహితమే అనుకరణము. అనుకరణమునకు సమీపకాలమే సాపేక్ష్యము కాదు. సుదూరకాలమును సావకాశమే అది హుళక్కి భాస్కరుని అనుకరణమగుట కూడ నిరాఘాటము

4. అరణ్యకాండము చిన్నది. ఆశ్వాసవిభాగము కలదు యుద్ధకాండభాగము పెద్దది ఆశ్వాసవిభాగము లేదు అరణ్యకాండమును రచించిన భాస్కరుడు, యుద్ధకాండభాగమును రచించిన భాస్కరుడు ఒకడైన అట్లు జరుగదు కనుక అరణ్యకాండమును రచించిన భాస్కరుడు మంత్రిభాస్కరుడు యుద్ధకాండభాగమును రచించిన భాస్కరుడు హుళక్కిభాస్కరుడు

అరణ్యకాండము ముద్రితగ్రంథములందు ఆశ్వాసాద్యంతపద్యములు వినా, ప్రథమాశ్వాసమునందు 288, ద్వితీయాశ్వాసమునందు 435 మొత్తము 723 పద్య

పద్యములు కలవు. యుద్ధకాండభాగమునందు ఆశ్వాసాదిపద్యము వినా 1133 పద్య గద్యములు కలవు. సంశోధితముద్రణగ్రంథమును సంతరించుకొన్న అరణ్యకాండములోని పద్యగద్యముల సంఖ్య తరుగవచ్చును; యుద్ధకాండభాగములోని పద్యగద్యముల సంఖ్య తరుగఁజాలదు తక్కువ పద్యగద్యములు కల అరణ్యకాండమును రెండు ఆశ్వాసములుగ విభజించి, ఎక్కువ పద్యగద్యములు కల యుద్ధకాండభాగమును ఆశ్వాసములుగ విభజింపకపోవుటకు హేతువు, యుద్ధకాండము పూర్తిగ రచింపకపోవుట అనుట సంతృప్తికరము కాదు నన్నయ అరణ్యపర్వమును పూర్తిగా రచింపకపోయినను ఆశ్వాసవిభాగము చేసెను. ఆశ్వాస విభాగము వ్రాయుచు చేయునదిగాని, వ్రాసిన తర్వాత చేయునది కాదు కొన్ని తాళపత్రగ్రంథములందు "యుద్ధకాండ శేషంబునందు షష్ఠాశ్వాసము సమాప్తము" అని కలదని ఒక అభిప్రాయము కలదు.[86] కాని ఆ తాళపత్రగ్రంథములందును ఆశ్వాసవిభాగము లేకపోవుటవలన కాఁబోలు, అది "షష్ఠకాండమను నభిప్రాయమున ప్రయుక్తమైయుండును" అని ప్రత్యభిప్రాయము కలదు[87] అయినను మఱొక తాళపత్రగ్రంథమునందు "యుద్ధకాండ శేషంబున సర్వంబును సప్తమాశ్వాసము" అని కలదు[88] అది సప్తమకాండము కాఁజాలదు. ఆ తాళపత్రగ్రంథమునందును ఆశ్వాసవిభాగము లేనిచో, తదభావము ప్రధ్వంసాభావమగును. ఏ ప్రతియందును ఆశ్వాసవిభాగము లేకుండ షష్ఠాశ్వాసము, సప్తమాశ్వాసము అను మాటలు నిర్హేతుకముగ లేఖకులు కల్పించినవి కాఁజాలవు. అస్తవ్యస్తములైన తాళపత్రగ్రంథములను బట్టి, ముద్రితగ్రంథములను బట్టి ఆశ్వాసవిభాగము కలదని, లేదని అరణ్యకాండకర్త మంత్రిభాస్కరుఁడు, యుద్ధకాండభాగకర్త మాత్రమే హుళక్కిభాస్కరుఁడు అనుట సుసంగతము కాదు.

౫ అరణ్యకాండములోని ఆశ్వాసాద్యంతపద్యములకు, ఇతరకాండములలోని ఆద్యంతపద్యములకు భేదము కలదు కనుక అరణ్యకాండకర్త ఇతరకాండకర్తలతో సంబంధము లేనివాడు ఉన్నవాడు హుళక్కిభాస్కరుడు లేనివాడు మంత్రిభాస్కరుడు.

బాలకాండాంతపద్యములు శివపరము. కిష్కింధాకాండాదిపద్యము శివపరము సుందరకాండాంతపద్యములు శివపరము. యుద్ధకాండాంతపద్యములు శివపరము తక్కిన కాండాద్యంతపద్యములెల్ల సాహిణిమారుని పరము శివపరమైన యుద్ధకాండాంతపద్యములు నిస్సందేహముగ అయ్యలార్యుడు రచించినవి. బాలకాండాంత,

కిష్కింధాకాండాది, సుందరకాండాంతశివపరమైన పద్యములును అయ్యలార్యునివి కావచ్చును ఆశ్వాసవిభాగము కల యుద్ధకాండశేషములోని శివపరమైన అయ్యలార్యుని ఆశ్వాసాద్యంతపద్యములు బాల,కిష్కింధా, సుందరకాండములందు ప్రక్షిప్తములు కావచ్చును. భాస్కరరామాయణము కలగూరగంప శివపరమైన ఆద్యంత పద్యములను వదలిన అయోధ్యా, అరణ్యా, కిష్కింధా, సుందరకాండముల ఆద్యంత పద్యములకు భేదము లేదు అరణ్యకాండకర్త ఇతరకాండకర్తలైన మల్లికార్జునభట్టు కుమారరుద్రదేవులతో సంబంధము లేనివాడు కాడు ఉన్నవాడే అరణ్యకాండకర్త. అతడు మంత్రిభాస్కరుడు కాడు. హుళక్కి భాస్కరుడే.

6.అరణ్యకాండములోని శైలికి, యుద్ధకాండములోని శైలికి భేదము కలదు. కనుక అరణ్యకాండకర్త మంత్రిభాస్కరుడు. యుద్ధకాండము భాగకర్త హుళక్కి భాస్కరుడు

అసలు శైలి అన్నది కర్తృత్వనిర్ణయమునకు నిర్ధారకసాధనము కాదు. అట్టిది కలగూరగంపయైన భాస్కరరామాయణకర్తృత్వమునకు నిర్బాధకసాధనము కాదు. అంతేకాదు. అరణ్యకాండము కరుణరసప్రధానము. యుద్ధకాండభాగము వీరరసప్రధానము రసభేదమునుబట్టి శైలిభేదము సంభవము అయినను అరణ్యకాండశైలికి యుద్ధకాండశైలికి సామ్యమును కలదు.[89]

అరణ్యకాండము మంత్రిభాస్కరకృతమనుటకు ప్రదర్శించిన ఆరు ఉపపత్తులందును ఒక్క ఉపపత్తి కూడ బలవత్తరము కాదు అంతేకాదు. భాస్కరరామాయణము ముద్రితగ్రంథములందుగాని తాళపత్రగ్రంథములందుగాని మంత్రిభాస్కరుని ప్రసక్తి లేదు.[90] పూర్వకవిస్తుతులందును మంత్రిభాస్కరుని ప్రసక్తి లేదు హుళక్కి భాస్కరుని ప్రసక్తి కలదు కాబట్టి అరణ్యకాండము మంత్రిభాస్కరకృతము కాదు హుళక్కి భాస్కరకృతమే

## కాలము

హుళక్కి భాస్కరుడు కాకతిప్రతాపరుద్రచక్రవర్తి ఆస్థానకవిగ ప్రతాపచరిత్రాదిగ్రంథములందు కలదు. కాని ప్రతాపచరిత్రాదులు ప్రామాణికగ్రంథములు కావు. అందలి విషయములు స్వతఃప్రమాణములు కావు ప్రమాణాంతరము

మృగ్యము అంలేకాదు. భాస్కరరామాయణమునందు ప్రతాపరుద్రచక్రవర్తి ప్రసక్తి లేదు.

మల్లికార్జునభట్టు హుళక్కిభాస్కరుని పుత్త్రుడు కావచ్చును. కుమారరుద్ర దేవుడు శిష్యుడు కావచ్చును అయోధ్యాకాండాంతగద్యమునందు ముద్రితగ్రంథము లందు "నిశ్శంకవీరమారయకుమారరుద్రదేవప్రణీతంబైన" అని కలదు తాళపత్ర గ్రంథములందు "నిశ్శంకవీరమారయకుమారరుద్రదేవప్రణీతంబైన" అనియే కల దు.[91] కాకతిరుద్రమదేవి ప్రధానమార్గమునందు నిశ్శంకమల్లికార్జునుడు కలడు [92] "ని శ్శంక" ఇంటిపేరు "వీర" విశేషణము మల్లికార్జునుడు వలె మారయ పేరు నిశ్శంక ఇంటిపేరిటి వీరమారయ కుమారుడు రుద్రదేవుడు భాస్కరరామాయణము కృతిభర్త సాహిణి మారయ. ఆశ్వాసాద్యంత, కాండాద్యంతపద్యములు అంకితచిహ్నములు సాహిణిమారయ వీరమారయ ఏకవ్యక్తి కాకపోవచ్చును సాహిణి మారయకు వీరవిశేషణము లేదు వీరమారయకు సాహిణివిశేషణము లేదు సాహిణి మారయ కొడుకు రుద్రదేవుడు కలడు అతడు పాలకుడు గాని కవి కాడు వీరమారయ కొడుకు రుద్రదేవుడు కావచ్చును ప్రతాపరుద్రచక్రవర్తి ప్రధానవర్గములోని వారు తమ కుమారులకు ప్రతాపరుద్రునిపేరు పెట్టుకొనుట సహజము. అయోధ్యా కాండములోని ఆశ్వాసాద్యంతపద్యములందు సాహిణిమారుడు అయోధ్యాకాండకర్త రుద్రదేవుని తండ్రి అని లేదు అయోధ్యాకాండకర్త రుద్రదేవుడు కాకతి ప్రతాపరుద్రచక్రవర్తి కాడు. ప్రతాపరుద్రచక్రవర్తి తండ్రి పేరు మహాదేవుడు [93]

సాహిణిమారునికి సంబంధించిన శాసనములు రెండు కలవు. 1 నెమలిపుర శాసనము [94] కాలము 1233+79=1311 వ సంవత్సరము దానకర్త మారయ సాహిణి రుద్రదేవనింగారు ఇతడు "ప్రతాపరుద్రునకు సామంతుడైనట్లును, గజ సాహిణియైనట్లును, పల్నాడు, గురింజాల స్థలములు సలువదియూళ్లను నిజస్థాయిగా నేలుచున్నట్లును "శాసనమునందు కలదు రుద్రదేవుని తండ్రి మారయ సాహిణి సాహిణి మారయ కావచ్చును సాహిణి అన సేనాపతి సాహిణిమారయ కాకతి ప్రతాపరుద్రచక్రవర్తి సేనాధిపతి అగును 2 వొప్పిచెర్ల శాసనము.[95] కాలము 1311 వ సంవత్సరమే దానకర్త మాచయసాహిణింగారు అతడు "గురిజాల పింగళిస్థలములు చేరియున్న పల్నాడిసీమ కఫకారిగ ...... ప్రతాపరుద్రుని గజ సాహిణియైన గుండమనాయనింగారికెని మారయసాహిణింగారికెని పుణ్యముకొఱకు

దాన"మిచ్చినట్లు శాసనము నందు కలదు గుండమనాయుడు ప్రతాపరుద్రుని గజసాహిణి అయినట్లు మారయసాహిణి ప్రతాపరుద్రుని అశ్వసాహిణి కావచ్చును. రెండవ శాసనమునందు దానము "పుణ్యము కొఱకు" అనియుండుట వలన అప్పటికె మారయసాహిణి మరణము చెందెనని ఒక అభిప్రాయము కలదు.[96] సజీవులకును పుణ్యముకొఱకు దానము సేయుట సముదాచారము గుండమనాయుడు లేక గుండయనాయకుడు లేక గుండయసాహిణి మహబూబ్‌నగర్‌జిల్లాలోని మక్తల్ స్కంధావారమునకు అధిపతిగ ఉన్నట్లు కలదు[97] "గుండమనాయనింగారు" తోపాటు "మారయ సాహిణింగారు"ను 1311 తర్వాత సజీవుడు కావచ్చును

హుళక్కి భాస్కరుడు దశగతులు అను గ్రంథమును సాహిణిమారునికి అంకితమిచ్చినట్లు ఒక అభిప్రాయము కలదు[98] కాని గ్రంథము కానరాదు అది భాస్కరరామాయణముకంటె ముందు అంకితమిచ్చిన గ్రంథము కావచ్చును.

అయ్యలార్యుడు హుళక్కిభాస్కరుని మిత్రుడని కొన్ని తాళపత్రగ్రంథములలోని కాండాంతగద్యములందు కలదు[99] కాని కాండాంతగద్యములవి సాంకర్యము చెందినవి. అప్రామాణికము. "శాకల్యమల్లకవివీరనరసింహావరజాప్పలార్యనందన ...... అయ్యలార్యవిరచితంబైన" అను కాండాంతగద్యమే ప్రామాణికము. శాకల్యమల్లకవికి, వీరనరసింహునికి అవరజుడైన అప్పలార్యుని కుమారుడు అయ్యలార్యుడు కావచ్చును. శాకల్యమల్లుభట్టు ప్రతాపరుద్రుని ఆస్థానకవిగ ప్రతాపచరిత్రాదిగ్రంథములందు కలదుగాని, ప్రతాపచరిత్రాదిగ్రంథములు ప్రామాణికములు కావు. శాకల్యమల్లకవి వేదాంతదేశికుల కుమారుడు వరదదేశికుల ప్రత్యర్థిగ గురుపరంపరాప్రభావమను గ్రంథమునందు కలదు[100] ప్రతాపచరిత్రాదిగ్రంథములకంటె గురుపరంపరాప్రభావము నయము. వేదాంతదేశికుల కాలము[101] 1268–1369 వరదదేశికుల కాలము స్థూలముగ 1300–1380 అగును. ఆ కాలమునందలి శాకల్యమల్లకవి మనుమడు అయ్యలార్యుని కాలము 1340–1400 కావచ్చును. అయ్యలార్యుడు "యుద్ధకాండము తరువాయి" "వేదగిరినాయనింగారి ప్రేరణంబున రచియించినట్లు కలదని పూర్వోక్తము అంతేకాదు. అయ్యలార్యుడు యుద్ధకాండశేషరచనమునకు శ్రీకారము చుట్టెను.

"శ్రీనుతమూర్తియైన రఘుశేఖరు తేజముఁ బొరెఁ బన్నుచు౯" 11వపద్య.

అని యుద్ధకాండశేషరచనమునకు అయ్యలార్యుని ఉపక్రమణము. ఇది నూతనకావ్యారంభసూచకము. కావున వేదగిరినాయని ప్రేరణము యథార్థము కావలయును. వేదగిరినాయుడు రాచకొండ రాజధానిగా పరిపాలించిన వెలమరాజు పెద

వేదగిరినాయుడగును అతని తండ్రి మాదానాయుని ఉమామహేశ్వరశాసనము కాలము[102] 1299+78=1376 వ సంవత్సరము కావున పెదవేదగిరినాయని ప్రేరణమున అయ్యలార్యుడు "యుద్ధకాండము తరువాయి" రచించినకాలము 1380 ప్రాంతము కావచ్చును.

ప్రతాపరుద్రుని సేనాధిపతి అయిన సాహిణిమారునికి అంకితముగ హుళక్కి భాస్కరుడు, అతని పుత్త్రుడు మల్లికార్జునభట్టు, శిష్యుడు రుద్రదేవుడు రచించిన భాస్కరరామాయణములోని "యుద్ధకాండము తరువాయి" వేదగిరినాయని ప్రేరణమున అయ్యలార్యుడు రచించుట నిర్హేతుకము కాజాలదు యుద్ధకాండము రచించుచుండగా హుళక్కిభాస్కరుడు స్వర్గస్థుడు కావచ్చును అయిన "యుద్ధ కాండము తరువాయి" పుత్త్రుడైన మల్లికార్జునభట్టుగాని, శిష్యుడైన రుద్రదేవుడుగాని పూరింపవలయును కాని పూరింపలేదు కారణము హుళక్కిభాస్కరుని తోపాటు మల్లికార్జునభట్టు, రుద్రదేవుడు కూడ స్వర్గస్థులగుట కావలయును రామాయణము పూర్తిగా రచించిన తర్వాత రచింపదలచిన అవతారిక లేకపోవుటకు అదే కారణ మగును. హుళక్కి భాస్కరుడు, మల్లికార్జునభట్టు, రుద్రదేవుడు ముగ్గురును ఏక కాలమునందే స్వర్గస్థులగుట కాకతీయసామ్రాజ్యపతన కాలమునందు సంభవము. కాబట్టి యుద్ధకాండశేషము వినా భాస్కరరామాయణము రచనాకాలము 1323 ప్రాంతము యుద్ధకాండశేషము రచనాకాలము 1380 ప్రాంతము.

కాకతీయ సామ్రాజ్యపతనము కారణముగ అసమగ్రమైన భాస్కరరామా యణము వెంటనే ప్రసిద్ధము కాదు. సావకాశముగ ప్రసిద్ధమగును 1330 ప్రాం తమునందు అప్రసిద్ధమగుటవలన, ప్రోలయవేమారెడ్డి ఎఱ్ఱాప్రెగడచేత రామాయ ణము రచింపజేయుట చూడ సంభవము.

ఇది సంభావ్యమైన సమన్వయము.

## సందేహము

హుళక్కి భాస్కరుని ఆధ్వర్యవమున, అతని పుత్త్రుడైన మల్లికార్జునభట్టు, శిష్యుడైన రుద్రదేవుడు కొన్ని కాండములు రచించుట సంభవమే కాని, సందేహము నకును అవకాశము కలదు అరణ్యకాండమునందు పర్ణశాలయందు సీతను గానక రాముడు పలవించునపుడు కల పద్యమిది :

"ఉల్లము జల్లన దేహము
దిల్లవడఁగ ధృతి దలంక దెప్పర మొందం

దల్లడముతోడ నుటజం
బెల్ల వెదకెఁ బ్రియను గానకెంతయు భీతిన్." 256 ప 2 ఆ.

బాలకాండమునందు విశ్వామిత్రుడు రామలక్ష్మణులను యాగసంరక్షణార్థము పంపుమనిన, "సింహాసనచలితుం డగుచు దశరథుం డల్లన తెలిసె" నపుడు కల పద్యమిది :

"ఉల్లము జల్లన నెంతయుఁ
దల్లడ మందుచు విషాదతప్తుం డగుచుం
బెల్లుగ భయమును బ్రేమయు
మల్లడిగొన మౌనిఁ జూచి మనుజేశుఁ డనున్" 181 ప.

అయోధ్యాకాండమునందు కౌసల్య పట్టాభిషేకసమయమున రాముని రాక విని నీరాజనమిచ్చుటకు ఎదురేగి రాజర్షి రత్నమును చూచినపుడు కల పద్యమిది.

"ఉల్లము ఝల్లన మొగమున
వెల్లదనం బొలయఁ దాల్మి వీడంగఁ గడుం
దల్లడ మందుచు నుండఁగఁ
దల్లి కిఁ బ్రణమిల్లి యతఁడు దగ నిట్లనియెన్." 111 ప

(ఇది తాళపత్రగ్రంథములలోని పాఠము.)

కిష్కింధాకాండమునందు సుగ్రీవుడు దెచ్చియిచ్చిన భూషణోత్తరీయములు చూచి రాముడు వగచినపుడు కల పద్యమిది ·

"ఉల్లము జల్లన ముఖమునఁ
బెల్లుగ బాష్పములు దొరఁగఁ బ్రేమంబున హా
వల్లభరో యనుచును మది
పల్లటిలన్ రాముఁ డుర్వి(బడి మూర్ఛిల్లెన్" 53 ప.

సుందరకాండమునందు సీత తరుశాఖపైని హనుమంతుని చూచినపుడు వచనమిది

"ఉల్లంబు జల్లన నొల్లంబోయి యల్లన గేటి" 2 2 వచ.

యుద్ధకాండభాగమునందు సీత నాగపాశబద్ధులైన రామలక్ష్మణులను చూచి నపుడు కల పద్యమిది :

"ఉల్లంబు జల్లన నొదవు తల్లడమున" 579 ప.

ఇట్లు సదృశమైన స్థలములందు సమానభావప్రకటనము కలదు.

అరణ్యకాండమునందు అధికలఘుకందపద్యము కలదు

"సరసిజకువలయపరికర
పరిమళపరిమిళితశిశిరపావసరంగ
త్తరళతరంగాంబుకణో
త్కరధరమలయానిలంబు దనపైఁ బొలయన్" 425 ప 2 ఆ.

బాలకాండమునందు ఇట్టి పద్యములు రెండు కలవు 80, 341 పద్యములు.

"మణిఘృణిగణయుతరశనా
ఝణఝణితాగణితరణితచరణాంచితభూ
షణఘోషణరణనవిచ
క్షణకంకణకింకిణీకఝుంకృతు లారన్" 80 ప.

అయోధ్యాకాండమునందు ఇట్టి పద్యము కలదు.

"ఝణఝణితకనత్కంకణ
మణిమయమంజీరజనితమంజులశింజా
రణితనభోభాగనిరీ
క్షణ మల్లన సేసి మేనకం బొడగాంచెన్" 305 ప

కిష్కింధాకాండమునందు ఇట్టి పద్యము కలదు

"సురుచిరసరిదురుపరిమళ
సరసిజకువలయసరోవిసరసుమఘనభా
సురవనహిమకరకరశుభ
కరరజనులు పెల్లు వెలయఁ గాఁహతురుఁడై" 374 ప.

సుందరకాండమునందు ఇట్టి పద్యము కలదు

"వికసితసుతకేతకెచం
పకతిలకక్రముకపారిభద్రక కరపీ
రకరంజకురంటకకుర
వకవకుళకపిత్థవిల్వవనవాటికల్" 61ప.

అరణ్యకాండమునందు, యుద్ధకాండభాగమునందు "విస్ఫులింగ" శబ్ద ప్రయోగము విరివిగ కలదు

"కనదురువిస్ఫులింగములు గ్రక్కెడు" [24ప.] "కనదురువిస్ఫులింగములు కన్నులరాలఁగ" [129ప.] "కవిసిరి విస్ఫులింగములు గైదువులున్" [192ప ]

"విస్ఫులింగతతులు వివిధముఖముల" [221ప.] "మహాశనిగతివిస్ఫులింగములు [239ప 1ఆ. అర కాం] "ఒక్కట విస్ఫులింగముల్ వెలువడ" [52ప] "విస్ఫులింగములు వెలువడుచునికి" [84ప]– "మార్గణగణస్ఫురణస్ఫుటవిస్ఫులింగముల్" [373ప.] "గదావిస్ఫులింగాగ్నిజ్వాలలు" [509ప] "నానావిధ విస్ఫులింగములు" [519ప యు కాం భా]

అయోధ్యాకాండమునందు విస్ఫులింగశబ్దము విరళముగ కలదు.

"బొమలు గీరించి విస్ఫులింగములు చెదర" 48ప.

కిష్కింధాకాండమునందు విస్ఫులింగశబ్దము విరళముగ కలదు.

"విశంకటకోపోత్కటవిస్ఫులింగయుతరూక్షప్రేక్షణల్" 464ప.

సుందరకాండమునందు విస్ఫులింగశబ్దము విరివిగ కలదు

"వేడిమి విస్ఫులింగములు" [28ప] "సంకీర్ణస్ఫుటవిస్ఫులింగపటలీ సంచారమై" [197ప.] "చటులాక్షిస్ఫుటవిస్ఫులింగచయసంచారంబు" [208ప] "కనదురువిస్ఫులింగములు కన్నుల రాలఁగ" [344ప.] "అన్నింటను విస్ఫులింగములు నిండఁగ [474ప] "ఘనవిస్ఫులింగతతులు" [475ప] "మండిత విస్ఫులింగవిషమజ్వలితానలకీలలు" [514ప.]

అంత్యానుప్రాసము అన్నికాండములందును కలదు

అనంతరగ్రంథములోని సాదృశ్యము అనుకరణమగును. సమాంతరగ్రంథములలోని సాదృశ్యము అనుకరణమగునా?— యుద్ధకాండశేషమువఱకు మొత్తము హుళక్కిభాస్కరుడు రచించి పుత్త్రునికి, శిష్యునికి కర్తృత్వయశస్సు ధారవోసెనా? అను సందేహము కలుగును సందేహనివృత్తికి సంశోధితముద్రణప్రతియే గతి.

## సమీక్ష

బాలకాండము చాలవఱకు మూలవిధేయము. మూలాతిక్రమణమైన ఋశ్యశృంగుని వృత్తాంతము రంగనాథరామాయణమునకు అనుసరణము స్త్రీపుంసభేదము తెలియని ఋష్యశృంగుడు వారవనితలతో పలికిన విధమిది :

"నాకుఁ గొమ్మొక్కటి మస్తకమ్మునను
మీకుఁ గొమ్ములు రెండు మెఱసె ఱొమ్మునను
నే వృషములఁ గల్గె నివి యపూర్వములు
మీ వల్కలము లతి మృదులము లరయ

మా జటాబంధంబు మాఁడ్కివి గావు
మీ జటాబంధము ల్మెఱుఁగుల బొదలె
మేని బూడిద పూఁత మేల్తావి గొట్టు
వీనుల వింధు మీ వేదనాదములు
కని విని యెఱుఁగ మిక్కాననభూమి
మునులకు నీ వేషములు గల వొక్కొ?" రం రా.

"ఈ మధురస్వరవేదం
బే మెన్నఁడు వినము మీకు నే ముని సెప్పెన్
వేమఱు మీతోఁ జదివెద
నో మునివరులార చెప్ప దొప్పఁగ నాకున్" 73ప.

"నాకుఁ బోలెఁగావు మీ కురంబున రెండు
వలుఁద గుజ్జుగొమ్మ లలరుచున్న
వలతి తులసిపూస లతిసితములు మేనఁ
దనర నలఁదినారు తావి భూతి." 75ప.

"ఈ కట్టిన వల్కలములు
మీ కెంతయు లెస్స లింత మృదువులు గలవే
యే కుజము నారలో యివి
మాకును నివి యొసఁగవలయు మానుగ వీనిన్." 76ప

వారకాంతలు ఋష్యశృంగుని "ఒనర దీమంబుల నొక వింతమృగముఁ గొని తెచ్చు తెఱఁగునఁ గొనివచ్చి"రని రంగనాథరామాయణమునందు కలదు. "తెచ్చిరి దీమముల్ మృగముఁ దెచ్చిన కైవడి ముగ్ధసంయమిన్" అని [83ప. బా. కాం.] భాస్కరరామాయణమునందు కలదు

కుశనాభుని వృత్తాంతములోని రాజకన్యల వర్ణనము రమణీయముగ కలదు.

"జంగమవల్లులో యమృతసాగరవీచులొ రత్నమూర్తులో
యంగజు మోహనాస్త్రములొ యంచితహేమశలాకలో మహీ
రంగనటత్తటిల్లతలొ రాజకళాసఖులో యనంగఁ ద
న్వంగులు వాద్యసంగతుల నాడుచుఁ బాడుచు నుండ నత్తటిన్"
308ప బా. కాం.

అయోధ్యాకాండము కథావిధానము స్వతంత్రము వాల్మీకిరామాయణమునందు కైకేయి రాక్షసి కాదు మనోదౌర్బల్యము కల మానవస్త్రీ. మంథర మహారాక్షసి కైక మనోదౌర్బల్యమును పడగొట్టినది మంథర చేసిన మహోపన్యాసముచేత కైక మనసు మాఱినది ఉపాయము కూడ చెప్పినది మంథర ఉబ్బితబ్బిబ్బైనది కైకేయి ఆ గూనిదాని గూనికే బంగారుతొడుగు చేయించెదనన్నది. తన పంతము చెల్లకున్న తాను చచ్చినట్లు లెక్క అన్నది. వచ్చినట్టు వరము లిచ్చినాడు దశరథుడు చూడ రమ్మనిన రామునికి వరముల సంగతి చెప్పినది కైక. జనకునాజ్ఞ జవదాటలేని రాముడు సమ్మతిని తండ్రికి జెప్పి, తల్లి దగ్గఱకు వచ్చి, కన్నతల్లి కౌసల్య దుఃఖార్ణవము ను దాటి, లక్ష్మణుని ఆగ్రహాగ్నిపర్వతప్రజ్వలనమును చల్లార్చి, సీత అకారణప్రస్ఫీతశోకమును అనునయించి, అనుమతించి, లక్ష్మణసీతాసమేతుడై, వసిష్ఠపుత్త్రుడైన సుయజ్ఞునింటికి వచ్చి వల్కలధారణము చేసినట్లు వాల్మీకి రామాయణమునందు కలదు భాస్కరరామాయణమునందు కైక రక్కసి. మందర నిమిత్తమాత్రము. రాముడు "కేకయరాజనందనమందిరద్వారమునకు" వచ్చి, "బాష్పాకులలోచనుఁడును దీనవదనుఁడు"నైన తండ్రిని చూచి "భీతుఁడయి" కైకేయికి నమస్కరించి కారణమడిగినాడు ఆమె వరముల సంగతి చెప్పినది ఆ చెప్పుటలో ఒక విశేషము కలదు వరము లడిగినప్పుడు వాకొనని, రాముని "పదునాలుగేడులు మునిస్థితికిఁ గానకుఁ బుచ్చుట" చేర్చినది. దశరథుడు నోరెత్తలేదు రాముడు "ధన్యుఁడ నేఁగెద కానకు" అన్నాడు అక్కడే సీతను అనునయించి, అనుమతించి, లక్ష్మణుని ఆగ్రహాగ్నిపర్వతప్రజ్వలనమును చల్లార్చెను అప్పుడు కైక "తన సమక్షమున రాముఁడు నారచీరలు కట్టుకొని కాననభూమికి సర్వశూన్యుఁడై చనవలె" నన్నది. రాముడు "అట్లే చేసెదను మునివేషమునకు వల్కలాదులు కొనితేర పంపుము" అన్నాడు. తత్క్షణమే తెప్పించినది కైకేయీ మహారాజ్ఞి సీతారామలక్ష్మణులు కైకేయీమందిరమునందే తపోవేషము లు తాల్చినట్లు భాస్కరరామాయణమునందు కలదు ఇది స్వతంత్రకథనము.

సీత అమాయకత్వము చక్కగ చిత్రింపఁబడినది

"ఆ నగరంబు వెల్వడి ధరాత్మజ ముందటఁ గానవచ్చు ను
ద్యానముఁ జూచి కోమల కరాబ్జమునన్ భుజ మప్పళించుచున్
లేనగ వొప్ప నల్ల తరుతే మన యేఁగెడు కాననంబు నా
నాసనపద్మ మెత్తె వసుధాధిపుఁ డశ్రువితానపంక్తితోన్." 116ప.

అరణ్యకాండము మూలవిధేయము సంక్షేపరూపము. రంగనాథరామాయణా నుసరణము కలదు స్వతంత్రకల్పనములును కలవు అందు శూర్పణఖ రాముని వర్ణించిన పద్యమొకటి :

"రేకు లన్నియు విచ్చి రేయెండ జిగి నిండి
  కరమొప్పు తెల్లదామరల కంటె
నఱలేని నెఱదీప్తి మెఱుఁగెక్కి సరిమిఁటఁ
  జరియించు సంపూర్ణచంద్రు కంటె
నునుఁదీఁగఁ జిగిదోఁగి నునుపార నిగ్గారి
  తనరు దిక్కరుల హస్తముల కంటె
నిగిడి చేరువలెల్ల నీలోత్పలద్యుతుల్
  పచరించు హరినీల రుచుల కంటె

నితని కన్ను లొప్పు నీ రాజు మోమొప్పు
నితని కరము లొప్పు నితని మేని
కాంతి యొప్పు ననుచుఁ గడువేడ్క నన్నిశా
చరణి చూచె రామచంద్రుఁ దవిలి." 135ప. 1ఆ.

ఇందు ఉపమానములైన తెల్లదామరల, సంపూర్ణచంద్రుని, దిక్కరుల హస్తముల, హరినీలరుచుల వివరములు మనోహరములు.

మాయలేడి వర్ణనము కూడ స్వతంత్రకల్పనమే

"నెలలోని యిఱ్ఱికి నీలకంఠుని చేతఁ
  బొలుపారు లేడికిఁ బుట్టెనొక్కొ
యజుఁడన్ని రత్నంబు లందునుం గలుగు క్రొ
  మ్మించుల దీనిఁ గల్పించెనొక్కొ
రోహిణాచలము మేరువుఁగూడి యురుతర
  ప్రభల నీ హరిణంబుఁ బడసెనొక్కొ
క్రొక్కారు మెఱుఁగులుఁ జుక్కల యెఱపును
  గలసి యీ మృగమయి వెలసెనొక్కొ
దీనిఁ బోలంగ జంతువుల్ త్రిభువనముల
యందు మఱి కలవొకో యని యాత్మ మెచ్చి

ప్రీతి వనదేవతలు సూడ సీత దృష్టి
మార్గమున కల్లఁ జనియె నమ్మాయ యిఱ్ఱి" 25ప. 2ఆ.

ఇందలి సంభావనములు, వనదేవతలు సైతము ఆత్మ మెచ్చి అరయుట, సీత ఆ లేడిని పట్టి తేవలయుననుటకు అత్యంత సమర్థములు.

రావణుడు అపహరించుకొనిపోవునెడ సీత ఆక్రందనము కరుణరస నిర్భరము. అవి ఎనిమిది పద్యములు. (107–115ప. 2ఆ.) అందు తుదిపద్యము హృదయవిదారకము.

"పావనాకార గోదావరీదేవి నీ
వెఱిఁగింపవమ్మ రాజేంద్రుతోడ
నో మాల్యవంత పుణ్యోన్నతగిరినాథ
చెప్పంగదే రాజసింహుతోడ
నో జనస్థానమహీజనులార యీ
విధ మెఱిఁగింపరే విభుని తోడ
నో దండకాటవినున్న తాపసులార
నా పాటు చెప్పఁడీ నాథుతోడ

నేను శ్రీరాముభార్య మీరెవ్వరైన
నడ్డపడి తాఁకి విడిపింపరయ్య కావ
రయ్య సురలార మునులార యక్షులార
యఖిలదిక్పతులార పుణ్యాత్ములార" 115ప. 2ఆ.

కిష్కింధాకాండము మూలవిధేయము– కాళిదాసు రఘువంశములోని అజ విలాపమునకు, కుమారసంభవములోని రతివిలాపమునకు మార్గదర్శకమైన తారా విలాపము మూలమునందు వలె తారస్థాయిని కలదు. అమూలకమైనది, స్వతంత్ర కల్పనమైనది తారాశాపము

"నరవర యిట్లకారణమ నాపతిఁ జంపితి గాన యీవు బం
ధురభుజశక్తితో మహిజఁ దోకొని వచ్చిన సీత నీ కడం
జిరతరకాల మింపుగ వసింపక నీ వతిదుఃఖపాటుతో
నెఱియుచునుండ భూమిఁ జొర నిమ్మనుచున్ శపియించెఁ గిన్కతో."
303ప.

అనుగ్రహము లేని శాపమిది తార శాపమువలన అట్లు జరుగలేదుగాని, అట్లు జరుగుటవలన తారశాపము కల్పితమైనది. చమత్కారకల్పనమే,

కవి సంస్కృతవ్యాకరణ పాండిత్యప్రకర్షను ప్రదర్శించు పద్యమొకటి కలదు.

"యమునద్గంగము కృష్ణభూమదిల మబ్జాక్షన్మనుష్యంబు నీ
లమహీధ్రన్నిఖిలాచలావలి తమాలద్భూజ మిందీవర
త్కుముదశ్రేణి పికద్విహంగము దమస్తోమద్గ్రహార్కప్రభా
సముదాయం బగుచుండె లోక మలఘుశ్యామాభ్రముల్ పర్వినన్"
382ప.

కాఱుమబ్బులు దట్టముగా క్రమ్మినపుడు గంగానది యమునానదిగ, భూమి నల్లరేగడి నేలగ, మనుష్యలందఱు మహావిష్ణవులుగ, పర్వతములెల్ల నీలాచలములుగ, వృక్షములన్ని గానుగుచెట్లుగ, తెల్లగలువలు నల్లగలువలుగ, పక్షులెల్ల కోకిలలుగ, సూర్యకాంతిసముదాయము చీకటిగుంపుగ మాఱెనని అర్థము అది సహజము. అందుకు యమునాదినామములను ధాతువులుగా మార్చి, వానిని శతృప్రత్యయాంతములు చేయుట సంస్కృతవ్యాకరణ పాండిత్యప్రదర్శనము

అంగదుడు వివరించిన శోకస్వరూపము సార్వజనీనము. సార్వకాలికము.

"శోకముఁ బొందు నే ఘనుఁడు శోకము కాలవిషంబు శోక ము
ద్రేకముఁ బొంద మానస మతివ్యథ పాల్పడు శోకమగ్నునిం
బైకొని చంపుఁ గ్రూరఫణి బాలునిఁ బోలెను శోక ... త్మలోఁ
జేకొని వానిచిం బరఁగఁ జెల్లునె చేయఁ బరోపకారము ..." 768ప.

ఇందు "క్రూరఫణి" అను పాఠము "కాలఫణి అని" కవిపాఠము కావచ్చును—

సుందరకాండము సుందరతరము హనుమంతుడు లంకాపురమున సీతను వెదకుచు, నిద్రించు స్త్రీలను చూచి, ధర్మవిహీనుడనైతినని చింతించి, కామించి చూడనందున దోషము కాదని భావించి, తలపోసిన విధమిది

"సుదతిని సుదతుల లోపల
వెదకక మృగకులములోన వెదకుదురే యీ
సదనంబులలో నృపసతి
వెదకక యొండెడల నాకు వెదకఁగ నగునే" 97 ప.

ఇది సయుక్తికముగను సమర్థముగను కలదు.

హనుమంతుడు-అనవాలుగా ఇచ్చిన అంగుళీయకమును సీత, రాముని వలె

"అక్కునఁ జిక్కఁజేర్చి ముదమారఁగ ముద్దిడి యింతగాల మే
నిక్కడ నిట్ల యుండఁగ నిజేశుఁడు నీవును నన్నుఁ బాసి మీ
రక్కడ నుండ నెట్లు మనసాడె విభుండట నన్ దలంచునా
నిక్కము చెప్పు నావలని నెయ్యము భూపతి కెట్టి చందమో 292

బాఁతిగ నిడ గ్రైవేయక
మె తోఁచెదు నాకు నాదు ప్రాణేశునకుం
జేతం బెట్టఁగఁ గంకణ
మైతో కేయూరమైతొ యచ్చటఁ జెపుమా. 293

నరపతికి నాకుఁ బరిణయ
మిరవారఁగ నాఁడు చేసితిప్పుడు దేశాం
తరమునఁ జిక్కిన నన్నును
వరుసం గూర్పఁగ నీవ వచ్చితి కరుణన్" 294 ప.

అని పలుకుట మృదుభావముగ్ధము కరుణరసస్నిగ్ధము.

అనంతరకవులకు ఆదర్శప్రాయమైన చంద్రవర్ణనమిది :

"కువలయపర్వ మబ్జముల గొంగ చకోరమనోరథంబు జ
క్కవకవ పాయు త్రోవ కఱకంఠుని యౌదల పువ్వు చిత్తసం
భవు దళవాయి దేవతల పారణ మంబుధి యుబ్బు లోచనో
త్సవము దమోవ్యపాయము నిశామణి తూర్పునఁ దోఁచె నయ్యెడన్."
170 ప.

హుళక్కిభాస్కరుని యుద్ధకాండభాగమునందును వర్ణనావైదగ్ధి కలదు.

"అవిరళతారకానిబిడహారము లోలి ధరించి చంద్రికా
ధవళనినూతనాంబరము దట్టపు గాఁగ ముసుంగు పెట్టి కై
రవమధురస్మితం బమర రాత్రివిలాసిని యొప్పె శీతరు
క్ప్రవిమలరత్నదీపమును గల్గు నజాండనికేతనంబునన్." 457 ప.

మందోదరి హితబోధకు (766–780 ప) రావణుని నిరాకరణమునందు (782–786 ప)

"ఎఱిఁగి యెఱింగి మున్నతఁడె యగ్గొనరించెను దానికై కదా
చెఱగొని వచ్చితిం బిదప సీత వృథాకథ లింక నేల పెం
పఱ బ్రదుకెంత తీయనె ఖరాదుల చావున కేమి చింతసే
మఱఁదలి బన్న మే పగిది మానిని యోఁగుదు సంధి చేసినన్." 784 ప.

అను పద్యము బహుళార్థసాధకము.[103]

అయ్యలార్యుని యుద్ధకాండశేషము భాస్కరరామాయణమునకు శిరోమణి. చాలవఱకు మూలవిధేయము రంగనాథరామాయణానుసరణము కలదు స్వతంత్ర కల్పనములును కలవు కాలనేమి వృత్తాంతము (1627–1717 ప) రంగనాథ రామాయణానుసరణము అందు కాలనేమి ఆశ్రమవర్ణనము (1627–29 ప.) ధాన్య మాలిని ఉన్న సరస్సు వర్ణనము (1642–1647 ప.) స్వతంత్రకల్పనములు. యుద్ధవర్ణనములు వీరరౌద్రభయానకరసముద్రాముద్రితములు రామరావణయుద్ధము రామరావణయుద్ధము వలెనే కలదు (1522–1575 ప) మండోదరి రాముని మహత్త్వము చెప్పునెడ మత్స్య, కూర్మ, వరాహ, నృసింహ, పరశురామావతారముల ప్రసక్తి కలదు. (1898–1903 ప) అనుగమనప్రసక్తి కలదు (1919 ప.) రావణుని సమాధానమునందు ముక్తికాంక్ష కలదు.

"ఎఱుఁగుదుఁ బద్మబాంధవకులేశుఁడు పంకజనాభుఁ డౌట యే
నెఱుఁగుదు మున్న యిందిర మహీసుతయై తనరారు సీతగా
నెఱుఁగుదు నాకు రాఘవమహీశుని చేతి వధక్రమంబు ని
ట్లెఱిఁగియు ముక్తిఁ బొందఁగ నభీష్టము గల్గుట నింత చేసితిన్."
1929 ప.

అంత శివభక్తుడు ఇంత విష్ణువైరభక్తుడగుట వింత.

రాముని బాణములకు రావణాసురుని తలలు, చేతులు తెగి మఱల వచ్చుటకు కారణము, బ్రహ్మవరమున రావణుని నాభియందు అమృతము కలదని విభీషణుడు చెప్పుట కలదు. (2161 ప.)

రావణుని మరణమునకు విభీషణుడు విచారించు ఘట్టమునందలి,

"ధృతిప్రవాళః ప్రసహాగ్రపుష్ప
స్తపోబల శ్శౌర్యనిబద్ధమూలః
రణే మహాన్రాక్షసరాజవృక్ష
స్సమ్మర్దితో రాఘవమారుతేన" 10 శ్లో 112 స.

అను శ్లోకమునకు అయ్యలార్యుని ఆంధ్రీకరణమిది

"సారస్కంధము శౌర్యమూలము విరాజద్బాహుశాఖంబు దు
ర్వారోదారధృతిప్రవాళ మతిదీప్యత్కోపపుష్పంబుఁ బా
పారంభైకఫలంబునై పరఁగు దైత్యాధీశవృక్షంబు దా
నీ రూపంబున రామమారుతి విఱిచెన్ హేలాసముల్లాసియై" 2203 ప.

ఇందు రాఘవపాండవీయరూపకము కంటె రామహస్తిరూపకము రసవత్తరము అంతేకాదు ఈ పద్యము "లలితస్కంధము కృష్ణమూలము" అను పోతన పద్యమునకు ఒరవడి. ఇది రావణపరము అది భాగవతపరము. అందు శ్లేష అధిక విశేషము.

రాముడు సీతతో నిష్ఠురోక్తులు పలుకుట [2342–2344 ప.] యథామూలకములైనను అనౌచిత్యమని ఒక అభిప్రాయము కలదు [104] అవి లేనిచో సీత అగ్నిప్రవేశము చేయవలసిన ఆవశ్యకము లేదు రాముడు సీతకు అగ్నిపరీక్ష పెట్టినట్లు లోకాభిరామాయణమునందు కలదు వాల్మీకిరామాయణమునందు, భాస్కరరామాయణమునందు లేదు తానే చేసినట్లు కలదు శివుడు చేసిన శ్రీరామునిస్తుతియందు [2419ప ] రావణుడు "భూసురులకు నెల్లనాఁడు మెడఁజుట్టిన పాము" అని కలదు. అది భుజగభూషణుడైన శివుఁడే అనుట కూడ అనౌచిత్యమని మఱొక అభిప్రాయము కలదు [105] మెడఁజుట్టిన పాము శివునికి భూషణము. భూసురులకు కాదు.

అగ్నిప్రవేశము చేసిన సీత అభివర్ణనమిది :

"పవడపురాశిలోని నవభర్మశలాకయుఁ బోలెఁ జూరుప
ల్లవముల కుప్పలో నిడిన లాలితచంపకదామ మట్లు ర
క్తవనజరాజిహంసి యనఁగా నరుణాభ్రములోన నున్న యా
నవశశిరేఖఁ బోలె దహనస్థిత యయ్యె విదేహకన్య దాన్" 2373 ప.

ఇది ఆధునికభావకవిత్వమునకు ఆద్యప్రకృతి వలె కలదు శక్తిమంతుడైన శాకల్య అయ్యలార్యుని కవిశారద కచ్ఛపీస్వనములివి

# ఇతరకవులు

**శ్రీగిరి :** ఈతని కృతి నవనాథచరిత్రము. పద్యకావ్యము. కాని అనుపలబ్ధము ఉపలబ్ధమైన గౌరన నవనాథచరిత్ర ద్విపదకావ్యమునకు ఆధారము. శ్రీశైలక్షేత్రములోని భిక్షావృత్తిమఠాధిపతి ముక్తికాంతభిక్షావృత్తి,

"నవనాథవరుల పుణ్యప్రవర్తనలు
పరగ శ్రీగిరికవి పద్యబంధముల
విరచించినాఁ డది ద్విపదకావ్యమునఁ
జెప్పింపవలయుఁ బ్రసిద్ధి పెంపలర"

అని గౌరనకు అదేశించినట్లు గౌరన నవనాథచరిత్రమునందు కలదు. ప్రమథక్షవి శ్రీగిరికి సంబంధించి రెండు శాసనములు కలవు[106] రెండును పశ్చిమగోదావరిజిల్లా భీమవరముతాలూకా మోగల్లునందు లబించినవి. మొదటి శాసనమునందు శకసంఖ్య కలదు అది 1237+78 = 1315 వ సంవత్సరము రెండవ శాసనమునందు శకసంఖ్య లేదు అనవేమారెడ్డి రాజ్యకాలమునందని కలదు అనవేమారెడ్డి అనగానే కొండవీటి సామ్రాజ్యాధిపతి అనవేమారెడ్డి అనిపించుట సహజము. అనవేమారెడ్డి రాజ్యకాలము 1364–1386 అని పూర్వోక్తము 1315 వ సంవత్సరమునందు ప్రతిగ్రహీత అయిన శ్రీగిరి అంతవఱకు కలడనుటకు మఱొక ఆధారము లేదు. సుసంగతమును కాదు అనవేమారెడ్డి అను వ్యవహారము ప్రోలయవేమారెడ్డికిని కలదు. ప్రోలయవేమారెడ్డి రాజ్యకాలము 1323,24–1353 అని పూర్వోక్తము. శ్రీగిరి నవనాథచరిత్రము రచించుటకు ప్రోలయవేమారెడ్డి ప్రోత్సాహమునకు అవకాశము కలదు ప్రోలయవేమారెడ్డికి అంకితమైన ఎఱ్ఱన హరివంశమునందు నాథసంప్రదాయము ప్రభావము కలదు[107] నాథసంప్రదాయప్రవర్తకులే నవనాథవరులు. కాబట్టి శ్రీగిరికాలము పదునాల్గవశతాబ్ది పూర్వార్ధమే.

మడికి సింగన సకలనీతిసమ్మతమునందు ఉట్టంకితమైన శ్రీగిరిశతకము [241 ప.] శ్రీగిరికృతమని ఒక అభిప్రాయము కలదు.[108] అది శ్రీగిరికృతమని అందు లేదు ఉదాహృతమైన పద్యమునందు "చిరతరప్రకాశ ః శ్రీగిరీశ" అను మకుటము కలదు. శ్రీగిరీశునిపై ఎవరు రచించిన శతకమైనను శ్రీగిరిశతకమగును. శతకకర్త శ్రీగిరియే కావలసిన ఆవశ్యకము లేదు. అయినట్లు ప్రమాణాంతరము లేదు.

శ్రీగిరి శ్రీరంగమాహాత్మ్యమును పద్యకావ్యముగ రచించినట్లు తెలియుచున్నదనికూడ మఱొక అభిప్రాయము కలదు[109] శ్రీగిరి ప్రథమకవి అని శాసనములందు కలదు అనగా మహాశైవకవి అని అర్థము నవనాథచరిత్రము మహాశైవగ్రంథమే. వైష్ణవగ్రంథమైన శ్రీరంగమాహాత్మ్యమును శ్రీగిరి రచించుట సంగతము కాదు. ఇంతకు ఆ శ్రీరంగమహాత్మ్యమును అనుపలబ్ధము "చినమల్లు శ్రీగిరన్న శ్రీరంగమాహాత్మ్యమునుండిఉదాహరణపద్యములందు పద్యములుకలవు అతఁడుభిన్నుఁడగును.

అనుపలబ్ధమైనను శ్రీగిరి నవనాథచరిత్రపద్యకావ్యము సముపలబ్ధమైన గౌరన నవనాథచరిత్రద్విపదకావ్యమునకు ఆధారమగుట వలన శ్రీగిరికి సాహిత్య చరిత్రయందు స్థానము కలదు.

**కృష్ణమాచార్యులు :** ఈతని కృతి సింహగిరినరహరివచనములు. అదొకవిధమైన వచనగ్రంథము కృష్ణమాచార్యులు కాకతిప్రతాపరుద్రచక్రవర్తి కాలమునందున్నట్లు ప్రతాపరుద్రచరిత్రమునందు కలదు. రామానుజాచార్యుల కాలమునందున్నట్లు ఆచార్యసూక్తిముక్తావళియందు కలదు. ఇందు చరిత్రకు ఒకటి ప్రమాణము, మఱొకటి అప్రమాణము కాదు రెండును సమానమే. అప్రమాణములే. "తిక్కనసోమయాజుల వరప్రసాదంబుచేత సమ్మరమొల్ల రామాయణంబు వచనకావ్యంబు రచించి వీరప్రతాపరుద్రుని కంకితముగాఁ జేయ నిశ్చయించెను" అని కల ప్రతాపరుద్రచరిత్రమునుబట్టి కృష్ణమాచార్యుల కాలము ప్రతాపరుద్రుని కాలమనుట ప్రామాణికము కాదు

తాళ్లపాక చినతిరుమలాచార్యుల సంకీర్తనలక్షణమునందు ఇట్లు కలదు.

"ధరఁ గృష్ణాచార్యాదిక
పరికల్పితపదము తాళబంధచ్ఛందో
విరహితమై చూర్ణాఖ్యం
బరగునది నియుక్తనామభాసిత మగుచున్."

ఇందలి కృష్ణాచార్యులు కృష్ణమాచార్యులే కృష్ణాచార్యనామము సంస్కృత రూపము. చినతిరుమలాచార్యుల సంకీర్తనలక్షణము, తాళ్లపాక అన్నమాచార్యులు సంస్కృతమునందు రచించిన సంకీర్తనలక్షణమునకు తెనుగుసేత. అది అనుపలబ్ధము. కాని అందలి కృష్ణాచార్యసంస్కృతనామము తెనుగు సంకీర్తనలక్షణమునందు తేజరిల్లినట్లు అనుమేయము కావున కృష్ణమాచార్యులు తాళ్లపాక అన్నమాచార్యుల కంటె పూర్వుడు కావలయును. అంతేకాదు కృష్ణమాచార్యుల సింహగిరి నరహరివచనముల ప్రభావము శ్రీనాథుని భీమేశ్వరపురాణమునందు కలదు. (212 పచ 3 ఆ.) కావున కృష్ణమాచార్యులు శ్రీనాథుని కంటె పూర్వుడు కావలయును శ్రీనాథుని భీమేశ్వరపురాణము రచనాకాలము స్థూలముగ 1430 ప్రాంతము [110] అన్నమాచార్యుల కాలము[111] 1400, 24-1502. పదునైదవ శతాబ్ది. కాఁబట్టి కృష్ణమాచార్యుల కాలము పదునాల్గవశతాబ్ది కావచ్చును.

సింహగిరినరహరివచనములు సంకీర్తనప్రభేదములు అందు నామ సంకీర్తనములును కలవు అవి సింహాచలక్షేత్రమునకు మాత్రమే సంబంధించినది 1374 వ సంవత్సరమునాటి ఒక సింహాచలశాసనమునందు నామసంకీర్తనము సేయుటకు సానులకు వృత్తి కల్పించినట్లు కలదు.[112] ఆ నామసంకీర్తనములు

కృష్ణమాచార్యకృతములు కావచ్చును. వాని సంరక్షణము కృష్ణమాచార్యుల అనంతరమే ఉత్పన్నమగు విషయము కావున కృష్ణమాచార్యుల చరమకాలము 1370 ప్రాంతము కావచ్చును అంతకంటె బహుపూర్వము కావలసిన ఆవశ్యకము లేదు. ఒక సింహగిరినరహరివచనమునందు కృష్ణమాచార్యులు వికృతిసంవత్సరమునందు జన్మించినట్లు కలదు. (52 వచ.) అది 1290 వ సంవత్సరమగును [113] కాబట్టి కృష్ణమాచార్యుల కాలము 1290–1370.

ఇది నిర్బాధకము కాదు. ఒక సింహగిరినరహరివచనమునందు గోవులను సరిగా మేపనివాడు "పిరంగివ్యాధివాఁడై జన్మించును" అని రెండు ముద్రిత గ్రంథములందును కలదు. (8 వచ) అది "పరంగివ్యాధి" అని ఆంధ్రవిశ్వకళా పరిషత్–గ్రంథాలయములోని వ్రాతప్రతియందు కలదు పిరంగివ్యాధి అనునది లేదు పరంగివ్యాధి అనునది కలదు పరంగి అన ఫ్రెంచిదేశస్థుడు. ఫ్రెంచిదేశస్థుల వలన సంక్రమించిన వ్యాధి పరంగివ్యాధి సుఖవ్యాధి. అది ఫ్రెంచివారివలన సంక్రమించినదను అభిప్రాయము కలదు ఫ్రెంచిదేశస్థులు భారతదేశమునకు వచ్చిన కాలము పదునాల్గవశతాబ్ది కాదు మఱొక సింహగిరినరహరివచనమునందు పౌతకమూరి భాగవతుల పరమాచార్యులు "ప్రమాణస్వరూపజ్ఞాని తిరుమలాచార్యులు" అని కలదు. (32 వచ) తాళ్లపాక చిన తిరుమలాచార్యులకు శాసనములందు "శ్రీరామానుజసిద్ధాంతస్థాపనాచార్య, వేదాంతాచార్య, కవితార్కికకేసరి" అను బిరుదములు కలవు [114] అతడు ప్రమాణస్వరూపజ్ఞాని అగును అంతేకాదు. పౌతకమూరి భాగవతులు తాళ్లపాక వారి శిష్యులు కావచ్చును చిన తిరుమలాచార్యుల కాలము 1540–47. అంతకు పాతిక సంవత్సరముల క్రితము కందుకూరు శాసనమునందు శ్రీకృష్ణదేవరాయలకు యవనరాజ్యస్థాపనాచార్యబిరుదము కలదు. శాసన కాలము 1514వ సంవత్సరము [115] యవనరాజ్యస్థాపనాచార్యబిరుదము వలె, ఒక సింహగిరినరహరివచనమునందు" విభీషణరాజ్యస్థాపనాచార్యబిరుదము కలదు. (7 వచ.) మఱొక వచనమునందు "సర్పవరము, కోరుకొండగిరి" అని కలదు. (1 వచ 2 అను) సర్పవరగ్రామనామవ్యవహారము ప్రాచీనము కాదు శ్రీనాథుని భీమేశ్వరపురాణమునందు సర్పపురమనియే కలదు సర్పవరమని 1502 వ సంవత్సరమునాటి సర్పవరశాసనమునందు కలదు.[116] కోరుకొండ గిరిపైన లక్ష్మీనరసింహస్వామి వెలసిన, దేవాలయము నిర్మింపఁబడిన కాలము 1353 వ సంవత్సరము [117] అది ప్రసిద్ధమగుటకు, అన్యత్ర గ్రంథస్థమగుటకు మఱికొంత కాలము పట్టును ఇదియెల్ల కృష్ణమాచార్యులకాలము 1290–1370 అనుటకును బాధకములు ప్రక్షిప్తములనిన పైకాలము నిక్షిప్తమగును. ఇంకను పరిశోధనీయము.

కృష్ణమాచార్యులు "పరాభవసంవత్సర ఆషాఢశుద్ధద్వాదశినాడు చిరతాళంబులను బూని సంకీర్తనము చేసినట్లు ఒక వచనమునందు కలదు. (53 వచ.) అది 1306 వ సంవత్సరమగును.

కృష్ణమాచార్యులు శఠకోపవిన్నపములు కూడ రచించినట్లు ఒక అభిప్రాయము కలదు [118] అది తాళ్లపాక చిన్నన్న పరమయోగివిలాసములోని ద్విపదలను సరిగా అర్థము చేసికొనక పోవుటవలని అనర్థకము అ ద్విపదలివి :

"సిరివరు నిజశిష్యుఁ జేసికొన్నట్టి
హరిభక్తిపరు ననంతాళువారులను,
శఠమతరాద్ధాంతసంహారియైన
శఠకోపమునిఁ బోలు శఠకోపమౌని,
వేదంబుఁ దెనుఁగుఁ గావించి సంసార
ఖేదంబు మాన్పిన కృష్ణమాచార్యు,
ఘనతరపంచమాగమసార్వభౌము
ననఘు శ్రీ తాళ్లపాకన్నమాచార్యు" 45-52 పం. 1ఆ.

ఇందు శ్రీమహావిష్ణువును శిష్యుని చేసికొన్న అనంతాళువారు, శఠకోపమునిని పోలు శఠకోపమౌని, వేదమును తెనుగు గావించిన కృష్ణమాచార్యులు, పంచమాగమ సార్వభౌముడు తాళ్లపాక అన్నమాచార్యులు నలుగురు కలరు. శఠమతరాద్ధాంత సంహారి అయిన శఠకోపముని నమ్మాళ్వారు అతనిని పోలిన శఠకోపమౌని అహోబలక్షేత్రమరాధిరేతి ఆదివణ్‌శఠకోపజీయ్యరు నమ్మాళ్వారు రచించిన "తిరువాయ్ మొజ్హి" తమిళవేదము. శఠకోపవిన్నపములు తదనువాదము కాదు వేదమును కాదు. సింహగిరినరహరివచనములందు "యజుర్వేదసామవేదఋగ్వేదాథర్వణవేదము లున్న"వని ఒక వచనమునందు కలదు (25 వచ )

సింహగిరినరహరివచనములు "చాతుర్లక్షగ్రంథము" అని ఒకవచనమునందు కలదు. (20 వచ ) పౌతకమూరి భాగవతులు కృష్ణమాచార్యులను సంపర్శించునరికె "లక్షయేబదివేలు కొదువ" అని మఱొకవచనమునందు కలదు (32 వచ.) ఇప్పటికి లభించినవి అష్టోత్తరశతము కంటె ఒకటి అధికము చాతుర్లక్షగ్రంథ మనగా శతసహస్రశ్లోకసంఖ్యమైన మహాభారతము కంటె నాలుగింతలు. ఏకలక్ష గ్రంథపరిమాణకలితమైన మహాస్కాందపురాణము కంటెను నాలుగింతలు అయి దింతలైనను ఆశ్చర్యము లేదు అవి శ్లోకములు ఇవి వచనములు ఏవంవిధమైన చాతుర్లక్షగ్రంథసంఖ్యాపరిగణనములోని చాతుర్యము, ఆంతర్యము దురవగాహము.

సంస్కృతభాషలోని రామానుజాచార్యుల గద్యత్రయము; మల్లికార్జున పండితుని గద్యత్రయము, పాలకుఱికె సోమనాథుని గద్యత్రయము, తెలుగు

భాషలోని కృష్ణమాచార్యుల వచనములు సదృశములు సంస్కృతమునందు గద్య అను అర్థమున వచనశబ్దము లేదు అందువలన గద్యవ్యవహారమే గత్యంతరము. తెలుగునందు గద్యవ్యవహారము, వచనవ్యవహారము సావకాశము. బిరుదగద్యలు, చూర్ణికలు, విన్నపములు తత్సదృశములే. అయినను "గద్యయు నైదు విధంబుల విహరించు"నని పొత్తపి వేంకటరమణకవి లక్షణశిరోమణియందు లక్షణనిర్దేశము కలదు

> "గద్య యనుకరణశబ్దయుక్తంబై యొప్పు, నందు బిరుదగద్య సంబోధనాంతపదబంధురంబై వర్తిల్లు, నందు చూర్ణిక లేకవచనద్వివచన బహువచనసందర్భంబులుగ విభక్త్యానుశాసనికసమాసాదితకల్పనానల్ప జల్పితంబై వెలయు, నందు వచనంబులు బహుప్రకారరచనానిచయప్రాచు ర్యమ్ములై సంచరించు, నందు విన్నపంబు లెన్నఁ దిన్ననై ఋజుమార్గంబుల ననుగమించు." 421 వచ. 3ఆ.

ఇట్లు లక్షణనిర్దేశము చేసి పొత్తపి వేంకటరమణకవి "ఈ పంచవిధమ్ములు మితరహితములై స్వేచ్ఛాకల్పనా గౌరవమ్ముల కొలందుల విలసిల్లు"నని వివరించెను (421 వచ) అంతేకాదు

> "కనుఁగొనఁ బాదరహితమై
> పనుపడి హరిగద్దె వోలె బహుముఖరచనం
> బున మెఱయు గద్య యదిదాఁ
> దెనుఁగు కృతుల వచన మనఁగ దీపించు హరీ!" 422ప.3ఆ.

అని గద్య వచనమని విశదీకరించెను వేంకటరమణకవి "బిరుదుగద్దె లక్షణము" అని భోజరాజీయమునుండి ఉదాహరించినది చూర్ణిక అని కలదు. (423వచ.) అది సంబోధనాంతపదబంధురమే "మదీయచూర్ణికలక్షణము" అని ఉదాహరించినది కూడ సంబోధనాంతపదబంధురమే (424వచ) లక్ష్యములే కావు లక్షణములును నిర్దిష్టములు కావు. వచనము, బహుప్రకారరచనానిచయప్రచుర మని లక్షణము వాలకుఱికె సోమనాథుని పంచప్రకారగద్య బహుప్రకారరచనాని చయప్రచురమే విన్నపములు తిన్ననై ఋజుమార్గములను అనుగమించునని లక్షణము వచనములు వంకరై వక్రమార్గముల అనుగమించునవి కావు వచనములు విన్నపములే విన్నపములే విన్నపములు వచనములే లక్షణనిర్దేశమిది లాంఛన ప్రాయము.

సింహగిరినరహరివచనములందు విన్నపములు కలవు. (32,53వచ) చూర్ణికలు, బిరుదగద్యలు కలవు (7,8,39,40 వచ) తెలుగు భాషలోని విన్నపములని, వచనములని పేర్కొన్న రచనములందు అద్యంతసంబోధనములు కలవు సింహగిరినర హరివచనములలోని ఆదిసంబోధనము "దేవా!" అంతసంబోధనము అనాథపతీ

శ్రీకృష్ణకువ్వాయస్వామీ సింహగిరినరహరీ". దీనికి ముందు "యతిరామానుజముని వరముదాతారు" అని, తర్వాత "నమో నమోదయానిధీ" అని కలదు ఇదియెల్లశతక మకుటప్రాయము "నమోనమోదయానిధీ" దండకాంతసదృశము వచనము లివి పద్యములుకావు పదములు. కృష్ణమాచార్యుల పదములు తాళబంధచ్ఛందోవిరహిత మైన చూర్ణములని, నిరుక్తనామభాసితమగునని తాళ్లపాక చినతిరుమలాచార్యుల సంకీర్తనలక్షణమునందు కలదు పద్యము పూర్వోదాహృతము. నిరుక్తనామభాసిత మన వచనము వచనశబ్దమునకు సంస్కృతమునందు నిరుక్తమను అర్థము కలదు. సింహగిరినరహరివచనములందు "యతిరామానుజ ... దయానిధీ" అను ముగింపు వాక్యము కొన్ని వచనములందు పూర్తిగా లేదు. అది లేఖకుల అనవధానత అగును.

సింహగిరినరహరివచనములు బహువిధములు. బహువిషయసంభరితములు. విష్ణుస్తోత్రములు, వైష్ణవమతసిద్ధాంతములు, సృష్టిప్రకారము, వంశానుచరితము, పురాణకథలు, మహిమలు. కృష్ణమాచార్యుల జీవితచరిత్రాంశములు మొదలైనవి కలవు అన్ని వచనములు వైష్ణవమతప్రబోధము తోపాటు సింహాచలక్షేత్ర మాహాత్మ్యము ప్రచారము చేయునవి.

"పంౘ్రెండు వేలు పుణ్యంబులు సేసి శ్రీమద్భాగవతులై శ్రీవైష్ణవులై జన్మింతురు." (2వచ.) "శ్రీవైష్ణవులే బ్రాహ్మణులు" (3వచ) "సర్వమ్ విష్ణు మయమ్ జగత్" (7వచ) "మా సింహగిరినరహరిదాసులకు దాసులై నంగాని లేదు గతి." (11వచ.)– "ముముక్షుముక్తి కైలాసవైకుంఠబ్రహ్మలోకగీర్వాణములు మా సింహగిరినరహరి యిచ్ఛావిహారములు" (37వచ) "మా సింహగిరినరహరి సక లాంతర్యామియగుట ...... సత్యమే సాక్షి." (60వచ.) "మీ (సింహగిరినరహరి) నామోచ్చారణంబు సేసిన" ప్రహ్లాదనారదాదులు పరమ భాగవతోత్తములు కృతార్థు లైరి." (4వచ 1అను.) "దేహంబును, చిత్తంబును మా సింహగిరినరహరిం దలం చినగాని పవిత్రము గాదె" (6వచ.2అను.)

మత ప్రచారమునందు రసప్రచారము విరళము.

"ఈ దేహంబనెడు లంకపై దండు దిగి చిత్తమనెడు నింద్రజిత్తుపై రణించి దుర్బుద్ధులనెడు దుర్మార్గపు రాక్షసుల హతము చేసి, యాశలనెడు రాక్షసుల పేరడంచి మమతమండోదరిని బట్టి దాసిగా నేలి, యాచార్యుండనెడు హను మంతునిఁ బంపి, యా లంకఁ జొచ్చి సాధించి జీవుండనెడు సీతను దెచ్చి మీ పాదారవిందముల భక్తి హత్తించి దరి చేర్చుమీ" (4వచ)

ఇట్టి రచనయును ఇంతింత మాత్రమే.

కృష్ణమాచార్యులు సంతూరులో అంధుడై పుట్టినట్లు, తల్లిదండ్రులు రోసి నూతిలో పారవైచినట్లు, సంన్యాసిశిరోమణి కువ్వాయ సంరక్షించి పెంచినట్లు, సింహా

చలస్వాంధయను అంధత్వము పోయినట్లు ఒక వచనమునందు కలదు. (52వచ.) కృష్ణమాచార్యులకు కూతురు నిచ్చి పెండ్లి చేయునెడ, మేనమామ శ్రీరంగాచార్యులు కృష్ణమాచార్యుల సహపంక్తిని పరమునిలో చరమును చూచి వెలి వేసినట్లు వేరొక వచనమునందు కలదు (58వచ) వేశ్యాలోలుడైన కృష్ణమాచార్యులు పోతకమూరి భాగవతుల సందర్శనమున పరివర్తనము చెందినట్లు మరొక వచనమునందు కలదు. (32వచ) ఇవి కృష్ణమాచార్యుల జీవితచరిత్రాంశములు

**వెన్నెలగంటికవులు :** పదునారవ శతాబ్దివాడగు వెన్నెలకంటి సూరన విష్ణుపురాణమునందు ఇట్లు కలదు

"ఈ నిఖిలంబు మెచ్చ నమరేశ్వరదేవుఁడు చూడఁ గృష్ణవే
ణీనది సాక్షిగా ననికి నిల్చిన రావుకుఁ గేసభూవిభుం
గానకుఁ దోలి వెన్నడిచి కాచిన వేమయ యన్నపోతభూ
జానికి సత్ప్రబంధము లొసంగిన వెన్నెలగంటి వారిలోన్"

22 ప పీ.

తాను ఒకడు. (23 ప పీ.) ఇందు వెన్నెలగంటి కవులు అనపోతారెడ్డికి కావ్యములు అంకితమిచ్చినట్లు కలదు కవుల పేరులు, కావ్యముల పేరులు **లేవు** అనపోతారెడ్డికి అంకితమైన కావ్యము లభింపలేదు. కాని జక్కన విక్రమార్క చరిత్రమునందు ఇట్లు కలదు.

"వెన్నెలగంటి సూర్యుఁడు వివేకగుణాఢ్యుఁడు వేదశాస్త్రసం
పన్నుఁడు రెడ్డివేమనరపాలకుచేత మహాగ్రహారముల్
గొన్న కవీంద్రకుంజరుఁ దకుంఠతతేజుఁడు పెద్దతండ్రిగా
సన్నుతి గన్న సిద్ధనకు, సంతతదానకళావినోదికెన్"

ఇది పూర్వముద్రణమునందు షష్ఠ్యంతపద్యములందు కలదు ఇటీవలి ముద్రణమునందు వంశవర్ణనపద్యమునందు కలదు ఉభయస్థలములును పద్యమునకు ఉచితములు కావు ప్రక్షిప్తము కావచ్చును అయినను ఇందు "వెన్నెలగంటి సూర్యుఁడు రెడ్డివేమనరపాలకుచేత మహాగ్రహారముల్ గొన్న కవీంద్రకుంజరుఁడ" నుట నిరాధారము కాఁజాలదు. రెడ్డివేమనరపాలకుడు ప్రోలయవేమారెడ్డి అని ఒక అభిప్రాయము కలదు [119] అయిన విష్ణుపురాణమునందు వెన్నెలకంటి సూరన "రెడ్డివేమభూజానికి సత్ప్రబంధము లొసంగిన వెన్నెలగంటి వారి లోపలన్" అని చెప్పుట సంభవము అట్లు చెప్పలేదు కాఁబట్టి వెన్నెలగంటి సూర్యుఁడు మహాగ్రహారములు గొన్న రెడ్డివేమనరపాలకుడు ప్రోలయవేమారెడ్డి కాఁజాలడు. అనపోతారెడ్డి అనంతరము కొండవీటిసామ్రాజ్యాధిపతి అయిన అనవేమారెడ్డి అగును. అనవేమారెడ్డి అసలు పేరు వేమారెడ్డియే అతడు కూడ కవిపండిత పోషకుడే [120]

"భువి సత్యనవేమ పార్థివేంద్రే
విదుషాం జీవన మేవ జీవనమ్
దివి సత్యనవేమభూపతీంద్రే
విదుషాం జీవన మేవ జీవనమ్ "

**రావిపాటి త్రిపురాంతకుడు :** ఈతని కృతులు త్రిపురాంతకోదాహరణము, అంబికాశతకము, చంద్రతారావళి, మదనవిజయము సంస్కృతము సందు ప్రేమాభిరామము అంబికాశతకము లభింపలేదు. అందలి పద్యములు మూడు ప్రబంధరత్నాకరమునందు, రెండు ప్రయోగరత్నాకరమునందు కలవు మఱొక రెండు పద్యములును కలవు [121] ఆకరము తెలియదు. చంద్రతారావళి కూడ లభింపలేదు. తారావళి అనుట వలన ఇరువదేడు పద్యములు ఉండవలయును. నాలుగు పద్యములు మాత్రము ప్రబంధరత్నాకరమునందు కలవు మదనవిజయము శిథిలతాళపత్రగ్రంథమును చూచినట్లు, అది "ఎనిమిదాశ్వాసముల సంజ్ఞాభియోగిక భార్యాధికారపారదారిక వైశికాదిప్రకరణములు గలిగి"న కామశాస్త్రగ్రంథమని ఉదాహరించిన పద్యములు రెండు కలవు [122] క్రీడాభిరామమునకు మూలమైన ప్రేమాభిరామము రావిపాటి త్రిపురాంతకుడు రచించినట్లు క్రీడాభిరామమునందు కలదు. (శివ వచ) అప్పకవీయమునందు "రావిపాటి తిప్పరాజుచాటుధార" అని ఉదాహరించిన క్రింది పద్యము కలదు.

"సరి బేసైరిపుడేల భాస్కరులు భాషానాథః పుత్రాః వసుం
ధర నం దొక్కరుడు మంత్రియయ్యె వినుకొండ గ్రామయామాత్యభా
స్కరుడో? యౌ నయితే సహస్రకరశాఖ ల్లే, వదే యున్న వే.
తిరమై దానము సేయుచో రిపుల హేతిన్వ్రేయుచో వ్రాయుచో."

60 ప 3 ఆ.

ఇందు వినుకొండలో మంత్రి అయినవాడు రామయామాత్యభాస్కరుడని కలదు కాని వినుకొండమంత్రి లేక దుర్గాధిపతి రామయామాత్యభాస్కరుడు కాడ రాయనామాత్యభాస్కరుడు [123]

"ఘనతరౌదార్యదీక్షాకల్పితానల్ప
కరనిబద్ధసువర్ణకంకణుండు
ఆసేతుశీతనగాంతరరాట్సభా
మధ్యవిశ్రుతకీర్తిమండలుండు
కొండపల్లీవిన్నకొండదుర్గద్వయీ
దేశప్రజావసథీయుతుండు
సకలావనీపకసంతానయాచిత
వస్తుప్రదానప్రవర్తనుండు

అన్న వేమమహీశదత్తాగ్రహార
మదకళాందోళికార్యసన్మణివిశేష
భూషణాద్యష్ట భూతివిభూషితుండు
భానుతేజుండు రాయన భాస్కరుండు."

ఇది చింతగుంట కోదండరామకవి సునందాపరిణయములోని పద్యము. రాయన భాస్కరుడు కాటయవేమారెడ్డి కడ మంత్రిగను కలడు. అట్లు కల చాటు పద్యమిది:[124]

"కలయఁ బసిండిగంటమునఁ గాటయవేమసమక్షమందు స
త్ఫలముగ రాయని ప్రభుని బాచఁడు వ్రాసిన వ్రాల మ్రోఁతలన్
గలుగలు గల్లుగల్లురనఁ గంటకమంత్రుల గుండె లన్నియున్
జలుజలు జల్లుజల్లురనె సత్కవివర్యులు మేలు మేలనన్."

పయి రెండు పద్యములనుబట్టి రాయన భాస్కరుడు మంత్రి. అనవేమారెడ్డి రాజ్యకాలమునందు వినుకొండదుర్గాధిపతి అనవేమారెడ్డి రాజ్యకాలము 1364–1386 అని పూర్వోక్తము 1384–85 ప్రాంతమునందు వినుకొండదుర్గము విజయనగరసామ్రాజ్యమునందు విలీనమైనది. [125] కావున రాయనభాస్కరుడు వినుకొండ దుర్గాధిపతి అయిన కాలము 1384 వ సంవత్సరము కంటె పూర్వము కావలయును. 1365 ప్రాంతము కావచ్చును అయిన రావిపాటి త్రిపురాంతకుని కాలము 1290–1370 అగును. ఇది 1320 ప్రాంతమున రావిపాటి త్రిపురాంతకుడు ముప్పదేండ్ల వయస్సునందు సంస్కృతమున ప్రేమాభిరామము రచించుటకు సానుకూలము.

త్రిపురాంతకోదాహరణము త్రిపురాంతకక్షేత్రదైవమైన త్రిపురాంతకదేవుని గురించి వ్రాసిన ఉదాహరణము పాలకుఱికి సోమనాథుని బసవోదాహరణ, పండితారాధ్యోదాహరణముల తర్వాతి ఉదాహరణ ము తృతీయోదాహరణము. తెలుగు ఉదాహరణములందు తిలకాయమానము. కవితాసుందరము.

ప్రథమావిభక్తి ఉత్పలమాలపద్యమునందు త్రిపురాంతకదేవుని పతాక కలదు. కళిక వృషభగతిరగడయందు ఉక్తివైచిత్రి కలదు.

"ఆఱురేకుల మంత్రకుసుమమునందు వెలిఁగెడు చంచరీకము"

ఆఱురేకుల మంత్రము షడక్షరి. ప్రణవముతో కూడిన పంచాక్షరి. పంచాక్షరియందు పరమేశ్వరుడు కలడని శైవవిశ్వాసము. షడక్షరి పువ్వు. అందు త్రిపురాంతకదేవుడు తుమ్మెద. పంచాక్షరియందు పరమేశ్వరుడు కలడను భావము ప్రకటించిన తీరు విచిత్రసరణి ఉత్కళికయందు కిరాతార్జునీయకథ ప్రసక్తమైనది.

ద్వితీయావిభక్తి ఉత్పలమాలయందు అర్ధనారీశ్వరవర్ణనము కలను. కళిక విజయ భద్రరగడయందు కన్నప్ప, చేరమరాజు, సాంఖ్యతొండని కథలు ప్రసక్తమైనవి ఇవి బసవపురాణమునందు కలవు ఉత్కళికయందు మన్మథదాహకథ ప్రసక్తమైనది. తృతీయావిభక్తి ఉత్పలమాలయందు త్రిపురాంతకదేవుని పతాక ముక్తికాంత పయ్యెద కొంగుతో ఉపమింపబడినది కళిక తురగవల్గనరగడయందు ఒడయనంబి, భల్లాణ రాజు కథలు ప్రసక్తమైనవి ఇవి కూడ బసవపురాణమునందు కలవు కళికయందు,

"మఱియు మఱ్ఱిమాని మొదల మరగియున్న గురునిచేత"

అని కలదు మఱ్ఱిచెట్టు దక్షిణామూర్తి నెలవు శివుడు దక్షిణామూర్తి వేషమున మునులను కాపాడినట్లు పండితారాధ్యచరిత్రమునందు కలదు.

మునుల శ్రీదక్షిణామూర్తివేషంబు
నను బ్రోచు దిరువది నాల్గవ లీల" పుట౧౮౧.ప్ర సం.

ఉత్కళికయందు త్రిపురాసురసంహారకథ ప్రసక్తమైనది. చతుర్థీవిభక్తి ఉత్పలమాల యందు త్రిపురాంతకక్షేత్రము "శ్రీనగము తూరుపువాకిలి" అని కలదు. కళిక వృషభగతిరగడయందు శివుడు బాణాసురునికి కావలియైన కథ ప్రసక్తమైనది ఇది బసవపురాణమునందు కలదు ఉత్కళికయందు గుండయ్యకథ ప్రసక్తమైనది ఇది కూడ బసవపురాణమునందు కలదు పంచమీవిభక్తి ఉత్పలమాలయందు త్రిపురాంతక క్షేత్రము మోక్షదాయకమని కలదు కళిక విజయభద్రరగడయందు జ్ఞానవిషయము కలదు ఉత్కళికయందు దక్షాధ్వరధ్వంసకథ ప్రసక్తమైనది. షష్ఠీవిభక్తి చంపక మాలయందు శివునికి చంద్రుడు శిఖాకుసుమమని కలదు కళిక తురగవల్గనరగడ యందు సచ్చిదానందతత్త్వము కలదు. ఉత్కళికయందు ఆదినాథజననము, రసవాద మననము కలదు ఇది నాథసంప్రదాయమునకు జ్ఞాపిక. సప్తమీవిభక్తి ఉత్పలమాల యందు లో, వెలి చూపులు కలవు ఇది కూడ నాథసంప్రదాయప్రభావమే అగును. కళిక విజయభద్రరగడయందు కరికాలుని భక్తి ప్రసక్తమైనది ఉత్కళికయందు శివుని అష్టమూర్తుల విషయము కలదు సంబోధనప్రథమావిభక్తి ఉత్పలమాల యందు శివాధిక్యము సూచితము కళిక విజయభద్రరగడయందు దారువిహారకథ ప్రసక్తమైనది. ఇట్లు అష్టాదశపురాణకథలు, బసవపురాణకథలు ప్రసక్తమగుటయే కాదు' కడపటి ఉత్కళిక రసగుళిక

"వినుతముఖనలినమును
ఘనజఘనపులినమును
వరవళితరంగములు
గురుకుచరథాంగములుఁ
గలిగిన యుమాసరసి
లలితముఖములఁ బెరసి

క్రాలు నొక కలహంసః
బాలచంద్రోత్తంసః"

పయి ఉత్కళిక అనంతరము సార్వవిభక్తికపద్యము కలదు. అంతే. ఆదిమధ్యావసానములందు రావిపాటి త్రిపురాంతకుడు రచించినట్లు లేదు కాని పెద పాటి జగన్నాథకవి ప్రబంధరత్నాకరమునందు ఉదాహరణపద్యములందు రావిపాటి త్రిపురాంతకుని అంబికాశతకము, చంద్రతారావళి, త్రిపురాంతకోదాహరణముల నుండి ఉదాహరించిన పద్యములు కలవు కావున రావిపాటి త్రిపురాంతకుని కృతులే.

**చిమ్మపూడి అమరేశ్వరుడు :** "పేరెన్నిక కెక్కినట్టి యమరేశ్వరు" అని అనంతామాత్యుడు [9ప 1ఆ భో రా], "చిమ్మపూఁడి యమరాధిపుఁడన్న సుసత్కవీశ్వరుల్ నెన్నుదుటం గరాంజలులు నింతురు జే యని అని" వల్లభామాత్యుడు [౨౭ప. క్రీడా.] స్తుతించిన చిమ్మపూడి అమరేశ్వరుడు పేరెన్నిక కెక్కిన వాడే కాని, ఆతని కృతి అనుపలబ్ధము ఒక పండితునికి ఉపలబ్ధమైనట్లు, మఱొక పండితుడు అపహరించినట్లు ఒక ఉదంతము కలదు [126] కాని విశ్వసనీయము కాదు. అపహరించిన పండితుడు అంతర్ధానము చేయడు "చిమ్మపూడి అమరేశ్వరుని విక్రమసేనము" అని ప్రబంధరత్నాకరమునందు, ఉదాహరణపద్యములందు ఉదాహరించిన పద్యములు కలవు. ప్రబంధరత్నాకరమునందు ఆకరములు కల పద్యములు పది కలవు అందులేనివి ఉదాహరణపద్యములందు నలుబదిరెండు పద్యములు కలవు [127] అన్ని పద్యములును వివిధములైన వర్ణనములు. ఒక పద్యమునందు "మాళవాధినాథ" అని కలదు మాళవదేశాధిపతియైన విక్రమసేనుని కథ విక్రమసేనము కావచ్చును. విక్రమసేనుని కథ కథాసరిత్సాగరమునందు కలదు. తిక్కన విజయసేనము వలె చిమ్మపూడి అమరేశ్వరుని విక్రమసేనము కథాకావ్యమగును.

**వేములవాడ భీమనః** "వచియింతు వేములవాడ భీమనభంగి నుద్దండలీల నొక్కొక్కమాటు" అని శ్రీనాథుని అల్లాడ వేమారెడ్డి ప్రశంసించినట్లు శ్రీనాథుని కాశీఖండమునందు కలదు. (13ప.1ఆ)

"లేముల వాడక శుచియై
లేములవాడం జరించు లేములవాడం
దా మెఱసిన భీముని నుత
భీముని బలభీము విమతభీమునిఁ దలఁతున్" 11ప.1ఆ

అని పూర్వకవిస్తుతిని,

"భీమన పద్యమన్నఁ గడుఁ బ్రీతి వహించుచు మేలు మేలు నా
నేమిది చెప్పినారమన సిక్కమె ప్రాసముఁ గూర్చినాఁడవౌ
నేమిది కాదు దీని వడి కిక్కడ కర్థమి దెట్టి దీ గణం
బేమని పెట్టినాఁడవని యెగ్గులు పట్టుఁ గుబుద్ధి పెద్దలన్." 18ష.ఆ.

అని కుకవినిందను కొఱవి గోపరాజు సింహాసనద్వాత్రింశికయందు కలదు.

"భీమన తొల్లి చెప్పెనను పెద్దల మాటయె కాని యందు నొం
డేమియు నేయెడ న్నిలుచు టెవ్వరుఁ గానరు" 11ప.1ఆ.

అని పింగళి సూరన రాఘవపాండవీయమునందు కలదు. ఇవి పదియేను పదునాలు శతాబ్దుల ప్రసక్తులు కావున వేములవాడ భీమన పదియేనవశతాబ్ది కంటె పూర్వుడు కావలయును బహుపూర్వుడు కావలసిన ఆవశ్యకము లేదు. పదునాల్గవ శతాబ్దివాడు కావచ్చును.

పదునాఱవ శతాబ్ది ఉత్తరార్ధములోని లింగమగుంట తిమ్మకవి సులక్షణ సారమునందు ''భీమన ఛందము" నుండి ఉదాహరించిన డెబ్బదియైదు పద్యములు కవిజనాశ్రయమునందు కలవు. గణపవరపు వెంకటకవి ఆంధ్రప్రయోగరత్నాకరము నందు భైరవచ్ఛందస్సునుండి ఒకటి, జయదేవచ్ఛందస్సునుండి రెండు, భాస్కరదేవుని ఛందస్సు నుండి ఒకటి మొత్తము నాలుగుపద్యములోను మూడుపద్యములు భీమన నరసింహపురాణము లోనివి కలవు. కూచిమంచి తిమ్మకవి సర్వలక్షణసార సంగ్రహమునందు వేములవాడభీమకవి సుమతిశతకమునుండి పద్యములు కలవు అవి సుప్రసిద్ధమైన సుమతిశతకములోనివే మఱొక లక్షణగ్రంథమునందు భీమనవిరచిత శతకంధరరామాయణము నుండి రెండు పద్యములు కలవు.[128] పెదపాటిజగన్నాథ కవి ప్రబంధరత్నాకరమునందు భీమన దశావతారములని ఒక పద్యము కలదు. మఱొక వర్ణనపద్యము కలదు. దశావతారపద్యము ఉదాహరణపద్యములందును గలదు. అది నరసింహపురాణములోనిదగును. తంజావూరు సరస్వతీమహలు గ్రంథాలయమునందు భీమన జ్యోతిశ్శాస్త్రపద్యములు పెక్కులు కలవు కావున రాఘవపాండవీయము, నరసింహపురాణము, శతకంధరరామాయణము, సుమతిశతకము, కవిజనాశ్రయము, జ్యోతిశ్శాస్త్రము వేములవాడ భీమన కృతులు కావల యును. ఇందు సుమతిశతకము, కవిజనాశ్రయము మాత్రమే లభించినవి. అవి వివాదగ్రస్తవిషయములైనవి.

లింగమగుంట తిమ్మకవి సులక్షణసారమునందు వేములవాడ భీమకవి చాటు పద్యములని మూడు పద్యములు కలవు. అవి:

1. "గరళపుముద్ద లోహ మవగాఢమహాశనికోట్లు సమ్మెటల్
హరునయనాగ్ని కొల్మి యురగాధిపుకోఱలు పట్టుకార్లు ది
క్కరటి శిరంబు దాయ లయకాలుఁడు కమ్మరి వైరివీరసం
హరణగుణాభిరాముఁడగు మైలమ భీమన ఖడ్గసృష్టికిన్" 194ప.

ఇందు "పట్టుకార్లు" అను శబ్దము ప్రయుక్తమైనది అది కన్నడమునందు "పటకాపు" అని, తెలుగులో "పటకారు, పటుకారు" అని కలదు. ఇతరద్రావిడ భాషలందు లేదు గుజరాతీభాషయందు కలదు కనుక దేశ్యము కాదు. అన్య

దేశ్యము. "ఫత్‌కారు" అను ఫారసీపదమునుండి "పటకారు" అను పదము నిష్ప న్నమగును అది పదమూడవ శతాబ్దిని తెలుగుభాషలో ప్రవేశించినను, "పటుకారు" అగుటకు కొంతకాలము, "పట్టుకారు" అగుటకు మఱికొంతకాలము, "పట్టుకార్లు" అను కవిప్రయోగమగుటకు ఇంకను కొంతకాలము పట్టును కావున పయిపద్యము రచనాకాలము పదునాల్గవశతాబ్ది అగును పదునాల్గవశతాబ్దిని మైలమభీమన కాదగిన భీమరాజు కలడు కొండవీటి సామ్రాజ్యాధిపతి అనవేమారెడ్డి అన్నదేవచోడుని ఆధి నములోని నిడుదవోలు దుర్గమును జయించి, అన్నదేవచోడుని తఱిమివైచి అతని సవతిసోదరుడైన భీమరాజును నిడుదవోలు దుర్గాధిపతిని చేసినట్లు చారిత్రికసమన్వ యము కలదు.[129] అన్నదేవచోడని తల్లి అన్యమాంబ. భీమరాజు తల్లి మైలమాంబ కావచ్చును భీమరాజు రెండవ ఏఱువభీముడగును. ఏఱువ భీముడని, మైలమభీము డని వేములవాడ భీమన చాటుపద్యములు కలవు అతడు నిడుదవోలు దుర్గాధిపతి అయిన కాలము స్థూలముగ 1370—1400 పదునాల్గవశతాబ్ది ఉత్తరార్ధము

2. "ఘనుఁడన్ వేములవాడ వంశజుఁడ దాక్షారామభీమేశనం
దనుఁడన్ దివ్యవిషామృతప్రకటనానాకార్యధుర్యుండ భీ
మన నా పేరు వినంగఁ జెప్పితిఁ దెలుంగాధీశ! కస్తూరికా
ఘనసారాదిసుగంధవస్తువులు వేగం దెచ్చి లాలింపురా" 177ప.

ఇందు వేములవాడ భీమన దక్షారామభీమేశనందనుడని ఇదమిత్థముగ కలదు. ఇది తెలుంగాధీశుని సందర్శించినపుడు చెప్పిన పద్యము తెలుంగాధీశుడన తెలుగు రాయలు. ఒక తెలుగు రాయల శాసనము 1345 వ సంవత్సరమునందు కలదు[130] గాని, అతడు వేములవాడ భీమన సందర్శించిన తెలుగురాయలు కాఁజాలడు మడికి సింగనకు రామగిరిసీమయందు వృత్తులు, గ్రామములును ఇచ్చిన ముప్పభూపతి తండ్రి కూడ [36ప 1ఆ జ్ఞా వా రా] తెనుగునృపతి. అనగా తెలుగురాయలే. అతడు వేములవాడ భీమన సందర్శించిన తెలుగురాయలు అగును. ముప్పభూపతి రామగిరిపట్టణాధీశ్వరుడు. [10వచ.1ఆ జ్ఞా.హ రా] అతని తండ్రి తెలుగురాయలు కూడ రామగిరిపట్టణాధీశ్వరుడగును అది 1368 వ సంవత్సరమువఱకు ముసు నూరి కాపయనాయకుని ఓరుగల్లు రాజ్యములోని భాగము తెలుగురాయలు, ముప్ప భూపతి 1368 తర్వాతనే రామగిరిపట్టణాధీశ్వరులగుదురు.

3. "చక్కఁదనంబు దీవియగు సాహిణిమారఁడు మారుకైవడిన్
బొక్కిపడంగలండు చలమున్ బలముంగల యా చళుక్యపుం
జొక్కనృపాలుఁ డుగ్రుఁడయి చూడ్కులమంటలు రాలఁ జూచినన్
మిక్కిలి రాజశేఖరుని మీఁదికి వచ్చిన రిత్తవోవునే" 226ప.

ఇది "వేములవాడ భీమకవి పదునొకండవ చోట హకారంబు నిలిపి మూఁడు గడియలకు రామగిరిదుర్గమున ముత్తిక దిగిన మారని చావఁదిట్టిన చాటుధార" అని

అప్పకవీయమునందు కలదు. [372వచ 2అ.] "చొక్కనామకుంజరుఁడు" "చిత్రకూటంబులో" ఉన్నట్లు వేములవాడ భీమకవి "అనితాభ్యుపదాన", "శంభువరప్రసాదకవి" అను చాటు పద్యములందు కలదు చిత్రకూటమన రామగిరియే. "రామగిరి రితి చిత్రకూటః" అని మల్లినాథసూరి మేఘసందేశవ్యాఖ్యానమునందు కలదు. [1శ్లో.] కాఁబట్టి చళుక్యచొక్కనృపాలుడు కూడ రామగిరిపట్టణాధీశ్వరుడు కావలయును. కాని చాళుక్య చొక్కనృపాలుడు చరిత్రకు అందని వ్యక్తి ఒక సాహిణిమారుడు చరిత్రకు అందిన వ్యక్తియే. అతడు కాకతిప్రతాపరుద్రచక్రవర్తి అశ్వసాహిణి. భాస్కరరామాయణమున కృతిభర్త. కాని కాకతిప్రతాపరుద్రచక్రవర్తికాలమునందు చళుక్యచొక్కనృపాలుడు రామగిరిపట్టణాధీశ్వరుడు కాఁజాలడు. రాజశేఖరుడును కాఁజాలడు. ప్రతాపరుద్రచక్రవర్తియే రాజశేఖరుడు. చళుక్యచొక్కనృపాలుడు కూడ తెలుగునృపతి. ముప్పభూపతి వలె 1368 తర్వాతనే రామగిరి దుర్గాధిపతి అగుట సంభవము అతని కాలములోని సాహిణిమారుడు మఱొక సాహిణిమారు డగును అతడు మఱల చరిత్రకు అందని వ్యక్తి. చళుక్యచొక్కనృపాలుడు, అతనిమీద దండెత్తివచ్చిన సాహిణిమారుడును చరిత్రకు అందని వ్యక్తులైనను, చళుక్యచొక్కనృపాలుని రామగిరిదుర్గాధీశ్వరత్వము పదునాల్గవ శతాబ్ది ఉత్తరార్ధమునందే సంభవము

కావున లింగమగుంట తిమ్మకవి సులక్షణసారములోని మూడు పద్యములను బట్టి వేములవాడ భీమన కాలము పదునాల్గవశతాబ్ది ఉత్తరార్ధము కావలయును.

వేములవాడ భీమకవి చాటుపద్యములందు కళింగగంగుకు సంబంధించిన పద్యములు కలవు అవి :

"వేములవాడ భీమకవి వేగమె చూచి కళింగగంగు తా
సామము మాని కోపమున సందడి దీఱిన రమ్ము పొమ్మనెన్
మోమును జూడ దోషమిఁక ముప్పది రెండు దినంబు లావలన్
జామున కర్ధమం దతని సంపద శత్రులఁ జేరుఁ గావుతన్."

"వేయి గజంబులుండఁ బదివేలు తురంగములుండ నాజిలో
రాయల గెల్చి సజ్జనగరంబునఁ బట్టముఁ గట్టుకో వడిన్
రాయకళింగగంగు కవిరాజభయంకరుఁ జూడ వేడ్కనేఁ
బోయెద, మీనమాసమునఁ బున్నమ పోయిన షష్ఠి నాఁటికిన్."

114 ప. స. సాఁ సం.

ఇందు "కళింగగంగు, రాయకళింగగంగు" అని కలదు "రాయలఁ గెల్చి" అని కూడ కలదు. రాయకళింగగంగు అనగా కళింగదేశాధిపతి అయిన గాంగవంశ రాజు. వ్యస్తముగ "రాయలు" అను వ్యవహారము విజయనగరరాజులకు వినా ఇతరరాజులకు చరిత్రప్రసిద్ధము కాదు ఒక విజయనగరరాజు కళింగదేశాధిపతి అయిన గాంగవంశరాజును జయించుట, కళింగదేశాధిపతి అయిన గాంగవంశరాజు మఱల విజయనగరరాజును జయించుట చరిత్రాంశము మొదటి బుక్కరాయల మేనల్లుడు యువరాజు సంగమరాయలు 1358 వ సంవత్సరమునందు గాంగవంశ రాజును జయించినట్లు, ఆ గాంగివంశరాజును 1361 వ సంవత్సరమునందు జయించినట్లు, హైహయరాజు జాజ్ నగర్ విడిచిపెట్టి తెలంగాణము నకు పాఱిపోయినట్లు ఉత్కళదేశచరిత్రగ్రంథమునందు కలదు[131] హైహయ రాజు సంగమరాయలే అగును. జాజ్‌నగర్ సజ్జనగరము కావచ్చును. కాని విశాఖమండలమునందు సజ్జనగరము కలదని కళింగసంచికయందు కలదు. అది జాజ్‌నగర్ కంటె సంగమరాయల జయాపజయములకు మిక్కిలి అను కూలము. కళింగగంగు కాలమును పదునాల్గవశతాబ్ది ఉత్తరార్ధమే

ఆంధ్రప్రయోగరత్నాకరములోని ఒక పద్యమిది ·

"వాండిమి నల్ల సిద్ధి జనవల్లభుఁ డోర్చిన రాజు భీతుఁడై
యాంధ్రను గానకుండ వృషభాంకము బెట్టి కొనంగఁ [illegible]చితో
నేండిది యేమి నీ వనుచు నెచ్చెలు లెల్ల హసింప నంతలో
మూండవ కంటితోడి దొర మూర్తి వహించిన మ్రొక్కి రంగసల్."

ఇది "జయదేవచ్ఛందోలక్ష్యము, భీమన చెప్పిన పద్యము" అనియే గణప వరపు వేంకటకవి ఆంధ్రప్రయోగరత్నాకరమునందు కలదు నరసింహపురాణము లోని పద్యమసి లేదు. కాదు కూడ భీమస చెప్పిన పద్యము కూడ కాకపోవచ్చును. కారణము డకారమునకు, రేఫసంయుక్తడకారమునకు ప్రాసఘటనము.

ఇంతకు మిక్కిలి వేములవాడ భీమస కాలమును నిర్ణయించుటకు పనికివచ్చు చాటుపద్యములు లేవు. కాని, వేములవాడ భీమకవి సంస్కృతమునందు రచించిన జ్యోతిషగ్రంథమును తెనిగించినట్లు కల జ్యోతిషగ్రంథమునందుఁ వేములవాడ భీమకవి "ప్రభవవర్షంబున శ్రావణమాసంబు శుక్లపక్షంబున శోభనంబు మీఱఁ బంచమీశుక్రవారంబునను హస్తయందుఁ గన్యాలగ్నమందు" జన్మించినట్లు కలదు.[132] ప్రభవనామసంవత్సరశ్రావణశుక్లపంచమీశుక్రవారము 1327 వ

సంవత్సరమునందు మాత్రమే కలదు కాని నక్షత్రము హస్త కాదు చిత్త. ప్రభవ నామసంవత్సరశ్రావణశుద్ధచతుర్థీగురువారమునాడు, అనగా 26–7–1327 వ తేదీని సూర్యోదయము మొదలు ప్రభవనామసంవత్సరశ్రావణశుద్ధపంచమీశుక్రవారము నాడు, అనగా 27–7–1327 తేదీని సూర్యోదయమువఱకు హస్త కలదు జననము సూర్యోదయాత్పూర్వమైన "హస్తయందు" అనియే చెప్పవలయును. కావున వేములవాడ భీమన జననకాలము 27–7–1327 వ తేదీయే అగును

మొత్తముమీద వేములవాడ భీమనకాలము 1327–1400

## సుమతిశతకము

సుమతిశతకము జైనకవికృతమని ఒక అభిప్రాయము కలదు.[133] కాని సుమతిశతకమునందు,

"అప్పిచ్చువాఁడు వైద్యుఁడు
నెప్పుడు నెడతెగక పాఱు నేఱును ద్విజుఁడున్
జొప్పడిన యూరనుండుము;
చొప్పడకున్నట్టి యూరుఁ జొరకుము సుమతీ" 7 ప.

అను పద్యము కలదు ఇందు "ద్విజుఁడున్" కలదు. కారణము పౌరోహిత్యము అది జైనమతసంబంధి కాదు. బ్రాహ్మణమతసంబంధి. కాఁబట్టి ఇది సుమతిశతకము జైనకవికృతము కాదనుటకు నిర్ధారకసాధనము.

సుమతిశతకము బద్దెనకృతమని మఱొక అభిప్రాయము కలదు.[134] అందుకు ప్రధానమైన ఆధారము బద్దెన నీతిశాస్త్రముక్తావళిలోని ప్రథమపద్యము.

"శ్రీవిభుఁడ గర్వితారి
క్ష్మావరదళనోపలబ్ధజయలక్ష్మీసం
భావితుఁడ సుమతిశతకముఁ
గావించిన ప్రోఁడఁ గావ్యకమలాసనుఁడన్" 1 ప.

ఇది నీతిశాస్త్రముక్తావళి తాళపత్రగ్రంథములందు లేదు. ఇతరముద్రిత గ్రంథములందు లేదు. ఒక ముద్రితగ్రంథమునందే కలదు అది ప్రకటించిన వారి మాటలలోనే వారి "కరకౌశలము" కావచ్చును ప్రత్యంతరపేశలమైనను "నీతిశతకముఁ గావించిన ప్రోఁడ" అను బద్దెన పాఠమునకు "సుమతిశతకముఁ గావించిన ప్రోఁడ" అను పాఠాంతరము కాలాంతరసంక్రాంతము కావచ్చును. కారణము బద్దెన నీతిశాస్త్రముక్తావళి నీతిశతకమే రాజనీతిశతకము. సుమతిశతకము ప్రజానీతి

శతకము సుమతిశతకములోని పద్యములు నీతిశాస్త్రముక్తావళియందు మకుటము మార్చుకొని చేరిపోయినవి. అవి లేఖకునికి నీతిశాస్త్రముక్తావళి సుమతిశతకమను భ్రాంతి కలిగించును. కాఁబట్టి సుమతిశతకము బద్దెనకృతము కాదు.

సుమతిశతకము వెములవాడ భీమకవి కృతమనుటకు 1. జనశ్రుతి. 2 లాక్షణికోదాహృతి. 3. భీమనకృతమని కల పద్యము కలవు జనశ్రుతి స్వతః ప్రమాణము కాదు ప్రమాణాంతరసంవాదము కలదేని పరిగ్రాహ్యము. లాక్షణికోదాహృతి కూడ స్వతః పరమప్రమాణము కాదు నిర్బాధకమైనచో సాధకము. కర్తృకాలములు తెలియని ఒక లక్షణగ్రంథమునందు భీమన సుమతిశతకమునుండి "కాదన్నవాఁడె కరణము" అను పద్యము కలదు కూచిమంచి తిమ్మకవి సర్వలక్షణసారసంగ్రహమునందు "భీమకవి సుమతిశతకము" నుండి "ఏఱుకుమీ కసుగాయలు" అను పద్యమును కలదు (162 ప) సర్వలక్షణసారసంగ్రహము లోని భీమకవి వేములవాడ భీమకవియే (78, 114 ప) సుమతిశతకము భీమన కృతమని సుమతిశతకప్రతులందు కల పద్యమిది :

"శ్రీకరముగ భీమన మను
లోకమునకుఁ బొగడఁగా విలోకించి మదిన్
ప్రాకటముగ సుమతికి మతి
చేకూడఁగ సుమతినీతి చెప్పఁదొడంగెన్"

ఇది శతకకవి పద్యము కాదు. ఇతరకవి పద్యము అయినను నిర్నిమిత్తము కాఁజాలదు. కావున సుమతిశతకము వేములవాడ భీమనకృతమే కావలయును. ఇందుకు సుమతిశతకరచనాకాలమును ఉపబలకము. సుమతిశతకమునందు,

"మాటకుఁ బ్రాణము సత్యము
కోటకుఁ బ్రాణంబు సుభటకోటి ధరిత్రిన్
బోటికిఁ బ్రాణము మానము
చీటికిఁ బ్రాణంబు వ్రాలు సిద్ధము సుమతీ" 91 ప.

ఇందు "చీటి" అను పదము యతిమైత్రిప్రాసఘటితము పాఠాంతరకల్పనమునకు నిరవకాశము. నిర్ధారకప్రయోగము. "చీటి" అను పదము దేశ్యము కాదు. అన్యదేశ్యము. చిరి లేక చీర్ఠీ అను ఉరుదూపదము తెలుగులో చీటీ అయినది. అది సంస్కృతప్రాతిపదిక వలె దీర్ఘమును హ్రస్వము చేసి ప్రయోగించెను ఇట్టి ప్రయోగములు పదునైదవ శతాబ్దిని కలవు "ఖుసి" అని శ్రీనాథుడు. "నవల"

అని జక్కన కావున శ్రీనాథుడు పేర్కొన్న వేములవాడ భీమన కాలము పదు నాల్గవ శతాబ్ది కావలయును. అది పూర్వార్ధము కంటె ఉత్తరార్ధమగుట సుసంగతము

సుమతిశతకములోని నీతులు విశ్వజనీనములు. అయిదారు పద్యములు వినా అన్ని పద్యములు సార్వకాలికములు. బాలావబోధములు ప్రజల నాలుకలపై నర్తించునవి నిత్యజీవితమునకు వర్తించునవి. ధర్మపన్నములు కావు జీవితమును కాచి వడపోసిన నగ్నసత్యములు జీవితమును తీర్చిదిద్దగలుగు నిత్యసత్యములు. ఒక నిత్యసత్యము :

"వినఁదగు నెవ్వరు సెప్పిన
వినినంతనె వేగపడక వివరింపఁదగున్
గని కల్ల నిజముఁ దెలిపిన
మనుజుఁడెపో నీతిపరుఁడు మహిలో సుమతీ!" 100 ప.

**నవకవులు :** వేమన పద్యములందు "శివకవులకు నవకవులకు" అని ఒక పద్యము కలదు అంతేకాదు "భవదూరుఁడు, శరభాంకుడు, వటమూలుడు" అను కవుల పేరులు కల పద్యము మఱొకటి కలదు.[135] గణపవరపు వేంకటకవి ఆంధ్రప్రయోగరత్నాకరమునందు "నవకవుల శతకము" నుండి నాలుగు పద్యములు కలవు. నాలుగు పద్యములకును "శరభాంకలింగమా" అను మకుటము కలదు పెదపాటి జగన్నాథకవి ప్రబంధరత్నాకరమునందు "శరభాంకుఁడు" అని ఉదాహరించిన "శరభాంకలింగమా" అను మకుటము కల పద్యము కలదు. శరభాంకుడు కాకతిప్రతాపరుద్రచక్రవర్తి మంత్రి అని లింగధారణచంద్రియకయందు కలదు.[136] శరభాంకలింగశతకము లభించినది భవదూరుడు మొదటి బుక్కరాయల కుమారుడని అతని పోరుమామిళ్ల శాసనమునందు కలదు [137] శాసనకాలము 1291+78 = 1369 వ సంవత్సరము భవదూరుని కృతి లభింపలేదు వటమూలుని పద్యములు కొన్ని లభించినవి [138] అందు "వటమూలమందిరా" అను మకుటము కలదు వటమూలమందిరశతకమగును వటమూలమందిరుడు దక్షిణామూర్తి శివుని రూపము వటమూలుని పద్యములందు నాథసంప్రదాయసరణి కలదు భవదూరుడు, శరభాంకుడు, వటమూలుడు శివకవులు నవకవులును. శివకవియుగములోని శివకవులు పూర్వకవులుగాను, ఎఱ్ఱనయుగములోని శివకవులు నవకవులుగాను పరిగణింపఁబడినట్లు ప్రతీయమానము.

## శరభాంకలింగశతకము

శరభాంకలింగశతకమునందు కాకతిప్రతాపరుద్రచక్రవర్తి బందీకృతుడైన సందర్భమును సూచించు పద్యము కలదు

"చాపముగా నహార్యమును జ్యగని బాణము గాఁగ నాగిగాఁ
బాపదారం బొనర్చి తలపం త్రిపురంబులఁ గాల్పవె మహో
ద్దీపితతీవ్రకోపమున దేవతలెల్ల నుతింప నాఁటి వి
ల్పాపపు ఢిల్లి మీఁదఁ దెగఁబాపఁగదే శరభాంకలింగమా"

ఇందు శరభాంకుడు శత్రునాశనము కోరి, మొదట చకారము ఆజిన చోట హకారము పెట్టి రచించెనని ఐతిహ్యము కలదు అది నిజమైనను, కాకపోయినను ఇది శరభాంకలింగశతకరచనాకాలము కాకతీయ సామ్రాజ్యపతనానంతరమనుటకు సాధకము.

శరభాంకలింగశతకమునందు పూర్వోత్తరవిభాగము కలదు. పూర్వభాగము నందు భాషాదోషములు బహుళము. పద్యములు పంచపాదులు. ఉత్తరభాగము నందు భాషాదోషములు విరళము పద్యములు చతుష్పాదులు. రచనాభేదమును కలదు. అందుకు హేతువు భవదూయని, వటమూలుని ప్రమేయమైనచో, ప్రయోగ రత్నాకరములోని "నవకవుల శతకము" అనుమాట అన్వర్థమగును. శరభాంక లింగశతకము శివభక్తిప్రబోధకము కాని మూఢభక్తి కాదు వివేకభక్తి.

"కలలకుఁ జింతయేల తన కర్మము వచ్చిన పిల్లికోసమై
యలమట యేల తుమ్మెనని యాపద యేల యనేకకీడులే
దొలఁగక కంటిమంచు మదిఁ దోఁచక నిల్చి కృశింపనేల పో
తెలియఁగ లేరు మానవుల తిక్కకు వెఱ్ఱొక మందు గల్గునా
మెలఁగక వ్రాయు బ్రహ్మలిపి మిథ్యయె యో శరభాంకలింగమా"

21 ప.

"కోరిన రావు సంపదలు కోరకయుండిన మాన వాపదల్
కోరిన కోరకున్న ననుకూలములై తన పూర్వకర్మచే
సారెకు వచ్చుఁ బోవు ననిశంబును నీ పదభక్తియుక్తి నేఁ
గోరుదు గాని యన్యములు గోరనయా శరభాంకలింగమా"

58 ప.

"వాడకు వాడ గాదు త్రిదివంబున కేఁగెద మంచు కొంద ఱ
ల్లాడుదు రేమి చిత్రము వియచ్చరులో శివమంత్రసిద్ధులో
పాదలి సంగమేశ్వరునిఁ గొల్చిన భక్తుని బంటు బంటులో
నేడకు నేడ సుద్దులివి యెక్కడయా శరభాంకలింగమా"

59 ప.

# యుగవైశిష్ట్యము

నన్నయయుగమునకు, శివకవియుగమునకు సమన్వయము తిక్కనయుగమునందు జరిగినది. నన్నయయుగమునకు తిక్కనయుగమునకు సమన్వయము ఎఱ్ఱనయుగమునందు సాగినది. తిక్కన ప్రభావము కంటె నన్నయ ప్రభావము మిన్న. ఎఱ్ఱన అరణ్యపర్వశేష, నృసింహపురాణములందు, భాస్కరరామాయణమునందు నన్నయ ప్రభావము, ఎఱ్ఱన సోమనల హరివంశములందు నన్నయ తిక్కనల ప్రభావము శరభాంకలింగశతక, త్రిపురాంతకోదాహరణములందు తిక్కన ప్రభావము కనిపించును తెనుగునుడికారము కంటె సంస్కృతప్రౌఢి పరిఢవిల్లినది

పూర్వయుగములలోని ఛందస్సులు పునరావృత్తములైనవి. "తద్రచనయకా" రచించిన ఎఱ్ఱన అరణ్యపర్వశేషమునందు వినా మధ్యాక్కర కానరాదు. మధురాక్కర మాటలేదు తరువోజ కూడ తగ్గుమొగము పట్టినది దేశీయచ్ఛందస్సుల కంటె సంస్కృతచ్ఛందస్సులు స్వకీయములైనవి వచనమునందు గొలుసుకట్టు రచనము వచ్చినది తెలుగు పదములు కుప్పలు పోసినట్లు కూర్పుట గొలుసుకట్టు రచనము. ఇది ఎఱ్ఱన హరివంశమునందు కంటె సోముని హరివంశమునందు ఎక్కువ భాస్కరరామాయణమునందు తక్కువ

ఉక్తివైచిత్రి కంటె శబ్దవైచిత్రి ఉజ్జ్వలమైనది అంత్యానుప్రాసము అట్టహాసము చేసినది స్వతంత్రకావ్యరచనకు స్వాగతము లభించినది ఎఱ్ఱన నృసింహపురాణము ప్రథమోదాహరణము. కథాప్రధానమైన పురాణమును రసప్రధానమైన కావ్యముగ రచించు ప్రయత్నము ప్రారంభమైనది. నాచన సోమనాథుని ఉత్తర హరివంశము ప్రముఖోదాహరణము. కావ్యాంధ్రీకరణమును స్వతంత్రపద్ధతిని సాగినది.భాస్కరరామాయణము నిదర్శనము. శతకోదాహరణ ప్రక్రియలు కొనసాగినవి.

హరిహరనాథతత్త్వప్రభావము కలదు. శంభుదాసుడైన ఎఱ్ఱన నృసింహపురాణ, రామాయణహరివంశములు రచించుట ప్రభావము హరిహరనాథతత్త్వ పునరుద్ధరణము నాచన సోమనాథుని స్వభావము. అయినను వైష్ణవమతము వైజయంతిని ఎగురవైచినది. కాని శైవమతము నెడ మొగ్గు కలదు. కారణము రెడ్డిరాజుల బ్రాహ్మణమతోద్ధరణమునందలి శైవమతావలంబనము కావచ్చును. అది వీరశైవము కాదు. ఆగమశైవము. పరమతనిరసనము లేదు సహనము కలదు.

# సంఖ్యా సూచిక

## ఉపోద్ఘాతము

1 Select Inscriptions Vol I 1942 PP 35, 40.
2. ఆంధ్రుల చరిత్రము పూర్వయుగము 1910 పుటలు 20, 79–80.
3 A Classical Accounts of India 1960 PP 337–350.
B The Ancient geography of India. 1963 PP 445–446.
క ఆంధ్రభాషావికాసము. 1947. పుట 7
4. As 3 A. P. 337. 5. రెండు వలె. పుట 17.
6. Rigveda Brahmanas 1920 PP 28, 29, 64, 65
7. Rigveda Legends Through The Ages 1953 PP 241–245.
8. As 6 PP 42–50. 9 చరిత్రచర్చ 1989. పుటలు 3–11
10. A. India As Described In Early Texts of Buddhism and Jainisn 1941 PP 18–19, 34, 78–79, 108, 113–114.
క. తెలుగు విజ్ఞానసర్వస్వము మూడవసంపుటము. 1959. పుట 1.
11. Life in Ancient India as Depicted in the Jaina Canons. 1947. P 266.
12. A History of Indian Literature Vol II. 1927. PP 1–18.
13. Ibid PP 428–32.
14. Epigraphia Indica. Vol VI PP 85–88.
15. ప్రాచీనాంధ్రచారిత్రకభూగోళము 1963. పుట 167
16. అదే 17. అదే.
18. [భారతి 1937 ఆగస్టు] సమగ్ర ఆంధ్రసాహిత్యం. మొదటి సంపుటం: 1965 [పుట 21.]
19. తెలుగు జానపదగేయగాథలు. 1977 పుటలు 70–71.
20 శ్రీనాథుడు 1971 పుటలు 396–402.
21 కావ్యాలంకారసంగ్రహము. వివరణము 1945 పుట 31
22 కావ్యస్వరూపమ్ 1969. పుట 76.
23. శృంగారప్రకాశిక 1940 పుట 91
24. English Literature. 1973 PP 1–4
25 ఇరువదియొకటి వలె పుట 91 26 అదే. పుటలు 91–103.
27. ఆంధ్రసాహిత్యచరిత్ర. (లిఖితము)
28 ఆంధ్రకవుల చరిత్రము. ప్రథమభాగము. 1937. పీఠిక పుట 12.
29. అదే.

30. ఆంధ్రవాఙ్మయచరిత్రసంగ్రహము. 1928 విషయసూచిక. పుటలు 7–8.
31. ఇరువదియేడు వలె. 32 పది "క" వలె. పుట 594.

# ప్రాబంధ్నన్నయయుగము

1. (భారతి. 1920.) ప్రభాకరస్మారిక. 1989 పుటలు 600–601.
2. పత్రికావార్త. 3 ఒకటి వలె.
4. అశోకధర్మశాసనాలు. 1989 పుట 38.
5. **Epigraphia Andhrika Vol IV PP 1–2**
6. (నవభారతి. 1979.) సాహిత్యసమస్యలు. 1990. పుటలు 56–76.
7. భారతి. 1948. మే. పుటలు 12-18 8. ఆరు వలె పుటలు 77–97.
9. ఆంధ్రభాషావికాసము. 1947 పుట 51. అథసూచిక. 8.
10. అదే. పుటలు 51–53.
11. ఆంధ్రవాఙ్మయారంభదశ. ప్రథమ సంపుటము. 1960 పుటలు. 178, 124.
12. **Epigraphia Indica Vol XXVII PP** 221, 225.
13. **Early Telugu Inscriptions.** 1976 **PP** 1–3
14. శాసనపద్యమంజరి. ప్రథమభాగము 1930 పుట 1
15. ఆరు వలె. పుటలు 13–15.
16. **South Indian Inscriptions. Vol X. No** 2
17. **A History of South India.** 1984. **P.** 207
18. పదునాలుగు వలె. పుటలు 2–3.
19. **As** 17. **P.** 208. 20. భారతి. 1967 మార్చి పుట 16.
21. కర్ణాటకకవిచరితె. ప్రథమసంపుటె. 1924 పుట 30.
22. భారతి. 1982. ఆగస్టు. పుట 51.
23. అదే. 24. అదే.
25. (ఆంధ్రపత్రిక సంవత్సరాదిసంచిక. 1921) తెలుగు ఛందోవికాసము 1962 పుట 39 26 అదే పుటలు 37–38.
27. తెనుగు కవుల చరిత్ర 1953 పుటలు 107–112.
28 సంస్కృతవాఙ్మయచరిత్ర ప్రథమసంపుటము 1982 పుటలు 71,91.
29 నాట్యశాస్త్రము. విశంది పుట 25
30. దక్షిణభారతసాహిత్యములు. 1962 పుట 6.
31. అదే. పుట 59.
32. ఇరువదియెనిమిది వలె ద్వితీయసంపుటము 1961 పుట 395.
33. అదే. పుట 390.

34. సంస్కృతసాహిత్యచరిత్ర 1986 పుట 646.
35 నన్నెచోడుని కుమారసంభవము ప్రాచీనగ్రంథమా?; 1983
36 ఆంధ్రవాఙ్మయచరిత్ర. దుర్ముఖి. పుటలు 52–56
37 ఆంధ్రవాఙ్మయచరిత్రసంగ్రహము 1928 పుటలు 29–30.
38 ఉపన్యాసకాభిప్రాయము. 39 చరిత్రచర్చ 1989. పుటలు 82–83.
40 Indian Buddhism 1970 PP 424, 501
41. A Manual of Buddhistic Historical Traditions. 1963. PP 73, 78.
42. A History of Indian Literature. Vol. II 1927. P. 184. F N. 4.
43. తెలుగు విజ్ఞానసర్వస్వము. మూడవ భాగము 1959 పుట 545.
44. As 17. P. 84 45 Ibid. 46 Ibid
47. Ibid PP 367–368. 48. ముప్పది వలె. పుటలు 8, 10.
49. ఇరువదియొకటి వలె పుట 22 50 అదే పుట 31
51. సాహిత్యసమస్యలు. 1990. పుటలు 27–29.
52. The Rule of the Chalukya-Cholas in Andhra Desa 1985. P. 34.
53. ముప్పదియారు వలె 54. ముప్పదియేడు వలె
55. The Eastern Chalukyas of Vengi. 1950. PP 57, 63, 180, 216, 287–289
56. నలుబదిమూడు వలె. పుటలు 550–551. 57. అదే.
58. ప్రబంధరత్నావళి పీఠిక 1918. పుట 27; 1976. పుట 31
59. ఇరువదియేడు వలె. పుటలు 83–86.
60 ఏబదియొకటి వలె పుటలు 11–13
61 ఏబదియెనిమిది వలె. 62 ఇరువదియేడు వలె
63 శ్రీరాజరాజనరేంద్రపట్టాభిషేకసంచిక. 1922. పుటలు 80, 81.
64 అదే 65. భారతి 1986 మే పుటలు 6–10.
66. అదే 1988 జూలై పుటలు 44–49.
67 ఇరువదియేడు వలె. పుటలు 87–90.
68. కర్ణాటకవిచరిత్ర. ప్రథమసంపుటి. 1924. పుట 72.

# నన్నయయుగము

1. ఆంధ్రసాహిత్యచరిత్ర. (లిఖితము).
2. శ్రీరాజరాజనరేంద్రపట్టాభిషేకసంచిక 1922. పుట 92.
3 అదే పుట 94 4. అదే. పుట 93.
5 ఆంధ్రకవితరంగిణి. మొదటి సంపుటము. 1955. పుటలు 113–114.
6. అదే. 7. రెండు వలె. పుట 14.
8 ఆంధ్రుల చరిత్రము పూర్వయుగము 1910. పుట 286
9 అదే పుట 285.
10 తెలుగు విజ్ఞానసర్వస్వము మూడవ సంపుటము. 1959 పుట 163.
11. అయిదు వలె 12 అదే. 13. అదే. 14. అదే
15 ప్రాచీనదక్షిణభారతచరిత్ర 1967 పుట 366.
16. పది వలె పుట 555. 17. పదియేను వలె. పుట 372
18. ఎనిమిది వలె పుట 284. 19. శ్రీనాథుడు. 1971. పుటలు 382–383.
20. పది వలె. పుట 656. 21. అదే. పుట 659.
22. నన్నయ వ్యాసపీఠము 1987. పుట 263.
23. శాసనపద్యమంజరి ప్రథమభాగము. 1930 పుటలు 29–30.
24. పది వలె. పుటలు 543–554 25 అదే. పుటలు 552–553.
26. అదే. పుట 550. 27 భారతి 1986. ఫిబ్రవరి. పుటలు 4–8.
28. **A History of South India.** 1984 **P.** 189.
29. **Ibid.** 30. **Ibid.**
31. పది వలె. పుట 163. 32. అదే. పుట 164. 33. అదే.
34. అదే. 35. అదే. 36. అదే.
37. అదే పుట 165. 38. అదే.
39. ఆంధ్రసాహిత్యపరిషత్పత్రిక. సంపుటము 54 సంచిక 4–5. పుటలు 77–79
40. కర్ణాటకకవిచరితె. ప్రథమసంపుటె పుట 30.
41. తెనుగు కవుల చరిత్ర 1952. పుటలు 158–159.
42. అయిదు వలె పుట 124.
43 ఒకటి వలె 44 అదే. 45. అదే
46. నన్నయగారి ప్రసన్నకథాకలితార్థయుక్తి 1954. పుట 15.
47. సారమతి నన్నయ. 1976 పుట 50.
48. పండితప్రవచనము.
49 ఆంధ్రవాఙ్మయారంభదశ. ద్వితీయసంపుటము. 1966. పుటలు 745–746

50. నన్నయకవిత్వము. అక్షరరమ్యత. 1977. పుటలు 65, 126.
51. నలుబదియారు వలె. పుటలు 12, 174–175.
52. ఒకటి వలె. 53. రెండు వలె. పుట 213. 54. ఒకటి వలె.
55. **An Introduction to the Study of Literature**. 1971. **PP** 96–103, 111.
56. నలుబదియొకటి వలె. పుటలు 145–148. 57. ఒకటి వలె.
58. క. ఆంధ్రవాఙ్మయచరిత్రసర్వస్వము. 1957. పుటలు 249–250.
చ. నన్నెచోడుని కవిత్వము 1959 పుॱ 20.
59. సాహిత్యసమస్యలు 1990 పుటలు 98–119.
60. ఆంధ్రకవుల చరిత్రము. ప్రథమభాగము 1937. పుటలు 68–69.
61. ఏబది తొమ్మిది వలె. 62 అరువది వలె పుటలు 69–84.
63. అదే. పుట 176. 64. అదే. పుట 177. 65. అదే. పుటలు 181–182.

# శివకవియుగము

1. తెలుగు విజ్ఞానసర్వస్వము. మూడవ సంపుటము. 1959. పుట 166.
2. అదే పుట 172. 3. అదే. పుట 19 .
4. అదే. పుటలు 192–202. 5. అదే. పుటలు 200–201.
6. అదే పుట 189. 7. అదే. పుటలు 202. 8. అదే.
9. అదే. పుట 203. 10. అదే. 11. అదే. పుట 204.
12. అదే. పుట 205. 13. అదే. పుట 208.
14. అదే పుట 211. 15. అదే. పుట 217.
16. పండితారాధ్య చరిత్రము. 1939. ఉపోద్ఘాతము. పుట 27.
17. బసవపురాణము. 1926. పీఠిక. పుట 56.
18. **Development of Religion In South India. 1963. PP 44–45**
19. తెలంగాణాశాసనములు. II. పుటలు 17', 198, 214.
20. క దక్షిణభారత శాసనములు. సంపుటము 20. సంఖ్య 178.
చ. బసవేశ్వరవచనాలు, సమగ్రసమీక్ష. 1976–77. పుట 174.
21. **A History of South India**. 1984. **P**. 148.
22. క. ఇరువది "క" వలె. సంఖ్య 127. చ అదే. "చ" వలె. పుట 178.
23. ఇరువది "చ" వలె. పుట 210. 24. ఒకటి వలె. పుట 189.
25. అదే. పుట 2 5. 26. క. బసవని కాలజ్ఞానము. పుట 7.
చ. ఇరువది "చ" వలె. పుటలు 211, 277.
27. శివతత్త్వసారము. 1968. పీఠిక. పుటలు 38–41.
28. సమగ్ర ఆంధ్రసాహిత్యం. 1965. సం. 1. పుట 241.
29. ఇరువదియేడు వలె. పుటలు 7–8.

30. శివశ్రీ బండారు తమ్మయగారి వ్యాసావళి. ప్రథమభాగము. కీలక. పుటలు 202—203 31 ఇరువదియేడు వలె. పుటలు 7-8.
32 ముప్పది వలె పుట 203 33 పదియేడు వలె. పుటలు 66-67.
34. ఆంధ్రసాహిత్యచరిత్ర (లిఖితము)
35 ఇరువదియేడు వలె పుటలు 36-38.
36 కర్ణాటకకవిచరితె. ప్రథమసంపుటి. 1924. పుటలు 213—214
37. ఇరువదియేడు వలె పుట 4.
38 (తెలంగాణాశాసనములు?) ఇరువదియేడు వలె పుట 24.
39 అదే 40, లోకవ్యవహారము.
41 భారతి 1945 ఫిబ్రవరి పుటలు 102—108 ఆ.
42. అదే సెప్టెంబరు పుటలు 107 117.
43 History of Reddy Kingdoms 1948. P. 126.
44. ప్రతాపరుద్రచరిత్రము. 1969. పుటలు 69—74.
45. సిద్ధేశ్వరచరిత్రము. 1960. పుటలు 161-164 46. అదే. పుట 79.
47. 15—5-42 Copy of 15—4—5 (174) M 400.
48. భాషాచారిత్రకవ్యాసావళి 1987 పుట 189.
49. కాకతీయసంచిక 1935 అనుబంధము సంఖ్య 26. పుటలు 64—66.
50. A History of India 1973 P. 204
51. ఆంధ్రవాఙ్మయసూచిక. 1929 పుటలు 125, 335.
52. బసవపురాణము 1966 పీఠిక. పుట 335.
53. ముప్పదియారు వలె. ద్వితీయసంపుటి. 1924 పుటలు 293—294.
54. శతకకవులచరిత్రము. 1924. పుటలు 19-20.
55. Avalokana. A Compendium of Karnataka Heritage -1958. PP 182—183.
56. ఇరువది "చ" వలె. పుట 43. 57 అదే పుట 32. 58. అదే పుట 26.
59. అదే. పుట 133. 60. అదే. పుట 140. 61. అదే.
62. పదియారు వలె పుట 300.
63. The Kakatiyas 1978 P. 118
64. ఇరువది "చ" వలె అనువాద విభాగము పుటలు 12, 17, 18,19,19?.
65. ఉదాహరణవాఙ్మయచరిత్ర 1950. పుట 2 1968. పుటలు 4—5.
66. వీరశైవాంధ్రవాఙ్మయము 1952. పుట 87.
67 పాలకురికి సోమనాథుని లఘుకృతులు 1962 పీఠిక. పుట 12.
68. సిద్ధాంతశిఖామణి. 1961. పుటలు 78-79.
69. ఏబదియొకటి వలె. 70. ఏబదిరెండు వలె. పుట 336.

71. ఆంధ్రసాహిత్యపరిషత్పత్రిక. సంపుటము 54. సంచిక 3. పుటలు 111.-
72. అదే సంపుటము 15. సంచిక 5,6 పుటలు 106-121.
73. భారతి 1959. జనవరి. పుట 12.
74. పదియేడు వలె. పుట 30 75 అదే పుట 17.
76. ఆంధ్రకవుల చరిత్రము ప్రథమభాగము 1937. పుట 225
77. చాటుపద్యమణిమంజరి ద్వితీయభాగము 1952. పుట 81.
78. సాహిత్యసంపద 1889 పుట 28 79 పదియేడు వలె పుట 23.
80. డెబ్బదియేడు వలె పుట 82. 81. అదే పుట 84.
82. సాహిత్యసంపద 1989, పుట 28. 83 డెబ్బదియేడు వలె పుట 87.
84. ఏబదిరెండు వలె పుటలు 352-‘5”.
85. భక్తిశతకముల సంపుటము అక్షయ పుటలు 19-44
86. ఏబదిరెండు వలె పుటలు 352-353.
87. క. ఏబదినాలుగు వలె పుటలు 52-53.
చ. ఇరువది "చ" వలె పుటలు 367-373.
88. సర్వేశ్వరశతకము 1919 పుట 2.
89. ఏబదిరెండు వలె. పుటలు 374-375
90. ఆంధ్రకవితరంగిణి. మూడవ సంపుటము. 1959. పుటలు 9-10.
91. అదే. పుట 52. 92. As 63. P. 299.
93. తొంబది వలె పుట 52. 94 అదే.
95. సకల నీతిసమ్మతము 1970. ఉపోద్ఘాతము పుటలు 87-88.
96. అదే. పుట 86.
97. బద్దెన రాజనీతి, వ్రాతప్రతి. Acc No. 5413 A.P. Oriental Manu-Script Library
98. ముప్పదినాలుగు వలె. 99 పదియేడు వలె. పుట. 91.

# తిక్కనయుగము

1 A History of South India. 1984.P. 199.
2. Ibid. 3. Ibid. P 196.
4. ఆంధ్రుల చరిత్రము ద్వితీయభాగము 1912. పుట 61,
5 అదే 6 అదే. పుటలు 61-62. 7. అదే. పుట 62.
8 అదే. పుట 63.
9 నాలుగు వలె. పూర్వయుగము· 1910. పుట 337.
10. As 1. PP 214, 216. 11. Ibid. P. 225.

12. నాలుగు వలె పుట 63.
13. అదే. పుట 64 14. అదే. 15. అదే. పుట. 71.
16. కాటమరాజు కథ. 1953. పీఠిక. పుట 26.
17 నాలుగు వలె పుటలు 77, 78. 18. అదే. పుట 69.
19. అదే. పుట 72 20. అదే. పుట 73.
21 The Kakatiyas 1978. P 11?. 22. Ibid. 23. Ibid.
24. నాలుగు వలె. పుట 75 25. As. 21. PP 271–274.
26. నాలుగు వలె పుట 78. 27. అదే. 28. అదే. పుట 87.
29. దక్షిణభారతసాహిత్యములు. 1962 పుటలు 65–70.
30. దక్షిణదేశభాషాసారస్వతములు. దేశి. 1970. పుటలు 147–152.
31. ఆంధ్రకవితరంగిణి రెండవ సంపుటము. 1956. పుటలు 97–113.
32 భారతి 1959. జనవరి పుటలు 37–46.
33. క రంగనాథరామాయణము. 1943. పీఠిక. పుటలు 1–4; అనుబంధపీఠిక. పుటలు 2–3 చ. పంచమి 1954. పుటలు 12–23.
34. సాహిత్యసంపద 1989 పుటలు 41–44.
35. ముప్పదిమూడు "క" వలె. 1957. పుటలు 14–36.
36. సంస్కృతవాఙ్మయచరిత్ర. ద్వితీయసంపుటము. 1961. పుట 39.
37. ఆంధ్రసాహిత్యచరిత్ర. (లిఖితము)
38. సారస్వతాలోకము 1964. పుటలు 146–47.
39 ముప్పదియేడు వలె 40. As 1. PP 227–228.
41. ఆంధ్రసాహిత్యపరిషత్పత్రిక. సంపుటము. 15. సంచిక. 5. పుటలు 222–223.
42. నాలుగు వలె. పుట 106. 43. As 21. P. 115
44. ముప్పదియొకటి వలె పుటలు 216–217. 45. ముప్పదితొమ్మిది వలె.
46. ఆంధ్రమహాభారతము. సంశోధితముద్రణము తృతీయసంపుటము. పుట. 1.
47. తిక్కన సారస్వతమూర్తి. 1980. ప్రవేశిక. పుట 15. 48. అదే
49. ఆంధ్రభారతకవితావిమర్శనము. 1981. పుట 94.
50. తిక్కన కావ్యశిల్పము 1973. పుటలు 78–79.
51. భారతము- తిక్కన రచన. 1962. పుటలు 91–93.
52. ముప్పదియేడు వలె. 53. అదే.
54. సాహితీసమీక్ష 1971. పుటలు 91–101.
55. ఆంధ్రసారస్వతవ్యాసావళి. 1952. పుటలు 93–125.
56. ముప్పదియొకటి వలె పుట 205.
57. అదే. పుట 208. 58. కేతన. 1973. పుట 19.

59. నలుబదియొకటి వలె. 1915. పుట 273.
60. భారతి. 1983. ఫిబ్రవరి. పుటలు 49–53.
61. కేయూరబాహుచరిత్ర. 1966. పీఠిక. పుటలు 11-13.
62. ముప్పదినాలుగు వలె. పుటలు 21-47.
63. కవిజీవితములు. 1955. పుటలు 126-127.
64. ఆంధ్రసాహిత్యపరిషత్పత్రిక 1917. పుటలు 36-38.
65. ముప్పదియేడు వలె
66. ఆంధ్రవాఙ్మయము- రామాయణము. 1989 పుటలు 77–142.
67. భాస్కరరామాయణము–విమర్శనాత్మకపరిశీలనము. 1988. పుట 212.
68. ముప్పదిమూడు "క" వలె పుటలు. విషయానుక్రమణిక. 4. గ్రంథము 176. 69. అదే. 70. అదే.
71. ముప్పదిమూడు "క" వలె. అనుబంధపీఠిక పుట 7.
72. అదే. 1957. పుటలు 17-24. 73. అదే. పుటలు 25-29.
74. అరువదియారు వలె పుటలు 144-154.
75. As 21 P. 194 76. **Ibid. PP** 132, 135. 77. **Ibid. P.** 171.
78. ముప్పదియొకటి వలె మూడవ సంపుటము. 1959. పుట 165.
79. ఆంధ్రమహాభారతము- ఛందఃశిల్పము. 1966. పుట 165.

# ఎఱ్ఱనయుగము

1. క. విలసతామ్రశాసనము. చ. కలువచేఱు శాసనము,
   **A. A Forgotheu chapter of Andhra History.**
   ట. రెడ్డిసంచిక. 1947. పుట 11.
   **B. Hdistoy of Reddi kingdoms** 1948. **PP** 17-18.
2. **As** 1 **B.** 3. ఒకటి "క" వలె.
4. ఒకటి "ట" వలె. అను. **I.** పుటలు 9-11.
5. అదే. పుటలు 11-13. 6. అదే పుట 14. 7. అదే. పుటలు 3-9.
8. **As** 1 **B. P** 68 9. నాలుగు వలె.
10. **As** 1 **B. P.** 195. 11. **Ibid**
12. ఒకటి "ట" వలె పుట 33. 13. ఆంధ్రసాహిత్యచరిత్ర. (లిఖితము.)
14. తెలుగులో హరివంశములు. 1979. పుటలు 151-152; 158-159.
15. ఆంధ్రకవితరంగిణి. నాలుగవ సంపుటము. 1960. పుటలు 66–67.
16. ఆంధ్రకవుల చరిత్రము ప్రథమభాగము, 1937. పుటలు 169-177.
17. పదియేను వలె. 18. పదునాలుగు వలె. పుటలు 126-128.

19. As 1 B P 95. 20. Ibid. P. 110.
21. ఒకటి "ట" వలె అను I. పుట 13. 22. అదే. పుట 28.
23. శ్రీనాథకవితాసమీక్ష. ద్వితీయసంపుటము. ప్లవ. పుట 240. శ్లో. 29.
24. As 1 B. P. 67.
25. ఆంధ్రమహాభారతము. సంశోధితముద్రణము. ద్వితీయసంపుటము. 1969, పుట 321. 26. అదే. పుట 320.
27. ఒకటి "ట" వలె అను. I. పుట 1. 28. As 1 B. PP 92-94.
29. ఒకటి "ట" వలె. అను I. పుట 10. 30. అదే. పుట. 11.
31. హరివంశము. 1967. పీఠిక. ఎ.రా. పుటలు 28-30. 32. అదే.
33. ఉపన్యాసకాభిప్రాయము. 34. పండితాభిప్రాయము.
35. పదునాలుగు వలె. పుట 201.
36. క. విమర్శతరంగిణి 1931. పుటలు 8-13.
చ. పదియేను వలె పుటలు 114-118.
37. ఆంధ్రవాఙ్మయసూచిక. 1929. పుట 231.
38. అదే. పుట 35. 39. పదియేను వలె. పుటలు 130-135.
40. A History of South India. 1984. P. 239.
41. నాచన సోమనాథుఁడు- కావ్యానుశీలనము. 1979. పుట 8.
42. Epigraphia Carnatika. vol. X. G. D. 46.
43. నలుబదియొకటి వలె. పుట 81. అ. సూ. 1.
44. As 42. TL No. 154. 45. As 40.
46. Ibid. P. 265. 47. Ibid. 48. Ibid. P. 271.
49. Early VijayaNagara Studies. 1989. P. 146.
50. Ibid P 184 51 Ibid. P. 144. 52. As 50.
53. Ibid. PP 113-117. 54. Ibid. P. 39. 55 Ibid.
56. Ibid. 57. Ibid. P. 47. 58. Ibid.
59. Ibid. P. 39. 60. Ibid. P. 41. 61. Ibid. P. 46.
62. శ్రీనాథుఁడు 1961 త్రైపుప్రతి. మొదటి సంపుటము. పుటలు 833-838.
63. As 1 B. P. 126. 64. A. Ibid. B. As 40. P. 267.
65. శ్రీనాథుఁడు 1971 పుటలు 72-104.
66. పదియేను వలె. ఆఱవ సంపుటము. 1961. పుట 47.
67. ముప్పదియారు వలె. పుటలు 5-6. 68. అదే. పుట 6.

69. నలుబదియొకటి వలె పుట 124 70 ముప్పదియారు వలె పుట 6
71. ఆంధ్రసాహిత్యపరిషత్పత్రిక సంపుటము 43 సంచికలు 4,6 పుటలు 1–10, 83–92 72 ముప్పదియారు వలె పుటలు 17–163
73 గౌతమవ్యాసములు 1964. పుటలు 18–20.
74. భారతి 1959 జనవరి పుటలు 37–76
75. భాస్కరరామాయణము— విమర్శాత్మకపరిశీలనము. 1988 పుట 173.
76 అదే. పుట 191 77 పదియారు వలె పుటలు 316, 317
78. డెబ్బదియైదు వలె. పుటలు 192–197.
79. పదియేను వలె రెండవ సంపుటము 1956 పుటలు 97–110, 123–124 80 డెబ్బదినాలుగు వలె
81. డెబ్బదియైదు వలె పుట 165 82 అదే 83 అదే
84. క. పదియారు వలె 1889
చ పదియేను వలె పుటలు 110–118
85. క. భాస్కరోదంతము
చ భాస్కరరామాయణము 1915 పీఠిక. పుటలు 9–10; 16-17.
86. డెబ్బదియైదు వలె పుట 197
87. అదే పుట 12 88. అదే. పుట 197.
89. క. ఆంధ్రవాఙ్మయచరిత్రసర్వస్వము
చ డెబ్బదియైదు వలె పుటలు 23–35.
90. డెబ్బదియైదు వలె పుటలు 192–197 91. అదే పుటలు 57, 193.
92. **The Kakatiyas** 1978, **P.** 1:9 93. **Ibid. P.** 128.
94. **A. Annual Report.** 307 of 1934-35.
క. పదియేను వలె. మూడవ సంపుటము 1959 పుట 220
95. **A. As** 94 **A** 48 of 1910.
క. ఆంధ్రుల చరిత్రము. ద్వితీయభాగము. 1912. పుట 335.
96. తొంబదియైదు "చ" వలె. 97. **As** 92. **P.** 196.
98. మానవల్లి కవి- రచనలు. 1972. పుట 87.
99. డెబ్బదియైదు వలె పుట 197.
100. పదియేను వలె. పుట 165. 101. **As** 40. **P.** 356.
102. మల్లాది సూర్యనారాయణశాస్త్రి షష్టిపూర్తి సంచిక. 1941 పుట 16.
103. క. ఆంధ్రధ్వన్యాలోకము. 1968. పుటలు 411–408.
చ. డెబ్బదియైదు వలె. పుట 73.

104. క సమగ్ర ఆంధ్రసాహిత్యం. మూడవ సంపుటం. 1965. పుట 41.
చ. డెబ్బదియైదు వలె పుట 77. 105 క నూటనాలుగు "క" వలె.
చ. డెబ్బదియైదు వలె. పుట 76. 106 As 1 B PP 498-499.
107 నాథయోగి మన వేమన 1987 పుటలు 207-209.
108. పదియేను వలె పుటలు 161-162. 109. అదే. పుట 162.
110. అరువదిరెండు వలె పుటలు 159-166.
111. పదియేను వలె ఆఱవ సంపుటము: 1961. పుటలు 14-15
112 (S.I.I Vol VI. No 34) Simhachalam Temple Insciptions 1987 PP 452-454.
113. సింహగిరి నరహరివచనములు 1968 మున్నుడి. పుట 10.
114. పదియేను వలె ఎనిమిదవసంపుటము 1961. పుట 172.
115 అదే ఏడవ సంపుటము 1963. పుట 94
116 అరువదిరెండు వలె పుటలు 404-405
117 ఒకటి "ట" వలె పుటలు 395-396.
118 నూటపదమూడు వలె 1988. హరిచందనము పుటలు 34-36.
119 As 1 B PP 500-501.
120 అరుపది రెండు వలె. పుటలు 13-14
121 తొంబదియెనిమిది వలె. పుట 87
122. అదే పుటలు 95-96 123. As 1 B. P 511.
124 చాటుపద్యమణిమంజరి ప్రథమభాగము. 1913. పుట 53.
125 As 1 B PP 126-127.
126. నా వాఙ్మయమిత్రులు 1966. పుట 59
127. ప్రబంధరత్నావళి. 1976 పుటలు 3-13.
128 పదియారు వలె పుట 361.
129 భారతి 1982 అక్టోబరు పుటలు 17-27
130 అదే. 1982. జూన్ పుటలు 5-17 131. అదే 132. అదే.
133. అదే 1983 ఫిబ్రవరి పుటలు 47-58. 134 అదే
135 నూటయేడు వలె. పుటలు 6-7.
136 పదియేను వలె. మూడవ సంపుటము 1959. పుట 187
137. అదే నాల్గవ సంపుటము 1960. పుట 159.
138. అదే. పదవ సంపుటము. 1953 పుటలు 80-81.

# సవరణపట్టిక

| పుట | పంక్తి | ఒప్పు |
|---|---|---|
| 6 | 24 | లజ్జిత |
| 15 | 23 | రససిద్ధస్య స్థిరం కావ్యస్య |
| 21 | 25 | పన్నస్ప |
| 25 | 11 | ఏళన్ |
| " | 17 | అతికళ |
| 39 | 14 | 41 |
| 40 | 19 | ఇక్ష్వాకులు[51] |
| 45 | 17 | అభిప్రాయము కలదు [61] |
| 60 | 9-10 | మహోత్సవమున్ |
| 85 | 21 | ప్రవృత్తి |
| 93 | 6 | ఇది యర్థము.[51] |
| 106 | 19 | సౌదర్యముతోనే కలదు. |
| 111 | 26 | బ్రూయాత్ |
| 116 | 10 | తార్క్షుడు కశ్యపుడు. |
| 143 | 4 | పట్టము కట్టెను.[1] |
| 146 | 26 | ధీయతే |
| 147 | 10 | శిటిత్తొండర్ |
| 149 | 21 | అభిప్రాయము కలదు.[19] |
| 151 | 28 | 192. |
| 152 | 1 | 192+12=204 |
| " | 2 | పద్యములు కలవు.[30] |
| 165 | 10 | గ్రధనము |
| " | 28 | ప్రతాపరుద్రచరిత్ర లిఖిత |
| 167 | 28 | కలుగదు |
| 170 | 26 | యుక్తిని వివరింతు |
| 171 | 13 | కరుణావిలోల |

| పుట | పంక్తి | ఒప్పు |
|---|---|---|
| 178 | 3 | సోమనాథుని విన్న విషయమే |
| 183 | 27 | సంవదించు |
| 188 | 16 | ప్రసక్తమైన |
| 189 | 25,28 | పోల్చు |
| 190 | 3 | సంకేతాన్ |
| 221 | 11,12 | అభిప్రాయము. |
| 231 | 8 | బాలోఒపి |
| 234 | 16 | ఐతిహ్యము కలదు.[88] |
| 241 | 28 | అనుభవసారము వీరశైవ |
| 243 | 7 | గూడ"నని |
| 246 | 12 | 37వ |
| 254 | 29 | శ్రుత్యనురూపమంచు |
| 255 | 14 | అందింపు |
| 260 | 10 | కలదు. |
| 263 | 9 | వృషమస్ |
| ,, | 10 | యొనర్చు |
| ,, | 16 | బొదివి |
| 265 | 22 | లజ్జాఒమపి |
| ,, | 27 | నగరేషు |
| 266 | 11 | అవ్యవస్థా |
| 270 | 10 | 1279వ |
| 274 | 8 | అంబరరవి |
| 275 | 11 | బంబన |
| 283 | 11 | జగదకల్యాణ |
| ,, | 20 | స్కాఒ=18. స్కాందపురాణము |
| 293 | 22 | బ్రతి, యున్నవారు |
| 295 | 6 | కృపావిహీన |
| 296, 297 | 26,14 | వింతలింతలు |

| పుట | పంక్తి | ఒప్పు |
|---|---|---|
| 297 | 3 | కఱ్ఱి |
| 307 | 22 | ప్రౌఢిమై |
| 312 | 18 | వారణంబులు |
| 317 | 6 | ఘామమయైన |
| 319 | 13 | బచ్చపిలుతు |
| 331 | 21 | లోలతఁ |
| 348 | 13 | కోపము |
| 349 | 24 | బకజాతి |
| 372 | 23 | ప్రత్యంతరములందు నిరుపయోగమైనది |
| 374 | 14 | అవి :[70] |
| 385 | 4 | హా |
| 387 | 28 | కాదు [79] |
| 390 | 17 | విచ్ఛిన్నములైనవి స్వచ్ఛస్వచ్ఛంద |
| 391 | 21 | శాఖానగరాధిపతి.[11] |
| 396 | 1 | ఉపపత్తులు [14] |
| 411 | 3 | కాలము [30] |
| 431 | 11 | సౌందర్యసంపద |
| 432 | 19 | ప్రబంధము |
| 433 | 7-8 | లింపారఁగ |
| 440 | 10 | జీవుఁడన్ |
| 441 | 1 | సర్చింపఁగా |
| 444 | 7 | మొదటి హరిహరరాయలు, మొదటి బుక్కరాయలు |
| 451 | 27 | జగమెఱుఁగన్" అని నుతించుట |
| 452 | 15 | విషయము సవీనగుణ |
| 455 | 19 | శయ్యాతలంబున |

# తెలుగు సాహిత్యచరిత్ర

ప్రథమభాగము

ఆచార్య కొర్లపాటి శ్రీరామమూర్తి

రమణశ్రీ ప్రచురణ